# జ్ఞాపిక

ఆర్యులారా!

ఈరంగనాథరామాయణము పూర్వముద్రణమునందు మంచి వ్రాఁతప్రతులు దొరకనందునఁ బూర్వతరముద్రితములగు ప్రతులసాహాయ్యముననే కొంతవఱకు సంస్కరింపించి ముద్రించితిమి. తరువాతఁ గొన్నిదినములకు రెండుమూఁడు వ్రాఁతప్రతులు మామిత్త్రులు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారివల్ల లభించుటవలన వానిం బట్టి మాపండితులగు శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులుగారిచేతను, శ్రీయుత జనమంచి శేషాద్రిశర్మగారిచేతను బూర్వముద్రణములో వదలిపోఁబడిన భాగములను పొందుపఱిచి చక్కఁగ సంస్కరింపించి ముద్రించినారము. కావున నింకను నెందేని యపూర్వవర్ణనాభాగములు గల ప్రాఁతవ్రాఁతప్రతు లుండెనేని పంపినచోఁ బునర్ముద్రణమునఁ గూర్చుకొనియెదము. రంగనాథకృత మగు నుత్తరకాండము గూడ లభించినది. దానిని బ్రత్యేకసంపుటముగాఁ బ్రకటించుచున్నారము.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# పీఠిక



## రంగనాథుఁడు

ఈ మహాకవి రామాయణమును ఆఱు కాండములు ద్విపదగా నాంధ్రీకరించెను. ఇతఁడు రామాయణమును తాను దెనిఁగించినట్లు గ్రంథమున నెచ్చటను జెప్పుకొనలేదు; కాని గ్రంథములకు నామములు కవులనుబట్టియుఁ, గృతిపతి ననుసరించియుఁ, గథనుబట్టియుఁ బెట్టఁబడుచుండును గాన రంగనాథుఁడే రామాయణమును రచించె నని వచించుట కనుమాన మొందవలసిన యవసరము లేదు.

కోనబుద్ధరాజు తాను రామాయణమును ద్విపదగా నాంధ్రీకరించి తన తండ్రి యగువిట్ఠలరాజునకుఁ గృతి యిచ్చినట్లు కాండాంతములయందుఁ జెప్పఁబడి యున్నది.

> "అని యాంధ్రభాష భాషాధీశవిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
> పాలితాచారుఁ డపారధీశరధి, భూలోకనిధి కోనబుద్ధభూవిభుఁడు
> తమతండ్రి విట్ఠలధరణీశు పేరఁ, గమనీయగుణధైర్యకనకాద్రి పేరఁ
> బనిపూని యరిగండభైరవు పేర, నాచంద్రతారార్కమై యొప్ప మీఱ
> భూచక్రమున నతిపూజ్యమై వెలయ, నసమానలలితశబ్దార్థసంగతుల
> రసికమై చెలువొందు రామాయణంబు......"

దీనింబట్టి కూడ బుద్ధరాజు రామాయణమును రచింపలే దని స్పష్టమగుచున్నది. ఎట్లనః—సాధారణముగా విద్వత్కవు లాత్మస్తుతిని జేసికొనువారు కారు. ఒకానొకఁ డట్లు తన్నుఁ దా స్తుతించుకొన్నను నీలాగున వ్రాసికొనుట యెందును గానము.

ఇందు బుద్ధరాజునకు:—౧. భాషాధీశవిభుఁడు, ౨. వినుతకావ్యాగమవిమలమానసుఁడు, ౩. పాలితాచారుఁడు, ౪. అపారధీశరధి, ౫. భూలోకనిధి అను నైదు విశేషణములు వాకొనఁబడి యున్నవి. వాస్తవముగా నీవిశేషణముల కీరాజు తగినవాఁడేయైయుండు ననుకొన్నను దాను వ్రాసిన యీ ద్విపదకావ్యమున నిన్నివిశేషణములు స్వవిషయమునఁ దోరణముఁ గూర్చినట్లు చేర్చియుండు ననుకొనుట సమంజసముగా లేదు. సాధారణముగా లోకమున నూటిలోఁ దొంబదితొమ్మిదిమంది యాత్మస్తుతిపరాయణులు కారా యని ప్రశ్నింపవచ్చును. ఐనను అట్టివారు లేరని చెప్ప

వి లుండదు గాని యట్టివా రితరులచేతఁ దమ్ముఁ బొగడించుకొందు రనిచెప్పుట యుక్తిహీనము గాదు.

శ్లో. "వాణీం కాణభుజీమజీగణదవాసాసీచ్చ వైయాసికీ
మంతస్తంత్రమరంస్త పన్నగగవీగుంఫేషు చాజాగరీత్,
వాచామాచకలద్రహస్యమఖిలం యచ్చాక్షపాదస్ఫురాం
లోకేఽభూద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్యజన్యం యశః."

అని కోలచలమల్లినాథసూరి చెప్పుకొన లేదా? యనిప్రశ్న వేయవచ్చును.

కోలచలమల్లినాథసూరి కావ్యపంచకమునకును నైషధమహాకావ్యమునకును వ్యాఖ్యల వ్రాసినమహానుభావుఁడు. ఈకాలమున బిరుదములు చెల్లినట్లాకాలమునఁ జెల్లకుండెను. బిరుదమును ధరించినవాని నెట్లయినను బట్టిచూచుచుండిరే కాని సాధారణముగా విడిచి పెట్టినవారు కారు. మల్లినాథకవి యంతకు ముందు వ్యాఖ్య వ్రాసినవారు మూలార్థమును బాడుచేసి యున్నందునఁ దాను వ్రాయఁబూనిన వ్యాఖ్య సమంజసముగ నుండునే కాని ముందటిదానివలె నపార్థమును బోధింపదను విషయమును లోకులు తెలిసికొందురుగాక యనియు, వ్యాఖ్య వ్రాయఁబూనినవాని కన్నిశాస్త్రములలోఁ బాండిత్య ముండియే తీఱవలెనో యాసంగతిని దెలుపుటకును నట్లు చెప్పుకొనియెం గాని వేఱుగా దని కొందఱనుచున్నారు. పంతమున వ్యాఖ్య వ్రాయఁబూనినందునఁ బరపక్షవాదుల గుండెలవియుఁగాక యని యీలాగునఁ జెప్పినాఁడని కొందఱు వాదించుచున్నారు. ఏది యెట్లున్నను ఈమహాకవి వ్యాఖ్య రచించిన వాఁడేకాని మూలకర్త గానందున మన మీయుదాహరణమును బ్రకృత కవినిర్ణయఘట్టమున గ్రహింప ననవసరము. కాళిదాసాదు లిట్లు చెప్పుకొనలేదుగదా!

సీ. "తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ, జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది, నానాపురాణవిజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర, జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి, శోభితు సత్ప్రతిభాభియోగ్యు
తే. నిత్యసత్యవచను మత్యమరాధిపా,చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా,భరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ."

అని నన్నయభట్టారకుఁడు చెప్పుకొనలేదా? యనియు నడుగవచ్చును.

క. హితుఁడవు చతురవచోనిధి, వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా, పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్."

అని యల్లసానిపెద్దనకవిశిరోమణియుఁ జెప్పుకొన్నాఁడుగదా? యని కూడ నొక ప్రశ్న వేయవచ్చును. ఇట్టి వెన్నియో యుదాహరణములు చూపి యాత్మస్తుతి

పరాయణత్వము కొందఱకు సహజముగాని యవలేపమున వారు వ్రాసికొనుట లేదనియును సిద్ధాంతము చేయవచ్చును.

"తమతండ్రి విట్ఠలధరణీశుపేర......"

అనుచోఁ దనతండ్రి యనక తమతండ్రి యనుటచేతనే వారి యాశ్రితుఁ డొకఁ డీగ్రంథమును రచించి ప్రభువునాశయమురీతి వారు వ్రాసినట్లే చెప్పుచు, వారి యందుఁ దనకుఁ గలగౌరవాతిశయమున నేకవచనము చెప్పుట ధర్మము కా దని "తమ" యని బహువచనము చెప్పిన ట్లూహించుట రంగనాథుఁడే యీకృతికర్త యనుటకు సహాయముగా నుండు నని నాతలంపు. నాయీతలంపు నిరర్థకమే కావచ్చును; దానిని సాధించుటకుఁ దగినంతసామర్థ్యము నాకు లేకపోవచ్చును; గాని రంగనాథుఁడే రామాయణమును ద్విపదగా రచించె ననుసజ్జనోక్తిమాత్రము నిరంకుశము. దానికి నాతలంపుగూడఁ గొన్నికారణములతోఁగూడఁ దోడ్పడుఁ గాక!

రంగనాథుఁడు కోనబుద్ధారెడ్డియాస్థానపండితుఁడు. సరసముగఁ గవిత్వము చెప్పఁగలవాఁడు. గ్రంథమునఁ దనకుఁ గలపాండిత్యమును వీలులేక చెప్పకొనన నందున వారితండ్రి పేరు మొదలగునవి మనము నిర్ణయింపఁజాలము.

ఇక్కవితిలకుఁడు సర్వజనశ్లాఘాపాత్రముగ నొకగ్రంథమును జెప్పఁబూని నన్నయభట్టు రచించినభారతమునుజూచి యిఁకఁ బద్యరచనవలనఁ బ్రఖ్యాతిని సంపాదించుట సాధ్యము కాదని నిశ్చయించి ద్విపదకావ్యము రచించి ప్రఖ్యాతి నొందె నని పెక్కండ్రు వాడుచున్నారు. దీనియందు సత్య మెంత యున్నదో యెఱుఁగఁ జాలము. గాని ద్విపదకావ్యకర్తలలో నతఁ డగ్రగణ్యుఁడనుటలో నెవరును భిన్నాభిప్రాయులు కారు, కనుక నీపైగాథ కొంతవఱకు నిజ మని యంగీకరింపఁబడఁదగి యున్నది.

రంగనాథకవి ద్విపదగ రామాయణమును రచించుచుండ మంత్రిభాస్కరుఁడు తానాసంగతి విని పద్యకావ్యముగ రామాయణమును రచించి కృతి నిచ్చుటకు రాజుగారికొలువుకూటమునకుఁ దెచ్చినపుడే రంగనాథునికృతియు సంపూర్ణమై యతఁడును గ్రంథమును గొనితెచ్చెననియు, రాజు తాను జెప్పివ్రాయించిన దగుటచే రంగనాథరామాయణమును గుడిచేతతోడను, దనకుఁ గానై రచించి కృతి నీయఁ దెచ్చియున్న భాస్కరరామాయణము నెడమచేతితోడను గ్రహించె ననియు, నందుమీఁద మంత్రిభాస్కరుఁ డవమానజనితదుర్వారక్రోధంబున రసజ్ఞుఁడు గాని రాజునకుఁ గృతి నిచ్చుటకంటె నొకగుఱ్ఱపువాని కిచ్చినను మేలే యని సభనుండి

వెడలిపోయెననియు నొకగాథను కొందఱు చెప్పుదురు. భాస్కరుఁడనంతటిమహాకవి రాజుపైఁ గలకోపమునఁ దనకృతిని నీచునకియ్యఁ బూనె ననుట యేమాత్రము విశ్వాసార్హము కాదు. సాహిణీమారుఁడు గుఱ్ఱములఁ గాచువాఁడు కాఁ డనుట కనేకదృష్టాంతము లున్నందున నీకథ కేవలకల్పిత మని కొంద ఱందురు. అది నిజమే కావచ్చును. లేక సాహిణిమారుఁ డనువాఁ డొకఁడు గుఱ్ఱములను గాచు వాఁడుగను నుండవచ్చును. ఆపేరుగలవాఁడు గుఱ్ఱములకాచువాఁడుగా నుండఁ గూడ దనునియమము లేదు గాన నతఁ డుండినను మహాకవి యట్టివానికిఁ గృతి నియ్యఁ బూనుకొనె ననుటయే యసంగతము గాన నీగాథ కల్పితమే. ఐనను దీనిం బట్టిచూచినను రంగనాథుఁడు రాజునొద్ద నాస్థానకవిగా నున్నవాఁ డనియు నతని గ్రంథము రాజుగారిప్రీతికిఁ బాత్ర మనియుఁ దేలుచున్నది.

రంగనాథుఁడు రామాయణమును రచించుచో హనుమంతుఁడు సంజీవికై పోవునప్పుడు కాలనేమి కపటమునివేషధారియై హనుమ నొకసరోవరమునకుఁ బంప నతఁ డచ్చటికేఁగి మకరిచే మ్రింగఁబడి దానిం జంపఁగా నది తనపూర్వవృత్తాంతమును జెప్పుఘట్టమున,

“ఇది తపఃఫలసార మెలనాఁగ ! నాతు, నిది పుణ్యఫలసార మెలనాఁగ ! నాతు
నిది మోక్షసాధన మెలనాఁగ ! నాతు, నిది స్వర్గసోపాన మెలనాఁగ ! నాతు.”

అని కవి వ్రాయఁగా నాభాగమును విని రాజు తనభార్య యగునెల నాగయం దాతఁడు బద్ధానురాగుఁ డయ్యె ననుకొని తనభార్యతో నాకవి వాంఛితమును దీర్పవలయు నని యాజ్ఞాపించె ననియు, నాసంగతి విని కవి తనకామె యందుఁ గలమాతృభక్తిని దెలిపె ననియుఁ గొందఱు చెప్పుదురు. ఇట్టిగాథల కర్థము లేకపోవుటయే కాక యిట్టివి కవియొక్క నిర్మలమనశ్శుద్ధిని నణంచు నవియు నగు నని చెప్పవచ్చును. ఇట్టిగాథల నేమాత్రము ప్రపంచజ్ఞాన మున్నవారైనను విశ్వసింప రనుటలో సంశయ ముండదు.

ఇక్కవి యిప్పటి కేడువందలసంవత్సరముల క్రిందట నున్నవాఁడు. ఇతఁడు రామాయణమును యథామూలముగాఁ దెనిఁగింపక కథను మాత్రమే గ్రహించి కొన్నితావులం బెంచియుఁ గొన్నితావుల సంకుచితముచేసియుఁ దెనిఁగించెను. ఇంతియే కాక మూలములో లేనిగాథలఁ గొన్నింటిం జేర్చియున్నాఁడు. సులోచనసహగమనము, కాలనేమిచరిత్రము నివి క్రొత్తఁగా నిందుఁ జేర్పఁబడినవి. మూలమున కిది యెట్టిపరివర్తనమో ఆవిషయమును జర్చించుట యనవసరము గాన దానిజోలి మానితిని.

రంగనాథునకు సంస్కృతాంధ్రములయం దసమానపాండిత్యము గలదు. మనోహరముగఁ గవిత్వము చెప్పుసామర్థ్య ముగ్గుతోఁ బెట్టినట్లూహింపవచ్చును. ద్విపదకావ్యముగాన శైలి సరసముగనే యుండుననరాదు. ఎన్నియో ద్విపదగ్రంథము లున్నవిగాని దీనిం బోలినదానిం దఱచుగఁ గానము. ఒక్కొక్కస్థలమునఁ బూసగూర్చినట్లు సంస్కృతపదములను గవి కూర్చియున్నాఁడు. కొన్ని తావుల సులలితము లగునాంధ్రపదములను రత్నములవలెఁ గూర్చియున్నాఁడు.

ఈరంగనాథరామాయణము లాక్షణికగ్రంథమే యని యప్పకవి మొదలగువారు పరిగ్రహించియున్నారు. దుష్టసంధులు లోనగువ్యాకరణదోషము లందందుఁ గనుపట్టుచున్నవి. చిరకాలముక్రిందట వ్రాయఁబడినతాళపత్రగ్రంథ మొకటి నాకరగతమై యున్నందున దానింబట్టి ముద్రితపుస్తకములో వదలిపెట్టఁబడినకొన్ని భాగములను జేర్చితి. కొన్ని కొన్ని తావుల విశ్రమదోషములును గనఁబడుచున్నవి. పాఠకులవలన నిట్టి దోషములు సంభవించినవో లేక ప్రమాదవశమునఁ దొలుతనే పడినవో చెప్పఁజాలను.

ఇఁక నీగ్రంథమందలివిశేషాంశములం జూపుచున్నాను.

## సంస్కృతసమాసములు

"రణభేరి వేయించి రత్నశైలాభ, గణనీయశబలాశ్వకలితమై దూర్య
మణికూబరసువర్ణమయచక్రదశక, రణజయప్రదధనుర్బాణాసిపూర్ణ
రణితకింకిణి యైనరథ మెక్కి వెడలె..." — ఆరణ్యకాండము 139 పుట.

"బర్హిణవర్ణనిబర్హణపవన, గర్హణచణకాంతిఘనవేగతురగ
సందోహసంభృతస్యందనోత్తమము..." — ఆరణ్యకాండము 140 పుట.

"మండితకరివేషమధ్యందినార్క, మండలపరివేషమహితానుకారి
కుండలీకృతచండకోదండదండ, ఖండనాత్మకలాస్యహహాహుంకృతప్రియ" — ఆరణ్యకాండము 141 పుట.

"నూత్నశృంగారమనోహరాకార, రత్నవితర్దికారమణీయవార
రంగవల్లీహారరంజితద్వార, రంగధ్వజోదారరమ్యపటీర
నీరపూరితమార్గనిరుపమాకార, పౌరసంచారసంభరితంబుగాఁగ". — కిష్కిం. 190 పుట.

"చండవాతాఘాతజాతడిండీర, గండూషితాశావకాశనీకాశ
వీచీసమీచీనవిహారమాణాది, వైచిత్రకరవాలవరవాలములను". — కిష్కిం. 204 పుట.

## ఆంధ్రపదములకూర్పు

"వ్రతములఁ గడు డస్సి వనటులఁ గ్రుస్సి, యతిదుఃఖములఁ గుంది యాత్మలోఁ గంది
విపులాశ్రువులఁ దోఁగి విరహాగ్నిఁ గ్రాగి, కపటవృత్తులఁ జిక్కి కడుమట్ట స్రుక్కి

జీవంబుపై రోసి చెలువంబుఁ బాసి, యావిధి మదిఁ దూఱి యలసత మీఱి
చెక్కిటఁ జేయిఁ జేర్చి చింతల కోర్చి, దిక్కు లేమిఁ దలంచి ధృతి దూర డించి
యినరశ్మి వాడినయెలదీఁగెఁబోలె, ఘనధూమయుతదీపకళికయుఁబోలె" సుం. 216 పుట.

## కల్పనలు

"శాకినీభూతపిశాచబేతాళ, డాకినులంతఁ దండంబులై యపుడు
నేనుంగుతలకాయ లెసఁగఁ గుండలుగఁ, బూని యందలిముత్యములు దండులముగ
దండి రామునిరణధర్మసత్రమున, పండినారిదె రండు వరుస భుజింప
ననివేడ్కఁ బైకొన్నయధికారముద్ర, గొని రౌద గాఁకుండఁ గూ[illegible]ట్టి
రక్తచందనమును రక్తాక్షతలును, రక్తసంకల్పపూరంబును దాల్చి
శరవహ్నిపక్వమాంసప్రకటాన్నములు, పొ[illegible]ను గొవ్వులందు
వరదలై యాజ్యప్రవాహముల్ కండ, లెరిగి శారిజము లనేకశాకముల
పాలప్రేవులు శాపపాశముల్ మేలి, వాలుగుండెలు పిండివంటలు మఱియు"

ఆరణ్యకాండము 142 పుట.

"పరితాప మనియెడిబడబాగ్ని గలిగి, పెరిగెడిలాల యన్ ఫేనంబు గలిగి
వెడలుకన్నీరను వెల్లువగలిగి, కడలేనివగ పనుకరుడులు గలిగి
ప్రకటరోదనమహారావంబు గలిగి, చకితత్వ మనియెడిచలనంబు గలిగి
మునుకొని శోకసముద్రుఁడై పెద్ద, వెనుఁబడి యెంతయు వికలుఁడై యున్న
యారావణుని .." యుద్ధకాండము 364 పుట.

## శ్లేషలు

"ఆతతానంతభోగాస్పదం బగుచుఁ, బాతాళమునుబోలెఁ బరఁగినదాని
మహనీయశతకోటిమహిమచే నింద్రు, మహితాలయమువోలె మానైనదాని
నిఖిలంబునందును నెగడు తేజమున, శిఖినివాసమువోలెఁ జెలువైనదాని
సమధికం బైనభీషణవృత్తి గలిగి, యమునివాసమువోలె నమరినదాని
వివిధమేదోమాంసవితతిఁ గ్రవ్యాదు, భవనాంగణమువోలె భాసిల్లుదాని
నిరుపమతరవారుణీయుక్త మగుచు, వరుణాలయమువోలె వ్రాలినదానిఁ
దిరమైనయాసుగంధిస్పర్శనమున, మరుదాలయమువోలె మానైనదాని
విలసితనిధులచే వెలసి కుబేరు, నెలవునువోలె వర్ణితమైనదాని
నురువిభూతికినెల్లనునికిపట్టగుచు, హరునివాసమువోలె నమరినదాని" యు. 342 పుట.

## చమత్కారములు

"ఘన మైన పరుషరాక్షసభాషణములు, సనకాదియోగీంద్రసన్నుతుల్ గావు
ఉరవడిఁ బఱతెంచు నుగ్రదానవులు, పరిచారకామరప్రతతులుగావు
చలమున నార్చురాక్షసభటోత్తములు, నలిఁబాడుతుంబురునారదుల్ గారు
వ్రాలుచు నీమీఁద వచ్చునాగాలి, యాలవట్టంబులయనిలంబు గాదు
యుద్ధరంగం బమృతోదధిగాదు, యుద్ధంబు మఱికోలు వుండుటగాదు" యు. 361 పుట.

ఈపక్కిని దరువాతికవులు తమగ్రంథములలో నిట్లే చెప్పుకొనియున్న వారు.

## భాగవతము - పోతనకవిగారు

సీ. "చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు, నిగిడి గోత్రముదండ నిలువరాదు
కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు, మనుజసింహుఁడ నని మలయరాదు
చేరినఁ బడవైతుఁ జేయి సాపఁగరాదు, బెరసి నామీఁదటఁ బెరుగరాదు
భూనాథహింసకుఁ బోరాదు నను మీఱి శోధింతుఁ గానలఁ జొరఁగరాదు
ఆ. ప్రబలమూర్తి నను చు భాసిల్లఁగారాదు, ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁపరాదు
కల్కితనము చూపి గర్వింపఁగారాదు, తరముగాదు కృష్ణ! తలఁగు తలఁగు.
సీ. మహిమతో నుండంగ మధురాపురముగాని పోలుపార వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండఁ గంసునిసభగాని సంసారరహితులసభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా బాహునాదముగాని నారదువీణాస్వనంబుగాదు
చమురులాడఁగ మల్లజవవిగ్రహముగాని రమతోడి ప్రణయవిగ్రహము గాదు
తే. వెలసి తిరుగంగ వేదాంతవీథిగాదు, మొఱసిసోమునిమనములమూల గాదు
సాగి నడువంగ భక్తులజాడగాదు, శౌరి నామ్రోల నీ వెందుఁ జనియె దింక.

భాగ. స్కం. ౧౦.

ఇంకను గొందఱు కవు లీరంగనాథునిమార్గమునే యనుసరించిరి. వాని నన్నింటిని వేర్కొనుట కిది సమయముగాదు గదా?

## శైలి

"మాటమాత్రంబున మహియు నాకసము, మీటను నాట నమ్మేటియె నేర్పుఁ
గార్చిచ్చునైనను గరువలినైన, నార్చను గూర్చను నాతఁడే నేర్చు
భువనంబు లన్నియు బూదిగావింప, నవి బోదిగావింప నాతఁడే నేర్పుఁ
బొల్పడ బ్రహ్మాండభాండంబునైన, నిల్పఁబగుల్ప నానిపుణుండె నేర్చు" అర. 145 పుట.
"పెట్టినసొమ్ములు పెట్టెలోఁ బెట్టి, దట్ట మౌ కస్తూరి తలపట్టు పెట్టి
మలినవస్త్రము గట్టి మదినల్కదొట్టి, చలము చేపట్టి భూస్థలిఁ బండెనంత." అయో. 79. పుట.

## సులలిత నానార్థపదప్రయోగము

"పుండరీకంబులఁ బోలుపారువారు, పుండరీకాక్షులఁ బోలుపారువారు
పుండరీకచ్ఛాయఁ బోలుపారువారు, పుండరీకోన్నతిఁ బోలుపారువారు."

యుద్ధ. 37 పుట.

ఇట్లెన్నియో యీగ్రంథమునుండి యుదాహరణములు చూపవచ్చును. అప్పనిని జేసినచో గ్రంథము నెత్తి వ్రాసినట్లే యగును గాన మానితి. ఇట్లు వీనుల విందైనగ్రంథమును రచించిన మహాకవిని బొగడ నాతరంబగునే?

ఇట్టియుత్కృష్టగ్రంథరత్నమున నేలొకో కొన్నిస్ఖాలిత్యములు కనఁబడుచున్నవి. కొన్నింటి నుదాహరించుచున్నాను.

## యతిభంగము

'అనఘ గంగాయనములు గూడి యునికి.'' అయోధ్యాకాండము 105 పుట.

## వ్యాకరణవిరుద్ధక్రియలు

'చరతపోనియతిమై వర్షసహస్ర, మరుగఁబారణ సేతుననియున్నచోట.' బా. 54 పుట.

'ఏతల్లిపనిసేతు నేతల్లిఁగొలుతు.' అరణ్యకాండము 161 పుట.

'మనఁజేతు నిప్పుడు మహిమీఁద ననిన.' యుద్ధకాండము. 302 పుట.

## ప్రాసము

'ఓరియీవానరుఁ డున్నాఁడో లేఁడో, వెర వారఁగా నాకు వివరించిచెప్పు'

యుద్ధకాండము. 298 పుట.

## సంధులు

'అడుగులు చేతులు నంటంటి చూచి, యొడలఁ బ్రాణములు లేకునికి భావించి'

అయోధ్యాకాండము, 111 పుట.

'మునుకొని వార్ధుల ముంచి ముంచెత్తు' కిష్కింధాకాండము. 188 పుట.

'మొఱపెట్ట వార్ధుల ముంచి ముం చీడ్చి' యుద్ధకాండము. 298 పుట.

## ద్రుతసంధి

'చూపులచేతనే చూడఁ బుత్తనుచు' యుద్ధకాండము, 420 పుట.

## కుషష్ఠికియుందునగాగమములేమి

'శరభంగమానియాశ్రమము కేతెంచి. అరణ్యకాండము. 132 పుట.

'అనవుడు వెఱగంది యాజాంబవంతు, కనియె విభీషణుం డతిసంభ్రమమున'

యుద్ధకాండము. 379 పుట.

'అని లక్ష్మణుఁడు పల్క నావిభీషణుఁడు, దశమది నూహించి ధరణీశు కనియె'

యుద్ధకాండము. 398 పుట.

## కొనున కుకాదేశము

'బ్రహ్మాదులకు నడ్డపడరానియట్టి, బ్రహ్మాస్త్ర మవలీలఁ బట్టుక మ్రింగె'

బాలకాండము. 48 పుట.

'అడవుల కేనును నర్థితో వత్తుఁ, దోడుక పొమ్మనఁ దూలి రాఘవుఁడు

అయోధ్యాకాండము. 90 పుట.

'తోఁక గాల్పించుక తొలఁగి వచ్చితిని, పీఁకతో రామునిపీటిలోఁపలను'

యుద్ధకాండము. 299 పుట.

## రేఫద్వయమైత్రి

'రెండుహస్తము లెత్తి ఱెక్కలతోడి, కొండరెప్పున వచ్చుకొమరుదీపింప' బాలకాండము. 23 పుట.

'ధరణీశుఁ డారాత్రి దప్పితో నంత్ర, మఱ పొంది యాయజ్ఞమందిరమందు'

బాలకాండము. 60 పుట.

'ధారాకరాళమై దనుజవర్గములఁ, గాఱించి నొంచి చీకాకు గావించి'

అరణ్యకాండము: 142 పుట.

'మొఱపెట్ట వార్థుల ముంచియుంచిడ్చి, కరుణించి విడువఁడే ఘనుఁ డైన వాలి?'

యుద్ధకాండము. 298 పుట.

ఇట్టిదోషము లందందుఁ గనఁబడుచున్న ను సంపూర్ణనిశాకరునందుఁ గళంకము వలె మొత్తముమీఁద నిమ్మహాకవికవిత్వము నిర్దుష్టమై శ్లాఘాపాత్రమై తరువాతికవులకు మేలుబంతియయ్యె ననిచెప్పుట కావంతయు సంశయము లేదు. ఇట్టియుత్తమగ్రంథమును రచించియుఁ దనవిషయమును గొంచెమైనను జెప్పుకొనుట కవకాశ మీయక ధనలోభమునకుఁ జిక్కె ననుటకంటె నిమ్మహాకవివిషయమున వేఱొక్క మాటఁ జెప్పవీలు లేదు. ఎంతగాఁ దనపేరు నాచ్ఛాదించుకొనినను శాశ్వతకీర్తి యిమ్మహాకవిపుంగవునకు వచ్చియే తీఱినందులకు మనము సంతోషింపవలయును. ఈగ్రంథము పెక్కుతావులఁ బురాణము చెప్పఁబడుచు నెందఱో పామరులకో రామాయణకథను వెల్లడించి భక్తిశ్రద్ధల వృద్ధి సేయుచున్నది. ఇంతకంటె సత్కవులకు వేఱొక ఫల మేమి కావలెను? ఇట్టే యిక్కాలపుఁగవిపుంగవులును సద్గ్రంథముల రచించి పామరులకు జ్ఞానాభివృద్ధిని జేయుదురుగాక! సర్వేశ్వరుఁడు, సర్వసాక్షి, కరుణానిలయుఁడు నగుపరమపురుషుఁడు సద్గ్రంథముల వృద్ధిచేయుట కెల్లరఁ బురికొల్పుఁగాక.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ,

కడప హైస్కూలు ఆంధ్రపండితుఁడు.

# మొదటికూర్పు పీఠిక

శ్రీవాల్మీకిమహర్షిప్రణీతం బగు శ్రీమద్రామాయణము సంస్కృతభాషయం దాదికావ్యము. అది తన్నుపాసించుమానవులకుఁ గల్పతరువుంబోలెఁ జతుర్విధ పురుషార్థంబుల నొసంగుచు మహామహిమంబునఁ జెన్నారు. రామాయణకథ నెఱుంగనిమనుజులు మనదేశంబున లేరని చెప్పవచ్చును. ఈపుణ్యచరిత్రమును సంస్కృత భాష నెఱుంగని యాంధ్రదేశప్రజనుల కుపయుక్తం బగునట్లు తొలుత రంగనాథుఁ డనుకవి ద్విపదకావ్యంబుగా రచియించెను. పిమ్మట భాస్కరుఁడు మున్నగు కవులు పద్యకావ్యంబుగా రచించిరి. అనంతరము కొండొకకాలమున కుత్తరరామకథను గవిబ్రహ్మ యని సన్నుతి గాంచిన తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణం బనుకావ్యంబును నిర్మించెను. ఇప్పటికాలంబున గోపీనాథము వేంకటకవియు, వావిలికొలను సుబ్బారాయకవివాఘుఁడును రామాయణకావ్యంబును మూలము ననుస రించి పద్యకావ్యంబులుగా వ్రాసి కీర్తిఁ గాంచిరి. ఇంకను బెక్కండ్రుకవులు రామ చరిత్రమును బెక్కుతెఱంగుల వ్రాసియున్నారు.

ఆంధ్రంబున రామాయణమును వ్రాసినవారిలోఁ దొల్లిటికవి రంగనాథుఁడు. ఈగ్రంథమున నుపోద్ఘాతమునందుఁ గోనబుద్ధరాజు తనజనకుండగు విట్ఠల నృపా లునియాజ్ఞచే నతని కంకితంబుగ రామాయణము నాంధ్రీకరించె నని యుండుటం బట్టి దీనిని రచించినకవి కోనబుద్ధరాజని యెన్నఁదగి యున్నను దీనికిఁ జిరకాలము నుండి రంగనాథరామాయణ మనియే పేరు కలిగియుండుటచేఁ గోనబుద్ధరాజునొద్ద నాస్థానకవి యగు రంగనాథుఁ డీగ్రంథమును బుద్ధరాజుపేరుతో వ్రాసి తదీయా జ్ఞానుసారంబుగ విట్ఠలధరణీశుపేర నంకితంబు గావించెనో యనుసందేహము పొడముచున్నది. లేకున్న నీగ్రంథమునకు రంగనాథరామాయణ మనుపేరు కలుగుటకుఁ గారణము కానంబడదు.

రంగనాథకవి యేకాలపువాఁడో యేకులమువాఁడో యని తెలియుట కాధారము లేవియుఁ గానరావు. శాలివాహనశకము పండ్రెండవశతాబ్దంబున నుండిన వాఁడని వీరేశలింగముపంతులుగారు కవిజీవితములో వ్రాసిరికాని దానికిఁ బ్రబల నిదర్శనములు కానంబడవు. భాస్కరుఁడును రంగనాథుఁడును సమకాలికు లనుట కొకగాథ కలదు. కోనబుద్ధరాజు నాస్థానకవియగు రంగనాథుఁడు రామాయణమును

ద్విపదకావ్యముగా వ్రాయుచుండఁగా దాని నెఱింగి నృపాలునియొద్ద మున్నుగాఁ దనకావ్యము నొసఁగి బహుమతు లందఁగోరి భాస్కరుఁడు రామాయణమును బద్యకావ్యముగాఁ దనమిత్రులచేఁ గొంత వ్రాయించి తానుం గొంతభాగమును వ్రాసి పూర్తిచేసి రాజునొద్దకుఁ గొనిపోయె ననియు నాసమయంబుననె రంగనాథుఁడును దా నొనర్చినరామాయణమును తీసికొనివచ్చి రాజున కొసఁగఁగా నమ్మహీపతి యాశ్రితపక్షపాతంబున రంగనాథుని రామాయణమును దక్షిణహస్తంబున గ్రహించి భాస్కరుని రామాయణము నెడమచేతఁ బుచ్చుకొనఁబోఁగా భాస్కరుఁడవమానితుఁడై కోపించి నాయుత్తమకావ్యంబును నీయట్టి పక్షపాతముగల నరవరున కిచ్చుటకంటె నీగుఱ్ఱపువాని కిచ్చుట మేలని చెప్పి లేచి పోవుచుండఁగా నతని యశ్వాధ్యక్షుఁడైన సాహిణిమారుఁ డామాటలు వినుచుండి, కవీంద్రా! నీయాడినమాట తప్పక కృతిని నా కిమ్మని వేఁడఁగా భాస్కరుండు రామాయణము నతని కంకితము చేసె ననియు నొకకథ కలదు. ఇది నిక్కమయేని రంగనాథుఁడును హూణశకము పదుమూఁడవశతాబ్దమున నుండినవాఁడని చెప్పవచ్చు.

ఇఁక రంగనాథుని కవిత్వముం గూర్చి యించుక విచారింతము. ద్విపదకావ్యములలో శ్రేష్ఠమైనది రంగనాథరామాయణ మనిచెప్పుటకు సందేహము లేదు. అందఱును బ్రౌఢకావ్యములను జదివి వానియర్థంబుల నెఱుంగుట దుష్కరము. కావున స్త్రీలు లోనగువారికి సులభముగాఁ దెలియుటకై తొల్లి కొందఱు కవీశ్వరులు ద్విపదకావ్యములుగా వ్రాసియున్నారు. హరిశ్చంద్రోపాఖ్యానము, నలచరిత్రము, రాజయోగసారము, పరమయోగివిలాసము, సిద్ధేశ్వరచరిత్రము మొదలగు గ్రంథములు ద్విపదకావ్యములుగా వ్రాయఁబడి యున్నవి. రంగనాథుఁడు రామాయణమును వ్రాసిన యనంతర ముత్తరరామాయణమును ద్విపదకావ్యముగా రంగనాథుఁడే వ్రాసి కోనబుద్ధరాజుకుమారులైన కాచవిభుఁడును విట్ఠలనృపాలుఁడును రచించినట్లు వారికే కృతిపతిత్వ మొసఁగెనని తోఁచుచున్నది.

రంగనాథునిశైలి ద్రాక్షాపాకమై సలక్షణమై రసవంతమై యెంతయు మనోహరముగా నుండును. అన్వయకాఠిన్యము కొంచమేనియు లేక చక్కనిజాతీయములతో నొప్పారుచుఁ జదువఁ జదువ మనంబున కానందంబుఁ గలిగించును. గ్రంథమును జదువుచున్నపుడు శ్రీరాముని దివ్యచరిత్రమును గన్నులారఁగనుచు వీనులార వినుచున్నట్లు తోఁచును. కావున రంగనాథరామాయణమును నాంధ్రదేశీయులు పలుమాఱు వీథిపురాణముగాఁ బఠింతురు.

ఇతనికవిత్వమునఁ దెనుఁగుపదములు మెండుగాను సంస్కృతపదములు స్వల్పముగాను నుండును.

తెనుఁగురచనల కుదాహరణము:—

"తిట్టుపాటున కోడి తివిరి సాకొందుకు, పట్టంబు మాన్పించఁ బనిచెఁ గాకధిప
సొంపేది రాముని స్రుక్కక కైక, చంపు మన్నను బట్టి చంపవే నీవు?
పెద్దకాలము నాకు బిడ్డలు లేక, పెద్దయుం శోకించి పెక్కులు నోచి
కడపట నొక్కనిఁ గని యేను గొంత, యుండు కాఁటి యున్నచో నుండనీవైతి"

అయోధ్యాకాండము. పుట. 107

ఇక్కవి తెలుఁగుశబ్దములు విశేషముగాఁ బ్రయోగించుచున్నను దనపాండిత్యమును దెల్పుటకై యక్కడక్కడ సంస్కృతరచనలును గావించియున్నాఁడు. ఉదాహరణము:—

"గంధకస్తూరికాకలితాంబుపూర, గంధిలసకలమార్గధరాంగణంబు
చీనిచీనాంబరశ్రేణీవితాన, నానామణీతోరణధ్వజాంచితము
ఫలభారకమ్రరంభాస్తంభపూగ, కలితప్రతిద్వారకక్ష్యాంతరంబు
సాంకవలిప్తవిస్తారవితర్ది, కాంకితరంగవల్ల్యాదిశోభితము
[illegible]తార్క, గణసౌధగోపురోత్కరశిరోగ్రంబు"  బా. పు. 63

ఈగ్రంథంబునందు రంగనాథకవి శబ్దాలంకారములను నర్థాలంకారములను సమయోచితంబులుగా నందందుఁ బ్రయోగించి యున్నాఁడు. శబ్దాలంకారముల కుదాహరణములు:—

"రాముని జితభృగురాముని కాంతి, సోముని [illegible] కీర్తి
కాముని సౌందర్యకాముని శాంత, ధాముని రవిసమధామునిఁ బాసి"  అయో. పుట. 82.

"కమనీయమృదుకరకమలయుగ్మములఁ, గమలము ల్ద్రిప్పుచు కమలంగఁ బట్టి
కమలాకరంబులఁ గమలాప్తకులుఁడు, కమలారియునుబోలి కమలముల్ నొంచు"

యుద్ధకాండము. పుట. 247

"జగతీతనూజాత జగదేకమాత, నిగమసన్నుతపూత నిగమవిఖ్యాత
యమితగుణోపేతయైనయాసీత......"  యుద్ధకాండము. పుట. 282

219-220 పుటలలోఁ గన్పడు వర్షాకాలశరత్కాలవర్ణనలందును 313 పుటయందుఁ గన్పట్టుచంద్రోదయవర్ణనలందును నుపమోత్ప్రేక్షాశ్లేషాద్యర్థాలంకారములు తెలియునది.

రంగనాథుఁడు లాక్షణికుం డగుమహాకవియయ్యు చంద్రునందుఁగళంకముం బోలె నితనికావ్యంబున నక్కడక్కడఁ గొన్ని లక్షణవిరుద్ధములు కానంబడియెడి.

"ఏతల్లిపని సేతు నేతల్లిఁ గొలుతు"  పుట. 161

ఒకానొకచోట రేఫశకటరేఫలమైత్రియుఁ జూపట్టుచున్నది:—

"మీఱి తాపసులను మిఱ్ఱగెదువీవు, వారు తాపసులను వడిఁబ్రోతురెపుడు"  పుట. 282

ఇట్టి ప్రయోగము లొకకొన్ని కానంబడుచున్నను రంగనాథకవిని లాక్షణికునిగాఁ బూర్వకవు లంగీకరించియున్నారు. కావున నివి రంగనాథునివి కావనియుఁ గొంద ఱూహించుచున్నారు.

రంగనాథుఁడు వాల్మీకిరామాయణము ననుసరించి వ్రాసినను మూలగ్రంథములోని యన్నియంశములను సంక్షేపముగా వ్రాసెను; గాని యనూ్యనానధిక మగు భాషాంతరము చేసినవాఁడు కాఁడు. కొన్నిచోటులఁ దనయిష్టము చొప్పున వర్ణనలు పెంచియుఁ గొన్నిచోటుల మార్చియు నున్నాఁడు. ఎటు లున్నను ముఖ్యములగు నంశములనుమాత్రము విడువక తెనుఁగు చేసి యున్నాఁడు. వీని కుదాహరణము లూహించుకొనునది.

రంగనాథ రామాయణ మాంధ్రదేశంబున సకలజనాదరణీయమైన గ్రంథమని మున్నె యెఱింగించితిమి. ఇందేపట్టునఁ జూచినను రసవంతముగాను హృదయరంజకముగాను నున్నను మిక్కిలి రమణీయములగు భాగములలోఁ గొన్నింటి నిటఁ జూపెదము.

అయోధ్యాకాండమున దశరథుఁడు కైక ననునయించుసందర్భమున—
(పుట. 80).

"ఇందీవరాక్షి పూర్ణేందునిభాస్య, ఇందిందిరాలక యేల యీయలుక
పవళింప నేలనే బాలేందుఫాల, యవిరళమృదులపర్యంకంబు లుండఁ
గోమలమృదులదుకూలంబు లుండ, నీమైలచీర నీ వేల కట్టితివి
పసిఁడిశలాకతోఁ బ్రతియైన మేనఁ, బొసఁగ భూషణములఁ బూన వేమిటికిఁ
జలపట్టి వెన్నెలచందమా నుదుటఁ, దలకట్టు వేయ నీతలఁ బెట్టు పుట్టె
నీలాలకంబుల నిగ్గులు దేర, నేల పాపటదీర్ప విన్నాణ్ణరీతిఁ
గెమ్మోవి కినుమడి కెంపుసంధిల్లఁ, గమ్మతమ్ముల మేల కైకొవు బాల
జిలుగువన్నెలతేట చీఁకవ్వమెలక, మొలిపింప వేటికి ముఖచంద్రునందు"

సుందరకాండమున హనుమంతుఁడు సీతాదేవిని వెదకుప్రకరణంబున—
(పుట. 215.)

"ఇనవంశవల్లభుఁ డేకతంబునను, మును నన్ను రమ్మని ముద మొప్పఁ బిలిచి
జనకజఁ బొడఁగానఁ జాలుదు వీవ, యని చెప్పి నాచేతి కానవా లిచ్చెఁ
బనిపూని వచ్చితి బంటనై యేను, కనుఁగొనలే నైతిఁ గమలాక్షి నెందు
నీదురాత్ముఁడు సీత నిటఁ దెచ్చుచోట, వేదనఁ బ్రాణము ల్విడిచెనో యింత

* * * *

యేమని మగుడుదుఁ జేమందుఁ బోయి, యేమిసేయుదు నింక నిటమీఁద నేను
వామాక్షిఁ గానక వచ్చితి ననిన, రాముఁ డప్పుడె పాయుఁ బ్రాణవాయువుల
నన్నకై సౌమిత్రి యడుఁప నీవార్త, విన్నంత భరతుండు విడుచుఁ బ్రాణముల
నతనికై శత్రుఘ్నుఁ [illegible]. హాతు లాదు రినవంశ మంతట సమయు
నది చూచి సుగ్రీవుఁ డాయంగదుండు, మొదలై నకపివంశమును నాశమొందుఁ
గాన వానప్రస్థగతి మహాటవుల, నేను గా పుండుదు నిదియుఁ గాదేని
సొదఁ బేర్చుకొని యగ్నిఁ జొత్తు నొండేని, యుందధులఁ బడిచత్తు నుసురాన దక్క
యక్కట సంపాతి యాడినమాట, నిక్కంబుగా నమ్మి నీరధి దాఁటి
యిచ్చటి కొంటినై యేవచ్చు టెల్ల, నచ్చుగా వ్యర్థ మయ్యె నొఁగాక యేమి"

272 పుట చంద్రోదయవర్ణన మెంతమనోజ్ఞముగాఁ జేయఁబడినది చూడఁదగు.

"కృతకృత్యుఁ డగురాముకీర్తిపుష్పములు, చతురతమై వెదచల్లినయట్లు
కరమొప్పఁ జుక్కలు గాన్పించె నంతఁ, జిరకాలములసీమ శిశువులమామ
పాలుపొందుకలువలపోరాని విందు, కలసినజక్కవకవఁ బాపు మందు
పాలవెల్లిని ద్రచ్చిపడసిన వెన్న, శాలియాఁదలపూవు చుక్కలనవ్వ
నెఱిచకోరములకు నెలనెల పంట, యురవేసి విరహుల నుడికించుమంట
గగనంబుతోఁడపు దొంగలగుండెదిగులు, నొగి నబ్ధిఁ బొంగించు నూఱటపట్టి
హరిహరబ్రహ్మల యానందదృష్టి, సరసిజరిపుఁ డైన చంద్రుఁడు వొడిచె"

ఇట్టి వర్ణనలు మఱియుఁ బెక్కు లున్నవి. వానిం జదువరు లారయునది.

తేనియ తేఁటలంబోని మధురరసవచనంబులు నివ్వటిల్ల "నసమానలలితశబ్దార్థ సంగతులఁ...బరఁగ నలంకారభావనల్నిండ" నీరామాయణమును రచియించిన రంగనాథకవి నెంతయేని నుతింపఁ దగియుండెడు. చరిత్రము శ్రీరాముని దగుటచే నిది పరమపావనంబును సకలపురుషార్థప్రదంబును గలికలుషవిధ్వంసనచణంబును గావున దీని నాంధ్రదేశీయులెల్లరుఁ బరమాదరంబునఁ బఠించుచుఁ గృతకృత్యులై యెల్ల సౌఖ్యములఁ బడయుచు నానందింతురుగాక.

నాగపూడి - కుప్పుస్వామయ్య.

# విషయసూచిక

## బాలకాండము

## అయోధ్యాకాండము



## ఆరణ్యకాండము

విషయము.



శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీరంగనాథరామాయణము

## బాలకాండము

శ్లో. చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

శ్రీకామినీనాథు జితదైత్యనాథు, లోకరక్షణకృత్యు లోకైకనిత్యు
నిత్యసదానందు నిర్వాణకృత్యుఁ, గృత్యవిదూరు నకృత్రిమాధారు
నాధారకమలమధ్యామోదభేద, సాధనక్రమసమాచరణషట్చరణు
సింధురవరదు నాశ్రితలోకబంధు, [1]బంధమోచను బలిబంధనోదగ్రు
నారూఢపంచదశాక్షరప్రసవ, పారిజాతాకారుఁ బ్రణవానుకారు
నగ్రామ్యగోపికాభ్యంతరవ్యగ్రు, నగ్రసదాకారు నాకారరహితు
యోగిమానసలసదోంకార[2]దీప్తు, యోగసందర్శితాభ్యుదయప్రచారు
శ్రుతిశిరోభాగవిశుద్ధచైతన్యు, నతిలోకు సర్వలోకాశ్రయశ్లోకు
నఖిలాండమూర్తికాయతనిత్యసూత్రు, నఖిలతత్త్వాతీతు నాద్యంతరహితు
నమలాత్ము నక్షరు నామ్నాయకమల, కమలాప్తు నక్షీణకల్యాణసదను
శంకావినిర్ముక్తసద్భక్తవర్యు, కైంకర్యవత్సలుఁ గారుణ్యసింధు
బోధకుండై వచ్చి బోధ్యమై తోఁచి, బోధమై వీక్షించు పూర్ణస్వరూపు
నానితత్త్వము తత్త్వమస్యాదివాక్య, భేదాతిరూపు నభేద్యప్రతాపుఁ
గడుఁగొని నియతులై కర్మబంధములు, గడచి యేకతమునఁ గదలక నిలిచి
యరుదుగా నింద్రియవ్యాప్తుల మఱచి, విరచితాసనబద్ధవిన్యాసలీలఁ
బరిచితాసనమునఁ బదిలమై నిలిచి, సరవితో మదిలోన సరసత నిల్పి
నెలయ డెబ్బదిరెండువేలనాడులను, గలయ వివేకించి కసటు వోఁ దుడిచి
యొకరెండుత్రోవల నొకటిగా మెలఁగి, యకలంకమతితోడ నతిసూక్ష్మముగను

1 బన్ధమోక్షణు. 2 విప్ర, యోగిసందర్శితా.

నవయవంబులయందు నానందమైన, పవను నిరోధించి పశ్చిమవీథిఁ
జొనిపి కోణత్రయశుద్ధి గావించి, మనసుతోడనె కూడ మఱపించి తెచ్చి
కుండలినిజశక్తిఁ గూర్చి సంప్రీతి, నొండొండఁ గమలంబు లొగి నాఱుగడచి
యటఁ జంద్రమండలం బల్లనఁ జేర్చి, యటఁ బరమవ్యోమ మై తమ్ము మఱచు
పరమయోగీంద్రులభావమ్ముకీలు, పరికింపఁ దానైన బ్రహ్మస్వరూప
మొగి రెంటఁ బెరయక మూట నేర్పడక, తగిలి నాల్గవత్రోవ తత్త్వమై యుండి
యైదింటి కాదియై యాఱిటిఁ గడచి, యాదికి నాదియై యమరినదేవుఁ
డనుతరనిర్మలాంతర్నాడియూప, మనురూప మగుమనం [illegible],
నిష్ఠాభిరతివేది నిఖలేంద్రియములు, కాష్ఠము లొప్పథ మఖండపావకుఁడు
యోగామృతము ఘృతముజ్వలానంద, యోగంబు ఫలముగా నొగిఁ జెల్లుచున్న
యభిమతాంతస్థనిత్యామోదకర్మ, విభవంబుకడపట విలసిల్లుఘనుఁ
బరమేశు నవ్యయుఁ బరమకల్యాణుఁ, బరమాత్ము నపరోక్షుఁ బ్రక్షీణకర్ము
మాదేవుఁ గమలాక్షు మమ్మేలు దేవు, నాదినారాయణు [illegible]
భావించి కీర్తించి ప్రార్థించి మ్రొక్కి, సేవించి యభిమతసిద్ధిఁ గావింప
హారకర్పూరనీహారగోక్షీర, తారకాకృతి శారదాదేవిఁ గొలిచి
చారురామాయణచంద్రాబ్ధి యగుచు, వారక విలసిల్లు వాల్మీకిఁ దలఁచి
భారతమంజరీపారిజాతంబు, సారమానసుఁ బరాశరసూనుఁ గొలిచి
యతనితనూభవు నాశుకబ్రహ్మ, నతిభక్తియుక్తిమై నభినుతి చేసి
యేకథఁ జెప్పిన నెల్ల సజ్జనులు, నేకొని కీర్తనల్ చేయుచు నుందు
రేకథఁ జెప్పిన నిహపరోన్నతులు, ప్రాకటంబుగఁ జేర్చి [1]ఫలియించుఁ బ్రీతి
నేకథఁ జెప్పిన నీప్సితార్థములు, గైకొని పుణ్యముల్ గడఁగి కాన్పించు
ననువిచారములు నాయంతరంగమునఁ, గొనకొని కృతిసేయఁ గోరుచున్నంత
శ్రీరమణీయులై కృష్టిసత్తములు, గోరి వర్ణనసేయఁ గోనవంశమున
ఫలితసదాచారభానుఁడై తోఁచి, కలికాలదోషాంధకారంబు ద్రోలి
గురుధర్మపథముల కొలఁదులు దెలిసి, పరనృపనక్షత్రపంక్తుల నణఁచి
నిత్యపుణ్యోదయనియతిఁ బెంపొందు, నత్యున్నత ప్రతాపాభిరామునకుఁ
గరదీప్తి నిజఖడ్గగంగాప్రవాహ, పరధరణీపాలభాలాక్షరములఁ
గలపూర్వగర్వపంకము లొప్పఁ గడుగు, నలవుమైనసమానుఁ డగుసత్యనిధికి
శరణార్థిరాజన్యషట్పదాధార, కరపద్మునకుఁ గోనకాటభూపతికి
నయనయోదయదయాయతనిత్యమతికిఁ, బ్రియతనూజన్ముఁడై పృథివిఁ బెంపొందు
రుద్రప్రతాపుండు రుద్రనిర్మలుఁడు, రుద్రాత్ముఁ డగు కోనరుద్రనరేంద్రు
పౌత్త్రుఁ డభంగుఁ డప్రతిమవిక్రముఁడు, గోత్రధీరుఁడు కులగోత్రవర్ధనుఁడు
దివిజేంద్రవిభవుండు ధీరవర్తనుఁడు, భువనవిఖ్యాతుండు బుద్ధభూపాలు
తనుజన్ముఁ డక్షీణదాక్షిణ్యధనుఁడు, ధనధాన్యధనదుండు ధర్మధర్మజుఁడు

1 ఫలియించుచుండు.

అతిపుణ్యసౌజన్యుఁ డతిభీమజన్యుఁ, డతిశౌర్యశరజన్ముఁ డాజన్మశుభుఁడు
కామినీకాముఁ డఖండవిక్రముఁడు, రామత్రయోదారరణవిశారదుఁడు
చందనమందారచంద్రికాహార, కందళత్కుందేందు ఘనకీర్తిధనుఁడు
పరఁగు కోనాన్వయమహారాజాతనుజుఁ, బరిపక్వఫలరీతిఁ బరఁగినవాఁడు
పొలుచు కోనాన్వయపూర్వాద్రియందు, వెలుఁగుభానుఁడువోలె విలసిల్లువాఁడు
దొరసి కోనాన్వయదుగ్ధాంబురాశిఁ, బరిపూర్ణచంద్రుఁడై భాసిల్లువాఁడు
నిక్కి యంతంతకు నిర్మలం బగుచు, దిక్కులఁ దనపేర్మి దీపించువాఁడు
దానధర్మక్రియాతాత్పర్యకేళిఁ, దానరై వినుతులఁ దనరారువాఁడు
మగఁటిమి నసమానమహిమ దీపింపఁ, బగతుఱ నవలీల భంజించువాఁడు
బలితోగ్రరాజన్యబలవజ్రపాణి, లలినొప్పువాసవు లలిఁబోలువాఁడు
ప్రత్యర్థినృపవనపావకోజ్జ్వలుఁడు, సత్యంబు చేతను సరిదగువాఁడు
విమలోగ్రరాజన్యవిపులాంధకార, కమలాప్తబింబ ఖడ్గప్రభావిభవ
విలసితామరవధూవిమలాస్యకమల,ముల వీరమధుకరంబులఁ గూర్చువాఁడు
అరినృపప్రాణానిలాహారభుజగ, వరభుజాస్థాపితావని[1]గలవాఁడు
కురు[2]కేరళావంతికుంతలద్రవిళ, మరుమత్స్యకకరూశమగధపుళింద
కససుసాంకాశ్యకోసలబర్బరముల, నరనాథసభల వర్ణనకెక్కువాఁడు
ఆతతసామభేదాదుల నొప్పు, నీతిక్రమంబుల నెరసినవాఁడు
రమణమై నాదిమరాజన్యరీతి, నమితవైభవముల నమరినవాఁడు
వినయనయోపాయ విజయసుస్థిరుఁడు, ఘనకీర్తి విఠ్ఠలక్ష్మాపాలవరుఁడు
రాజసర్వజ్ఞుండు రాజసింహుండు, రాజశిరోమణి రాజపూజితుఁడు
సకలజగద్ధితచాతుర్యధుర్యుఁ, డొకనాఁడు కొలువున [3]నున్నతుం డగుచు
బహుపురాణజ్ఞులు బహుశాస్త్రవిదులు, బహుకావ్యనాటకప్రౌఢమానసులు
హితులు మంత్రులుపురోహితులునాశ్రితులు, సుతులు రాజులుబహుశ్రుతులునుగొల్వ
దీపించి భూలోకదేవేంద్రుపగిది, నేపారి యున్నచో నింపు సొంపొంద
రసికులు భారత రామాయణాది, రసగోష్ఠి చెల్లింప రసికశేఖరుఁడు
రామకథాసుధారస[4]రక్తుఁ డగుచు, నామహాసభలోన నందఱఁ జూచి
రమణమైఁ దెనుఁగున రామాయణంబు, క్రమ మొప్పఁ జెప్పెడి ఘనకావ్యశక్తి
గలకవు లెవ్వారు గల రుర్వి ననుచుఁ, దలపోయ విఠ్ఠలధరణీపాలునకు
నున్నతమూర్తికి సురుయశోనిధికి, విన్నవించిరి వేడ్క విబుధులు గడఁగి
నీతనూజన్ముండు నిపుణమానసుఁడు, ధూతకల్మషుఁడు బంధుసన్నీతియుతుఁడు
సర్వజ్ఞుఁ డనఘుండు [5]చతురవర్తనుఁడు, సర్వపురాణ విచారతత్పరుఁడు
కమనీయబహుకళాగమవిచక్షణుఁడు, సుమనీషిపోషణోత్సుకసుఖోన్నతుఁడు
కవిసార్వభౌముండు కవికల్పతరువు, కవిలోకభోజుండు కవిపురందరుఁడు

1 వ్రాలువాఁడు. 2 కురుకుంతళావంతి ఘూర్జరద్రవిళ. 3 నున్నతుల్ మెఱయ. 4 రక్తి తవర. 5 సాధువర్తనుఁడు.

ప్రత్యర్థిరాజన్య[illegible]వజ్రపాణి, ప్రత్యర్థినృపదావ[1]పావకోజ్జ్వలుఁడు
భీక[illegible], లోకానురక్తత్రిలోకదుర్దముఁడు
పరసాధుజలజా[illegible], పురుషచింతామణి [illegible]
నీ కతిభక్తుండు నిఖిలశబ్దార్థ, పాకజ్ఞుఁ [illegible]
మఱియు రామాయణమర్మధర్మజ్ఞుఁ, డెఱుఁగు నాతనిఁ బిల్వ మీకథఁ జెప్ప
ననిన మజ్జనకుఁ డుదాత్తవర్తనుఁడు, నను నర్థిఁ బిలిపించి నను గారవించి
భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ, రామాయణంబు పురాణమార్గంబు
తప్పక నాపేరఁ దగ నంధ్రభాషఁ, జెప్పి ప్రఖ్యాతంబు సేయింపు మర్థి
నని యానతిచ్చిన నస్మద్గురూక్తులకు, ననయంబు హర్షించి యట్ల కావింపఁ
బనిపూని యరిగండభైరవుపేర, ఘనుపేర మీసరగండాంకుపేర
లలితసద్గుణగణాలంకారుపేర, నలఘునిశ్చలపదయాయత[illegible]పేర
నాతతకృతిపేర నతిపుణ్యుపేర; మాతండ్రి విఠ్ఠలక్ష్మానాథుపేర
రాజులు బుధులును రసికులు సుకవి, రాజులు గోష్ఠిని రాగిల్లి పొగడఁ
బదము లర్థంబులు భావము ల్గతులు, పదశయ్య లర్థసౌభాగ్యముల్ యతులు
రసములకల్పన ల్ప్రాసనంగతులు, రసమూనరీతులు నన్నియుఁ గలుగ
నాదికవీశ్వరుఁ డైనవాల్మీకి, యాదరంబునఁ బుణ్యు లందఱు మెచ్చఁ
జెప్పినతెఱఁగున శ్రీరామచరిత, మొప్పఁజెప్పెదఁ గథాభ్యుదయ మె ట్లనిన

కథాప్రారంభము

ఘనతపస్స్వాధ్యాయకమనీయశీలు, మునినాథు నారదు మునిలోకవంద్యు
ననఘుతపోనిధి యైనవాల్మీకి, గనుఁగొని యొకనాఁడు కర మర్థి నడిగె
నెవ్వాఁడు శ్రీమంతుఁ డెవ్వాఁడు శాంతుఁ, డెవ్వాఁడు ఘనపుణ్యుఁ డెవ్వఁ డున్నతుఁడు
నెవ్వాఁడు నీతిజ్ఞుఁ డెవ్వాఁడు ప్రాజ్ఞుఁ, డెవ్వాఁడు దుర్దముం డెవ్వఁ డుత్తముఁడు
నెవ్వాఁడు జితకాముఁ డెవ్వఁ డజేయుఁ, డెవ్వాఁడు నిరసూయుఁ డెవ్వఁ డాఢ్యుండు
నెవ్వాఁడు సువ్రతుం డెవ్వఁ డుదారుఁ, డెవ్వాఁడు సుచరిత్రుఁ డెవ్వాఁడు సముఁడు
నెవ్వనికిన్నకు నింద్రాదిసురలు, దవ్వుదవ్వులనుండి తలఁకుచుండుదురు
అట్టివాఁ డిలఁ బుట్టి యరిగెనో యిప్డు, పుట్టెనో యిఁకమీఁదఁ బుట్టనున్నాఁడో
యనినఁ ద్రిలోకజ్ఞుఁ డైననారదుఁడు, దనబుద్ధి నెంతయుఁ దలపోసిచూచి
యామహా శ్రీవిష్ణుఁ డిపుడు జన్మించె, రాముఁడై దశరథరాజున కతఁడు
నియతాత్ముఁ డతిశౌర్యనిధి కృపాజలధి, జయశాలి స్వజనరక్షణవిచక్షణుఁడు
కంబుకంధరుఁడు చక్కని మేనివాఁడు, బింబారుణోష్ఠుండు పీనవక్షుండు
వెడఁదకన్నులవాఁడు విపులాంసతలుఁడు, నిడుదచేతులవాఁడు నియతవర్తనుఁడు
వేదవేదాంగకోవిదుఁడు కోదండ, [2]వేదవిదుండు వివేకభూషణుఁడు
కమలాప్తుతేజంబు కడలిగాంభీర్య, మమరాద్రిధైర్యంబు నవనిసైరణయు
ధనదునిత్యాగంబుఁ దనయందు మిగుల, ననువొందు నిత్యకల్యాణవిగ్రహుఁడు

1 పాపనాశకుండు. 2 వేదవిద్వరుఁడు.

కౌసల్యకానందకరుఁడు శ్రీకరుఁడు, భాసురత్రైలోక్యపావనమూర్తి
రాముఁడై యిలఁబుట్టి రాజశేఖరుఁడు, రాము నిమ్మని వేఁడ రాజు పంపఁగను
మౌనివెంటను బోయి మఖమును గాచి, దానవి నటుకూల్చి దైత్యునిఁ ద్రుంచి
రాతి నాతినిఁ జేసి రాముఁడు వేగ, సీతఁ జేకొనుటకు శివువిల్లు విఱిచి
ఖ్యాతిగా సీతను గడుఁ బెండ్లియాడి, సీతతోడను గూడి చెలఁగి యయోధ్య
కేతెంచుచోటఁ గెంపెసఁగంగ విప్రుఁ, డేతెంచి నిలిచిన నేపునఁ గదిసి
వాపోవ నాతని బలువిల్లు దిగిచి, కోపంబుతో మునుఁ గొమరొప్పఁ దీసి
యేపున నందఱు నెద వేడ్కమీఱ, నాపట్టునను వచ్చి యప్పురిఁ జేరి
నాసక్తి యౌవరాజ్యాభిషిక్తునిగఁ, జేసెద నని తండ్రి చెలఁగి యయోధ్యఁ
బట్టంబు గట్ట భూపతి సమకట్ట, మట్టుమీఱినయట్టి మంథర యపుడు
నెట్టనఁ గైకతో నెఱినాటఁ జెప్పఁ, గట్టడికైక సంగరమునఁ దొల్లి
రెండువరంబు లర్థించిన దౌటఁ, జండించి కాననస్థలికి రాఘవునిఁ
బనిచిన జనకుని ప్రతినకై పూని, జనకజాలక్ష్మణసహితుఁడై వెడలి
దేవనంబునను నెంతే ఘనంబునను, బావనమునిచర్యఁ బరఁగు సంయములఁ
గరుణమైఁ గాపాడి ఖరదూషణాది, శిరములు శరములఁ జెండు బెండాడి
ఋశ్యమూకంబున నినజుఁ [1]జేపట్టి, వశ్యత నొకకోల వాలిఁ దూలించి
సీతకై చలపట్టి సేతువు గట్టి, పాతకదశకంఠుపదితల ల్గొట్టి
సీతతోఁ గూడి యాశ్రితలోకపారి,జాతంబు వనచరజాతంబు గొలువ
నింద్రాదివినుతుఁడై యేతెంచి రామ,చంద్రుండు నిజపూజ్యసామ్రాజ్యలక్ష్మిఁ
బాలించుచున్నాఁడు ప్రజలకు వేడ్కఁ, గీలించుచును గృతకృత్యుఁడై యనుచు
నారాముచరిత మాద్యంతంబు చెప్పి, నారదముని పోయె నలినజుపురికి
మునిపతి వాల్మీకి ముద మొప్ప నంతఁ, దనశిష్యుఁ డగు భరద్వాజుండుఁ దానుఁ
బ్రకటింప సజ్జనభావంబు పోలె, నకలుషజీవనం బై కరం బలరు
తమసానదికిఁ బోయి తన్నదీవారిఁ, దమ యనుష్ఠానము ల్దగఁ జేయుచుండి
యాయేటిదరిఁ గ్రౌంచయమళంబు ప్రేమఁ, గాయజకేళిమైఁ గవయుచో నొకటి
నొకబోయ చంపిన నున్న యాక్రౌంచి, ప్రకటశోకంబునఁ బలవింపఁ జూచి
దగవును ధర్మంబు తలపోసి మౌని, పగదాయనబోయపై నల్కవొడమి
యోరి నిషాదుండ యోరి పాపాత్మ, యోరి నీ కెగ్గేమి యొనరించె రోరి
కామించి క్రౌంచముల్ [2]గవయుచో నొకటి, నేమిటికై చంపి తిబ్బంగిఁ గదిసి
యీపాతకమున ననేకదుఃఖములు, ప్రాపించి తిరుగుము బహువత్సరములు
అని బోయ శపియించి యంత వాల్మీకి, దనశిష్యుఁ డగు భరద్వాజునిఁ జూచి
పలికెను శ్లోకంబుపద్ధతిగాను, బలికినపల్కును బలుమాఱు చూడ
ఛందోనిబద్ధమై సమవర్ణపంక్తిఁ, బొంది నాలుగుపదంబుల హృద్యమగుచు
నిది చాల విస్మయ మీశాపవాక్య,పదములు దమయంతఁ బద్యమై నిలిచె

---

1 స్నేహించి. 2 కవయంగ నొకటి; కవయ నం దొకటి.

ననిన భరద్వాజుఁ డాదిగా శిష్యు, లనురక్తిఁ బఠియించి రాపద్య మంత
ననఘుఁ డావాల్మీకి యాశ్రమంబునకు, జనియున్నచో బ్రహ్మ చనుదెంచుటయును
నెదురేఁగి పదముల కెఱఁగి తోడ్తెచ్చి, కుదురుగాఁ గుశపీఠిఁ గూర్చుండఁ జేసి
కరమర్థిఁ బూజించి కరములు మొగిచి, పరఁగ శాపాక్షరపద్యంబుఁ జదువ
విని బ్రహ్మ నగి పద్యవిషయమై వాణి, యనఘ నీముఖమున నవతరించినది
శ్రీరాముచరిత మశేషంబు నీకుఁ, గోరి నారదుఁడు సంకోచించి చెప్పె
నది విస్తరించి నీ వఖిలంబు చెప్పు, మది సర్వమును దోఁచు నని చెప్పి పోయె
నీరీతిఁ గృప వరం బిచ్చి మన్నించి, సారసగర్భుండు చనిన పిమ్మటను
మఱి నిర్మలధ్యానమతిఁ బూని మౌని, తఱిఁగొని సకలంబుఁ దలపోసి చూచి
రఘుచరిత్రము దశరథుచరిత్రంబు, రఘురాముజన్మంబు రామువర్తనము
తాటకావధము నుద్దండరాక్షసుల, [1]యాటోపహరణంబు యజ్ఞరక్షణము
దనరు గంగామహాత్త్వంబు గౌతముని, వనితను శాపంబు వలనఁ బాపుటయు
ధనువు ద్రుంచుటయు సీతావివాహంబు, చనుచోట జమదగ్నిజాతునాగ్రహము
రామాభిషేకసంరంభంబు దుష్ట, కామిని కైకేయి కష్టభాషణము
నభిషేకవిఘ్నంబు నడవికి రాము,విభుఁడు వోవుటయు భూవిభునిశోకంబు
దశరథుమరణంబు దశరథరాముఁ, గుశలసంభాషియై గుహుఁడు గాంచుటయు
నురుపుణ్యు లట గంగ నుత్తరించుటయు, వరతపోనిధి భరద్వాజుఁ గాంచుటయు
నరిగి యాచిత్రకూటాద్రి నెక్కుటయు, భరతుండు రఘురాముపజ్జ వచ్చుటయు
నన్నచేఁ బాదుక లర్థిమైఁ బడసి, [2]మున్నన లింపార మగిడి వచ్చుటయు
దండకాగమనంబు తగిలి విరాధుఁ, జండవిక్రము నందు సంహరించుటయుఁ
బరమపుణ్యుని శరభంగుఁ గాంచుటయు, బరువడి మునులతోఁ బ్రతినలాడుటయు
చనియయ్యగస్త్యునాశ్రమముచొచ్చుటయు, మునిచేతదివ్యాస్త్రములువడయుటయు
మునిచెప్పఁగా వారు ముదమున వేగ, చని పర్ణశాలలో సరగనుండుటయు
మోహించి రాక్షసి మొనసి వచ్చుటయు, నూహించి దానితో నొగిఁబల్కుటయును
స్రుక్కక రామానుజుండు శూర్పణఖ, ముక్కును జెవులును మ్రోడుసేయుటయు
నదివోయి ఖరదూషణాదిరాక్షసుల, కది చెప్ప వారంత నలిగి వచ్చుటయు
సురవడి రఘురాముఁ డొక్కఁడే కడఁగి, ఖరదూషణాదుల ఖండించుటయును
నట రావణునిబుద్ధి నలుక పుట్టుటయుఁ, గుటిలమారీచుండు క్రొవ్వి చచ్చుటయు
నసురాధిపతి సీత నపహరించుటయు, విసువక రాముఁడు విలపించుటయును
నని జటాయువుచావు నవలఁ గబంధుఁ, గనుటయు మఱి పంపకడకుఁ బోవుటయుఁ
గరమర్థి ఋశ్యమూకమున సుగ్రీవుఁ, డరుదెంచి కనుటయు నతనిసఖ్యంబు
వాలిసుగ్రీవుల వైరంబు తెఱఁగు, చాలంగ రాముండు సప్తతాళముల
నేలఁ గూలఁగనేసి నెమ్మి మెప్పించి, వాలి నొక్కమ్మున వధియించుటయును
దారావిలాపంబు దశరథసూనుఁ, డారవిసూను రాజ్యమున నిల్పుటయు

1 యాటోప మణఁచుట. 2 మన్ననల్ చేకొని.

మానవపతి యంత మాల్యవంతమున, వానకాలం బెల్ల వసియించుటయును
గాకుత్స్థకోపంబు కపిసమాగమము, నేకతంబున ముద్ర నిచ్చి పుచ్చుటయు
నలయక కపులు సీతాన్వేషణంబు, సలుపుటయును బిలసందర్శనంబు
నాతఱంబున మహేంద్రాద్రి నెక్కుటయుఁ, బక్షీంద్రుఁడైన సంపాతిదర్శనము
వనధిలంఘనమును వనధిమధ్యమునఁ, జనుచోట మైనాకసందర్శనంబు
మదమెత్తి సింహిక మారుతసూనుఁ, గదిసి చచ్చుటయు లంకాప్రవేశంబు
లంకను నొప్పించి లలనచే నచట, లంకత్రోవయుఁ గని లంకఁ జొచ్చుటయు
నతఃపురంబున కరిగి చూచుటయు, నంత నశోక వనావలోకనముఁ
దెఱిగొప్ప నందు వైదేహిఁ గాంచుటయు, నెఱుకకు నానవాలిచ్చి దేర్చుటయుఁ
బెనచి యావనమెల్లఁ బెఱికివైచుటయు, హనుమంతుఁ డత్తఱి నక్షుఁ జంపుటయుఁ
బవనజుఁ డటఁ బట్టువడిపోవుటయును, గవిసి లంకాపురి గలయఁ గాల్చుటయు
మానినీమణి శిరోమణి యిచ్చుటయును, మానితాత్ముం డబ్ధి మరల దాఁటుటయు
మధువనహరణంబు మణిఁ బ్రీతి నిచ్చి, యధిపతి మారుతి యాశ్వసించుటయు
నినకులాధిపుఁడు దండెత్తి పోవుటయు, వనధితీరంబున వచ్చి నిల్చుటయు
వనరాశి త్రోవయియ్యక క్రొవ్వుటయును, గొనకొని రాముండు కోపించుటయును
నంత విభీషణుఁ డధిపుఁ గాంచుటయుఁ, జింతించుటయు మఱి సేతుబంధనము
జడధి దాఁటుటయును జని లంకమీఁద, విడిసి వేర్చుటయు దోర్వీర్యంబు మెఱసి
కరముగ్రు లగు కుంభకర్ణాది వీర, వరులఁ ద్రుంచుటయు రావణునిఁ జంపుటయు
నావిభీషణుని లంకాధినాయకునిఁ, గావించి పట్టంబు కరుణఁ గట్టుటయు
ననుపమశుద్ధి బ్రహ్మాదులు మెచ్చ, జనకజ రఘురామచంద్రుఁ బొందుటయు
నెలమిఁ బుష్పక మెక్కి యెల్లరు వేడ్కఁ, జెలఁగి యంభోనిధిసేతువుమీఁదఁ
దెలిసి శ్రీకంఠుఁ బ్రతిష్ఠసేయుటయు, వెలయ నయోధ్యకు వేగ వచ్చుటయు
భరతుఁ గాంచుటయును బట్టాభిషేక, మరుదుగా రఘురాముఁ డవధరించుటయుఁ
గపిసైన్యపతుల నర్కజవిభీషణుల, విపులసంపద లిచ్చి వీడుకొల్పుటయుఁ
బరికించి ప్రజల కాపదలొందకుండఁ, గరుణఁ బ్రోచుట యనుకథ లెల్లఁ దెలిసి
వెలయ నిర్వదినాల్గువేలశ్లోకములు, గలిగి యేనూఱు[1]సర్గల విస్తరిల్లి
కాండంబు లాఱింటఁ గర మొప్పు మిగిలి, యుండ రామాయణ మొప్పఁ గావించి
యొనరఁ దక్కిన కథ లుత్తరకాండ, మునఁ జెప్పి వాల్మీకిమునినాథుఁ డంత
ఈకథ పఠియింప నెవ్వరు నేర్తు, రీకథ జగముల నెబ్భంగి వెలయు
ననుచుండ కుశలవు లనఘమానసులు, మనసిజాకారులు మంజుభాషణులు
జననుతుల్ సంగీతసాహిత్యపరులు, మునివేషధారు లిమ్ముల వచ్చి మ్రొక్క
యనఘ రామాయణం బర్థితోఁ జదువఁ, జను దెంచితిమి మమ్ము[2]చదివింపవలయు
ననిన సంతోషించి యమ్మునీశ్వరుఁడు, తన మనోరథ మెల్లఁ దలకూడె ననుచు
గేయమై పాఠ్యమై కేవల పుణ్య, దాయకం బగు రఘూత్తమచరిత్రంబు

1 సర్గముల వర్తిల్లి. 2 చదువనీవలయు.

వనుపమతంత్రీలయాన్వితభణితి, మునిపతి చదివింప ముద మొప్పఁ జదివి
రమణ శృంగారాది రసము లేర్పడఁగ, సమవృత్తభేదముల్ సంధి సమాస
సమధికశబ్దార్థసంగతు లెఱిఁగి, క్రమ మొప్పఁ బాడుచుఁ గవగూడి వారు
మునిజనసభల నిమ్ములఁ బూజనములు, గొని వినోదింపఁ గాకుత్స్థవల్లభుఁడు
వెలయఁ దమ్ములు దాను వేడ్క లింపొంద, గొలువిచ్చి వారలఁ గోరి రావించి
వారిరూపంబులు [illegible], వారినిర్మలతరవాగ్విశేషములు
తనకు నింపొసరింపఁ దత్కథాక్రమము, వినుచుండె రాముఁ డవ్విధ మెట్టి దనిన
ద్వాదశయోజనాత్యాయతం బగుచు, నైదుయోజనముల నడి వెడల్పగుచు
నిపుణత మయునిచే నిర్మితంబగుచు, నెపుడు శాత్రవకోటి కెదురుచు క్కగుచు
కొలఁదిమీఱిన భానుకులజులకెల్లఁ, గులరాజధానియై కొనియాడఁ బరఁగి
సరయుప్రాంత కోసలదేశమునను, ధరణికిఁ దొడవయోధ్యాపురం బొప్పు
మణిగోపురంబుల మణితోరణముల, మణికుట్టిమంబుల మణిగవాక్షములఁ
గేళికాగృహములఁ గృతకశైలముల, బాలానిలంబులఁ బటహానాదముల
మహితవారణముల మానితాశ్వముల, బహురథప్రతతుల భటకదంబముల
విమలసౌధంబుల విపణిమార్గములఁ, గమనీయవనములఁ గమలాకరములఁ
జెలువుల బావులఁ జెఱకుఁదోఁటలను, దఱుచైన శాలికేదారవారములఁ
బరిఘలఁ గోటలఁ బసిడిమాడువులఁ, గర మొప్ప లోకవిఖ్యాతమై పరఁగు
నాపురి దశరథుం డనుమహారాజు, చాపవిద్యావరజాలకార్ముకుఁడు
చతురుపాయజ్ఞుండు షాడ్గుణ్యశాలి, సతతశక్తిత్రయసంధానకర్త
ధర్మోత్తరుఁడు కృతాధ్వరుఁడు శ్రీకరుఁడు, ధర్మశాస్త్రపురాణతాత్పర్యపరుఁడు
అజునినందనుఁడు బాల్యాదిగా నియతిఁ, బ్రజలఁ బాలించిన పరమపావనుఁడు
జంభారికై పోయి శంబరాసురుని, దంభం బణంచి సుత్రామునిచేత
మందారపుష్పదామములు గైకొన్న, యిందుమతీపుత్త్రుఁ డినకులాధిపుఁడు
తేజంబు కాంతియుఁ దెగువయు నేర్పు, రాజసంబును నుదారతయు ధైర్యంబు
మొదలైనసద్గుణంబులప్రోది యగుచు, నుదయార్కుగతిఁ దనయుగ్రతేజంబు
దీపితంబై యేడుదీవులఁ బర్వ, భూపాలతిలకమై పొలుపొంద నేలు
నన్నరనాథుకులాంగనామణులు, మున్నూటయేఁబండ్రు ముఖ్యలై యందు
నచలితసౌశీల్య యైనకౌసల్య, కుచకుంభనిర్జితకోక యాకైక
యనఘచరిత్ర యా నాసుమిత్రయును, వినుతి కెక్కిరి త్రయీవిద్యలో యనఁగ
నిలమీఁద నతనికి హితపురోహితులు, పొలుచువసిష్ఠాదిపుణ్యసంఘములు [జేయు
అనఘాత్మకుఁడు దృష్టియనువాఁడు విజయుఁ, డనువాఁడు సిద్ధార్థుఁ డనువాఁడు మ
నర్థసాధకుఁడు జయంతుఁడు నీతి, తీర్థుఁ డశోకుండు ధీమంతుఁడైన
మంత్రపాలకుఁడు సుమంత్రుండు ననఁగ, మంత్రులు గల రెనమండ్రు నాతనికి
ఆమంత్రులందఱు నన్యోన్యహితులు, స్వామికార్యవిచారచతురమానసులు
పరమర్మభేదనోపాయధౌరేయు, లరసి ప్రజాగుప్తి యాచరింపుదురు

అట్టివా రెనమంత్రు లఖిలకార్యములఁ, బట్టునదిద్దఁ దీర్పనుఁ జాలి కొలువ
నష్టాక్షరముల బాహాష్టకంబులను, స్పష్టమై వెలయు నారాయణుకరణి
దశరథుం డలరె నాతనిదేశమునను, గృశుఁడు కొండీఁడు రోగియు దరిద్రుండు
జారుండు మఱి యనాచారుండు పుణ్య,దూరుండు క్రూరుండు తుచ్ఛుండు జడుఁడు
మండుండు మఱి లేరు మందునకైన, నందఱు మణికుండలాద్యలంకృతులు
నందఱు ధర్మపరాయణచిత్తు, లందఱు విహితకులాచారరతులు
అందఱు సకలశాస్త్రాబ్ధిపారగులు, నందఱు శ్రీవిష్ణు నతిభక్తి పరులు
ఈచందమున రాజ్య మేపు దీపింప, భూచక్ర మెల్ల నేర్పున నేలి యేలి
ప్రకటరాజ్యాంగసంపదఁ దేలితేలి, యొకనాఁడు దశరథుం డుల్లంబులోనఁ

దశరథుఁడు మంత్రులతో పుత్త్రకామేష్టిసేయ నాలోచించుట

దనకు సంతతిలేమిఁ దలపోసి వగచి, తనకు నాయువు వేగ తఁగఁబోయె ననుచు
మనమునఁ గుందుచు మఱియు నాతండు, తన మంత్రివరుల నందఱను రప్పించి
ఘనముగఁ గొలువిచ్చి ఘనతఁ గూర్చుండి, తనమంత్రివరుల నందఱఁ జూచి పలికెఁ
బెక్కుదానంబులు పెక్కుధర్మములుఁ, బెక్కుయాగంబులు పెక్కువఁ జేసి
పెక్కేండ్లు మంటి శోభితకీర్తిఁ గంటి, మక్కువ మీవంటి మంత్రులు గలుగఁ
గొదువ లే దేమిటఁ గొడుకులు లేని, కొదువ యొక్కటి గాని కులముద్ధరించు
కొడుకులు లేకున్నఁ గోరి పుణ్యములు, వడయ రుత్తమలోకపదవు లెవ్వరును
గానఁ బుత్త్రులఁ గానఁగా నాకు వలయుఁ, గాన నే నింక లోకములెల్ల మెచ్చఁ
దలకొని యశ్వమేధము సేసి పిదప, నెలమితోఁ బుత్త్రకామేష్టి వేల్చెదను
ఈయాగములచేత హితము రంజిల్లఁ, బాయక పుత్త్రులఁ బడసెద నేను
నని చెప్ప వారలు నతి సంభ్రమమున, మనమున సంతోషమగ్నులై యున్న
నామంత్రివర్యుల నందఱఁ జూచి, తా మది నూహించి తగవొప్పఁ బలికె
ననుపమంబుగ నేను నశ్వమేధంబు, వినయంబునం జేసి విబుధులు మెచ్చఁ
బుత్త్రుల కొఱకునై పుత్త్రకామేష్టి, నేత్రోత్సవంబుగ నేఁ జేయువాఁడ
నని తగు పనులకు నందఱఁ బనుప, ననఘులు మఱి వసిష్ఠాదులు వచ్చి
నిలిచిన మ్రొక్కుచు నెలమిఁ దోడ్తెచ్చి, పలికెను వారితోఁ బార్థివోత్తముఁడు
అనఘ వసిష్ఠసంయములార యిప్పుడు, ఘనమైన హయమేధకంబు నాచేతఁ
జేయించి పుత్త్రైకసిద్ధి నొందుటకుఁ, జేయింపుఁడీ దానిఁ జెచ్చెర నన్న
నలవడ నీచేయు హయమేధమఖము, నెలకొని యేమింక నిర్వహించెదము
మది నెన్న శక్యమే మఖరాజమహిమ, మిదిగాక పుత్త్రకామేష్టియుఁ జేయఁ
దనయులఁ గాంచెదు ధన్యమానసుల, ననవుడు హర్షించి యవనినాయకుఁడు
అందఱఁ బనిచి శుద్ధాంతంబు సొచ్చి, సుందరీమణుల కా శుభవార్తఁ జెప్పి
యనురక్తి నేకాంతమై యున్నవేళ, ననఘుండు సూతుఁ డిట్లనియె భూపతికి
ధరణీశ మీకు సంతానసంప్రాప్తి, వెరవైనకథ మున్ను విన్నాఁడ నేను
భూమీశ విను మంగభూమీశుకొడుకు, రోమపాదుఁడు గుణారూఢుండు దొల్లి

యేమి పాపముననో యెఱుంగఁ జొప్పడక, యీమహిలో వర్షమటు సున్నవయ్యె
దా నేలి పాలించు ధరణిపై నెందు, వానలు లేకున్న వగలను జెంది
వరమునీంద్రులచేత వర్షహోమములు, పరువడి సేయించి ఫలము రాకున్న
భూతలశోకంబునఁ బొగులుచు నున్న, యారాజుఁ గనుఁగొని య[illegible]ను లనిరి
యోమహీపాలక యోరాజచంద్ర, యీమహిపై వాన లిటఁ బుట్టుటకును
నొకయుపాయమ్ము మే మొగిఁ జెప్పవార, మకళంక[illegible] ననుపొందఁ జేయు
పరహితోన్నతుఁడు విభాండకసుతుఁడు, చిరపుణ్యనిధి ఋశ్యశృంగుఁ డన్వాఁడు
నగధైర్య పుట్టిననాఁట నుండియును, నగరరాష్ట్రంబు లన్నఁడు నెఱుంగమిని
నతఁ డెందు నాఁడువారనుపేరు నెఱుఁగఁ, డతఁడు తాపసవృత్తి నడవులనుండు
వసుధేశ యతఁ డిందు వచ్చినఁ జాలు, వెసఁ బాయు నీయనావృష్టిదోషంబు
నావుడు మునినాథు నగరి కేరీతి, రావింతు నని విచారము చేసి తెలిసి
అతఁడు వచ్చుటకును నాత్మఁ జింతించి, మతిమంతు లగునట్టి మంత్రులఁ బిలిచి
మునులను రప్పించి ముదమొప్ప నడుగ, మునులును మంత్రులు మునముతోఁ జెప్ప
మనమున సంతోషమహిమ శోభిల్ల, మునులమాటలు విని మోదంబు మీఱ
నుండెను భూకాంతుఁ డొగి మాను లనిరి, దండిగ నోరాజ తలపోసి యిపుడు
వారకాంతల నెల్ల వసుధేశ పంపు, వారకాంతలచేత వనముల కిపుడు
దండిగా భక్ష్యముల్ దగవారి కిచ్చి, మెండుగ వనముల మేటి వస్తువులు
పెట్టి పంపుము నీవు పెంపుతో ననుచు, గట్టిగాఁ గాంతలు కడుఁ [illegible]సతులు
తిన్నగ నటు పోయి తెఱఁగొప్పఁ గాంచి, మన్ననచే మౌనిమహిమ వీక్షించి
తియ్యని భక్ష్యముల్ తెఱఁగొప్ప నిచ్చి, నెయ్యంబుచే మది నెఱిఁ గరఁగించి
యాటలఁ బాటలఁ దేటమాటలను, బాటలగంధులు పదిలులై నిలిచి
మనసెల్లఁ గరఁగించి మఱి వెంటనంటి, మనసిజాకారలు మఱి మాయ వన్ని
యచ్చుగ నిటు రాఁగ నతఁడు వెం దగిలి, వచ్చు నిచ్చోటికిని వసుధేశ వినుము
అని చెప్పి మునివర్యు లటుఁ జనిరంత, ఘనముగా నారాజు కరుణ నారాత్రి
మన మలరఁగ నుండి మఱునాఁడు లేచి, మునులను దలఁచుచు ముదమొప్ప నంత
ననురక్తిఁ గడుఁ బ్రౌఢ లగు వారసతుల, వినుతయౌవనరూపవిభ్రమవతుల
మనసిజమోహనమంత్రదేవతలఁ, బనిచె నొప్పెడువారిఁ బాటించి యతఁడు
అతివ లమ్ముని యున్నయడవికిఁ బోయి, యతనియాశ్రమభూమి కల్లనఁ జేరి
చతురనర్తనకళాసంగీతగతుల, నతనికిఁ దమయొప్పు లర్థిఁ జూపుటయు
నాపుణ్యనిధి వారి నాఁడువా రగుట, రూపింప నేరక రుచులఁ జేపడక
యలసయానముల నీయడవిలో నొప్పు, మెలఁగెడు నివి వింతమృగములోఁ గాక
యనుచుండ నొక్కనాఁ డతివలు ప్రీతిఁ, దనుఁ జేరవచ్చినఁ దప్పక చూచి
చన్నులవే రడ్డి చన్నులమీఁద, నున్నహారములకు నుపదేశ మడిగి
మాకుఁ గొమ్మొక్కటి మస్తకమ్మునను, మీకుఁ గొమ్ములు రెండు మెఱసెఱొమ్మునను
నేవృక్షములఁ గల్గె నివి యపూర్వములు, మీవల్కలము లతిమృదులంబు లరయ

మాజటాబంధంబుమాన్పి విగాఁపు, మీజటాబంధము మెఱుఁగులఁ బొదలె
మేనిబూడిదెపూఁత మేల్తావిగొట్టు, వీనులవిందు లీవేదనాదములు
కని విని యెఱుఁగ మిక్కాననభూమిఁ, మునులకు నీవేషములు గలవొక్కొ
ఎక్కడి ముని లన్న నింతు లాఘనుఁడు, చిక్కట భావించి చెలఁగి నవ్వుచును
నానుపూర్విగ శ్రుతిహారియా సామ, గానంబు పాడి చక్కఁగఁ బదక్రమము
శుద్ధమార్గంబునఁ జూపంగ నేర్తు, మిద్ధర మాచర్య లెఱుఁగ మీతరమె
యని నేర్పుమాటల నమ్మునిస్వామిఁ, గనుఁబ్రామి మఱియు నక్కన్య కాముకులు
ఎవ్వరితనయుఁడ వెవ్వఁడ వేల, యివ్వనంబున నుండు టెఱిఁగింపు మనుడు
అమలకీర్తులఁ బుణ్యుఁ డగువిభాండకుని, కొమరుండ ఋశ్యశృంగుండు నాపేరు
విపులతపోనిష్ఠ వెలయ నీయడవిఁ, దపము సేయుటకునై తగిలి వర్తింతు
భాగీరథీస్నానపరత మాతండ్రి, యోగిపుంగవులతో నొగి నేగినాఁడు
ఒండు దేశంబుల నొందక యిచట, దండిమైఁ దపములు తగనొప్పఁ జేసి
కదలక యున్నాఁడు ఘనత మాతండ్రి, సదమలచిత్తుఁడై సద్భక్తి నిపుడు
వినుఁడు మీ రిచటికి విచ్చేయుకతన, ననఘుండ నైతిఁ గృతార్థుండ నైతి
మాతండ్రికృపచేత మఱియు నిచ్చటను, నాతతంబుగఁ దప మనువొంద నెపుడు
చేసి యిచ్చట నుండుఁ జింతఁ బోనాడి, వాసిగా వనముల వరుస మిమ్ములను
గనినయప్పుడు నాకుఁ గడుఁజోద్యమయ్యె, ననువొందఁ బోదమా యాశ్రమమునకు
నని మునులను వారి నాశ్రమంబునకుఁ, గొనిపోయి ఋశ్యశృంగుండు పూజించె
నెలనాఁగ లమ్ముని యిచ్చినపూజ, యలరుచుఁ గైకొని యతని వీక్షించి
మునివర మావనంబునఁ దెచ్చినార, మనుపమఫలరాజి యనుచు లడ్వములు
అతిరసంబుల మనోహరము లైనట్టి, యతిరసంబులు వడి లలరు మండిగలు
సారసరసముల చవు లుగ్గడించి, పేరువెట్టఁగరాని పెక్కు భక్ష్యములు
నిచ్చిన నములుచు నెడనెడఁ జవుల, మెచ్చుచుఁ దనిసి యామెలఁతలఁ జూచి
గ్రుక్కిళ్లుమ్రింగుచుఁ గొసరి యడుగుచును, జొక్కుచు నందంద సొరదిఁ జేచాచి
ము న్నిట్టిఫలముల మునివరులార, యెన్నఁ డే నెఱుఁగ న దేవనంబులను
మీతపం బె తపంబు మీతపోవనమె, యీతపోవనముల కెక్కుడు ధరణి
నని పల్క నయ్యింతు లల్లన నగుచు, ననువారఁ దనులత లట సోఁకఁ గదిసి
తావియూర్పులచేతఁ దాలిమి దూలి, పావ నొయ్యన ముఖాంబురుహంబు లొత్తి
పలుకులఁ దళుకులఁ బాటతేటలను, బిలుపుల సొలపుల బేలించి యతని
హృదయంబుఁ గరఁగంగ నిరుచన్నుఁగవలు, గదియించి బిగియారఁ గౌఁగిళ్ల మరపి
యనఘ పోయెద మిదె యాశ్రమంబునకు, నని విభాండకు దెస నడరినభీతి
నరిగి చేరువ నుండి రావనంబునకు, నరవిందలోచన లరిగినపిదప
వా రింక నెన్నఁడు వత్తురో యనుచు, నాఋశ్యశృంగుండు నట నిద్ర లేక
యారాత్రి వేగించి యష్టమినాఁడు, ఆరమణులఁ గన్న యచటి కేతేర

## ఋశ్యశృంగుండు వారాంగనలఁ దగిలి రోమపాదునియింటికి వచ్చుట

నందియు క్షైతయంగ నసదుఁగొందీఁగె, లందంద వడక రాయంచలనడల
మగువలు వచ్చి యామునిఁజిత్తాత్ముఁ గాంచి, నగు మొగంబులతోడ నలుఁదట్లఁజేరి
మునివర మావనంబునకు రావలయు, నని పల్క రంకకు ననుమతించుటయుఁ
గని చాల వెలఁదులు ఘనమునిఁ జూచి, మనసులు గరఁగంగ మఱిమఱి పలికి
తమయుపాయంబులఁ దమవిలాసములఁ, దమకంబు పుట్టించి తరలాక్షులంత
విస్తారపథ మని వెఱచి పోవమికి, హస్తపల్లవముల నాందోళికగను
నొనరెడుదీమంబు లోక వింతమృగముఁ, గొనివచ్చు తెఱఁగున గొనివచ్చి రతని
నతఁడు వచ్చుటయు నయ్యంగరాజ్యమున, నతులవర్షములు సస్యము లొప్పె నంత
సకలసౌభాగ్యముల్ సలలితంబుగను, నకలంకమతితోడ నానృపుఁ డుండి
యామౌనిఁ గనుఁగొని యతిభక్తియుక్తి, నేమంబుతోఁ బూజ నెమ్మిఁగావించి
యనఘుండు దనకూఁతు నారాజు శాంత, యనుదాని నిచ్చిన నారాజునింట
నతఁ డుండ దశరథుం డమ్మునిఁ దెచ్చి, హితమతిఁ బుత్త్రకామేష్టినాఁ బరఁగు
క్రతు వమ్మునీంద్రుచేఁ గావించెనేని, సుతుల నల్వుర బహుశ్రుతుల సున్నతుల
నాతతోన్నతిఁ గాంచు నని చెప్పెఁ దెలియ, నాతోడఁ దొల్లి సనత్కుమారుండు
అటుగాన నీవింక నాఋశ్యశృంగుఁ, బటుభక్తి యుక్తిమైఁ బ్రార్థించి తెమ్ము
అని చెప్పి యాసూతుఁ డరిగిన పిదప, మనమున సంతోషమమితలు సెలఁగ
ననువరి దశరథుం డారోమపాద, జననాథుపీటికిఁ జని ఋశ్యశృంగు
మునిపతిఁ గని మ్రొక్కి ముదముతో ననియె, వినవయ్య మునిచంద్ర విమలమానసుఁ
యనువందఁ బుత్త్రుల నడుగుట కేను, మనమునఁ దలపోసి మమత నీకడకుఁ
గొనక్రొని వచ్చితిఁ గొనుము నీ వనుచు, మనమునఁ గృప పుట్ట మఱి నుతిసేసి
క్రతువున కాచార్యుఁగా వరియించి, యతులిత చతురంతయానాథుఁ జేసి
వచ్చుచో దూతలవలను వీక్షించి, పుచ్చి ముందర వారిఁ బురమును నగరు
వాసవుపురితోడ వైభవం బొప్పఁ, గై సేయవలయును గడువేగ మీరు
అని పల్క వారును నరిగి పౌరులకు, వినిపింపఁ జేసిరి వివిధశిల్పములు
దుందుభిశంఖాది తుములనాదముల, నందంద మ్రోయించి రంత భూపతియుఁ
బురమున కేతేరఁ బురజనుల్ సేయు, పరమమంగళతతుల్ పరఁగఁ గైకొనుచు
నతనివిరోధ్యసాధ్యకు నయోధ్యకును, జతురుఁడై తోడ్తెచ్చి శాంతతోఁగూడ
నీరీతి నాఋశ్యశృంగుని దెచ్చి, భూరమణుం డంతిపురమున నునిచి
వితతార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి, యతికృతార్థుఁడనైతి నని సంతసించె
నాసమయంబున నారాజసతులు, కౌసల్య మొదలుగాఁ గలవారు వేడ్క
నలువొంద తేనియానతిఁ బూని చాల, నలరి సంతసమున నాశాంత కపుడు
మహితభూషణవస్త్రమాల్యాదు లిచ్చి, బహువిధంబుల వారిఁ బ్రార్థించి రంతఁ
గొంత కాలమునకుఁ గువలయజనులు, సంతోష మెసఁగ ననంత మేతేర
నడరెడు వేడుక నాఋశ్యశృంగు, కడకు భూపతి వచ్చి కడుభక్తి మ్రొక్కి

సన్నుతస్థితి నన్ను సంయమిప్రవర, చెన్నొంద జన్నంబు సేయింప వలయు
నని విన్నవించిన నౌఁగాక యనుచు, నినకులోత్తముఁ జూచి యిట్లని పలికె
వేగంబె తెప్పింపు విహితంబు లైన, యాగసంభారంబు లన్నియు నధిప
యనవుడుఁ దగువారి నయ్యై తెఱంగు, లొనరింపుఁ డనుచు నియోగింపఁ బనిచి
యఖిలసంభారంబు లర్థిఁ దెప్పించి, ముఖము చూచుటకు సుమంతునిఁ బంపి
కేకయస్థానాథుఁ గీర్తిసనాథు, నా కాశిరాజు నవ్యాహతతేజు
జనకాంగ రాజాది జననాథవరుల, ననఘచరిత్రుల నర్థి రప్పించి
మనుజనాయకుఁడు సుమంతుతో ననియె, ననఘుల వేదవేదాంగపారగుల
గృహమేధు లగువారి గృతతంత్రభావ్య, మహితార్థనిశ్చయమతుల భూసురులఁ
బరఁగు సుయజ్ఞు జాబాలిఁ గశ్యపుని, సురుచిరాత్ముని వసిష్ఠుని వామదేవు
రయమునఁ దోడ్కొని రమ్ము నీ వనినఁ, బ్రియమున నాతండు వెంపార నరిగి
యురుభక్తి నందఱ నొగిఁ దోడితేరఁ, బెరువడిఁ దా నర్ఘ్యపాద్యాదు లిచ్చి
నిర్మలవ్రతనిత్యనిష్ఠార్థ మైన, ధర్మార్థయుతముగాఁ దగుమాటఁ బలికె
మునులార కొడుకులు మును నాకు లేమి, మనమునఁ దలపోసి మమత రెట్టించి
మిత్రసూక్తుల నశ్వమేధయాగంబు, పుత్త్రులకొఱకు నై పుత్త్రకామేష్టి
సేయంగ నీ ఋశ్యశృంగుఁ దోడ్తెచ్చి, మీయనుగ్రహము గామించియున్నాఁడ
ననవుడు నావసిష్ఠాదిసంయములు, జననాథుమాటకు సంతోషమంద
యినకులోత్తమ లోకహిత మాచరింపఁ, దనయులఁ గోరు నీతలఁపొప్పు నింక
నశ్వంబు విడువు మీయశ్వమేధమున, విశ్వరక్షకులైన విక్రమోజ్జ్వలులు
నలువురుకొడుకులు నరనాథ నీకుఁ, గలిగెద రని పల్కఁ గడు సంతసిల్లి
సవనయోగ్యం బైన జవనాశ్వ మరసి, భువనపావనమూర్తి పూజించి నొసటఁ
బ్రకటిత బిరుదాంకపట్టిక గట్టి, యొకయేఁడు దనయిచ్ఛ నుర్విఁ జరింప
సమకట్టి విడిచె నశ్వంబు రక్షింప, విమతోగ్రులగు సైన్యవిభులతోఁ గూడ
నంత వసిష్ఠాదు లనుమతిసేయ, వింతగా శిల్పకోవిదుల రావించి
సరయువునుత్తరస్థలి యాగశాల, విరచింపఁగాఁ బంచె వేదోక్తసరణి
మఱియు నానాదేశ మనుజవల్లభుల, వఱలువిప్రనృపాలవైశ్యశూద్రులను
రప్పించె నంత వర్షము పూర్ణమైన, నెప్పటి మధుమాస మేతేర నృపుఁడు
చిరతపోనిధి ఋశ్యశృంగుసమ్మతియు, గురుని యానతియుఁ గైకొని మంచివేళ
స్పృహను శాంతాఋశ్యశృంగులతోడ, నిహితసంభారవర్ణితహోమకుండ
సహితమై యేకవింశతిరమ్యయూప, మహితమై శ్రౌతధర్మక్రియాచార
విహితమై మాయాప్రవీణదైతేయ, రహితమై సకలాఘరహితమై యొప్పు

దశరథుఁడు యాగదీక్షవహించుట

యాగవాటము చొచ్చి హాయము వచ్చుటయు, యాగదీక్షవహించి యతిశుద్ధినొంది
మునుల వసిష్ఠాదిమునిజనోత్తముల, ఘనుల ఋత్విక్కులఁగా వరియింప
సవనత్రయం బభీష్టమున నొనర్చి, ప్రవిమల యూపాగ్రబద్ధంబు లైన

జలచరంబు లరణ్యచరములు విహగ,ములు సురగంబులు మొదలుగానొప్పు
పశువుల మున్నూటిఁ బ్రథితాశ్వ మొకటి, విశసించి క్రతుకర్మవేదులు ప్రీతి
నేమంత్రములతోడ నేపలలములు, గామించి వేలుపఁగాఁ జెప్పు శ్రుతులు
నామంత్రములతోడ నాపలలములు, కామించి వేల్చిరి కడఁగి ఋత్విజులు
అనలుండు సప్తజిహ్వలఁ బ్రజ్వరిల్లె, ననిమిషుల్ దనిసి గాహావిధాదికముల
నాయాగదినముల నాఁకొన్నవాఁడు, నాయాసపడినవాఁ డరసిన లేఁడు
సారమృష్టాన్నవస్త్రపటీరకనక, హీరభూషాదిసంతృప్తులే కాని
యేక్రియలందును నెడపడకుండ, నీక్రియ హయమేధ మీడేరుటయును
వెనుక జ్యోతిష్టోమవిశ్వజిదాది, ఘనయాగతతులు సాంగముమీఱఁ జేసి
అధ్వరదక్షిణకై పూర్వదేశ, మధ్వర్యునకును బ్రహ్మకు దక్షిణంబు
పానరంగఁ బశ్చిమభూమి హోతకును, దనర నుత్తరము నుద్గాతకు నిచ్చె
నిల నయోధ్యయుఁ దక్క నెల్లదేశముల, నలరి యిచ్చిన ముదమంది ఋత్విజులు
ఎప్పు డేలుదుము నీ విచ్చినదేశ, మెప్పు డనుష్ఠాన మేము సల్పుదుము
ఏమేడ దేశంబు లేలుట లేడ, భూమికి వెలయిమ్ము భూమీశ మాకు
ననవుడుఁ బదికోటు లగు సువర్ణములు, కనకంబు నలుమడి కలధౌతచయము
గోరంగ నొకలక్షగోవుల నిచ్చె, నాఋశ్యశృంగాదు లైనఋత్విజులు
అవి పంచుకొని ముద మందిరి ప్రీతిఁ, బ్రవిమలాధ్వరకర్మపరిచారకులకు
నరనాయకుఁడు సువర్ణములు కోటియును, వరభూషణంబులు వలయువారలకుఁ
గామితార్థంబులు కామించువారి, కేమి వారిచ్చిన నింపార నిచ్చి
పరఁగ భూసురులకు భక్తితో మ్రొక్కి, వరుస వారిచ్చు దీవనలు గైకొనుచుఁ
బ్రకటదివ్యాంబరాభరణాదు లొసఁగి, యకలంకచిత్తుఁడై యవభృథంబాడి
శ్రీమహితుఁడు ఋశ్యశృంగుచేఁ బుత్ర, కామేష్టిఁ జేయింపఁగా నేఁగుదెంచి
క్రమమొప్ప యాగభాగములు గైకొన్న, యమరు లారావణు నాత్మలోఁ దలఁ
బ్రహ్మఁ గనుంగొని ప్రణమిల్లి నిలిచి, బ్రహ్మ నీవరశక్తిఁ బంక్తికంధరుఁడు
ప్రవిమలాచార్యుల బ్రహ్మర్షివరుల, దివిజుల మునుల బాధించుచున్నాఁడు
దారుణవరశక్తి దలఁప మాచేత, వారిజాసన వాఁడు వారింపఁబడఁడు
సురగణంబులతోడ సుత్రాముఁ బట్టి, పరిభవించుచు నేఁచు బాహుదర్పమున
గంధర్వయక్షాదిగణముల మునుల, బంధించు సాధులఁ బట్టి బాధించు
వాఁడన్నఁ గులగిరుల్ వడవడ వడఁకు, వేఁడిమి చూపఁగ వెఱచు భాస్కరుఁడు
వీఁకతో నతఁ డున్నవీట నెన్నఁడును, దేకువచెడి గాలి దిరుగంగ వెఱచు
నన్నిశాచరుఁగన్న నాటోప మెసఁగ, మున్నీరు కడలొత్తి మ్రోయంగ వెఱచు
నేపునఁ గన్నప్పు డెల్ల మమ్మేఁచు, పాపాత్ముఁ డగునట్టిపంక్తికంధరుని
నంతంబు నొందించు నాయుపాయంబు, చింతింపవలయు నీచిత్తంబులోన
ననవుడు నాతెఱం గంతరంగమునఁ, గని బ్రహ్మయును దేవగణము వీక్షించి
యమరులచేఁ జావఁ డసురులచేత, సమయఁడు గంధర్వసమితిచేఁ జెడఁడు

రజనీచరులచేతఁ ద్రాగఁ డెన్నఁడును, భుజగసంఘములచేఁ బొలియఁ డెన్నఁడును
యక్షులచే నీల్గఁ డాలంబులోనఁ, బక్షియూథంబుచేఁ బడఁడు వానికిని
వరమిచ్చునప్పుడు వాంఛింపఁడయ్యె, నరులఁ గావున వాఁడు నరులచేఁ జచ్చు
విశదంబుగా నింక వినుఁడు హిరణ్య,కశిపుఁడు లోకముల్ గారించునాఁడు
నరసింహరూపంబు నారాయణుండు, ధరియించి వాని విదారించినాఁడు
వాఁడె వీఁడై విశ్రవసునకుఁ బుట్టి,నాఁడు గావున నేఁడు నారాయణుండు
వీని నిర్జించు నవ్విష్ణుని నభయ,దానంబు మన మింకఁ దగ వేఁడవలయు
నని దేవతలతోడ నాబ్రహ్మ పలుక, ననువొంద నందఱు నప్పుడే కదలి
యమృతాబ్ధికడ కేఁగి యచ్యుతుఁ గాంచి, విమలచిత్తులు నయి విబుధులు వేడఁ
గరములు ముకుళించి కడుభక్తి మ్రొక్కి, యరుదుగ సుర లప్పు డావిష్ణుఁ గాంచి
సన్నుతించిరి మది సంతోష మెసఁగఁ, గనకాక్షశిక్ష లోకత్రయాధ్యక్ష
వనజాలయావక్ష వసుమతీరక్ష, వనజాక్ష మాకు నెవ్వరు లేరు దిక్కు
నీవొక్కఁడవు దక్క నిక్క మీమాట, గోవింద పరిపూర్ణగుణ చిదానంద
దేవ జగన్మయ దేవాదిదేవ, దేవనిస్తారక దివ్యావతార
శుభమూర్తి శరణంబుఁ జొచ్చిన మాకు, నభయమిచ్చితిగాదె యమృతాబ్ధిఁ దొల్లి
తలపోయ దానవదళన నీబాహు, బలవిక్రమంబులఁ బరఁగు లోకములు
భక్తవత్సల నిన్నుఁ బరికింపఁ దరమె, భక్తియోగముదక్క బయలుమాటలను
మధుసూదనుఁడ నిన్ను మదిలోన నమ్ము, నధికపుణ్యులకెందు నాపదల్గలవె
జగదుద్భవస్థితిసంహారగతులు, దగ వినోదంబులై తనరు నీమాయ
ఆధారభూతమై యఖిలలోకములు, మాధవ దాల్చు నీమహనీయతనువు
అహిరాజతల్ప నీయలరువైభవము, మహిమఁ జూడఁగ నవాఙ్మనసగోచరము
శరణాగతత్రాణ శరణు లోకేశ, శరణార్థు లగుమమ్ముఁ జనుఁ గావ నీకుఁ
గావునఁ ద్రైలోక్యకంటకుం డైన, రావణుఁ బొలియించి రక్షింపు మమ్ము
మా శోకకార్యంబు మసలక చేసి, లోకకీర్తులఁ బొందు లోకైకవినుత
నిర్మలచిత్తుండు నిశ్చలవ్రతుఁడు, ధర్మశీలుండు నుత్తమగుణాన్వితుఁడు
నగుచున్న దశరథుఁ డశ్వమేధంబు, తగఁ జేసి మది శుచిత్వమున నున్నాఁడు
కాకుత్స్థవంశునికాంతలఁ దలఁప, నేకాంతలను వారి కెనసేయరాదు
పరమూర్తు లొప్పంగ నాలుగంశముల, సరసిజోదర నీవు జనియింపవలయు
నరశక్తి సురల కవధ్యుఁడై లోక,పరితాపకరుఁ డైన పంక్తికంధరుని
మునుల గంధర్వకింపురుషుల సురలఁ, బనివడఁ జంపినపాపాత్ముఁ జంపి
సవనము ల్సేయింపు సంయమివరుల, భువనము రక్షింపు పుండరీకాక్ష
యని విన్నపము సేయునమరులఁ జూచి, వనదగర్జితగతి వనజాక్షుఁ డనియె
సురలార మీరింక సుఖమున నుండుఁ, డరిగి మర్త్యమున నే నవతారమంది
యాదట బంధుమిత్రామాత్యపౌత్ర, సోదరయుతు దశాస్యుని గీటడంచి
నిండార నేలెద నియతితోఁ బదునొ,కొండువేలేఁడు లీకుంభినీతలము

సజానిరాజంబున నవనీతలమున, రజనీచరేంద్రుండు రాజిల్లఁ గలిగె
ననుచు వరంబిచ్చి యజుని వీడ్కొలిపి, యనిమిషులను బంపి యసురారి చనియె

## దశరథునకు యజ్ఞపురుషుఁడు దివ్యపాయస మిచ్చుట

అప్పుడు విమలహోమాగ్నిలోనుండి, యొప్పెడుపుణ్యాత్ముఁ డొకదివ్యమూర్తి
హరినీలనీలాంగుఁ డరుణాంబరుండు, తరుణార్కతేజుఁ డుదగ్రవిక్రముఁడు
పరఁగఁ బాయసముతోఁ బసిడిపాత్రంబు, కరమున ధరియించి గ్రక్కున వెడలి
తనుఁ జూచి యద్భుతాదరమున లేచి, వినయాఢ్యుఁడై యున్న విభుని వీక్షించి
భూనాథ విను యజ్ఞపురుషుండ సుతుల, నే నీకు నీఁగోరి యేతెంచినాఁడ
నాదట నీపాయసాన్నంబు పుచ్చి, నీదేవులకుఁ బెట్టు నిష్ఠతో ననిన
ననురాగమునుబొంది యవనీశుఁ డతని, ననువొందఁ బూజించి యాపాయసంబు
తానందుకొనియె సుధాకలశంబు, చేనందుకొన్న శచీపతిమాడ్కి
నంతఁ బ్రాజాపత్యుఁ డటు మాయమైన, నంతఃపురంబున కరిగి భూవిభుఁడు
రమణు లెదుర్కొని ప్రమదాబ్ధిఁ దేల, నమరనిర్మితమైన యాపాయసంబు
సగము కౌసల్యకు సగములోఁ బుచ్చి, సగము సుమిత్రకా సగములో సగము
కైకకు నిచ్చి యుత్కంఠ నాసగము, ప్రాకటంబుగ సుమిత్రకు నిచ్చె మఱియు
నప్పాయసాన్నంబు లర్థి భుజించి, యప్పుడు గర్భిణు లైరి వా రెలమి
తగిలి వారలఁ జూచి దశరథేశ్వరుఁడు, మిగుల నానందించి మెఱసెఁ జూపఱకు
మొగి ఋశ్యశృంగాదిమునుల భూపతులఁ, దగునర్చనము లిచ్చి తగనీడుకొలిపి
పరమానురాగుఁడై పడఁతులు దాను, ధరణీశుఁ డయ్యయోధ్యకు నేఁగుదెంచె
దముయాగభాగము లర్థిగిలి కైకొన్న, యమరులు దమలోక మరిగెడుచోట
నాకంజగర్భుఁ డింద్రాదులఁ జూచి, లోకరక్షణకళాలోలుఁడై శౌరి
ధారణిపై నవతారంబుసేయ, మీరును దోడ్పడ మేకొనవలయు
నటుగాన లోకహితార్థవర్తనులఁ, బటుపరాక్రమరూపబలపయోనిధుల
బలగర్వముల మిమ్ముఁ బ్రతిపోల్పఁజాలు, బలియుర వానరపతులఁ బెక్కండ్రఁ
గిన్నరగంధర్వఖేచరయక్ష, పన్నగామరసిద్ధభామలయందుఁ
బుట్టింపుఁ డేమున్న పుట్టించినాఁడ, నెట్టన బలపయోనిధి జాంబవంతు
నది యెట్టి దనిన నేనావులించుటయు, నుదయించెఁ జిరతరాయుష్మంతుఁ డతఁడు
అని బ్రహ్మ తమతోడ నానతిచ్చుటయు, విని సంతసిల్లి యావేల్పులందఱును
అనిమిషపతి వాలి ననలుండు నీలు, నినుఁడు సుగ్రీవు సురేజ్యుండు తారు
సింధువల్లభుఁడు సుషేణు గుహ్యకుఁడు, గంధమాదను విశ్వకర్మయు నలుని
దివిజవైద్యయుగంబు ద్వివిదమైందులను, దివిరి పర్జన్యాధిదేవత శరభుఁ
గరువలి హనుమంతుఁ గడఁగి పుట్టింప, ధరణిఁ బుట్టించిరి తక్కినసురలు
తమతమసత్త్వము లర్థిఁ బుచ్చి పేర్చి, యమితశౌర్యుల వానరాధీశవరుల
నావానరులు జగదాప్తవర్తనులు, దావాగ్నితుల్యు లుదగ్రవిక్రములు

1 పర్వతాకారులై భాసిల్లువారు, పర్వతయోధులై పరఁగెడువారు
భీమసాహసికులై పెంపారువారు, కామరూపంబులఁ గర మొప్పువారు
దఱిమి యబ్ధులనైన దాఁటెడువారు, 2 పెఱికి కొండలనైన భేదించువారు
నఖదంష్ట్రహేతుల నలిఁ గ్రాలువారు, నఖిలలోకోత్తరులై యొప్పువారు
ధారణినైన విదారించువారు, నైరూఢికెక్కియు నరుదుగ వారు
కొందఱు సుగ్రీవుఁ గొందఱు వాలిఁ, గొందఱు హనుమంతుఁ గొందఱు నీలుఁ
గొందఱు నలమైందకుముదులఁ గొలిచి; యెందు నభేద్యులై యేపు దీపించి
మలయదర్దురగంధమాదనసింహ్యకులు మొదలగు శైలములఁ గాననముల
3 బహుజలనదనదీప్రాంతదేశముల, విహరించుచుండిరి వేడ్కతో నంత
మహనీయపాయసమహిమచే జేసి, యహిమాంశుకులపత్నులందు గర్భంబు
లలవడ నాధానమైనది మొదలు, కలిమిఁ గైకొనెఁ జేదకొను లెంతయును
నమృతాన్నరుచిలోన నడఁగక వెలికి, గమనించె నన దేహకళ వెల్లవాఱె
రావణుసామ్రాజ్యరమ ముక్కునల్పు, గావించుటకు సూచకము లివి యనఁగ
ననపత్యతాదోష మంతయు వెడల, మొనసె నాఁదగెఁ జనుముక్కుల నల్పు
చెక్కులుపలుచఁగాఁ జిట్టుముల్కలిసె, నిక్కెనాభులువళు ల్నైఱులకుఁబాసెఁ
దలచూపెఁ గోర్కు లంతటఁగ్రమంబునను, నెలలు తొమ్మిదియును నిండినపిదప
వర్ణితమధుమాస వరశుక్లపక్ష, పూర్ణయౌ నవమిని బుధవాసరమున

శ్రీ రా మా వ తా ర ము

మహిఁ బునర్వసుతార మధ్యాహ్నవేళ, గ్రహపంచకము నుదగ్రస్థితిఁ దనరఁ
దొలఁగక గురుఁడు చంద్రుఁడుఁ గూడియుండ, లలితకర్కాటకలగ్నంబునందు
సర్వలోకాధారు జగదేకవీరు, శర్వాదిదేవతాసంస్తూయమాను
దివ్యలక్షణకళాదేదీప్యమాను, నవ్యయు నసమాను నార్తార్తిహరణు
భవ్యుఁ జితానందుఁ బరమకల్యాణు, దివ్యులరక్షించు దీనార్తిహరణు
గుణగణాలంకారు గురుకీర్తిహారు, ఫణిరాజశయను శ్రీపతి హృషీకేశు
నాకమలోదరునర్ధాంశమునను, గాకుత్స్థకులు రాముఁ గనియెఁ గౌసల్య
యదితి యింద్రుని గన్న యనువునఁ దూర్పు,సుదతి చంద్రునిఁగన్న చొప్పున నంత
భూలోకవిదితమై పుష్యనక్షత్ర, లాలితం బగు మీనలగ్నంబునందుఁ
గమలాక్షసమతేజుఁ గమలాప్తవంశుఁ, గమలాప్తుభరతుని గనియెఁ గైకేయి
ప్రణుతింపఁ దగునట్టి ఫణితారకమున, గణితకర్కటకలగ్నంబునఁ గవలఁ
దరళలోచన సుమిత్రాదేవి మిత్ర,చరితుల లక్ష్మణు శత్రుఘ్నుఁ గనియె
దివి మ్రోసె నప్పుడు దేవదుందుభులు, దివి నాడి రప్పుడు దేవకామినులుం
సొరిదిఁ బువ్వులవాన సోనలై కురిసెఁ, బరితోష మందిరి బ్రహ్మాదిసురలు
కలయ నయోధ్యలోఁ గలవార లెల్ల, వెలసి రుత్సవముల వీరు వా రనక

1 పర్వతశౌర్యులై పరఁగెడువారు. 2 మెఱమి కొండలనైన మీటెడువారు. 3 బహు జలనిధినదీప్రాంతదేశముల.

అప్పుడు దశరథుఁ డనఘు వసిష్ఠు, రప్పించి జాతకర్మములు సేయించి
పుత్త్రోత్సవంబును బొరయించె దివిజ, నేత్రోత్సవంబుగా నిఖలపౌరులకుఁ
బురుడు దీరినయంతఁ బుణ్యాహవేళ, వరుస నాసుతులకు వంశోన్నతులకు
నామకరణములు నలువుర కిప్పు, డేమఱ కీవు సేయింపు వసిష్ఠ
యనవుడు నౌఁగాక యని తనగుదిని, గనుఁగొని పలికెను గౌసల్యసుతుని
రముక్రీడ యని ధాతు రమ్యార్థ మమరు, రమయతి యననొప్పు రామనామంబు
కైకేయితనయుండు ఘనబలాన్వితుఁడు, సుకుమారతనుఁడు సుశ్లోకుండు గాన
భరతనామంబునఁ బరఁగు సుమిత్ర, కిరవైనసుతులకు నింపె సొంపెసఁగ
లక్షణగుణులు సంలక్షించి చూడ, లక్ష్మణశత్రుఘ్ను లనునామ మొదవుఁ
గాన వీరలు మహాఘనపుణ్యమతులు, ఈనలువురకును నివి నామము లన
లక్ష్మీసమన్వితులకు రామభరత, లక్ష్మణశత్రుఘ్నలలితాఖ్య లెసఁగ
నొగి నామకరణంబు లొప్పఁ గావించి, తగ నర్థకోటులు దానంబు లిచ్చె
వారలు తల్లులు వరుస దాదులును, బోరామిఁ దము నర్థిఁ బోషింపఁ బెరిఁగి
కల్లరినగవులఁ గన్నులు దెఱచి, యల్లనల్లనఁ దప్పటడుగులు వెట్టి
మల్లడిగొను డొంకుమాటలు నేర్చి, యెల్లవారికిఁ జాల నింపు లొనర్చి
కొద్దిగా ముత్తెంపుఁగొనబు వజ్రాల, మద్దికాయలడాలు మలయఁ జెక్కుళ్లఁ
బ్రాకటంబుగ ఫాలబాలేందుకళల, శ్రీకరాకృతి రావిరేక లల్లాడఁ
బొగడొందు మగరాల పులిగోళ్లు మెలి, జిగి డెందములయందుఁ జిందులు ద్రొక్క
నెడనెడఁ బలుపచ్చ లేయడ్డిగలుగఁ, గడునొప్పు మొలనూళ్ల గంటలు మొఱయ
మువ్వ లందెలు పదంబుల రొద ల్సేయ, నవ్వులాటల బాల్యనటన లేర్పడఁగ
విద్దెలు నెఱపుచు విభునిముందఱను, ముద్దులుగులుకుచు మోహనాకృతుల
నంత నానలువురు నభివృద్ధిఁబొంది, సంతతపుణ్యులై సమచిత్తు లగుచుఁ
దములోనఁ గవకూడి దశరథాత్మజులు, రమణీయమూర్తులు రామలక్ష్మణులు
భరతశత్రుఘ్నులు పాయక పుణ్య, నిరతులై చాలోపసీతులై యంత
మాయావినోదము ల్మరగి యాడుచును, నాయెడ రఘురాముఁ డాప్తులుఁ దాను
నిండారుప్రేమతో నెట్టెలుగట్టి, చెండును దండంబు చెలువొప్పఁ బట్టి
తరమిడి యాడెడుతఱిని గైకేయి, వరవు డామంథర వడి నేఁగుదెంచి
చిట్టంటుచేఁతలఁ జెండు దట్టుటయు, కట్టల్క రాముఁ డాకాష్ఠంబుచేత
నడచిన నొక్కకా లప్పుడే విఱిగెఁ, దడయక యందందఁ దమకించి రాము
నడరెడువేడ్కతో నాడంగఁ జూచి, తడయకరాముపైఁ దగఁ గ్రౌర్య ముంచి
విరిగినకాలితో వెసఁ గైక నగరి, కరిగి తద్వృత్తాంత మంతయుఁ దెలుపఁ
దరమిడి కైకేయి దశరథాధిపున, కెఱిఁగింప నంతయు నెఱిఁగి భూవిభుఁడు
అలవసిష్ఠుని నయోధ్యకును రావించి, వలగొని మ్రొక్కి యోవరమునిచంద్ర
వీరికి వేదాదివిద్య లన్నియును, నేరుపుఁ డనుచు నానృపుఁ డప్పగింప
ననఘుఁ డమ్మునినాథుఁ డట్లకావింప, జననాథుతనయు లాసంయమికరుణఁ

గరిహయారోహణక్రమము లెఱింగి, వరరథారోహణవైఖరు ల్దెలిసి
యఖిల వేదంబులు నఖిలశాస్త్రములు, నఖిలశస్త్రాస్త్రవిద్యలు నేర్చి రంత
వారిలో రాముఁ డవార్యశౌర్యమున, సారవివేకాదిసద్గుణావళులఁ
దేజరిల్లుచు విష్ణుదేవుండు గాన, రాజిల్లె నాదశరథుఁడును నంతఁ
గొడుకులపెండ్లిండ్లు గొమరొప్పఁ జేయ, నడరి చింతింప విశ్వామిత్రుఁ డట్టె
వచ్చి నిల్చుటయు దౌవారికు ల్దెలిసి, వచ్చి యాదశరథవరునర్థిఁ జూచి
యవధారు దేవ విశ్వామిత్రమౌని, తివిరి వాకిట నేఁగుదెంచియున్నాఁడు
అనవుడు దశరథుం డాప్తులతోడ, మునివసిష్ఠుఁడుఁ దాను ముదముతో నపుడు
పరమేష్ఠి కెదురేఁగుపాకశాసనుని, కరణి నెదుర్కొని ఘనశక్తి నెఱిఁగి
యమ్మునిఁ గొనిపోయి యర్ఘ్యపాద్యములఁ, నెమ్మిఁ బూజించిన నృపుఁ జూచి యతఁడు
కుశలమే ప్రజలకుఁ గుశలమే నీకుఁ, గుశలమే నీముద్దుకొడుకుఁగుఱ్ఱలకు
విశదవ్రతాచారవినుత వసిష్ఠ, కుశలమే మునులార కుశలమే యనిన
నేమిటఁ గొఱఁతలే దేము ధన్యులము, నామందిరము పావనమ్ము చెన్నొంద
భావితమూర్తి యోపరమమునీంద్ర, నీవు విచ్చేసితి నేఁడు మాకడకుఁ
గాన లోకములఁ బ్రఖ్యాతుఁడ నైతి, మానవాధిపులలో మాన్యుండ నైతి
వచ్చినకార్యంబు వలనొప్పఁ జెప్పుఁ, డిచ్చమైఁ జేసెద నేకార్యమైన
ననిన విశ్వామిత్రుఁ డారాజుఁ జూచి, జననాథ దశరాత్రసవమును దొడరి
కోరి యేఁ జేయుచోఁ గ్రూరరాక్షసులు, దారుణాకారు లిద్దఱు వచ్చి వచ్చి
మాయాగశాలలో మాంసరక్తములు, పాయక గురియుచుఁ బ్రబలవిఘ్నములు
సేయుచు నున్నారు క్షితిపాల మఱి, నాయాగమధ్యంబునం దల్ల రాదు
అటుగాన నీపుత్త్రు నభిరాముఁ రాముఁ, బటుసత్త్వుఁ గ్రతువొప్పఁ బాలించుకొఱకుఁ
గొనిపోవ వచ్చితిఁ గ్రూరులు దనుజు, లనిఁ జావ రొరులచే నతనిచేఁ గాని
యితనిమహత్త్వ మే నెఱుఁగుదు బ్రహ్మ, సుతుఁడైన యీవసిష్ఠుండును నెఱుఁగు
అనఘ రాముఁడు బాలుఁ డనుబుద్ధి మాను, మనఘ నీపుత్త్రకుం డనులోభ ముడుగు
క్రతుకర్త క్రతుమూర్తి క్రతుభాగభోక్త, యతఁడు లోకారాధ్యుఁ డతనిఁ బుత్తెంపు

కౌశికుఁడు యజ్ఞరక్షణార్థమై దశరథునితో రామునిఁ బంపుమనుట

మతులశస్త్రాస్త్రంబు లతని కేనిత్తు, నతనిచేఁ గ్రతురక్ష యగు మాకు ననుడు
బెలుకురి మూర్ఛిల్లి పెద్దప్రొద్దునకుఁ, దెలిసి వెల్వెలఁబాఱి దీనుఁడై మిగులఁ
గలఁగి కంపించి గద్గదకంఠుఁ డగుచుఁ, బలికె విశ్వామిత్రుఁ బ్రార్థించి నృపుఁడు
రాముఁడు బాలుండు రాముండు నిసువు, రాముఁ డెఱుంగఁడు రణకళాకేళిఁ
బదియును నైదేండ్లప్రాయంబువాఁడు, కదలెడి చిప్పకూఁకటిగలవాఁడు
పరికించి తనయందుఁ బగవారియందు, నురుబలాబలగతు లూహింపలేఁడు
ఇటువంటిపసిబిడ్డ నేల వేఁడితిరి, కటకటా ఘనదయాకలితుండ వయ్యు
బహుదివ్యశస్త్రాస్త్రపతులు రాక్షసులు, మహితమాయోపాయయుతులు రాక్షసులు
నిపుణసంగరకళానిధులు రాక్షసులు, విపుల బాహాటోపవిభులు రాక్షసులు

వారితోఁ బోర నెవ్వఁడు రాముఁ డనఁగ, వా రేడ యితఁ డేడ వరమునిచంద్ర
యిరువదివేలేఁడు లవనిఁ బాలించి, తఱిదప్పి ముదిసి యీతనిఁ గంటి నేను
ఇతనిఁ బుత్తెంచుట కేఁ జాలనయ్య, క్రతురక్షకై విచారము లేల మీకు
నేను సేనలఁ గూడి యీప్రొద్దె కదలి, పూని వచ్చెద నిదె పొందు మీవెనుక
మునినాథ మీయాగమున విఘ్నకర్త, లను రాక్షసులశక్తు లవియెంత గలవు
వా రెవ్వ రెవ్వరు వారి పేరేమి, యీరాఘవుఁడు వారి నెబ్భంగి గెలుచు
ననిన విశ్వామిత్రుఁ డనియె భూపతికి, మనుపులస్త్యబ్రహ్మమనుమండు ఖలుఁడు
ఆవిశ్రవసుకొడు కఖిలకంటకుఁడు, రావణుఁ డుగ్రసంరంభుఁడై పనుప
బలసి మారీచసుబాహులన్వారు, నలిరేఁగి యాగవిఘ్నములు సేయుదురు
రాముఁడొక్కఁడు దక్క రణభూమి వారి, నేమిచందంబున నెదుర లే రొరులు
అని పల్క నమ్మక యధిపతి మఱియు, మునినాథుతోఁ బల్కె మోమోట లేక
బ్రహ్మనాలవవాఁడు పరమసాహసుఁడు, బ్రహ్మచే వరములు వడసినవాఁడు
అట్టిరావణుచేత నటు పంపు వడసి, నట్టివారల గెల్వ నతఁ డేమి చాలు
వారిలా వెఱుఁగక వచ్చెద ననుచు, మీరి పల్కితి నింక మెల్లనఁ జనుఁడు
ననవుడు రోషతామ్రాక్షుఁడై చూచి, కనలుచుఁ గటము లుత్కటములై యదర
నొడలెల్లఁ గంపింప నురుగతిఁ బలికె, నడరి విశ్వామిత్రుఁ డారాజుఁ జూచి
కాకుత్స్థకులజులగతి విచారింప, కీకష్టదుర్భాష లేల భాషింప
నేను వచ్చినపని యొడఁగింపు మంటి, పూని చేసెద నంటి బొంకెద విపుడు
క్రతురక్షకై రాముఁ గడఁగి వేఁడుటయు, ధృతిమాలి యీనని తెగి పల్కె దీవు
సూనృతేతర నిన్నుఁ జూడఁగా రాదు, గానఁ బోయెద నంచుఁ గడఁగి పల్కుటయు
జలనిధులింకె భూచక్రంబు గ్రుంగెఁ, గలఁగె లోకములు దిగ్గజములు మ్రొగ్గె
దివిజులు వెఱచిరి దిశలు గిడ్పడియె, నవశంబులుగఁ జొచ్చె నఖిలభూతములు
అప్పుడు మౌని కోపాటోపవృత్తి, తప్పక భావించి దశరథుఁ జూచి
యావసిష్ఠుఁడు పల్కె నర్కవంశజులు, భూవలయంబున బొంక రెన్నఁడును
మిన్నందు నీకీర్తి మీవారికీర్తు, లన్నియుఁ జెడుఁ గల్లలాడితి వేని
యిచ్చెద నని పల్కి యీకున్నఁ బోలియు, నచ్చుగాఁ జేసిన యఖిలధర్మములు
దశరథాధీశుఁడు ధర్మాత్ముఁ డనఁగ, విశదకీర్తుల నీవు వినఁ బ్రసిద్ధుఁడవు
పుడమిలో నవనీశ భువనరక్షణము, గడవంగ ధర్మముల్ గలవె రాజులకుఁ
గాన రాముని నిచ్చి గాధినందనుని, మాననీయునిఁ బంపు మానవాధీశ
ఘనబలోన్నతులు రాక్షసు లీకుమారుఁ, డనికి దక్షుండు గాఁ డనుచు నీకొడుకు
శైశవంబున కింత శంకింపనేల, కౌశికుఁ డుండంగఁ గలుగునే భయము
అధిప విశ్వామిత్రు నత్యుగ్రతపము, లధికసామర్థ్యంబు లతివిచిత్రములు
భూనాథ యిమ్మహాపుణ్యుండు దేవ, దానవగంధర్వదైత్యులకంటె
నెఱుఁగు దివ్యాస్త్రంబు లిమ్మహాభావుఁ, డెఱుఁగనివిషయంబు లెందును లేవు
జనలోకనాయక జయము సుప్రభయు, ననఁగ దక్షునికూఁతు లాజయావలన

సుప్రభవలన రక్షోవధార్థముగ, సుప్రభుం డగుభృశాశ్వుండు వేర్వేఱ
నస్త్రాకృతులఁ బుత్త్రులరయ నేఁబండ్ర, శస్త్రాకృతుల తనూజన్ము లేఁబండ్రఁ
గామరూపంబులు గలవారిఁ గాంచి, భూమీశ యిచ్చె నీపుణ్యాత్మునకును
అది కారణంబుగా నఖిలశస్త్రాస్త్ర, విదుఁ డిమ్మునియు నీవు వెఱవంగ వలదు
ఈమునిమహిమ పెంపెఱుఁగవే యకట, యీమునితో నాడి యేల తప్పెదవు
ఈమునిచంద్రుతో నేఁగ రామునకు, నేమంబు జయమును సిద్ధమ్ము సుమ్ము
ఇతఁడు రక్కసుల జయింపఁగా లేఁడె, హితమతి నీపుత్త్రు నిద్ధచారిత్రు
నలఘుశస్త్రాస్త్రవిద్యలఁ బెద్దసేయ, వలసి యిచ్చుటికి భూవర వచ్చెఁగాక
కాన రామునిఁ బంపు క్రతువు రక్షింప, నీనిర్మలాత్ముని కిచ్చుట మేలు

### కౌశికునితోడ రామలక్ష్మణులఁ బంపుట

అని వసిష్ఠుఁడు పల్క నాత్మలో నమ్మి, జననాథుఁ డా రామచంద్రునిఁ బిలిచి
బాలభావము చూచి బాష్పము ల్నించి, యాలింగనము సేసి యర్థి దీవించి
చిప్పకూఁకటి దువ్వి చెక్కిలి పుడికి, తప్పక యొక్కింతతడవు చింతించి
పుణ్యాహవాచనపూర్వంబు గాఁగఁ, బుణ్యవ్రతంబులు పుణ్యహోమములు
గ్రహపూజనలు సేసి కమనీయవస్త్ర, మహితభూషణములు మనసార నిచ్చి
యొగిఁ దానుఁ గౌసల్యయును వసిష్ఠుండు, తగిన దీవన లిచ్చి దశరథేశ్వరుఁడు
పుణ్యలగ్నంబునఁ బుత్త్రరత్నంబుఁ, బుణ్యాత్ముఁ డగు గాధిపుత్త్రున కిచ్చి
నెమ్మియుఁ దెగువయు నెఱిఁ బిరిగొనఁగ, నమ్మునిఁ గొలిచి పొమ్మని వీడుకొలిపె
నప్పుడు లక్ష్మణుం డా రాముఁ గొలిచి, తప్పక భక్తితోఁ దానును జనియెఁ
బొదివి పువ్వులవాన పొరిఁబొరిఁ గురిసె, వదలక యనుకూలవాయువు లీచె
వరఘోషమంగళవాద్యము ల్మ్రోసె, సుర లాకసంబునఁ జూచిరి ప్రీతి
నా రాఘవుం డప్పు డరుగుచిత్రముల, నారిమ్రోఁతల మహోన్నతశస్త్రములను
మహితతూణీరముల్ మండలాగ్రముల,సహజంబుగాఁ బూని సంప్రీతితోడ
నక్షీణతూణగోధాంగుళిత్రాణ, కక్షులంబకృపాణకలితులై దివ్య
శరచాపహస్తులై సంయమిపిఱుఁదఁ, గరము సంప్రీతిమైఁ గదలి రాఘవులు
ఆవనజాప్తుని నర్థితోఁ గొలిచి, పోవు నశ్విను లనఁ బోవుచో వేడ్క
నురుపుణ్యమతు లర్ధయోజనం బరిగి, సరయువుడగ్గర శ్రమముఁ బొందుటయు
రామసౌమిత్త్రుల రమ్మని యపుడు, తా మున్ను దారుణతపముచేఁ గొన్న
గనకగర్భునిపుత్త్రికల సర్వమంత్ర, జననుల సర్వదా సౌఖ్యదాయినుల
బల యతిబల యనఁ బరఁగుమంత్రముల, నెలమిమై వారల కిచ్చెఁ గౌశికుఁడు
ఆ రామలక్ష్మణు లామంత్రశక్తి, నారూఢరవితేజులై బడలికయు
నాఁకలి నీరువ ట్టాదిగా రుజలు, పోఁకక బలవృద్ధి శోభిల్లి రంత
సరయూనదీతటస్థలి నాఁటిరాత్రిఁ, దరుణకోమలదర్భతల్పంబులందుఁ
గౌశికుచేఁ బుణ్యకథ లొప్ప వినుచు, దాశరథులు ప్రమోదమున నిద్రింప
నాగాధితనయుండు నా ప్రభాతమున, వేగంబె మేల్కని వేడ్క చిత్తమునఁ

దనరంగ నటఁ దృణతల్పంబులందుఁ, గనుమోడ్చియున్న రాఘవుల నీక్షించి
అరుణోదయంబయ్యె ననఘాత్ములార, నిరుపమపూర్వాహ్ణనిత్యకృత్యములు
వలయు నేమంబులు వరుసఁ గావింప, వలయుట మేల్కొన వలయు మీ రనినఁ
దెలిసి సంధ్యావిధుల్ దీర్చి కౌశికుని, కలరుచిత్తములతో నతిభక్తి మ్రొక్కి
తరణివంశోత్తము ల్దారర్థిఁ జనుచు, సరయూసురాపగాసంగమంబునను
బహుసహస్రాబ్దము ల్వాయనినియతి, బహుతపంబులు సేయుపరమసంయములఁ
గనుఁగొని సంతోషకలితుఁడై గాధి,తనయుతోఁ బలికె నాదశరథాత్మజుఁడు
ఎవ్వరియాశ్రమం బిది సంయమీంద్ర, యెవ్వ రుండుదురయ్య యీతపోభూమి
ననవుడు రామ యనంగాశ్రమమున, వినఁబడు నిది లోకవిఖ్యాత మగుచు
నీయాశ్రమంబున నెలమితోఁ దపము, సేయుచు లీలమై శివుఁ డున్నఁ జూచి
కందర్పుఁ డతిదర్పగర్వితుం డగుచు, నిందుశేఖరుమీఁద నేయంగఁ జూచి
యడరి యాదేవుఫాలాక్షానలమునఁ, జెడుట ననంగాఖ్యఁ జెందె లోకముల
నంగసంగతిఁ దదీయాశ్రమభూమి, యంగదేశం బయ్యె నంతనుండియును
అరుదారఁ దపము లీయాశ్రమభూమిఁ, జరిపించుపుణ్యులు చరితార్థు లెందు
ననుచు విశ్వామిత్రుఁ డత్తెఱంగెల్ల, వినిపించి యారఘువీరులుఁ దాను
నిలిచి నాఁ డావాహినీసంగమమున, విలసితస్నానాదివిధు లనుష్ఠించి
యానందమందఁ దదాశ్రమవాసు, లైనమునీశ్వరు లాత్మలో నెఱిఁగి
రమణీయమూర్తుల రామలక్ష్మణుల, నమితతపోధనుఁ డైన కౌశికునిఁ
గొనిపోయి వేడ్కలు గొనలొత్త నపుడు, వినుతార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి
పుణ్యకథాగోష్ఠిఁ బొదల నారాత్రి పుణ్యరాత్రముఁ జేసి పుణ్యసంయములు
మఱునాఁడు నిత్యకర్మంబు లయ్యేటఁ, దెఱఁగొప్ప నందఱుఁ దీర్చినమీఁద
నీనావికుఁడు నేర్పు నియ్యేఱు గడప, భానువంశజులకుఁ బదిల మీనావ
యనుచు విశ్వామిత్రుఁ డలరంగఁ బలుక, విని రామలక్ష్మణు ల్వేగవొప్ప నపుడు
వారికిఁ బ్రణమిల్లి వారు దమ్మనుప, నాఋషితోఁ గూడ నానావ యెక్కి
సరయువు దాఁటుచో సరయువునడుమ, గరము విస్మయమంది కరములు మొగిచి
యివి మహాధ్వనులు పెల్లెసఁగుచున్నవియు, దివినుబ్బి యిది యేమి తెలుపవే యనుడు
గర మొప్ప మీఁటుచుఁ గైలాసశిఖరి, సరయువు మానససరసి జన్మించి
పొంగారు సాకేతపురిచుట్టుఁ గవిసి, గంగలోఁ గూడెడు కరదుల మ్రోఁత
యని ముని చెప్పిన నర్థితోఁ మ్రొక్కి, యనఘు లన్నదిదాఁటి యరుగుచో నెదుర
కరులు సూకరములు కాసరంబులును, హరిణముల్ శరభంబు లజగరంబులును ఁడ
బులులు భల్లూకము ల్పొదలుసింగములుఁ, గలమహాటవిఁ జొచ్చి ఘనుఁడు రాఘవుఁ
ఖదిరతిందుకపూగఖర్జూరనింబ, బదరీవటప్లక్ష పాటలీతరులు
బహుళకంటకలతాపరివృతవృక్ష, సహితంబు నిర్మానుషంబును నైన
నివ్వనభూమి మునీశ్వర పూర్వ, మెవ్వరియాశ్రమం బెఱిఁగింపు మనుచు
నడుగ విశ్వామిత్రుఁ డంతయుఁ జెప్పఁ, దొడఁగి యారామునితో నిట్టు లనియె.

వలుక నింద్రుండు వృత్రాసురుఁ జంపి, మలకలుషప్రాప్తి మలినాంగుఁ డైన
సురలును మునులును సుత్రాము నిటకు, దురితముక్తునిఁ జేయఁ దోడ్కొని వచ్చి
పుణ్యోదకంబులఁ బుణ్యమంత్రములఁ, బుణ్యాభిషేకము ల్పొలుపారఁ జేయ
నామలకలుషంబు లనునవి రెండు, భూముల నిడ శుద్ధిఁబొంది వాసవుఁడు
మలయుక్తమైనది మలదంబు కలుష, కలితమైనది యొప్పుగాఁ గరూశంబు
ననియుఁ బాపఘ్నంబు లనియుఁ బే రొసఁగి, జనపదంబునఁ దొల్లి జంభారి దనకు
నలవృత్రవధపాప మందుఁ దీఱుటయు, వినుతింప ధనధాన్యవిభవము ల్పొదలఁ
బొలుపార వరము లాపురముల కిచ్చి, వెలయించె నిఁక నొండు విను రఘురామ

విశ్వామిత్రుఁడు రామునకుఁ దాటకజననము దెలుపుట

ధరణిఁ దాటక యనుదానవురాలు, కరులు వెయ్యింటికిఁ గలలావు గలిగి
పోలువేది నీరెండుపురములు సొచ్చి, యలవుమై బాధించు ననుడు రాఘవుఁడు
ఎవ్వరు లా విచ్చి రీయింతి కింత, యెవ్వరి కిది పుత్త్రి యీదుష్టబుద్ధి
యీపురంబులు రెండు నేల కాఱించు, నీపాపకర్మురా లెఱిఁగింపు మనుడు
నవని సుకేతుఁ డను యక్షుండు తొల్లి, తవిలి పద్మజునకుఁ దపమాచరించి
యడరెడునిష్ఠమై నతని మెప్పించి, కొడుకు వేఁడుటయును గొడుకు నీ కీను
వెలసినగజముల వేయింటిలావు, గలకూఁతు నిచ్చితిఁ గనుము పొమ్మనిన
నావరంబున దాని నాతండు గాంచి, భావించి సుందునిభార్యగాఁ జేసె
నతఁ డవ్వధూటియం దతిఘోరసత్త్వ,వతుల మారీచసుబాహు లన్వారిఁ
బడసి లోకాంతరప్రాప్తుఁ డౌటయును, గొడుకులు దానును గూడి గర్వమున
నాయింతి మఱి యగస్త్యాశ్రమంబునకుఁ, బోయి మౌనుల పొరిఁ బొదలి కాఱింపఁ
గలశజుఁ డాపాపకర్ములఁ జూచి, యలిగి రాక్షసులు గండని శాప మిచ్చె
నదియాదిగా రాక్షసాకృతుల్వాని, యదయత మానవాహారముల్ గొనుచు
దా నిందు వసియించి ధరణిఁ గాఱించు, దీనిఁ జంపఁగ లేరు తెగువ నెవ్వరును
నీ వొక్కఁడవు దక్క నీచేతఁ గాని, చావ దాఁడుది యని చంపరా దనకు
మొనసి గోబ్రాహ్మణహితమైనఁ జాలుఁ, జనుఁ జంపఁ గామినీజనుల రాజులకుఁ
దొల్లి ధారుణియెల్లఁ ద్రుంపఁ జింతించు, ప్రల్లదురాలైనఁ బర్జన్యుఁ డలిగి
సంపన్నమతి విరోచనుకూఁతుఁ బట్టి, చంపఁడె యది ప్రశస్తముగాదె యొందు
నెఱియ లోకంబు లనిద్రముల్ గాఁగఁ, జెఱుపఁ జిత్తంబునఁ జింతించుటయును
వలుక దృఢవ్రత యగు భృగుపత్నిఁ, జలమొప్ప విష్ణుండు చంపఁడే తొల్లి
యదిగాన లోకహితార్థమై సతులఁ, బొదివి చంపుటయును బుణ్యంబు లనఘ
యనిన విశ్వామిత్రసతులవాక్యములు, తనతండ్రిపనుపును దలఁచి రాఘవుఁడు
హాటకగర్భుఁ డగుమౌనిమాటఁ, దాఁటక తాటక దండింతు ననుచు
ఘనధనుర్ఘోషముల్ గగనంబు నిండ, నినుచుటయును మండి నిండఁ గోపించి
కర్ణకఠోరమౌ కార్ముకధ్వనికి, ఘూర్ణితారుణనేత్ర కుటిలాస్య యగుచు
రెండుహస్తము లెత్తి తెక్కలతోడి, కొండ రివ్వున వచ్చుకొమరు దీపింప

వివిక్తాట్టహాసంబు వెలిదంష్ట్రరుచుల, వెనఁజల్లఁ దివిరియుల్లము వెసఁ బెల్లగిల్లఁ
జరణఘట్టనములఁ జటులసత్త్వంబు, ధరణికిఁ దెలుపుచుఁ దవిలి యేతెంచు
తాటకఁ గనుఁగొని దశరథరాముఁ, డాటోప మెసఁగంగ ననియెఁ దమ్మునికిఁ
జూచితే లక్ష్మణ చూచితే దీని, నేచంద మేయంద మేయుగ్రదృష్టి
దీనిఁ జూచిన గుండె దిగు లేరికైన, మానునే యటు గాన మర్దింతు దీని
ననుచుండ గర్జన నాకసం బగలఁ, జనుదెంచి పదధూళి సకలంబుఁ గప్ప
నలిమీఱి ఘోరదానవురాలు ఱాలు, కలగొనఁ గురియ రాఘవుఁడు గోపించి
యనుపమాస్త్రంబున నమ్మహాశిలలు, దునుమాడి దానిచేతులఁ ద్రుంచివైచె
నప్పుడు లక్ష్మణుం డసురేశుచెలియ, కప్పాటుగావింతు నని యన్నకరణి
ముక్కును జెవులును మొదలంటఁగోసె, నక్కాముదూషిణి యక్కజం బొదవ
మాయలు ధరియించి మఱియుఁ బెక్కమ్ము, లాయింతి గురియ విశ్వామిత్రుఁ డనియె
ననఘ సంధ్యాకాల మగుచున్నదియు, దనుజుల నెందు సంధ్యల గెల్వరాదు
నీవింకఁ గృపమాని వెలకొని దీని, నీవిశ్వహితముగా నిటఁ జంపు మనుడు
గాధేయమునిమాట గడపక శబ్ద, వేదిబాణముల నవ్వేడమాయ లడఁచి
పెడపెడనార్చుచుఁ బిడుగుచందమున, నడతెంచుచున్న దానవి నిరీక్షించె
మహితాస్త్ర మొకటి చన్నొన నాటనేయ, బహురక్తధారలు పర్వ నావనిత
అసురశిఖారంభమం దది రాముఁ, డొసఁగెనో శరముల నుపహార మనఁగఁ
బ్రళయమారుతమునఁ బగిలి సంధ్యాభ్ర, మిటఁ గూలు తెఱఁగున నిలఁ గూలెఁ దాని
యప్పు డానందించె నఖిలభూతములు, నప్పు డానందించి యమరులు మునులు
ఆరాము దీవించి యాలింగనంబు, గౌరవంబునఁ జేసెఁ గౌశికుఁ డంత
దేవగంధర్వాది దివిజులు గొలువ, దేవేంద్రుఁ డచటికి కేతెంచి శ్రీరామ
దేవునిఁ గాంచి ప్రార్థించి పూజించి, దేవవిధేయు గాధేయు నీక్షించి
మమ్ము రక్షింప నిమ్మహిఁ బుట్టినట్టి, యిమ్మహామహునకు నిమ్ము భృశాశ్వ
సంతాన మైన యస్త్రములు శస్త్రములు, నంతయు నని చెప్పి యరిగిన దివికి
నినుఁ డంతఁ గ్రుంకె నయ్యెడను నాఁ డుండి, ముని మఱునాఁడు రామునిఁ బ్రేమఁ జీరి

శ్రీరామునకు భృశాశ్వసంతానము లైనయస్త్రశస్త్రముల నిచ్చుట

రామ నీవిక్రమరణకేళి చూచి, యేము మెచ్చితిమి నీ కిచ్చెద మింక
నమరోరగాసురయక్షయుద్ధముల, సమధిక మగు నస్త్రశస్త్రంబు లనుచుఁ
దనుశుద్ధితోడ సుస్థలిని గూర్చుండి, మునిపతి రాముఁ బ్రాఙ్ముఖునిఁ గావించి
యమలమనస్కుఁడై యఖిలంబుఁ దలఁచి, క్రమమున దండచక్రంబును ధర్మ
చక్రంబు మఱి కాలచక్రంబు విష్ణుచక్రంబు శక్రువజ్రంబును నసియుఁ
బాశిపాశము ధర్మపాశంబు కాలపాశంబు నీశానుభయదశూలంబు
నొగి శక్తియుగ్మంబు నుగ్రమై మిగుల, నెగడు సుష్ణానుష్ణనిర్మితాశనులు
కంకాలమును ఘోరకరవాల ముసల, కంకణాఖ్యంబులుఁ గ్రౌంచబాణాది
శస్త్రంబు లొగినిచ్చి సమ్మదం బడర, నస్త్రంబు లాగ్నేయ మన నొప్పునదియు

బ్రాహ్మంబు తేజఃప్రభంబు నైంద్రంబు, బ్రహ్మశిరంబును బ్రస్థాపనంబు
నారాయణంబుఁ బైనాకంబు శిఖర, దారుణశౌర్యసుదామనంబులును
బ్రశమనమును విలాపనము సత్యంబు, విశదప్రభలఁ బొల్చు విద్యాధరంబు
వాయవ్యసోమసంవర్తాస్త్రములును, మాయాధరాస్త్రంబు మానవమథన
సౌమనసహరుద్రసంతాపనములు, తామసమౌసలదర్పణాస్త్రములు
హయశిరంబును మాయ లడరించి చాల, జయమిచ్చుగాంధర్వసమ్మోహనములు
నొరిది నైష్ఠికమును శో[illegible]ఖ్యంబు, నరుదుగ నాగ్నేయ మనుసాయకంబు
గరుడబాణంబును గౌబేరశరము, నారసింహాస్త్రంబు నాగబాణంబు
వారింప రానట్టి వైష్ణవాస్త్రంబు, వారక నుతికెక్కు వైద్యాధరంబు
రౌద్రబాణంబును రాక్షసాస్త్రంబు, భద్రప్రదంబైన పాశుపతాస్త్ర
మొగిఁ గర్తరీచక్రములును మేఘాస్త్ర, మగణితంబైనట్టి యస్త్రజాలముల
నఖిలదారుణమైన యమురమోదకియు, శిఖి యనఁ దగునుల్లసిలుగదఖడ్గ
వామనపైశాచ వాయవ్యశస్త్ర, సామసౌమ్యాఖ్యానసంవర్తనములు
సామంబు మథనంబు సంతాపనంబు, తామసంబును జగదంబుదారుణము
కంకోలకాహాలకరవాలముసల, కింకిణుల్ మొదలుగాఁ గీలితాస్త్రముల
నెలమి నిచ్చిన వానినెల్లఁ గైకొనుచు, నలరి రాముం డమ్మహాత్మునిఁ జూచి
మునినాథ సకలాస్త్రములు భవత్కరుణఁ, గని కృతార్థుఁడ నైతిఁ గావున నింక
సలలితంబుగ నుపసంహారణాస్త్రముల నొసంగు మటన్న ముదమంది యతఁడు
సత్యవంతము రభసము పరాఙ్ముఖము, సత్యకీర్తియు దశాక్షము నవాఙ్ముఖము
ప్రతిహారతరము మారణమును శుచియు, శతవక్త్రదైత్యదృష్టములు లక్ష్యములు
గ్రశనంబు కరవీరకరిసత్యకీర్తి, దశశీర్షమును శతోదరము జ్యోతిషము
విమలంబు మకరంబు విరుచి నిష్కలియుఁ, బ్రమథనంబును సునాభంబును సర్వ
నాభంబు మఱి దుందునాభంబు పద్మ,నాభంబుఁ దృఢనాభనైరాశ్యములును
గామరూపంబు నౌ గంధర్వరణము, సౌమనమును నిద్రసంధానములును
మోహనవిషమాక్షములు మహానాభ, బాహువిభూతిజృంభకములు ధాన్య
ధనువులు వృత్తవంతము రుచిరంబు, నెనయ సార్చిర్మాలి ధృతిమాలి యనఁగఁ
గామరూపంబులు గలమహాస్త్రములు, భూమీశునకుఁ జెప్పి పొలుపార మఱియు
నివియును గాక యనేకశస్త్రాస్త్ర, నివహముల్ రఘువంశనేతకు నొసఁగి
తత్ప్రభావంబులు తన్మంత్రములును, దత్ప్రయోగంబులు తదుపసంహాతులు
విలసిల్లు శస్త్రాస్త్రవిద్యారహస్యములు సర్వమును దెల్ప మొగి రామునెదుట
నంగారసదృశంబులై కొన్ని ఘోర, భంగుల ధూమ్రనిభంబులై కొన్ని
యనుపమదీప్తి రమ్యంబులై కొన్ని, తనరారు బహుదివ్యతనువులై కొన్ని
పరువడి చంద్రప్రభంబులై కొన్ని, పరికింప భానుదీప్తంబులై కొన్ని
బహుళాంధకారవిభ్రమములై కొన్ని, మహితాట్టహాస భీమంబులై కొన్ని
యకలంకమూర్తు లిట్లమర నేతెంచి, ముకుళితకరయుగ్మములతోడ నిలిచి

యేకార్య మొనరింతు మే మిటఁ బనుపు, మా కేమి యానతి మనుజలోకేశ
యనుడు నేఁ దలఁచినయప్పుడే మీరు, చనుదెందు పొందన్న సకలశస్త్రములు
వలగొని మ్రొక్కి యవ్వసుమతీపతికి, నెలమితో మ్రొక్కుచు నేఁగె నంతటను
మునినాథుఁ జూచి కేల్మోగిచి రాఘవుఁడు, వినయంబు భక్తియు విశ్వాస మెసఁగ
ననఘ కృతార్థుఁడ నైతి నీకరుణ, నని వినుతించి విశ్వామిత్రు వెంట
నరుగుచో నట వామనాశ్రమభూమి, కర మొప్పుటయుఁ జూచి కాకుత్స్థకులుఁడు
ఈపర్వతము చెంత నిది యొక్కవనము, చూపుల కింపారి సొంపుల నలరి
పొలుచు నానామృగంబులుఁ గలధ్వనులు, గలపక్షిమృగములు గలిగి చెన్నగుచు
నున్న దీయాశ్రమం బో సంయమీంద్ర, యున్న నెవ్వరిది యిం దెల్లజంతువులు
సుఖలీల నున్నవి చూడ నిక్కడికి, నిఖిలజ్ఞ యెక్కడ నీయజ్ఞభూమి
ఎటనుండి చనుదెంతు రేచి రాక్షసులు, చటులోద్ధతులు నీదుజన్నంబు చెఱుప
యాగరక్షణముగా నఖిలరాక్షసుల, వేగంబె నిర్జింతు విశిఖాలి ననిన
నక్కౌశికుఁడు జగదభిరామురాముఁ, జెక్కిలి పుణికి సస్నేహుఁడై పలికె
ననఘ నీ వెఱుఁగని యర్థంబు గలదె, వినుము నాచే విన వేడుకయేని
మును విష్ణుదేవుండు ముదముతోఁ దపము, గొనకొని కావించుకొఱకునై యిచట
యుగము లనేకంబు లుండఁగా ననఘ, మగు వామనాశ్రమం బండ్రు మున్ దీని

శ్రీరాములకు కౌశికుఁడు ఆశ్రమాదుల తెలిఁగించుట

మఱియును సిద్ధాశ్రమంబును ననఁగ, వఱలు నీయాశ్రమవనము లోకముల
జననాథ బలి విరోచనుతనూజుండు, ఘనరాజ్యపదమున గర్వంబు మిగిలి
యేఁచి మరుత్తుల నింద్రాదిసురల, వేఁచి కారింపంగ విబుధులు మునులు
నీయాశ్రమంబున కేతెంచి మ్రొక్కి, తోయజనాభునితోడఁ దా మనిరి
శరణాగతప్రియ శరణు లోకేశ, సరసిజోదర మాకు శరణంబు నీవ
పన్నగా మమ్మేఁచు బలి యనువాఁడు, చెన్నొంద జన్నంబు సేయుచున్నాఁడు
అవ్వారి దానవయజ్ఞవాటమున, నెవ్వ రే మడిగిన నిచ్చుచున్నాఁడు
క్రతువు దీక్షమున్నె కావింపు మాకు, హితమంచుఁ బ్రార్థింప నెల్ల దేవతలు
నాసమయంబున నదితితోఁ గూడ, భాసురవ్రతనిష్ఠఁ బరఁగు కశ్యపుఁడు
ఇమ్ములఁ దపము వెయ్యేఁడులు సేయ, సమ్మదంబున విష్ణు సాక్షాత్కరించె
నీమహాతనువున నిఖిలలోకములు, సోమార్కలోచన చూపుము మాకు
నాద్యంతరహితుండ వగునిన్ను వేద, వేద్యుని శరణంబు వేఁడెద మనినఁ
గరుణ నావిష్ణుండు కశ్యపుఁ జూచి, వరము నీ కిచ్చెద వాంఛితం బెద్ది
యడుగుము నీ వన్న నలరి కశ్యపుఁడు, కడుభక్తితోఁ గరకమలము ల్మోగిచి
యతిబలోద్ధతి నాకు నదితికి నీవు, సుతుఁడవై జన్మించి సురల రక్షింపు
మది కోర్కి నాకును నీదేవతలకు, మదిలోన మన్నింపు మమ్ము నాదటను
అనవుడు నావిష్ణు వదితిగర్భమున, ననుపమం బగుతేజ మలర జన్మించి
వామనత్వము దాల్చి వచ్చి యద్దనుజు, భూమి మూఁడడుగులు పొసఁగంగ నడిగి

రెండడుగులచే ధరిత్రియు దివియు, దండిమైఁ గొలిచి యాధన్యు బంధించి
లోలత నీమూఁడులోకము ల్వెలియ, నేలుము నీవంచు నింద్రున కిచ్చె
నవిగాన నిది వామనాశ్రమం బందు, రిదియ మాయాశ్రమం బీపుణ్యభూమి
సిద్ధించు నిటు దపస్సిద్ధులు గాన, సిద్ధాశ్రమంబు నాఁ జెల్లు నెల్లెడల
నీవె వామనుఁడవై నెగడి త్రివిక్రమావతారము దాల్చి నట్టివిష్ణుఁడవు
నాఁడును నిది నీవనంబు శ్రీరామ, నేఁడును నారీతి నీవనం బయ్యె
ననుచుఁ గౌశికుఁడు నిజాశ్రమంబునకుఁ, జని యందు రామలక్ష్మణులఁ బూజించె
నచ్చట మునిజనం బంతయుఁ గొంత, ముచ్చట దీఱ రామునిఁ బూజసేసె
నంత రాఘవుఁడు విశ్వామిత్రుఁ జూచి, సంతసంబున మునీశ్వర నేఁడు మీరు
యాగదీక్షకు బూరుం డనుమాన ముడిగి, యాగశత్రుల నెల్ల నడఁచెద నేను
అనిన విశ్వామిత్రుఁ డంత హర్షించి, మునుల రప్పించి యిమ్ముల దీక్ష వడసి
యాగవేదుల మును లర్థిఁ గావింప, యాగాంగములఁ బూర్ణ మయి వేసి యొప్పె
నంచితాజ్యాహుతు లందందు దొరుఁగ, మించి యగ్నులు మండి మింటికిఁ బ్రాఁక
హోమాగ్నిఁ బ్రభవించుచున్నతధ్వనులు, సామాది వేదప్రసన్నఘోషములు
నాతతదేవతాహ్వాననాదములు, హోతల పుణ్యమంత్రోపనాదము ల
దిక్కు లన్నియు నుండి తివిరి ఘోషింప, నక్కజ మయి యాగ మటు చెల్లుచుండ
రామభద్రుఁడు ధనుర్ధరుఁడునై మైత్రి, సౌమిత్రియును దాను జాగరూకతను
రక్కసు ల్వచ్చుమార్గము మున్నె జెంగి, యకౌశికుని మౌనియై యున్నవాని
విశ్వమంతయుఁ దమోవృతము గాకుండ, శాశ్వతధృతిఁ గాఁచు చంద్రార్కు లనఁగఁ
గాచిరి కంటికిఁ గనుఱెప్పకరణి, నేచినభక్తి నయ్యేడ నైదునాళ్లు
నలవుమైఁ గవ గూడి యాఱవనాఁడు, బలిమి మారీచసుబాహు లేతెంచి
మేలిఖడ్గద్యుతు ల్మెఱుఁగులు గాఁగఁ, గ్రాలు కాలాంబుదోత్కరములో యనఁగ
దళములు దారు నుద్భటవృత్తి మింటి, నిలిచి గర్జనములు నిగుడించి మించి
వదలక యయ్యజ్ఞవాటంబులోన, మదమున నుప్పొంగి మాంసరక్తములు
గురియుచో హోతలకోలాహలంబు, గరిమ సదస్యుల కలకలధ్వనియుఁ
బరిచారకుల దీనభాషణధ్వనియుఁ, బరికించి విని రామభద్రుండు పొంగి
లక్ష్మణా చూడు నాలా వంచు విజయలక్ష్మీ ధనుర్ఘోషలక్షణం బెసఁగ
నెలకొని వినువీథి నిజదృష్టి నిలిపి, బలువడి వాయవ్యబాణ మేయుటయు
నురవడి మారీచు నువ్వెత్తుగాఁగ, సరభసవృత్తిమై శతయోజనములు
గొనిపోయి యతిముఱిఁ గ్రూరరాక్షసుని, వనధిలోపలఁ బాఱవైచె నాశరము
అడరి వజ్రమునకు నళికి యంభోధిఁ, బడిన మైనాకమై పడిన యయ్యసుర
యొకరీతి దరి చేరి యుగ్రాంశుకులుని, యకలంకవిక్రమం బందందఁ బొగడి
దనుజులఁ బాసి యాంతతనిష్ఠతోడ, ననయంబు నాసుచంద్రాశ్రమభూమి
శూరత విడిచి యాసురవృత్తి నడఁచి, కోరి తపముసేయఁ గూర్చుండె నంత
అతిముఱి రఘురాముఁ డగ్నిబాణమున, నుఱిది సుబాహుని యురమేసి చంపెఁ

దక్కిన రాక్షసబలములు నొకటఁ, జక్కాడె మానవశరమహత్త్వమున
సురలు మోదించి యచ్చోఁ బుష్పవృష్టిఁ, గురిసిరి మునికోటి గొనియాడెనతని
మున్ను వృత్రాసురు మునుమిడి చంపి, సన్నుతింపఁగ దేవసంఘంబుఁ గూడి
వెలుఁగొందు దేవతావిభునిచందమున, బలువిడి రాముఁడు బాహుశౌర్యమునఁ
గడఁగి యజ్ఞారులఁ గడఁగి శిక్షించి, విలసిల్లె రాముండు విభవంబుతోడ
నతినిష్ఠ వెలయ విశ్వామిత్రుఁ డంతఁ, గ్రతుకర్మ మంతయుఁ గడ తేర్చి వచ్చి
నెలకొని రఘురామ నీప్రసాదంబు, గలుగఁగాఁ జెల్లింపఁగంటి నీక్రతువు
నని కృతార్థుఁడ నైతి నని కౌఁగిలించి, వినుతించి రాము దీవించి హర్షించి
యనఘమానసుఁడు విశ్వామిత్రమౌని, యనురాగమునుబొంది యచ్చోటఁ దాను
భూవరు లారాత్రిఁబుచ్చి యచ్చోట, వేవినఁ బూర్వాహ్ణవిధు లాచరించి
మునులకుఁ బ్రణమిల్లి మునులతో గాధితనయునిఁ గనుఁగొని తాపసప్రవర
యింక నెయ్యది కార్య మెఱిఁగింపు నీకుఁ, గింకరులము నీదుకృపకుఁ బాత్రులము
అనిన నచ్చటిమౌను లందఱు గాధితనయు మున్నిడికొని తా మిట్లు లనిరి
జలజాక్షకులవర్య జనకభూవిభుఁడు, చెలువొప్ప జన్నంబు సేయుచున్నాఁడు
మన మందుఁ బోదము మనుజేశునింట, ద్రినయనుపాటించుదివ్యకార్ముకము
గంధాదిపూజలఁ గరమొప్ప దేవ,గంధర్వయక్షరాక్షసవీరవరులు

రాముని మిథిలానగరమునకుఁ బోవ మునులు ప్రేరేపించుట

మొదలైనవారికి మున్ను నేకులకు, నది యెత్త నెక్కిడ నలవి గాకుండు
నట్టి విల్లునుబట్టి యటు లెక్కుపెట్టి, గట్టిగా నెత్తిన ఘనునకు నతఁడు
తనకూతు నిచ్చెదఁ దప్పక నేను, ననుచున్న వాఁడని యందఱు నపుడు
జననాథ యాశరాసనలాభంబు, జనకునిజన్నంబు చనుఁ జూడ నీకు
ననుచు విశ్వామిత్రుఁ డాదిగా సకల,మునులు నావీరోత్తముల దాశరథుల
లలితపుణ్యుల మిథిలాపురంబునకుఁ, జెలువారఁ బయనంబు నేసి సమ్మదము
నొంది భాగీరథియుత్తరతటముఁ, జెంది హిమాద్రియుం సిద్ధాశ్రమంబు
వలపట నిడి యక్షవల్లభుదిశకుఁ, బొలుపారఁబొందిన భూరిమార్గమున
మూఁడు యోజనములు మూఁడుజాములకు, నాఁడేగి యట శోణనదముతీరమున
విడిసి తీర్థస్నానవిహితకర్మములు, నడిపి రథ్యస్థలి నరనాథసుతులు
సంతోషమున మునీశ్వరులతో నుండి, రంత కౌశికుఁ జూచి యారాముఁ డనియెఁ
గరము ప్రజావృద్ధి గలుగు నీదేశ, మరయ నెవ్వరిదేశ మానతిం డనిన
భూనాథ విను బ్రహ్మపుత్త్రుండు కుశుఁడు, నానొక్కముని మహోన్నతకీర్తి గలఁడు
అతఁడును వైదర్భి యనునింతివలన, సుతుల నల్వురఁ గాంచె సురుచిరాకృతులఁ
బ్రశమితాత్ముల ధూర్తరజాసుఁ గుశాంబుఁ, గుశనాభు వసువు నక్కుమరులు మిగిలి
యనివార్యశౌరులై యనుపమలీలఁ, దనరు మహాక్షత్త్రధర్మంబు నడుపఁ
గొడుకులచరితంబు గుణములుఁ జూచి, యదరుసంతసముతో నాకుశుం డనియె
నిలఁ బ్రజాపాలనం బెలమిఁ గావింపుఁ, డలఘుకీర్తులు గల్గు నన ముదమంత

కౌశలంబున నొప్పఁగాఁ గుశాంబుండు, కౌశాంబి యనుపేరఁ గావించెఁ బురము
దశరథాత్మజ మహోదయమనుపురము, కుశనాభుఁ డొనరించెఁ గుశలుఁడై ధరణి
శూరుండు ధూర్తరజుండు నిర్మించె, నారంగపురము ధర్మారణ్య మనఁగ
వసువు నిమ్ముల గిరివ్రజ మనుపేరఁ, బసనుగా నిర్మించెఁ బట్టణం బొకటి
యిది ప్రీతి నవ్వసుఁ డేలుదేశంబు, మదమంది గిరులైదు ముందఱ నొప్పె
నానగమధ్యంబునందును మాగ, ధానామమున నొక్కతటిని చెన్నొందుఁ
జాల నమ్మగధదేశం బెల్ల వసువు, పాలించుచుండును బరమధర్మమున
నచ్చెరు వడరంగ నా కుశనాభుఁ, డచ్చరలేమ ఘృతాచియం దెలమిఁ
గన్నులు మరునంపగములు నానొప్పు, కన్నెల నూర్వురఁ గడురూపవతులఁ
గనియె నత్తరుణులఁ గమనీయకాంతి, వినుతయౌవనకళావిస్ఫూర్తు లమర
మంజీరమేఖలామధురవాచాల, మంజులకంకణమధుశింజితములు
కర మొప్పఁగాఁ దాళగతులనఁ గూడి, మెరయు లీలాలాస్యములు సల్పువారు
మురిపెంబు లింపార మొగి మృదంగాది, వరవాద్యములు వేడ్క వాయించువారు
పాణిపల్లవలఘుస్ఫారితలీల, వీణామృదుక్వ[illegible] గాఁగ
మాకందమంజులమధుపానమత్త, కోకిలధ్వనిఁ గూడికొని పాడువారు
నగుచు నుద్యానంబునందుఁ గ్రీడింపఁ, దగిలి యాచెలువలఁ దప్పక చూచి
కామాంధుఁడై సర్వగతుఁడైన పవనుఁ, డామానినులఁ జూచి యర్థితోఁ బలికె
మానినీమణులార మఱి వినుఁ డింక, బూని చెప్పెద మీకుఁ బొసఁగంగ నిపుడు
నన్ను వరింపుఁడు నలినాక్షులార, చెన్నార నమరత్వసిద్ధిఁ గైకొనుఁడు
ఎన్నఁడు జరలేనియొలజవ్వనంబు, నున్నతయశము మీకొప్పారఁ గలుగు
ననిన నల్లన నవ్వి యనిలుండ వఖిల, జనహృదయంబులఁ జరియింతు వీవు
నీవెఱుంగుదు మమ్ము నీమహత్త్వంబు, భావింప కిది యేమి పలికెద వకట
నియతుఁడై వర్తించు నిర్మలధర్మ, నయశీలుఁ డగుకుశనాభుకూఁతులము
ఓడక మాతండ్రియుండ మాయంతఁ, గూడుట యటు సేయఁ గులహానిగాదె
యిరవార మాతండ్రి యెవ్వరి కిచ్చుఁ, బరికింప నాతఁడు పతి మాకు ననినఁ
బవనుఁడు కోపంబు పట్టలేకప్పు, డవయవంబులఁ జొచ్చి యాతలోదరులఁ
గుదియంగ విగిచినఁ గుబ్జలై తండ్రి, కదియొల్ల నెఱఁగింప నందఱు వచ్చి
విన్ననై పదసారవిందముల్వ్రాంచి, సన్నిధి నిలిచి బాష్పములు నించుటయుఁ
గుశనాభుఁ డప్పు డాకూఁతులకైన, దశ చూచి వెఱఁగంది తా వారి కనియె
నిట్టిరూపములు మీ కేలనాగలార, యెట్టుగాఁ బాటిల్లె నెవఁ డిట్లు సేసె
మీ రేల పలుకరు మీ రీతి కేమి, కారణం బనవుడుఁ గరములు మొగిచి
తమతండ్రితోడ నాధవళాక్షు లనిరి, మముఁ జూచి పవనుండు మానంబు విడిచి
నన్ను వరింపుఁడు నలినాక్షులార, యన్న నామాటకు నోఁ గాక యనక
మాతండ్రి నడుగు మీమాట నీవనిన, నాతండు కామాంధుఁడై యల్గి మమ్ము
గుబ్జలఁగాఁ జేసెఁ గ్రూరాత్ముఁ డనిన, నబ్జలోచనలతో నాతఁ డిట్లనియె

తగవును ధర్మంబుఁ దలపోసి మీరు, తగదని శీలంబు దాఁట నోడితిరి
కన్నియలార మీగౌరవంబులను, నున్నతసత్కీర్తి నొందెదె కులము
దేవతావిషయమై తెగి యొల్లరైతి, రీవిధి మీరు సహించుటే లెస్స
క్షమయె సత్యంబును క్షమయె శీలతయు, క్షమయె తపంబును క్షమయె కీర్తిఁ
క్షమయె ధర్మంబును క్షమయె లోకంబు, నమరంగ రక్షించు నని విచారించి
తనమంత్రివరులతోఁ దలపోసిచూచి, యనఘాత్ముఁ డగుచూడి యనుమునీంద్రు

విశ్వామిత్రుఁడు తనవంశక్రమంబు దెలుపుట

దనుజన్ముఁ డగుగుణోత్తరు బ్రహ్మదత్తుఁ, డనువాని రప్పించి యమ్మహాత్మునకు
ధర్మపత్నులుగాఁగఁ దనదుకన్నియల, నిర్మలబుద్ధిమై నెమ్మి నిచ్చుటయు
చూడిపుత్త్రుఁడు వారిఁ జూచి కైకొనఁగ, వీడె నానూర్వురవికృతరూపములు
అవనీశ యదిమొదలాపురోత్తమము, అవనిఁ గన్యాకుబ్జమను పేరఁ బరఁగె
నాకుశనాభుండు నప్పుడొప్పారు, నాకృతుల్ గల తనయలఁ గనుంగొనుచు
నలరి యాకూఁతుల నల్లుని ననిచి, యొలమిమైఁ బుత్త్రకామేష్టి గావింపఁ
గొడుకైన కుశనాభుఁ గుశుఁడు వీక్షించి, పడసెదు పుత్త్రునిఁ బరమధర్మాత్ము
వినుతనిర్మలకీర్తి విఖ్యాతు గాధి, యనుపేరు గలపుణ్యు నని యొక్షగించి
పరమప్రియంబున బ్రహ్మలోకమున, కరిగె నాకుసుమన్నఁడై పుట్టె గాధి
దశరథాత్మజ గాధితనయుండ నేను, కుశవంశమునఁ గౌశికుండండ్రు నన్ను
మతిధర్మనిష్ఠార్థ మాయక్క సత్యవతి భక్తిమై సురేశ్వరలోకమునకు
వేడుకఁ దనప్రాణవిభుఁడైన ఋచికు,తోడ శరీరంబుతోడఁ దా నరిగి
యీలోకమున లోకహిత మాచరింపఁ, బ్రాలేయపర్వతప్రాంతదేశమున
నలిఁ గౌశికీనామనది యయ్యెఁ దాను, వెలయ నన్నదిచెంత విహరింతు నేను
సిద్ధాశ్రమముఁ బ్రవేశించినకతన, సిద్ధంబు గాఁ దపస్సిద్ధుండ నైతి
నాదినుండియు మదీయాన్వయస్థితియు, నీదేశవిధమును నేర్పడ వింటి
నడురాత్రి యరుదెంచె నరలోకనాథ, కడు డస్సినాఁడవు కనుమోడ్తుగాక
చలియింపకున్నవి సకలవృక్షములు, మెలఁగవు వనభూమి మృగసమూహములు
నెఱి విహంగంబులు నీడముల్ చేరి, మఱచియున్నవి తమ మంజులధ్వనులు
యామినీచరులైన యక్షరాక్షసులు, భూమి విచ్చలవిడిఁ బోరిఁ జరించెదరు
దీటుగఁ జీఁకటి దెసలు నాకసము, కాటుకఁ బూసినకరణి నున్నదియు
నీలాంబరంబున నిండుముత్తెములు, గీలించి బ్రహ్మాండగేహగోళమునఁ
గడు నొప్పుగా మేలుకట్లిత్తినట్లు, యుడుగణంబులతోడ నున్నది నింగి
యడరంగ జనులను నానందమొదవ, నుడురాజు పొడతెంచుచున్నాఁడటన్న
నామాటలకు మెచ్చి యఖిలసంయములు, నామునీంద్రునితోడ నని రవ్వ డలరి
నెఱియ నీవంశంబు నిర్మలం బనఘ, గుఱి లేనిమహిమ నీకులమువారెల్ల
బ్రహ్మసమానులు పరికింప నీదు, బ్రహ్మవర్చసమును బరికింప నొప్పు
ననిన విశ్వామిత్త్రుఁ డమ్మునీశ్వరుల, వినుతించె నంత భూవిభులు సంయములు

నా రాత్రి నిద్రింప నాప్రభాతమున, నాఋషిపుంగవు లాగాధిసుతుఁడు
జననాథ నిద్రయుఁ జాలింపు మనిన, విని తేజి పూర్వాహ్ణవిధు లాచరించి
కౌశికుఁ జూచి యగాధమై చూడ, నీశోణనదకత్న మింత యొప్పగునె
యాకీర్ణమీనంబు నతిరమణీయ, సైకతంబును సుప్రసన్నతోయంబు
పరిచితహరితాదిపక్షిసంఘమ్ము, తరుణనీలోచ్చ్వలత్తరళతరంగ
మై యున్న దీయేఱు ననఘాత్మక మన, మేయెడ దాఁటున మెత్తెఱం గనినఁ
దలుచుగా మును లెల్లదాఁటెడుమార్గ, మెఱిఁగిపోద మటంచు నెడదవ్వుపోవఁ
గలహంససారసకారండవాది, జలపక్షిరవములు సరిదమ్ముఁ బిలుచు
విధమునఁ జెలఁగంగ వీను లింపార, నధిపుఁ డాలించి మధ్యాహ్నకాలమున
సిద్ధమునీంద్రసంసేవ్యతీరమును, శుద్ధపుణ్యోదకసుప్రవాహమును
గలిగి నదీతిలకంబై ధరిత్రిఁ, బొలుపారుజాహ్నవిఁ బొడగాంచి మ్రొక్కి
గాధేయు చూడ నగాధమై తోఁచు, నాధునీరత్నంబు నఁట దాఁటిపోవ
దెరు వింక నెయ్యది దెలుపవే యనిన, నరనాథ యట శోణనద ముత్తరించి
మొగిమూఁడుయోజనమ్ములు దాఁటిపోవ, నగు నమ్మహానది యందాఁక మనకుఁ
దోయఫలాదులు ద్రోవఁ బెక్కనుచు, నాయేఱు దాఁటి వారటుపోవుచోటఁ
జెలఁగుసారసగుణసేవ్యమై పుణ్య, సలిలమై యుత్ఫుల్లజలజమై మిగుల
ఫేనమై నిత్యగంభీరమై చారు, మీనమై యతిపుణ్యమిళితమై యమరు
గంగాతటంబున ఘనలతాసంఘ, సంగతంబగు సమస్థలమున నిలిచి
మనుజేంద్రతనయులు మాధ్యాహ్నికంబు, లొనరించి ముదమందియుచితభోజ్యముల
నోజమై మునిగోష్ఠి నొప్పుచున్నంత, రాజన్యతిలక మా రామచంద్రుండు
రాజహంసోద్ధూత రాజీవరేణు, రాజీవరాజితరంగత్తరంగ
గంగ నాలోకించి కౌశికుఁ జూచి, గంగ యీవసుధ కేక్రమమున వచ్చె
నే తెఱంగునఁ బోయె నిట నాకమునకుఁ, బాతాళమునకు నెబ్బంగిఁ దా నరిగె
నేచి పారావార మేగతిఁ జొచ్చె, నేచందమునఁ బుట్టె నిమ్మహాతటిని
చెప్పవే యనవుడు శ్రీరాముఁ జూచి, యప్పుణ్యధనుఁడు విశ్వామిత్రుఁ డనియెఁ
గమనీయకాంతులు గలరూపవతులు, హిమవంతునకుఁ గూతు లిరువురు గలరు
అమరులందఱు గూడి యాగంబుకొఱకు, హిమవంతు వేఁడి యీయిద్దఱిలోన
గురుపుణ్య యగు పెద్దకూఁతును గంగ, నరుదారఁ గొనిపోయి రటనాకమునకు
నటమీఁదఁ బార్వతి యనుపిన్నకూఁతుఁ, బటుతపోనిష్ఠతోఁ బరితృప్తుఁడైన
ఫాలలోచనునకుఁ బత్నిగా నిచ్చె, నాలోలలోచన నానగాధిపుఁడు
సురుచిరరుచి గంగ సురలోకమునకు, నరిగి తా సురనది యనుపేరఁ బరఁగె
ననిచెప్పి మునినాథుఁ డవనీశుఁ జూచి, వినుము వృత్తాంతంబు వెండియు నొకటి

### కౌశికుఁడు కుమారస్వామిజననము చెప్పుట

పార్వతి వరియించి పరమానురక్తి, సార్వకాలంబును జంద్రశేఖరుఁడు
అతిలోకగతిలోలుఁడై దివ్యవర్షశతము దా రతికేళి సలుపుచున్నెడను

కమలాసనుం డాదిగా సర్వసురలుఁ, దమలోన నెంతయుఁ దారు చింతించి
వెలయ నీయుగ్రపుర విషయ తేజంబు, దలఁప నెవ్వరికైన ధరియింపవశమె
యనుచు నందఱు నమ్మహాదేవుకడకుఁ, జనుదెంచి వినతులై సద్భక్తితోడ
దేవదేవ మహేశ దేవ సర్వేశ, దేవనిస్తారక దేవ నీ మహిమ
సర్వగీర్వాణులు సన్నుతించెదరు, సర్వజ్ఞ మాకుఁ బ్రసన్నుండవగుము
యేపార నీతేజ మెవ్వరు దాల్ప, నోపుదు రటుగాన నుడుగు మీవిధము
కరుణఁ దపోవృత్తిఁ గైకొని మీరు, పరిబ్రహ్మచర్యంబు చరియింపవలయు
ననవుడు నోఁగాక యనుచు నాసురలఁ, గనుఁగొని ముదముతో గౌరీశుఁ డనియె
జలియించె నిదె నిజస్థానంబువలన, నెలకొని మీలోన నిర్జరులార
యెవ్వరు దాల్చెద రీతేజ మనిన, నివ్వసుంధర దాల్చు నింపార ననిరి
హరుఁడు నాసురలతో నోఁగాక యనుచు, ధరణిపైఁ గావించెఁ దద్వీమోఘణము
దివిజు లయ్యెడ నగ్నిదేవు నీక్షించి, పవనునితోఁ గూడి పావక నీవు
ఇలమీఁదఁ బడియున్న యిమ్మహాతేజ, మెలమిఁ బ్రవేశింపు మింపార ననిన
స్వవశంబుగా నట్టి శర్వతేజంబు, పవనపావకులును భరియింపలేక
యంగజహరువీర్య మప్పుడు వేగ, గంగ లోఁగొననిచ్చెఁ గసమర్థితోడ
నిచ్చిననాయింతి యిరవొందగాను, మచ్చిక ధరియించె మహిత రెట్టింపఁ
దనవిభుతేజ మత్తఱిఁ దాల్పలేక, తనమది భయమంది తత్తఱపడుచు
గంగాతరంగముల్ గదము భీతిల్లి, పొంగెల్ల నడఁగుచుఁ బొదలుచునపుడు
చిత్తసంక్షుభితయై శీఘ్రంబుగాను, దత్తీరదేశంబుఁ దాఁజేర్చుటయును
శరవణంబునయందుఁ జయ్యనఁజొచ్చి, చిరతరంబున నందుఁ జెల్వొందుచుండె
నప్పుడు ఋషిపత్ను లందఱుఁగూడి, యొప్పుగాఁ దమతమ యుచితకృత్యములు
తప్పక తీర్పంగఁ దా వేఁగుదెంచి, రప్పుడు నార్యుఁడు నాగంగఁ జొచ్చి
తోయంబులాడుచుఁ దొడరి వేవేగ, పాయక శరవణభవ్యస్థలమునఁ
ద్రేతాగ్నులనుబోలి తేజరిల్లుచును, బ్రాంతిగాఁ బ్రచురమై పరఁగుచు లెస్స
నున్నవి యీయగ్ను లొండొరుల్ మనము, చెన్నారఁ జలిచేతఁ జిక్కి స్రుక్కితి
మన్నన లింపొంద మనము నిచ్చుటను, గ్రన్నన చేకొనఁ గడఁగుద మనిన
నీశ్వరతేజంబు నిరవొందఁ బుచ్చి, శాశ్వతంబుగ ధర సత్కీర్తి వెలయ
జాతవేదునిఁ జేరఁ జనిన యింతులకు, నాతతంబుగఁ జూచినట్టి యింతులకు
నిర్భరవృత్తిమై నిలిచె గర్భములు, గర్భిణులై వారు కర మొప్పుచున్న
బహుభీత లగుచు నాభామిను లపుడు, తహతహపడి మతి తన్మయత్వమునఁ
దమతమయిండ్లకుఁ దారర్థి నరుగ, శమితాత్ము లగుమునిసంఘంబు లప్పు
డంత నావృత్తాంత మాయోగదృష్టిఁ, జింతించి మును లలచెలువల కనిరి
మీసత్యశీలత మీఁదుగర్వంబు, మీసౌఖ్య మిప్పుడు మిమ్మింత చేసె
ననుచు నాగ్రహమున నవనిఁ గంపింప, వనితలమీఁద నవార్యకోపమున
మతిహీనులరు మిమ్ము మన్నింపనేల, పతిదూరు లగుఁడంచుఁ బల్కిన వినుచు

మగుడ జాహ్నవిఁ జేరి మగువలందఱును, దగునమ్మ నీ కిది తగునంచుఁ బలికి
తమతమబాహులతాడనంబులును, దమగర్భములమీఁదఁ దగఁ జేసిరోగిని
గరతాడనంబులఁ గలఁగి కంపించి, కరమొప్ప గర్భముల్ గరఁగి విచ్ఛిన్న
గర్భంబులై యప్డు కాంతలవలన, నిర్భయంబున జాఱి నెఱయంగ నప్పు
డాఱుఖండంబులై యవనిపైఁ బడియె, జాఱిన యాఖండచయము గ్రహించి
శరవణంబునయందుఁ జయ్యనఁ బెట్టి, యరు దలరఁగ లేచి యాతలోదరులు
తపమున కరిగిరి తద్దయుఁ బ్రీతి, నుపమింప నటఁ జాల నుగ్రవీర్యంబు
కవగూడి వృద్ధియుఁ గడుఁగల్గఁజాల, నవనిపై శ్వేతాద్రి యనఁ గడునొప్పె
నరయ నాశైలంబునందుఁ గుమారుఁ, డరుదార జన్మించె నతనితేజమున
జననప్రదేశంబు శరవణం బగుట, జననాథ యతఁడొప్పె శరజన్ముఁ డగుచు
నిలఁ గృత్తికలు చన్నులిచ్చుటఁ జేసి, యలరుచుఁ గార్తికేయాఖ్యఁ జెన్నొందె
నారయ నమ్మాత లార్వురుగాన, వారు సంతోషింప వదనంబు లాఱు
ధరియించి సముచితస్తన్యపానంబు, సరినొప్పఁ జేయుట షణ్ముఖుం డయ్యెఁ
దరుణేందుమౌళి రేతస్కందమునను, నరుదారఁగా స్కందుఁ డననొప్పె నంతఁ
బరువడిఁ దమ సురల్ ప్రణుతింప నెఱఁగి, గిరిపుత్త్రి కన్నులఁ గెంపారఁ జూచి
సురలార సంతానశూన్యత మీకు, ధరణికిఁ గానిమ్ము ధరణికి నింక
బహునాయకత్వంబు పాటిల్లనిమ్ము, బహువిధంబుల నని పలికెఁ గోపించి
కలఁగిరి సురలంతఁ గౌరితోఁ దపము, సలుప హేమాద్రికిఁ జనియె నీశ్వరుఁడు
అమరేంద్రుఁడాదిగా నఖిలదేవతలు, కమలసంభవుఁ డున్నకడకుఁ దా మేఁగి
జలజసంభవ భుజాసత్త్వసంపన్ను, నెలమి సేనాపతి నిమ్ము మా కనిన
వారిజగర్భుండు వారి నీక్షించి, గౌరీశసుతుఁ డైన కార్తికేయుండు
సేనాధిపత్యంబు సేయు మీ కనిన, నానిలింపులు వేడ్క నౌఁగాక యనుచుఁ
జేకొన నాతఁడు సేనాని యయ్యె, నాకనాయకున కున్నతసౌఖ్య మెసఁగ
నని పల్క రఘురాముఁ డధికసంతోష,మునుబొంది మఱియు నమ్మునినాథుఁ జూచి
యీమహానది సంయమీశ్వర త్రిపథ,గామిని యగు టేమి కారణం బనిన
ననఘుండు కౌశికుఁ డారాముఁ జూచి, విను మని యాకథ వివరింపఁదొడఁగె
ననఘుఁ డయోధ్యకు నధిపుఁడై సగరుఁ, డనుచక్రవర్తి యాయతకీర్తి గలఁడు
హిమవంతమున నాతఁ డిచ్ఛలో సుతులఁ, దమకించి భృగుగూర్చి తపమాచరింప
నంత నాభృగుఁడును నాతపంబునకు, సంతుష్టహృదయుఁడై సగరు నీక్షించి
పృథివీశ కొడుకులు పెక్కండ్రు నీకుఁ, బ్రథితోరుకీర్తులు పరఁగఁ బుట్టెదరు
అంచితకీర్తిని నతివలం దొకతె, గాంచు నొక్కని వంశకరుఁడైనపుత్త్రు
మఱియొక్కసతిగాంచు మానుగా సుతుల, నఱువదివేవుర నతులవిక్రముల
నని వరం బిచ్చిన నారాజసతులు, విని కరంబులు మోడ్చి వినయంబుతోడ
మునినాథునకు మ్రొక్కి ముదమంద నొక్క,తనయుఁడే సతికన్న తనయులేసతికి
ననవుడు మీకోరినట్లపుఁ బుత్త్ర, జననంబు లని పల్కి సంతోష మంది

యందగ్రమహిషి నిజాన్వయరుచిక, నందను నొక్కని నరనాథుఁ గోరె
మఱి గోరె నాయున్న మగువయు సుతుల, నఱువదివేవుర నధికమోదమున
సగరుండు భృగునకు సతులతోఁగూడ, నొగిఁ బ్రదక్షిణ మంత నొనరించి ప్రీతిఁ
బురమున కేతెంచి పొలుపార నంతఁ, గరము వేడుకఁ గొంతకాలంబు చనఁగ
మానుగాఁ దనయగ్రమహిషి కేశినియు, సూనుని నసమంజసుం డనువానిఁ
గనియె నాసుకృతియుఁ గాంతకుఁ బుట్టె, ఘనతరంబైనట్టిగర్భతుంబంబు
కఱకైన యాసారకాయలోఁ బుట్టి, రఱువదివేవు రత్యద్భుతలీల
నంత దాదులు వారి నాజ్యభాండములఁ, గొంతకాలము పెంపఁ గొమరారి వారు
రూపయౌవనముల రూఢిమైఁ బెరిఁగి, రాపెద్దవాఁ డందు నతులదర్పమున
వాపోవఁ దమ్ముల వడిఁ జుట్టి పట్టి, చాపలంబునఁ గట్టి సరయువులోన
వైచిన నవ్వుచు వచ్చిన మగుడఁ, ద్రోచుచునుండు నాదుష్టాత్ముఁ డైన
యసమంజసున కంత నంశుమంతుండు, దెసలఁ దేజంబులు దీపింపఁ బుట్టె
నాయసమంజసుం డతిదుష్టచిత్తుఁ, డై యున్ననతనిఁ బోనడఁచి యారాజు

శ్రీరాముఁడు సగరులవృత్తాంతముఁ దెల్పు మనుట

శాశ్వతధర్మనిష్ఠాపరుం డగుచు, నశ్వమేధముసేయ ననురక్తిఁ దొడఁగె
ననినఁ గౌశికుఁ జూచి యారాముఁ డనియె, మునినాథ మావంశములవారికథలు
విన వేడ్కపుట్టెడు వివరించి చెప్పు మనిన విశ్వామిత్రుఁ డనియె రామునకు
విడువక హిమశైలవింధ్యశైలముల, నడుమ నాసగరుజన్నంబు వర్తించె
యాగంబుచేరువ నంశుమంతుండు, రాగిల్లి యశ్వంబు రక్షించునెడను
ననిమిషపతి దైత్యుఁడై మ్రుచ్చిలించి, కొనిపోయి పాతాళకుహరంబు సొచ్చి
కపిలసంయమిచెంతఁ గడఁకతోఁ గట్టి, యపరిమితానందుఁడై పోయె దివికి
భూపాలుఁ డశ్వంబు పొడగాన కిచ్చఁ, గోపించి మండుచుఁ గొడుకులఁ జూచి
యిటఁ గాన మశ్వంబు నెవ్వఁడో వచ్చి, కుటిలుఁడై మ్రుచ్చిలి కొనిపోయినాఁడు
మూఁడులోకంబులు మునుమిడి వెదకి, వాఁడెవ్వఁడైనను వాని నిర్జించి
తెండు గుఱ్ఱము వేగ తెగువమైఁ గడఁగి, పొండన్న సాగరుల్ భుజశక్తి మెఱసి
నెఱసి బ్రహ్మాండంబు నిండ గర్జించి, యఱువదివేవురు నాప్రొద్దె కదలి
యానాకమర్త్యంబు లంతయు వెదకి, కానక ధరణి వ్రక్కలుసేయఁ దొడఁగి
యొక్కొక్కఁడొక్కొక్కయోజనం బుర్వి, నక్కజంబుగఁ ద్రవ్వఁ దని యేర్పఁ
పరువడి పూర్వదిగ్భాగంబు దొడరి, ధర ప్రదక్షిణముగాఁ ద్రవ్వద మనుచుఁ
బోరిఁబోరిఁ గుద్దాలభూరిశూలముల, ధర రసాతలమునందాఁకఁ ద్రవ్వుచును
బాతాళవాసులఁ బ్రకటసత్త్వముల, భూతసంతతులఁ జంపుచుఁ జెలంగుచును
వెస నప్పు డఱువదివేలయోజనము, లసమునఁ ద్రవ్వి రాయసమానబలులు
భూరిసత్త్వముల జంబూద్వీప మిట్లు, వారక దిరిగి రావడిఁ ద్రవ్వ వెఱఁగి
యమరగంధర్వసిద్ధాదులు బెదరి, కమలగర్భుం డున్నకడ కేఁగి మ్రొక్కి
వనపర్వతద్వీపవతి యైనభూమి, చని త్రవ్వుచున్నారు సగరనందనులు

బలువడి సత్త్వసంపన్నంబులైన, జలచరంబులఁ బట్టి చంపుచు మఱియు
వీఁడు యజ్ఞమునకు విఘ్నంబుఁ జేసె, వీఁ డశ్వహారుఁడంచు విడువక పట్టి
బలియురై తమదృష్టిఁ బడువారి నెల్ల, జలజసంభవ వృథా చంపుచున్నారు
దలఁచి నీవిధి సమాధానంబు సేయ, వలయు నన్నను బ్రహ్మ వారితో ననియెఁ
గపిలమునీంద్రుఁడై కైకొన్నవాఁడు, తపము నవ్యయుఁడునై దామోదరుండు
అమ్మునికోపాగ్ని యందంద వారిఁ, గ్రమ్మ భస్మంబు గాఁగలవార లింక
నని పల్క సురలెల్ల నౌఁగాక యనుచుఁ, జని రంత నక్కడ సగరనందనులు
పిడుగులఁబోలెడు భీకరధ్వనులు, కడుమ్రోయ నిలఁ బ్రదక్షిణముగాఁ గలయఁ
జొట్టును ద్రవ్వి యెచ్చోట ఘోటకము, పట్టుగానక తండ్రిపాలి కేతెంచి
యశ్వంబు పొడగాన మఖిలంబు వెదకి, యశ్వచోరునిఁ గానమైతిమి దేవ
యేమేమి సేయుదు మిటమీఁద ననిన, భూమీశుఁ డలిగి యాపుత్త్రుల కనియె
విశ్వంబు కలగొని వెదకి నాయెదుట, నశ్వంబుఁ దేక మీ రరుదేర వలవ
దని పల్క నౌఁగాక యనుచు నాసగర,తనయు లుద్ధతి రసాతలమున కరిగి
యెలమి శిరఃకంప మలుకఁగావించి, తలకొని యందంద ధరణి కంపింప
దొరఁకొని యందఱు తూర్పుదిక్కెల్ల, నరసి గుఱ్ఱముఁ గాన కచ్చోట సకల
ధారణీమండలోద్ధరణముకుంద, చారుభుజాదండసముదండకాండ
చతురగ్రముల ధరాచక్రంబు మోవఁ, జతురతగల శుభ్రసామజేంద్రంబుఁ
బొడగాంచి సంప్రీతిఁ బూజించి యచటఁ, దడయక మఱి బృహద్భానుదిక్కునకుఁ
బోయి నానావిధంబుల నందు వెదకి, యాయశ్వరత్నంబు నందుఁ జొప్పడక
సతతదానచ్ఛటాసమ్మదామోద, ధృతశిలీముఖపుండరీకాఖ్యగజముఁ
గనుఁగొని పూజించి కడువేడ్కతోడ, వినుతించి యవ్వలి వెదకుచు యామ్య
భాగంబునకు నేఁగి పరికించి హయము, లా గొకింతైనను లక్షింప లేక
ఘనతరత్వము త్రివిక్రమునాక్రమించు, ననిమించు వామనం బను దంతిఁ గాంచి
యర్చించి యవ్వలి కరిగి నైరృతిని, జర్చించి యందు నశ్వము గానలేక
కుముదమార్దవమునఁ గుముదవర్ణమునఁ, గుముదంబు నా నొక్కకుంజరేంద్రంబుఁ
గని నమస్కారంబు గావించి యవలఁ, జనిచని పశ్చిమాశాప్రదేశమున
శోధించి తురగంబు చొప్పింతయైన, సాధింపలేక యంజనశైల మనఁగ
రంజితమదనిర్ఝరంబులు గలిగి, యంజనం బను నేన్గు నచ్చోటఁ గాంచి
వివిధసత్కృతులు గావించి యామీఁదఁ, బవనుని దెస కేఁగి బహువిధంబులను
నెమకి గుఱ్ఱముఁ గాననేరక యచట, నముచిసంహారవారణప్రతిమాన
దంతమయ్యును బుష్పదంతాఖ్యఁ బరఁగు, దంతి నీక్షించి మోదమునఁ బూజించి
యటఁబాసి చని కుబేరాశాంతరమునఁ, దటుకున నరసి సైంధవముఁ గానంగ
లేక యచ్చట నొక్కలేఖాధినాథ, లోకగజాధిప లోకైకసార్వ
భౌమమో యన సార్వభౌమాభిధాన, సామజేంద్రము గాంచి సద్భక్తి మ్రొక్కి
సార్వభౌముని పుత్త్రసంఘంబు గదలి, శర్వుని దెస కేఁగు సమయంబునందు

ననతిదూరమున హుతాగ్నినిఁబోలి, కనుఁగవమోడ్చి యేకతము గూర్చుండి
తననిష్ఠ పెంపునఁ దపమాచరించు, ననఘాత్ముఁ గపిలమహామునిఁ గాంచి
యతని చెంగట నున్న హయము వీక్షించి, యతని భర్జించిన నతఁ డుగ్రదృష్టి
నఱిముఱి సగరుల నలిగి చూచుటయు, నఱువదివేవురు నట భస్మమైరి

## అంశుమంతుఁడు అశ్వరాజముఁ దెచ్చుట

కొడుకు లయ్యశ్వంబుఁ గొనిరాక చాలఁ, దడసిన సగరుండు తాపంబు నొంది
మనుమని నయ్యంశుమంతుఁ బంపుటయుఁ, జని యంశుమంతుఁ డాజాడనే పోయి
యమరేంద్రుదెస విరూపాక్షుంబు గాంచి, సముచితస్థితి నమస్కరణ మొనర్చి
మాతంగపుంగవ మాపినతండ్రు, లేతెంచి రెటుపోయి రెం దున్నవారొ
తురగచోరకుఁ డెందుఁ దూఱినవాఁడొ, వరుస నీ వెఱిఁగింపవలయు నా కనిన
నాదిగ్గజాధీశుఁ డాయంశుమంతు, నాదరంబునఁ జూచి యప్పు డిట్లనియెఁ
బ్రియమార నొక్కెడఁ బృథివీశతనయ, హయముఁగాంచెదవన్న నేఁగాక యనుచు
నున్న [1]దిక్కరులను నొగి దాఁటిదాఁటి, యన్నిటి నిబ్భంగి నడుగంగ నవియుఁ
బరువడి తా మిట్లు పలుకంగ వినుచు, నరిగి యాముందర నశ్వరాజంబు
నరయుచుఁ గపిలసంయమిపొంతఁ గనియె, సరిప్రోవులై యున్న [2]సగరభస్మములు
కని చాల శోకించి కరఁగి తండ్రులకుఁ, బొనరఁ దిలోదకంబులు వోయ వెదకి
యుదకంబు గానక యున్న యయ్యెడను, సదయుఁడై గరుడుండు సనుదెంచి పలికెఁ
గపిలుని నలుకమైఁ గలఁచి యమ్మౌని, కుపితాగ్ని సాగరుల్ కూలి నీఱైరి
యిదియేల శోకింప నిటు శోకమంద, నిది వేళగా దొక్క టేర్పడ వినుము
సరసిజాసనవంద్యచరణారవిందుఁ, డరవిందదళనేత్రుఁ డాదిపూరుషుఁడు
బలిదానవేశ్వరు బంధించునప్పు, డలుకఁ ద్రివిక్రముఁడై నిండఁ బెరిఁగి
యగణితశక్తి రెండడుగులయందు, జగతీతలం బెల్ల సరి నాక్రమించి
జలజాతజలచరశంఖచక్రమ్ము, లలవడునట్టి మూఁడవపదాంబుజము
కడుకొని బ్రహ్మలోకముదాఁకఁ జాఁపఁ, గడు వేగమున వచ్చి కమలసంభవుఁడు
తలకొన్న భక్తితోఁ దనకమండలువు, జలములఁ దత్పాదజలజముల్ గడిగెఁ
బొగడొందఁ దజ్జలంబులు నభోవీథి, దగిలి వర్తించు మందాకిని యనఁగఁ
గావున నీవింకఁ గమలసంభవుని, భావించి తప మతిభక్తిఁ గావించి
కడకమై నాకాశగంగఁ దోడ్తెచ్చి, తడయక భస్మముల్ తడిపినఁగాని
పరలోకసుఖములు వడయరు వారు, గురుబుద్ధిఁ దురగంబు గొని యేఁగుమనినఁ
దురగంబు గొనిపోయి తొడరి యంతయును, దరమిడి యాతఁడు తమతాతతోడఁ
జెప్పిన శోకించి చేయఁ గైకొన్న, యప్పుణ్యమఖము సమాప్తంబు చేసి
కామించి యాకాశగంగ నీయుర్వి, కెమ్మెయి దెత్తునో మే నంచుఁ జింత

1 దిగ్గజములు. 2 సగరమహీప, తనయులవౌ భస్మతతుల వీక్షించి, జనకులవే యంచు స్వాం సుం దెంచి.

విడువక ముప్పదివేలేండ్లు తపము, పుడమి నెంతయుఁ జేసి పోయెను దివికి
నారాజుమనుమఁ డయ్యంశుమంతుండు, ధారుణి గంగకుఁ దప మొప్పఁబూని
వరుస ముప్పదివేలవర్షము ల్సలిపి, పరలోకగతుఁడయ్యెఁ బదపడి యతఁడు
ఆతనిపుత్త్రుఁడు దిలీపావనీనాథుఁ, డతినిష్ఠతోడ జాహ్నవిఁ దెత్తు ననుచు
విడువక ముప్పదివేలేండ్లు తపము, గడపియు నతఁడు రోగములచేఁ జచ్చె
ననఘుఁ డాతనిపుత్త్రుఁ డగుభగీరథుఁడు, దనరాజ్యమునయఁ బ్రధానుల నిల్పి
సారధర్మజ్ఞులు సద్గుణోజ్జ్వలులు, శూరులు నగునట్టిసుతులను గోరి
యొల్లపాపంబుల నిలఁమీఁదఁ బాపఁ, దెల్లంబుగాఁ గంగఁ దెచ్చెద ననుచుఁ
గరమర్థిఁ దపము గోకర్ణాశ్రమమున, నరుదుగాఁ బదివేలయబ్దము ల్సేయ
ననుపమంబుగసాగు నాతపంబునకు, వనజసంభవుఁ డంత వరదుఁడై వచ్చి
యడుగుము వర మన్న నాభగీరథుఁడు, కడుభక్తి బ్రహ్మకుఁ గరములు మొగిచి
భారతీనేత ప్రపంచనిర్మాత, సారలోకత్రాత సత్యసంఘాత
ధాత మాతాత లుదగ్రులై వచ్చి, యాతతకపిలుకోపాగ్నిచేఁ గ్రాగి
నూఱువేలేండ్లు సన్నుతగతిలేక, నాఱడిపడి భస్మమై యున్నవారు
కడఁగి యాభస్మముల్ గంగోదకములఁ, దడుపక గతిలేదు దయసేయు మనిన
హరుఁ డొక్కరుఁడు దక్క నన్యు లాగంగ, ధరియింప నేరరు దగిలి యెవ్వరును
నీవింక హరుఁ గూర్చి నిష్ఠమైఁ దపము, గావించి ప్రార్థింపు గంగ ధరింప
ననిపల్కి మదిలోన నతఁడు ప్రార్థించు, తనయులనిచ్చి యద్ధరణీశుకొఱకుఁ
దనరంగ నాగంగ ధర కేఁగు ననుచుఁ, జనియె పద్మజుఁ డటఁ జని భగీరథుఁడు
అంగుష్ఠ మొక్కటి యవనిపై మోపి, యంగజహరుఁ గూర్చి యతిఘోరతపము
[1]దలకొని చేయఁ బ్రత్యక్షమై శివుఁడు, తలఁదాల్తుఁ దెమ్ము మందాకిని ననియె
నంత భగీరథుం డర్థిఁ బ్రార్థింప, నంతరిక్షస్థలమందుండి గంగ
గగనమండలము నక్షత్రమండలముఁ, బగుల లోకములెల్లఁ బగుల మ్రోయుచును
గులపర్వతములతోఁ గుంభినితోడ, బలసి మహాదేవుఁ బాతాళమునకుఁ
గొనిపోవుతెఱఁగున ఘోరమై పర్వి, చనుదెంచు నురవడి జగములు బెదర
వచ్చునాగంగగర్వముఁ బాప శివుఁడు, హెచ్చి జూటముఁ బెంచె నింతలో గంగ
వచ్చి మహాదేవు వరజటావీథిఁ, జొచ్చి వెల్వడుత్రోవ చొప్పడకున్న

### భగీరథుఁడు గంగను దెచ్చుట.

హరుజటాజూటమహాటవిఁ జిక్కి, తిరుగుడుపడుచు వర్తించుచునుండె
నంత భగీరథుం డతులప్రవాహ, మంతయు నిప్పు డెం దరిగెనో యనుచు
వెఱగంది మఱియును విషకంధరునకు, దఱికొని యత్యుగ్రతప మాచరింప
నపరిమితప్రీతి నాభగీరథుని, తపమంత మెచ్చి కందర్పహరుండు
లోలతఁ దనమౌళిలోనున్న గంగ, భూలోకమున కింకఁ బొమ్మని యనుప
వలనొప్పుజూటంపువాకిలి వెడలి, పొలుపొందఁ బాతాళమునఁ జూపు నిలిపి

1 దలకొని చేయంగఁ దా వచ్చి శివుఁడు.

తనపితృసృష్టి మందాకిని కపిలుఁ, గని మునిమహిమకుఁ గడుఁజోద్యమంది
తగిలి నిన్నలఁచినదారుణాకృతుల, సుగతికిఁ బంప వచ్చుచు నున్నదానఁ
గినియకు మీ వని కేలర్థి మొగిచె, ననఁ బద్మముకుళంబు లమరఁ జూపఱకు
నడరు నమ్మునికిన్న నటుపోవ వెఱచి, సుడివడు తెఱఁగున సుడులొప్ప మిగుల
మామీఁదఁజనుదెంచు మలయుచుగంగ, యేమెక్కడికిఁబోదు మిటమీఁద ననుచ
బఱతెంచి సగరులపాలిపాపములు, మొఱవెట్టుచున్నవి ముక్కంటి కనఁగ
నోలిఁ బంకజముల నుండరాకున్నఁ, దూలి యాకసమునఁ దుమ్మెదల్మ్రోయ
భూతాధిపతి జూటమునునుండి ధరణి, కేతెంచుగంగకు నెండగాకుండ
గొడుగులుపట్టినకొమరున హంస, లుడువీథి సుడివడి యొప్పారుచుండఁ
దొడరి సాగరులవా దోత్సోత్కనములు, కడఁకమైఁ బోఁద్రోచుకరములో యనఁగఁ
గమనీయతరములై ఘనతరంగముల, గము లంతకంతకుఁ గర మొప్పమిగులఁ
దనవారిలోపలఁ దగ భగీరథున, కనుపమసితకీర్తు లందందఁ బుట్టి
నెఱసి భూతలమెల్ల నిండ నేతెంచు, వరుసన నుఱువులు వఱలంగ గంగ
యప్పటప్పటికిని నతులఘోషంబు, లుప్పొంగియుప్పొంగి యుడువీథి ముట్టి
బ్రహ్మాండభాండము వ్రీగులఁ బెల్లుబ్బి, బ్రహ్మాదిదేవత ల్భక్తితోఁ బొగడ
శివుఁడుధరించినశ్రీగంగ యపుడు, భువిఁ బామరులకెల్లఁ బుణ్యంబునీయ
వచ్చితి నని గంగ వరుసగాఁ జెప్ప, వచ్చినవిధమున వరుస ఘోషించి
సురలు ఖేచరులును సుముఖులై చూడ, గరుడగంధర్వులు గరము భూషింపఁ
జనుదెంచి బిందువన్సరసిలోఁ జొచ్చి, యెనయఁ బ్రవాహంబు లేడులై పాఱి
యనఘాత్మ పావనిహ్లాదినినలిని, యనఁ బ్రవాహములు మూఁడరిగెఁ దూర్పునకు
సీత సుచక్షువు సింధువు నాఁగ, ఖ్యాతితో మూఁడేఁగెఁ బడమటిదెసకు
నడరుచు నుప్పొంగి యందులో నొకటి, కడఁగి భగీరథత్రోవపాలు పిఱుఁద
ఘనతరవిశదోదకప్రవాహంబు, వినువీథి శరదభ్రవిభ్రమం బెసఁగ
దివికేఁగ మదిలోనఁ దివురుభూజనుల, కవిరళనిశ్రేణు లమరుచందమున
నిలయునింగియుమ్రోఁగు నెడఁ బ్రవాహంబు, గలయ నానామాలికలు వీచులమర
నీభంగిఁ ద్రిప్పుదు నెల్లపాపముల, నాభంగిఁ జూడుఁడీ యన సుడులొప్పఁ
జెలిమిఁ దారలతోడఁ జేయఁజక్కరణిఁ, బెలుచ నింగికి నంబుబిందువు లెగయ
ధర్మాత్ములగువారి ధర్మకీర్తులకు, నిర్మలస్థానమై నెఱిఁబొల్తు ననుచుఁ
గేలి నయ్యాపగాకీర్తులు నవ్వ, లీల డిండీరమాలిక లుల్లసిల్లఁ
బెక్కుఁగన్నులఁజూతుఁ బృథివిపెంపెల్ల, మక్కువననుభంగి మత్స్యములోలయఁ
జరియించుకొమరారు జలచరావళులు, పొరినొప్ప నేతెంచె భూలోకమునకు
నంతశతార్కమై యమరుచందమున, గాంతిమద్బహురత్నఖచితంబులైన
నిజభూషణంబుల నింగి వెలుంగ, గజవిమానాదులు కర మర్థి నెక్కి
యమరగంధర్వసిద్ధాదులు చూడ, నమరంగ నేతెంచి రజుఁడు నేతెంచె
నటమహానాగంబు లాప్రవాహంబు, చటులవేగముచూచి సరిమ్రొగ్గుటయును

అంతయు నానిర్జరాదులు చూచి, చింతించి జపములుచేసి రాలోన
నానదిగట్లనే యవగాహమంది, యానందమును బొంది యాడి రచ్చరలు
అమరమునీంద్రాదు లంత సంతోష, ణమరగాఁ బువ్వుల నర్పించి రెలమి
నాపుణ్యనదిలోన నతిపాపరతులు, శాపదగ్ధులు కృతస్నానులై దివికిఁ
జనుచుండ సురలు నచ్చరలు గంధర్వ, దనుజపన్నగయక్షదైత్యరాక్షసులు
కిన్నరాదులు నాభగీరథరథము, వెన్నాడి కనుఁగొంచు వేడ్కనే తేరఁ
బెరిగి పర్వతములు భేదించుకొనుచు, నరుగ జహ్నుఁడుయాగ మాత్రోవఁజేయ
వరదగా నటువచ్చి వలగొని గంగ, సరి చుట్టుముట్టిన సరగున నపుడు
యాగోపకరణంబు లవివెల్లిపోయి, యాగవిఘ్నంబైన నతఁ డాగ్రహించి
నింగికి నుప్పొంగి నెఱి నేఁగుదెంచు, గంగ నాకర్షించి కలుషించి క్రోలె
అనిమిషమునివరు లాభగీరథుని, గనుఁగొని పల్కిరి కరమర్థి మీఱి
నీమహాగంగని ట్లీమునీశ్వరుఁడు, ఈమాడ్కిఁ గ్రోలెనే యిప్పుడె నీవు
కోపంబు లేకుండఁ గోరి యీమౌని, నీపట్ల వేఁడిన నిచ్చును గంగ
ననియిట్లు దేవత లందఱుఁ జెప్ప, వినయంబుతోఁ బోయి వేడ్క నమ్మౌనిఁ
గనుఁగొని మ్రొక్కుచుఁ గరములు మొగిచి, వినయసంభరితుఁడై వేడ్క నిట్లనియె
వినవయ్య మునిచంద్ర విమలచారిత్ర, ఘనమైనగంగను [1]గడునుగ్రతపముఁ
జేసి యుర్వికి గంగఁ జెలగుచు నిపుడు, వాసిమైఁ దెచ్చితి వరుస నిచ్చటను
మోసమై మీచేత మొనసి క్రోల్పడితి, నోసంయమీశ్వర యోపరబ్రహ్మ
దయచేసి విడిపింపు ధన్యచారిత్ర, దయచేయు సంయమీ దయచేయు మనుచు
వినయంబుతోఁబల్క విని మౌనివరుఁడు, మనమునఁ గృపపుట్ట మఱియు నిట్లనియె
నోభగీరథచంద్ర యోమహారాజ, యీభంగి గంగను నిలకుఁ దెచ్చుటకు
నీమహత్త్వంబును నీతపోమహిమ, నే మని చెప్పుదు నిఁక నీదుకీర్తి
విడిచెద గంగను విడిచెద నిపుడు, పుడమిలో నాకీర్తి పొలుపొందు ననుచు
నుమిసి యెంగిలిసేయనొల్లక యతఁడు, రమణమై దనకర్ణరంధ్రంబునుండి
వెడలింప నెప్పటివిధమున గంగ, యడరుచు జాహ్నవి యనుపేరఁ బరఁగెఁ
బురుషపురాకృతపుణ్యంబునడుమ, దొరకొన్న విఘ్నంబు ద్రోచి యేతెంచు
వెరవున నారాజు వెంటనేవచ్చి, శరనిధిఁ జొచ్చి యాజాహ్నవీదేవి
దిగి రసాతలమునఁ దిరిగి యందున్న, సగరజభస్మము ల్సరినిండఁ బాఱె
నంత నంబుజగర్భుఁ డాభగీరథుని, సంతసంబునఁ జూచి జననాథ వినుము
జలనిధి నెందాఁక సలిలంబు లుండుఁ, దలఁప నీసగరునితనయు లందాఁక
దివ్యభూషణముల దివ్యాంబరముల, దివ్యమాల్యంబుల దివ్యగంధముల
దివ్యమూర్తుల నొప్పి దివిజలోకమున, దివ్యభోగముల వర్తించుచుండెదరు
అడరంగ నిది మొదలనఘ నీపేర, నడుచు భాగీరథినామ మీనదికిఁ
ద్రిపథయనంగ వర్తిలువరదయన, నృప జాహ్నవియనంగ నెగడు లోకములఁ

1 ఘనమైన తపము.

దగఁ బితలకుఁ దిలోదకములు నడిపి, జగములన్నిట సత్యసంధుఁడవగుము
అనఘ మీపగయంతయు [illegible], ఘనుఁడు దిలీపుఁడు గైకొన్న వ్రతము
నెఱపఁజాలమి నీవు నెఱపంగఁ దివిరి, తెఱఁగొప్ప నీగంగఁ దెచ్చితికాన
గంగాంబునిర్మల [illegible], మంగళచిరకీర్తి మహితుండ వగుము
కాకుత్స్థకులజుల గౌరవశ్రీల, కాకరం బగుతనయావళిఁ గనుము
లలితధర్మముల మూలస్తంభ మైతి, పొలుపార నింక నీపుణ్యోదకముల
వెలయఁ దీర్థస్నానవిధు లొప్పఁ దీర్చి, ఫలము గైకొనుచుండుము పద్మసంభవుఁడు
తనలోకమున కేఁగెఁ దదనంతరంబ, తనర నాగంగఁ గృతస్నానుఁ డగుచు
నలువదివేవుర కాభగీరథుఁడు, నెఱిఁ దిలోదకములు నిష్ఠతో నిచ్చె
నాతిలోదకముల నమరులై సగరు, లాతని దీవించి యరిగిరి దివికి
ననఘుండు మఱియయోధ్యాపురంబునకుఁ, జనిభగీరథుఁడు రాజ్యము సేయుచుఁ
గలుషఘ్న మీయుపాఖ్యానంబు భక్తి, చెలువారఁ జదివినఁ జెప్పఁగా వినిన
నొనరఁ బుణ్యాత్ముల నాయుష్మంతులగుచు, ధనధాన్యకీర్తులఁ దనరుచునుందు
రెప్పుడు వారల కెల్లదేవతలు, నొప్పఁ బ్రసన్నులై యుండుదు రెలమి
నమరంగ సిద్ధించు నఖిలకార్యములు, సమకొను నంచితస్వర్గభోగములు
పెనుపారఁగా వారిపితృగణంబులకు, ననుపమసద్గతు లనిశంబుఁ గలుగు
ననిన రాఘవుఁడు గంగావతారంబు, విని కౌశికునిఁ జూచి వినుతులు సేసి
నేఁడు విశ్వామిత్ర నీచేత వింటి, వేఁడిమి నీగంగ భూలోకమునకు
వచ్చినతెఱఁగును వారితెఱంగు, నచ్చెరు వడరంగ నని ముదంబంది
యారాత్రి యందుండి యఖిలలోకముల, నారూఢికెక్కిన యానది గ్రుంకి
యాహ్నికకృత్యంబు లన్నియుఁ దీర్చి, జాహ్నవి దాఁటి విశ్వామిత్రుతోడ
నుత్తరతటమునం దున్నసంయములఁ, జిత్తంబు లలరఁ బూజించి వీడ్కొనుచుఁ
జనిచని యెదుట విశాలయన్పురము, కనుగవ కింపైన గాధేయుఁ జూచి

## దేవత లమృతంబు వడయుట

యీపురిపే రేమి యేరాజవంశ్యుఁ, డేప్రమైఁ బాలించు నెఱిగింపు మనిన
ఘనుఁడుకౌశికుఁడు రాఘవుఁజూచి పలికె, విను మింద్రుకడ మున్ను విన్నాఁడ నేను
దితిసుతులైన దైతేయులు నదితి, సుతులై నసురలు భాసురలీలఁ బొల్లి
నోలి రసంబులు నోషధుల్ నించి, పాలసముద్రంబు పరువడి ద్రచ్చి
క్రమ మొప్ప నమృతంబు గైకొందమనుచు, సమమైత్రి నాసుధాజలరాశి డాసి
కవ్వంబు తరిత్రాడుగా మందరంబు, నవ్వాసుకిని జేసి యమృతాబ్ధిఁ దరువ
వెలయంగ నటఁ బుట్టె విషము గ్రమగుచుఁ, గలయ లోకంబుల గాఱించిమించఁ
బరఁగ రోషానల పరుషంబునైన, హరుఁ డదిగొని మ్రింగె నంత సుమియుట
నురగముల్ ధరియించె నోలిఁ దద్విషము, మఱిమఱి తరువంగ మఱియును బుట్టె
వంచన మన్మథావాప్తి లోకముల, ముంచియొత్తఁగఁజాలు మురిపెంబు లమరఁ
గాంచీగుణత్కారఘననితంబములు, నించుక నడుమును నెఱియుఁజన్గవలు

చంచలతనులతల్పరిదంతచయము, మించుకన్గవయును మెఱయుమోవియును
గోమలభ్రూలతాకోదండుఁ డైన, కాముని విలువిద్యగతి చూప నొప్పి
కడఁగంటిచూపులఁ గటదీధితుల, వెడలించు భుజలతావిక్షేపములను
అమర నూతనయౌవనాభిరామముల, నమర నర్వదికోట్ల యప్సరోగణము
లీలమై నచ్చరలేమల నెల్ల, నోలి దేవతలు దైత్యులును గైకొనిరి
వారక దరువ నావరుణాత్మజాత, వారుణి ప్రభవించె వైభవం బలర
నాసుర దితిసుతు లపు డొల్లకున్న, నసురులై వర్తిల్లి రవని నెల్లెడల
సుర నాదితేయులు సొరిదిఁ గైకొన్న, సురలనఁ బ్రఖ్యాతి శోభిల్లి రపుడు
సంతసంబున రమాసతి తురంగంబు, కాంతిమిన్నగుదంతి కౌస్తుభమణియు
నమృతాంశుఁడును బుట్టె, నమృతంబు సురభి, నమరసుధాపూర్ణ మగుకమండలువు
కలిగి ధన్వంతరి కర మొప్పఁ బుట్టె, వెలయంగ మఱి పుట్టె వింతవస్తువులు
అంత సురాసురు లమృతంబుకొఱకు, నెంతయుఁ దమలోన నేచి దర్పమున
ననుపమస్థితిఁ బోర నసురులసురలఁ, గనుఁగొని సురలపైఁ గరుణించి మించి
మానినీరూపమై మధుమర్దనుండు, తా నమృతముఁ బంచి తగనిచ్చువేళ
రాహుకేతువు లనురాక్షసులప్పు, డూహించి పంక్తిలో నొగిఁ గూరుచుండి
[1]చెయి జాచిపట్టినఁ జెలఁగుచు సుధను, మెయిచాయఁ జూడ మెలఁత యిచ్చుటయు
రవిచంద్రులప్పు డారమణినిఁ జూచి, కనగూడి యిద్దఱుఁ గళవళం బంది
కనుసైఁగ నటుచూపఁ గనలుచు విష్ణు, వనువొందఁ జక్రంబు నటు ప్రయోగించి
శిరములు ఖండించి సృష్టిలోపలను, కఱకురాక్షసుతలల్ కడుగ్రహంబులుగ
నామింట నిలిపె నయ్యమృతంబు ద్రావ, నేటియుఁ జెడకుండ నెప్పుడు వారి
నాడిగా నెప్పు డయ్యాదిత్యుఁ జంద్రు, బాధించుచుందురు పర్వంబులందు
నసురుల గనుఁబ్రామి యమృతంబు సురల, కొసఁగి వారికి జయంబొసఁగె యుద్ధమున
దైతేయకోటియందఱఁ ద్రుంచి యింద్రుఁ, డాతఁడే త్రిజగంబు లర్థిఁ బాలింప
దితి యంతఁ దనసుతుల్ దెగుటకునొగిలి, పతియైన కశ్యపుఁ బ్రార్థించి యింద్రుఁ
జంపఁజాలిన మహాసత్త్వప్రతాప, సంపన్ను నొకనిఁ బ్రసాదింపు మనిన
నంగీకరించి సహస్రవర్షంబు, లంగన ఘనశుచివై యుండఁ గల్గు
మూఁడులోకంబులు మొగి గెల్చువాని, వాడిమిమై నింద్రు వధియించువాని
గనియెద వొకపుత్త్రుఁ గాంత నావలన, నని పల్కి దితి మేను హస్తాంబుజమున
నయమారఁ బరిమార్జనము సేసి మఱియు, దయఁ జూచి యతఁ డేఁగెఁ దపమాచరింపఁ
జనియె నాదితియును సమ్మదం బెసఁగఁ, జని యుగ్రతప మొప్ప సల్పుచునుండె
నంతట మఘవంతుఁ డత్తెఱం గెఱిఁగి, చింతించి దితిఁ జేర శిష్యుండు వోలె
పాయక కుశసమిత్ఫలమూలభవ్య, తోయాదు లతిభక్తితోడఁ దెచ్చుచును
జరణంబులొత్తుచు సత్కృతుల్ మఱియుఁ, బరిపాటి సేవయుఁ బరిచర్య సేయు
నేవేళ నెచ్చట నేమి గావలయుఁ, గావలసిన వెల్లఁ గనుసన్నఁ దెచ్చి

---

1 చేయి చాపినఁ గాంచి చెలఁగుచు

యుపచరించుచు వేడ్కనుండెఁ బెక్కేండ్లు, నపుడొక్కనాఁ డింద్రు నాదితి చూచి
యలరుచు మది రహస్యము దాఁపలేక, బలభేది వినుము నాపల్కు నీ వొకటి
తనయుని గోరి మీతండ్రి నేరకుగ, వినుము వెన్వేళను వెడలినపిదప
నిచ్చితి సుతనంచు నింపార నాకు, నచ్చుగా వరమిచ్చె నటుగాన నీకు
నిటమీఁద బరియేఁచు లేఁగినపిదపఁ, బటుశక్తి తమ్ముఁడు ప్రభవింపఁగలఁడు.
అలరంగ నీవును నాతండు గూడి, పాలుపాఱ నేలుఁడీభువనత్రయంబు
వినుతకీర్తుల మీరు విలసిల్లుచుండుఁ, డని పల్కి నంత మధ్యాహ్నకాలమునఁ
దలనిడి కాళ్లడ దలయుంపిగాఁగ, నలతమై నిద్రించు నాదితిఁ జూచి
శతమన్యుఁ డెంతయు సంతోషమంది, వితతవైఖరి నిదే వేళ నా కనుచు
దితిగర్భ మతియోగధీశక్తిఁ జొచ్చి, శతకోటిచేఁ దనశత్రువౌ శిశువు
నేడుతునక్కలుసేయ నెలుగెత్తి బాలుఁ, డేడువ దితియు నయ్యెడ మేలుకాంచె
మఘవుఁడు మారుదో మారుద యనుచు, లఘురీతిఁ బలుక బాలకుఁ జంపవలదు
వలదనియెడు దితివాక్య మాలించి, వెలువడి గర్భ మవ్వేళ వాసవుఁడు
కరములు ముకుళించి కలకచిత్తమున, తిరమైనభక్తిచే దితితోడఁ బలికెఁ
దనరంగఁ గాళ్లడ తలయుంపిగాఁగఁ, గొని ముక్తకేశవై కూర్కటఁజేసి
యరసి నీ వశుచి వైతివిగానఁ దెగువఁ, గార్యంబుకొఱకేను గడుపులోఁ జొచ్చి
గొనకొని నినుఁజంప కోడి గర్భంబు, దునిమితి నే నేడుతునియలుగాఁగ
సన్నకుసన్న నాశత్రుండుగానఁ, జిన్నిపాపనిఁ బరిచ్ఛిన్నుఁ జేసితిని
జనని ధర్మజ్ఞవై సైరింపవలయు, ననిన దుఃఖింపుచు నాయింద్రుఁ జూచి
నా నేరమంతయు నాకలోకేశ, నీనేర మదిలేదు నిక్కువం బరయ
నని పల్కి మరుదాఖ్యలమరఁ దేజంబు, లెనయంగ ఖండంబు లేడ్వురు నగుచు
నిమ్ముల నాపుత్రు లెలమి నెల్లెడల, సమ్మదమింపారఁ జరియింపనిమ్ము
సప్తఖండంబులై సరినొప్పువీరి, సప్తమారుతగణస్కంధనాయకులఁ
గావింపు మని వేఁడగాఁ నట్లసేసి, దేవేంద్రుఁ డమరావతికిఁ బోయె నంత
వారును దేవతావల్లభుచెలిమి, మారుతగణసంజ్ఞ మఱి దివ్యులైరి.
దేవేంద్రుఁ డతిభక్తి దితికి శుశ్రూష, గావించె నీపుణ్యగణ్యదేశమున
నీపుణ్యధరణి మున్నిక్ష్వాకునృపతి, భూపవర్యుం డలంబసయందుఁ గన్న
కొడుకు విశాలుఁడన్నుపలయాధిపుఁడు, పుడమి నేలి విశాలపురి యిందొనర్చె
నావిశాలునిపుత్త్రుఁడై హేమచంద్రుఁ, డావిర్భవించెను నతఁడు సుచంద్రు
నతఁడు ధూమ్రాశ్వుని నతఁడు సృంజయుని, నతఁడంత సహదేవు నతఁడు కుశాశ్వు
నాతండు సోమదత్తాఖ్యుఁ గాకుత్స్థుఁ, డాతని కెంతయు నమరంగ సుమతి

### సుమతి యనురాజు విశ్వామిత్రుని ఎదుర్కొనుట

భావింప నెప్పుడు పరమధర్మముల, నీవిశాలాపురం బేలెడి రాజు
లనఘు వైశాలికు లన వీరు జగతి, వినుతికెక్కిరి ధర్మవిభవసంపదల
నిచ్చల రఘునాథ యిచట నీరాత్రిఁ, బుచ్చి వేగినఁ జూడఁబోద మిజ్జనకు

ననునంత గాధేయుఁ డటువచ్చు టెఱిఁగి, మనమున సంతోషమగ్నుఁడై సుమతి
తనపురోహితులును దనబంధుజనులు, తనతోడఁ జనుదేరఁ దనపట్టణంబు
వెలువడి చనుదెంచి విహితమార్గమున, నెలమితో నామునీంద్రుఁ బూజించి
కరములు ముకుళించి కడుభక్తిఁ బలికె, ధరణిలోపల నేఁడు ధన్యుఁడనైతిఁ
జరితార్థమయ్యె నాజననంబటంచుఁ, బరమప్రియంబునఁ బలికి యొండొరుల
నమరంగఁ గుశలంబు లడిగినపిదప, సుమతి విశ్వామిత్రుఁ జూచి తా ననియె
మునినాథ యసమానమూర్తు లీఘనులు, ఘనభుజు లనిమిషక్రమపరాక్రములు
కరిరాజగమనము ల్కంఠీరవములఁ, బురుడింపఁజాలిన భుజసత్త్వములను
లలితంబులైన ఫుల్లసితారవింద, దళములఁదెగడు నేత్రములఁ జెన్నొందఁ
గరవాలములుఁ గార్ముకంబులు దొనలు, ధరియించి దమసుపదన్యాసములును
జగతి నారవిచంద్రసంచారలీల, మగురాకసమువలె నలరించువార
లిరువురు దమలోన నెల్లచందముల, సరియగుచున్నారు జనులచూడ్కులకు
నీకుమారకులెవ్వ రెవ్వారిసుతుల, నాకు నేర్పడ గాధినందన చెప్పుమ
యనిన విశ్వామిత్రుఁ డాతనిఁ జూచి, వినిపింపఁదొడఁగెను వీను లుబ్బంగ
నోరాజకులచంద్ర యోసుగుణాబ్ధి, వీరివృత్తాంతంబు వినుము దెల్పెదను
సరయుపొంతఁ గోసలదేశమునను, నరుదొప్పఁగ నయోధ్య యనుపురి యొప్పు
నాపురి నేలుచు నాదశరథుఁడు, నేపుమై మనుజుల నెల్లఁ బాలించు
నాతనివరపుత్రుఁ డైననీ రాముఁ, డితనికి ననుజాతుఁ డీలక్ష్మణుండు
మఖముసేయుటకునై మఱి నేను వేఁడ, సుఖమున నిచ్చెను సుతులనిద్దఱిని
మావెంట వేంచేసె మఖమును గాచి, వేవేగఁ దాటక వెస సుబాహువును
ఆటోపమొప్పంగ ననిలోనఁ గూల్చి, మాటమాత్రంబున మారీచుఁ దోలి
యాగంగ నట దాటి యటు మిథిలకును, నేగంగఁ దలఁచుచు నిటకు వచ్చితిమి
ఈరాజశీతాంశు లినవంశకులులు, వీరిసామర్థ్యంబు వినఁగ జోద్యంబు
ననిన విశ్వామిత్రు నమలవాక్యములు, విని చాల సుమతియు విస్మయంబంది
యారాఘవుల నప్పు డర్థిఁ బూజింప, వారును బూజలు వరుసఁ గైకొనుచు
నారాత్రి యందుండి యాప్రభాతమున, నా రాజు తముఁ బంప నర్థితోఁ జనిరి
చనిచని గౌతమాశ్రమము రాఘవుఁడు, కనుఁగొని పలికె నాగాధినందనుని
పలలితపల్లవసంపద ల్గలిగి, వెలయు మామిళ్లును వేఱుపనసలు
నారంగ జంబీర నారికేళములు, పారిభద్రంబులు బదరికాతతులు
మాతులుంగ లవంగ మంజీరతరులు, శ్రీతరు చంపక సింధువారములు
పొన్నలు పొగడలు పోఁకమ్రాఁకులును, నెన్నంగ నరఁటుల నెఱయుపుప్పొళ్లు
చిత్తజాంబకములై చెలఁగునశోక, లత్తుక దాడిమ లలితమల్లికలు
తిందుకంబులు శివతిలకశాల్మలులు, చందన కర్పూర సహకారములును
భల్లాత గుగ్గులు బ్రహ్మ కౌశికము, లెల్లచో నల్లినయేలకీలతలు
అల్లిన మొల్లలు నలరుచేమంతి, చల్లనిపుష్పవాసనలఁ జెన్నొందు

కాసారములచేతఁ గడురమ్య మగుచు, భాసిల్లుపక్షుల పటురవంబులును
సమధిక మిట్టియాశ్రమభూమి సకల, రమణీయమయ్యె నిర్జన మేటికయ్యె
మున్నిందుఁ దపమున మునివర్యుఁ డెవ్వఁ, డన్నియు నెఱిఁగింపు మనిన నిట్లనియె
గౌతముం డిక్కడఁ గడఁకతోఁ దొల్లి, యాతతనిష్ఠ నహల్యతోఁ గూడి
యతిఘోరతపము సేయఁగ నింద్రుఁ డెఱిఁగి, యతనితపంబు దానంతయుఁ జెఱుపఁ
గుక్కుటంబై పోయి కుటజంబు సేరి, కొక్కొక్కొరో యని కూయఁ గొమరొప్ప మా
మనమునఁ జింతించి మమత రెట్టింప, ముని నిజానుష్ఠానమునకుఁ బోవుటయు
గౌతమాకారంబు గైకొని వచ్చి, యాతనిసతి నహల్యాదేవిఁ గదిసి
ఋతుకాలమనరు కోరికగలవారు, మతిఁ దలంపఁగఁ బ్రొద్దు మఱి చాలఁగలదు
పొలఁతుక నీతోడి భోగేచ్ఛ నాకు, వలయుటఁ దలపోసి వచ్చితి ననిన
నెఱిఁగి యహల్య నీవింద్రుండవగుట, యెఱుఁగుదు గాకేమి యిందు రమ్మనుచు
జలజాక్షి తనపర్ణశాలలోపలికి, బలభేదిఁ గొనిపోయి పరఁగఁ గ్రీడించె
సురనాథుఁ డప్పుడు స్రుక్కుచు భీతి, నరుగుచో గౌతముఁ డంతలో వచ్చి
యోరి పాపాత్మక యుచితమే నీకు, నారూపు గైకొని నాపత్నిఁ గవయ
నీపాపఫలమున నీ వపుష్కుండ, వై పొమ్ము పొమ్మని యంత శపించె
గౌతముశాప మఖండమై తాఁక, నాతనియండంబు లంతలోఁ దెగియె
నడరి గౌతముఁ డహల్యాదేవిఁ జూచి, పడఁతి పాషాణమై పడియుండు మీవు

### గౌతముఁ డహల్యకు శాప మిచ్చుట

కరముగ్రమగునెండ గాలిపెంధూళిఁ, బొరలుచు నెందును బొడఁగానఁబడక
అనిన శాపమున కెయ్యదితుది నాకు, ననిన నహల్య కిట్లనియె గౌతముఁడు
వైకుంఠధాముఁ డవాప్తకాముండు, లోకరక్షణకళాలోలచిత్తుండు
రాముఁడై వచ్చి పురాణపూరుషుఁడు, భూమిపై జన్మించి పొగడు దీపించి
చనుదెంచి కౌశికుజన్నంబుఁ గాచి, యినకులాధీశ్వరుఁ డీత్రోవ వచ్చి
తొలఁగిపోవక నిన్నుఁ ద్రొక్కినఁ జాలు, జలజలోచన నీదుశాపంబు దీఱు
నని చెప్పి శీతాద్రి కరిగె గౌతముఁడు, మునిపత్ని యారూపముననుండె నంత
సురరాజు దనపాటు సురలతోఁ దెల్ప, దరమిడి పితృదేవతల వారు వేఁడి
వెరవరులై మేషవృషణముల్ దెచ్చి, సురలు సంధించిరి సురలోకపతికి
నతులపుణ్యాత్మకు లదిమొదిగాఁగ, గ్రతువులఁ [1]జంపుదుర్కడఁగి మేషముల
నాఁడాదిగా మునినాథుశాపమునఁ, బోఁడిమిచెడి యీతపోవని నున్న
యాయహల్య నతుల్య పాతమశ్శల్యఁ, జేయవే శ్రీరామ చిరపుణ్యధామ
యని చెప్పె గౌతమునాశ్రమంబునకుఁ, జనుదేర శ్రీరామచరణంబు సోఁక
మొగులెల్ల విరియ సోమునికళవోలెఁ, బొగ యడంగిన హవ్యభుక్కీలవోలెఁ
గలఁకఁ దొలంగిన కమలినివోలె, బలుమట్టు గడిగిన బంగారువోలె
శ్రీరామపాదరాజీవపరాగ, దూరీకృతాఘసందోహయై యపుడు

---

1 వధియింత్రు కడఁగి.

వెలఁది యంతయు శిలావేషంబుమాని, తిలకించి తనతొంటిదేహంబు పూని
మునిపతిచేత రామునిమహత్త్వంబు, వినినదిగాన నావేదండయాన
యామహామహునకు నాతిథ్య మొసఁగి, శ్రీమీఱ నిటకు విచ్చేసితిగానఁ
జరితార్థనైతి మీచరణపద్మములు, దరి నిచ్చి రఘునాథ త్రైలోక్యనాథ
మీపాదతీర్థమా మిన్నేరు భువన, పాపంబు లెడఁబాపఁ బొల్పెడె నవఁగ
నిలయెల్ల నొకట మిన్నొక్కటఁ గొలిచి, బలి మెట్టి బ్రహ్మాండభాండంబు ముట్టి
వేదశిరోవీథి విహరించు నీదు, పాదముల్ నాదుశాపముఁ బాచు టరుదె
యని రాము వినుతించె నంత గౌతముఁడు, సనుదెంచి రఘురామచంద్రుఁ బూజించి
ప్రాకట జన్మసాఫల్య నహల్యఁ, గైకొని తొల్లింటిగతి విలసిల్లెఁ
గ్రొవ్విరిజడివాన కుంభినిఁ గురిసె, నవ్వేళ దేవతూర్యంబులు మొరసె
ఘనపుణ్యు లందుండి కదలి మిన్నంటి, తనరు ప్రాకారసౌధములయూథముల
నమరిక రత్నగేహముల వాహముల, రమణీయరాజమార్గముల దుర్గముల
వలనొప్పు శృంగారవనుల జవ్వనులఁ, బొలుచు సంతతశుభంబుల నిభంబులను
ననువొందు వైరివర్గాశిథిలకును, జనకుని మిథిలకుఁ జనుదెంచి రంతఁ
గాళింగ నేపాళ కర్ణాట లాట, మాళవ సౌవీర మగధ పాంచాల
కురు పాండ్య బర్బర కుంత లావంతి, మరు తురుష్కాభీర మనుజవల్లభుల
ఘనతర యాగోపకరణభారముల, ననురూపపశుగణాయతనయూపముల
భూరి దధిక్షీరపూర్ణకుంభముల, సారసమిద్భారచారుదేశముల
నడరి ఘోషించు సామాదివేదముల, నుడుగక చనుదెంచుచున్న తాపసుల
నుడువీథి నుప్పొంగు హోమధూమముల, నడరెడు దేవతాహ్వానరావములఁ
బూజలుగైకొన్న పుణ్యసంయములఁ, బూజింపసొలయని భూసురోత్తముల
నరుదైన జనకుని యజ్ఞవాటంబు, కరమర్థిఁ జొచ్చె నగ్గాధినందనుఁడు
అంత నాజనకమహారాజవర్యుఁ, డెంతయు[1]మర్యాద నెదురుగా వచ్చి
మునినాథునకు మ్రొక్కి ముదమొప్పఁ దోడ్కొనిపోయి పూజించి కుశలంబులడిగి
నీవు వచ్చితిగాన నేఁడు నే మిగులఁ, బావనాత్ముఁడనైతిఁ బ్రబలె నాక్రతువు
లని చాలఁ గొనియాడి యమ్మునిచంద్రు, వెనుకనె వినతులై విలసిల్లుచున్న
గురుతరస్ఫీతవక్షులఁ గాకపక్ష, ధరుల మహాధనుర్ధరుల శ్రీకరులఁ
గోమలాంగుల నభంగురయశోనిధుల, భూమి జరించు వేల్పులఁ బోలుఘనుల
సదయాంతరంగుల సతతప్రసన్న,వదనుల భువనపావనచరిత్రులను
చారుప్రభాభానుచంద్రసన్నిభుల, ధీరుల నయ్యశ్విదేవతాకృతుల
నాజానుబాహుల నతులవిక్రముల, రాజీవనేత్రుల రామలక్ష్మణులఁ
జూచి యీశరచాపశోభితాకారు, లీచతురాత్మకు లెవ్వరివార
లీపల్లవారుణ మృదుపాదుపద్మ, లేపగిదిని వచ్చి రిచటికి నడిచి
యనిన విశ్వామిత్రుఁ డనఘులు వీరు, జననాథ దశరథజనపాలసుతులు

1 మహిమతో.

నాయతశక్తి నాయాగంబు గాచి, యాయహల్యను బ్రోచి యనుకంప నేచి
నిరుపమతరశక్తి నీయింట నున్న, హరునిచాపముఁ జూడ నరుదెంచి రనుడు
మునినాథుమాటకు ముదమంది జనకుఁ, డనునయంబున వారినర్థిఁ బూజించెఁ

శదానందుండు విశ్వామిత్రు ప్రభావంబుఁ దెల్పుట

కౌశికుఁ గనుఁగొని గౌతమసూనుఁ, డాశతానందుఁ డిట్లనియె రాగిల్లి
నీవు రామునిఁ దెచ్చి నెమ్మి మమ్మేలి, తీ విశ్వవిభుఁ డేర నెవ్వరితరము
అడరి మాతల్లి యహల్యపాపములు, కడుగ రామునిపాదకమలరేణువుల
గౌతమశాపదుర్గతి నిస్తరించి, గౌతముఁ గ్రమ్మఱఁ గలిసె మాతల్లి
రామచంద్రునిపాదరాజీవమహిమ, లేమందు నని రాము నీక్షించి పలికె
నీకౌశికుఁడు పుణ్యుఁ డీక్షోణిమీఁద, నీకు రక్షకుఁడఁట నీకేమి కొదువ
యరయ విశ్వామిత్రు నతులప్రభావ, మరిది ప్రస్తుతిసేయ నైనను వినుము
దశరథాత్మజ బ్రహ్మతనయుండు కుశుఁడు, కుశుఁ డర్థితోడుతఁ గుశనాభుఁ గనియెఁ
గుశనాభునకు గాధి కొమరుఁడై పుట్టెఁ, గుశపవిత్రుఁడు గాధికొడుకయ్యె నితఁడు
అతిధర్మనిరతుఁడై యఖిలంబు పొగడ, నితఁడు మహీచక్ర మేలుచునుండె
నొలసినవేడుక నొకనాఁడు దన్నుఁ, బలిసి యక్షౌహిణీబలములు గొల్వ
వెడలి కాననముల వేడ్కలు సల్పి, పుడమియంతయుఁ జరింపుచుఁ జాల బడలి
బహుగంధబంధురప్రసవమంజరుల, బహుఫలంబులనొప్పు పాదపావళుల
బహుపక్షిరవముల బ్రహ్మఘోషముల, బహుసరోవరముల బహుళవేదికల
నలరుచు జాతివైరాదులు లేక, మెలఁగు నానావిధమృగసమూహముల
ననిలాంబుజీర్ణపర్ణాశులై తపము, నొనరించుతపసుల యోగిపుంగవులఁ
బన్నగఖేచరప్రముఖగంధర్వ, కిన్నరాదుల వాలఖిల్యాదిమునులఁ
గడునొప్పి బ్రహ్మలోకము పోలె మిగుల, నడరు వసిష్ఠునియాశ్రమంబునకు
నతిముదంబున వచ్చి యావసిష్ఠునకు, నతినిష్ఠ మ్రొక్కిన నతఁడు దీవించి
యుచితాసనంబున నునిచి పూజించి, ప్రచురరసస్వాదుఫలమూలతతుల
వరుసతో నిచ్చిన వానిఁ గైకొనుచుఁ, గరములు ముకుళించి కడుభక్తిఁ బలికె
ననఘాత్మ తపసులు నగ్నిహోత్రములు, జనలోకనుతములై జరగుచున్నవియె
మీరును శిష్యులు మీయాశ్రమమున, నారంగ వీరు వారన కెల్లవారు
ముదమున నున్నారె మునినాథ యనిన, నొదవుసమ్మదమున నున్నార మేము
నీతితోఁ జేయుదె నీవు రాజ్యంబు, ప్రీతిమై భరియింతె భృత్యవర్గముల
ముదమొప్ప రాజ్యాంగములు పరీక్షించె, వదలక నిర్జించె వ్రాలుశాత్రవులఁ
గుశలమే సర్వంబు కుశలమే నీకుఁ, గుశలమే నీపుత్త్రకులకుఁ బత్నులకు
నని పల్కె మీకృప నఖిలంబు కుశల, మనియెఁ గౌశికుఁ డంత నవ్వసిష్ఠుండు
కరమర్థి మాయింటికడ విందు గుడిచి, యరుగుమ యీవని యతనిఁ బ్రార్థింప
నందుకు కౌశికుం డనుమతించుటయు, విందుసేయుటకునై వేగంబ యతఁడు
తనహోమధేనువు దలఁచి రప్పించి, జననాథవరునకు సకలసేసలకు

వివిధభక్ష్యంబులు వివిధభోజ్యములు, వివిధభంగుల విందు వేడ్కఁ గావింప
వలయుఁగావున నీవు వలయువస్తువులు, గలిగింపుమనవుడుఁ గామధేనువును
గలమాన్నతతులు శాకములు భక్ష్యములు, గలవంటకము లూరుఁగాయలంబళ్లు
ఫలవిశేషంబులు పాయసాన్నములు చెలువారు వెన్నలు చీనిచక్కెరలు
సద్యోఘృతములు రసాయనంబులును, మద్యవిశేషముల్ మాంసభేదములు
వావిరి మఱియు నెవ్వారికి నేమి, కావలె నవి యడుగకయె కల్పింప
నాధేనుమహిమ కత్యాశ్చర్యమొంది, గాధేయుఁ డప్పుడు కడిమాడ సేయఁ
గుడిచి సేనలు దానుఁ గోర్కి దీపింపఁ, గడుఁ దృప్తినొంది యాగాధితనూజుఁ
డీకామధేనువు నెబ్భంగినైనఁ, జేకొందు ననుచు వసిష్ఠునిఁ జేరి
లక్షగుఱ్ఱంబులు లక్షధేనువులు, లక్షయేనుఁగులు వేలక్షలు మణులు
నిచ్చెద నీధేను విమ్ము నాకనిన, నిచ్చలో మునినాథుఁ డెంతయు వగచి
యిది నాకు జీవనం బిది నాకుఁ బ్రాణ, మిది నాతపంబుల కెల్ల సాధనము
హవ్యకవ్యంబుల నతిథిసత్కార, మవ్యాహతముగ నీయావుచే నడుచు
నీపుణ్యధేనువు నీఁజాల ననిన, నాపూర్ణబలుఁడు విశ్వామిత్రుఁ డలిగి
యిమ్ముని బతిమాలి యే వేఁడనేల, రమ్మని భటసహస్రంబులఁ దాను
గోవు నుద్ధతిఁ బట్టికొనిపోవఁ బోవఁ, బోవక యది మునిపుంగవుఁ జూచి
యనఘ వసిష్ఠసంయమిచంద్ర నన్నుఁ, గొనిపోవుచున్నాఁడు క్రొవ్వి కౌశికుఁడు
వారింప వకట దుర్వారుండవయ్యు, నూరక తగునయ్య యొప్పింప నన్ను
ననఘాత్మ నీయెడ నపరాధి గాను, నను నుపేక్షించుట నాయమే నీకు
ననుడు ధేనువుమాట కావసిష్ఠుండు, మనమునఁ గృపపుట్టి మఱుమాటఁ బలికె
నే నేల విడుతు నిన్నెంతయు బలిమి, భూనాయకుఁడు గొనిపోయెడుఁ గాని
క్షత్త్రియు లుద్దండచారిత్రులైన, ధాత్రిసురోత్తము ల్దారెంతవార
లక్షౌణి కధిపతి యీగాధితనయుఁ, డక్షౌహిణీబలం బతనికిఁ గలదు
ఏవిధంబున గెల్తు నితని నే ననిన, నావసిష్ఠునితోడ నాధేను వనియె
మునినాథ నృపతేజమునకంటె నెందు, వినుతింప నెక్కుడు విప్రతేజంబు
గావున నీకంటెఁ గౌశికుం డెక్కు, డే వెంటఁ గాకుండు డే నెఱుంగుదును
బనుపుము నన్ను నీబలముల నెల్ల, మునుకొని యడఁచెద మునినాథ యనిన
నావసిష్ఠుఁడు ధేను వపుడు సైన్యములఁ, గావించు బలముల ఖండింపుముఱక
నన విని హుంకారమడరించుటయును, గనుఁగొని ధేను హుంకారంబునందె
ఘనవాలలతయందుఁ గర్ణంబులందుఁ, దనురుహంబులయందు దంతంబులందు
ఖురమధ్యములయందుఁ గొమ్ములయందు, సురలోచనములందు నూర్పులయందు
మొనయ జంఘులయందు మోఁకాళ్లయందు, నను వొందఁ దొడలందు నధరంబునందు
గాఢతరం బైన గంగడోలునను, రూఢిగాఁ గూడిన రోమకూపములఁ
గెరలు రంకెలను వక్షప్రదేశమున, బొరి నుద్భవించిరి భువనభీకరులు
కైరాత పల్లవ కాంభోజ యవన, వీరులు పెక్కండ్రు విషమవిక్రములు

చిత్రరూపాఢ్యులు చిత్రాయుధులును, జిత్రవిలోకనుల్చిత్రాలంకృతులు
నై వీరులై ధీరులై మహోదారు, లై వారు సేనాసహాయులై మఱియు
హయులతోఁ గరులతో నందందఁ గడిమిఁ, బరఁగి విశ్వామిత్రుబలములఁ ద్రుంపఁ
జూచి యాకౌశికసుతుల నూర్వురను, నేచి నానాహేతిహేతులు నిగుడ
వచ్చి వసిష్ఠుని వధియింపఁ గడఁగి, యచ్చట భస్మమై రతనిహాలంకృతికి
నంత విశ్వామిత్రుఁ డఖిలసైన్యంబు, లంతకువీటికి నరుగుట చూచి
యతులపరాక్రము లగుచున్న తనదు, సుతులచావును జూచి శోకించి యంతఁ
దనరాజ్యమున నొక్కతనయుని నునిచి, చని హిమాచలమునఁ జలమున నిలిచి
త్రిపురారిఁ గూర్చి యతిప్రయత్నమునఁ, దప మొనరింపఁ బ్రత్యక్షమౌటయును

## కౌశికుఁడు ఈశ్వరునిచేత నస్త్రములు వడసి వసిష్ఠునితోఁ బోరుట

హరుచేత వివిధశస్త్రాస్త్రము ల్వడసి, యురవడిఁ జనుదెంచి యుగ్రుఁడై కడఁగి
మొగి వసిష్ఠాశ్రమంబున వహ్నిశిఖలు, నెగయఁ బెల్లగ నేసె నాగ్నేయబాణముల
నప్పుడు బాణాగ్నులాశ్రమంబెల్లఁ, గప్పి మండుటయును గని వసిష్ఠుండు
కాలదండముఁ గొన్న కాలుండో యనఁగఁ, గేల దండము దాల్చి కినుకతో వెడలి
యోరి విశ్వామిత్ర యోరి పాపాత్మ, భూరిపుణ్యాశ్రమంబులు గాల్పఁ దగునె
యెనయ నీవెక్కడ నే నెక్కడనిన, ఘనరోషచిత్తుఁడై కౌశికుం డప్పు
డతనిపై రౌద్రంబు నైంద్రంబుఁ బాశు, పతము వైష్ణవము జృంభణము శోషణము
జటులమోహనమును సంతాపనంబుఁ, బటుతరవజ్రంబు బ్రహ్మపాశంబుఁ
గనలు పైశాచంబు కాలపాశంబు, ఘనవిష్ణుచక్రంబు కాలచక్రంబు
వారుణ గాంధర్వ వాయవ్యసౌర, ఘోరాస్త్రకోటులు క్రూరుఁడై యేయఁ
గలయంగ విస్ఫులింగంబులు చెదర, బలువిడి నుగ్గాడె బ్రహ్మదండము స
నలుక విశ్వామిత్రుఁ డంత బ్రహ్మాస్త్ర, మలవడ సంధించి యార్చి యేయుటయు
సకలగీర్వాణులు సకలసంయములు, సకలగంధర్వులు సకలపన్నగులు
సకలభూతంబులు సకలదిక్పతులు, సకలతారాగ్రహచంద్రసూర్యులును
సకలలోకంబులు చలనంబునొంది, సకలదిక్కులు మండఁ జండవేగమున
బ్రహ్మాండభాండంబు బలువిడి నెగడి, బ్రహ్మదండము దాటి పఱతేరఁ జూచి
బ్రహ్మాదులకు నడ్డపడరానియట్టి, బ్రహ్మాస్త్ర మవలీలఁ బట్టుక మ్రింగెఁ
సురుచిరబ్రహ్మతేజోమూర్తి వెలుఁగ, నరుదార నమ్మునియంగరోమముల
నెఱిమంట లెగయ ననేకబాణంబు, లఱిముఱి వెడలి విశ్వామిత్రుఁ దాఁకి
చుఱుపుచ్చఁదొడఁగినఁ జూచి కౌశికుఁడు, నెఱిచెడి యెంతయు నిజసత్త్వ మెడలి
తరమిడి యాబ్రహ్మదండ మొక్కటను, వరశస్త్రకోటులు వమ్ములై పోలిసె
నస్త్రముచేల మీయనబ్రహ్మబలము, క్షత్రబలంబది గాల్పనే యనుచు
చెనటియై మగిడి కౌశికుఁ డాలు దాను, జని ఘోరతపమర్థి సలుపుచునుండె
నటమీఁద సుతుల విశ్వామిత్రమౌని, పటుసత్త్వవంతులఁ బడసె నల్వురను
వినుము దుష్యంద హావిష్యందనాము, లన దృఢనేత్ర మహారథు లనఁగఁ

జలము డింపక పెక్కు సంవత్సరమ్ము, లలఘునిష్ఠలఁ దపం బటు సేయ మెచ్చి
పంకజసంభవుఁ డింపార వచ్చి కౌశికునిఁ, గనుఁగొని యెంతయుఁ గరుణించి పలికె
నీతపంబున మెచ్చి యిచ్చితి నీకుఁ, బ్రీతిమై నిట రాజఋషిపదం బనఘ
యని పోవ గాధేయుఁ డతిదీనుఁడగుచు, నెనయంగ నీతపం బెంత చేసినను
గడపట బ్రహ్మర్షి గానేరనైతి, నెడపడి చెడిపోయి యీయుగ్రతపము
నీరాజఋషిపదం బే నొల్ల ననుచు, ఘోరతపంబు గైకొని సేయుచుండె
అంత నిక్ష్వాకుకులాగ్రణియైన, సంతతకీర్తి త్రిశంకుఁ డన్రాజు
తనువుతోడను గూడి తా నాకమునకు, నొనరంగఁ జనుజన్న మొనరింపఁ దలఁచి
భక్తి వసిష్ఠునిపాలి కేతెంచి, యుక్తమార్గంబున నుపచరించుచును
దివిజలోకమున కీదేహంబుతోడ, సవనంబు గావించి చనఁ గోర్కె నాకు
ననురక్తిఁ గావింపుఁ డనఘ నాచేత, మునుల రప్పింపుఁడు ముద మొప్ప ననిన
నరనాథ యొడలితో నాకలోకమున, కరుగ నసాధ్య మీయవనీశులకును
అనవుడు రాజన్యుఁ డట దక్షిణమున, ఘననిష్ఠఁ దపమూర్తిఁ గావించుచున్న
చిరపుణ్యులైన వసిష్ఠపుత్త్రులకుఁ, గరమర్థిఁ బ్రణమిల్లి కరములు మొగిచి
దేవలోకమున కీదేహంబుతోడఁ, బోవచ్చు యాగంబు పూని నాచేతఁ
జేయింపుఁ డనిన వసిష్ఠుఁ డీతెఱఁగు, సేయుఁడీ యనె నేని చేయింతు మనుడు
నారాజచంద్రుఁ డిట్లనియె వసిష్ఠుఁ, డేరాజులును జేయ రీక్రతు వనియె
మీకడ నిటు రాక మీరైన నన్నుఁ, జేకొని యజ్ఞంబు సేయింపవలయు
నరయఁ బురోహితు లగువారు గారె, ధరణీశులకు సర్వధర్మసాధకులు
అనిన వాసిష్ఠు లాయవనీశుఁ జూచి, ఘనుఁడు వసిష్ఠుండు గాదన్న తెఱఁగు
నిర్మలమతి నొరుల్ నేర్తురే సేయ, దుర్మతి వగు నీకుఁ దోఁపదు గాక
యనిపల్కి నిర్విణ్ణుఁడై సంయమీంద్రు, తనయులఁ జూచి యాధరణీశుఁ డనియె
మీతండ్రి నిరసించె మీరును జేయ, రైతి రే తెఱఁగున నైన నీక్రతువు
హితబుద్ధి లేనిమీ రేల నా కింక, నితరులచేతఁ జేయించెదఁ గాక
యనినఁ జండాలుండ వగుమంచు నలుకఁ, గనుఁగొని పల్కి రాఘనపుణ్యు లంత
భాసురంబగు భూమిపాలు తేజంబు, వాసిష్ఠకోపాగ్ని వడిఁ గాలె ననఁగ
నారయ నీలదేహంబును నీలి, చీరయు జుంజురుశిఖయును దనర
నంట నశుద్ధంబులైన మాలిన్య, మంటించు నీరూప మనుభంగి దోఁపఁ
బ్రణుతవర్ణస్ఫూర్తిఁ బరఁగిన కనక, మణిభూషణము లోహమయములై తనర
నోజమైఁ గష్టనామోక్తిభేదముల, నాజాతి కనురూపమైన రూపమున
జననాథుఁ డతిఘోరచండాలభావ, మొనరంగఁ జెడ్పడియున్న వీక్షించి
పౌరభృత్యామాత్యబంధువర్గంబు, లారాజు వర్జించి రంత నారాజు
నొదవినభయమున నొయ్య మెట్టుచును, నొదుకుచు జనులకు నోసరించుచును
జని మహామహుని విశ్వామిత్రుఁ గనినఁ, గనికరం బొదవ నాగాధితనూజుఁ
డిల నయోధ్యాపురం బేలెడినీకు, నెలమిఁ జండాలత్వ మేల పాటిల్లె

నేతలంపున వచ్చి నెఱిఁగింపు మనిన, నాతండు ముకుళితహస్తుండై పలికె
నిరవొంద బొందితో నింద్రలోకమున, కరుగఁజొప్పడునట్టి యాగంబు మున్ను
చేయింపుఁ డనిన వసిష్ఠుఁ డీతెఱఁగు, సేయింప రాదని చెప్పె నుత్తరము
నావసిష్ఠునిపుత్త్రు లగువారు నతఁడు, గావింపఁగాదన్నఁ గా దని పలికి
రితరులచేతఁ జేయింతు నన్నాట, కతిరోషమున మాల వగు మన్న నైతి
ననఘ నాచేసెద నన్న యధ్వరము, నొనరింతు నామాట కొగి బొంకు లేదు
ఇష్ట[illegible] నిటమీఁదనైన, నెట్టన సత్యంబు నెగడఁ బాలింతుఁ
బెక్కుధర్మంబులు పెక్కుజన్మములు, పెక్కువతోఁ జేసి పెంపు గైకొంటి
గురులఁ బూజించితి గురులు నావలనఁ, గరుణచాలమి ధర్మకార్యంబు నిలిచి
పౌరుషం బడి దేవ ఫలము లేకున్న, నేరమి వాటిల్లు నిక్కువం బరయ
నేవిధంబుననైన నీవు నాపాలి, దైవమై రక్షింపఁ దగుదు నా కనియె
అనిన విశ్వామిత్త్రుఁ డతని వీక్షించి, జననాథ నీవింక సంతాప ముడుగు

త్రిశంకునికై కౌశికుఁడు యజ్ఞంబుచేయ నారంభించుట

దీనునిఁ జేపట్టితిని త్రిశుద్ధిగను, మానుల రప్పించి మఘము సేయించి
దేహంబుతోడనే తివిరి నేఁ బలుక, సోహంబు గాకుండఁ బుచ్చెద దివికి
విను నిన్నుఁ బరమపవిత్త్రుఁ గావింతు, నని పల్కి శిష్యుల నందఱఁ జూచి
మునుకొని మీరెల్ల మునుల ఋత్విజులఁ, గొనిరండు వే త్రిశంకునియాగమునకు
నని నియోగించిన నట్ల వా రేఁగి, మునివరేణ్యులనెల్ల మొగిఁ దోడితెచ్చి
కలయ విశ్వామిత్త్రుకడకు నేతెంచి, చలమేది నిల్చిరి సంయమీశ్వరులు
వారు వసిష్ఠునాశ్రమవాసులెల్ల, వారలు దక్కంగ వచ్చి రందఱును
ఆవసిష్ఠునిపుత్త్రు లాడిరి కొన్ని, యావాక్యములు విను మంచు వా రనిరి
మతి విచారింపక మఘము సేయించు, నతఁడు రాజఁట మాలఁడఁట సేయువాఁడు
చండాలుమఘమున సకలమునీంద్రు, లుండి భోజనము లే యుక్తిఁ జేసెదరు
అడ కేమొగముల నరుగుదెంచెదరు, వేడుక సురలు హవిర్భాగమునకుఁ
బరఁగ విశ్వామిత్త్రపాలితుండైన, నరుఁ డెట్టులొందెడు నాకలోకంబు
విన విస్మయం బని వెలయ దూషించి, రనిన విశ్వామిత్త్రుఁ డగ్నియై మండి
కడునిష్ఠుఁ దపమిట్లు గావించు నన్ను, నదరి దూషించు పాపాత్ములందఱును
నూతనగతి నేడునూఱుజన్మముల, బాగుగాఁ గ్రవ్యాదభావంబుఁ దాల్చి
మానవశునకాదిమాంసము ల్దినుచు, హీనులై చరియింపనిమ్ము లోకముల
నసమున నన్నాడు నామహోదయుఁడు, వసుధ నిషాదుఁడై వర్తింపనిమ్ము
అని శపియించి సంయముల వీక్షించి, మునులార యీరాజముఖ్యుఁ ద్రిశంకు
నున్నతకులశీలు నురుకీర్తిలోలు, సన్నుతధర్మజ్ఞు సత్యప్రతిజ్ఞుఁ
గ్రతువుసేయింపుఁడు గాత్రంబుతోడ, నితఁ డింద్రపురి కేఁగు నిరవొప్ప ననిన
నాఋషిమాటల కమ్మహామునులు, దారు విచారించి తమలోన ననిరి
గాధిసూనునిమాట గాదంటిమేని, క్రోధించి శపియించుఁ గ్రూరవాక్యములఁ

గానఁ జేయింతము క్రతువు కౌశికుఁడు, మానుగాఁ జెప్పినమహితమార్గమున
నని పల్కి మునులెల్ల నధ్వరకర్మ, మొనరింప నామంత్రయోగాదు లమర
నాగాధితనయుండు యాజకుం డగుచు, యాగభాగములకు నమరులఁ బిలిచెఁ
బిలిచిన రామంచుఁ బేరెలుంగెత్తి, పలికిరి సుర లటు పలుకఁ గౌశికుఁడు
కుశపవిత్రముచేత గొని స్రువం బెత్తి, దిశలరోషానలదీప్తులు నిగుడ
నాకేంద్రలోకంబునకుఁ ద్రిశంకుండ, నీకోరినటువలె నిన్నుఁ బుచ్చెదను
నడరంగ నే బాల్య మాదిగా నియతి, విడువక తపముఁ గావించితినేని
బొందితోడనె కూడఁ బోయి స్వర్గంబు, నందుము పొమ్మన్న నాత్రిశంకుండు
తత్తపోబలమునఁ దడయక యెల్ల, సత్త్వము లేగెడి సరణిఁ బోవుటయుఁ
జండాలుఁడవు నీవు స్వర్గలోకమున, నుండనీ నని యింద్రుఁ డుదరి త్రోపింపఁ
గడఁక విశ్వామిత్ర కావవే యనుచు, వడిఁ దల క్రిందుగా వచ్చుచున్న
శరణార్థియైన త్రిశంకునిఁ జూచి, కరుణావిధేయుఁడై గాధేయుఁ డపుడు
జననాథ నీవాకసమునందె నిలువు, మని పల్కి నిలుపుచు నటఁ దక్షిణమున
నలుకఁ ద్రిశంకున కమరేంద్రుతోడి, చలమున వేఱొక్క స్వర్గంబు నేసి
లలినందు సప్తర్షు లనుదారకలను, నలవడఁ గల్పించి యానాకమునకు
వేఱు దేవతలఁ గావింప నింద్రునకు, మాఱింద్రుఁ గల్పింప మదిఁ దలంచుటయు
జాల భీతిలి సర్వసంయము ల్సురలు, నోలి విశ్వామిత్రునొద్ద కేతెంచి
యిలలోన మునినాథ యీత్రిశంకుండు, దలపోయ గురుశాపదగ్ధుండుగానఁ
దగ నాకమున నుండఁ దగ దన్నమాట, తగవుగాఁ గొని గాధితనయుండు పలికె
సురలార యీతని సురలోకమునకు, నరిగెదు మేనితో నని పల్కినాఁడ
నామాట నిజముగా నైన నీనాక, మీమహీనాథున కిటు చెల్లనిండు
ప్రథ నొప్ప లోకముల్వరఁగునందాఁక, నభమునఁ బొలిచి యీనక్షత్రములను
గలయనచ్చరవీథికం బెను మీఁదఁ, దొలఁగని తేజంబుతోఁ జెలువొంది
బృందారకస్ఫూర్తి పెంపొందు శిరము, క్రిందై త్రిశంకుండు కృతపుణ్యుఁ డగుచు
కర మొప్ప నీతారకలకును నడుమ, నురుతరకీర్తిమై నుండనిం డనిన
ననుమతించుచు నప్పు డాయనుగ్రహముఁ, గొనియాడి ముని వీడుకొని సురల్మునులు
లలి నిజస్థానంబులకు నేఁగి రంత, నెలమిఁ గౌశికుఁడు మునీంద్రులఁ జూచి
యిమ్ముగా నటమీఁద నిది తపంబునకు, సమ్మర్ద మిక్కడఁ జాలంగఁ గలుగు
మునులార మనమింక ముదము చిత్తమునఁ, దనర నొక్కెడకుఁ బోదము రండటంచుఁ
గడఁకనక్కడఁ బాసి కదలి విశాల, కడ కేఁగి యందుఁ బుష్కరతీర్థమాడి

### అంబరీషుఁడు యజ్ఞపశువుగా శునశ్శేఫునిఁ గొనిపోవుట

యంబుఫలాహారి యగుచుఁ బెక్కేండ్లు, పంబిననిష్ఠఁ దపంబు గావించె
నంబరీషుం డయోధ్యాపురివిభుఁడు, శంబరరిపుమూర్తిసముఁ డట్టియెడను
వెలయంగఁ గ్రతువు గావింపఁగాఁ బూని, బలభేదిచే యాగపశువుఁ గోల్పోయి
యరసి లేకున్నఁ బ్రాయశ్చిత్తవిధికి, నరపశు వెదుగుచు నానాశ్రమముల

నరయుచు నందంద నటనొక్కమౌని, పరునింటికడకు భూవరుఁ డేఁగుదెంచి
భృగుతుంగవాసియై పేదయై నియతిఁ, దగనున్న రుచికునొద్దకుఁ బోయి మ్రొక్కి
కరుణాఢ్య యేను యాగము సేయఁగోరి, పరికింపనేరక పశువుఁ గోల్పడితి
గొనకొని యొకలక్షగోవులఁ బుచ్చు, కొని యాగపశువుగాఁ గొడుకు నా కిమ్ము
నావుడు నాతండు నాపెద్దకొడుకు, పై వేడ్క సేయుదుఁ బశువుగా నీను
నావుడు మునిపత్ని నాపిన్నకొడుకు, పై వేడ్క సేయుదుఁ బశువుగా నీను
అని యిరువురు పూని యాడువాక్యములు, విని శునశ్శేఫుఁ డుర్వీపాలుఁ జూచి
తనపెద్దకొడుకు మాతండ్రి పాటించుఁ, దనపిన్నకొడుకు మాతల్లి పాటించు
వారలు నీ కేల వచ్చెద నేను, గోరి వీరల కిమ్ము గోసహస్రముల
ననిన నట్ల యొనర్చి యమ్మునిపుత్త్రుఁ, గొని రథం బెక్కించుకొని శీఘ్రవృత్తి
జననాథుఁ డెంతయు సంతోష మొప్పఁ, జని చని పుష్కరాశ్రమభూమిఁ జేరె
నచట శునశ్శేఫుఁ డతితపోనిష్ఠ, నచలుఁడై యున్న విశ్వామిత్రుఁ గాంచి
తనమేనమామ యాతఁడుగానఁ బ్రేమ, ననలొత్త సుచితప్రణాముఁడై పలికె
ననుఁ దలిదండ్రు లీనరవరాగ్రణికి, ననఘాత్మ పశువుగా నమ్మి పొమ్మనిరి
చెలువొప్ప నీరాజు సేయుజన్నంబు, ఫలియింపఁజేసి నాప్రాణముల్గావు
తల్లియుఁ దండ్రియు దైవంబు గురువు, నెల్లచుట్టములు నా కీవేళ నీవె
యని దైన్యపడఁగ విశ్వామిత్రమౌని, దనతనూభవుల నందఱఁ జూచి పలికెఁ
బ్రాకటంబుగఁ దమపరలోకమునకు, నై కదా సుతులఁ బుణ్యాత్ములు గనుట
పరలోక మిదియ నాపాలికి నన్ను, శరణంబుఁ జొచ్చె నీసంయమిపుత్త్రుఁ
డితఁడు నామేనల్లుఁ డితని రక్షింపుఁ, డితనికై ప్రాణంబు లిడుఁడు మీ రొకరు
అడిగెద మిమ్మన్న నటు సేయఁ గొడుకు, లొడఁబడ మన్న నత్యుగ్రుఁడై మండి
శునకమాంసము దించు సొరిది వేయేడు, లనుభవింపుఁడు దుఃఖ మని శాపమిచ్చి
కౌశికుఁ డత్యంతకారుణ్యబుద్ధి, నాశునశ్శేఫు నొయ్యనఁ జేరఁ బిలిచి
యేను మంత్రములు రెండిచ్చెద నీకు, వాని ననుష్ఠింపు వదలక నీవు
అవి నిన్ను రక్షించు నంబరీషునకు, సవనతంత్రంబును సఫలంబు సేయు
నని చెప్పి మంత్రంబు లవి రెండు నిచ్చె, ననుపమభక్తితో నతఁడు గైకొనియె
మఱునాఁడు వచ్చి యమ్మనుజవల్లభుఁడు, వఱలెడు తనయజ్ఞవాటంబుఁ జొచ్చి
విశసింపఁ బూని యావిమలాత్ముఁ దెచ్చి, పశుపూజచేసి యూపమున బంధించె
నంత శునశ్శేఫుఁ డమ్మంత్రజపము, శాంతుఁడై చేయుచుఁ జలియింపకున్న
నచటి కింద్రోపేంద్రు లర్థితో వచ్చి, సుచరిత్రు నంబరీషునిఁ జేరఁ బిలిచి
క్రతుపూర్ణఫలమిచ్చి కడనున్న రుచికు, సుతుఁ జిరాయువుచేసి సురలతోఁ జనిరి
అరుదైనతపమున నంత వెయ్యేండ్లు, జరపిన బ్రహ్మ విశ్వామిత్రుఁ గదిసి
నీకు ఋషిత్వంబు నీతపశ్శక్తిఁ, జేకూడె నని యొప్పఁ జెప్పి విచ్చేసె
నంతటఁ దనియక యత్యుగ్రతపము, సంతతనియతితో సలుపుచు నుండఁ
గాముదీమములీలఁ గైకొననేర్చు, కామునిబాణంబు కమనీయకంబు

### విశ్వామిత్రుఁడు మేనకను గూడుట

చెలువొందునప్సరస్త్రీమూర్తి దాల్చి, మెలఁగెడుగతితోఁడ మేనక యపుడు
లలితయౌవనకళాలావణ్యగణ్య, జలకేళిఁ దేలనాసతిజారుకొప్పు
చికిలిమాపులు నునుఁజెక్కులముద్దు, మొకము కెంపులమోవి మొలకనవ్వులును
బొంగారుకుచకుంభములు పదార్వన్నె, బంగారుపొడిరాలుబాహుమూలములు
చిన్నారినూఁగారు సింగంపుఁగౌను, పొన్నపూపొక్కిలి బొదలెడుపిఱుఁదు
లూరులతీరు నోరూరఁగాఁ జూచి, పేరువాడి మరుండు పెళపెళనార్వ
ధ్యానంబు మౌనంబుఁ దపముఁ బోకార్చి, మేన గళల్గ్రమ్మ మేనకఁ జూచి
నన్నుఁ గాయజుకేళి నలినాక్షి పొందు, మన్న నామాటకు నంగీకరించి
పదియేండ్లు మది సోలి భావజుకేళి, సదమదంబుగ సౌఖ్యసరసిని దేలి
మతి వివేకము పూని మౌని యెంతేని, దఱుగని తనతపోధనము పోవుటకుఁ
బరితపించుచు మది పదిలంబుచేసి, సురలోకమునకు నాసుదతి వీడ్కొలిపి
యింద్రునియత్నంబు లివి యంచుఁ దెలిసి, యింద్రియజయశుద్ధి యేఁగాంతు ననుచు
శీతాద్రి కరిగి కౌశికిచెంతఁ జేరి, యాతపంబునను మహాతపం బపుడు
వర్షముల్ వెయ్యైన వచ్చి విరించి, హర్షించి నీవు మహర్షివై తనిన
నీరజాసన నన్ను నీవు నీచిత్త, మారంగ బ్రహ్మర్షి యన్నంతదాఁకఁ
జరియింతుఁ దప మన్నఁ జరియింపు మనుచు, నరవిందభవుఁ డేఁగె నంతఁ గౌశికుఁడు
బ్రహ్మదేవుఁడు పోవఁ బరమపావనత, బ్రహ్మర్షితను నేను బడసెద ననుచు
నూరుపు వుచ్చక యూర్ధ్వబాహుండు, మారుతాహారుండు మౌనియు నగుచుఁ
బనివడి వేసవిఁ బంచాగ్నిమధ్యమున వానకాల మిమ్ముల బట్టబయల
మంచుకాలంబున మడుఁగులయందు, నంచితంబుగఁ జేసె నత్యుగ్రతపము
నీభంగి వెయ్యేఁడు లేగినపిదప, సౌభాగ్యవతి రంభ జంభారి చూచి
యెలమిమై దేవతాహితకార్య మొకటి, చెలువార నే నీకుఁ జెప్పెద వినుము
సురహితంబుగ గాధిసూనుతపంబు, సురుచిరంబుగ మాన్పు సుందరి యనుడుఁ
గ్రూరతపంబు గైకొనియున్నతనిఁ, జేర నాతరమె శచీనాథ నీకు
మ్రొక్కెద నమ్మహామూర్ఖునివిక్కు, నిక్క చూడఁగనోప నీపాదమాన
నాకేశ కోపించు నన్ను శపించు, నాకౌశికుని సైఁప నని జాలిఁ బడుచు
నెఱిఁగి యెఱింగి తారెట్టివెంగలులు, కొఱవిచేఁ దలఁ గోకుకొనువారు గలరె
యన విని యింత భయంబేని నీకు, మనసిజమాధవు ల్మరి సహాయముగ
వత్తురు చను మన్న వనితయు నతని, చిత్త మెఱింగి చెచ్చెర భూమి కరిగి
గాధిసూనుం డున్న ఘనతపోవనము, మాధవమన్మథుల్మఱి సహాయముగఁ
గిరకోకిలసమాకీర్ణ మయూర, శారికానిజసఖీసహితయై చొచ్చి
యారంభయును మనోహరలాస్యగరిమ, నారంభ మొనరింప నలిగి కౌశికుఁడు
పదివేలవర్షముల్పాషాణభావ, మొదవంగఁ గైకొని యుండి యామీఁద
నురుతపోనిధియైన యొకవిప్రువలన, సరసిజానన పొందు శాపమోక్షంబు

నని పల్కఁ బాషాణమయ్యె నారంభ, మనసిజుండును నేఁగె మతి భీతుఁ డగుచుఁ
దనతపం బొక్కింత దఱిగిన నంతఁ, దనలోన నగ్గాధితనయుఁ డూహించి
యపుడు కామంబున నడఁగె నాతపము, నిపుడు క్రోధంబున నిచ్చితి ననుచు
మదిలోన వగచి కామంబు క్రోధంబు, వదలి నిరాహారవంతుఁడై నియతి
విజితేంద్రియుండునై వేయువత్సరము, లజుఁడు మెచ్చఁగఁ దపం బతినిష్ఠఁ జేసి
యనయంబు బ్రహ్మర్షి ననిపించుకొందు, నని యుత్తరము వాసి యటఁ బూర్వదెస
నెనసి వెండియును దేవేంద్రుండు సేయు, ఘనవిఘ్నకోట్లకుఁ గదలక నిలిచి
యరుదెంచి యంత సిద్ధాశ్రమభూమి, నురు ఘోరతపము సేయుచునుండఁ గలిగె
వరతపోనియతిమై వర్షసహస్ర, మరుగఁ బారణ సేతునని యున్న చోట
నివ్వరిబియ్యంబు నెఱినెఱిఁ దెచ్చి, యవ్వి యన్నియుఁ బాకయత్నంబుచేసి
యారయ దేవతార్పణముగాఁ జేసి, వారవి భుజియింప వడిఁ దలంచుటయు
బలభేది యొకముదిబాపఁడై వచ్చి, నిలిచి గ్రాసము వేఁడ నెమ్మితో నిచ్చె
నాయమరాధీశుఁ డడరి భోజనము, చేయుచో నన్నంబు శేషింపకున్న
మఱియును వెయ్యేండ్లు మౌనియై నిలిచి, తఱుఁగని నిష్ఠతోఁ దపమాచరింప
నప్పుడు మునినాథునొదలఁ బుట్టి, కప్పె లోకముల నుత్కటమైన పొగయుఁ
గలఁగెఁ బయోధులు కంపించె ధరణి, కులగిరు లదరె దిక్కులు చిక్కువడియె
నమరులు గంధర్వ లఖిలసంయములు, కమలగర్భునిఁ బ్రీతిఁ గని మ్రొక్కి యనిరి
యాయతచిత్తుఁడై యత్యుగ్రతపము, చేయుచున్నాఁడు చెలఁగి కౌశికుఁడు
అతనిమనోరథం బర్థి సిద్ధింప, మతి మెచ్చి తప మింక మాన్పకయున్న
ననఘ విశ్వామిత్రునత్యుగ్రమైన, ఘనతరవహ్నిచేఁ గాలు లోకములు
అన విని వారితో నప్పుడు కదలి, వనజాసనుఁడు వచ్చి వరదుఁడై నిలిచి
వినుము కౌశిక యింక విపరీతతపము, పనిలేదు చాలింపు బ్రహ్మర్షివైతి
వనినఁ గౌశికుఁడు బ్రహ్మాదిదేవతలఁ, గనుఁగొని పల్కె నక్కజమైన భక్తి
బ్రహ్మర్షిపదమేను బడసితినేని, బ్రహ్మపుత్త్రుఁడు లోకపావనమూర్తి
చిరపుణ్యశాలి వసిష్ఠుండు వచ్చి, యరసి నన్ బ్రహ్మర్షి వనకున్న నమ్మ
ననిన వసిష్ఠుని నబ్జసంభవుఁడు, ననిమిషులును బిల్వ నర్థితో వచ్చి
బలితంపుఁదపమున బ్రహ్మర్షివైతి, తెలిసితి మింక సందేహంబు లేదు
ముద మొప్పఁ జను మన్న ముని వసిష్ఠునకుఁ, బదిలుఁడై మ్రొక్కి సద్భక్తిఁ బూజిం
నంత విశ్వామిత్రు నఖిలదేవతలు, నెంతయు దీవించి యేఁగిరి దివికి
నారూఢపదుఁడు విశ్వామిత్రుమహిమ, లారయ నిట్టిమహాద్భుతక్రియలు
అని పల్క రాముఁడు నాలక్ష్మణుండు, జనకాదులును సభాసదులు మోదించి
రిల్లడ జనకునియింట నుగ్రాత్ముఁ, డెల్లరెఱుంగ మున్నిడిన చాపంబు
కడఁకమై విఱిచి రాఘవుఁ డేపుమెఱసి, కడుమోదమున సీతఁ గైకొను నెల్లి
నని రసాతలమున కంతయుఁ జెప్పఁ, జనిన చందమున భాస్కరుఁ డస్తమించె
జనకు వీడ్కొని గాధిసంభవుఁ డొక్క, యునికిపట్టున రామయుక్తుఁడై యుండె

ననుపమప్రీతితో నారాత్రి గడపి, యినుపొడుపున నిత్యకృత్యముల్ దీర్చి
జనకుచెంతకు రామసహితుఁడై పోయి, యనియె విశ్వామిత్రుఁ డందఱు వినఁగ
నినకోటిసమతేజు లీవిశ్వమూర్తు, లనఘకీర్తులు వీ రనన్యగోచరులు
ఈపుణ్యధనులు నీయింటిలో నున్న, చాపంబు చూడంగఁ జనుదెంచినారు

### జనకుండు శివునిచాప మెఱింగించుట

ఆవిల్లు దెప్పింపు మనవుడు జనక, భూవరుం డప్పు డద్భుతమంది పలికె
భవుఁ డంధకాసురభస్మాసురాది, దివిజారివరుల సాధించె నావింట
నుల్లోకుఁడై శివుఁ డుగ్రదానవులఁ, దొల్లి యనేకులఁ ద్రుంచె నావింట
విపులకోపాటోపవిభవుఁడై హరుఁడు, త్రిపురదుర్గములు సాధించె నావింట
నావింట మఱి దక్షుయాగంబుఁ జెఱిచె, దేవేంద్రముఖ్యులఁ ద్రిదశులఁ దోలి
నియతాత్మ మాతాత నిమిచక్రవర్తి, నయనయాన్వితునకు నాఱవతరము
నగుదేవరాతుచే హరుఁ డిచ్చెఁ దొల్లి, యగణితబలమైన యావిల్లు పిదప
నదియాదిగా నుండు ననఘ మాయింట, విదితమై యావిల్లు వినుతులనొప్పి
జన్నంబు గావింప సమకట్టి యేను, సన్నుతనియతి భూస్థలిశుద్ధికొఱకుఁ
గ్రతుశాల దున్న నాఁగటిచాలులోన, నతులితంబుగఁ జాలునం దొప్పమిగిలి
మందసంబును రాఁగ మది నుబ్బి చూచి, మందసంబును నేను మఱుత దీయంగ
నతివైభవంబుగా నందులో నపుడు, నతివ యొక్కతె పుట్టె నాశ్చర్యలీలఁ
బ్రీతితో సీత యన పేరొప్పఁ బెట్టి, యాతన్వి నాకూఁతు రని పెంచుచుండ
నిల వసంతంబులనెలతీఁగెఁ బోలి, నళినారికళఁ బోలి నానాఁటఁ బ్రబలి
యింతయై యంతయై యొలజవ్వనమున, వింతయై యాయింతి వెలయుటఁ జూచి
తలకొని తరుణికై ధరణివల్లభులు, బలియులై యేతెంచి పడుచును దమకు
నడిగిన వారల కంటి నేనప్పు, డుడురాజబింబాస్య కుంకువ గలదు
హరునివిల్లిది దీనినతిసత్త్వయుక్తిఁ, బెరిఁగి యేతెంచి మోపెట్టినఁ జాలు
నతనికి నాకూఁతు నబ్జాక్షి నిత్తు, నతిమోదమున నన్న నన్నరేశ్వరులు
నెత్తిన కడఁకతో నేతెంచి చాప, మెత్తఁజాలకపోదు రెందఱేనియును
ధనువెత్తఁజాలని ధరణీశులెల్లఁ, దనరారు సిగ్గునఁ దలలెత్తలేక
కూఁతు నిచ్చెద నని కోదండ మొకటి, బ్రాఁతిగా నెపమిడి భ్రమియించె మనల
జనకుఁ డాతని నింక సకలయత్నముల, నని నేసి సాధింత మని విచారించి
చనుదెంచి కోటపై సంవత్సరంబు, ఘనసైన్యములతోడఁ గడిమిమై విడియఁ
దగ మున్ను గూర్చిన ధాన్యాదు లెల్ల, నొగిఁ దీఱ మదిలోన నొకటి చింతించి
వడి దేవతలఁ గొల్చి వారిచే నపుడు, వడసిన చతురంగబలముఁ గైకొనుచు
విడిసినబలముపై వీఁకతో నడువఁ, దొడరఁజాలక భీతితో కొంద ఱరుగఁ
గొందఱు మాతోడ ఘోరాజిచేసి, చిందరవందరై చెడి వార లోడి
రక్కజమగుశక్తి నావిల్లు రాముఁ, డెక్కువెట్టినఁ గూఁతు నెలమి నిచ్చెదను
విల్లున్నమందస వేగ తెమ్మనుచు, బల్లిదు లగువారిఁ బదివేలఁ బనిచె

నది లోహమయమును నత్యాయతంబు, విదితాష్టచక్రంబు విపులంబు నగుచు
నమరెడుమందస మావింటితోడ, తమతమ సత్త్వము ల్దగఁగొని వారు
కనకాద్రితోఁ గూడఁ గమలజాండంబు, గొనివచ్చుగతి నీడ్చుకొనివచ్చుదాని
జనకునంతఃపురచారుసౌవాసు, పనివడి దాదులు పఱతెంచి వేగ
జానకి నూర్మిళ జనకునిదేవి, కానంగఁ జనుదెంచి కని చెప్పి రెలమి
వినరమ్మ చెలులార విన్నపం బొకటి, మనరాజుసభలోన మఱి మునులుండ
గాధినందనుఁడైన కౌశికు వెనుక, నరవరోత్తముల నాజానుబాహువుల
నమరంగ దేవగంధర్వులకన్న, కొమరైన తేజంబు కొమరొప్పువారి
చెలువైన తేజంబు చెలఁగి వీక్షించి, యల వీరు లెవ్వార లని జనకుండు
అడిగినఁ గౌశికుఁ డతిహర్ష మాత్మ, నడరంగ దశరథు నాత్మజు లీరు
హరుచాప మెక్కిడ హర్షించి రిటకు, ధరణీశ తెప్పింపు తగువారిఁ బనిచి
యన నిట్లు కౌశికుననుమతిమీఱఁ, దనమంత్రులను బిల్చి ధనువు దేఁ బనిచె
తోరణగండ్లలోఁ జూడఁగవచ్చు, నారయ వేగ రం డని నాఁతి పిలువ
కులము శౌర్యము రూపుగుణమును బొగడ, చెలఁగి చెవుల సుధ చిలికినట్లుండఁ
బ్రేమ వెగ్గలమైనఁ బృథివీజకపుడు, రోమాంచమయ్యె నాగూఢమై మేనఁ
బ్రియమును భయమును బెరిగొని పొదల, నయమెంచి తలవాంచి ననఁబోణియుం
అలివేణి సిగ్గున నటఁ బల్కకున్నఁ, జెలువకుఁ బరిచర్య చేసిరి సఖులు
పన్నీట కుంకుమపదనిచ్చి యొకతె, చెన్నార మకరికల్చెక్కిళ్ల వ్రాసెఁ
దట్టుపునుంగును దగుచందనంబు, దట్టంబుగాఁ బూసెఁ దరళాక్షి కొకతె
నుదటఁ గస్తురిరేఖ నుతముగాఁ దీర్చి, నెదుట నద్దముఁ బెట్టె నెలనాగ యొకతె
కురులు సున్నగ దువ్వి కొప్పమర్చుచును, విరులందు నొకతన్వి వింతఁగాఁ దురిమె
వాసించుబాగాలు వడి నాకుమడుపు, లాసతీజనమణి కందిచ్చె నొకతె
అలినీలవేణికి నందంబుగాను, మొలనూలిగంట లిమ్ముల మ్రోయ నిడియెఁ
గులుకుఁబాలిండ్లపై గొప్పముత్యముల, విలసిల్లు హారముల్ వేసె నొక్కరితె
కాంత గట్టిన చంద్రకావివల్వలను, వింతగా నెఱి నొప్ప వెసఁ దీర్చె నొకతె
యీమాడ్కి చెలికత్తె లెలమిఁ గైసేయ, హేమపీఠంబున నెలమితో నుండ
నప్పుడు కల్యాణి నవనినందనను, తప్పక వీక్షించి తల్లి దా నపుడు
కనకసౌధగవాక్షకలితగా నపుడు, వనజాక్షిఁ దోడ్కొని వచ్చె నాయెడకు
నెప్పుడు వీక్షింతు మినవంశజాతు, నెప్పుడు గనుఁగొందు మేము రాఘవుని
అని వారలందఱు హర్షంబుతోడ, ఘనగవాక్షములందుఁ గనుఁగొని రంత
రాముని లోకాభిరాముని దివ్య,ధాముని గన్గొని తరలాక్షు లపుడు
ఘనశౌర్యరూపముల్ గలిగినవానిఁ, గనకచేలునిమాడ్కిఁ గళలొప్పువాని
జోకపువ్వులవిల్లుఁ జొనిపినవాని, జ్యాకిణాంకితహస్తజలజుఁడౌవాని
రూపంబు లొక్కట రుచిరవర్ణముల, నేపార వేఱుగా నెన్నఁగవచ్చు
శ్రీపతియంశజుల్ క్షితిపాలసుతులు, భూపాలరత్నము ల్పొలుపారుటౌర

జనకజ దగు రామచంద్రున కిరవు, ఒనరె సౌమిత్రికి నూర్మిళ యనుచుఁ
దనరుఁ గాకని వారు దగనెన్నికొనుచు, ననుపమప్రేమతో నటఁ జూచుచుండ
నమరేంద్రసభఁ బోలు నాసభనడుమ, నమరంగ మందసమటఁ జేర్చి రపుడు
సభలోన నునుపంగ జనకభూవిభుఁడు, శుభమూర్తినగ్గాధిసుతుని వీక్షించి
కిన్నరగంధర్వగీర్వాణయక్ష, పన్నగరాక్షసప్రభృతు లెవ్వరును
నెక్కుపెట్టఁగఁజాల రీచాప మనిన, దక్కిననరులకుఁ దలపంగ దరమె
కౌశిక రామలక్ష్మణులకుఁ జూపు, మీశరాసన మన్న నెలమి నమ్మునియు
రామచంద్రుని జూచి రఘువంశవర్య, యీమహాధనువెత్తి యెక్కిడి తివియు
మాదివరాహమై యవలీల గోట, మేదినీతలమెత్తి మెఱసిననీకుఁ
దనర నీవిల్లెంత తలపోయ ననఘ, యని యిట్లు మునివరుఁ డానతిచ్చినను
మనువంశతిలకుఁడు మఱి వేగపుత్తు, నని మునిసభలోన నారాజు క్రియను
సౌమిత్రియును దాను జయ్యన లేచి, ప్రేమయుఁ దమకంబు పెనఁగొనుచుండఁ
జెలఁగుచుఁ దనమీఁది చెఱఁగు రాఁదిగిచి, మొలనూలు బిగఁజుట్టి మోహనాకృతులఁ
దిరముగా నిగ్గులు దిశల శోభిల్ల, నరవిందలోచనుం డసమసాహసుఁడు
మొలనూలిగంటలు మురువుమించగను, మలఁగుచు నవరత్నమాలికల్పొరల
బాహుపుర్లుంగరాల్పటుకంకణములు, బాహువులంగుళావళికాంతులీన
నమరంగఁ గర్ణభూషాదులకాంతి, కొమరారుచెక్కిళ్లు గుదిగొని మెఱయ
అలకలు పెడతల నటనృత్యమాడి, తళుకొందు బంగారుతనుకాంతులీన
కోటిమన్మథలీలఁ గొమరుదీపింప, నీటుగా నటువచ్చి నెఱియెల్ల రెఱుఁగ
జనకజుసభలోన జనసుతంబైన, మనువంశతిలకుండు మందస దెఱచి
ధరణీతలంబెల్లఁ దనమీఁద నునిచి, చిరనిద్రసుఖయించు శేషాహి యనఁగఁ
గాలమేఘములోనఁ గదలనిరుచులఁ, దూలక పొలుచు విద్యుద్దండ మనఁగ
నిరుపమాకారత నిండారి యందుఁ, గరమొప్పు విల్లెత్తి గవిసెన వుచ్చి

శ్రీరాములు శివునివిల్లు విఱుచుట

గర్వించి తనునెత్తఁ గడఁగి యేతెంచు, నుర్వీశబలము లాహుతులుగ మ్రింగ
నరుణరత్నప్రభయనుమంటలొలుకఁ, బెరుఁగుచు నిలుచున్న పెనుచిచ్చువోలె
నక్కజమగుశక్తి నావిల్లు రాముఁ, డెక్కుపెట్టుచునుండ నెఱిఁగి కౌశికుఁడు
హరునిచాపము రాముఁ డతిసత్త్వయుక్తిఁ, బెరిఁగి నేఁ డిదె యెక్కుపెట్టుచున్నాఁడు
అదరకు భూదేవి యాత్మలో నీవు, చెదరి చలింపకు శేషాహి నీవు
కడఁక ధరింపుము కమఠేంద్ర నీవు, కదునేమరకుఁడు దిక్కరులార మీర
లని యని పల్కఁగ నామేటివిల్లు, గొనయ మెక్కించి కైకొనక రాఘవుఁడు
తనబాహుసత్త్వంబు దర్పంబు మెఱసి, జనకునికనియె నాచాపంబు చూచి
యిది చాలఁ జులకన యది చాలఁ బ్రాఁత, యిది చాల నిస్సార మిది చాల నలఁతి
తెగఁగొన నిలువదు దీని నాయెదుటఁ, బొగడితి పలుమారు భూపాల యనుచు
సురలు ఖేచరులు భూసురులు కిన్నరులు, నరులును నృపతులు నలిఁ బర్వి చూడ

నెడపక తనజయం బెల్లెడఁ జాటు, పడుపున విలు గుణధ్వని చెలంగించి
సీతగుణంబులు చెవిసోఁకె ననఁగ, జేతివింటిగుణంబు చెవిసోఁక దిగువ
వడి రక్కసులపట్టు వదలెనన్నట్లు, పిడిపట్టు వదలినఁ బెకలి పేటెత్తి
పెళపెళధ్వనులును బెటపెటధ్వనులు, కలయ దిక్కులద్రువఁగాఁ బెల్లు విఱిగె
విఱుగ రాజన్యులవిపులమానములు, పఱియలువాఱె భూభాగమంతయును
జిడిసె దిగ్గజములు శేషాహి మ్రొగ్గె, బెదరె భూతములు కంపించె లోకములు
జనకుఁడు రామలక్ష్మణులును గాధి, తనయుండు దోఁగఁ దక్కఁ దక్కినవారు
బిట్టులిక్కి మూర్ఛిల్లి పృథివిపైఁ బడిరి, నెట్టనఁ బొడము నానిష్ఠురధ్వనికి
జనకభూవిభుఁ డంత సంతోషమంది, ఘనవిస్మయము నొంది కౌశికుఁ జూచి
నామాట దప్పక నాముద్దుకూఁతు, నీమహితాత్మున కిచ్చెద నింకఁ
దడయక పెండ్లికి దశరథాధీశుఁ, గడుసంభ్రమమున నిక్కడికి రప్పింతు
నని దశరథునకు నత్తెఱం గెల్ల, వినుపించి తోడ్తేర వేడ్కతో నపుడు
తనయాప్తమంత్రులఁ దడయక పిల్చి, పనిచిన పనిపూని పరువడి నేఁగి
జవనాశ్వములమీఁద సాకేతపురికి, దివసత్రయమున నెంతే వేగ వచ్చి
తనయుల సేమంబు దలపోసిపోసి, వనరుచునున్న యవ్వసుధేశుఁ గాంచి
వినతులై జనకభూవిభుఁ డంపినట్టి, జననుతపత్త్రముల్ సన్నిధి నునిచి
నీకుమారుఁడు శౌర్యనిధి రామచంద్రుఁ, డాకౌశికునియాగ మర్థితోఁ గాంచి
జనకుజన్నముఁ జూడఁ జనుదెంచి యందు, మునులు రాజన్యులు ముదమంది చూడ
ధర సురాసురులకు ధరియింపరాని, హరువిల్లు మోపెట్టి యవలీల విఱిచె
విఱిచిన జనకభూవిభుఁ డిచ్చె సీత, నఱలేక తనకూఁతు నారాఘవునకుఁ
బ్రియమునఁ బెండ్లికిఁ బిలువఁ బుత్తెంచె, రయమున విచ్చేయు రాజన్యచంద్ర
యనవుడుఁ దనమది నానందమంది, జనపతి పెండ్లికిఁ జాటింపఁ బనిచి
జనకుమంత్రులకు నుత్సవమొప్ప నిచ్చె, ఘనరత్నభూషణకనకాంబరములు
అఱలేనికులగురుఁ డైనవసిష్ఠుఁ, డెఱఁగొప్పఁ దా వామదేవు జాబాలి
ఘనునిఁ గశ్యపుని మార్కండేయు నత్రిఁ, దనరు బాంధవులను దనయమాత్యులను
నిమ్ములఁ బిలిపించి యిట్లని పలికె, సమ్మదం బడర విశ్వామిత్రునొద్దఁ
దేజంబుతోడ విదేహదేశమున, రాజిలుచున్నారు రామలక్ష్మణులు
అందు రాముఁడు రాజు లందఱు చూడ, నొందు నసాధ్యమౌ నిందుశేఖరుని
చాపంబు విఱిచిన జనకుండు సీత, నేపార రామున కీనిశ్చయించి
యెలమిఁ బెండ్లికిని మిమ్మేఁగుదెమ్మనుచుఁ, బొలుపార నిట వీరిఁ బుత్తెంచినాఁడు
జననుతం బగుఁగదా జనకుసంబంధ, మనిన నందఱు మెచ్చి రమ్మఱునాఁడు

దశరథుఁడు మిథిలకుఁ బోవుట

మొగి వసిష్ఠాదిసన్మునులతోఁ గూడఁ, దగు బంధురాజన్యతతులతోఁ గూడ
రమణీయదివ్యాంబరములతోఁ గూడ, విమలమౌక్తికవజ్రవితతితోఁ గూడఁ
గరిరథభటతురంగములతోఁ గూడఁ, బరమాప్తవరమంత్రిపతులతోఁ గూడ

వినుతపుణ్యాంగనావితతితోఁ గూడ, ననుపమవైభవంబలరఁ గైసేయఁ
గరమొప్ప రథమెక్కి కల్యాణమునకు, నరనాథతిలకుఁ డానందముప్పొంగఁ
గడుఁగెలంకుల గజస్కంధంబులందుఁ, గొడుకులు ముత్యాలగొడుగులనీడఁ
బరమసమ్మదమున భరతశత్రుఘ్ను, లిరువురు గొల్చి రా నేపుదీపింపఁ
గ్రందుగా నిండి మంగళతూర్యకోటు, లందంద మొఱయ మహాభూతి మెఱయ
నెడనెడ విడుదు లనేకవస్తువులు, నడపింప మంత్రులు నాల్గుదినములఁ
జనియెను మిథిలకు జనకుండు నంత, నినకులాధిపునకు నెదురుగా వచ్చి
కొనిపోయి వేడ్కలు కొమరొత్తనపుడు, జనపతి శుచితోపచారముల్ సేసి
మునివరనివహంబు ముదమందనప్పు, డనియె మహానంద మలర నాతనికి
నాకూఁతు దశరథనరనాథ యేను, నీకుమారుని కిచ్చి నెమ్మిఁ బెండ్లికిని
నిటు పిల్వఁబంచిన నీవు విచ్చేసి, తటుగాన నేను గృతార్థుండనైతి
నీవసిష్ఠమహామునీంద్రుఁ డీవామ,దేవాదిమునులు నేతెంచుటఁ జేసి
నాకోర్కి సిద్ధించె నాజన్మ మలరె, నాకులం బతిపావనంబయ్యె నేఁడు
రవికులోత్తములైన రాజులతోడి, యవిరళసంబంధమది నాకుఁ గలిగె
నెల్లి పెండ్లికి లగ్న మిష్టులఁ బిలిచి, తెల్లంబుగాఁ బ్రవర్తింపుఁడు ప్రీతి
ననవుడు దశరథుం డట్లగా కనుచు, ననురాగ మొంది యత్యంతము ప్రీతి
జనకుఁ డమర్చిన సదనరాజమున, ననురక్తి వసియించె నంత నచ్చటికిఁ
గడుఁ బ్రీతిరామలక్ష్మణులతోఁ గూడ, నడరి విశ్వామిత్రుఁ డరుగుదెంచుటయు
ననఘుండు దశరథుం డమ్మహామునికి, వినతుఁడై పూజించి వినయంబుతోడఁ
దనరార నీదయ ధన్యుండనైతి, ననఘాత్మ యన విని యక్కౌశికుండు
అకలంకచరితుండవైన నీ వనఘ, సుకృతంబు గావించి శుద్ధుండవైతి
రవికులోత్తముఁడైనరాముండు పుత్త్రుఁ, డవుట విశేషించి యధికపుణ్యుఁడవు
క్రతురక్షణార్థమై కడఁగి రాఘవుల, హితబుద్ధి నీవె మా కిచ్చితి నాఁడు
నెమ్మదినున్నారు నీసుతుల్వీరె, నెమ్మిఁ గన్గొనుమన్న నృపతి యాసుతులు
నాలోన మ్రొక్కిన నలరి దీవించి, యాలింగనముచేసె ననురాగ మెసఁగఁ
జనకుండు నాదివసంబున నంతఁ, దనయాగకర్మ మంతయు నెఱవేర్చి
యలరు వేడుక నినుఁ డస్తాద్రి కరుగఁ, బొలుపొంద నారాత్రి పోయినపిదప
మఱునాఁడు కల్యాణమండపవేది, నెఱయ మంత్రులతోడ నిండుఁ గొల్వుండి
యిమ్ములఁ దనపురోహితు శతానందు, సమ్మదంబునఁ జూచి జనకుండు పలికె
ననఘాత్మ మాతమ్ముఁ డగుకుశధ్వజుఁడు, కనుఁగొనవలయు నీకల్యాణ మతఁడు
తిరముగా నిక్షుమతీతీరభూమిఁ, బొరినొప్పు సాంకాశ్యపురి నున్నవాఁడు
అతనిఁ దోడ్తేర నీవరుగు మనంగ, నతిజవాశ్వములతో నమరుతే రెక్కి
యతివేగముగ నేగి యాకుశధ్వజుని, నతులితంబుగఁ గని యర్థిమైఁ జెప్పి
జనకపుత్త్రికి నేఁడు జననాథవర్య, మనువంశచంద్రుఁడౌ మనరామునకును
ఘనముగఁ బెండ్లియౌఁ గడువేడ్కతోడ, జనకుండు యత్నంబు జరపంగఁ గోరి

పతి నిన్నుఁ దోడ్తేరఁ బనిచె నన్నిపుడు, సతులతో హితులతో సకలసైన్యయుతిఁ
గదలుద మిప్పుడే ఘనత మిథిలకుఁ, బద మని చెప్పినఁ బరఁగ నందఱును
దవరారు వేడుకఁ దగ రథంబెక్కి, తనయాద్వయముతోడఁ దా నేఁగుదెంచి
యనఘమానసుఁడు శతానందునకును, జనకభూవిభునకు సద్భక్తి మ్రొక్కి
యెలమి నమ్మానవాధీశుసమ్మతిని, నలువొప్ప సింహాసనమునఁ గూర్చుండె
నంత సుధామాఖ్యుఁ డనుమంత్రి జనకుఁ, డెంతయు ముదమున నీక్షించి నీవు
చని వసిష్ఠునితోడ సచివులతోడఁ, దనయులతోడ నాదశరథేశ్వరుని
వెరవారఁ దోడ్కొని వేగ రమ్మనిన, నరిగి యాతఁడు ప్రీతి నమ్మహీపతికి
వినతుఁడై యిట్లను వేడ్కతో నన్ను, జనకుఁడు పుత్తెంచె [illegible]
నీయుపాధ్యాయులు నీతనూభవులు, నీయమాత్యులు నీవు నేతేరవలయు
ననిన నాదశరథుం [illegible], జని సుఖాసీనుఁడై జనకుతో ననియెఁ
బరఁగ వసిష్ఠుండు పరమదేవతయు, గురువు నీయిక్ష్వాకుకులమున కెల్ల
సర్వజ్ఞుఁ డగుట నీసంయమీశ్వరుఁడు, సర్వకార్యములకుఁ జాలు మా కనిన
నప్పుడు దశరథునన్వయక్రమముఁ, జెప్ప భావించి వసిష్ఠుఁ డిట్లనియె
నరనాథ విను నిర్గుణబ్రహ్మమైన, హరి సగుణైకలీలాకృతిఁ దాల్చి
నిజలీలకై నాభినీరజంబందు, నజునిఁ గల్పింపంగ హరి కజుఁ డొదవె
భూమీశ బ్రహ్మకుఁ బుట్టె మరీచి, యామరీచికిఁ బుట్టె నవనిఁ గశ్యపుఁడు
నతని కర్కుఁడు సుతుఁ డాజగదాప్త,నుతికి వైవస్వతమనువు నందనుఁడు
నతనికి నిక్ష్వాకుఁ డనురాజరత్న, మతనికిఁ గుక్షినా నాత్మసంభవుఁడు
కుక్షియన్ భూనాథుకొడుకు వికుక్షి, యక్షరాత్ముఁడు బాణుఁ [illegible]
నతనికి ననరణ్యుఁ డతనికిఁ బృథుఁడు, చతురమానసుఁడు త్రిశంకుఁ డాతనికి
నతనికిఁ దనయుండు నాహరిశ్చంద్రుఁ, డతనికి లోహితాస్యాఖ్యపుత్రుండు
అతనికి దుందుమారావనీనాథుఁ, డతనికి యువనాశ్వుఁ డనునరేశ్వరుఁడు

### వసిష్ఠుఁడు యువనాశ్వునివృత్తాంతముఁ దెల్పుట

నతనికిఁ బ్రియభార్య లతిరూపవతులు, సతు లిద్దఱకుఁ బుత్రసంతతి లేమి
నంతట నారాజు నఖిలసన్మునుల, సంతతికోఱకునై సరగ రప్పించి
యామహాత్ములకెల్ల నర్ఘ్యపాద్యములు, ప్రేమముతో నిచ్చి ప్రియవాక్యములను
ఘనులార నన్నును గరుణించి మీరు, దనయుల నాకును దయసేయవలయు
నని విన్నవించిన నారాజునకును, ననువొంద నమ్మును లపు డిట్టు లనిరి
యింద్రయాగము సేయు మవనీశ భక్తి, సాంద్రంబుగాఁ బుత్రసంతతి గలుగు
నన జన్నమున కప్పు డఖిలవస్తువుల, ననువొందఁ దెప్పించె నాక్షణంబునను
నైంద్రయాగం బను నామఖం బపుడు, సాంద్రానుమోదులై సంయమీశ్వరులు
పుత్త్రలాభంబుకై పొలుపొంద నంతఁ, జిత్రయజ్ఞము దారు సేయఁగ నందు
జలములు మంత్రించి జలకుంభములను, నలరార నియతిచే నటు దాఁచియుండ
ధరణీశుఁ డారాత్రి దప్పితో నంత, మఱపొంది యాయజ్ఞమందిరమందుఁ

గలశంబులో నీళ్లు గ్రక్కునఁ ద్రావ, జలహీన మగుకలశంబును జూచి
యెవరు ద్రావిరి జలం బెటుపోయె ననుచు, ప్రవిమలాత్ములు వారు భావనిరీక్ష
నరసి యానృపతియే యానీరు ద్రావు, లెఱిఁగి చోద్యంబంది యిది దైవమాయ
యని చూచుచుండంగ నానృపాలకుఁడు, ఘనమగుగర్భంబు కడువేగఁ దాల్చె
గర్భమంతటఁ బడి కడుచోద్యమలర, నర్భకుం డుదయించె నారాజు చచ్చెఁ
గడఁగుచు ఋషులెల్లఁ గడుదుఃఖమంది, సడలని యమ్మంత్రసామర్థ్యములను
బనివడి యువనాశ్వుఁ బ్రతికించి రంత, ననుపమశుభమూర్తి యై యుండి యతఁడు
వరుసతోడుతఁ జక్రవర్తిచిహ్నంబు, లరుదార నుండెడి యాపుత్త్రుఁ జూచి
యితఁ డేడుదీవులు నేలు నటంచు, చతురత ఋషులెల్ల సంతోషపడిరి
అలయువనాశ్వుండు నామౌనిజనుల, కెలమితో ధనరాసు లిచ్చినఁ జనిరి
తల్లియే లేనికతంబున బాలుఁ, డల్లన నాఁకొని యట నేడ్చుచుండ
సరస నాయింద్రుండు వచ్చి తా నప్పు, డరయంగ నాశిశు వాఁకలి దీరఁ
బెనుపొందఁగా నోరఁ బెనువ్రేలు వేగ, నునిచిన నమృతంబు నొయ్యనఁ ద్రావ
సుధ గ్రోలుటయుఁ జేసి శుభయుతు పేరు, బుధులతో మాంధాత భూమీశుఁడ
నతనికి నామధేయంబటు చేసి, యతివేగమునఁ బోయె నాబిడౌజుండు [నుచు
అంత నామాంధాత యలపూర్ణచంద్రు, నంతటి ప్రభతోడ నతిశయిల్లుచును
రూఢిగా యౌవనారూఢుఁ డై నంత, గాఢశౌర్యస్ఫూర్తిఁ గడుఁ దేజరిల్లి
రావణాదుల బహురణముల గెలిచి, భూవలయంబెల్లఁ బొందుగా నేలి
విష్ణునిభక్తుఁడై వెలసి యాగములు, జిష్ణుబలంబునఁ జేయుచునుండె
నారాజునకు విమలాంగి యన్సతికి, భూరితేజోయుతుల్పుత్త్రరత్నములు
నరయంగ ముచుకుందుఁ డాసుసంధియును, దరుణు లేఁబంద్రును దగ జనియింప
సుదతుల ప్రాయంబు సొరిదివచ్చినను, ముదమున సౌభరిమునిపతి కిచ్చె
నతివల కగ్రజుఁ డగుముచుకుందుఁ, డతివేగ హరిభక్తుఁ డై యేఁగె దివికి
నాతనిసోదరుం డాసుసంధియును, నాతతపుణ్యాత్ముఁ డై భువి నేలె
నతనికి ధ్రువసంధి యనురాజు పుట్టె, నతఁడు ప్రసేనజిత్తనురాజుఁ గనియె
దొరయఁ బ్రసేనజిత్తునకు భరతుండు, నరయ నాభరతున కసితుండు పుట్టె
నతఁడు రాజ్యముసేయ నాతనిశత్రు, లతులపరాక్రములైన హైహయులు
దారుణాకారులు తాళజంఘులును, సారంగ సేనబిందనువాఁడు గూడి
యతిఘోరయుద్ధంబు నత్తఱిఁ జేసి,యతనినె యనిలోన హతుఁజేసి చనిరి
అంత నాతనిసతు లతిదుఃఖమంది, మంత్రులరాజ్యంబు మఱిఁ దీర్ప నునిచి
మేలిమి నుండిరి మెలఁతలిద్దఱును, కాళిందియనుసతి గర్భమైయున్న
మేలోర్వలేక యామెలఁతలం దొకతె, చాలంగ సవతిమచ్చరమునఁ జేసి
గర్భిణి యైయున్న కాళిందికపుడు, గర్భంబుఁ జెరుప నొక్కట విచారించి
యోర్వక విషము ప్రయోగించె నంత, నావిషమున గర్భమట వీడిపడక
తా వేగి వేదన తల్లడంబంది, యావనితయుఁ దుషారాద్రికిఁ జనుచు

చ్యవనుఁ గాంచి యాసంయమీంద్రునకు, నవిరళభక్తితో నల్లన మ్రొక్కి
తనదు వృత్తాంతంబు తగ విన్నవింప, వినియు నాపుత్త్రివి వెఱవకు మనుచుఁ
బొందారఁ గరుణతోఁ బూఁబోఁడి నెత్తి, కందువదృష్టిని గడఁగి లోఁజూచి
ప్రతిపక్షదమనుండు పరమధార్మికుఁడు, నతులతేజుండు మహాత్ముండు నగుచు
వరకీర్తివంతుండు వంశవర్ధనుఁడు, పరమరూపంబున భాసిల్లు జగతిఁ
బొగడొందఁ గరముతోఁ బుత్త్రుండె నీకు, నగుఁ గాకఁ గాళింది యనుచు దీవించె
వలగొని యమ్మునీశ్వరునకు మ్రొక్కి, చెలులతోఁ దనయింటి కేఁగి యాయువతి
యతిముదంబుననున్న యాశుభాంగికిని, సుతుఁ డుదయించెను శోభనముహూర్తమునఁ
గరమొప్పఁ బుత్త్రునిఁ గాంచి కాళింది, గరము సమ్మదమందెఁ గడుసంభ్రమమున
నాతఁడు శత్రుల నణఁచి రాజ్యంబు, చేతోముదంబునఁ జేయుచునుండ
సతతంబు విలసిల్లె సగరుఁ డన్ పేర, నతనికిఁ దనుజన్ముఁ డసమంజసుండు
అతనికి సుతుఁ డయ్యె నంశుమదాఖ్యుఁ, డతనిపుత్త్రుఁడు దిలీపావనీనాథుఁ
డతనికున్నతపుణ్యుఁ డగుభగీరథుఁడు, సుతుఁ డాతనికిఁ గకుత్స్థుం డనురాజు
నతనిసూనుఁడు రఘువనమహీపాలుఁ, డతనిపుత్త్రుఁడు పురుషాదకుం డగుచుఁ
గమనీయసితకీర్తి కల్మాషపాదుఁ, డమర శంఖణుఁ డయ్యె నతని కాతనికి
సుతుఁడు సుదర్శనశ్లోకితలేశుఁ, డతనితనూజన్ముఁ డగ్నివర్ణుండు
అతనికి ఋతుపర్ణుఁ డతనికి మరువు, అతనికి శీఘ్రగుం డతనికి మనువు
సుతుఁ డయ్యె నంబరీషుం డనురాజు, సుతుఁ డాతనికి జనస్తుత్యుండు నహుషుఁ
డతనికి సుతుఁడు యయాతి యక్కమేటి, యతనికి నాభాగుఁ డాతని కజుఁడు
అతనికి దశరథుఁ డనఘు నీపుణ్యు, సుతుఁ డయ్యె సఫలనిస్తులమనోరథుఁడు
రాముఁ డీదశరథరాజతనూజుఁ, డేమని వర్ణింతు నింక నే నధిప
యితనికి నీకూఁతు నీఁగంటి వీవు, కృతకృత్యుఁడవు శుభాంకితమయ్యెఁ గులము
అని యిట్లు రఘువంశ మభినుతి సేయ, విని శతానందుండు విమలమానసుఁడు
జనకానుమతి సభాసదులెల్ల వినఁగ, మునివసిష్ఠునిఁ జూచి ముద మొప్పఁ బలికె
మునినాథ మీచేత ముదమార వింటి, ననఘాత్మ దశరథునన్వయక్రమము
సన్నుతి కెక్కు నేజనకునన్వయము, చెన్నగు మీ కేమి చెప్పెద దాని

శతానందుఁడు జనకునివంశక్రమంబు దెల్పుట

సద్విజవరమహాంసప్రతిపాద్యుఁ, డద్వితీయబ్రహ్మమైనయచ్యుతుని
నాభిసరోజంబునను బ్రహ్మ పుట్టె, నాభూతనిర్మాత యగు ధాతవలనఁ
బుట్టె మరీచి యాపుణ్యవర్తనుని, పట్టియై కశ్యపబ్రహ్మ జనించె
నతనికి దిననాథుఁ డాత్మజుఁ డయ్యె, మతిమంతుఁ డతనికి మనువు జన్మించె
నమ్మను వచ్యుతధ్యానకాలమునఁ, దుమ్మఁగ వైవస్వతుఁడు తుమ్మువలన
నిర్మలాచారుఁడు నీతికోవిదుఁడు, ధర్మశీలుఁడు జగద్భరితమానితుఁడు
విమలమూర్తి త్రిలోకవిశ్రుతకీర్తి, నిమి యనురాజు మానితతేజుఁ డొప్పె
నతనిపుత్త్రుఁడు మిథి యతనికి జనకుఁ, డతని కుదావసుం డమ్మహీజాని

తనయుండు నందివర్ధనుఁడు సుకేతుఁ, డనువిభుఁ డతనికి నమ్మహాత్మునకు
రాజర్షి యగు దేవరాతుఁ డెల్లెడల, రాజిల్లె మఱి బృహద్రథుఁడు తత్సుతుఁడు
నతనినందనుఁడు మహావిభుఁ డతని, సుతుఁడయ్యె సుధృతి యాసుధృతికి ధృష్ట
కేతుఁ డాతని కురుకీర్తి హర్యశ్వుఁ, డాతనికిని మరుం డామరువునకు
సుతుఁడు ప్రతీంధకక్షోణీశుఁ డతని, సుతుఁడు కీర్తిరథుండు సుతుఁ డావిభునకు
దేవమీఢుండు తదీయుఁడౌ విబుధుఁ, డావిబుధునిపుత్త్రుఁ డామహీధ్రునకుఁ
గీర్తిరాతుఁడు వానికిని మహారోముఁ, డార్తిదూరుఁడు వాని కాస్వర్ణరోముఁ
డాస్వర్ణరోముండు హ్రస్వరోమాఖ్యు, భాస్వరగుణశాలిఁ బడసె నాతనికి
జనకభూపాలకుశధ్వజుల్వీరు, జనియించి రిరువురు సౌజన్యధనులు
జనకుఁ డంతట మహీజనులఁ బాలింపఁ, గని యొక్కనాఁడు సాంకాశ్యభూవిభుఁడు
ధన్యవిక్రముఁడు సుధన్వుఁ డన్వాఁడు, సైన్యసమేతుఁడై చనుదెంచి మిథిల
సీతాసమేతంబు శివునివిల్లడుగ, దూతఁ బుత్తెంచినఁ గ్రోపించె వెడల
వైవచ్చి హరునిచాపంబు సీతయును, గావలెనని ఘోరకలహంబుఁ జేయ
జనకుండు సంగరస్థలి వానిఁ గూల్చి, తనతమ్ముఁ బూన్చె నద్ధరణికి ననుచు
జనకుఁ డాదిగ వంశజాతులందఱికి, జనకనామము ప్రశస్తము ధాత్రిలోన
నిమివంశమునఁ బుట్టు నృపతులందఱును, సమధికయోగవిజ్ఞానసంపదల
స్థిరజీవు లటుగానఁ జెచ్చెరవీరి, తరమును గొంచెమై తగును లెక్కకును
జనకునివంశంబు సద్వర్తనంబు, గొనియాడి యాసీతగుణమును బొగడి
విశదప్రతాపుని విమలభాషణుని, దశరథుఁ గనుఁగొని దశరథాధీశ
నీతనూజునిరాము నిత్యాభిరాము, సీతతోడుతఁ బెండ్లి చెలువొప్పఁజేసి
యలఘుకీర్తులఁ బొందు మను శతానందు, పలుకుల దశరథపతి యుత్సహించి
ఘనుఁడావసిష్ఠుని గాధినందనునిఁ, గనుఁగొని వారితోఁ గడువేడ్కఁ బలికె
చారువిచారు నీజనకభూదారు, మీ రడుగుండు సౌమిత్రి కూర్మిళను
బ్రకటగుణోత్తరు ల్భరతశత్రుఘ్నులకుఁ గుశధ్వజనృపాలకునికూఁతులను
అన వారు జనకున కత్తెఱంగెల్ల, వినిపించి యనుమతి వేవేగ పడసి
జనకునివాక్యము ల్సకలంబు వేడ్కఁ, దనరారఁ జెప్పి రాదశరథుతోడ
ననురాగముప్పొంగ నామఱునాఁడు, ఘనశుభగ్రహదృష్టి గలుగుటఁ జేసి
పనివడి యుత్తరఫల్గునియందె, జనకుండు లగ్ననిశ్చయము సేయించి
పురమును దనయంతిపురముఁ గైసేయఁ, బరిచారకుల వేగ పంపిన వారు
గంధకస్తూరికాకలితాంబుపూర, గంధిలసకలమార్గధరాంగణంబు
చీనిచీనాంబరశ్రేణీవితాన, నానామణీతోరణధ్వజాంచితము
ఫలభారకమ్రరంభాస్తంభపూగ, కలితప్రతిద్వారకక్ష్యాంతరంబు
సాంకవలిప్తవిస్తారవితర్ది, కాంకితరంగవల్ల్యాదిశోభితము
మణిశాతకుంభకుంభవితర్కితార్క, గణసౌధగోపురోత్కరశిరోగ్రంబు
దీపితమాణిక్యదీపసాంద్రాణ, ధూపపుష్పకలాపధూర్వహాణంబు

నైపుర మెల్లెడ నలరఁ గైసేసి, నైపుణి మెఱసి యంతఃపురం బంతఁ
గరమొప్పఁ గైసేసి కల్యాణవేది, విరచింపుఁ డన శిల్పవేదులంతయును
బచ్చరాజగతిపైఁ బసిఁడికంబములు, మెచ్చుగా నిల్పి యామీఁద నీలంపు
బోదెలు కురువిందముల దూలములును, పాదుగా నిడి తీరుపడఁ జెక్కడఁ
గోమేధికంబుల కొణిగెలు బరివి, గామల్చి పై వజ్రకాండ మొసంగి
హాటకస్ఫటిక మాయతకవాటములు, వాటంబుగా నాల్గువాకిళ్ల మర్చి
అందుల బంగరుహారువుచిత్తరువు, లందంబుగాఁ దీర్చి హరినీలమణుల
గమిగమిచిన పటికంపుసింగముల, గమకమౌ సోపానగతు లేర్పఱించి
కలితలామజ్జకకాయమానములు, కలువడంబులు డంబుగాఁ జొట్టి కట్టి
యాలోననే కాండమౌ బలుపచ్చ, మేలిపెండ్లియరుంగు మృగనాభి యలికి
ముత్తెంపునిగ్గుల ముగ్గు లేర్పఱిచి, చిత్తజజనకలక్ష్మీవివాహంబు
గుజరాతికెంపులగోడ లిఖింపఁ, బ్రజలకుఁ గన్నులపండువై యుండె
అంత వసిష్ఠవిశ్వామిత్రమునులు, సంతతపుణ్యుల జనకుండు చూచి
మీర లయోధ్యకు మిథిలకుఁ గర్త, లేరూప ముచితమౌ నిటమీఁదిపనులు

## దాశరథుల నలంకరించుట.

అది సేయుదురుగాక యనవుడు వారు, చదురొప్ప దశరథజనపాలచంద్రు
కొడుకుల నల్వురఁ గొమరొప్ప నప్పు, డెడతెగనట్టి యాయెల్లవాద్యములఁ
బాటలు పాడుచుఁ బరఁగనంగనలు, తేటగా నందఱు తెచ్చి పీఁటలను
గూర్చుండఁ దలలంటి కుదురుగా వార, లేర్చినల్వ్వాలు పెట్టి యెంతయుఁ బ్రీతి
స్నానముల్ సేయించి చక్కఁగా నుదుట, మానితతిలకంబు మఱి భూషణములు
చీనాంబరంబులు చెలువొప్ప నిచ్చి, నానావిధంబుల నలువుగఁ బొంగి
దశరథుభార్యలు దశరథేశ్వరుఁడు, విశదప్రతాపుండు వేడ్క నుప్పొంగి
సకలభూషణములు సరసతఁ బెట్టి, యకలంకమతితోడ నంతటనుండి
యాయతశుభమైన యభ్యుదయంబు, సేయింప నర్థితోఁ జేసె నవ్విభుఁడు
ఎక్కుడుసంతోష మెసఁగఁ జిత్తమున, నొక్కొక్కసుతున కభ్యుదయంబుకొఱకు
వెలయంగ నన్నియు వేదోక్తయుక్తి, గలయఁ బదాఱులక్షల ధేనువులను
గలధౌతఖురములు కనకశృంగములు, తలకొని చెలువొందు తామ్రపుచ్ఛములు
దొరయమించిన కాంస్యదోహాళంబులును, వరుస వేష్టించిన వరవస్త్రములును
గలిగి సవత్సలై కరమొప్పువాని, లలిభూసురోత్తములకు భక్తి నిచ్చి
మఱియు నసంఖ్యాతమహితహేమములు, తఱుచుగా నంతట దక్షిణ లొసఁగి
భూదానవసుదానములు మొదలైన, వేదోక్తదానము ల్వేర్వేఱ నొసఁగెఁ
దదవసరమున యుధాజిత్తు ప్రేమ, తుదమీఱఁగా భరతుని మేనమామ
తనతండ్రి కేకయధరణీశ్వరుండు, మనుమని భరతుని మైత్రిఁ దోడ్తేరఁ
దను నంపఁగా నయోధ్యకు వచ్చి యచటఁ, దనయులపెండ్లికి దశరథేశ్వరుఁడు
జనకునివీటికిఁ జనుట యెఱింగి, యనురక్తి వేవేగ యచటి కేతేర

దశరథుం డతని నాదృతిని బూజించి, కుశలంబులెల్లఁ బేర్కొనుచుండె నంత
మఱునాఁడు స్నాతకమహితకృత్యములు, తఱితోడఁ గావించి తమ్ములుఁ దాను
రాముఁ డత్తఱి దశరథునొద్ద నిలువ, శ్రీమీఱ నతనిఁ గైసేయింప నృపుఁడు
నారాముని నొదల నమరెఁ గిరీట, మారోహణాద్రిశృంగాగ్రమో యనఁగ
బద్ధకంకణుఁ డయ్యె భక్తులఁ బ్రోవ, సిద్ధమన్నట్టు దాల్చెను గంకణములు
ఎద మున్ను పుట్టిన యిందుదీధితులు, పొదలె నేఁడన హారములు చెన్నుమీఱెఁ
దనకన కాంబరత్వము భూమిఁ దెల్పె, ననఁ గనకాంబరం బలరారెఁ గటిని
గష్టరావణునిచేఁ గాసిల్లినట్టి, యష్టదిక్పాలురయశము లిర్వంక
మౌక్తికచ్ఛలమున మనవులు దెల్పె, యుక్తిమై జౌకట్లు లొప్పె వీనులను
వదనశృంగారమీ వైఖరి నొప్పెఁ, బొదలినఁ గస్తూరిబొట్టు చూపట్టెఁ
బదపడి లక్ష్మణభరతశత్రుఘ్ను, లుదయార్కతేజు లొండొరులు వేర్వేఱఁ
గుండలకేయూరకోటీరహార, మండనావళి సుకుమారదేహములు
గైసేయ నందు దిక్పతులమధ్యమున, వాసవుం డన రామవల్లభుం డొప్పె
అంత నక్కడ జనకావనీనేత, కాంతిమై నలువురఁ గన్యకామణులఁ
గైసేయ సైరంధ్రికలఁ బంప వారు, భాసురమణిపీఠిపై వారి నునిచి
పేరటాండ్రొగిఁ బాడ పెండ్లి పాటలకు, శారికాశీరము ల్పందడి సేయఁ
గుంకుమకస్తూరిగోరోచనంబు, సంకుమదంబు వాసనగందవడియు
నలుగురికొక్కట నలుఁగులు పెట్టి, కలమృదుధ్వనులఁ గంకణములు మెఱయ
కురుల సంపెఁగనూనెఁ గూర్చి యింపొంద, హరిచందనంబుల సటకలు పెట్టి
ఘనసారసురభినఖంపచాంబువుల, జనకపుత్రికలకు జలకము ల్దీర్చి
జిలుఁగులఁ దడియొత్తి చెంగావిచన్నె, చలువపావడలపై జాళువాసరిగ
కొంగులనొప్పుదుకూలము ల్గట్టి, శృంగారములు గుప్పఁ జేసిరో యనఁగ
గొప్పగా నొప్పుగాఁ గొప్పులమర్చి, విప్పుగా జాజిక్రొవ్విరు లందుఁ దుఱిమి
పచ్చకప్పురముతోఁ బన్నీటితోడ, పచ్చికస్తురికలపము గూర్చి యలఁది
బంగారుసరిగె గస్పడు కుట్టుపనుల, కంగులఱయికలు కనుపట్టఁ దొడిగి
చనుకట్లమీఁదఁ బచ్చలబన్నసరము,లును దారహారంబులును బొందుపఱిచి
ముద్దుమోములకొక్క ముఱువుగాఁ గోర, దిద్దుచుఁ గస్తూరితిలకము ల్దీర్చి
చెక్కుల మకరిక ల్చిత్రించి గొప్ప, ముక్కర ల్నాసాగ్రములఁ గీలుకొల్పి
మగరాలతళుకుఁగమ్మలును గట్టాణి, బొగడలు చఱుకుఁ గెంపులబవిరెలును
బచ్చలకడియము ల్పద్మరాగములు, గ్రుచ్చిన మొలనూళ్లు గోమేధికముల
యందియల్ మొదలైన హారభూషణము, లందంబుగాఁ జేర్ప నపుడు కన్యకలు
శారదపూర్ణిమాచంద్రునికళలో, చారువసంతవాసనపుష్పలతలో
సానదీఱిన మంచిజాతిరత్నములో, శ్రీనిండఁ బటిక నార్చినకుందనంపుఁ
గమ్మలో కఱఁబులుఁగడిగిన ముత్తియమ్ములో నెఱతావి నలరుగంధంపుఁ
గొమ్మలో యనఁ బెండ్లికూఁతు లొప్పారి, రమ్మక్క యని సతు లక్కజంబంద

వారిలో సీత లావణ్యవిఖ్యాత, సారగుణవ్రాత జగదేకమాత
యాదిమలక్ష్మి దానై పుట్టెఁ గాన, నాదేవి చెలువ మింతంతని తెలిసి
భూషింపశక్యమే భూషణంబులకు, భూషణంబై యొప్పె భూదేవికరణి
మెఱసి రత్నాకరమేఖల యగుచు, మఱి గంధవతి వసుమతియుఁ దా నగుచు
అంత వసిష్ఠసంయమి లగ్నసమయ, మంతయు జనకున కరసి యేతెంచి
దశరథుతో సమస్తము దెల్ప నతఁడు, కుశికపుత్ర వసిష్ఠగురులతోఁ గదలి
యమరేంద్రవిభవుఁడై యర్హయానములఁ, గొమరొప్పఁ గైసేసి కొడుకులు నడువ
శృంగారములు సేసి చెలువలు నడువ, సంగడిఁ గొలిచి రాజన్యులు నడువఁ
గ్రంతలు గొని పుణ్యకాంతలు నడువ, నంతంతఁ బొగడుచు నర్థులు నడువఁ
గైసేసి హయమత్తగజములు నడువఁ, గైసేసి మంత్రివర్గంబుతో నడువ
వేదనాదములతో విప్రులు నడువ, మోదంబుతో మునిముఖ్యులు నడువ
నడచి యజ్జనకునినగ రొప్పఁ జొచ్చి, పుడమిఱేఁ డప్పుడు పుత్రులు దాను
వనజలోచనలు నివాళులొసంగ, జనకుఁ డెదుర్కొని సంభ్రమం బెసఁగ

## శ్రీసీతారామకల్యాణము

ఖచితోరునవరత్నకల్యాణవేది, నుచితపీఠంబున నున్నచోఁ బ్రీతిఁ
దనపురోహితునితోఁ దడయక జనకుఁ, డనలుఁ బ్రతిష్ఠించి హైమవేదికను
వేదోక్తగతి హోమవిధు లాచరించి, యాదేవకన్యక లననొప్పు తనదు
కన్యకామణుల నగణ్యలావణ్య, మాన్యల నలువుర మైత్రి రావించి
జనకుండు మధుపర్కసమయంబుఁ దీర్చి, తన కూర్మిపుత్త్రి సౌదామనీగాత్రిఁ
గామినీజనమణిఁ గమలాక్షి సీతఁ, గోమలిఁ దెరమఱుంగున వేడ్కఁ నిలిపి
రామాభిరాముఁ డారామచంద్రునకుఁ, గామితసిద్ధిసంకల్పపూర్వముగ
శ్రీరామ నాపుత్త్రి సీత సద్ధర్మ,చారిణిఁ గొను మగ్నిసాక్షిగా ననుచు
దారవోసెను దేవతాపుష్పవృష్టి,ధారతో దివ్యవాద్యధ్వనుల్ మీఱఁ
బ్రమదంబుతోడ దీపములపళ్లెములు, సమదయానలు మహాసంభ్రమంబునను
దలఁబ్రాలు బంగరుతబుకుల నునిచి, కెలఁకుల రమణులు కెరలుచుఁ బట్ట
గుడముతో జిల్కఱఁ గూర్చి యిద్దఱకు, వడి శిరస్సులమీఁద వలనొప్ప నుంచి
రంతట సుముహూర్త మని తెర దీయఁ, గాంతనెమ్మోము మున్గనుఁగొని యలరె
రామునికనుఁగవ రాకాసుధాంశు, గోమున నలరెడు కుముదంబు లనఁగ
భామచూపులు నిల్చెఁ బతిపదయుగళిఁ, దామరపై తేటతండంబపోలె
నింతిలావణ్యాబ్ధి కెదురెక్కు మీన, సంతానమై రామచంద్రు చూపడరె
వరుదేహకాంతిప్రవాహమధ్యమునఁ, దరుణిచూపులు పద్మదళములై గ్రాలె
స చూపుఁ బతిచూపు సరసతఁ జూపు, రతిరూపు రతిమనోరమణునిరూపు
నెలమి నొండొరులు మేనెఱుఁగ రాకుండఁ, గళ లంటఁ దాఁకినగతిఁ గొంతసేపు
వెలసె నంతట రఘువీరకుంజరుఁడు, చెలికేలుఁ గెందమ్మి చెలువునఁ బట్టి
యొండొరు ల్పులకించి యొక్కపీఠమున, నుండి హోమము సేయుచుండిరి ప్రీతి

ఊరువయోధన్య నాయూర్మిళాకన్యఁ, గరము సంప్రీతి లక్ష్మణకుమారునకు
వలనొప్ప నాకుశధ్వజకూఁతులందు, నలినాయతాక్షి మాండవి భరతునకు
నత్రిజబింబాస్య యగుశ్రుతకీర్తి, శత్రుఘ్నునకు నిచ్చె జనకుండు ప్రీతి
నిగమోక్తవిధినిఁ బాణిగ్రహణములు, తగిలి కావించి రాదశరథాత్మజులు
తలఁబ్రాలు వోసి రందఱు లాజహోమములు దీర్చి కాంచిరి మునులదీవనలు
దివినుండి ఘోషించె దేవదుందుభులు, భువి నిండ వర్షించెఁ బుష్పవర్షములు
అప్పు డానందించి రఖిలదేవతలు, నప్పు డానందించి రఖిలసన్మునులు
పాడిరి గంధర్వపతు లుత్సహించి, యాడిరి సంప్రీతి నమరకన్యకలు
అపుడు వసిష్ఠుఁ డాయవనీశసుతుల, నుపమింప వైవాహికోక్తమైనట్టి
హోమాంతమున వారి నుచితకృత్యములు, నేమంబుతో నగ్ని నెఱిఁ బ్రదక్షిణము
సేయించి సప్తర్షి సేవలొనర్చి, యాయతంబుగ దీక్ష నలరుచు నపుడు
కూర్చుండి రందఱు కుదురుగా నందు, నేర్చుచు మౌనులు నెసఁగు భూసురులు
సరగున నందఱు సంతోషమెసఁగ, పరఁగ దీవనలిచ్చి పరమపావనుల
శుభలక్షణంబుగా సుందరీజనుల, విభవసమృద్ధిగా విలసిల్లి రప్పు
డాయతంబుగ దీక్షవలరి మోదమునఁ, జేయించి మఱునాఁడు చెలఁగి సదస్సు
గావించి సంతోషకలితులై యపుడు, దీవించి రందఱు దివ్యచిత్తములఁ
దెఱఁగొప్పగాఁ బెండ్లిదినములు నాల్గు, నెఱయ నిత్తెఱఁగున నిండి యుండుటయు
అన్ని శోభనములు నన్ని తేజములుఁ, గన్నులపండువుగాఁ జూచి ప్రీతిఁ
దరణివంశాధీశు దశరథాధీశు, శరధిసన్నిభశీలు జనకభూపాలు
వెరవొప్ప దీవించి వేడ్క వా రనుప, సరిగెఁ గౌశికుఁడు హిమాచలంబునకు
నప్పుడు మిథిలేశుఁ డానందకేళి, నుప్పొంగి నిజవిభవోన్నతి మెఱసి
ధరణీశులకుఁ జాలఁ దద్ద్విజయుగము, వరభూషణంబులు వస్త్రంబు లొసఁగఁ
దమదేశములకును దగఁ జనిరంతఁ, గ్రమమున నర్థార్థిగణములకెల్ల
నపరిమితద్రవ్య మటులిచ్చి పనిచి, నృపయుగ్మ మొప్పెను నెనరొప్పఁగాను
గరమొప్ప బుద్ధులు గఱపి కూఁతులకు, వరరత్న భూషణావళులు విచిత్ర
చిత్రాంబరములు దాసీజనంబులును, నేత్రోత్సవంబుగాఁ నెమ్మితో నొసఁగి
కరిరథహయభటగణభూషణాదు, లరణంబుగాఁ దనయల్లుండ్ర కిచ్చి
యావసిష్ఠాదిసంయములకు దశర, థావనీశునకు ననర్ఘ్యమాణిక్య
భూషణంబు లొసంగి పూజించి వినయ, భాషణంబుల యుక్తపద్ధతి ననుపఁ
గొడుకులఁ గోడండ్రఁ గొమరొప్పఁ గొనుచుఁ, గడఁకతో దశరథక్ష్మాపతి గదలి
యడరి యయోధ్యకు నరుగుచోఁ ద్రోవ, వడి బెర్చి ప్రతికూలవాయువుల్వీఁచెఁ
దడయక దుర్నిమిత్తము లనేకములు, పొడచూపినప్పుడు భూపతి కలఁగి
యేలొకో మునినాథ యిబ్బంగిఁ గడఁగి, పోలనిశకునము ల్పొడచూపఁ దొడఁగె
ననపుడు దశరథు ననుకంపఁ జూచి, యనియె వసిష్ఠసంయమి నిశ్చయించి
యుర్వీశ ముందఱ నొకమహాభయము, పర్వి యాలోననే పాయు నోడకుము

అనుచుండ వాయువు లందంద విసరెఁ, గనుకను పెంధూళి గప్పెఁ గప్పుటయుఁ
గరులు జోదులుఁ దురంగములు రాహుతులు, విరథులై రథులు నివ్వెఱపాటువడి
సేనలు నల్దెస ల్చీకాకుపడియె, భానుమండలమునఁ బ్రభ మాసె నంత
నిరువదియొక్కమా ఱేచి రాజులను, దరమిడి చంపిన ధన్యవిక్రముఁడు
క్రమ్మినజడలలోఁ గాఁపున్నగంగ, చెమ్మనా నుదుటను జెమట లుప్పొంగ
ఘోరమై మండెడు కుత్తుకవిషముఁ, గ్రూరదైత్యులమీఁదఁ గోపించి యుమిసి
పరమేశ్వరుఁడు దనఫాలనేత్రమునఁ, బెరిగి మండుచునున్న పెనుమంటఁ బుచ్చి
తనరెండుకన్నులఁ దగఁ బంచిపెట్టె, ననివచ్చుపగిదిఁ గన్గొనలఁ గెంపెసఁగఁ
దెగి లోన మండెడు తీవ్రకోపాగ్ని, యెగసి మై సుడిగొన్న యెఱమంట లనఁగ
వెలసి కెంజాయల వెడఁజల్లుజడలు, బలిసి జూటంబున భాసిల్లుచుండఁ
దమకించి భుజలక్ష్మి తాఁబట్టి యాఁడు, విమలనాళముతోడి విరిదమ్మి యనఁగఁ
బరశువు మూఁపున భరియించి వచ్చు, పరశురామునిఁ జూచి భయమున నలఁగి
రయమున దశరథరాజు సన్మునులు, భయనివారణమంత్రపరతంత్రు లగుచు

## పరశురాముఁడు శ్రీరాము నెదుర్కొని భంగపడుట

ననఘులై యెదురుగా నర్ఘ్యపాద్యములు, గొనిపోవ వానిఁ గైకొనక రౌద్రమున
దశరథభూపాలు దర్పించి చూచి, దశరథరాము ముందఱ వచ్చి నిలిచె
నిలిచిన భార్గవునిజమూర్తిఁ జూచి, తల యూఁచి మెచ్చి సద్భక్తితో మ్రొక్కి
చక్కఁ గట్టెదుట హస్తము లొప్ప మొగిచి, యొక్కింత భయమున నున్నవీక్షిం
నీ వెంత మ్రొక్కిన నిన్ను మన్నించి, పోవ నాతోఁ బోరు భూపాలతనుఁడు
భూసురోత్తము కశ్యపుఁడు మొదలయిన, భూసురోత్తములకు భువి నెల్ల నిచ్చి
యతిజితేంద్రియవృత్తి నడవుల నుండ, నతులతపోరాశి వగుటను జేసి
యొనర నీకెఱుఁగుట యుచితంబు గాన, మునినాథ యే నీకు మ్రొక్కితిఁ గాన
వెఱచి మ్రొక్కుట గాదు వెరవరి నన్ను, నుఱకఁ బోనాడుట యుచితమే నీకు
ననవుడుఁ దాపసుం డని నన్నుఁ బలికి, తనిలో సహస్రబాహుజునుఁ ద్రొట్టి
యిరువదియొక్కమా ఱేచి రాజులను, దరమిడి చంపితి ధరణిపైఁ ద్రొళ్లి
నెఱిఁ దిలోదకములు నెత్తుట నొసఁగి, తెఱఁగొప్ప మాపితృదేవత లెల్ల
భూపాలశవములఁ బొందొంద దివికి, సోపానములు చేసి సొరిదిరై చనిరి
అట్టిభార్గవరాము ననఘు నన్నెఱుఁగ, కిట్టేల రాముఁడై యిలఁ బుట్టితీవు
రాజన్నఁ బోరిఁ గొందు రామనాములను, రాజుల నైఁతునే రణభూమి నేను
రాజకులుండవో రాముని నిన్ను, రాజి మన్నింతునే యదియునుగాక
రాజని మీతండ్రి రణమునఁ ద్రుంప, రాజికి వచ్చిన నాకును నోడి
స్త్రీలమఱుంగునఁ జెలువొప్ప నున్న, కాలవశంబునఁ గాచితి నతనిఁ
దాన గర్వాంధుఁడై తద్దయు నిపుడు, మానక యున్నాఁడు మఱి యుబ్బి యిచట
మఱుగుఁ జొచ్చిన నైన మననీయ ననుచు, వెఱవక పల్కిన వెఱపుతో నపుడు
అనవుడు దశరథుఁ డతిభీతుఁ డగుచు, వినయోక్తి భార్గవు వీక్షించి పలికె

నీవు బ్రాహ్మణుఁడవు నీకు రోషంబు, గావింప నేటికి ఘనముగా నాదు
తనయులు బాలురు తగదు కోపంబు, వినుతశాస్త్రపురాణవిఖ్యాతిఁ గనుట
నెఱుఁగనే భార్గవ యెఱుఁగవే నీవు, నెఱుఁగని మర్మంబు లెందైనఁ గలవె
నీతోడఁ బోరాడ నెన్నెదిరింప, నాతతంబుగ నుండు నాభవుం డైన
నోపునే భార్గవ యొరు లెదిరింపఁ, బాపవే యీతఱిఁ బరమపావనుఁడ
దేవేంద్రుఁడైన నీతీవ్రప్రతిజ్ఞ, భావించి యుడుపంగ భవ్యుండు గాఁడు
మన్నించి రక్షించి మమ్ము నందఱను, జెన్నుగాఁ జనుమని శిరసును వంచి
వన్నింపు మని వేఁడి మఱియు మ్రొక్కినను, గన్నుల కోపంబు గడునొప్పి యుండె
నని తన్నుఁ గొనియాడు నతనివాక్యములు, విని యాదరింపక విపులరోషమునఁ
గనలుచు నత్యంత కఠినుఁడై యపుడు, దమియింతు నని మదిఁ దలఁచి యిట్లనియెఁ(?)
గరమొప్ప విలువిద్యఁ గడిమిమై నేను, హరునితోఁ దొల్లి యభ్యాసంబు సేయ
నాఁడు కుమారుండు నాతోడఁ దొడరి, పోఁడిమి చెడి యోడిపోయినఁ జూచి
నాపెంపు మెచ్చిన నాగకంకణుని, చాపంబు విఱిచిన సైఁతునే మఱియు
అనిన నా రఘురాముఁ డా రాముఁ జూచి, యనియె నిశ్చలవృత్తి నతిసమ్మదమున
నేను వినోదమై నెక్కిడి తివియఁ, గా నది విఱిగెను గాక దానట్ల
నాతెగ కేల పినాకివి ల్నిలుచు, నాతతభుజసత్త్వ మట్టిదె నాకు
నెసఁగ యుద్ధములందు నిక్ష్వాకుకులులు, పసుల బ్రాహ్మణులఁ జంపఁ దలంప రెందు
నీ వెన్ని పలికిన నీకవి చెల్లె, నీవు బ్రాహ్మణుఁడవు నినుఁ జంపనొల్ల
నిదె నాదు కంధర మిదె నీదు పరశు, వదరక యుచితకృత్యము సేయు మింక
ననవుడు రఘురాము నలుకదీపింపఁ, గనుఁగొని పలికె భార్గవరాముఁ డడరి
భావింప నాకు నీపలుకులఁ జూడ, నీవు క్షత్రియుఁడవు నేను బ్రాహ్మణుఁడ
ననుగర్వ మున్నది యటు చూడవలదు, వినుతవిక్రమశక్తి వేఁడిఁ జూపెదను
వఱలు నజ్జనకభూవరునింట నీవు, విఱిచినవిల్లు నీవిల్లును దొల్లి
యర్మిలి నిండార నమరులు విశ్వకర్మచే నొక్కటఁ గావించి రెలమిఁ
బురములు నిర్జింపఁ బోయెడునాఁడు, హరునకుఁ దగనిచ్చి రందులో నొకటి
నావింట త్రిపురంబు లణఁచి రుద్రుండు, దా వీరగర్వముద్రారతుఁ డగుచు
నసహాయమున నేను నసురత్రయంబు, వసుధపైఁ గూల్చి తెవ్వరు నాకు నీడు
నని పల్కఁ జక్రి బుద్ధాకృతిఁ బూని, తునిమించెఁ గాక రుద్రునికి శక్యంబె
యని యాడకాడకు నసురులు మునులు, సనకాదిహరిపార్శ్వచరులును బలుక
విని రుద్రగణములు వినుపింప శివుఁడు, విని రోషమునఁ బోర విష్ణునిఁ బిలువ
సురగరుడోరగవరులెల్లఁ గూడి, సరసిజాసనుఁ జేరఁ జని విచారించి
హరిహరసత్త్వంబు లరయుద మనుచు, మురవైరి కపుడు కార్ముకరాజ మిచ్చి
యిరువుర కెంతయు నెఱుక సేయుటయు, హరియు రుద్రుఁడుఁ బోరి రరుదుగా నపుడు
నారాయణునితీవ్ర నారాచఘోర,ధారచే శివునికోదండంబు సగము
విఱిగి పేటెత్తిన వీక్షించి రపుడు, హరిశక్తి ఘనమని యమరు లందఱును

ఇరువుర మాన్పి రాయీశుఁ డవ్వేళ, సురలచిత్తస్థితిఁ జూచి యావిల్లు
రయమున నాదేవరాతున కిచ్చె, జయధన్యుఁ డాతండు జనకున కిచ్చె
వనజలోచనుఁడును వలనొప్ప నిచ్చెఁ, దనచేతిచాప మత్తఱి ఋచికునకు
జమదగ్ని కిచ్చె నిశ్చలమతి నతఁడు, జమదగ్ని నాకిచ్చె సదయుఁడై దీని
బెనకువ నది తొల్లి వేల్పెత్తియుంటఁ, గని నీవు విఱిచితిగాక భూనాథ
ఆవింటితోడిదె యరయ నాచేతి, యీవిల్లు నిదె చూడు మినవంశతిలక
నెలకొని యీవిల్లు నీవెక్కువెట్టి, తలకొని బాణసంధానంబు నేసి
కడిమి చూపక నిన్నుఁ గదలనీ ననినఁ, దడయక రోషించి దశరథాత్మజుఁడు
కన్నుల ఘనవహ్నికణములు దొరుఁగఁ, దన్నెఱుంగని జామదగ్న్యుతో ననియె,
నిరుపమనిజశక్తి నీకుఁ గల్గుటయుఁ, దరమిడి రాజులఁ దరిమి చంపుటయు
నెఱుఁగుదు నన్ను నీవితరునిమాడ్కి, వెఱవక పలికెదు బీరంబు మెఱసి
నీవెఱుంగవు నాదు నిజబాహుబలము, నీవెంతవాఁడవు నీచాప మెంత
తెమ్మని విలుఁ దీసి తెగువ మోపెట్టి, క్రమ్మఱ నత్యుగ్రకాండంబు దొడిఁగి
నీకాళ్లు దెగవేసి నీగర్వ ముడిపి, నీకోప మడఁచెద నేఁడన్నఁ దలఁకి
యురుసత్వగర్వంబు నుబ్బును దూలి, పరశురాముఁడు రాముఁ బ్రార్థించి పలికె
నేను గశ్యపునకు నిల నిచ్చినాఁడఁ, గాన రాత్రులు నిల్వఁగా నేర నిచట
ననుదినంబును మహేంద్రాచలంబునకుఁ, జనవలె నటుచేయఁ జరణము ల్వలయు
నాకాళ్లు నేయక నాపాలిపుణ్య, లోకమార్గంబు లాలోకింప నేయు
నన్ను రక్షింపుము నరనాథచంద్ర, మన్నింపవే రామ మనుజలోకేశ
యనవుడు రఘురాముఁ డాజామదగ్న్య, ఘనపుణ్యలోకమార్గము నేసెనంత
జడురీతి నిలుచున్న జమదగ్నిరాముఁ, గడునుగ్రుఁడై యున్న కాకుత్స్థరాముఁ
జూచుచు నుండిరి సురసిద్ధసాధ్య, ఖేచరు లద్భుతక్రీడలఁ దగిలి
వలనొప్పఁగాఁ బుష్పవర్షము ల్గురిసె, నలినగర్భాదులు నానందమంది
పొగడిరి రామునిఁ బొందుగా సురలు, మిగుల తేజంబున మిన్ననుండి
యంత భార్గవరాముఁ డారాముఁ జూచి, యంతరంగంబున నతని భావించి
యనఘ నీసత్త్వ మే నాత్మలోఁ జూచి, నిను వివేకించితి నీవు విష్ణుఁడవు
కాకుత్స్థ యటుగానఁ గదనంబునందు, నీకు నోడుట నాకు నింతగా దెందు
నాబలంబును నీవె నాయాత్మ నీవె, నాబంధువులు నీవె నారామచంద్ర
నామాట లన్నియు నాత్మ నుంపకయ, రామ రక్షింపవే రఘుకులాధీశ
యనుచుఁ బ్రస్తుతి నేసి యానందమంది, మనమున రఘురామమహిమ లెన్నుచును
వరుస శ్రీరాముని వలగొని భక్తిఁ, గరములు ముకుళించి కరము సంప్రీతి
వినయవిధేయుఁడై విభునటు చూచి, మనమునఁ గృపవుట్ట మఱి యిట్టులనియె
సెలవిమ్ము రాఘవ శ్రీజానకీశ, సెలవిమ్ము పోయెద సెలవిమ్ము నాకు
నాతప్పు లెన్నక నన్ను మన్నించి, యీతఱి రక్షించి యింపుగాఁ బనుపు
మనసు నేకముచేసి మదివెల్గుఁ గనుచుఁ, గనుమూసి నిష్ఠఁగూర్చి కదలక తపము

లోనరంగఁ జేసిన నొయ్యన మునులు, మనముల నానందమగ్నులై యుండు
రనుచుఁ బ్రస్తుతిఁజేసి యభినుతుల్ చేసి, యనుపమప్రీతితో నప్పుడే కదలి
నిరుపమతరశక్తి నీశక్తియనుచు, నరిగె రాముఁడు మహేంద్రాచలంబునకుఁ
బరశురామునివిల్లు ప్రార్థింప నొసఁగె, వరుణుచేతికి రఘువర్యుఁ డాక్షణమె
యప్పుడు వాయువు లనుకూలగతుల, నొప్పె నుత్సాహంబు లొదవె సేసలకు
నరుదరుదని సుర లభినుతిసేయ, వరజయశ్రీ గూడి వచ్చి రాఘవుఁడు
తనతండ్రి దశరథధరణిపాలునకు, ననఘువసిష్ఠున కతిభక్తి మ్రొక్క
మ్రొక్కిన దీవించి మొగిఁ గౌఁగిలించి, యక్కున నందంద నొదలఁ జేర్చి
[illegible] సరసోక్తి నేఁ బునర్జాతుండనైతిఁ
గొమరొప్ప నీవంటి కొడుకును గనుట, నమరేంద్రుఁ బోలితి నవనిలో నిపుడు
పరమపావనుఁడైన పరశురాముండు, పరమేశుపగిదిని బరఁగ నిచ్చటికి
వచ్చుట నేఁ గాంచి వపువెల్ల వడఁక, నిచ్చలో భయమంది యిఁక నేది త్రోవ
యనుచు భయంబున నాతనితోడ, మనవిగాఁ జెప్పిన మఱి వినకున్నఁ
బరవశత్వంబొంది పలుకనేరకయు, పరమమైత్రికి నేను బాల్పడి యుంటి
నతని గెల్చుటయె నా కాశ్చర్యమయ్యె, నతులితవైభవం బందితి నేను
బానెను భయమెల్లఁ బ్రౌఢి నీచేత, వాసికెక్కితి నిల వైభవం బబ్బె
ననుచు రామునిఁ జాల నభినుతిచేసి, మునివసిష్ఠాదుల ముదమునఁ గూడి
పరమసమ్మదమున బలములుఁ దాను, నరిగె నయోధ్యకు నవనివల్లభుఁడు

దశరథుఁడు పుత్త్రులం దోడ్కొని అయోధ్య కేఁగుట

పుణ్యచిహ్నములతోఁ బుణ్యులతోడ, బుణ్యమంగళతూర్యములు మ్రోయ నరిగి
తానును గొడుకులు దశరథాధీశుఁ, డానందమున నయోధ్యాపురిఁ జొచ్చి
రాజితాలంకారరమణఁ జేపట్టు, రాజమార్గంబున రాజముఖులు
సుఖులుఁ దారును గేళిసౌధంబు లెక్కి, సుఖతరాకృతులఁ రాసుతులఁ గన్గొనుచు
సేసలు చల్ల నాశీర్వాదమెల్ల, భూసురు లొసఁగ విస్ఫురణఁ బెంపెసఁగ
నగణితశృంగార మైయొప్ప దనరు, నగరుఁ బ్రవేశించె నరనాథుఁ డంతఁ
గౌసల్య కేకయక్ష్మాపాలపుత్త్రి, యాసుమిత్త్రాదేవి యాదిగాఁ గలుగు
నంతఃపురాంగన లందఱు నప్పు, డెంతయుఁ బ్రీతితో నెదురుగా వచ్చి
చేరివారలమీఁద సేసలు చల్లి, నీరాజనంబులు నెఱి నిచ్చి రంతఁ
గొడుకు లందఱు మ్రొక్కఁగోడండ్రు మ్రొక్కఁ, గడుఁబ్రీతి దీవించి కౌఁగిటఁజేర్చి
సీతాదికాంతలచెలువంపుబుద్ధి, చాతురి కన్నుల చల్లగాఁ జూచి
తనరారుచుండిరి దశరథుం డపుడు, తనయులు నలుగురు తను భజియింప
నాల్గుచేతులనొప్పు నలినాక్షుఁ డనఁగ, నాల్గుకొమ్ములు గల నాకేభ మనఁగ
సకలజనానందచతురుఁడై రాజ్య, మకలంకరక్షకుఁడై యేలుచుండి
యొకనాఁడు దశరథుం డుచిత మెఱింగి, ప్రకటితశుభరతు భరతు నీక్షించి

ఘనుఁడు మీమామ కేకయరాజు దోడు,కొనిపోదు నిన్నని కోరియున్నాఁడు
గాన శత్రుఘ్నుతోఁ గదలి మీమామ,తో నేఁగి యతని సంతోషంబు నెఱపు
తాతకు నవ్వేళఁ దగ మేనమామ, కాంతభక్తితో ననిశంబు మ్రొక్కు
సురలకాఁ దలఁచి భూసురులకు వత్స, పరమప్రియంబునఁ బరిచర్య సేయు
వారలచేత నవారణస్యంద, నారోహణములు శస్త్రాస్త్రవిద్యలును
నెఱి వేదశాస్త్రము ల్నీతిశాస్త్రములు, సుఖకళావిద్యలు నొగి నభ్యసింపు
మేకక్షణంబును నెడపక నియతిఁ, జేకొని నీమేలు చెప్పి పుత్త్రమ్ము
అనవుడుఁ దల్లుల కవనిపాలునకు, వినతుఁడై రఘురామవిభునకు మ్రొక్కి
తాను శత్రుఘ్నుండుఁ దన మేనమామ,తోన యిమ్ముల భరతుఁడు పుణ్యరతుఁడు
రాజగృహంబున రమణీయమైన, రాజధానికి నేఁగి రఘుకుమారకులు
తాతకుఁ దమరాకఁ దగ నెఱిఁగింపఁ, బ్రీతిమైఁ బుచ్చ నాపృథ్వీవరుండు
పట్టణంబునఁ దిరువడ తోరణములు, గట్టించి బహుపతాకలు కల్వడములు
కలయంగ నెత్తించి గంధోదకములు, పొలుపొందఁ జల్లించి పుష్పధూమములు
కరమొప్ప రాజమార్గమున వాసింపఁ, బరిచారకులఁ బంచి బలయుతు లగుచు
వనితలు నిజమంత్రివర్గంబుతోడఁ, జనుదేర నెంతయు సంభ్రమం బెసఁగ
వరుస నానాగీతవాద్యనృత్యములు, పరమశుభాచారభంగుల నడువఁ
బ్రీతి నెదుర్కొని ప్రియమొప్ప వంది,సూతమాగధజనస్తుతు లోలిఁ జెలఁగ
మనుమలఁ దోడ్కొని మహిమతో వచ్చెఁ, బనిగొన్న భక్తితో భరతుండు నంతఁ
దమ తాత మొదలుగాఁ దగినపెద్దలకుఁ, గ్రమము దప్పక నమస్కారము ల్చేసి
పొలుపొంద వారిచేఁ బూజితుం డగుచుఁ, దళుకొత్త వేడుకఁ దాతతో ననియె
నార్యక నాకు విద్యాభ్యాస మింకఁ, గార్య మాచార్యులై ఘనులైనవారి
కప్పగింపుఁడు నన్ను ననిన నారాజు, చెప్పినవారిచే శిక్షితుం డగుచు
నమర విద్యాభ్యాసమంతయుఁ జేసి, విమలైకమతి నొకవిప్రునిచేతఁ
దమతండ్రి యగుచున్న దశరథేశునకు, సముచితస్థితి మేము సకలవిద్యలును
జెలువంబుగా నభ్యసించితి మింకఁ, దలఁపుపుట్టెడు మాకుఁ దముఁ జూడవలయు
నని చెప్పుమన నయోధ్యాపురంబునకుఁ, జనుదెంచి యతఁడు నాజననాయకునకు
రాజపత్నులకు నారామలక్ష్మణుల, కోజ నెంతయుఁ జెప్పె నుల్లంబు లలర
నంత శ్రీరాముండు యౌవరాజ్యమున, నెంతయుఁ జతురుఁడై యెల్లవారలకుఁ
బ్రాకటంబుగ నొండుబాధ లేకుండ, నేకప్రబుద్ధిగా నిటఁ దండ్రిఁ గొలిచి
ధారణీప్రజలకు దయయొప్పఁ జేసి, వీరు వారన కతివిశ్రుతకీర్తి
సముచితుఁడై ధర్మచరితంబుఁ బూని, యమరేంద్రవిభవుఁడై యారామవిభుఁడు
సీతయుఁ దానును జెలువొప్పఁ గూడి, నూతనరతిసుఖార్ణోరాశిఁ దేలి
చంద్రశాలలఁ గేళిసౌధవీథికలఁ, జంద్రకాంతాతివిశాలవేదికల
గాజుటోవరుల బంగరుపడకిండ్ల, జాజిపూఁబొన్పులఁ జంపకక్రముక

గొలఁకుల కెలఁకులఁ గుంజపుంజములఁ, జలువచప్పరముల సైకతస్థలులఁ
జాతురి మెలఁగుచు సకలభోగములు, నాతతసౌఖ్యంబు లందుచు నుండె
అని యాంధ్రభాషభాషాధీశవిభుఁడు, వినుతవాక్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి, భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
దమతండ్రి విట్ఠలధరణీశుపేరఁ, గమనీయగుణధైర్యకనకాద్రిపేర
నలఘునిశ్చలదయాయతబుద్ధిపేర, లలితనిర్మలగుణాలంకారుపేర
నాచంద్రతారార్కమై యొప్పు మిగిలి, భూచక్రమున సతిపూజ్యమై యొప్పు
నసమానలలితశబ్దార్థసంగతుల, రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావన ల్నిండఁ, గరమర్థి నీబాలకాండంబుఁ జెప్పె
నారూఢి నాశ్లేయమై యాదికావ్య, మై రసికానందమై యల్లనాఁడు
నిర్వాసుమతి నొప్పు నీపుణ్యచరిత, మెవ్వరు చదివిన నెవ్వరు వినిన
సామాదిబహువేదచయధామరామ, నామచింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్ ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును, బాయనిశుభములు పాపక్షయములు
వరపుత్రలబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యచయసమృద్ధియును
నేవిఘ్నములు లేక యిండ్లలో నధిక, లావణ్యవతులైన లలనలపొందు
కొడుకులతో నెప్డుఁ గూడియుండుటయు, నెడగాఁగ నాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులఁ గూడుటయు, నిమ్ములఁ గామ్యంబు లెడపకుండుటయు
సతతంబు దేవతాసంతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవభోగాదివాసులఁ జేయు
నెందాఁక కులగిరు లెందాఁక జలధి, యెందాఁక రవిచంద్రు లెందాఁక దిశలు
ఎందాఁక వేదంబు లెందాఁక ధరణి, యెందాఁక భువనంబు లేపుదీపించు
నందాఁక యీకథ యక్షతానంద, సందోహదోహళాచారమై పరఁగు.

బాలకాండము సమాప్తము.

---

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీరంగనాథరామాయణము

## అయోధ్యాకాండము

శ్రీలీల దశరథోర్వీపాలుఁ డవనిఁ, బాలించుచుండి చొప్పడ నొక్కనాఁడు
సుతులు నల్వురలోన శుభతరమూర్తి, యతుల యశోనిధి యగుచున్న వాని
ననుదినంబును బేద లగువారి నెల్ల, మనమున ముదమంద మన్నించువాని
హితబుద్ధి యగువాని నెల్లభూతముల, హితమును గరుణ[1] నన్వేషించువాని
బోలఁ జతుర్విధపురుషార్థగతుల, నోలి చిత్తంబున నూహించువాని
ననిశంబు సంతుష్టుఁ డై యుండువానిఁ, గొనియాడఁదగిన సద్గుణములవానిఁ
దప్పని కోపంబు దగు ప్రసాదంబు, నొప్పగు ప్రభుశక్తి నొనరెడువాని
గజహయారోహణదక్షుఁ డగువాని, విజయలక్ష్మీసమన్వితుఁ డగువాని
వెరవరి యగువాని విహితకార్యంబు, నరయ ననాలస్యుఁడై చేయువాని
మాననిరోషంబు మదిలేనివాని, మానుగా భృత్యుల మన్నించువానిఁ
నతిరథుఁ డగువాని [2]ననసూయవృత్తిఁ, బ్రతిదినంబును బుద్ధిఁ బాటించువానిఁ
గరుణాసముద్రుఁడై కడుమించువానిఁ, బరులగుణంబులు పాటించువాని
బుద్ధి బృహస్పతిఁ బురుడించువాని, నిద్ధతేజంబున నినుఁబోలువాని
నమితప్రజానంద మలరించువానిఁ, గుముదబాంధవుభంగిఁ గొమరొందువాని
వెలయ ధనుర్వేదవేదశాస్త్రములు, వలయు, విద్యలయందు వలనొప్పువాని
న్యాయమార్గంబున నర్థార్జనంబు, పాయక సేయ నేర్పరి యగువాని
సైరణ ధరతోడ సరివచ్చువాని, భూరిగుణంబులఁ బొలుపొందువానిఁ
గోదండదీక్షైకగురుఁ డగువాని, నాదిమపురుషుఁడై యలరారువాని
శ్రీరాముఁ బట్టాభిషిక్తునిఁ జేసి, ధారుణిఁ బాలింపఁ దలపోసి యంత
దలకొన్న కడకతో దశరథేశ్వరుఁడు, కొలువుకూటమునకుఁ గొమరొప్ప వచ్చి

### దశరథుఁడు వసిష్ఠాదులతో రామునకుఁ బట్టముఁగట్ట నాలోచించుట

యందు వసిష్ఠాదు లగు మహామునులు, నందు సుమంత్రాదు లగుమంత్రివరులు
చేరువ నృపతులుఁ జెలులుఁ జుట్టములు, పౌరవర్యులు జానపదులు నాశ్రితులు
పారవివేకులు సామంతనృపులు, ధీరులు రాజనీతిజ్ఞులు మొదలు
వారల రావించి వారిదనినద, చారుగంభీరసుస్వరమునఁ బలికె

---

1 చేకొంచెడువాని. 2 ననసూయ గల్గి.

మాపెద్ద లిక్ష్వాకుమనుజేశముఖ్యు, లీపృథ్వీతల మేలి రింపెసఁగ
వారలరీతి నవారితనీతి, నీరాజ్య మంతయు నే నోపినట్లు
నిజకులాగతధర్మనిరతుండ నగుచుఁ, బ్రజల నేలితిని మీప్రాపునఁ జేసి
యిదియంతయును మీర లెఱిఁగినయదియ, విదితంబుగా నింక వినుఁ డొక్కమాట
నఱువదివేలేఁడు లవనిఁ బాలించి, నెఱసి తచ్ఛత్రంబునీడనే యుండి
ముదిసితి భూభారమునకంటె ఘనతఁ, బొదలు జరాభారమును దాల్చుకతన
నామేను వికసితనలినషండంబు, కౌముదితోఁ బోరి గర్వంబు దక్కెఁ
గావున నారాముఁ గల్యాణరాము, దేవతాహితకాము ధీగుణస్తోము
నిందీవరశ్యాము నినకోటిధాము, సౌందర్యజితకాము జగదభిరాముఁ
బ్రజలఁ బాలింపఁగఁ బట్టంబు గట్టి, సుజనులు గొనియాడ సుఖకరంబైన
యూరటఁ గోరుచు నున్నాఁడ మీకు, నీరీతి సమ్మతియే యంచుఁ బలుక
ఘనగర్జితంబు లాకర్ణించి యలరు, వనమయూరము లన వా రుత్సహించి
మొగిఁ గలకలశబ్దముఖరితస్వాంతు, లగుచు భూసురముఖ్యు లగుభూమిప్రజలు
దమలోనఁ దాము మంతనమాడి కూడి, కమలాప్తకులున కుత్కంఠత ననిరి
మీ రానతిచ్చిన మేలిమిమాట, వారు వీరన కెల్లవారికి హితమె
హృదయరంజకము నభీష్టదం బయ్యె, నదిగాక సకలజనానందకరము
రాజనీతిజ్ఞు నిర్మలధర్మనిపుణుఁ, దేజోజగద్బంధు దీనైకసింధు
సత్యసంపన్నుఁ బ్రశాంతిసంపన్ను, నిత్యవిప్రార్చనానిరతు సచ్చరితు
నీతియుఁ బ్రీతియు నేర్పును నోర్పు, ఖ్యాతియు భూతియుఁ గాంతియు దాంతి
శాంతియు మొదలగు సద్గుణావళుల, నెంతయు నీకన్న నెక్కుడై యున్న
రాముని లోకాభిరాముని నీవు, భూమికి రాజుగాఁ బూన్చుట తగదె
త్రైలోక్యమైన నాతం డేలఁజాలు, నీలోక మేలుట యెంతమాత్రంబు
నీసుతాగ్రణి రాజ్యనిరతుఁడౌ నేని, భూప మాచేసిన పుణ్యంబుగాదె
కావునఁ బట్టంబు గట్టు మీవతని, కే వేళ మేము నిదియె కోరుదుము
అనుచు బద్ధాంజలు లై విన్నవింప, విని తనమదిలోన వేడ్క రెట్టింప
భూమీశుఁ డప్పు డుప్పొంగి వసిష్ఠ, వామదేవులఁ జూచి వలనొప్పఁ బలికె
నీమధుమాస మభీష్టదం బగుట, రాముని సకలసామ్రాజ్యలక్ష్మికిని
రాజుఁ జేయుదము తద్ద్రివ్యవస్తువ్రలు, యోజించి తెప్పింపుఁ డుచితవైఖరిని
నని పల్క వారు నయ్యభిషేకయోగ్య, ఘనవస్తువులు గూర్పఁగాఁ బంచి రంత
క్ష్మావల్లభుండు సుమంత్రాదిమంత్రి, కోవిదులను బంధుకోటి వేర్వేఱ
రావించి చెప్ప వారలు సమ్మతించి, వేవేగ రఘురామవిభుని రప్పించి
తనచూపులను సుధాధారలు దొరుగ, జననాథుఁ డారామచంద్రుతో ననియెఁ
బెనుపొందఁ గడిమిమైఁ బెద్దకాలంబు, జనులెల్లఁ బొగడ రాజ్యము చేసి యేను
దానముల్ ధర్మముల్ తగిన యాగములు, మానిన నిష్ఠతో నొగిఁ బెక్కు చేసి
డపట నీయట్టి కల్యాణశీలుఁ, గొడుకుగాఁ బడసితిఁ గోర్కె రెట్టింప

నేనింక భూభార మిట మోయఁజాలఁ, గాన నీకుఁ బట్టంబు గట్టెదఁ బ్రీతి
చెలువారఁ బట్టాభిషేకంబు సేయ, లలితపుణ్యోదయలగ్న మెల్లుండి
యొనర సీతయు నీవు నుపవాసముండుఁ, డెనసినభక్తితో నెల్లి సంప్రీతి
నని పల్కుటయు రాముఁ డవనీశుఁ జూచి, వినయంబు ధైర్యంబు వెలయ నిట్లనియె
జననాథ నాకు నీచరణపద్మములు, గొనకొన్న భక్తితోఁ గొలుచుటకంటెఁ
గడచినరాజ్యంబు గలదె లోకముల, నుడుగు మీపలుకు లయోగ్యంబు లనుడు
ననఘచారిత్రుఁడ వతిసత్త్వధనుఁడ, వినకులరత్నంబ వీవుండ నింకఁ
దగువార లెవ్వరు ధరణిపాలనముఁ, దగిలి సేయింపుము త్రైలోక్యవీర
యని పల్కుటయు రాముఁ డట్లకా కనుచుఁ, దననగరికిఁ బోయెఁ దదనంతరంబ
పౌరుల రాజుల బంధులనెల్ల, వారల వీడ్కొని వనజాప్తకులుఁడు
అంతఃపురంబున కరిగి శ్రీరాము, చెంతనున్న సుమంతుచేఁ బిలిపించి
తనసమీపమున నాతనయుఁ గూర్చుండఁ, బనిచి యానందబాష్పము లుప్పతిల్ల
మనములరఁగఁ జూడ మహిపున కపుడు, మనమున దిగులొత్త మఱియశుభములు
కనుపట్టె నంతటఁ గడుభయమంది, తనపుత్త్రునిఁ జూచి తద్దయుఁ బలికె
నాపాలిభాగ్యంబ నానిధానంబ, నాపుణ్యసారంబ [illegible]
నాపుత్త్రరత్నంబ నాకలలందు, దీపించె నశుభవర్తితనిమిత్తములు
ఘనదుర్గ్రహముల నుల్కాపాతములను, గనుఁగొంటి మనసు వైకల్యంబుఁ బొందెఁ
గావునఁ బుష్యయోగము నీకు లెస్స, నీవు పట్టముఁ బూన నిండు నాకోర్కి
యాలస్యమేల నీయభ్యుదయమును, నీలోకమంతయు నెపుడుఁ గాంక్షించు
నన విని దశరథునానతి యియ్యకొని మ్రొక్కి తండ్రి వీడ్కొని రామవిభుఁడు
తనతల్లికిని సుమిత్రకు నట్టివార్త, జనకనందనకు లక్ష్మణునకుఁ జెప్పి
వారల సంతోషవార్ధిఁ దేలించి, యారామవిభుఁడు శీతాంశుసన్నిభుఁడు
తననగరికి వచ్చెఁ దాను సీతయును, ఘనమైన హృదయవికాసంబునొంద
నంత వసిష్ఠుతో ననియె భూవిభుఁడు, సంతోష మెసఁగంగఁ జని రామవిభుని
మునినాథ యుపవాసమునకు సంకల్ప, మొనరింపఁ జేయుము యుక్తమార్గమున
ననవుడు బ్రహ్మరథారూఢుఁ డగుచుఁ, జని వసిష్ఠుఁడు రామచంద్రునికడకుఁ
దనశిష్యు నొక్కనిఁ దడయక పనిచి, తనరాక మున్నుగాఁ దగ నెఱిఁగించి
యమ్మూఁడువాకిండ్లయందాఁకఁ బోవ, నిమ్ముల రాఘవుం డెదు రేగుదెంచి
యవతీర్ణరథునికి నతిభక్తి మ్రొక్కి, సవినయంబుగ సంతసంబున నపుడు
లోనికిఁ దెచ్చి యాలోకవంద్యునకు, మానుగ సత్కృతుల్ మనసారఁ జేయఁ
బుణ్యాహవాచనంబులు నుపవాస, పుణ్యసంకల్పంబు పొసఁగఁ జేయించి
వెలయ రాముఁడు పదివేలధేనువుల, నెలమి దక్షిణగాఁగ నిచ్చినఁ గొనుచు
వచ్చి వసిష్ఠుఁడు వసుమతీపతికి, నచ్చుగాఁ జెప్పి గృహంబున కరుగ
నంతఃపురంబున కరిగె భూవిభుఁడు, నంత నక్కడ రాముఁ డానందమంద
జానకితోఁ గృతస్నానుఁడై విష్ణు, మానుగాఁ గూర్చి హోమంబుఁ గావించి

యాహావిశ్లేషంబు నమరఁ బ్రాసించి, యూహ విష్ణుధ్యాన మొనరఁ జేయుచును
విశదనిశ్చయబుద్ధి విష్ణుగేహమునఁ, గుశశయ్యపైఁ బొల్చి కులగురుండైన
యావసిష్ఠుఁడు చెప్పినట్టిచందమున, ధీవరిష్ఠుఁడు రామదేవుండు నిష్ఠ
నుపవాసముండె నయోధ్యలో నంత, విపులసమ్మదమున విలసిల్లువారు
కొలఁదిముత్యముల ముగ్గులు వెట్టువారు, చెలువార గృహములఁ జిత్రించువారు
కలయఁ గస్తూరిరేఖలు దీర్చువారు, నలిమీఱి మణితోరణము లెత్తువారు
విరులచప్పరములు విరచించువారు, పురవీథిఁ గేతనంబులఁ నిల్పువారు
కలువడంబులు మేలుగాఁ గట్టువారు, కలిమి నొండొరు లర్థిఁ గైసేయువారు
నభిషేకసుముహూర్త మలరించువారు, విభుఁడైన దశరథు వినుతించువారు
నిలువేల్పులకుఁ బూజ లిచ్చెడువారు, కలకొద్ది దానము ల్గావించువారు
పురరాజవీథి గుంపులు గూడువారు, సరసకథాగోష్ఠి సలిపెడువారు
రాముఁడే రాజుగాఁ బ్రార్థించువారు, రాముని గొలువ సంభ్రమపడువారు
రామకీర్తనముల రంజిల్లువారు, నై మహోత్సవకోటు లటు చేయుచుండ
నప్పుడు మంథర యనుకైకదాసి, తప్పక దన మేడఁ దా నెక్కి చూచి
యిది యేమిచందమో యీపురలక్ష్మి, పొసలఁ బున్నది మహాద్భుతవైభవముల

## మంథర కైకకు దురుక్తులు బోధించుట

పౌరులందఱును నపారశృంగార, చారుశరీరులై సంతసించెదరు
కౌసల్యనగరిలోఁ గలకాంత లెల్లఁ, గైసేసియున్నారు కడువేడ్కతోడ
నేలొకో కౌసల్య యెదనుబ్బియుబ్బి, వేలసంఖ్యధనంబు వెచ్చపెట్టెడిని
ననుచుఁ బ్రమోదాది యగురాముదాదిఁ, గనుఁగొని యడిగి యక్కామినివలన
రాముఁ బట్టముఁ గట్టి రాజుగావించు, నామహోత్సవకోటు లని నిశ్చయించి
పనివడి రాముఁడు బాల్యంబునందుఁ, దన కాలు విఱిచినతప్పు సాధింప
నిది నాకు తఱియని యిచ్చఁ జింతించి, యది వచ్చి కైకతో నంతయుఁ జెప్ప
వచ్చి తత్కేళినివాసంబుఁ జొచ్చి, మచ్చిక నుయ్యెలమంచంబు మీఁదఁ
బ్రవిమలమృదులతల్పంబుపై వేడ్కఁ, బవళించియున్న యప్పద్మాక్షిఁ జూచి
లెమ్ము లెమ్మో భామ లీలాభిరామ, యిమ్మెఱుంగవు కార్య మేమియు ననుచు
గొనరెట్టఁ బట్టి గ్రక్కున లేవనెత్తి, తన నేర్పుమాటలఁ దరుణి కిట్లనియె
వసుధాధిపతి నాకు వలచు నాభాగ్య, మసమానమని చెప్పు టది బొంకు సుమ్ము
అది యెట్టులనఁ బెద్దయాలికి వెఱచి, మదిరాక్షి నిను వేఁడ మఱి మోసపుచ్చి
భరతుని నొకవంకఁ బరభూమిఁ బంచి, పరికింప రఘురాముఁ బట్టంబు గట్టఁ
దలఁచుచు నున్నాఁడు దశరథేశ్వరుఁడు, నెలఁత యిట్టిదియైన నీకేటి బ్రతుకు
రాజుల మది నమ్మరాదు నీకేల, వెజాడలను విఱ్ఱవీఁగెదో బాల
యిట్టి మోహవిదూరు నిట్టి వంచకుని, నిట్టి బూమెలవాని నెందు నేఁ గాన
మగఁడె యాతఁడు మైత్రి మానినయట్టి, పగవాఁడుగాక యీపట్టున నీకు
సవతికుమారుని జగతికంతటికి, ధవునిఁగా జేసిన ధవళాయతాక్షి

నీకుమారునకును నీకును నాకు, శోక మబ్బుటకాక సుఖమేల కలుగు
నీకరణంబుగా నీతండ్రి యనుపఁ, జేకొన్నప్రేమ వచ్చినదాన నేను
నీలెస్స నాలెస్స నీకైన లేమి, నాలేమి గాన నానావిధంబులను
హితముఁ జెప్పితి నీకు నిందునిభాస్య, మతి నీకుఁ బ్రస్తుండు మనుట దలంపు
మనుట వేడుకఁ బూని యాకైక దాని, వినుతించి కౌఁగిట వేగంబ చేర్చి
శ్రీరాముపట్టాభిషేకోత్సవంబు, చేరి నాకెఱిఁగించి చెవులకు విందు
చేసితి వేమందుఁ జెలువ నీపొందు, వాసిగా ఫలియించె వక్రోక్తు లుడుగు
భరతునకంటె నాభరతాగ్రజుండు, తిరమైనభక్తి విధేయుండు నాకు
నీమేలువార్తకు నేను మెచ్చితిని, భామరో యనుచు నేర్పడఁ గొంతసొమ్ము
ఘనతరనవరత్నఖచితమై యొప్పు, తనచేతికడియంబు దానికి వేగ
కొమ్ము కొమ్మని యొసఁగుటయు నాసొమ్ము, లక్ష్మాయలాఁడి యల్లటు పాఱవైచి
పాపంబు హృదయతాపంబు కోపంబు, దీపింపఁ బలికె నత్తెఱవతో మఱియు
నిది మేలుగా నుబ్బి తిచ్చలో నిప్పు, డిదియేమి మెచ్చుగా నిచ్చితి నాకు
నిదియేమి కైక యీహితముఁ గైకొనక, పదరి పల్కితి నీతి భావింపలేక
వలనొప్ప నేమనవచ్చు నీగుణము, కలకాల మీతీరుగాఁ జనఁదొడఁగెఁ
దన్నుమాలినయట్టి ధర్మంబు గలదె, కన్నుఁబోయెడునట్టి కాటుక గలదె
జగతిలో నెందైన సవతినందనుల, కగపడుశుభముల కాత్మఁ గోరుదురె
సవతికుమారుండు సామ్రాజ్యమునకు, ధవుఁడైన సకలభూధవులు బాంధవులు
ప్రజలు మంత్రులు రాముపంపు సేయుదురు, గజహయాదిబలంబు కైవసంబగును
దశరథునకు స్వతంత్రము లేదు పిదప, శశిముఖియైనకౌసల్య సంపదల
విఱ్ఱవీఁగఁగ సరివెలఁదివై యుండి, వెఱ్ఱిదానవె యెట్లు వేఁగించె దీవు
నది యది యేల నీ వావధూమణికి, నొదుఁగుచు దాసివై యుండంగవలయు
భరతుండు నారఘుపతికి భీతిలుచు, వెఱపున భృత్యుఁడై విహరింపవలయు
రాజదేవి యటంచు రమణి సీతకును, నీచిన్నికోడ లెన్నికఁ గొల్వవలయు
నైనంత యిట్టిదయేని నీకేటి బ్రతుకు, కల దుపాయం బిది కార్యంబునకును
వనదుర్గముల రాము వసియింపఁ బనుపు, పనివడి భరతునిఁ బట్టంబుగట్టు
మనవుడు కైకేయి యక్కటా నాకు, జననాథుఁ డింతటి చనువిచ్చె నేని
ఆరాజు నేమని యడుగుదు దీని, నీరెండు దశరథుఁ డేల నాకిచ్చు
నెక్కడిమాట నీ వేమిచెప్పినను, నిక్కార్యఘటన నాకేరీతిఁ బొసఁగు
శ్రీరాము నడవులఁ జేరఁ బొమ్మనుచు, నేరీతిఁ జెప్పుదు నెలనాఁగ నేను
ననుచున్న కైకతో నాయుపాయంబు, తనకీడు మెఱయ మంథర చెప్పఁదొడఁగె
బడఁతుక తొల్లి శంబరుఁడు నింద్రుండు, దొడరి పోరాడ నింద్రునకు నై ప్రీతి
నినుఁ దోడుకొని సైన్యనివహంబుఁ దాను, జని రాత్రి మార్కొన్న శంబరుతోడఁ
బోరాడ దశరథభూపాలుమీఁద, నారాక్షసుఁడు మాయ లలుకఁబన్నుటయు
ధవళాంగుఁ డనుమునిదయ నీవుగన్న, నవిరళంబగుమాయ నామాయ లడఁచి

నీవిభు నాదైత్యు నిశితాస్త్రనిహతిఁ, జావకుండఁగఁ గాచి సంప్రీతుఁ జేసి
వసుధేశుచే రెండువరములు నాఁడు, మసలక పడసితి మఱచితే వాని
ఈవె నాకీకథ లెఱిఁగించి మఱియు, నీ వాత్మ మఱచిన నే నేల మఱతుఁ
బట్టంబు నెడఁబాసి పదునాలుగేండ్లు, గట్టిగా మునివృత్తిఁ గౌసల్యకొడుకు
దారుణకాంతారధరణి నేలుటకు, ధారణీతలము నీతనయుఁ డేలుటకు
నారెండువరములు నవనీశు నడిగి, యీరెండు తెఱఁగుల నిటు సేయఁ బనుపు
మడుగుచో నతఁ డెంత ప్రార్థించెనేని, జడమతితోఁ గాక సత్యంబు మోపి
విడువక నీకార్యవిధము సాధింపు, తోడినకార్యంబు దొరకు నెల్లెడలఁ
బలి బొంక వెఱచు నీపై నెయ్య మెక్కు, డతకరింపఁడు సేయు మనిన రాగిల్లి
నీవంటి ప్రియురాలి నీవంటిసఖుని, నీవంటి నయగుణనిధి నెందుఁ గాన
నీవు నాచే విన్న యీవరద్వయము, గారవంబునఁ జేయఁగా వరారోహ
ఈవెంచినటువలె నీభూమి కెల్ల, నావరతనయుండు నాయకుండైన
బాగుగా నపరంజి బంగారుచేత, నీగూను పొదిగించి నీముఖేందువునఁ
దిలకంబు కస్తూరి దిద్ది నీమేను, వలనొప్ప భూషణావళులు గైసేసి
నటియించు మరునియందపుఁగొమ్మ యనఁగఁ, గుటిలకుంతల నీవు గ్రుమ్మరుచుండ
సఖులెల్ల నీమాట జవదాఁటకుండ, సఖియ నిన్నలరింతు సతత మే ననుచుఁ
గైక మంథరకు సత్కారముల్ చేసి, యేకాంతమునఁ దనయింటికిఁ బోయి
పెట్టినసొమ్ములు పెట్టెలోఁ బెట్టి, దట్టమౌ కస్తూరి తలపట్టు పెట్టి
మలినవస్త్రము గట్టి మఃనల్క దొట్టి, చలము చేపట్టి భూస్థలిఁ బండెనంతఁ
దనలోన నూహించి తనుఁ గొల్చి వచ్చి, మనమార నున్న యామంథరఁ జూచి
జననాయకుఁడు రామచంద్రునిఁ బిలిచి, వనమున మునివృత్తి వర్తింపఁ బనిచి
భరతుని దగు రాజ్యపదమున కెల్లఁ, గరమర్థిఁ బట్టంబు గట్టినఁ గాని
యన్నపానములొల్ల నాభరణమ్ము, లెన్ని యిచ్చిన నొల్ల నేమియు నొల్ల
నిట లేచి రా నింక నే నంచు నలుక, నటు పూని మదిలోన నలయుచున్నంత

**దశరథుఁడు కైకయింటికిఁ బోవుట**

కైకేయితోడ రాఘవుని పట్టాభి,షేకోత్సవం బెల్లఁ జెప్పెద ననుచు
నారాత్రి దశరథుఁ డచటి కేతెంచి, చారుమాణిక్యకాంచనదగద్ధగిత
కనకరత్నకవాటకాంత్యంతరముల, ఘనసారచందనకర్పూరగంధ
కలితనానారత్నకాంతిశోభితముఁ, దులకించు సౌధవేదుల వేగ కడచి
కేళీగృహంబునఁ గేకయపుత్త్రిఁ, బోలంగఁ బరికించి పొడగాన కపుడు
దౌవారికునిఁ జూచి దశరథుఁ డడుగఁ, గా వాఁడు వగచుచుఁ గరములు మొగిచి
దేవ యాకోపమందిరములోపలికి, దేవి విచ్చేసె నే తెఱఁగొకో యెఱుఁగ
నని వాఁడు పల్కిన నామాటలకును, ధనురుగ్రటంకారదారుణం బగుచు
వీనులఁ బడి మోము వెలవెలఁబాఱ, మానవాధీశుండు మానసంబునను
బ్రేమానుబంధంబు ప్రీతి రెట్టింప, నామందిరంబున కల్లన వచ్చి

యనిమిషపురినుండి యచ్చరలేమ, చనుదెంచి పడియున్న చందంబు దోఁప
నూరకే ధరణిపై నున్నయావికచ, నీరజాననఁ జూచి నివ్వెఱగంది
వెఱవెఱపాటున వేదనఁ బొంది, తెఱవదగ్గఱఁ జేరి దీనుఁడై మీఱి
యాయింతియొడలెల్ల నంటి చూచుచును, గాయజవివశుఁడై కడు వేడ్కఁ దొడఁగె
నిందీవరాక్షి పూర్ణేందునిభాస్య, ఇందిందిరాలక యేల యీయలుక
పవళింప నేలనే బాలేందుభాల, యవిరళమృదులపర్యంకంబు లుండఁ
గోమలమృదులదుకూలంబులుండ, నీమైలచీర నీవేల కట్టితివి
పసిఁడిశలాకతోఁ బ్రతియైన మేనఁ, బొసఁగ భూషణములఁ బూన వేమిటికిఁ
జలపట్టి వెన్నెలచందమౌ నుదుటఁ, దలపట్టు లేల నీతలఁపెట్టు పుట్టె
నీలాలకంబుల నిగ్గుల దేర, నేల పాపటదీర్ప విర్నాళ్లరీతిఁ
గెమ్మోవి కినుమడి కెంపుసంధిల్లఁ, గమ్మతమ్ముల మేల గైకోవు బాల
జిలుఁగువెన్నెల తేట చిఱునవ్వు మొలక, మొలపింపవేటికి ముఖచంద్రునందు
నిది యేమి కైక నీవిటు చిన్నవోయి, మది చూలి నీకింత మఱుఁగ నేమిటికి
నెవ్వరు నీదెస నెగ్గులు వలికి, రెవ్వరు మాటాడి రెదిరి నీతోడ
వారి నెఱిఁగింపు వారిజనయన, వారి వారింతు నెవ్వారలనైన
నని పల్కి కన్నుల నందందఁ గ్రమ్ము, ఘనబాష్పపూరముల్ కరములఁ దుడిచి
లేమ నీవొకదిక్కు లేనిచందమున, భూమిపై నిట ధూళిఁ బొరల నేమిటికి
గాము సోఁకెనొ యొండు ఘనమైనరోగ, మేమి పాటిల్లెనో యెఱిఁగింపు నాకు
వెజ్జులు వచ్చిన వేగ మాన్పెదరు, లజ్జింప నేటికి లలితాంగి నీకు
నటుగాన నీతలంపైన నొండరయ, నిటు సేయు మని పల్కు మేను జేసెదను
వనిత నీకొఱకు నవధ్యులుగాని, యనఘచరిత్రుల నైనఁ జంపెదను
జంపంగఁదగిన దుర్జనకోటినైనఁ, గంపించి నీమాటఁ గాచిపుచ్చెదను
నీకుఁ బ్రియంబైన నిరుపేదనైనఁ, జేకొని రాజుగాఁ జేసెద నెలమి
భామిని నీదయఁ బాసినయట్టి, శ్రీమంతునైన దరిద్రుఁ జేసెదను
నేను నావారు నీహితబుద్ధి నడువ, గా నీకు నిట్లుండఁ గారణ మేమి
లేమ నామాట లాలించి నీ విపుడు, మోమెత్తి నామది ముచ్చటదీర
నడిగిన నాప్రాణమైన నీకిత్తు, నడుగుము నీవన్న నానందమంది
యన్నాతి విభునినెయ్యంబు నెఱింగి, సన్నపుటెలుఁగున జనపతి కనియె
దేవ నీచెప్పిన తెఱఁగున నీవు, గావింతు నని బాస గావింతువేని
మఱి యెఱింగింతు నమ్మాట నీకనినఁ, దెఱవతో దశరథాధిపుఁ డిట్టు లనియె
వీరుఁ డెవ్వాఁడు మేటివిలుకాండ్రలోన, సార మెవ్వాఁడు ధర్మసమితిలోనెల్ల
నెవ్వనిఁ జూడక నేనుండఁజాల, నెవ్వాఁడు నను భక్తి నేప్రొద్దుఁ గొలుచు
నట్టి రాఘవునితో డతివ నీకోర్కి, నెట్టనఁ గావింతు నేనన్న నలరి
మరుదగ్ని శశినభోమణిముఖ్యులైన, సురల వేర్వేఱ సాక్షులుగా నొనర్చి
ధరణీశుమదిలోని తమకంబు దెలిసి, కరుణను నెడఁబాసి కైకేయి పలికె

నొలసి దేవాసురయుద్ధంబునందు, వలనొప్ప నిచ్చితి వరములు రెండు
భూవర మఱచితే బుద్ధిఁ జింతింపు, మావరద్వయము నిన్నడిగెద నిపుడు
నాదిత్యకులజుండ వగుమహారాజ, వాదిరాజులకంటె నధికపుణ్యుఁడవు

### కైక తన కిచ్చినవరముల నడుగుట

తప్పాడ వాడినఁ దప్పవు నాకుఁ, దప్పక వరములు దయ నిచ్చితేని
ధరణికంతటికిని దగ రాజుగాఁగ, భరతుఁ బట్టముగట్టఁ బనుపు మొక్కటికిఁ
బరఁగఁ దాపసవృత్తి బదునాలుగేఁడు, లురుదుర్గముల రాము నునుపు మొక్కటికి
నని పల్క నిర్ఘాతమై వచ్చి చెవుల, గొనకాడ మూర్ఛిల్లి కుంభిని ద్రెళ్లి
పెలుకురి భూపతి పెద్దప్రొద్దునకుఁ, దెలివొంది కైకేయిదెసఁ జూచి పలికె
కోమలి కేకయకులమునఁ బుట్టి, యీమాటలాడ నో రెట్లాడె నీకు
నడవులపాలు గమ్మని రాముఁ ద్రోవ, నెడపక తొల్లి నీ కెగ్గేమి చేసెఁ
గౌసల్యకంటె నిన్ ఘనతగాఁ జూచు, నీసేవ లొనరించు నీపంపుసేయు
నటువంటిసుగుణాఢ్యుఁడైన శ్రీరాము, నెటువలెఁ బొమ్మంటివే దయమాలి
అడవుల కతని నీ వంపు మటన్న, నెడ చూచి చూచి నే నెటులు పొమ్మందు
నామహాత్ముని రాము నడవుల కనిచి, యీమేనఁ బ్రాణంబు లెట్లు నిల్పుదును
నృపపుత్రి వని నిన్ను నెమ్మిఁ గైకొంటి, చపలలోచన కాలసర్పంబ వైతి
నారాజ్యమైనఁ బ్రాణములైన నిత్తు, నారాము విడిచిపొమ్మని పల్కఁజాల
నను వృద్ధు దీను ననాథు దుర్బలుని, మనికితపడకుండ మగువ రక్షింపు
చక్కఁగా నీపాదజలజంబులకును, మ్రొక్కెద నేను రాముని [1]నడాటమునఁ
జెలువ యీపాపంబు సేయఁ జింతింప, వలదనఁ గోపించి వామాక్షి పలికె
రాజేంద్ర సత్యపరాక్రమస్ఫూర్తి, పూజితకీర్తివై బొంకంగఁ దగునె
ఇట్టి దేవతలందఱెఱుఁగంగ నొట్టు, పెట్టి తప్పెద వెట్టి పృథివిపాలుఁడవు
ఒకగువ్వకై తనయొడలిమాంసంబు, నొకడేగకును శిబి యొసఁగఁడె మున్ను
క్షోణిదేవున కలర్కుం డనురాజు, ప్రాణితో నొసఁగఁడె తనలోచనములు
చెలరేఁగి జలధియుఁ జెలియలికట్ట, బలిమి దాఁటక లోను బడియుండలేదె
యది యటులుండె నీయన్వయభవులు, మదిలోన నవ్వులమాటలకైన
కలలోన బొంక రిక్ష్వాకుండవయ్య, వెలయఁ గౌసల్యకు వెఱచి బొంకెదవు
బొంకెడువాఁ డొక్కపురుషుఁడే యనుచు, బొంకితి ననుఁబొంద బుద్ధిగా దింక
విచ్చలవిడి నేను విషమైన మ్రింగి, చచ్చెద నటమీఁదఁ జంపింపు భరతుఁ
బావనుఁ డగురాముఁ బట్టంబు గట్టు, నీవు కౌసల్యయు నెమ్మది నుండు
మని పల్కుటయు శోక మాత్మ రెట్టింప, జననాథుఁ డెంతయు సంతాపమంది
వెలవెలఁబోయి వివేకహీనతను, గలిగి యాకైకతోఁ గ్రమ్మఱఁ బలికె
యేల కైకేయి నీకిట్టిపాపంబు, బాలిశత్వంబును బ్రాపించె మదిని
వన్నయుండఁగఁ దమ్ముఁ డవనీతితోడ, నిన్నేల నేలునే యున్నియు నేల

1 మహాత్ముగను.

నీకుమారుఁడు ధర్మనిరతుండు భరతుఁ, డీకలుషోక్తికి నెట్లోడిగట్టు
మాకులాగతమైన మం[illegible] దలఁపు, శోకార్తనను దెగఁజూడక మనుపు
మెప్పుడు నిల్లాలు హితము భక్తియును, దప్పక సఖరీతిఁ దల్లిచందమున
దాసివైఖరి సహోదరి తెఱంగునను, నానేన లాలించు నానావిధముల
నట్టి కౌసల్య మోహాపుఁబట్టిఁ బాసి, పట్టినధృతి నెట్లు ప్రాణముఁబట్టు
సౌదామనీలతాసంకాశదేహ, వైదేహి యేరీతి వగల వేఁగించు
నాసుమిత్రాపుత్త్రుఁ డతనితల్లియును, ఈసొద విని శోకమెట్లణంచెదరు
శ్రీరామపట్టాభిషేకంబు గోరి, పౌరులందఱు వేడ్కఁబడియుండుచోట
నారాము నడవుల కనిచితి నేని, ధీరాత్మకులు నన్నుఁ [1]పట్టఁజేసెదరె
కావున నెల్లలోకములకుఁ గీడు, గావించి యేసౌఖ్యగతు లందెదీవు
యిది యేలోకోక్తికైక యింకొకమాట, మదిత చెప్పెద నిక్కముగ నీవు వినుము
కలువరేకులఁబోలుకన్నులవాని, మొలకనవ్వులమోము మురిపెంబువాని
బలువైన యాజానుబాహులవాని, వలరాజుఁ గేరు చెల్వముగలవాని
నలరుఁ గల్వలకాంతి నగుమేనివానిఁ, జల్లచూపులు వెదఁజల్లెడువాని
సుధ లొల్కు తియ్యనిసుద్దులవాని, బుధులకు హిత మాత్మఁ బూనెడువాని
వలచి నాకెపుడు సేవలుసేయువాని, నిలువెల్ల ధర్మమై నెగడెడువాని
సత్యనిత్యుండయి చరియించువాని, నిత్యానురక్తిచే నెగడెడువాని
రాముని జితభృగురామునిఁ గాంతి,సోముని సద్గుణస్తోముని కీర్తి
కాముని సౌందర్యకాముని శాంత,ధాముని రవిసముధామునిఁ బాసి
నిమిషమాత్రంబైన నేనోర్వఁజాల, గమలాక్షి నీ వెఱుంగవె యిట్టివాని
నాయుత్తమోత్తము నడవుల కనుపఁ, బోయెఁ బ్రాణంబులు పోవు నాక్షణమె
యెంత పాపిష్ఠివే యెంత కట్టిడివె, యెంత మూఢాత్మవే యెంత రాక్షసివె
కఠినాత్మురాల యీకల్మషం బేల, శఠమతిఁ గోరెదు సాధ్వివై యుండి
యాలవై ప్రాణాపహారంబుసేయు, కాళరాత్రివిగాక కాంతవా నీవు
నడచి రాముఁడు కాననమున కెట్లరుగు, నడవుల నెట్లుండు నందఱుఁ దొలఁగి
మెత్తనిపాన్పున మేనెత్తుభోగి, యెత్తెఱంగుననుండు నిలఁ దృణశయ్యఁ
బంతినిష్టాన్నముల్ బంధులుఁ దాను, నెంతయు నియతితో నిట నారగించు
కడుపుణ్యదేహికిఁ గందమూలములు, నెడపక భుజియింప నెటు సమ్మతించు
నతివ నీకతిభక్తుఁ డైనరామునకు, మతిఁ గీడు దలఁపకు మన్నింపు మనుచు
నడరు శోకంబున నడుగులమీఁదఁ, బడిన మ్రొక్కొల్లక పాదముల్ దిగువ
భూకాంతుఁ డిలఁబడి పొరలఁ గైకొనక, కైకేయి దశరథుఁ గని యిట్టు లనియెఁ
జాలుఁ జాలీవట్టి జగజోలిమాట, చాలింపు మీవట్టి జాడ లేమిటికి
ధర్మంబు మాని సత్యము వీటఁబుచ్చి, నిర్మలయశమెల్ల నీటిలోఁ గలిపి
యీవరద్వయము నాకీలే దటంచు, భూవర బొంకి నీపుత్త్రుండు నీదు

1 దెగఁదిట్టకుండ్రె.

దేవులు నీవు వర్ధిల్లుము నేను, నావరసుతుఁడుఁ బ్రాణములఁ బొసెదము
అనునంత మాటాడకయ వేఁగి విభుఁడు, తనమది శోకించి తలవాంచియుండె
నంత వేఁగుటయుఁ దూర్యంబులు మ్రోయ, నంతంత వందిజనావళి పొగడఁ
గలగొని గర్పూరగంధముల్ చల్లి, జలముల జలకంబు చదురొప్ప నాడి
పరఁగ దివ్యాంబరాభరణముల్ పూని, చిరకీర్తి రాముఁడు సీతతోఁ గూడి
తెఱఁగొప్ప శచితోడ దేవేంద్రుఁ డొప్పు, తెఱఁగున సంపూర్ణ తేజుఁడై యొప్పె
మఱి యంత నభిషేకమండపంబునకు,నెఱి వసిష్ఠాదులు నిండ నేతెంచి
యాయరుంధతి మొదలగుపుణ్యసతులు, నాయతమతులగు నామంత్రివరులు
తగవొప్ప మకుటవర్ధనచక్రవర్తు, లగుమహారాజుల నందు రప్పించి
పంచపల్లవములు పంచవల్కములు, పంచామృతంబులు పట్టపేనుంగు
నెనమండ్రుకన్యలు హేమకుంభంబు, నొనర నౌదుంబరయోగ్యపీఠంబు
గంగాదితీర్థోదకము లాదిగాఁగ, మంగళవస్తుసామగ్రి రప్పించి
వరరత్నభూషణావళులఁ దెప్పించి, తరమిడి వేదోక్తదానముల్ సేయ

కైకయింటికి దశరథుని బిల్వ సుమంత్రుండు పోవుట

నొకలక్షకన్యల నొకలక్షగోవు, లొకలక్షయుక్త్రంబు లొప్పఁ దెప్పించి
జపములు సేయించి శాంతిసేయించి, విపులహోమంబులు వేడ్క సేయించి
యనుపమం బగులగ్న మాసన్నమైన, మనుజేశుఁ బిల్వ సుమంత్రు నంపుటయుఁ
గైకేయినగరికిఁ గడఁకతోఁ బోయి, వాకిట నిలుచుండి పలనొప్పఁ బలికె
దేవ సూర్యుఁడు పొడతెంచుచున్నాఁడు, వేవేగ మీరట వేంచేయవలయు
శ్రీరాముపట్టాభిషేకంబుసేయ, నారూఢమగులగ్న మాసన్నమయ్యె
మనుజేశ యభిషేకమండపంబునకు, మునులు రాజులు మహాత్ములు వచ్చినారు
పౌరులు బుధులును బంధువుల్ గూడి, మీరాక గోరి యిమ్మెయి నున్నవార
లన విని దశరథుఁ డావార్తలెల్లఁ, దనకుఁ గేవల మనస్తాపంబుఁ గూర్ప
వనట నీవును నొంప వచ్చితే యనుచు, వినియు నిద్రించిన విధమున నుండె
నాసమయంబున ననియెఁ గైకేయి, యోసుమంత్రుఁడ వేగ యుర్వీశుకడకు
రాముని దోడ్తెమ్ము రాజుపంపనుఁడు, నామాట విని యతఁ డప్పుడే పోయి
శీతపటీరాంబుసిక్తాంగణంబు, కేతనాన్వితము నికేతనాంచితము
చందనాగరుధూపసౌరభాన్వితము, మందానిలాలోలమాలికాయుతము
ప్రతిగృహద్వారరంభాస్తంభవర్గ, మతులితమణితోరణాభిరామంబు
పౌరజనాదిసంభ్రమదుర్గమంబు, నౌరాజమార్గంబు నపుడు గన్గొనుచు
నింద్రుగేహము హసియించు నాకిన్న, రేంద్రుమందిరముతో నీడుబోఁడాడి
సాంద్రవైభవరమాసహితమౌ రాము, చంద్రునినగరికిఁ జనుదెంచి లోనఁ
జనువరులై యున్న జనులచే వేగ, తనరాక యెఱిఁగించి తదనుజ్ఞ వడసి
చిత్రాఖ్యతారతో సిరులుల్లసిల్ల, మైత్రి యొప్పెడు చందమామచందమున
సీతాసమేతుఁడై చెలువొందు రాము, భూతలనాథుని బోడఁగాంచి మ్రొక్కి

రాదేవ మిము దశరథచక్రవర్తి, యాదేవి కైకగృహంబున నుండి
యాదటఁ బిలిచి తెమ్మనిపంచె ననుచు, మోదించి చిఱునవ్వు మొలకలు నిగుడ
ధరణిజ నటనుంచి తాను లక్ష్మణుఁడు, [illegible] కడఁకతోఁ గదలి
చతురంగబలము లసంఖ్యలు గొలువ, నగారలవాద్యములు మిన్నంది మ్రోయఁ
[illegible] కైవారము ల్సేయఁ, బంటి పుణ్యాంగన ల్సేసలు చల్ల
పురజను లానందమున జయవెట్ట, నరనాథునగరి కున్నతగతి వచ్చి
యరదంబు డిగి రాముఁ డపుడు కైకేయి, వరమందిరముఁ జొచ్చి వలనొప్పవచ్చి

శ్రీరాములు కైకయింటిలో నున్నదశరథుని [illegible]

వదనంబు వాంచి వైవర్ణ్యంబు మించి, పెదవులు [illegible] బెంపెల్ల నుడిగి
యుడుగక కన్నీరులొలుక శోకాగ్నిఁ,బడి కాలు దశరథపతి చేరఁబోయి
కరము భీతిలి మ్రొక్కి కైకకు మ్రొక్కి, కరములు ముకుళించి కడువిస్మయంబు
వెఱవెఱపాటును విహ్వలత్వంబు, వెఱపును మఱపును వీడఁజోడాడ
పరిపరివిధములఁ బలుమాఱు నెమకి, పరమపుణ్యుఁడు రామభద్రుండు పలికె
నోదేవి యిదియేమి యుర్వీశ్వరుండు, నా దెసఁ జూడఁడు నాతప్పు లేమి
యీవిన్నఁదనమును [illegible], నీవిచారము రాజు కేమిటఁ గలిగె
ననవుడు నాకైక యధిపుచందంబు, వినుపింతు నీవు గావించెద వేని
నని పల్క రఘురాముఁ డది యేమి తెఱఁగు, వినుపింప వోయమ్మ విశదంబుగాఁగ
దండ్రివాక్యములకై దారుణశిఖల, వేండ్రపుటానగ్నిలో విషధిలోనైనఁ
బడియెద విషమైన భక్షించువాఁడ, జడియక వినుపింపు సత్య మీమాట
యనవుడు కైకేయి యారాముఁ జూచి,మనమునఁ గృపమాలి మఱి చెప్పఁదొణఁగె
గరుణ.దేవాసురకదనంబునందు, వరములు రెండు భూవరుఁడు నా కొసఁగె
నవనీశు నా రెండు నడిగి మాభరతు, నవనికిఁ బతిఁజేయు మంటి నొక్కటికి
నెడపక పదునాలుగేండ్లు నిన్నంపు, మడవుల కాపుండ నంటి నొక్కటికి
ననుటయు నౌఁగాక యని యిచ్చి నీకు, వినుపింప మీతండ్రి వెఱచుచున్నాఁడు
కావున జడల వల్కలములు గట్టి, నీవింకఁ దపసివై నృపవేష ముడిగి
చనుదెమ్ము దశరథజనపతి బొంకఁ, డనిపింపవలతేని యడవుల నుండు
మామ్మన్న విని మొగంబునఁ జిఱునవ్వు,గ్రమ్మ మాటల నొండు కసటు లేకుండఁ
గరుణయుఁ దెగువయు గరిమంబు దోఁప, బరమపుణ్యుఁడు రామభద్రుండు పలికె
నిటు సేయమన్నవాఁ డినకులాధీశుఁ, డఁట నాసహోదరుం డగు రాజ్యకర్త
యటమీఁద నీకోర్కి యడపడ నేల, కటకటా కైకేయి కడుముగ్ధవైతి
వింతమాత్రమునకై యినవంశజుండు, చింతింపనేటికిఁ జిత్తంబులోనఁ
దనజనకునిమాట దాఁటినవాఁడు, తనయుఁడే తలపోయ దాయాదిగాక
యేనేమి నాతమ్ముఁడేమి యీభూమిఁ, బూనుటకును బుణ్యపురుషుఁడై యున్న
భరతుని దెస నాకుఁ బ్రాణంబులైన, సరకుగా వనిన రాజ్యము నాకు సరకె
యనవుడు ముదమంది యా కైక పలికె, మనుజేంద్రతనయ యామాట కే నిపు

భరతుని దోడ్తేరఁ బనిచెద నింక, నరుగుము వనముల కరుగునందాఁక
కుడువఁడు పలుకఁడు గూర్చుండఁ డిట్లు,పడియుండు నృపుఁడంచుఁ బల్కెఁ బల్కుటయు
కటకటా తగునె యీకఠినోక్తు లనుచుఁ, బటుమూర్ఛతో నేలఁబడియె నారాజు
నయ్యెడ నారాముఁ డవనీశచంద్రు, నొయ్యనఁ బట్టి శైత్యోపచారములఁ
దెలిపియంతయును బోధించుచు మఱియుఁ, బలికెఁ గైకను జూచి పరమహర్షమున
నింతయేటికిఁ జింత యిదియెంత నాకు, నంతరంగంబున ననుమానపడకు
పరికించి ధర్మంబు పాటింతుఁగాని, కరమర్థి వ్యర్థంబు గావింప నేను
వేయేల విభునాజ్ఞ వినఁబడకున్న, నీయాజ్ఞ గడవను నిక్కువం బరయఁ
జారుల శీఘ్రసంచారుల ఘోట, కారూఢులుగఁ జేసి యనిచి వేవేగ
కరమర్థి నీలగ్నఘటికలయందె, భరతునిఁ బిలిపించి పట్టంబుగట్టు
మిదె యరణ్యములకు నేఁగెద ననుచు, వదనాబ్జ మలరంగ వలఁగొని వచ్చి
తనతల్లికిని సుమిత్రావధూమణికి, జనకనందనకు నీచంద మంతయును
వినిపించి వారల వెస నూఱడించి, చనుదెంతు నోయమ్మ సందియపడకు
మని రాజునకు మ్రొక్కి యాకైక కెరఁగి, తనుఁగొల్చి సౌమిత్రి తగిలి రాఁ గదలి
చెలువార పట్టాభిషేకంబుకొఱకు, లలినమర్చిన మంగళద్రవ్యములకు
సుచిత్రప్రదక్షిణ మొనరించి చిత్త, మచలమై యవికారమై వికసింప
రాజ్యపట్టము మాని రాముండు లోక,పూజ్యుండు కాననభూమి కేఁగెడిని
ఆమహాకలకలం బంతఃపురమున, వినఁబడ దశరథు వెలఁదులు గలఁగి
యేభక్తి కౌసల్యయెడను గావించు, నాభక్తి మనయందు నట్ల కావించు
నాగుణాలంకారు నామహోదారు, నాగిరివరధైర్యు నాశౌర్యధుర్యు
నాపుత్త్రరత్నంబు నకట కానలకు, భూపాలుఁ డేమని పొమ్మన నేర్చె
వీఱిడియై రాము విపినవాసమున, కాఱడిఁబుచ్చెంగ నౌనమ్మ యనుచు
మీఱినవగలతో మేదినీనాథు, దూఱుచు శోకింపఁ దొడఁగి రందఱును
ఆసమయంబున నారామవిభుఁడు, కౌసల్యయింటికిఁ గడఁకతో వచ్చి
యటమున్న దొడఁగిన యభిషేకమునకుఁ, బెఱవిఘ్న మొరులు సంపాదింపకుండ
జపములు శాంతులు సాధుహోమములు, విప్రులైకనిష్ఠఁ గావించుచుఁ బ్రేమఁ
గరమర్థి నేమముల్ గైకొని భక్తి,పరత జనార్దనుఁ బ్రార్థించుచున్న
కౌసల్య రాము రాకకు సంతసిల్లి, భాసిల్లు వరపుణ్యభామలుఁ దాను
నెలమి సేసలు గొంచు నెదురుగా వచ్చి, వెలయ శుభాచారవిధు లాచరింప
నంత నాకౌసల్యయడుగుల కెఱఁగ, సంతోషమున రామచంద్రుని నెత్తి
యాలింగనము సేసి యాయువు యశము, భూలాభమును బొందు పుత్త్ర నీవనుచు
దీవించు తనతల్లిఁ దెఱఁగొప్ప రాము,దేవుఁడు వీక్షించి దీనుఁడై పలికె
నేకార్యమును మీర లెఱుఁగరు తల్లి, మీకు సుమిత్రకు మిథిలేంద్రసుతకుఁ
గడుభీతిపుట్టించు కార్యంబు పుట్టె, విడువక ధృతిఁబూని వినుము చెప్పెదను
వసుధేశుచే రెండువరములు తొల్లి, యసమానగతిఁ గైక యాజిలోఁ బడసెఁ

గొడుకుఁ బట్టముగట్టఁ గోరె నొక్కటికి, అడవికి ననుఁ బంప నడిగె నొక్కటికి

## కౌసల్య ప్రలాపించుట

నడిగిన దశరథుఁ డధికశోకమునఁ, బడుటయు మాతండ్రి పలుకు రక్షింప
నడవులఁ బదునాలుగబ్దంబు లుండఁ, గడఁగి వచ్చితి ననఁ గౌసల్య మదిని
గలఁగి నివ్వెఱగంది కడుఁ జిన్నవోయి, పలుకనేరక మ్రానుపడి యున్న దనుచు
ముడిగొన్న వగలతో మొదలంటఁ ద్రవ్వఁ,బడియున్న లతఁబోలెఁ బడిమూర్ఛవోయి
నడలుచు రఘురాముఁ డప్పు డాతల్లి,యెడ నతిభక్తితో నెత్తి నెమ్మేన
గమియ నంటినధూళిఁ గరములఁ దుడిచి, కొమరారుగద్దియఁ గూర్చుండ నునిచి
శ్రమము దీఱంగ లక్ష్మణుఁడును దాను, సముచితగతి నుపచారముల్ సేయ
నొదవిన వగలతో నొయ్యనఁ దెలిసి, పెదవులు దడుపుచు బింబోష్ఠి పలికె
ననఘ రాఘవ నిన్నుఁ నడవులనుండు, మనుపల్కు విన నెందు నరుదు వీనులకు
వెలుచ నొక్కట నిన్నుఁ బిలిపించియట్లు పలుక నెమ్మెయిఁ జాలెఁ బార్థివేశ్వరుఁడు
ధరణి కింతటికిని దగురాజు గాఁగ, భరతు పట్టముగట్టి పతిసేయుఁ గాక
కడుఁగృపశూన్యుఁడై కాకుత్స్థతిలకుఁ, డడవికి నిన్నుఁ బొమ్మనకున్న నేమి
యవివేకిగా నొండె యధముఁడుగాఁడు, సవతిమాటలు వినఁజనునయ్య తనకు
నిదిధర్మ మిదికార్య మిది లెస్స యనుచు, మదికెక్కు హితులైన మతిమంత్రులైనఁ
గులగురుఁడైన లోకులు మెచ్చ రతనిఁ, దెలుపలేరైరి నీదెస మైత్రిఁగూడి
యింత నేరముచేసె నెన్నఁడు నాథుఁ, డింతపాపముఁజేసె నెన్నఁడు కైక
యడవులనుండు పొమ్మని నిన్నుఁజూచి, నుడువఁగఁ గైకకు నోరెట్టులాడె
ననువునఁ జేరి ప్రాణములైన నడుగు, జననాథునకుఁ దాను చనవురాలైనఁ
గైకకుఁ బుట్టి లోకము లేలకీవు, నాకేల పుట్టితి నా రామచంద్ర
నీవు నాకడుపున నిటఁ బుట్టకున్న, నీవిషాదము నాకు నేల పాటిల్లుఁ
గొడుకులులేని యాగొడ్రాలికంటెఁ, గడలేనిశోకంబు గలిగె నాకకట
పెద్దకాలమునకు బిడ్డలులేక, తద్దయుఁ బ్రీతి నిన్ దనయుఁగాఁ గాంచి
యూఱడియుండుచో నుండలేదయ్య, నాఱడిఁబోయె నకట నాతపము
నరనాథనందన ననుడించి నీవు, కరము తెంపున ఘోర కాంతారములకు
నరిగి నప్పుడె నాకు నారసిచూడ, మరణంబు దప్పించి మఱియొండు లేదు
నన్నెట్లు విడి కానల కేఁగె దింక, నన్న నే నేమిట నడలార్చుకొందు
నెలమిమై నిరువదియేనువత్సరము, లలరి పెంచితి నిన్ను నఖిలంబు నెఱుఁగ
నట్టి నన్నిట డించి యెట్టుపోయెదవు, పట్టి నీకొఱకునై పాలించినట్టి
వివిధవ్రతంబులు వివిధదానములు, చవుట విత్తనములు చల్లినట్లయ్యె
భరతుండు రాజైనఁ బరివారజనులు, కరుణమాలినయట్టి కైకకు వెఱచి
ననుఁ గొల్వవత్తురే నరనాథునందుఁ, జనవు లేకుండెడు చందంబుఁ జూచి
వాసియు వన్నెయు వైభవం బెడలి, యీసవతులలోన నెట్లు వర్తింతుఁ
గైక రాజసము నేకరణి సహింతు, నీకార్య మిట్లౌట నెఱుఁగలేనైతి

వీనుల నీవార్త వినుటకు మున్నె, యేనే నేల చావనో యినవంశతిలక
కడఁగి యీ రాజ్యంబు గైకొని కైక, కొడుకు పట్టముగట్టుకొని యేలుఁగాక
భూరిదుర్గములకుఁ బోవ నేమిటికి, నూరకె నాయొద్ద నుండవే తండ్రి
యావసిష్ఠాదిసంయములు బాల్యమున, భావించి చూచి నీపాదపద్మములు
జలజాతహలకులిశధ్వజకలశ,ములు మొదలగుచిహ్నములు విలోకించి
యీవిశ్వమంతయు నితఁ డేలు ననిరి, యావార్తఁ గైక నేఁ డనృతంబు చేసె
నని పెక్కుతెఱఁగుల నడలుకౌసల్యఁ, గని లక్ష్మణుండు శోకము కోప మెసఁగ
ముడివడుబొమలతో మొగము కెంపెసఁగ, నుడుగక రోషాగ్ని లాగి మండుచుండ
రాముమాతను జూచి రామునిఁ జూచి, సౌమిత్రి యడిదంబు జళిపించి పలికె
మగఁటిమి దిగనాడి మానంబు విడిచి, తగు నుత్తమక్షత్త్రధర్మంబు వదలి
వాలినతేజంబు వమ్ముగాఁ జేసి, యేలకో దీనోక్తు లిట్లాడ నీకు
నక్కటా వీతజ్ఞుఁ డగుతండ్రి పనుపు, స్రుక్కక ధిక్కరించుట కాదుకాక
కామాతురుఁడు పాపకర్ముండు వృద్ధుఁ, డేమిటి కీరాజు నింత పాటింపఁ
గైకేయి కిచ్చి బొంకఁగ నేరననుచు, నీకిచ్చి యోడక నేఁ డెట్టు బొంకె
నదరి వసిష్ఠాదు లందఱు వినఁగ, కడఁగి నీకు బట్టంబు గట్టెద నన్న
పలుకు సత్యంబుగాఁ బాటింపవలదె, తలఁపంగ నది యసత్యముగాదె తొలుత
నెక్కడి దశరథుం డెక్కడి వరము, లెక్కడి భరతుండు నెక్కడి కైక
విను మేను నిజముగా విల్లెక్కువెట్టి, కొనియున్న నన్నుమార్కొన నెవ్వఁడోపు
భరతుని మొదలుగాఁ బగవారిఁ జంపి, నెరసి యీపుర మెల్ల నీకు గావింతు
హరిహరబ్రహ్మాదు లడ్డమైరేని, తరమిడి తోలి యుద్ధము సేయువాఁడఁ
గమనీయకేయూరకంకణాలంకృ,తములు మనోజ్ఞచందనచర్చితములు
నగు నాభుజమ్ముల నభిషిక్తుఁ జేసి, పగతురఁ జంపుదుఁ బాల్పడి యిపుడె
పాటింప నావంటిబంటు గల్గియును, నేటికి సామ్రాజ్య మెల్ల వర్జింప
నడవులకేఁగెద ననునట్టి బుద్ధి, విడిచి కౌసల్యకు వేడ్క లుప్పొంగ
నెట్టనఁ గడిమిమై నిజశక్తి మెఱసి, పట్టంబుఁ బూనుచుఁ బ్రజలఁ బాలింపు
మనవుడు రాఘవుం డనుజన్ముఁ జూచి, మనమునఁ దలపోసి మమత నిట్లనియె
సౌమిత్రి శూరత సమయంబుగాదు, ఈమాట మెచ్చదు హితబుద్ధి నిలుపు
చాలుఁజా లీపట్ల జగము లేలఁగను, బోలంగ మనకబ్బెఁ బొసఁగు కార్యములు
శూరత నిక్కడ చూపంగ నేల, వైరులయందును వర్తింతు గాని
యనిన కౌసల్యయు నారాముఁ జూచి, వినుము నీతమ్ముని విమలవాక్యములు
శౌర్యంబు చేపట్టు జను లెల్లఁ బొగడ, నార్యసమ్మతముగా నవనిఁ బాలింపు
సవతిమాటలకు రాజ్యము మాని యడవి, నివసింపఁబోవుట నీకు ధర్మంబె
నాయింట నుండుము నాదుశుశ్రూష, సేయు మింతటికంటె శ్రుతి ధర్మ మెద్ది
జనకువాక్యము సేయఁ జాలిన నీకు, జననివాక్యం బెన్న సన్నమే యన్న
యని పెక్కువిధముల నడలుచునున్న, తనతల్లి నూరార్చి తలఁ పెల్లఁ దెలిపి

ఏమిటి కీమాట లింత శోకింప, నేమిటి కని రాముఁ డేర్పడఁ బలికె
బలువిడి దమతండ్రిపనుపునఁ దొల్లి, చెలమునఁ దమతల్లిఁ జంపె భార్గవుఁడు
తఱుఁగని కినుకమైఁ దమతండ్రి పనుప, సగుణ నొగిఁ గోవుఁ జంపె గుండినుఁడు
తనమనోహరమైన తారుణ్య మొసఁగి తనతండ్రిముదిమి నాయుఁ దాల్చెఁ బూరుండు
తమతండ్రిపనుపునఁ ద్రవ్వరే తొల్లి, తమకించి సగరనందను లంబుధిని
గడఁగి తండ్రిపంపుఁ గైకొని నాకు, నడవులనుండుట యది యెంత పెద్ద
నీవల్లభునిమాట నీకును నాకు, భావించి సేయుట పరమధర్మంబు
ఈలక్ష్మణుఁడు బాలుఁ డేమియు నెఱుఁగఁ, జాలఁడు నీవనిచారంబె కాని
యని నవ్వుచును రాముఁ డనుజన్ముఁ జూచి, తనలోన శాంతసుంతయుఁ దోఁపఁ బలికె
నీవిక్రమంబును నీభుజాబలము, నీవిలువిద్యయు నీదుబుద్ధియును
నీమగతనమును నేటికి నకట, సౌమిత్రి నాయెడ సద్భక్తి కిదియె
యెంత సాహసము నీవిపుడు కోరితివి, ఎంతటిబుద్ధి నా కీవు చెప్పితివి

శ్రీరాములు కౌసల్యకు నీతిఁ దెల్పుట

కొనకొని యిటు వేఁడుకొన్నది తల్లి, యనుకంప లేక పొమ్మన్నాఁడు తండ్రి
యిలయెల్లఁ జేకొని యీరాజ్యపదము, నలి నేలువాఁడిక నాసహోదరుఁడు
బలువిడి యెవ్వరిపై నగ్గలే దీవు, బలగర్వములు చూపఁ బాడియే నీకు
నర్మిలి తండ్రివాక్యము సేయకుంటె, ధర్మంబు గలదె యీతండ్రివాక్యంబు
త్రోయుటకంటెను దురితంబు గలదె, వేయువిధంబుల వెదకి చూచినను
జనకునిపను పవశ్యము నీకు నాకు, జనులకును జేయ సహజధర్మంబు
గాన నాతనిపంపు గైకొని నేను, కానల కేఁగుట కాదనవలదు
పరమపావనులైన భానువంశజుల, చరితంబు నీకు విచారింపవలదె
కావలసినపనుల్ గాకేల మాను, దైవయత్నము లివి దాఁటంగఁ దరమె
యనిన లక్ష్మణుఁ డప్పు డాటోప ముడిగి, తనరఘురాముని తలఁ పెల్ల నెఱిఁగి
జడిసి యూరకయుండె సాధ్వి కౌసల్య, కొడుకు తెంపునకు మిక్కుటమైన వగలఁ
బొగులుచుఁ గళలచేఁ బున్నమచంద్రు, దెగడు రాముని మోము దృష్టించి మఱియు
నాకులభూషణ నాముద్దులయ్య, నాకూర్మికొమరుండ ననుఁ గన్నతండ్రి
క్రేపుఁ బాసినయావు క్రియ నిన్నుఁ బాసి, యీపదునాలుగేం డ్లిందుండఁజాల
నినుఁగూడి చనుదెంతు నిష్ఠురాటవుల, కని ప్రలాపించు నయ్యంబ నూరార్చి
యనునయాలాపదీనాస్యుఁడై రాముఁ, డనియె నోయమ్మ యిట్లాడంగఁ దగునె
పతియె ప్రాణపదంబు పతియె చుట్టంబు, పతియె దైవత మాత్మఁ బరికింప నట్టి
పతిఁ బాసి నావెంటఁ బఱతెంతు ననుట, మతిఁ దలంపఁగ ధర్మమా తల్లి నీకు
వసుధేశు నానతివసుమతిభార, మెసఁగ నాభరతున కిచ్చుట తప్పె
నవనీశుఁ డిచ్చెద నన్నవరంబు, లవి రెండు కైకేయి యడుగుట తప్పె
నన్నృతంబునకు నోడి యకట రాజేంద్రుఁ, డొనరంగ వరము లిట్లొసఁగుట తప్పె
మాతండ్రి యానతి మది నిర్వహించి, యే తెఱంగునఁ బూను టిది నాకు తప్పె

చేకొని పతిపంపు చెల్లింపకున్న, నీకైన తప్పదు నిక్కువం బరయఁ
బోనికానల కేను బోయిన మిగుల, దీనుఁడై పొగలు పార్థివుని నీ వెపుడు
వనునయించుచు సపర్యలు నొనర్చుచును, మనసునుమ్మలికంబు మాన్పంగవలదె
దురితదూరుండు బంధురనీతిరతుఁడు, భ్రాతుండు నాకన్న భక్తి నిన్నరయు
నీవు శోకింపకు నీకలనైన, భావింప దశరథ పతియొప్పుఁ దనకు
కైకేయి విడువక కలిసి వర్తింపు, నాకు సేయముగోరి నను వీడుకొలుపు
మని పల్కి మ్రొక్కిన నారామచంద్రుఁ, గనుఁగొని కౌసల్య కౌఁగిటఁజేర్చి
క్రమ్మెడుశోకాశ్రుకణము లందంద, వెమ్మఁచు రఘురాము వీఁపున రాల
నడవికిఁబోయెదే యకట నీవనుచుఁ, గొడుకుమై నివిరి డగ్గుత్తికఁబెట్టి
యొక్కింత ధృతిఁబూని యుల్లంబులోనఁ, జెక్కుటఁ గన్నీరు చేతఁ బోఁ దుడిచి
పావనజలములఁ బ్రక్షాళితాస్య, యై వచ్చి పుణ్యాహ మపుడు సేయించి
సురలును ఖేచరుల్ శ్రుతులును యతులు, తరులును గిరులును దాంతియు శాంతి
నదులును నిధులు నర్ణవము నాకసము, నుదకంబు మారుతం బుర్వియు నగ్ని
దిక్పాలకులు దశదిశలు చంద్రార్క, వాక్పతి ప్రముఖులు వలనొప్ప నీకు
స్వస్తి యెల్లప్పు డొసంగుదు రనుచుఁ, బ్రస్తుతిజేసి యా భామాలలామ
పాలుపొంద వేల్పులఁ బూజించి రాము, వలచేత నొకరక్ష వలనొప్పఁ గట్టి
యలిగి వృత్రాసురు ననిఁ జంపఁబోవు, బలభేది యగువజ్రపాణికిఁ దొల్లి
యేమంగళము లిచ్చి రెల్లదేవతలు, నామంగళములు నీ కగు రామచంద్ర
యరుదుగా దివినున్న యమృతంబుఁ దేరఁ, గర మొప్ప నరిగెడు గరుడున కర్థి
నేమంగళములిచ్చె హితమతి వినత, యామంగళములు నీకగు రామచంద్ర
దేవరాజ్యంబును దిరుగ నార్జింప, నాహవమునఁడు పోవునపుడు సంప్రీతి
నేమంగళంబుల నిచ్చె నయ్యదితి, యామంగళములు నీకగు రామచంద్ర
యని రాముఁ దీవించి యక్కునజేర్చుకొని మస్తకంబు మూర్కొని నిండుమదిని
అనిపినఁ దనతల్లి యడుగుల కెఱగి, యనుజన్మసహితుఁడై యచ్చోటు వెడలి
యభిషేకవిఘ్న వృత్తాంతంబు దెలిసి, సభ నుండురాజులు సచివులు సకల
పౌరులు శోకింపఁ బాదచారమునఁ, జారుచామరసితచ్ఛత్రముల్ మాని
యనురాగమందుచు నంత రాఘవుఁడు, తననగరికి నచ్చి తగవొప్ప మెఱసి
యంతఃపురంబున కరుగుచో సీత, యింతులు దాసును నెదు రేఁగుదెంచి
తనుఁజూచి మది విన్నఁదనముఁ గైకొన్న, ఘనుని రాఘవుఁ జూచి కడుఁజిన్నవోయి
మదియేమి యిట్లు నాహృదయేశ నీదు, వదనాంబుజము కడు వాడుపాఱినది
గట్టిగాఁ బుష్యయోగము దప్పకుండఁ, బట్టంబుగట్టెనే పార్థివేశ్వరుఁడు
సోమమండలముతో జోడగు గొడుగు, నీమోముఁదమ్మికి నీడుగా దేల
చామరద్వయము పార్శ్వంబులఁ దనరి, యేమొకో మనపట్టపేనుంగు రాదు
శ్రీరామ నీమౌళి నేసఁబ్రాలెవ్వి, పౌరులు నినుఁ గొల్చి బలసిరా రేల
దుందుభిపటహాది తూర్యఘోషములు, వందిమాగధులకైవారంబు లెవ్వి

యభిషేకదినము నేఁ డధిప నీయందు, శుభరాజచిహ్నముల్ చూడంగ లేవు
సౌమిత్రిమోమునఁ జాల దుల్లాస, మేమిచందంబొ నాకు నెఱిఁగింపు డిప్పు
డని పల్కు సీత ముగ్ధాలాపములకు, మనమునఁ గుంది యామానినిఁ జూచి
మునులకు నృపచిహ్నములకొండ వేల, వినుమది యెట్లన్న వివరింతు నీకు
గైక మాతండ్రి సత్కారించి తొల్లి, గైకొన్న వరములు కాంక్షించి నేఁడు
కొడుకుఁ బట్టముఁగట్టుకొని రాజ్య మేల, నడవుల నన్నుండ నడిగెఁ గావునను
ధరణిఁ బాలింప నాతమ్ముని భరతుఁ, గరమొప్ప పట్టంబుఁ గట్టిన ననియుఁ
బనివడి యడవులఁ బదునాలుగేండ్లు, జనకుశాసన మేను జరపంగ వలసెఁ
దల్లిదండ్రులమాట తప్పక సేయు, బల్లిదునకును సంపదయును గీర్తి
నాకలోకాది నానావిధపుణ్య, లోకంబు లరచేతిలో నుండు గాదె

**సీతతో రాజ్యాభిషేకభంగ మెఱిఁగించుట**

కావునఁ బతియాజ్ఞ కానల సలిపి, యేనచ్చునందాఁక నిందీవరాక్షి
గురువులు వగలచేఁ గుందకయుండఁ, బరిచర్యలొనరించి భక్తితోఁ గొలువు
చిత్తంబులోన నా సేమంబు గోరు, ముత్తమశీలవై యుచితధర్మములు
వనిత యమ్మలమ్రోల వర్తింపు మనిన, జనకజ యారామచంద్రునిఁ జూచి
కదలినమతి భీతి గాలిచేఁ గదలు, కదళిచందంబున గడగడ వణఁకి
బెదరి డగ్గుత్తికఁ బెట్టి పెన్వగలఁ, జెదరి యంతంతకుఁ జెలువేది పలికె
ఇదియె నిశ్చయమైన నేను మీవెంట, వదలక పయనమై వత్తు నిక్షణమే
నినుఁ బాసి యే నిల్వనేరఁ బ్రాణములు, ననుఁబట్టనేరవు నాప్రాణనాథ
యడవుల కేనును నర్థితో వత్తుఁ, దోడుకపొమ్మనఁ దూలి రాఘవుఁడు
కమలాక్షి యడవులఁ గందమూలములు, నమలి రానేలల నడచుచు నీవు
నారచీరలు గట్టి నడచుచు వగలఁ, గూరుచుఁ బేరెండకును గాలికోర్చి
నేలలఁ బవళించి నిచ్చలు పర్ణ, శాలలలో నుండఁజాలుదే యకట
కోమలదేహవు గోలవు బేల, వేమియు నేపాటు నెఱుఁగవు నీవు
తలఁప నక్కజమైన దంతులు పులులు, నెలుఁగులు తోఁడేళ్లు నిట్టులు కరులు
పాములు గాములు పైఁబ్రాకు నెట్టి, చీమలు గిరిగుహాసీమల దరుల
ఝరులనిమ్నుల లతాశ్చర్యమార్గముల, విరసకంటకలతావృతమార్గములఁ
దలఁప నక్కజమైన దారుణాటవుల, మెలఁగుట యక్కటా మేదినీతనయ
కావునఁ గౌసల్యకడనుండు మీవు, సేవింపు మాసాధ్వి చిత్తంబు వడసి
గృహదేవతలఁ గొల్వు కీర్తింపు నన్ను, నహరహంబును మామయడుగుల కెఱఁగు
భరతుండు నిను మాతృభావంబు గొలుచుఁ, బరుసంబు లాతనిఁ బలుకకు మబల
యిదె పోయి పదునాలుగేండ్లు నిండించి, ముదమొప్పఁ జను దెంతు ముగుద చింతిం
మనవుడుఁ బ్రణయశోకార్తయై రాముఁ, గనుఁగొని సీత నిక్కము విన్నవించె
పతులు గావించిన భాగ్యంబులైన, సతులను రక్షించు సమ్మదం బెసఁగ
నాపాలివిభుఁ డన్న నాదైవ మన్న, నాపుణ్యగతి యన్న నరనాథ నీవె

ఘనతపస్స్వర్గభోగము లనేకంబు, లనుభవించుటకంటె నతిభక్తితోడ
నిచ్చలు మనమార నీపదాంబుజము, లచ్చుగాఁ గొలుచుట యది నాకు సుఖము
నృపవర్య నీవున్న నిష్ఠురాటవుల, యుపవనంబులు నాకు నూహించి చూడ
జగతీశ విను విష్ణుసముఁడవౌ నీవు, జగదేకవిక్రమశాలివై పరఁగఁ
గరమొప్పు నీరక్ష గలిగిన నన్ను, సురరాజు తలయెత్తి చూడంగ వెఱచు
నారచీరలు గట్టి నడచి నీతోడ, నారంగఁ జనుదెంతు నట నీవుచూప
నమరంగఁ జూచెద నద్రులు నదులు, కమలాకరంబులు కడువేడ్కతోడ
పాయ నిన్నెందును బరఁగ నూఱైన, వేయైనఁ గానిమ్ము విపినంబులందు
నన్నుఁ దోడ్కొనిపొమ్ము నరనాథ యనిన, నన్నాతిఁ గనుఁగొని యతఁ డిట్లులనియె
అనిశంబు నతిదురంతాయాసమైన, వనవాస మేటికి వనజాక్షి నీకు
నీయందుఁ జిత్తంబు నిలిపి నిన్నునిచి, పోయి కావించెద భూపాలు పనుపు
వన్యమేడ నీ వేడ వనిత నిన్నేడఁ, గొనిపోయి దుర్గముల్ కుటిలమార్గముల
నారామవనకేళి కష్టంబుగాని, ఘోరాటవులయందుఁ గ్రుమ్మరఁ దగునె
వెల్లు క్రూరవృకాళి పృథుపుండరీక, భల్లూకసింహాది బహుమృగావళులు
ఘూకకాకానేకఘోరహుంకార, కాకోలఝిల్లికాకర్కశధ్వనులు
మానక వర్తించు మఱి భయంబొదవ, నీనీడతళుకు నీ వెందున వలదు
నావుడు విని సీత నరనాథుఁ జూచి, నీ వుండఁగా నాకు నిర్భయం బధిప
వనభూమిఁ దిరుగుదు వరుసతోఁ గూడ, నని నాకుఁ జెప్పినా రావేదవిదులు
కాన నీవిధమునఁ గాంతారమునకు, భానుకులేశ నీపాదముల్ గొలిచి
వచ్చెద నన్ను రావల దనవలదు, వచ్చిన మదిని నాభక్తియుఁ జూడు
మని పాదములఁ బట్టి యడలంగ వగచి, యనుమతింపమిఁ జూచి యతిదీన యగుచు
యెఱిఁగి నేఁ జేసితినే మున్ను తప్పు, మఱచి చేసితినేని మన్నింపు నన్ను
పటుశిలాకంటకప్రచురదేశములు, నట నిన్నుఁ గొలిచిరా నలతయు లేదు
కరుణమై నీవిచ్చుకందమూలములు, నరుదార నమృతంబులవియును నాకు
భావించి చూచినఁ బ్రాణబంధుఁడవు, నీవె కావున వత్తు నీతోడఁ బ్రీతి
జనకుఁడు చింతింప జనని చింతింప, చనునిష్టులగు బంధుజనుల చింతింప
జననాథ సహధర్మచారిణియందు, జనకునిచేఁ నగ్నిసాక్షిఁ గైకొంటి
జనలోకనుతుఁడవు సత్యసంధుఁడవు, నను డించి నీకుఁ గానల కేఁగఁ దగునె
యెన్నిదుఃఖములైన నెన్నికఁగాదు, అన్నియు సౌఖ్యంబులగును నీదయను
ఈవాడ లీమేడ లీబంధుబృంద, మీవస్తుసంపద లీ జీవనంబు
నీవు లేకున్నచో నిస్సారములగుఁ, గావున నిచట నేకరణి వేఁగింతు
సావిత్రి యనుపుణ్యసతి తనపతిని, సేవించినట్టి యా చెలువున నేను
నీవెంటఁ జనుదెంతు నీనీడఁబోలె, నావంటిసాధ్వికి నదియె ధర్మంబు
నినుఁ బాసి యిచ్చట నిమిషమేనోర్వ, వనముల నినుఁ గూడి వర్తింపనేర్తుఁ
బదునాలుగేం డ్లేల పాసెద నిన్నుఁ, గడిసి వెయ్యేండ్లైనఁ గడువేడ్కఁ గొలుతు

సతులకుఁ బతులకు జను లెంచఁదగిన, మతము ప్రతిష్ఠింపు మఱి వేయునేల
నీవరణ్యములకు నిట నన్ను విడిచి, పోవుట నిజమైనఁ బోవుఁ బ్రాణములు
నలుకమైఁ గాదేని యగ్నిచే నైన, జలముచే నైన విషంబుచే నైన
నేచినపగలతో నిటఁ జత్తు నేను, నాచూపు డించిపో నను దించిపోకు
మని ప్రలాపించుచు నడుగులమీఁద, జనకజ బడియున్న చందంబు చూచి
కరుణతో నల్లనఁ గరపల్లవముల, ధరణీశతనయుఁ డాతనుమధ్య నెత్తి

**సీత వచ్చుటకు శ్రీరాములు సమ్మతించుట**

యలివేణి నినుఁబాసి యావనంబులను, నలువంద విహరింప నాకిచ్చ లేదు
నినుఁ దోడుకొనిపోదు నీవు నావెంటఁ, జను దేరఁ గుశలంబు సకలంబునాకు
నిమ్ముల నీచిత్త మెఱుఁగంగఁ దలఁచి, యిమ్మాట లాడితి నే తెంతుఁ గాని
యనుచు నారఘురాముఁ డతికృపామూర్తి, జనకజరాకకు సమ్మతించుటయు
వలయుదానంబులు వరుసఁ గావింపు, నెలఁత నీ ననవుడు నెమ్మనం బలరఁ
గాంచనరత్నాదికంబు లైనట్టి, యంచితదానంబు లమ్మహీతనయ
వరుసఁ బ్రియంబగువారలకెల్లఁ, గరమర్థి నందందఁ గావించె నంత
ధరణీశుఁడును సుమిత్రాపుత్త్రుఁ జూచి, చేర రమ్మని రామచంద్రుఁ డిట్లనియె
నాతోడ నీవు కానకు వచ్చెదేని, నాతోడ నినుఁ బాసి నానావిధముల
మిడుకు కౌసల్యసుమిత్రల నెవ్వ, రుడుకార్చి పోషింతు రొప్పెడుభక్తి
మనమిద్దఱమునుఁ జన్న మనతండ్రి భక్తి, ననుదినంబును నెవ్వ రరయువా రిచట
మొదలనే సవతిపై మ్రొగ్గుఁ గైకేయి, మదిలోన నీరాజ్యమద మింక నొదవుఁ
బేర్మిచూపుచు దుఃఖపెట్టునో కైక, ధర్మంబు తలపోసి తగ వేల నడుపు
నటుఁగాన నే వచ్చునందాఁక నీవు, నిటనుండఁ దగునన్న నెంతయుఁ గనలి
యావేళ లక్ష్మణుఁ డన్ననిశ్చయము, భావించి తనపాణిపద్మముల్ మొగిచి
యప్పుడు నన్నురా నానతియిచ్చి, యిప్పుడు వలదను టేమికారణము
కౌసల్యకృప రక్ష గాక నారక్ష, యాసుమిత్రకు నేటి కాతేజ మరయఁ
బదివేవురకు నున్కిపట్టు నీవెలుఁగు, నిది యేల చింతింప నిట రామచంద్ర
భరతుండు నీదెస భయమునఁ జేసి, తిరముగాఁ గౌసల్యదేవికి భక్తిఁ
గరము సుమిత్రకుఁ గావించు నటుల, నిరవొందనటుఁగాన నేనిందు నిలువ
బాణబాణాసనపాణినై వెనుకఁ, దూణీరములుఁ బూని దుర్గమాటవులఁ
బొందుఁగా మిమ్ము నిమ్ములఁ గొల్వవలయుఁ, గందమూలాదులు కడఁకఁ దేవలయు
నటఁ దృణపర్ణాదు లరసి మీరుండు, కుటజము పజ్జగాఁ గూర్పంగవలయుఁ
బదునాలుగేండ్లును బగలును రేయి, నిదురవోవక సేవ నెఱి సేయవలయు
వచ్చెద నే నన్న వసుధేశుఁ డతని, నిచ్చమైఁ గైకొని యింపుదళ్కొత్త
వలయుబంధులనెల్ల వరుస వీడ్కొనుచు, వలనొప్పఁగా మున్ను వరుణదేవుండు
మనతండ్రి కిచ్చిన మహితచాపమును, ఘనశరశ్రేణులు గలకవదొనలు
పరమభేద్యంబగు కవచంబు పసిఁడి, పరుజులఁ జెన్నొందు పటుకృపాణములు

కొనిరమ్ము నా నేగి కొమరార బంధు,జనుల వీడ్కొని శస్త్రశాలకు నరిగి [జూచి
యాయుధంబులు గొంచు నరుగుదెంచుటయు, నాయతాత్ముఁడు రాముఁ డనుజన్ముఁ
తమ్ముఁడ వినుమెల్లధనముల నేను, నెమ్మి నిచ్చెద ధరణీసురవరుల
మహితపురస్థుల మనకింపులైన, సహజభృత్యుల నర్థిజనుల రావింపు
మావేళ నర్హుండు నఖిలజ్ఞుఁడైనఁ యావసిష్ఠునిపుత్త్రుఁ డయినసుయజ్ఞు
మొదలైనపుత్త్రుల ముదము చిత్తమునఁ, బొదలంగ నతిభక్తిఁ బూజింపవలయు
మఱియుఁ దక్కినవారి మన్నింత మెల్ల, తెఱఁగుల నక్కఱ తీఱ నర్థులకు
ననవుడు లక్ష్మణుం డౌఁగాక యనుచు, మునిపుత్త్రునింటికి ముదముతో నరిగి
రామువాక్యముఁ జెప్పి రమ్మన్న నతఁడు, నేమంబు లన్నియు నిష్ఠతోఁ దీర్చి
సౌమిత్త్రిసహితుఁడై చనుదేరఁ గాంచి, రాముఁడు వినయాభిరాముఁడై తాను
నెలమిమై సీతతో నెదురుగా వచ్చి, యలఘుతేజోమూర్తి యైనమునీంద్రుఁ
గొనివచ్చి గద్దియ కొమరార నునిచి, వినుచార్ఘ్యపాద్యముల్ వేడ్కతో నిచ్చి
హారకుండలవలయాంగదకటక, చారుకోటీరాది సకలభూషణము
మాతులుం డొసఁగిన మదగజేంద్రంబు, ఖ్యాతి శత్రుంజయాఖ్యము మొదలైన
కరిసహస్రంబును కమనీయరత్న, సురుచిరదివ్య వస్తువులెల్ల నొసఁగి
బహుభూషణము లిచ్చి పయిపయితోన, మహనీయరత్నముల్ మానుగా నిచ్చి
పసిఁడి యేర్పడఁబుచ్చి పదికోటులొసఁగి, యసమానవస్తువు లన్నియు నొసఁగి
యిచ్చినఁ గైకొని హృదయంబులోన, నచ్చెరువడరంగ నధికమోదమున
నారాజమిథునంబు నతఁడు దీవించె, నారంగ రఘురాముఁ డప్పుడు మఱియు
నెడపక భండార మెల్లఁ దెప్పించి, తోడరి దీనులకు నర్థులకుఁ బేదలకు
చెలిమి నగస్త్య కౌశికు లనువారి, కిల రత్నరాసు లనేకంబు లొసఁగి
మొగి వసిష్ఠాదిసన్మునిజనంబులకుఁ, దగుతపస్వులకు నర్థము లొప్ప నిచ్చి
వందిమాగధులకు వరదానశక్తు, లెందును బొగడంగ నిలుచూర నిచ్చి
పేదసాదలకును బృథ్వీదేవతల, కాదట బంధుమిత్రాశ్రితావళికిఁ
న్నుగా నిబ్బంగి బహుదానతతులు, సన్నుతమతినిచ్చి సౌమిత్త్రిఁ జూచి
వును దానంబు నెమ్మిఁ గావింపు, నావుడు నారాజనందనుం డలరి
ఘటజన్ముఁ గౌశికు గార్గ్య శాండిల్య, నటకు రప్పించి పెక్కర్థంబు లిచ్చి
వీరువా రన కెల్లవిధములవారు, నారంగ నెవ్వారె మడిగిన నిచ్చె
ధరణీశుఁ డాతనిఁ దనబుద్ధి యలరఁ, గరమొప్ప నతిమహాకల్యాణి యైన
యాయరుంధతికి సుయజ్ఞునిసతికి, నాయతం బగుభక్తి నప్పుడు సీత
తనభూషణము లిచ్చి తనయర్థ మిచ్చి, తనయింటఁగల వస్తుతతులెల్ల నిచ్చె
నప్పు డరుంధతి యకట యిత్త్వరకు, లిప్పాటు పడుచుంట నిటు చూడఁదగునె

## శ్రీరాములు త్రిజటాఖ్యునకు గోవుల నిచ్చుట

యని భర్త నడుగంగ నమ్మహామౌని, తనబుద్ధి నెంతయుఁ దలపోసి చూచి
యేరూపమునఁ బోవ దిది దైవయోగ, మూరకుండుము చూచుచుండుద మనిరి

ఆవేళఁ ద్రిజటాఖ్యుఁ డనువిప్రుఁ డడరి, జీవనస్థితికినై చేను దున్నుచును
ఘోరంపులేమిచేఁ గుందుటఁ జేసి, పేరాసఁ దత్పత్ని బిడ్డలఁ గొంచు
నతిసంభ్రమంబున నచ్చోటి కరిగి, తతిగొనఁ బనిసేయు తత్పుత్రుఁ జూచి
యేల యీనాఁగేలు హానయంబు విప్ర, నేల యీగుద్దలి యింటఁ బాఱవైచి
రమ్ము చెప్పెద నేఁడు రామచంద్రుండు, సమ్మదంబున నర్థిజనులకు నెల్ల
ద్రవ్యతండంబులు దయతోడ ధనము, నెవ్వఁ రేమడిగిన నిచ్చుచున్నాఁడు
నీకుటుంబము చెప్పి నీపేరు చెప్పి, కాకుత్స్థపతిచేతఁ గామితార్థంబు
వేవేగఁ జని నీవు వేఁడు కొమ్మనిన, నావిప్రుఁ డూహాలు నందంద నిగుడఁ
జనుదెంచి యారామచంద్రు నీక్షించి, తనరంగ దీవించి తా నిట్టు లనియె
పేదవాఁడను సుతుల్ పెక్కండ్రు గలరు, లేదు ద్రవ్యంబును లేశమాత్రమును
నను నీవు రక్షింప నరనాథ వలయు, ననిన నారఘురాముఁ డావిప్రుఁ జూచి
యావులమందలయం దున్న విప్రుడు, నీవు నీచేముష్టి నిజశక్తి మెఱసి
యెందాఁక వేసితి వీగోనిపశుల, నుంద నీకె యటన్న మది సంతసిల్లి
యఱచి దోవతి మొల నంట బిగించి, కుఱుచైన శిఖ ముడి గొని యాడుఁ గఱచి
నరములఁ బ్రాణముల్ నలినంటఁబట్టి, కరమునఁ బాషాణకలితుఁడై యపుడు
శ్రీరమాధవు నెంచి శ్రీరాము నెంచి, బిరబిర తనముష్టిఁ బెట్టుగాఁ ద్రిప్పి
యురమున జందెము నుబ్బి తలూఁగ, సరయూపుదాఁక విచ్చలవిడి నేసె
బ్రతుకుజీవన మని బ్రాహ్మణుం డట్టి, మొదవులఁ గొన్న రాముఁడు సోద్యమంది
మఱి వేయుఁగోవుల మహితవస్త్రముల, నఱలేక యిచ్చెద నడుగుమీ యనిన
జన్నంబునకు నీవు చాలినయర్థ, మెన్ననెక్కుడుగాను నిమ్మంచు నడుగఁ
దనియంగ నిచ్చినఁ దద్దయు నలరి, తనపత్నితోఁ గూడ ధనములు గొనుచు
సంతోషమున నటఁ జనెఁ ద్రిజటుండు, నంతట రఘురాముఁ డనురాగ మెసఁగఁ
గృతకృత్యుఁడై వచ్చి గృహదేవతలకుఁ, జతురుఁడై మునులకు సద్భక్తి మ్రొక్కి
యీరీతి రఘురాముఁ డెల్లవస్తువులు, కోరినవారికిఁ గోరిన ట్లొసఁగి
మును జనకునియజ్ఞమున వరుణుండు, తనకొసంగిన తనుత్రాణకోదండ
ఘనతరతూణీరఖడ్గాయుధములు, తనకులగురునింట దాఁచుటఁ జేసి
యనుజుచేఁ దెప్పించి యవి ధరియించి, జనకజాలక్ష్మణసహితుఁడై వెడలి
రాజు నొద్దకు వేగ రాజచిహ్నంబు, లోజఁ గానక పౌరు లుల్లంబు లలర
రాజవీథులనుండి రచ్చలనుండి, రాజితోన్నతసౌధరాజిపైనుండి
పుట్టినశోకాగ్ని పొగులుచుఁ గొంద, ఱట్టిదుర్దశ కర్హుఁడే రాముఁ డనుచు
నెందు రాముఁడు వోయె నింక నందఱము, నందె పోదముగాక యని కొంద ఱరుగ
గొందఱు రాజన్యకుంజరు వెనుక, మందిరంబులు డించి మనమెల్లఁ జనఁగ
నేపార సొంపెల్ల నెడలి పాడైన, యీపట్టణము కైక నేలని మ్మనుచుఁ
బరికించి కొందఱు ప్రజ లీపురంబు, పోరిపోరి నెలుఁగులు పులులు సింగములు
నక్కలు వఱళులు నలి పిశాచములు, పెక్కుభూతంబులు ప్రేతసంఘములు

పాయనియడవిలోఁ బతిరాముఁడున్న, యాయరణ్యము పురంబగునంచుఁ బలుక
క్రందయ్యె బహువిధాక్రందనరవము, నందంద వినిపింప సుధీధైర్యమున

శ్రీరాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై దశ[illegible] వచ్చుట

జగతీశునగరికి జనుదెంచి మఱియు, దగ సుమంత్రుఁడుఁ గాంచి ధరణీశసుతుఁడు
వినిపింపు మారాజవిభునితో ననినఁ, జని శోకమునఁ జాల సంతాపమందు
రాజేంద్రుఁ గనుఁగొని రామలక్ష్మణులు, పూజితచరితయౌ భూతనూభవయు
వచ్చినారని చెప్పఁబడి మూర్ఛవోయి, చెచ్చెఱఁ దెలివొంది చెందినవగల
నల్లన గద్దియ నాసీనుఁ డగుచు, నుల్లంబులో ధైర్య మొక్కింత నిలిపి
సత్తురుగాక నావనితలు నింక, వత్తురుగాక సీతకపుత్రుఁ జూడ
ననుచు డగ్గుత్తిక నల్లనఁ బలుక, వీని యాసుమంత్రుండు వినయంబుతోడ
నంతఃపురంబుల కరిగి యారాజు, నింతుల మున్నాటయేఁ బంపఁ దెచ్చె
మఱి పోయి యారాము మహనీయతేజు, తెఱఁగొప్పఁ దోడ్కొనితేర నీక్షించి
యాలింగనముసేయ నర్థితో లేచి, యాలోన రాలేక యవనిపైఁ బడియె
నంత నాశ్రీరాముఁ డారాజుఁ బట్టి, యెంతయుఁ బ్రేమచే నెసఁగంగఁ దిగిచి
తొడలపై నిడికొని దుఃఖింపఁ గొంత,వడికి చైతన్యంబు వచ్చి కూర్చుండి
తనుఁ జూచుచున్నయాతండ్రి నీక్షించి, జననుతుం డగు రామచంద్రుండు పలికె
ననఘాత్మ నీదుసత్యము నిల్ప నేను, వనభూములకుఁ బోవువాఁడ నా తెఱఁగి
యీసాధ్వి జనకమహీపాలతనయ, యీసుమిత్రాపుత్రు లిద్దఱు మిగుల
వలదని యేనెంత వారింప వినక, నలరి తామును రాఁగ నైయున్నవారు
గాన వీరలు నేను గానల కేఁగ, నానతి మ్మనుటయు నానరేశ్వరుఁడు
మదిదూలి కైకేయిమాటకు నిన్ను, నదయతఁ బొమ్మంటి నకట కానలకుఁ
జేకొని నామాట సేయంగ నేల, నీకెట్లు నందన నీవు నీయంతఁ
జెన్నొంద రాజ్యంబు సేయుదు గాక, యన్న నామాటకు హస్తముల్ మొగిచి
తలపోయ గురుఁడవు ధారణీపతివి, ఎలమిమై రక్షింప నిలబాంధవుఁడవు
నటుగాన నీవాక్య మర్థితోఁ జేయ, నిట నాకు నానతి యిచ్చి నన్నంపు
సత్యసంధుఁడవైన జనలోకనాథ, నిత్యంబుగా నేలు నిఖిలలోకములు
ననిన దీర్ఘాయువు నత్యంతశుభము, వినుతయశంబును విమలవిక్రమము
నకళంకధర్మంబు నమరంగఁ బొందు, మొకబాధయును లేక యుండుము పుత్ర
యారంగ నన్నును నరయ మీతల్లి, నీరాత్రి చూచి నీవెల్లి పొమ్మనిన
నేఁడేమి యెల్లేమి నిలువంగఁ దగదు, నేఁడు పోయెదమన్న నెమ్మి వీడ్కొలుపు
నరనాథ నాయాగి నాతమ్ముఁడైన, భరతుండు వసుమతిఁ బాలింపనిమ్ము
నగపు నీవిధి మీకు వలదన్న రాము, తెగువకు దశరథాధిపుఁడు శోకించి
ఏవంటిసత్పుత్త్రు నిష్ఠురాటవుల, కీవెంటఁ బొమ్మన నెట్లు నోరాడు
కైకేయిమాటలఁ గడు మోసపోతిఁ, గా కటకట యని కరుణఁ దానేడ్వ
నంతఃపురాంగన లందఱునడల; నంతఁ గౌసల్యయు నాసుమిత్త్రయును

వంతలవ్రాలుచు వగలఁ దూలుచును, వింతగా భువిఁ జేరి విలపించుచుండ
నపుడు సుమంత్రుఁ డయ్యవనిపాలయేశు, నృపుశోకమును జూచి నిట్టూర్పుఁబుచ్చి
ఘనతరశోకసంకలితుఁడై కైకఁ, గనుఁగొని పలికె నుగ్రాటోపుఁ డగుచు
నీయత్నమునఁ గదా నృపునకు మాకు, నీయవస్థలు వచ్చె నేమనఁగలను
పతిహితం బేమియుఁ బరికింపవెట్టి, సతివైతి వకట రాకాసివి నీవరయ
నీతల్లియట్లనే నీవు ప్రాణేశ, ఘాతివయ్యెదె గొట్టగతియున్న వినుము
సకలభాషలు నీదుజనకుఁ డెఱుంగు, నొకనాఁడు మీతల్లియును దాను శయ్య
నొప్పుగా శయనించి యొకకీటవార్త, యెఱిఁగి యాతఁడు నవ్వ నెద సంశయించి
యిది యేల నవ్వితి వెఱిఁగింపు మనిన, నది చెప్పినను బ్రాణహానియా నిపుడు
ననవుడు నీప్రాణహాని కేవెఱవ, వినుపింపు మనిన వివేకించు నతని
నదియె తప్పని వెళ్లనడఁచె మీతల్లి, యదిగాన నాచండి కాత్మజవైన
నీకేల కలుగు మానితపతిహితము, ఓ కైక యనిన నాఁడువిద యొంతయును
దలవాంచి కొండొకతడవు చింతించి, పలికె నాదశరథపతిఁ జూచి యపుడు
మున్ను మీకులమున ముఖ్యుఁడై సగరుఁ, డున్నతకీర్తియై యుర్వి నేలుచును
నసమంజసుం డను నగ్రనందనుని, గొసరక పురి వెళ్లఁగొట్టఁగా లేదె
రామచంద్రుని నీపరణ్యభూములకుఁ, దామసింపక పంపఁ దప్పేమి దీన
నన విని దశరథుం డధికశోకాబ్ధి, మునిఁగి ప్రత్యుత్తరంబున కోపకున్న
నపుడు సిద్ధార్థకుం డనుమంత్రివరుఁడు, కపటాత్మురాలైన కైక కిట్లనియె
అసమంజసుండు దర్పాతిరేకమున, నెసఁగ పట్టణములో నెల్లబాలురను
సరి పట్టి కట్టి యాసరయువులోనఁ, బరువడి వైవంగఁ బౌరులందఱును
సగరునితోఁ జెప్ప జనహితంబునకుఁ, దగవు చింతించి యాతనయుఁ బోనడఁచె
నీరామునం దొక్కయొగ్గైనఁ గలదె, చారువర్తనగుణసౌజన్యుఁ డితఁడు
నావుడు సత్యంబు నాతోడఁ బలికెఁ, గావునఁ దండ్రివాక్యము సేసె సుకృతి
యగుఁగాక రఘురాముఁ డనవుడు కైక, తెగువకు దశరథాధిపుఁడు శోకించి
చాల సంతాపించి జడిగొన్న వగలఁ, దూలుచు నాసుమంత్రునిఁ జూచి పలికె
ధనముల మణుల గోధనముల బంధు,జనముల నవరోధజనముల హితుల
విజయచిహ్నంబుల విలసిల్లుచున్న, గజముల రథముల ఘనతురంగముల
నిజముగా వేటకు నేర్పుధీవరులఁ, బ్రజల మంత్రుల రామభద్రుని వెనుక
వెడలింపు మీరిత్తపీడు కైకేయి, కొడుకుఁబట్టము గట్టుకొని యేలుఁగాక
యని యిట్లు దశరథుం డాడువాక్యములు, విని కైక కోపించి విభుఁ జూచి పలికె
రాజపుంగవ నీవు రామచంద్రునకు, రాజిల్లు నీసర్వరాజ్యసంపదలు
నిచ్చి పాడైయున్న యీపురం బేల, యిచ్చెదు భరతున కీపల్కులేల
సౌమిత్రియును దాను జనకనందనయు, రాముఁడు నారచీరలుగట్టి ప్రీతి
నేను జూచుచు నుండ నెల్లభోగములు, మాని దుర్గములఁ గ్రుమ్మరఁ బోవకున్నఁ
బోఁగదు నీయీవి బొంకు నీపలుకు, వసుధేశ నీవిచ్చువరము నేనొల్లఁ

దప్పితి వీవన్న దశరథాధీశుఁ, డప్పుడు మూర్ఛిల్లి యవనిపైఁ ద్రెళ్ళి
ధరణిపై నట్లున్న తండ్రినిఁ జూచి, పరితాప మందుచుఁ బలికె రాఘవుఁడు
ఏలమ్మ కైకేయి యిట్లు ... , తూలఁబోఁ బలుమాఱు దూఱనాడెదవు
గురుఁడును రాజు నామూరిమితండ్రి, పరమదైవం బిట్టిపతి నన్నుఁ బనుప
విషమైన మ్రింగుదు విపులాగ్ని నైన, విషధినైనను జొత్తు వేడ్కతో నేను
వనమున మునులతో వర్తింపుచున్న, ననుమతించుట నాకు నదియెంత పెద్ద
యన విని దశరథుఁ డావాక్యములకు, మనమునఁ గడుదూలి మఱి కైకఁ జూచి
విను మేను రాజ్యంబు విడిచి యీరాము, వెనుకఁ బోయెదను సీవిభవంబుతోడ
భరతు నయోధ్యకు బట్టంబుగట్టి, ధరణి యేలుదుగాక తగ వేల యనఁగ
నామాటలకు రాముఁ డధిపుతో ననియె, భూమీశ నిర్జనభూమిర్యై పరఁగు
నవ్వనంబును నాకు నర్హమైయుండు, నెవ్వరు నాతోడ నేటి కేతేర
నారచీరలు దెచ్చి నా కిందు దాని, నారంగ ధరించి యడవులలోనఁ
బదునాలుగేండ్లును బరఁగ నీయాజ్ఞ, వదలక వర్తించువాఁడను నేను
దే నారచీరలు దేవి నాకనిన, నానాతి నిర్లజ్జయై తానె యపుడు
ముదమంది మదిలోన మొగమోటలేక, మది చలింపక ... 
నారచీరలు దెచ్చి నరనాథపుత్త్ర, గారవంబున నీవు కట్టుకొమ్మనుచుఁ
బేరెలుంగున బల్కఁ బ్రియముతో రాముఁ, డా రాజసభయును నా రాజు నడల
నాతల్లిచే నున్న యవి పుచ్చుకొనుచు, ఖ్యాతిగా మున్నున్న పటములు విడిచి
నారచీరలు గట్టె నయముతో నపుడు, నారంగ ధరియించె నాలక్ష్మణుండు
సీతకు నానారచీరలు రెండు, చేతనిచ్చినఁ గొని చిత్తంబులోనఁ
గలఁగి రామునిఁ జూచి కాంతారవాసు, లెలమిమై నీచీర లెట్టుఁ గట్టుదురో
మునులంచు నొక్కటి మూపుపై వైచి, తనరారనొక్కటి తనకేలఁ దాల్చిఁ
కట్టనేరక మదిఁ గలఁగ నా రాముఁ, డట్టిచందంబుఁ గాంచి యాపువ్వుఁబోణి
ఘననితంబమునఁ బొంకముమీఱఁ గట్టఁ, గని రాజసుతులు రాఘవుని వీక్షించి
నారచీరలు గట్టి నరనాథపుత్త్ర, ... త్రి నీసీత నెట్లు
దారుణగతి నిట్లు తాపసిఁ బోలి, ఘోరాటవికి నీవు కొనిపోవఁ దగునె

## వసిష్ఠుఁడు కైకతో కఠినోక్తు లాడుట

మామాట మన్నించి మాయొద్ద నునిచి, సౌమిత్రియును నీవుఁ జనుఁడు కానలకు
ననఁగ వసిష్ఠుండు నలుకతోఁ గైకఁ, గనుఁగొని కులనాశకారిణి వీవు
భూపాలకుని మోసపుచ్చితి కాన, నీపాప మరయంగ నెందును గలదె
రాజపత్నులయొద్ద రఘురామునాజ్ఞ, నీజనకజ నుండని మ్మట్టుకాఁగ
వల దననేల యీావై దేహి చనఁగఁ, గలయఁ బౌరులతోడఁ గాననంబులకు
నేమును జనువార మింతియేకాదు, రామచంద్రునిఁగొల్వ రమణీయలీల
భరతశత్రుఘ్నులు బలసి వచ్చెదరు, పరికింప నీవు నీపాడూఱ నుండు
పోవంగ రాముఁడు పుణ్యశీలుండు, లీల నున్నది యూఱు లేనిది పాడు

పతినిట్లు వంచించి పాపంబు దలఁచి, యతిలోభమున రాము నడవులకనిచి
భరతు నయోధ్యకుఁ బట్టంబుగట్టి, చిరలీల రాజ్యంబుసేయఁ జూచెదవు
పతియాజ్ఞ దప్పఁడు భరతుండు తండ్రి, ప్రతినిధి యగు రామభద్రునిఁ జూచు
నీమాట విని ధర్మనిష్ఠఁ బోవిడిచి, రాము నడంచి యీ రాజ్యంబుఁ గొన్నఁ
దలపోసి చూడఁగ దశరథేంద్రునకు, పాలుపాపపతేఁ తాఁ బుట్టినేమైన
నీతప్పు నీమీఁద నెఱపినమీఁద, మాతగాఁ దలఁచునే మదిలోన నిన్నుఁ
గరమర్థి రాముఁ డాకాన వర్తింప, భరతుఁ డీసామ్రాజ్యభారంబు సేయఁ బూను
నెఱుఁగవు భరతునిహృదయ మేమియును, మఱియుఁ దెఱఁగు విన్న ముందు నీమీఁద
నెవ్వరికైన నీకు నిష్ఠురంబు, నివ్వింట భరతున కియ్యకో లగునె
కావున నిది మేలుగా నెన్నవలదు, నీ వదియునుగాక నిష్ఠురవృత్తి
శ్రీరామునకు మఱి సీతకు నారచీర లిచ్చుటను నీచేతు లెట్లాడె
నారచీరలు మాని నవరత్నఖచిత, చారుభూషణములు సరసంబులైన
చీనాంబరములు చెలువారఁ బూని, జానకిఁ దనపరిచారికల్ గొలువఁ
జనుఁగాక యనుచు నాసంయమీశ్వరుఁడు, వినుతభూషాంబరపతతు లిచ్చుటయు
ననయంబు మదిలోన హర్షముప్పొంగఁ, గొని యవి ధరియించె గురునియానతిని
సీత యప్పుడు నారచీరలు మాని, యాతతశ్రీతితో నట్లున్నఁ జూచి
కైక నందఱు దిట్టఁగా రాజు వినుచు, నాకాంత దెసఁజూచి యలుకతోఁ బలికె
తక్కక పాపంబు తలఁచి రామునకు, నక్కటా వనవాస మడిగితి కాక
మేదినీసుతయు సౌమిత్రియు నార, లాదరంబునఁ గట్ట నడిగితే నన్ను
నీమానవతి సీత యింతకుఁ దగునె, యేమి చేసితి నీకు నీతెంపు సేయ
రాముని వినయాభిరాముఁ గాంతార, భూమికిఁ దపసిగా బొమ్మనుకంటె
మఱియొండుపాపంబు మదిలోనఁ గలదె, తఱుమఁజేసియు నేల తండారవైతి
పాపజాతికి నీకుఁ బతియైననాకుఁ, బాపంబు కడమగానె పరికింప ననఁగ
నామాట విని రాముఁ డధిపుతో ననియె, భూమీశ యనుఁ బాసి పొదలుశోకమున
మాతల్లి కౌసల్య మదిఁ గుందకుండ, ఖ్యాతిగాఁ గృప మీఱు పరఁగ రక్షింపుఁ
డనుచు నాదశరథుఁ డావాక్యములకుఁ, దనరారుశోకాగ్నిఁ దనచిత్త మెరియ
నెట్టిపాపము తొల్లి యేఁ జేసినాఁడఁ, బట్టి నాకనుభవింపకపోదు నేఁడు
తల్లులబిడ్డల దయమాలి పాప, నుల్లంబులోపల నోర్వంగఁ గలనె
కైక మాటకు నిన్నుఁ గాంతారభూమిఁ, బైకొని యదయతఁబడ నేగుమంటి
హాపుత్ర హారామ యనుచు మూర్ఛిల్లి, భూపాలుఁ డప్పుడు బోధింపఁ దెలిసి
వారక పదునాలుగువత్సరంబులకు, నారఁగఁ బరిపూర్ణ మగునట్లుగాఁగ
మెచ్చినతొడవులు మేలువస్త్రములు, నచ్చుగా జానకి కవనీవిభుండు
వలనొప్పఁగాఁ దెచ్చి వరుస నిప్పించె, వలువలు గట్టియావరణభూషణములు

### కౌసల్య సీతకు పతిధర్మము దెల్పుట

దనరంగ జానకి ధరియించె నంత, జనకజఁ జూచి కౌసల్య శోకించి

యడరంగ నితఁడు మహాచక్రవర్తి, కొడుకని మీతండ్రి కోరి నిన్నిచ్చెఁ
గడుకొని దైవయోగంబునఁ జేసి, కడపట మఱి యిట్టిగతియయ్యె నేఁడు
తాపసవృత్తిమైఁ దగిలి కానలకు, నీపతితోఁ గూడి నీ కేఁగవలసె
దీనికి వగవకు తివిరి రాఘవుఁడు, ఈనిఖిలోర్వియు నేలెడి మగుడి
పతి పేదవాఁడైనఁ బాయంగరాదు, సతులకు నిదియు విచారించి నడుపు
చేకొని పతిపంపుసేయుపత్నులకుఁ, గైకొను నుభయలోకములందు శుభము
ననఁగను గౌసల్య నాసీతఁ జూచి, వినుతంబుగాఁ బల్కె వినయంబుతోడ
అనుకూలనై పతి నతిభక్తిఁ గొలిచి, తనర వర్తించెద ధర్మమార్గమున
మానుగాఁ బతిలేనిమగువ చక్రంబు, లేని తేరును దంత్రి లేనివీణెయును
బోలెఁ బుత్రులుగలపుణ్యురాలైనఁ, జాలంగ కొఱగాక చను నట్లుగానఁ
బతికిఁ బ్రియంబును బ్రాణంబునైన, హితబుద్ధి వంచింపకిత్తు నే ననిన
నాదేవి వైదేహి నలరారఁ జూచి, భూదేవిపుత్త్రివై పుట్టిన నీవు
నీగుణంబులు తగు నెలమి లక్ష్మణుని, నీగుణోజ్జ్వలు రాముహితుని మన్నింపు
మనిన సీతాదేవి యాఁగాక యనుచుఁ, దనకు మ్రొక్కిన నెత్తి తగఁ గౌఁగిలించి
దీవించె నప్పుడు తెఱఁగొప్ప రాము, దేవునితోడ నాదేవి యిట్లనియెఁ
బృథులాటవులయందుఁ బృథివీశపుత్త్ర, మిథిలేంద్రసుతను సౌమిత్త్రి నేమరకు
మనిన మాయానతి నది వింటి జనని, పొనర నాదక్షిణభుజము లక్ష్మణుఁడు
నానీడ జానకి నాకునెబ్భంగి, మానసంబున వీరి మఱువంగ నగునె
యేను విల్లందిన నెందు నేభయము, గానేలవచ్చు ముక్కంటి పైఁబడిన
నదిగాన నీవింక నడలకు మాకు, వదలను ధర్మంబు వగవంగ నీకు
భూనాథునకుఁ గరాంబుజములు మొగిచి, తాను సీతయు సుమిత్త్రానందనుండు
అమ్మలు దీవింపుఁ డందఱు ననుచు, నిమ్ముల మున్నూటయేఁబండ్రులకును
సరి ప్రదక్షిణముగాఁ జనుదెంచి మనసు, లెరియంగ నాతల్లులెల్ల శోకింప
వినుచు సుమిత్త్రకు వినతులై రంత, కనుఁగొని యద్దేవి కౌఁగిటఁ జేర్చి
శ్రీరాము దీవించి సీత దీవించి, ధారణీపతిసేఁత తలపోసి వగచి
మెలపొంద నపుడు సుమిత్త్ర లక్ష్మణుని, బిలిచి యింపార గంభీరోక్తిఁ బలికె
రాముని దశరథరాజుగాఁ జూడు, భూమిజ నన్నుఁగాఁ బుద్ధిఁ జింతింపు
మడవి నయోధ్యగా నాత్మలోఁ దలఁపు, కడుభక్తియుక్తి రాఘవుఁ గొల్చియుండు
మాయతజయసిద్ధి నభివృద్ధిఁ బొందు, పోయిరమ్మని ప్రీతిఁ బుత్త్రు దీవించె
రామచంద్రునిఁ జూచి రఘువీర నీకు, నేమంబు దలఁచి నీచిత్తంబులోన
నరలేనిసఖుఁ డన్న ననుజన్ముఁ డన్న, నెరయ సీతఁడెకాక నిక్కువం బరయ
నటుగాన లక్ష్మణు నరసి రక్షింపు, మడవులలో నన్న నౌఁగాక యనుచు
రాముఁ డాదశరథరాజు నీక్షించి, యామహాత్ముతో నచలుఁడై పలికెఁ
బదునాలుగేండ్లును బ్రకటదుర్గములఁ, బదునాల్గుదినములపగిది వర్తించి
ధరణీశ వత్తు సంతాపింపవలదు, భరతుండు నాకంటె భక్తుండు మీకు

వతనిఁ బట్టముగట్టుఁ డాత్మఁ గైకేయి, కృతకంబులగు నింకఁ గింకిరిపడకు
మాతల్లి నీకు నెమ్మది సేవసేయు, నాతల్లి మీరును నరనాయకుండు ప్రియు
నని ప్రదక్షిణముగా నచుజుండుఁ బోను, జనకజయును గడుసద్భక్తి మ్రొక్కి
రప్పుడు రఘురాముఁ డడవికిఁ బూని, దప్పక వెడల నాదశరథాధిపుండు
మదిలోనఁ దలఁచి సుమంత్రునిఁ జూచి, యదె రాముఁ డడవుల కరుగుచున్నాఁడు
గొనిపొమ్ము రథమున్నఁ గువలయాధిపుని, వనుపునఁ గొనిపోయి భక్తితో మ్రొక్కి
రథమిదె పుత్తెంచె రాజు మీకర్థి, రథమెక్కి వేంచేయు రఘురామచంద్ర
యనవుడు దశరథునాజ్ఞకు వెఱచి, మును సీత నెక్కించి మొగి నాయుధములు
తనరు జోడును బెట్టి తాను లక్ష్మణుఁడు, ఘనస్యందన మెక్కి కదలె రాఘవుఁడు
అంతఁ బౌరులు వృద్ధు లాప్తులు మంత్రు, లింతులు పౌరులు హితులు నాశ్రితులు
నంత బ్రాహ్మణరాజవైశ్యశూద్రులును, నంతంత నలుఁగడ నడలుచు వెడలి
ముందట నిరుపార్శ్వములఁ బిఱుందటను, సందడించుచు మది జడిగొన్న నగల
నరనాథ పుత్రుఁ డెన్నఁడు గానరాఁడు, సుచిరస్థితి నేఁడు చూత మింపారఁ
జంద్రుతేజము నవ్వఁజాలు నీరామచంద్రు మోమును జూడఁ జనుదెంచువారు
కడఁగి యిక్ష్వాకులగౌరవంబెల్ల, నడఁచెనే మంథర యని తిట్టువారు
తగవేది రఘురాముఁ దపసిగాఁ జేయ, నగుణమ్మ కైకేయి కని దూఱువారు
బాలిమి దిగనాడి దశరథాధీశుఁ, డాలికి వెఱచునే యని రోయువారు
చనువెల్లఁ జేసి రామసౌమిత్రు లంత, ననదలై పోదురె యని వేఁగువారు
పనిగొని తమతండ్రి పనుపునఁ గాని, పొనుపడి యిల్లిల పోదురన్వారు
ఈపదునాలుగేం డ్లెట్లు వీరడవి, నాపద వేఁగింతు రని పొక్కువారు
ఈనోము నోచెనో యిమ్మహీపుత్రి, తానంచు మదిలోనఁ దలపోయువారు
నతిమృదుగాత్రి యీయతివ భూపుత్రి, పతిఁబాయలే దని ప్రణుతించువారు
ఈసుతుఁ బాయంగ నెట్లోర్చె నట్టి, కౌసల్య మది యెంత గట్టనువారు
ధర్మము పాడయ్యె ధరనిప్పుడనుచు, నర్మిలి రాముతో నరిగెడువారు
నై రామునరదంబు నందందఁ గదిసి, భూరిశోకాగ్నులఁ బొగలుచుఁ బోవ
నంతఁ గౌసల్యయు నాసుమిత్రయును, జింతాపరంపరఁ జిక్కి శోకించి
వారిశిరంబులు వలనొప్పనూఁది, వారిపై వ్రాలుచుఁ వగలఁ దూలుచును
గలయ నంతగపురకాంతలు దన్నుఁ, గొలిచిరా దశరథక్షోణిపాలకుఁడు
భూరిలోచనబాష్పపూరముల్ దొరఁగ, హారామ హారామ యని పలుమాఱు
నెలుగెత్తి యేడ్చుచు నేచినవగల, నలిఁ దూలి పొగులుచు నగరంబు వెడలె
అప్పుడు రవిదీప్తు లణఁగె నల్దెసల, నుప్పొంగెఁ దమము వహ్నులు మండవయ్యె
ధరణి బీటలువాఱెఁ దారలు రాలె, విలసించి గ్రహములు వినువీథిఁ బాఱె
నెలమిమై మదధార లింకె దంతులకుఁ, గలయ సర్వములకుఁ గన్నీరు దొరఁగె
నావులు చన్నియ్యవయ్యెఁ గ్రేపులకు, నావీడు కడుశూన్యమై తోఁచెఁ బ్రజకు
వారు వీరన కెల్లవారు నెల్లెడలఁ, బౌరులయేడ్పు లంబరమెల్ల నిండె

సురవరకామినీశోకారవములు, పొరి బొరి వినవచ్చెఁ బురజనంబులకు
నప్పుడు దశరథుఁ డారాముని రథము, చొప్పు బాష్పములచేఁ జూడఁ జొప్పడక
చంద్రబింబముతోడ సరియైన రాము, చంద్రుని మొగ మొకసారి చూచెదను

## దశరథుఁడు రథము నిల్పు మని సుమంతుని బిలుచుట

ఓసుమంతుఁడ రథ మునుపవే యనుచు, నాసుమంతుఁడు విన నట్లు చేయుచును
వెనుకొని పురి దాఁటి వెస నేఁగుదేర, మనుజేశుఁ జూచి సుమంత్రుతో ననియె
నిదె వచ్చుచున్న వాఁ డినకులేశ్వరుఁడు, పొటపొద పోనిమ్ము పోనిమ్ము రథము
అని యని రఘురాముఁ డందందఁ దలఁచు, మొనసి యాతఁడు రయంబున దేరుఁ
నంత వసిష్ఠుఁ డయ్యవనీశుఁ జూచి, యంతరంగంబున నడలుచుఁ బలికె [బఱపె
ననఘ శోకించుచు ననుపఁగా రాదు, మనుజేశ నీవింక మరలు మిచ్చోట
ననపుడు దశరథుఁ డటు పోక నిలిచి, తనసూనురథమును దప్పక చూచి
యదియుఁగానక ధూళి నటుచూచి చూచి,యదియుఁగానక బయ లటుచూచి చూచి
హాయని యెలుగెత్తి హారామ రాము, హాయని మూర్ఛిల్లి యవనిపైఁ ద్రెళ్లి
పొరలుచుఁ గెంధూళిఁ బుడమి కంపింపఁ, గరముగ్ర మగుదృష్టిఁ గైకేయిఁ జూచి
నీపాప మెఱుఁగక నిన్ను మన్నించి, నాపుణ్యపుత్రరత్నముఁ గోలుపోతి
నిన్నుఁ బెండ్లాడి నే నీచుఁడనైతి, నన్నిట మేటినై యల్పుఁడనైతి
నడరు నిందలకెల్ల నాధారమైతిఁ, గడపటఁ జెడిచితిఁ గాకుత్స్థకులము
నినుఁ జూడఁగారాదు నిను ముట్టరాదు, చెనటి నీతోడ భాషింపఁగారాదు
అని దశరథుఁ డాడ నాపౌరజనులు, గనుఁగొని తనుఁ దిట్టఁ గైకేయి వినుచుఁ
దలవంచుకొనియుండె దశరథుం డంత,నలయుచు నపు డయోధ్యాపురిఁ జొచ్చి
పాడువాఱిన యట్టిపట్టణవీథి, నాడాడ నిలుచుచు నడలు కౌసల్య
నగరంతఁ జొచ్చి యానవధూళితోడఁ, బొరలుచు సెజ్జపైఁ, బొరలుచు మిగుల
నలయుచు సొలయుచు నసురుసు రనుచు, నలుదెస లూచుచు నాలుక యెండ
హా రామ హా రామ యనుచు దైన్యంబు, దూఱుచు దనుఁ దానె దూషించుకొనుచు
నేపాటు నేదుఃఖ మెఱుఁగనియట్టి, నాపుత్రరత్నంబు నాముకోడలును
ఎంతద వ్వరిగిరో యెందున్నవారొ, యెంతతోఁ గుంది వా రెటులే గెదరొ
కందమూలములు శాకములు నేరీతిఁ, దిందురో యెట్లు వర్తింతురో యడవి
నని యని వారలయాయాసములకుఁ, దనమది నడలుచుఁ దలపోయుచుండెఁ
గౌసల్యయును నంతకంటె శోకింప, నాసుమిత్రాదేవి యడలార్చుచుండె
నంత రాముఁడు పౌరులందఱు గొలువఁ, గొంతదవ్వేఁగి పేర్కొని వారిఁ బలికె
ననఘాత్ములార మీరందఱు మగుడి, చనుఁ డయోధ్యకు నాకు జయముగోరుఁడు
భరతునియాజ్ఞలోపలను వర్తించి, పొరయుఁడు సౌఖ్యముల్ పొందు మీ కనిన
వారలందఱు నేకవాక్యులై పలికి, రోరామ యిట్లాడ నుచితమే నీకు
భరతుఁ డేటికి మాకుఁ బట్టణం బేల, వరమందిరము లేల వాహము లేల
యుప్పరిగలు నేల యువిదలు నేల, చప్పరములు నేల సౌధంబు లేల

నతనిఁ బట్టముగట్టుఁ డాత్మఁ గైకేయి, కృతకంబులకు నింకఁ గింకరిపడకు
మాతల్లి నీకు నెమ్మది సేవసేయు, నాతల్లి మీరుసు నరసుండు ప్రేమ
నని ప్రదక్షిణముగా నచుజొందుఁ దాను, జనకజయును గడుసద్భక్తి మ్రొక్కి
రప్పుడు రఘురాముఁ డడవికిఁ బూని, దప్పక వెడల నాదశరథాధిపుఁడు
మదిలోనఁ దలఁచి సుమంత్రునిఁ జూచి, యదె రాముఁ డడవుల కరుగుచున్నాఁడు
గొనిపొమ్ము రథమున్నఁ గువలయాధిపుని, పనుపునఁ గొనిపోయి భక్తితో మ్రొక్కి
రథమిదె పుత్తెంచె రాజు మీకర్థి, రథమెక్కి వేంచేయు రఘురామచంద్ర
యనవుడు దశరథునాజ్ఞకు వెఱచి, మును సీత నెక్కించి నొగి నాయుధములు
తనరు జోడును బెట్టి తాను లక్ష్మణుఁడు, ఘనమైనరథ మెక్కి కదలె రాఘవుఁడు
అంతఁ బౌరులు వృద్ధులాప్తులు మంత్రు, లింతులు పౌరులు హితులు నాశ్రితులు
వంత బ్రాహ్మణరాజవైశ్యశూద్రులును, అంతంత నలుఁగడ నడలుచు వెడలి
ముందట నిరుపార్శ్వములఁ బిఱుందటను, సందడించుచును మది జడిగొన్న నగల
నరనాథ పుత్త్రుఁ డెన్నఁడు గానరాఁడు, సుచిరస్థితి నేఁడు చూతమింపారఁ
జంద్రు తేజము నవ్వఁజాలు నీరాము, చంద్రు మోమును జూడఁ జనుదెంచువారు
కడఁగి యిక్ష్వాకులగౌరవం బెల్ల, నడఁచెనే మంథర యని తిట్టువారు
తగవేది రఘురాముఁ దపసిగాఁ జేయ, నగునమ్మ కైకేయి కని దూఱువారు
దాలిమి దిగనాడి దశరథాధీశుఁ, డాలికి వెఱచునే యని రోయువారు
చనువెల్లఁ జెడి రామసౌమిత్రు లంత, ననదలై పోదురె యని వేఁగువారు
పనిగొని తమతండ్రి పనుపునఁగాని, పొనుపడి యిల్లేల పోదురన్వారు
ఈపదునాలుగేం డ్లెట్లు వీరడవి, నాపద వేఁగింతు రని పొక్కువారు
ఈనోము నోచెనో యిమ్మహీపుత్త్రి, తానంచు మదిలోనఁ దలపోయువారు
నతిమృదుగాత్రి యీయతివ భూపుత్త్రి, పతిఁబాయ లేదని ప్రణుతించువారు
ఈసుతుఁ బాయంగ నెట్లోర్చె నట్టి, కౌసల్య మది యెంత గట్టనువారు
ధర్మము పాడయ్యె ధరనిప్పుడనుచు, నర్మిలి రాముతో నరిగెడువారు
నై రామునరదంబు నందందఁ గదిసి, భూరిశోకాగ్నులఁ బొగలుచుఁ బోవ
నంతఁ గౌసల్యయు నాసుమిత్రయును, జింతాపరంపరఁ జిక్కి శోకించి
వారిశిరంబులు వలనొప్పనూఁది, వారిపై వ్రాలుచుఁ బగలఁ దూలుచును
గలయ నంతఃపురకాంతలు దన్నుఁ, గొలిచిరా దశరథక్షోణిపాలకుఁడు
భూరిలోచనబాష్పపూరముల్ దొరఁగ, హా రామ హా రామ యని పలుమాఱు
నెలుగెత్తి యేడ్చుచు నేచినవగల, నలిఁ దూలి పొగులుచు నగరంబు వెడలె
అప్పుడు రవిదీప్తు లణఁగె నల్దెసల, నుప్పొంగెఁ దమము వహ్నులు మండవయ్యె
ధరణి బీటలువాఱెఁ దారలు రాలె, విలసించి గ్రహములు వినువీథిఁ బాఱె
నెలమిమై మదధార లింకె దంతులకుఁ, గలయ నశ్వములకుఁ గన్నీరు దొరఁగె
నావులు చన్నియ్యవయ్యెఁ గ్రేపులకు, నావీడు కడుశూన్యమై తోఁచెఁ బ్రజకు
వారు వీరన కెల్లవారు నెల్లెడలఁ, బౌరులయేడ్పు లంబర మెల్ల నిండె

సురవరకామినీశోకారవములు, పౌరి బోని వినవచ్చెఁ బురజనంబులకు
నప్పుడు దశరథుఁ డా రాము రథము, చొప్పు బాష్పములుచేఁ జూడఁ జొప్పడక
చంద్రబింబముతోడ సరియైన రాము, చంద్రుని మొగ మొకసారి చూచెదను

దశరథుఁడు రథము నిల్పు మని సుమంత్రుని బిలుచుట

ఓసుమంతుఁడ రథ మునుపవే యనుచు, నాసుమంతుఁడు విననట్లు చీరుచును
వెనుకొని పురి దాఁటి వెస నేఁగుదేర, మనుజేశుఁ జూచి సుమంత్రుతో ననియె
నిదె వచ్చుచున్నవాఁ డినకులేశ్వరుఁడు, పోటపోద పోనిమ్ము పోనిమ్ము రథము
అని యని రఘురాముఁ డందందఁ దఱుచు, మొనసి యాతఁడు రయంబున దేరఁ
నంత వసిష్ఠుఁ డయ్యవనీశుఁ జూచి, యంతరంగంబున నడలుచుఁ బలికె [బఱపె
ననఘ శోకించుచు ననుపఁగా రాదు, మనుజేశ నీవింక మరలు మిచ్చోట
ననవుడు దశరథుఁ డటు పోక నిలిచి, తనసూనురథమును దప్పక చూచి
యదియుఁగానక ధూళి నటుచూచి చూచి,యదియుఁగానక బయ లటుచూచి చూచి
హాయని యెలుగెత్తి హారామ రాము, హాయని మూర్ఛిల్లి యవనిపైఁ ద్రెళ్లి
పొరలుచుఁ గెంధూళిఁ బుడమి కంపింపఁ, గరముగ్ర మగుదృష్టిఁ గైకేయిఁ జూచి
నీపాప మెఱుఁగక నిన్ను మన్నించి, నాపుణ్యపుత్రరత్నముఁ గోలుపోతి
నిన్నుఁ బెండ్లాడి నే నీచుఁడనైతి, నన్నిట మేటినై యల్పుండనైతి
నడరు నిందలకెల్ల నాధారమైతిఁ, గడపటఁ జెఱిచితిఁ గాకుత్స్థకులము
నినుఁ జూడఁగా రాదు నిను ముట్టరాదు, చెనటి నీతోడ భాషింపఁగా రాదు
అని దశరథుఁ డాడ నాపౌరజనులు, గనుఁగొని తనుఁ దిట్టఁ గైకేయి వినుచుఁ
దలవంచుకొనియుండె దశరథుం డంత,నలయుచు నపు డయోధ్యాపురిఁ జొచ్చి
పాడువాఱిన యట్టిపట్టణవీథి. నాడాడ నిలుచుచు నడలు కౌసల్య.
నగరంతఁ జొచ్చి యాననధూళితోడఁ, బొరలుచు సెజ్జపైఁ, బొరలుచు మిగుల
నలయుచు సొలయుచు నసురుసు రనుచు, నలుదెస లూచుచు నాలుక యెండ
హారామ హారామ యనుచు దైనంబు, దూఱుచు దనుఁదానె దూషించుకొనుచు
నేపాటు నేదుఃఖ మెఱుఁగనియట్టి, నాపుత్రరత్నంబు నాముకోడలును
ఎంతదవ్వరిగిరో యెందున్నవారొ, యెంతతోఁ గుంది వా రెట్టులేఁగెదరొ
కందమూలములు శాకములు నేరీతిఁ, దిందురో యెట్లు వర్తింతురో యడవి
నని యని వారలయాయాసములకుఁ, దనమది నడలుచుఁ దలపోయుచుండెఁ
గౌసల్యయును నంతకంటె శోకింప, నాసుమిత్రాదేవి యడలార్చుచుండె
నంత రాముఁడు పౌరులందఱు గొలువఁ, గొంతదవ్వేఁగి పేర్కొని వారిఁ బలికె
ననఘాత్ములార మీరందఱు మగుడి, చనుఁ డయోధ్యకు నాకు జయముగోరుఁడు
భరతునియాజ్ఞలోపలను వర్తించి, పౌరయుఁడు సౌఖ్యముల్ పొందు మీ కనిన
వారలందఱు నేకవాక్యులై పలికి, రోరామ యిట్లాడ నుచితమే నీకు
భరతుఁ డేటికి మాకుఁ బట్టణం బేల, వరమందిరము లేల వాహాము లేల
యుప్పరిగలు నేల యువిదలు నేల, చప్పరములు నేల సౌధంబు లేల

మేడలు మాకేల మేలమైనట్టి, వాడలు మాకేల వలదు నీవరుగ
పత్తనము నీవెంట నలకంటివేని, చిత్తము దీరికై సందేహ మేల
అని యిటుపలుకుచు నఖిలభూప్రజలు, తనుఁ గొల్చిరాఁ గని రఘురాముఁడు నాఁడేఁగి
తమసానదీతటస్థలమునఁ గ విడిసి, తమసతో సాంధ్యకృత్యము లెల్లఁ దీర్చి
తగుశౌధమున మృదుతల్పంబునందు, మొగిఁ బవ్వళించు నామోహనమూర్తి
తరుమూలమునఁ బర్ణతల్పంబునందు, ధరణీసుతయుఁ దానుఁ దగ విశ్రమించెఁ
దనచుట్టు పౌరులు తరుముల్లమునిచి, తనయుల భార్యలఁ దగులుఁ బోవిడచి
వనములఁ దమవెంట వచ్చువారనుచు, వినుపౌర దప్పితో నిద్రింపఁ జూచి
వారల మఱచించు వలనొండు లేక, నారాత్రిమధ్యంబునందు సుమంత్రుఁ
దేరాయితము సేసి తెమ్మని పనిచి, పౌరుల వంచించుభావ మాతనికిఁ
దెలిపి యయోధ్యకై తేరుఁ బోనిచ్చి, తలకొని మఱుచించి తమసను దాఁటించి
తృణశిలావృతభూమి తేరుఁ దోలించి, గణుతింపరాని వేగమునఁ బోవుచును
దమరాకయును మహీధవునిసేతయును, దమకించి మదిలోనఁ దాపంబునొంది
తెరువు పల్లెలవారు ధృతిదూలి యేడ్వ, బరుసంపుఁబలుకులు పలుమాఱు వినుచు
వనతరుల్ సీతకు వరుసఁ జూపుచును, ఇనకులముఖ్యుఁడైన యిక్ష్వాకునకును
మనువు మున్నొసఁగినమహిమఁ గన్గొనుచుఁ, జని వేగవతి దాఁటి సరయువు దాఁటి
నరనాథుఁ డమ్మఱునాఁడు మాపటికిఁ, గరము వేగమున గంగానదిఁ జేరి
తడయక హింగుదీతరుసమీపమున, విడిసి యచ్చటఁ బ్రీతి విశ్రాంతినొందె
నారయఁ దమసలో నట నిద్రవోయి, పౌరులందఱును బ్రభాతంబునందుఁ
గరమర్థితో మేలుకని నాల్గుదెసలఁ, బరికించి నివ్వెఱపడి శోకమునను
రామునిఁ గానక రథముచొప్పరసి, రాముఁ డయోధ్యాపురమున కీరాత్రి
యవనినాథుఁడు పిల్వనంపిన మరల, భువనభారముఁ బూనఁబోనోపు ననుచు
నని యయోధ్యకు వచ్చి యచ్చోట రాముఁ, గనుఁగొనఁజాలక ఘనశోకవహ్ని
ననయంబుఁ బొగులుచు నకట రాఘవుఁడు, మనల వంచించి క్రమ్మఱఁ బోయె ననుచు
నారామకృపయు సత్యంబు ధర్మంబు, చారువర్తనము నిచ్చలు నుతించుచును
నితరవస్తువులపై నిచ్చలు మాని, యతనిఁ దలంచుచు నతనిఁ బాయుటకు
నంతరంగంబున నలయుచుచుండ, నంత నక్కడ గుహుం డను చెంచురాజు

## శ్రీరాములు గుహునిఁ జూచుట

శృంగిబేరం బేలు చిరపుణ్యశాలి, గంగాతటమున రాఘవుఁ డుండు టెఱిఁగి
చనుదెంచి రామలక్ష్మణులకు మ్రొక్కి, వనమూలఫలములు వలయువస్తువులు
కనకాంబరాదులు కానుక లిచ్చి, వినయవిధేయుఁడై వినుతు లొనర్చి
యచ్చెరువుగ రామునాకృతిఁ జూచి, యిచ్చలో వెఱఁగంది యిది యేమి దేవ
నీవరణ్యములకు నిఖిలంబు విడిచి, యీవిధి విచ్చేయ నేమి కారణము
నలినాప్తకులనాథ నాయట్టిబంటు, కలుగ నీవేషంబు గలిగెనే మీకు
చెనటియై మిమ్మిట్లు చేసిననీచు, ననిఁ బట్టి చంపెద ననిన రాఘవుఁడు

నతనిసద్భక్తికి నతనిశక్తికిని, నతనిధీరోక్తుల కానందమంది
యతనిఁ గౌఁగిటఁ జేర్చి యాదరం బెసఁగ, నతనితోఁ దనవృత్తాంతంబు దెలుప
నంతయు విని గుహుం డాత్మలోఁ బెద్ద, చింతించి కైకేయి సేఁతకు వగచి
దశరథునేరమి తలపోసిపోసి, దశరథాత్మజులదుర్దశకు శోకించె
రాముఁ డప్పుడు కృపారసమగ్నుఁ డగుచు, సౌమిత్రియును దాను సముచితభణితి
గుహుశోక ముడుప నర్కుఁడు గ్రుంకుటయును, విహితసంధ్యాకాలవిధులొప్పఁదీర్చి
గంగోదకముల నాఁకలిదీర్చి సూత, శృంగిబేరాధిపు లేర్చి సేవింప
ధరణీతనూజయుఁ దాను లక్ష్మణుఁడు, ధరణిపైఁ దృణశయ్యఁ దగ విశ్రమించె
శరచాపహస్తుఁడై సౌమిత్రి యంతఁ, గర మొప్పఁ దమయన్నఁ గాచు సద్బుద్ధిఁ
బదునాలుగేండ్లును బగలును రేలు, నిదుర వోవకయుండ నియమంబు చేసి
తమయన్న సెజ్జకు దవ్వుల నిలిచి, యమలమానసుఁ డప్పు డటు గొల్చియుండె
నారాత్రి నిద్ర మాయారూపు దాల్చి, ధీరుఁ డాలక్ష్మణదేవునిఁ జేరి
యేను నిద్రాదేవి నేర్పడఁ దెల్పు, మా నాకు నింకెల్లి మానాథ్య యంత
విధి విధించెను వెంటవెంట వర్తింప, విధ మేది నిన్ను నే విడుచుట కింక
అనిన నూర్మిళయందు సహారహంబులును, జనియుండు మంత నీసమయంబు దీర్చి
వచ్చినఁ గైకొందు వరుస నిన్ననిన, నిచ్చ నౌఁగాకంచు నేఁగె నిద్రయును
అలరుచు నీదేవతానుగ్రహంబు, గలిగె నాకనుచు లక్ష్మణదేవుఁ డుండె
సుకుమారతారుణ్యశోభనాకృతులు, ప్రకటితధైర్యసంపన్నులై యున్న
నా రామసీత లత్యంతదుఃఖములఁ, గూరెడు తెఱఁగెల్ల గుహునకుఁ జెప్పి
హంసతూలికశయ్యయందుండుభోగి, పాంసుపల్లవములఁ బవళించి యిపుడు
కఱకురాల్లోత్తంగఁ గళవళపడుచు, గుఱువెట్టి నిద్రచేఁ గూర్కియున్నాఁడు
అడరి కౌసల్యయు నాసుమిత్రయును, బడిరెడిశోకంబు పలుమాఱుఁ జెప్పి
పొరిది నిద్దఱుఁ గూడి శోకించుచుండ, నరుణోదయంబయ్యె నంత రాఘవుఁడు
నేమంబులన్నియు నిష్ఠతోఁ దీర్చి, నేమమేర్పడ గుహుచే మఱ్ఱిపాలు
దెప్పించి కోమలదీర్ఘకేశములు, విప్పి యావైదేహి వివశయై తూల
ఆమఱ్ఱిపాలచే నందంద దడిపి, సౌమిత్రియును దాను జడలొప్పఁ దాల్చి
ఘనుఁడు రాఘవుఁడు వైఖానసవృత్తి, ననుజుండు దాను పాయనినిష్ఠఁ బూని
అనఘు సుమంతు రమ్మని చేరఁ బిలిచి, తనరార రథమెక్కఁ దగదు మా కింక
నరదంబు గొని యయోధ్యకు నీవు వేగ, మరలిపొమ్మధిపు నెమ్మదిఁ గొల్చియుండు
పార్థివేశ్వరునకుఁ బరఁగఁ దల్లులకు, నర్థితో మ్రొక్కితి మని చెప్పుమనుడు
యేమిటి కీమాట లిటమీఁద ననుచు, సౌమిత్రి యధిరోషమున నిట్లనియె
భూమీశుఁ డాలిపంపున నీతిమాలి, యేమియుఁ బరికింప కిటు చేసె మమ్ముఁ
దనయాలుఁ దానును దనకూర్మికొడుకు, ఘనరాజ్యభోగముల్ గైకొనుఁగాక
యని యేను బల్కితి నని చెప్పు మీవు, చనుమన విని రామచంద్రుండు గినిసి
మాను సౌమిత్రి సుమంత నీవింక, భూనాథుతో నీవు పుట్టింపవలదు

ఆనృపుఁ డిదివిన్న నధికదీనాత్ముఁ, డానతాననుఁడునై మఱి పొక్కుచున్న
యనిన సుమంతుఁ డత్యంతశోకమున, ననునింగి భీతిల్లి రాముని జూచి పలికెఁ
గానల మిమ్ముఁ ద్రోచి కడుదీనవృత్తి, నేఁ డయోధ్యాపురం బేమని చొత్తు
నే మని చెప్పుదు నీనాథుఁ బ్రజకు, నేమని కొనిపోదు నీశూన్యరథము
నేమని కౌసల్య నే నూఱడింతు, నే మని కైకమోము వీక్షింతు
వనముల కేనును వత్తును గాక, యనిన రాముఁడు నవ్వి యాతనిఁ జూచి
కడఁకతో నేము గంగానది దాఁటి, యడవిఁ జొచ్చితి మనువార్త కైక
నీవు చెప్పినఁగాని నిజముగాఁ గొనదు, నీవు శోకింపక నెమ్మదిఁ బొమ్ము
నామాటగా నీవు నయవాక్యసరణి, వేమాఱు దెల్పి భూవిభుఁ గొల్చియుండు

### సుమంతుఁడు అయోధ్యకు రథము గొనిపోవుట

మనవుడు రథమెక్కి యతిదీనుఁడగుచుఁ, జనియె సుమంతుఁడు సాకేతపురికి
అంత రాఘవుఁ డయోధ్యాపురి కపుడు, నంతరంగంబున నతిభక్తి మ్రొక్కి
గుహుఁడు పెట్టినయోడ కొమరొప్ప నెక్కి, యహిమాంశుకులు నాతఁ డాగంగ దాఁట
నడుమ జానకి గంగ నటు జూచి మ్రొక్కి, కడు వేడ్కఁ బ్రార్థించి కరములు మోడ్చి
దశరథేశ్వరునాజ్ఞ ధరణి వర్జించి, దశ చెడి రాముఁడు దండకాటవిని
బదునాలుగేండ్లు భవ్యవృత్తులను, విదితంబుగా నేను వీనితోఁ గూడ
సంచరించియు రామసౌమిత్రు లంత, నంచితశుభముచే నలరు వేడుకల
వచ్చిన నీకును వలనొప్పఁగాను, నిచ్చెద గోవుల నేకముల్ వస్త్ర
దానమృష్టాన్నాదిదానంబు లమరఁగాను భూసురులకుఁ గానుక నిత్తు
సురఘటల్ వేయింటి శుద్ధాన్నమాంసచురయఁ బెట్టెదనమ్మ యని భక్తిఁ గొలిచి
భవభంగధవళాంగభవమౌళిసంగ, నవనిజ యాగంగ నర్థిఁ బ్రార్థించె
గుహుని సంభావించి గుహుఁ వీడుకొలిపి, గుహుఁడు మార్గజ్ఞులఁ గొందఱఁ గూర్ప
ముందఱఁ గూర్మితమ్ముఁడు వెన్కఁ దాను, సుందరి నడుచక్కఁ జూపట్టఁ గదలి
వనచరమృగములవరుస జానకికిఁ, గనుపట్టఁ జూపుచు ఘనుఁడు రాఘవుఁడు
చని యొక్క మౌనియాశ్రమమును జేరి, మునిపతి కతిభక్తి మ్రొక్క నామౌని
వారలఁ గన్గొని వల్కలాదికము, గారవంబున బెంచఁగాఁ బల్కె నిట్టు
లే నెఱింగితి మీర లిటవచ్చు పనిని, ఈదిన మిందుండి యెల్లి పోవలయు
రఘుకులోత్తంస యీరమణీయమైన, యఘునాశమైన యీయాశ్రమభూమి
నిలుతురుగాక యనిన రఘూత్తముఁడు, పలికెఁ గ్రమ్మఱ మునిపతి కిట్లు లనుచు
నిక్కడ మాకుండ నేల పోయెదము, అక్కట మునినాథ యదియునుగాక
మాతల్లిదండ్రులు మాపురవాసు, లేతెంచి మముఁ జూడ నిట వత్తురన్న
నామాట కలరి యిట్లనియె నమ్మౌని, యీమాట నిశ్చయంబె రామ యిపుడు
పదమని సెలవిచ్చె పరమపావనుఁడు, వదలని ముదమున వారల కనియె
జననాథ మూఁడు యోజనములు నడువ, ననువొందఁ జిత్రకూటాఖ్యఁ జెన్నొందు
ననవుడు రాఘవుఁ డౌఁ గాక యనుచు, జనకజాసౌమిత్రిసహితుఁడై యప్డు

చని చని మూఁడుయోజనములు గడచి, చని సుభర్మగ యనుసరసి నాఁ డుండి
యారాత్రి భూపుత్రి యతిఖిన్నగాత్రి, గారడవిని యొంటిగా శయనించి
యున్నచందంబు తా నున్నచందంబు, కన నెల్లులకైన కష్టశోకంబు
కైకేయి కోర్కులు కడకుఁబుట్టుటయును, భూకాంతుపత్యంబు భూప్రజనగయుఁ
గన్నీరునోరుగ రాఘవుఁడు లక్ష్మణుని, కన్నియుఁ జెప్పఁగా నటవేఁగెఁ బ్రొద్దు
ఘనువంశతిలకు లామఱునాఁడు కదలి, మునుమిడి యోజనంబులు మూఁడు గడచి
అనఘు గంగాయమునలు గూడి యునికి, గనుఁగొని యటఁ బ్రయాగకుఁబోయియందు
మునిలోకనుతుఁడైన ముని భరద్వాజుఁ, గని నమస్కారముల్ గావించి తనదు
వృత్తాంతమంతయు విన్నవించుటయు, నత్తపోధనముఖ్యుఁ డా రాఘవులను
దీవించి రఘురామదేవు వర్తనము, భావించి యచ్చెరువడి తత్త్వ మెఱిఁగి
కందమూలఫలాదికంబుల వారిఁ, బొందుగా సంతుష్టిఁ బొందించి ప్రేమ
నమ్ముని పూజింప నారాత్రి యుండు, నెమ్మిఁ దీపింపఁగ నిల్చి యుర్వ్యాఁడు
ఘననిష్ఠ సంధ్యాదికర్మముల్ దీర్చి, మునులయాశీర్వాదములు చాలఁ బడసి
యరుదైన చిత్రకూటాద్రికిఁ దెరువు, వరపుణ్యుఁ డగు భరద్వాజుచే నెఱిఁగి
యరుగుచో రాముఁ డయ్యడవులనడుమ, సురుచాపరవమున సురుగుచుఁ బాఱు
మృగములఁ జూపుచు మేదినీసుతకు, నగవుఁ బుట్టించుచు నడతెంచు నడల
నలసి డస్సినచోట నవనీరుహముల, నిలిచినచోటనే నిలిచి దోడ్కొనుచుఁ
గరమర్థిఁ బెక్కుదుర్గంబులు గడచి, వరపుణ్యులట సిద్ధవటము నీక్షించి
సీత యప్పుడు కార్యసిద్ధులు గోరి, యాఁగుచరమున కంజలిచేసి
ప్రార్థింప నప్పు డాపార్థివతనయు, లర్థితో యమునమహానది దాఁటి
యారాత్రి యందుండి యమ్మఱునాఁడు, ఘోరాటవులు చొచ్చి కుశలమార్గమున
వలనొప్పఁ జని మాల్యవతిచుట్టుఁబాఱి, యంఘుసంయములకు నాటపట్టగుచు
సలలితతరులతాసానుకూటములు, చెలువు వాటించిన చిత్రకూటాద్రి
గని యెక్కి యందున్నఘనతపోధనులఁ, గని మ్రొక్కి మిగుల సత్కారముల్వడసి
యమ్మునీంద్రులచేత ననుమతి వడసి, తమ్ముఁడు దాను నత్తఱి మహీజముల
కొమ్మలు ఖండించి కొంత వింతగను, సమ్మదంబునఁ బర్ణశాలఁ గావించి
కృష్ణసారముఁ జంపి గృహశాంతిహోము, ముష్ణాంశుకులుఁడు శాస్త్రోక్తిమైఁ జేసి
యందుఁ బ్రవేశించి యాపర్ణశాల, చందంబు మెచ్చుచు సాధ్వియుఁ దాను
మునుల సేవించుచు మును లెల్లఁ బొగడ, మునిచరిత్రంబుల మోదించుచుండెఁ
దనతోడ నొకనాఁడు తలయంపిగాఁగ, నునిచి రాముఁడు గూర్క నుర్వీతనూజ
యొగిఁ గందమూలాదు లుపహారమునకుఁ, దగ నాయితము సేయుతఱి భీతి లేక
కడఁకతో నొకదుష్టకాకంబు శాల, నొడిసియుచు గాసిసేయుచు నున్నఁ జూచి
సీత యాకాకంబుఁ జెచ్చెరఁ జోప, నేతెఱంగున బోవ కీడాడఁ జూచి
చనుఁగవ నడుచక్కిఁ జంచునఁ బొడువ, ఘనశోణితం బొల్కఁగా నిద్ర దేరి
కడునల్గి రాముఁ డాకాకంబుఁ జూచి, వడి నిషీకముఁ బుచ్చి వైచె వైచుటయు

విడువక యది దాని వెనువెంటఁ దగులఁ, దడయక యది జగత్త్రయమెల్లఁ దిరిగి
కావుఁడీ యనుచు దిక్పాలుర బ్రహ్మ, దేవుని నమ్మహాదేవుఁ బ్రార్థింప
వారలు తమచేత వారింపఁబడ కునె, శ్రీరామశరణ మన్న శీఘ్రంబు మగుడఁ
జనుదెంచి మఱి తన్ను శరణు చొచ్చుటయు, ఘనమైనకృపతోడ గాకంబుఁ జూచి
నాయస్త్ర మెందు నెన్నఁడు రిత్తవోదు, నీయంగ మొకటి దానికి నిచ్చి పొమ్ము
అనవుఁడు దననేత్ర మయ్యస్త్రమునకు ఘనభక్తితో నిచ్చి కాకంబు చనియెఁ
జెలఁగి రాఘవుఁ డంత సీతచే నున్న, ఫలములు దేవతార్పణములు సేసి
యాయున్నఫలముల నలవడఁ దృప్తు, లై యుండి రిమ్ముల నంత నక్కడను
రామువర్తనము నారయ మూఁడునాళ్లు, నేమించి గుహుఁ జెంత నిలిచి మర్నాఁడు
వలగనివగల సుమంతుండు చాల, నలయుచుఁ జని యయోధ్యాపురిఁ జొచ్చి
సహజవైభవములు సర్వంబు నుడిగి, రహిచెడియున్న యారాజమార్గమున
నరుగుచోఁ బౌరజను లారథధ్వనులు, పరికించి యిదె రామభద్రుండు వచ్చె
నని సుమంతుని జేర నరుదెంచి రథము, కనుఁగొని రామునిఁ గానక వచ్చి
క్రూరకర్ముఁడు రాముఁ గొనిరాక డించి, యారిత్తరథ మేల నిటఁ దెచ్చె ననుచు
గుంపులు గుంపులు గొని తన్ను దూఱ, సొంపేది రామునిసుద్ది చెప్పుచును
రాజగేహముఁ జేరి రథ మంత డిగ్గి, రాజున్న యంతఃపురంబున కేఁగి
ధూళిగప్పినమేనితో బాష్పపూర, లోలనేత్రములతో లోలోనఁ బొదలు
కడలేనివగలతోఁ గౌసల్యయింటఁ, బడి ప్రలాపించుభూపతిఁ గాంచి మ్రొక్కి
భూమీశ మీపుణ్యపుత్త్రరత్నంబు, రాముఁడు సత్యపరాక్రమశాలి
సౌమిత్రియును దాను జడలొప్పఁ దాల్చి, తామసింపక గంగ దాఁటి కాల్నడల
ననఘుఁడై చిత్రకూటాద్రికిఁ బోయె, ననవుడు దశరథుఁ డాత్మ శోకించి
యనఘ సుమంత రమ్మని చేరఁ బిలిచి, తనయునిచరితమంతయుఁ దప్ప కడిగి
గౌరవమతి నీవు గల్గితి కాన, మారామభద్రునేమములెల్ల వింటి
గన్నులకవు శోకంబును దీఱ, చెన్నార నతనిఁ జూచినఁ గాని యకట
తనువునఁ బ్రాణము ల్దరియింపఁజాలఁ, గొనిపోయి రఘురాముఁ గూర్పవే యనిన
వినవయ్య శ్రీరాము వెంటనే పోవఁ, గని ప్రజ శోకించుఁ గైక దూషించు
నిది విచార్యంబుగా దిది బుద్ధిగాదు, మది నింత వగవకు మనుజేంద్ర నీవు
ధైర్యంబు పరికింపు ధర్మంబుఁ బూను, మార్యులు గొనియాడ ననఘుండ వగుమ
అఱలేక నడవుల నఖిలభోగములు, మఱచి నీసుతులు నెమ్మది నున్నవారు
అని పల్కి లక్ష్మణుం డన్నవాక్యములు, వినుపించుటయును భూవిభుఁడు శోకిం
సౌమిత్రిమాట నిజం బౌనె యట్టి, కామాంధుఁడను గ్రూరకర్ముండ ఖలుఁడ
నని సుమంతుని వేగ యటు వీడుకొలిపి, తనమది శోకించు ధరణీశుఁ జూచి
హారామ హారామ హారామ యనుచు, శ్రీరాము పలుమాఱుఁ జింతింప నేల
వేల నటించెద వేల యీశోక, మేల తాల్చెద వంత రోయుఁగనే నేను
నీవు లోకములలో నిందకు వెఱచి, ఆవల కైకేయి కన్నియుఁ గఱపి

రాముఁ బట్టముగట్టి రాజుఁ గావించి, భూము లేలించెదఁ బొగడొంద ననుచు
నడవిఁ ద్రోపించితే నాలిచేఁ బరిచి, కడుఁగష్టుఁడవు నీకుఁ గలవె ధర్మములు
త్రిట్టుపాటునకోడి తివిరి నాకొఱకు, పట్టంబు మాన్పింపఁ బనిచెఁగా కధిప
పాఁపేచి రాముని స్రుక్కక కైక, చంపు మన్నను బట్టి చంపవే నీవు
పెద్దకాలము నాకు బిడ్డలులేక, పెద్దయు శోకించి పెక్కులు నోచి
కడపట నొక్కనిఁ గని యేను గొంత, యుఱుకారియున్నచో నుండ నీవైతి
వని దూఱుకౌసల్య నధిపతి చూచి, తనపూర్వకథయెల్లఁ దాఁ జెప్పఁ దలఁచి
నీవు చెప్పినదెల్ల నిజముగాఁ గలదు, భావింప నే నట్టిపాపకర్ముఁడను
ఒకల బ్రాణము లీఁకనుండవు నాకుఁ, గడుబెట్టిసములాడి కాఱింపవలదు
కౌసల్య నాతొంటికర్మభోగంబు, లొనరించినవి యవి యూరకేపోవు
దైవంబులకునైనఁ దమకర్మఫలము, భావించి కుడువక పాయ రాదెందు
నది యెట్టిదనినను నది చెప్పఁ జోద్య, మది తెల్లముగ విను మని చెప్పఁదొడఁగె

దశరథుఁడు కౌసల్యకు దనశాపముఁ దెల్పుట

నాడెల్ల నేలెడువాఁడ నాపిన్న, నాఁడొక్కనాఁ డేను నడురేయి బోయి
యరుదైనవేఁటల నాసక్తిఁ బొంది, శరచాపములు పూని సరయువు చెంత
రేసిమాడఁగరాని రేవుచక్కటికి, డాసి పొదలలో డాగి యేనుండ
నఱిమఱి మృగకోటు లయ్యేటినీరు, పఱతెంచి క్రోలుశబ్దములు నచ్చటికి
వీనుల వీక్షించి వెస శబ్దవేధు, లైనబాణము లేసి యందందఁ జంపి
తనియక కాపున్న తఱి యజ్ఞదత్తుఁ, డను నొక్కమునిపుత్త్రుఁ డమ్మహానదికి
తిరమైనవిధి తన్నుఁ దెచ్చిన వచ్చి, కరమర్థి నచ్చట కలశంబు ముంప
గుదియక యటమ్రోయ గుటగుటధ్వనులు, అది మత్తగజమని యదరి యేయుటయు
నాతీవ్రశరమప్పు డదరంటదాఁక, హాతాత హామాత యనునార్తరవము
పొరిఁబొరి నామర్మములు గాడిపాఱ, వరమునిసుతుఁ డుర్వి వ్రాలి యిట్లనియెఁ
గ్రమమొప్ప నడవులఁ గందమూలములు, నములుచుఁ దపసినైననుఁ గన్నగురులఁ
గొలిచి యేరికిఁ గీడు గోరని నాకుఁ, గలిగెనే నేఁడిట్టి కష్టంపుఁజావు
ఎట్టిపాపాత్ములు నీరాత్త్రులందు, నెట్టన చంపరు నెఱసి జంతువులఁ
బగళుల రతికేళిఁ బాయక మెలఁగు, మృగములఁ జంపరు మెయినోటులేక
యెవ్వఁడొకో నన్ను నీనడురేయి, క్రొవ్వాఁడిశరమునఁ గూల్చినవాఁడు
వాఁడేమిగతిఁ బోవువాఁడొకో యింక, వాఁడేమి సేయును వఱలు నామృతికి
నక్కటా వృద్ధులై యంధులై తమకు, దిక్కెవ్వరును లేక దీనులై యున్న
తల్లిదండ్రులు నేఁడు తముకైనవగల, వెల్లియు నెబ్భంగి వెడల నీఁదెదరొ
కడుఁ బ్రొద్దువోయె నొక్కఁడుఁబోయి తడసె, కొడుకని మదినెంత గుందునో తల్లి
సనుఁగన్నతల్లికి నారామిఁ జెప్పి, యనుమానపడి యెంత యడలునో తండ్రి
యాటల మరిగి రాఁడని చూతురొక్కొ, నీటికందువ లేమి నిలిచినాఁడొక్కొ
యేమని వగతురో యీచావు విన్న, నేమి గాఁగలవారొ యిటమీఁద వారు

ఎవ్వరు నుదకంబు నిచ్చెద రింక, నెవ్వరు ప్రోచెద రిటమీఁద వారి
గడఁగి యీబాణ మొక్కటనె ముగ్గురముఁ, బడితి మిం కేమని పలవింతు విధికి
నని విలాపించుచో నావిలాపములు, విని యెప్పు డెప్పుడు విరియునో తమము
ఎప్పుడు చూతునో యుష్మత్పదంబులు, నిప్పాటు పాటిల్లెనే నేఁడు నాకు
ననుచుండ నుదయించె నంతఁ జంబుజబంధుఁ, డనఘ నాశోకనవవధి యుప్పొంగఁ
జొదురఁ దూఁకయింప సరయువు దాఁటి, యందు నత్రిగంబుపందును వెనుకఁ
దన చేతికలశంబు ధరణిపై వైచి, తనచెక్కు కలశము స్తకమునఁ జేర్చి
యుగమున వీఁపున నొండొండ నెకలు, నురుగ క్తధారలు నొడలెల్లఁ దొఁగి
వీడినజడలతో విశిఖవేదనల, వాడినమోముతో వసుధపై వ్రాలి
శరముపదేశమై చనఁజొచ్చి యోపఁ, బరికించి దేహసంబంధంబు లణఁచి
యేకర్మములయందు నీడాడనీక, నైకొని యింద్రియగతు లుజ్జగించి
కడపటయోగంబు గని తన్ను మఱచి, పడియున్న యోగికైవడి నూరకున్న

దశరథుఁడు యజ్ఞదత్తుని జూచి చింతించుట

మునికుమారుని జగన్మోహనాకారుఁ, గనుఁగొని బాణంబు గని యేను బెదరి
యన్నదీజలములు నప్పుడు తెచ్చి, కన్నులు దుడిచి యంగములెల్లఁ దుడిచి
యక్కట మునినాథ యడరి నాశరము, దిక్కటే దాఁకి వధించెనే నిన్ను
నీనదీజలముల కేల విచ్చేసి, తేనింక నీపాప మేమిటఁ గడతు
ననుచుండఁ దనకన్ను లల్లన విచ్చి, ననుఁ జూచి తనుఁ జూచి నాభీతిఁ జూచి
నీవేమి నేయుదు నీకేల వగవ, నీవెవ్వఁడవు నాకు నిష్కృతి గావింప
దైవయోగంబున ధరణీశ నాకు, నీవిధి యయ్యె నీకేల శోకింప
నేనుఁగే యనుబుద్ధి నేసితిగాని, పూని నాదెసఁ గోపమున వేయవీవు
ఏను బ్రాహ్మణుఁడఁ గా నెలమి వైశ్యునకు, భూనాథ శూద్రికిఁ బుట్టినవాఁడ
నటుఁగాన నిది బ్రహ్మహత్యయుఁ గాదు, పటుదోషఫలము నిను బ్రాపింప లేదు
నరనాథ తలఁకకు నాచావుఁ జూచి, యరిగి నాగురులున్న యచటికిఁ బోయి
నాచావుఁ జెప్పకున్నను యోగదృష్టిఁ, జూచి భావించి యచ్చుగఁ గాంచిరేని
కోపించి నన్నన్న గురులు నిను బట్టి, శాపింప రఘుకులక్షయము గాఁగలదు
భూపాల యీకొండపొంత పశ్చిమపుఁ, గోపున నొకవృక్ష కొమరొందుచుండు
నావటవృక్షకోటరమందు రేయి, కావడిఘటియించి కడుసంతసమున
గురుతుగా నేను నాగురుల నందుంచి, యరసి పోషణసేయు నందున్నవారు
కరమొప్ప గురువుల గ్రక్కున డించి, పరితాపమొందక భయపడకీవు
కావున వారికిఁ గలశోదకములు, వేవేగఁ గొనిపోయి విసుపింపు మీవు
మనుజేశ నీయస్త్రరురణంబు నాకు, ననుచిత మీబాణ మల్లనఁ బెఱుకు
మీశరవేదన కేనోర్వఁజాల, నాశరీరమునఁ బ్రాణము లుండ వింక
ననవుడు నే నప్పు డల్లనఁ జేరి, ఘనమైనశోకాగ్నిఁ గ్రాఁగుచు వగచి
యమ్ముఁ బెఱుకఁ బూని యటు ముట్టవెఱచి, క్రమ్మఱఁ దెగువమైఁ గలఁగి కంపించి

పనిగొనువగలతో బాణంబు వేయుక, మునికుమారుఁడు ప్రాణములు వాసె నంతఁ
గలఁగుచు నేను నాకలశంబుతోడి, జలములుఁ గొని తదాశ్రమభూమిఁ గరిగి
యతివృద్ధులై యంధులై తారసాన్న, గతికులై నిజసుతాగమనం ముల్లముల
నెడపకఁ గోరుచు నెఱికలు విఱిగి, పడియున్నపక్షులపగిది నట్లున్న
ఘనపుణ్యు లగువారిఁ గన్గొని చేరఁ, జనుదేరఁ దాఁ గాలిచప్పుడాలించి
యోపుత్ర యిటు తడవుండుదువయ్య, మాపట్టి నాకేల నుసలెనో యనుచు
దలఁకుచుండితిమి మీతల్లియు నేను, నిలుతువె యొకచోట నీవింత ప్రొద్దు
తనయ నీవెక్కడ తడసితివయ్య, కనుఁగొనఁగా మాకుఁ గన్నులు నీవ
అతివృద్ధులకు మాకు నాధారమీవ, గతిలేని మాకు సద్గతియును నీవ
యిదియేల పలుకవో యేమంటి నిన్ను, నుదకముల్ తెమ్మంటి నోకుమారకుఁడ
యని పల్కు మునిపల్కు లంతరంగమునఁ, బెనఁగొన్నశోకంబు భీతియుఁ బెనుపఁ
జెట్టిక్కు కావడి శీఘ్రింబ డించి, యట్టిట్టు వడఁకుచు నతిదీనవృత్తిఁ
జెప్పెద నన వచ్చి చెప్పరాకుండి, చెప్పకపోదని చెప్ప నూహించి
చలియించి గద్గదస్వరముతో వెడలు, పలుకులఁ దడబాటుపడుచు నిట్లంటిఁ
దాపసోత్తమ యేను దశరథమేదినీపాలకుఁడఁ గాని నీపట్టిఁ గాను
నీచకర్ములు విన్న నిందించునట్టి, నీచకర్మము నాకు నేఁడు సిద్ధించె
నేయుగంబులయందు నెవ్వరు నిట్లు, సేయనిపాపంబుఁ జేసి మీకడకు
వచ్చితి నేమని వాక్రువ్వనేర్తుఁ, దెచ్చె దైవం బిట్టి తెంపు సేయుటకు
సరయువుప్రాంత నిశావేళ వేఁటఁ, దిరుగుచు మృగము లేతెంచుచక్కటికి
వీనుల దృష్టించి వెస శబ్దవేధు, లైనబాణము లేసి యుంటందఁ జంప
నీరుకందువనుండి నీకుమారుండు, నీరు నింపఁగఁ గుంభనినద మాలించి
యేనుఁగుతలఁపున నేసితిఁ గాన, నానతి నాకేమి యనఘ మీతనయు
ప్రాణముల్ గొనియె నాపటుబాణ మనినఁ, బ్రాణముల్ ఝల్లనఁ బడిమూర్ఛవోయి
నామునిపత్నియు హాపుత్ర యనుచు, భూమిపైఁ బడి రిత్తవోందునట్లున్న
నప్పుడే నడలుచు నల్లనఁ దెలుపఁ, దెప్పిరి వారు నాదెస మోము లెత్తి
యేలయ్య దశరథ యేల శోకాగ్ని, గ్రాలఁ మాతనయు నెక్కడ దాఁచితీవు
అడవులఁ దపసులై యంధులై యున్న, బడుగులఁ జంపి పాపముఁ గట్టుకొంటి
యడరి నీదగుబాణ మదరంటఁ గొన్నఁ, బడునప్పు డేమని పలికెనో కొడుకు
పాయనివేదనఁ బ్రాణముల్ విడిచి, పోయెనో విడువకఁ బొదలుచున్నాఁడో
మృతికైన నొండునిమిత్తంబు లేదె, యతిసుతుఁ డంట బాణముఁట చావువిధియు
బుడమి వానప్రస్థుఁ బొలియించె నేని, చెడునింద్రుఁడైనను జెడఁడె భూవిభుఁడు
అవనీశ మాపుత్రు నజ్ఞానబుద్ధి, తవిలి యేసితిగాని దగదు నిన్నలుగ
మాకుట్టిఁ జూడక మముఁ గొని క్రాలు, శోకాగ్నులారవు చూపవే వాని
నని యని శోకించు నాతపోధనులఁ, గొనిపోయి వీఁడె మీకొడుకనుటయును
వేఁడి పయోధారవిమలమానసుఁడు, వేఁడి తపోధనవిపులపుణ్యుండు

వేఁడి సుధీజనవితతవర్తనుఁడు, వేఁడి నిరంతరవేదశాస్త్రపరుఁడు
అనుచుఁ జేతులు చాచి యందంద వెదకి, తనయునిపైఁ బడి తల్లి శోకించి
తొడలపై నునిచి నెత్తుటఁ దోఁగియున్న. జడలలోఁ దలఁ జేర్చి సంతాపమంది
యోవిమలాత్మక యోయజ్ఞదత్త, యోవిశ్రుతాచార యోధర్మనిపుణ
యెందు నాతోడ నీవిటఁ జెప్పికాని, యెందునుబోవ వీ విదియేమి నేఁడు
నాకలోకమున కున్నతిఁ బోవుచుండి, నా కేల చెప్పవు నావంశతిలక
కడవఁజేసెడుపాపకర్మురాలైతి, నడురేయి నిగ్రహపడిని బొమ్మంటి
నేచినగురుభక్తి నెల్లలోకములఁ, గాచినకొడుకు నిక్కడఁ జంపుకొంటి
నాకేటితప మింక నాకు నీతోడి, లోకంబె కాకింక లోకైకవినుత
యెక్కడి నీప్రాణ మెక్కడిబాణ, మెక్కడ దశరథుం డెక్కడ నీవు
ఇన్నియు నొడఁగూర్చ నిటు నేఁడు గలిగి, నిన్నుఁ ద్రెక్కొనియెనా నీకర్మఫలము
అని తల్లి శోకింప నమ్మునీశ్వరుఁడు, తనయునిపైఁ బడి తద్దయు వగచి
నీవు నాకడ కతినిష్ఠతో వచ్చి, కావింతు ప్రీతిసత్కారముల్ తొల్లి
యేను నీకడ కిప్పు డేతెంచియున్న, నే నెయ్యములుసేయ విటు నీకుఁ దగునె
కొడుక నీనిర్మలగుణకలాపములు, వెడలెనే యీబాణనిపాతంబునందు
నెవ్వనిఁ జదివింతు నింక వేదములు, నెవ్వనిఁ జదివింతు నింక శాస్త్రములు
నెవ్వనిఁ వినిపింతు నింకధర్మములు, ఎవ్వని కెఱిఁగింతు నింకఁ గావ్యములు
ఫలములు జలములు పరికించి మాకు, నలయకుండఁగ నెవ్వ రరసి పెట్టెదరు
దీర్ఘాయువని నిన్ను దీవింతుఁగాని, నిర్ఘాతపటుబాణనిహతి వల్కితినె
జమునైనఁ బుత్రభిక్షము వేఁడుకొనెదఁ, గొమరార నచటికిఁ గొనిపోఁగదయ్య
పనివడి యెందును బరలోకవిధులు, తనయు లొనర్తురు తల్లిదండ్రులకుఁ
బరిపాటి దప్పించి పరలోకవిధులు, మరలించి విధి నీకు మముఁ జేయఁ బనిచె
నీకలదినములు నిష్ఠ పెంపొందఁ, జేకొని మమ్ము రక్షించితి వీవు
నీయట్టికొడుకును నిజముగాఁ బూని, యేయుగంబులఁ గందు నింక నే ననఘ
దురితదూరుఁడవు బంధురతపోనిధివి, గురుభక్తుఁడవు నీవు గురుభక్తియుతులఁ
బరలోకపరులార్యపరులు ధర్మైక, పరులెందు నిజశౌర్యపరులార్తిహరులు
అన్నదానాదిమహాదానపరులు, గన్నలోకంబులు గనుము నీ వనుచుఁ
గర మొప్ప నగ్నిసంస్కారాదివిధులు, తరమిడి చేసిరి తమతనూజునకు
నమరుఁడై యతఁ డంత నాకాశవీథి, నమరవిమానంబు నందుండి పలికె
ఓగురులార యేనుత్తమలోక, భోగభాగ్యుఁడనైతిఁ బుణ్యుండనైతి
కరమర్థి మిముఁ గొల్చుకతమున నాడు, మరణంబునకు మీరు మలఁగకుఁ డింక
నేకాల మేత్రోవ నేది గావలయు, నాకాల మాత్రోవ నది గాకపోదు
అయ్యెడుకార్యంబు లగుఁగాక మాన, వయ్య మీ రితనిపై నలుగకుఁ డనుచు
ననిమిషపురి కేఁగ నతఁ డంత వారు, తనయునిపైఁ గూర్మి ధరియింపలేక
పోయెద మే మిదె పుత్రశోకమున, మాయట్ల నీవును మరణంబునొందు

మని ఘోరమగుశాప మలిగి నా కిచ్చి, తనువులు విడిచి రత్నపసు లచ్చోట
నగ్నిసమానుల నాపుణ్యధనుల, కగ్నిసంస్కారాదు లట నేను జేసి
చేకొన్నవగల వచ్చితిఁ బురంబునకు, నాకర్మఫలమిదె యాసన్నమయ్యె
ధీరతచెడి బుద్ధి తిరుగుచున్నదియు, నోరెండఁ జొచ్చెఁ గన్నులు గానవయ్యెఁ
బలుకులు వినరావు ప్రాణంబు లిం·, నిలువ వీ యొడలిలో నిలుపంగలేను
నాపాలికల్పద్రు నాధీసముద్రు, నాపరాక్రమరుద్రు నాగుణోన్నిద్రు
నాభాగ్యపదభద్రు నారామభద్రు, శోభనగుణముద్రుఁ జూడలేనైతి

దశరథుండు ప్రాణముల విడుచుట

నీరాత్రితోఁగూడ నేఁడునా ళ్లయ్యె, శ్రీరాముఁ బాసి నాజీవ మెట్లుండు
నని ప్రలాపించుచు హారామరామ, యనుచు నంతనె మృతుండయ్యె నారాజు
వనటలఁ గుంది భూవరుఁడు నిద్రించె, నని తాను నిద్రించె నంతఁ గౌసల్య
పరికించి యంతఁ బ్రభాతమౌటయును, గరమర్థి వందిమాగధులు నుతింప
ద్వారకొని మంగళతూర్యముల్ మ్రోయఁ, బురినుండువారెల్ల గిరికొని వచ్చి
ధరణీశదర్శనోత్కంఠులై యుండ, నిరవొప్ప నేఁడేల యిన్నాళ్ల రీతి
ద్వార మేలుకొనఁ డంచు ద్వారకొన్నచింతఁ, బరిచారకులు వచ్చి పతిసెజ్జ డాసి
ధరణీశుఁ డున్నచందము పోలదనుచు, నురుభయంబును బొంది యూరుపు లలర
యడుగులు చేతులు నంటఁటి చూచి, యొడలఁ బ్రాణములు లేకునికి భావించి
యందఱుఁ బెలుచ మహారోదనంబు, లందంద సేయ దిగ్గన మేలుకాంచి
యదరి కౌసల్యయు నాసుమిత్రయును, బెదరి యందఱుఁ జూచి పృథివీశుఁ జూచి
హా యని యెలుగెత్తి హాప్రాణనాథ, పోయితే దశరథభూనాథ యనుచు
విలపింపఁ గైకేయి విని రాఁగఁ జూచి, పలుమాఱు గైకేయిపై మోదుకొనుచుఁ
గైక నీకోర్కులు కడముట్టె నేఁడు, కైకేయి కలఁచితే కాకుత్స్థకులము
నడవులపాలు గమ్మని రాముఁ ద్రోచి, నడికొర్చి దశరథేశ్వరుఁ జంపుకొంటి
నెలకొని యిటమీఁద నీవు నీసుతుఁడు, నిలయెల్లఁ గైకొని యెలమి భోగింపుఁ
డనుచు నాకౌసల్య యాదిగాసతులు, తనుఁ జేరికొని యేడ్వఁ దలవంచుకొనుచు
నలిఁదూలి చనుదెంచి నాథుపై వ్రాలి, పలుదెఱంగులఁ గైక పలవించుచుండె
నాసమయంబున నడలు దీపింపఁ, గౌసల్య దశరథుఁ గనువిచ్చి చూచి
ధరణీశ నీయట్టి ధర్మస్వరూప,చరితున కీచావు సముకూరఁ దగునె
మోసపోయితి నిన్ను మదలింపలేక, నీసత్యసంపద నిన్నింత చేసెఁ
గడుకష్టమతియైన కైకేయిఁ జూచి, యడవికి రాముఁ బోనడచినపగపు
పరికించి నీ కేను బరిచర్య సేయ, భరియింపలేనైతిఁ బార్థివోత్తంస
నీయిచ్ఛలో నుండ నీపంపుఁ జేసి, పోయి సత్కీర్తులు పొందె రాఘవుఁడు
నెలకొన్నసత్యంబు నీవు పాటించి, బలసి నిలింపసంపదలు గైకొంటి
ధరణీశ నాకు నుత్తముఁడైననిన్నుఁ, బరుసంబులాడినఁ బాపంబు దక్క
నని చాలఁ బలవింప నాసుమిత్రాది,వనితలు గొంతెత్తి వాపోవుచుండ

నంతట నీవార్త లందంద ప్రాకె, గాంతలయేడ్పు లాకసమెల్ల నిండె
నంత సూర్యోదయంబయ్యె నా నాటి [illegible] భయముతో హితులు బాంధవులు
చేరువ నృపులు వసిష్ఠాదిమునులు, ధారుణీసురులు ప్రధానులు వచ్చి
భూరిశోకంబునఁ బొగులువసిష్ఠుఁ, డారూఢగతిమంతు నసుమతిఁ బడసి
తడయక దశరథధరణీశు మేను, గడఁకతోఁ దైలపక్వంబు సేయించి
చెలువైనమణిమయసింహాసనమునఁ, గొలువున్న తెఱఁగునఁ గూర్చుండఁబెట్టి
మంత్రులు సకలసామంతులు రాజ్యతంత్రజ్ఞులను గూర్చి తగవునఁ బలికె
నీరాజు సామ్రాజ్యమెల్లఁ బాలించి, స్వారాజునగరికిఁ జనియె నేఁడకట
ఇతనిపూనికఁదీర్ప సంతతియుఁ బాసె, హితమిత్రియై రాముఁ డేఁగెఁ గాననకు
భరతుండు తమమామపట్టణంబునకు, నరిగె శత్రుఘ్నసహాయుఁడై మున్నె
మనము రామునిఁ బిల్వ మరలిరాఁ డతఁడు, తనపూనికిఁ దీర్పఁ ధర్మవర్ధనుఁడు
కావున భరతు వేగమె పిలిపింపఁ, గావలయును రాజ్యకార్యముల్ దీర్ప
రాజు లేకున్నఁ బురంబు రాష్ట్రంబు, రాజిల్ల దెల్ల వర్ణంబులుఁ గలయ
దండనీతిక్రియల్ దానధర్మములు, మొండోడి చెడిపోవు మింతురు రిపులు
జారులు చోరులు సందడింపుదురు, కోరి నొంతురు సాధుకోటి దుర్జనులు
దొరలు సామంతులు దుర్గాధిపతులు, నరిది కప్పము లియ్య రని నిశ్చయించి
అలఘుమానసుఁడు జయంతుండు మొదలు, నలుగురుమంత్రులు నయబుద్ధిఁ బిలిచి
పలువన్నెచీర లాభరణముల్ గొనుచుఁ, బొలుచు గిరివ్రజపురమున కేఁగి
ఈవార్త లాతని కేమియుఁ దెలుపఁ, గావసిష్ఠుండు రమ్మనె మి మ్మటంచుఁ
గడువేగ భరతు నక్కడ నుండనీక, తోడుకొని రమ్మన్నఁ దోడ్తెంపుఁగడఁక
వారలు హరులు దువాళిగా నెక్కి, సారె నానాపురజనపదంబులను
నదములు నదులు కాననములు గిరులు, పొదలు పెక్కులు దాఁటి పొదలినధాటి
కరము చెన్నొందఁ గేకయరాజపురికి, నరుగ వారంత నేడవనాఁటిరాత్రి
బలమేది గోమయపంకమధ్యమునఁ, దల విరియఁగఁ బోసి తండ్రి గూలుటయు
జలనిధి శూన్యమై సంపూర్ణచంద్రుఁ, డిలఁ గూలుటయుఁ బట్టపేనుంగుకొమ్ము
విఱుగుట మొదలైనవిషమంపుఁగలలు, తలుచుగాఁ గని లేచి తద్దయు భీతి
తనయిష్టసఖులతోఁ దత్ప్రకారంబు, వినుపించి వగలమై వెనుఁబడుచున్న
భరతుసన్నిధి కేఁగి ప్రణమిల్లి నిలిచి, కరమర్థిఁ దమచేతకానుక లిచ్చి
యావసిష్ఠుఁడు కార్య మక్కడఁ గలిగి, దేవ మిమ్మిట తోడితెమ్మన్న వాఁడు
విచ్చేయుమనవుడు వెస దూతచేష్ట, లచ్చుగాఁ గనుఁగొని యతిభీతినొంది
తనమామకడ కేఁగి తత్ప్రకారంబు, క్రమమొప్పఁ దెలిపి సత్కారముల్వడసి

భరతుఁ డయోధ్యకు వచ్చుట

యతఁ డంపఁ గదలి రథారూఢుఁ డగుచుఁ, జతురంగబలములు సచివు లేతేర
నతులితచింత నేడవనాఁడు వచ్చి, యతిరయంబున నయోధ్యాపురిఁ జొచ్చి
పతిలేనిసతి నిశాపతిలేనిరాత్రి, గతి నెంతయును భోగకళలకుఁ బాసి

కన్నుల కాపురి కడు వాడుపాటే, యున్న చందము చూచి యుల్లంబు గలఁగి
యిదియేమివిధమొకో యీపట్టణంబు, తుదముట్ట శూన్యమై తోఁచుచున్నదియుఁ
బౌరులు నన్నుఁ జూచి బాష్పము ల్దొరుగఁ, దూఱుచు దవ్వులఁ దొలఁగిపోయెదరు
అంగళ్ల సకలసామగ్రివస్తువులు, పొంగార వేటికి పురములో ననుచు
నగరివాకిట సమున్నతి రథంబు డిగి, మొగిచెడి తాను దమ్ముఁడు శూన్యమైన
యంతఃపురంబున కరుగఁ గైకేయి, యెంతయుఁ బ్రియముతో నెదురుగావచ్చి
కౌఁగిలించుటయును గరమర్థిఁ గైక, కవిరళభక్తితో నప్పుడు మ్రొక్కి
యిచ్చమైఁ దమమామ యిచ్చినతొడవు, లిచ్చి వారలసేమ మేర్పడఁ జెప్పి
యెంతయు శూన్యమై యిది యేమి నగరు, వింతయై యున్నది విభవంబు దఱఁగి
రామలక్ష్మణులకు రాజవర్యునకు, సేమమే యనవుడు చింతించి కైక
భరతునిఁ జూచి సంభ్రమము రెట్టింప, దరహాసవదనయై తగ వేది పలికెఁ
దలఁకొని తొల్లి మీతండ్రి నాకర్థి, వలనుమీఱఁగ రెండువరము లిచ్చుటయు
నొకటికి భరతుని నుర్వి నేలింప, నొకటికి రఘురాము ననుపఁ గానలకు
నని వేఁడుటయుఁ దండ్రియానతిఁ బూని, జనకజాలక్ష్మణసహితుఁడై మునుల
యనువున రఘురాముఁ డడవికిఁ బోయెఁ, దనయుని నెడఁబాసి ధరణీశుఁ డీల్గె
నీసున నీకుఁగా నీయుపాయంబు, చేసితి రాజ్యంబు చేకొను మింకఁ
బ్రజలఁ బాలింపు సంపదలఁ దేలింపు, భుజశక్తి నేలుము బుద్ధి నొం డనక
ననవుడు మూర్ఛిల్లి యవనిపైఁ ద్రెళ్లి, ఘనరోషదృష్టిమైఁ గైకేయిఁ జూచి
కైక నాతల్లివై కరుణకుఁ బాసి, యీకష్టవర్తన మేల కైకొంటి
మునివేషమున వనంబున రాము నుండు, మని పల్క నెట్లు నోరాడెనే తల్లి
యరయ నిర్మలధర్మ లైనరాఘవుల, చరితంబు నీకు విచారింపఁ దగదె
యేనింక మాతండ్రి కేమని వగతు, నేను రాముని మొగం బెటువలెఁ జూతు
నెంత లోఁగుందెనో యిచ్చలో రాముఁ, డెంత కోపించెనో యేచి లక్ష్మణుఁడు
యెంత దూఱెనో కాన కేఁగుచో సీత, యింత కేమయ్యెనో యింతి కౌసల్య
యంతఃపురాంగన లాసుమిత్త్రయును, వంతచే నేమని వగచుచున్నారొ
వీరలకడ కేఁగి విలపింప నాకు, నోరెద్ది యెట్లు మనోవ్యథఁ దీర్తు
నింక నీపుర మేల యీభోగ మేల, శంకింప కడవి యే శరణంబు నాకు
ఘనపాపరతిఁ జేసి కడఁగి మీతల్లి, నిను నొక్క రక్కసునికిఁ గననోపుఁ
గాని కేకయరాజుఁ గన్న కూఁతురవు, గానేర వేమందుఁ గైక నీతోడ
ననుమాటలన్నియు నల్లనఁ బొంచి, వినుచున్న మంథర వెసఁ జూచి ప్రజలు
ఇన్ని పాపంబులు నిదియ చేయించె, నన్న శత్రుఘ్నుఁడు నావృద్ధవనిత
గూనుడొంకులు దీఱ గ్రొమ్ముడి జాఱ, మేనిసొమ్ములు వీడ మెలఁతలు చూడ
కడకాలఁ బట్టి యాకసమునఁ ద్రిప్పి, పుడమిపై వ్రేసె నప్పుడు చాల నలిగి
కైకేయిసతులెల్ల కనుకని చెదరఁ, గైకను వధియింపఁ గడఁగిన నంత
భరతుండు చూచి యీపాపాత్మురాలిఁ, బొరిగొని పాపంబుఁ బొంద నేమిటికి

పెనువేది తల్లిఁజంపిన నీచులనుచు, మనలఁ జూడఁగ రోయు మది రామవిభుఁడు
అటుగాన వలదని యతని వారించి, యటు పోయి కౌసల్యయడుగుల కెఱఁగి

భరతుఁడు కౌసల్యయొద్దకుఁ బోవుట

తాను దమ్ముఁడు శోకదందహ్యమాన, మానసులై పలుమాఱు నెలుఁగెత్తి
పలవింప నప్పుడా భరతునిఁ జూచి, యలిగి కౌసల్య యిట్లని దూఱి పలికెఁ
బతిఁబాసి సుతుఁబాసి బహువిధదుఃఖముల, మతి మాఱు శోకింప మఱిఁ దగుఁగాక
నీకేల శోకింప నెలకొని యింత, నీకోరినట్లెల్ల నీతల్లి చేసె
నన్ను నీవింక రాజ్యము సేయుచుండు, మన్నఁ జేతులు మోడ్చి యతఁడు భీతిల్లి
వెనువెన్క దిగియ నవ్వేలఁది కౌసల్యఁ, గనుఁగొని వాక్కాయకర్మచిత్తముల
శ్రీరామునకుఁ గీడుఁ జేసితినేని, ధారుణి నేనేలఁ దలఁచితినేని
నేను గైకతలంపు నెఱిఁగితినేని, నే నొకకీడైన నెఱిఁగితినేని
వినుము మద్యంబుద్రావినవానిగతికిఁ, బెనుపేదవిప్రుఁ జంపినవానిగతికిఁ
డెగి గురుపత్నిఁ బొందినవానిగతికి, జగతిపైఁ దానోడిచనువానిగతికి
చెనఁటియై పసిఁడి ముచ్చిలువానిగతికి, నెనసి గోహత్య చేసినవానిగతికి
న్యాయంబుదప్పిన నరనాథుగతికి, నేయెడఁ గొండెగాఁ డేగెడుగతికి
శరణార్థుఁ బ్రోవనిదురితాత్ముగతికి, పరధర్మవిక్రయవాంఛితుగతికి
గురువులఁ దిట్టిన కుటిలాత్ముగతికి, నరయ స్వామిద్రోహి యగువానిగతికిఁ
దల్లిదండ్రులఁ దిట్టుతనయునిగతికిఁ, గల్లలాడెడు పాపకర్మునిగతికిఁ
బరధనంబుల కాసపడువానిగతికిఁ, బరసతిఁ గలసినపాపాత్ముగతికిఁ
దనర నధర్మవర్తనుఁ డేగుగతికిఁ, జనువాఁడ నిందుకు సాక్షి దేవతలు
నాపాపమునఁజేసి నాకు నీపాప, మీపాపకర్మురా లిటుచేసెఁగాక
యేను రాముని కేల యెగ్గు గావింతు, నీనీచకర్మంబు లేడ నేనేడ
నని యేడ్చుభరతు శోకాగ్నులపెంపుఁ, గనుఁగొని కౌసల్య కడుభీతిఁ బొంది
యిటువంటిపుణ్యాత్ము నేల దూఱితిని, గటకటాయని పొక్కి కౌఁగిటఁ జేర్చి
భరతుశత్రుఘ్నులపై వ్రాలి తూలి, పరితాపమొందుచుఁ బలవించుచుండె
నంత వసిష్ఠసంయమి వారిఁ గొనుచు, నంతఃపురంబున కడలుచుఁ బోవఁ
గనుఁగొనఁగారాదు కైకేయిగన్న, తనయుండు వీఁడని తనమీఁద నలిగి
పెనుపొంద మాణిక్యపీఠిపై నొఱగి, తనుఁ జూడనొల్లని తలఁపున రోసి
కనుఁగవమూసినగతి నున్నతండ్రిఁ, గనుఁగొని భరతుండు కడుమూర్ఛఁబొంది
తెలిసి క్రమ్మఱఁజూచి తీవ్రంపువగల, వెలువరింపఁగరాక విలపింపఁ దొడఁగె
వసుధేశ కేకయావనిపాలుచేత, నసమానమణిభూషణావళి నీకుఁ
గొనివచ్చినాఁడఁ గైకొన నొల్లవేమి, ననుఁ జూడ వదియేమి నాతప్పులేమి
కడుఁబాపమతియైన కైకేయిగన్న, కొడుకని ననుఁ జూడఁగూడదో కాక
ధరణీశ యాసుమిత్రాపుత్రుఁ జూడు, పురపురఁ బొక్కుచుఁ బొరలుచున్నాఁడు
కడఁగి నీహస్తపంకజములఁ బట్టి, తుడువ వేమిటికి శత్రుఘ్నుపై ధూళి

నీతనిఁ గటాక్షింపు మితనితోఁ బల్కు, మితనిఁ గౌఁగిటఁ జేర్చు మితఁడేమిచేసె
నీమంచితనమును నీదయారసము, నీమొగమోటము నేఁడెందుఁ బోయెఁ
గైకేయి నీబుద్ధి గలఁచెనే తండ్రి, నీకీర్తిమఱకంబు నేర్చెనే కలుగఁ
జావరే నృపులెందుఁ జత్తురు కాక, లేవు కా కిట్టివి లేవుగా యెందుఁ
బడఁతులు మెప్పించి ప్రాణవల్లభుల, నడుగరె యీయీవు లడుగరు కాక
యీకష్టవర్తనం బేమిటఁ గడతుఁ, జేకూరె నికనేమి సేయుదు ననుచుఁ
బలుమాఱు విలపించు భరతునిఁ జూచి, తెలిసి వసిష్ఠుండు తెఱఁగొప్పఁ బలికె
అనఘాత్మ మీతండ్రి యవనినంతయును, వినుతింప నఱువదివేలేడు లేలె
మనుమార్గనియతి ధర్మములెల్లఁ జేసె, గొనకొని మీయట్టికొడుకులఁ గనియెఁ
గావున నీవు శోకము మానుమింకఁ, గావింపు మగ్నిసంస్కారాదివిధుల
ననవుడు నౌఁగాక యని మఱునాఁడు, మునుల రాజుల మహాత్ములఁ బిలిపించి
వలనొప్ప దశరథేశ్వరుకళేబరము, కలఁగొని తీర్థోదకము లార్చి తెచ్చి
వరవస్త్రభూషణావళులఁ గై సేసి, తరమిడి వేదోక్తదానముల్ సేసి
పరఁగ విమానంబుపైఁ దెచ్చి పెట్టి, యరుదైన మంత్రపూతాగ్నిఁ జేపట్టి
తనతమ్ముఁడును దాను దగ వసిష్ఠాది, మునులతో భరతుండు ముందఱ నడువ
నావిమానమునకు నందందఁ గదిసి, వావిరి యేడ్చుచు వగలఁ దూలుచును
మునుకొని కౌసల్య మొదలుగాఁగలుగు, వనితలందఱుఁ గూడి వరుస నేతేర
సరయువుచేరువ శవభూమియందుఁ, దిరముగా సొదఁ బేర్చి త్రేతాగ్ను లునిచి
యొలసినభక్తి వేదోక్తమార్గమున, నెలకొని దశరథనృపతి దహించి
తగురీతి మఱి తిలోదకములు వోసి, తగవుతోఁ బిండప్రదానముల్ సేసి
నగరికి వచ్చి యున్నతి భూసురులకుఁ, దగఁ బితృప్రీతిగా దానముల్ సేసి
తెఱఁగొప్పఁ బండ్రెండుదినములు వలయు, తెఱఁగుల నడిపి వర్తించుచో నంతఁ
గొనకొని యిక్ష్వాకుకులగురుండైన, మునివసిష్ఠుఁడు కార్యములు విచారించి
తాను రాజన్యులు తగుమంత్రివరులు, భానుసన్నిభతేజు భరతునిఁ జూచి
వరతేజ మీతండ్రి పరలోకమునకు, నరిగె శ్రీరాముఁడు నరిగెఁ గానలకు
నుర్వికి రాజు లేకున్న కార్యములు, నిర్వహింపఁగరాదు నిల్వరు ప్రజలు
ధారుణి చలియించు ధర్మంబు లణఁగు, వైరులు మింతురు వర్ణము ల్గలియు
నవని యరాజకమై యుండఁ దగదు, ప్రవిమలమతి నీవు పట్టంబుఁ బూను
మని బుద్ధిచెప్పిన నమ్మునినాథుఁ, గనుఁగొని భరతుండు కరములు మొగిచి
యిదియేమి మునినాథ యింతమూఢుఁడనె, మదినింతయెఱుఁగనె మాకులక్రమము
నన్నుఁ గావలఁద్రోచి యక్కటా నన్నుఁ,గన్నతండ్రినిఁ జంపెఁ గడఁగి మాతల్లి
యింత చాలదె నాకు నింక రాజ్యంబు, చింతింతునే యేను చెప్పకు మింకఁ
గైకేయికొడుకని కడఁగి పల్కెదవు, గాక యీతలఁపులు గలవె నాయందు
నిట్లున్నరూపున నేను మారాము, పట్టంబు గట్టెదఁ బ్రార్థించి తెచ్చి
కాకున్న మాయన్న గైకొన్ననియతిఁ, గైకొందుగా కొండు గలుగునే మాకు

### భరతుఁడు రామునివద్దికిఁ బోవుట

నని నిశ్చయముచేసి యపుడు మంత్రులను, గనుఁగొని మాయన్నఁ గానఁబోవలయు
తెరువులు చక్కఁగా దిద్దింపుఁ డఖిల, పురజనులకు నేగఁ బొసఁగినరీతి
నెడనెడ విడుదు లనేకవస్తువులు, కడుసమగ్రములుగాఁ గావింపుఁ డనిన
ననుకూలమతి వార లట్ల చేయించి, రనుపమోత్సాహులై యమ్మఱునాఁడు
వందిమాగధులును వరమంత్రివరులు, సుందరీనటనర్తసుకుమారవరులు
నవసహస్రములు దంతావళఘటలు, జవనాశ్వకోటి లక్షయు శతాంగములు
నఱువదిలక్షలు నమితపదాతి, తఱచుగా నడువ నత్తఱిఁ బౌరజనుల
జనపదస్థుల నెల్లజాతులవారి, ధనరత్నరాసులు తగ వసిష్ఠాది
మునుల రాజుల మంత్రిముఖ్యులఁగొనుచుఁ, దనతమ్ముఁడును దాను దల్లులందఱున
ననువుగాఁ జతురంతయానంబు లెక్కి, వెనుక రా భరతుఁ డవ్విధమునఁ గదలి
పోయి గంగాతీరమున దండువిడియ, నాయతభుజశీలుఁ డగుగుహుం డెఱిఁగి
కడఁగి రామునిమీఁదఁ గైకేయికొడుకు, నడచుచున్నాఁడు సేనలతోడ ననుచు
సలవుమైఁ గోపించి నావ లాగించి, బలములతో వచ్చి భరతున కనియె
భరత రాముఁడు రాజ్యపదము నీకిచ్చి, యరుదుగా మునివృత్తి నడవుల నుండ
నీవు సేనలఁ గూడి నిజశక్తి మెఱసి, పోవుచున్నాఁడవు పోలునే నీకు
నేను రామునిబంట నేనంప నిన్నుఁ, బోనీను నీబలంబుల సంహరింతు
నడరి నీతోడఁ బోరాడి ప్రాణములు, విడిచిన మఱి రామవిభునిపైఁ బొమ్ము
అని రోషమున గుహుఁ డాడువాక్యములు, విని భరతుఁడు నవ్వి విమలుఁడై పలికెఁ
బరమాత్ముఁ డగురాముఁ బ్రార్థించి తెచ్చి, పరఁగ నయోధ్యకుఁ బట్టంబుగట్టఁ
బోవుచున్నాఁడ నాబుద్ధిలో నొండు, భావించి నీవిట్లు పలుకంగవలదు
అని పల్కనాతని నక్కునఁ జేర్చి, తనమది పొగుల నాతనిచిత్త మెఱిఁగి
యనురక్తి భరతేశునడుగులకెఱఁగి, యనుపమవన్యంబులైనవస్తువులు
కని దనియఁగఁ బెక్కుకానుక లిచ్చి, కొనిపోయి గుహుఁడు కాకుత్స్థుండు తొల్లి
విడిసినచోటున విడిచి సంప్రీతి, జడలుగట్టినచోటు చనిచని చూప
జనులును మునులును సచివులు దానుఁ, గనుఁగొని భరతుండు కడుశోకమంది
సీతరాముండును జేరి పరుండ, నాతతతృణశయ్యలందుఁ గన్పడెడు
తఱుచైన కనకవస్త్రములచిహ్నములు, పొరిఁ గనుఁగొని మదిఁ బురపురఁ బొక్కి
ఘనశోకమునుబొంది కడుదీనుఁ డగుచు, మునురాఘవుఁడు జటల్ మొనసిధరించె
నెక్కడ నని భరతేశ్వరుం డప్పు, డక్కడకేమును ననువుగా జటలు
పనుపుచు మఱి మఱ్ఱిపాలు దెప్పించి, తనతమ్ముఁడును దాను ధరియించె జడలు
భరతుండు మఱునాఁడు బ్రాహ్మికకర్మ, పరుఁడునై గుహుఁడు రాఁ బన్నించినట్టి
యేనూఱుబలునావ లెక్కి వేర్వేఱఁ, దానుఁ దల్లులు మునుల్ తగ మంత్రివరులు
సకలసేనలుఁగూడ జాహ్నవిదాఁటి, యకళంకుఁ డగుగుహు నపుడు తోడ్కొనుచు
నతఁడు చూపిన త్రోవ నటఁ బోయిపోయి, క్రతుహోమతతధూమకబళితవ్యోమ

కృతకాంబుదస్తోమ కేవల ముదిత, కృతలాస్య విపినబర్హిణబర్హజాల
రచితాంతరాంతరరత్న విచిత్ర, ఖచితతోరణసక్రమమునై యొప్పు
నాభరద్వాజసంయమియాశ్రమమున, కాభరతుఁడు పోయి యనతిదూరమునఁ
జతురంగబలములఁ జతురత నిలిపి, యతులపుణ్యాత్మకుం డగుభరద్వాజుఁ
గని భక్తితో నమస్కారముల్సేయఁ, గని యమ్మహాముని కడు నల్గి పలికె
భరత యీచతురంగబలములఁ గొనుచు, భరితసన్నాహసంభ్రముఁడవై నీవు
కడుశాంతవృత్తి రాఘవుఁ డరణ్యములఁ, బడియుండ నాతనిపైఁ బోవ నేల
ననుచున్న మునికోపమంతయు నెఱిఁగి, వినతుఁడై భరతుండు వెఱచుచుఁ బలికె
జానకీవల్లభ సకల రాజ్యంబు, పూనుము నీవని పోయెదఁగాని
యొండుభావమునఁ బోనో మునినాథ, యొండుగాఁ దలఁపకు ముల్లంబులోన
ననిన సంతోషించి యమ్ముని పలికె, ననఘాత్మ నీవు నీయఖిలసైన్యమును
మనమార నాయాశ్రమమున నేఁడుండి, వినుతి మే మొనరించు విం దారగింపు
మని విశ్వకర్మను నటకు రప్పించి, ఘనచిత్రపురి యొండు గల్పించి యందు

భరతుఁడు భరద్వాజాశ్రమంబుఁ జేరుట

వారువీరన కెల్లవారికిఁ దగిన, మేడలనిండ్లు నిర్మింపు మీ వనిన
నైదుయోజనముల నతఁ డొక్కపురము, భూదేవిచరణనూపురము నిర్మించె
నందుఁ గాంచనమయం బొనొక్క రాజమందిరం బమరెఁ దన్మందిరంబునను
శ్వేతాతపత్రోరుసింహాసనమునఁ, జాతురి నొకసభాసదన మింపొందె
నప్పుడు మునియాజ్ఞ నట భరతుండు, విప్రైనగృహము ప్రవేశించి యందు
సింహాసనముగాంచి శ్రీరామనృపతి, సింహాసనం బంచుఁ జేతులు మొగిచి
యాసమీపంబున నపు డొక్కపీఠి, నాసీనుఁడై మిత్రులందఱుఁ గొలువ
నున్నచో మునియాజ్ఞ నొక్కట వచ్చి, కిన్నరగంధర్వఖేచరాంగనలు
నచ్చట నచ్చర లాటలుపాట, లచ్చెరువుగఁ జూపి రతనిసన్నిధిని
నీరీతి సకలజనావళియిండ్ల, నారూఢి వెలసె నాట్యప్రసంగములు
నిలమీఁద దివిమీఁద నేయేవిశేషములు కలవన్నియు మునియాజ్ఞ వచ్చె
జానపదు ల్పౌరజనములందఱును, స్నానముల్ కావించి చలువలుగట్టి
మందారపుష్పదామంబులు పూని, చందనంబలఁది భూషణములు పెట్టి
వేవేల తెఱఁగుల వింతగా వేల్పు, టావు చతుర్విధాహారంబు లొసఁగఁ
బరితృప్తులై దివ్యభామలు దమకు, సురతవిశేషముల్ సొక్కుచుఁ దెలుప
జన్మసాఫల్యంబు సమకూరె ననుచుఁ, దన్మయావస్థలఁ దగిలి క్రీడింప
నమ్మునియాశ్రమం బటుచూడ నొప్పె, నిమ్ముల నాస్వర్గ మేవగించుచును
ఈరీతి భరతేశుఁ డెల్లసైన్యములు, నాఋషిఁ బొగడుచు నారాత్రి దీర్చి
మఱునాఁడు పురము తన్మందిరావళులు, తెఱఁగంటిచెలులు నదృశ్యమౌటయును
భరతుఁ డత్యాశ్చర్యభరితుఁడై యుండి, వరతపోనిధి భరద్వాజునిఁ జేరి
ప్రణమిల్లి మీతపోబలమహత్త్వములు, ప్రణుతింపఁదరమె యాపరమేష్ఠికైన

నేనింక రఘురాము నినకోటిధాముఁ, గానఁ బోయెద నంచుఁ గన్నతల్లులను
నవ్వేళ మ్రొక్కించు నతఁడు మీ రెవ్వ, రెవ్వరు వేర్వేఱ నెఱిఁగింపు మనుఁడు
ధీరాత్మ నృపుపెద్దదేవులై యెల్ల, వారిలో వాసియు వన్నెయుఁ గాంచి
కడుపుచల్లఁగ రాముఁ గాంచియు వగల, సుడుకుచున్నది తద్వియోగాగ్నిశిఖలఁ
బరిచితజన్మసాఫల్య కౌసల్య, పరికింపు మిదె మునిపతిసార్వభౌమ
కౌసల్యసతివామకరమంటఁబట్టి, కైసేఁతలుడిపోయి గతపుష్పకర్ణి
కారశాఖయుఁబోలి కైవ్రాలియున్న, యీరామ శ్రీరాము నెడఁబాయలేని
యాలక్ష్మణునిఁ గన్న యట్టిపుణ్యాత్మ, రాలు సుమిత్ర పరాకు మునీంద్ర
యేతల్లికై కాన కేఁగె మాయన్న, యేతల్లికతమున నీల్గె మాతండ్రి
యేతల్లికోర్కి నన్నింతకుఁ దెచ్చె, నీతల్లి మాతల్లి హితపుణ్యపాక
కైక గన్గొనుమంచు గద్గదకంఠుఁ, డై కడపట శోకమగ్గలం బైన
నూరక యున్నచో నూరార్చి యతని, నాఋషి భావికార్యముఁ జూచి పలికె
నీకైక లోకైకహితము గావించె, మీకెల్ల తెల్ల మీమీఁద నౌననుచు
మఱి రాముఁ డున్నట్టిమార్గంబు దెలిపి, తెఱఁగొప్పనమ్మౌని దీవింప వెడలె
సింధురబృంహితసేనానులాప, సైంధవహేషితస్యందననేమి
రవములకలికి యరణ్యమృగాళి, తివిరినభీతి నద్దెసలకుఁ బాఱ
బలరణోద్ధూతవిపాంసుసంఘాత, మలినీకృతాదిత్యమండలుం డగుచు
నాచిత్రకూటాద్రి కర్థితో భరతుఁ, డేచి సేనలుఁదాను నేఁగుచో నంత
నటఁ జిత్రకూటాద్రియందు రాఘవుఁడు, కుటిలకుంతలసీత గూడి మోదమున
గనుఁగొంటివే యన్నగంబు బింబోష్ఠి, కనుదమ్ములకు విందుగావించె మనకు
నిన్నగమహిమఁ దా నెన్నఁగ వశమె, పన్నగపతికైన భామాలలామ
గుఱుతైన సెలయేటిఘుమఘుమధ్వనులు, ఉఱుము లటంచుఁ బెల్లుబ్బి నీకురులు
పురుడింపఁ దనగొప్పపురివిచ్చి నెమలి, పొరిఁబొరి యాడెడుఁ బూఁబోణి చూడ
కాంతరో యీచెంచుకాంతల కంటె, దంతికుంభంబులు తమచన్నుఁగవకు
నెనవచ్చునెట్లని యిభకుంభదళన, మొనరించి తన్మణులొప్పఁ దాల్చెదరు
దివ్యులసంకేతదేశంబుగాన, దివ్యవాసనలు సంధించె నీకోన
పదతలాలక్తకభాసురంబైన, పొగఁ జూడ గంధర్వభోగగేహంబు
కిన్నరకంఠి యీగిరిగహ్వరంబు, కిన్నరకిన్నరీగీతసద్గోష్ఠి
కలకంఠరవసహకారపల్లవము, కలకంఠి యీసహకారంబుఁ జూడు
పరిపరివిధముతోఁ బరువంపువిరుల, పరిమళంబులు గదంబముగఁ గూర్చుచును
మలయానిలుండు కోమలయానలీల, మలయుచున్నాఁ డిదె మనపైన నబల
యల్లదె చూచితె హల్లకనికర, ఫుల్లకైరవకుంజపుంజరంజితము
సాలతమాలరసాలతక్కోల, తాళహింతాలకుద్దాలకూలములు
అమలినపులినమధ్యాసనాసీన, సముచితమునిబృందసందీప్తమైన
మందాకినీనదిమణికన్నులలరె, మందయాన విలాసమథితమరాళ

యనియని పలుకుచు నవనీరుహాములఁ, గనుపట్టుబొదరిండ్ల ఘనకందరముల
శైలశృంగంబుల సానుదేశముల, నోలి వినోదించుచున్నచోఁ గడఁగి
బలువిడి చనుదెంచుభరతసైన్యముల, కలకలస్వనము లాకర్ణించి బిట్టు
కలఁగి నల్గడఁ బాఱు కరివరాహాది, బలుమృగంబులఁ జూచి బలధూళిఁ జూచి
యిట ధూళి దివిఁ బర్వ నేమికారణమొ,యటఁ బోయి యరసిరమ్మనిన లక్ష్మణుఁడు
వేవేగ నొకమహావృక్షాగ్ర మెక్కి, భావించి యుత్తరభాగంబునందు
బలములఁ బొడగాంచి భానువంశజుల, బలుబిరుదులతోడఁ బడగలు గాంచి
యిచ్చలో భరతేశుఁ డిట రాముమీఁద, వచ్చుచున్నాఁ డని వడి నిశ్చయించి
పటువజ్రమద్రిపైఁ బడుభంగి దోఁప, జటులసత్త్వమున వృక్షము డిగ్గనుఱికి
వారక రోషదుర్వారుఁడై వచ్చి, యారామవిభుఁ జూచి యనియె లక్ష్మణుఁడు
అడవికి నిన్నుఁబోనడచి నీరాజ్య, మడరి యంతయుఁ గొని యంతటఁ బోక
ఘనశక్తి నీమీఁదఁ గై[illegible], చనుదెంచుచున్నాఁడు సబలుఁడై నేఁడు
యదెచూడు కో[illegible]ధ్వజంబు, లదె చూడు భటులవీరాలాపములును
శరచాపకవచముల్ సరి పూని నీవు, భరతుని కెదురుగా బలువిడి నడువు
నిలువుము కాదేని నీవు సీతయును, దొలఁగుము నీశాంతి తుది నింతఁజేసె
నేనింక సైరింప నిట వచ్చెనేని, వీనిఁ జంపెదనన్న విని రాముఁ డనియె
నాకుఁ దమ్ముఁడవయ్యు నాతోడఁ బుట్టి, నీకిట్టియవినీతి నేఁడేల పుట్టె
భ్రాతృవత్సలమూర్తి పరమపావనుఁడు, నీతికోవిదుఁడు మానితధర్మపరుఁడు
భరతుండు నీకంటె భక్తుండు నాకు, భరతునిదెస నొక్కపాపంబు లేదు
మనల నయోధ్యకు మగుడఁ బ్రార్థింపఁ, జనుదెంచుచున్నాఁడు సందేహ ముడుగు
కడవకు మనుఁడు రాఘవునాజ్ఞ పెంపు, కడవ భీతిల్లి లక్ష్మణుఁ డూరకుండె
భరతేశుఁ డంతటఁ బౌరులహితుల, దొరల సమస్తయోధుల నొక్కచోట
విడియించి తల్లులు వెనుకఁ దోడ్తేర, గడక వసిష్ఠునిఁ గట్టడచేసి
గురుభక్తి సూతుండు గుహుఁడు తోడుగను, నరిగి తమ్ముఁడుఁ దాను నగ్గిరి నెక్కి
వరుస నయ్యడవి త్రోవలు తెలియుటకుఁ,గరమర్థి సౌమిత్రి గట్టినయట్టి
గుఱుతులు కొన్ని కన్గొనుచు నల్గడల, నెఱిఁ బరికించుచు నిఖిలాస్త్రశస్త్ర
జాలపాలితనూత్నశాలాంగణములఁ, జాలఁ జెన్నగు పర్ణశాల కేతెంచి

భరతుఁడు మునివేషధారులైనరామలక్ష్మణులఁ బొడగాంచుట

మునివేషమునఁ జాల మునమందురాముఁ,గను గొని యాత్మలోఁ గడఁగి శోకించెఁ
పొలుచు కాంచనగృహంబుల నుండువాఁడు, లలిదూలి పర్ణశాలల నున్నవాఁడు
పొగడొందు పూలపాన్పున నుండువాఁడు, జగతిపై బూరిసెజ్జను నున్నవాఁడు
నెఱసి కిరీటంబు నెఱిదాల్చువాఁడు, తఱచైనజడ లర్థిఁ దాల్చి యున్నాఁడు
నోలి రాజులు గొల్వ నుండెడివాఁడు, లోలత మృగములలో నున్నవాఁడు
మేలిచందనమును మెయిఁబూయువాఁడు, ధూళిధూసరితుఁడై తూలియున్నాఁడు
మొనసి దివ్యాంబరంబులు పూనువాఁడు, మునివృత్తి వల్కలంబులు గట్టినాఁడు

రసరసాన్నములను మెసవెడువాఁడు, కసరుఁగాయలఁ బ్రొద్దు గడపుచున్నాఁడు
చూచితే శత్రుఘ్న శుభమూర్తి రాముఁ, డీచందమున దుఃఖ మీఁదుచున్నాఁడు
నై కేయిపాపంపుఁగడుపునఁ బుట్టి, యీకష్టదుర్దశ నేఁ జూడఁగలిగె
ననుచుఁ దమ్ముఁడుఁ దాను నారామవిభునిఁ,గని మ్రొక్కుటయు వారిఁ గౌఁగిటఁజేర్చి
కన్నుల హర్షాశ్రుకణములు దొరుగ, వెన్నులు నివిరి భావించి దీవించె
అహిమాంశుకులునకు నాసుమంతుండు, గుహుఁడు మ్రొక్కిరి భక్తి గొనసాగనపుడు
ధరణిజకును సుమిత్రాతనూజునకు, భరతశత్రుఘ్నులు ప్రణమిల్లి కొలువఁ
గుశపీఠముల నిల్వఁగోరి రాఘవుఁడు, దశరథునేరుంబు తల్లులశుభము
పలుమాఱు నడుగుచు భరత నీవేల, యిలయేల కింతద వ్వేఁగుదెంచితివి
భూతలాధీశుపంపున రాజవగుచు, నీతితోఁ జేయుదే నీవు రాజ్యంబు
దశరథేశునకు సత్యప్రకాశునకు, విశదపుణ్యునకుఁ గావింతువే పూజ
తల్లులనెల్ల నాదర ముల్లసిల్ల, నుల్లంబు చల్లఁగా నూఱడింపుదువె
కోవిదు మత్కులగురు తపోనిష్ఠు, నావసిష్ఠు గరిష్ఠు నర్చించి నీవు
అగ్నిహోత్రముల సంధ్యాకాలనియతి, భగ్నంబుగాకుండఁ బాలింతె నీవు
సుజనులౌ మంత్రులచొప్పెల్లఁ దెలిసి, విజయంబు నామంత్రవిధి నెఱుంగుదువె
యపరరాత్రుల లేచి యర్థచింతనము, నిపుణతఁ జేయుదె నీవు నిత్యంబు
నరసి యుత్తమమధ్యమాధమజనుల, వెరవుతోఁ బనిగొందువే తగినట్లు
తనవారియెడనైన దగవునఁ దండ, మనురక్తిఁ జేయుదె యపరాధ మెఱిఁగి
మతిమంతు సకలసమ్మతు స్వామిహితుని, వితతవిక్రము సైన్యవిభుఁ జేసినావె
కొలిచినవారికిఁ గోరి జీతములు, నిలువఁ గాకుండ నిచ్చలు నొసంగుదువె
చారులవలన శాస్త్రములవర్తనము, వైరులతెఱఁగు సర్వము నెఱుంగుదువె
జాలిఁ దూలెడి పెదసాదలమొరలు, వాలాయముగ విందువా గర్వముడిగి
యర్మిలి వర్ణాశ్రమాచారవిహిత,ధర్మంబు లరయుదె తడఁబడకుండఁ
జోరుల జారుల సుడియంగనీక, వారల దండింతె వదలక పట్టి
చతురంగబలములసన్నాహపటిమ, నతియుక్తిఁ జూతువె యప్పటప్పటికి
ధనధాన్యవస్తుసద్భటసమేతముగ, మునుపుగాఁ గడిదుర్గముల నుంచినావె
యన్యాయములుసేసి యర్థముల్ గొనక, మాన్యతఁ బ్రోతువె మఱి కాపుజనుల
నర్థలోభమున విప్రాగ్రహారముల, నర్థమెత్తవు గదా యణువీసమైన
నెపుడు గోబ్రాహ్మణహితము గోరుచును, నిపుణుండవై ధర్మనిష్ఠ నుండుదువె
శక్తిత్రయంబును షడ్గుణంబులును, శక్తిపంచాంగముల్ చతురుపాయములు
పదునాల్గు రాజపాపంబులు దెలిసి, సదయుఁడై మనుధర్మశాస్త్రసంగతిని
దేవతాపితృమహీదేవతాపూజ, గావించి స్వర్గంబుఁ గాంచు భూవిభుఁడు
నీవును నారీతి నీతిరాజ్యంబు, గావింతువే యంచుఁ గాకుత్స్థుఁ డడుగఁ
గరములు మొగిచి గద్గదకంఠుఁ డగుచు, భరతుండు రామభూపతి కిట్టు లనియె
నీధర్మసరణి నాకేదియుఁ దెలియ, దోధర్మనిపుణ యింకొకవార్త వినుము

నృపకులాధీశ్వర నిన్నుఁ గానలకుఁ, గృపమాలి పిలిచి కైకేయి పొమ్మనినఁ
దడయక మీరిటు తాపసవృత్తి, నడవికి విచ్చేయ నదియాదిగాఁగ

### దశరథునిమృతి రామలక్ష్మణులు తెలియుట

వలతలఁ దూలి యేడవనాఁడు మిమ్ముఁ, దలఁచుచు మృతుఁడయ్యె దశరథేశ్వరుఁడు
ఏనును పితృమేధమెల్లను జేసి, కానల మీరుండఁ గానవచ్చితిని
అనుపల్కు నిర్ఘాతమై వచ్చి రాము, జనపతి మూర్ఛిల్లి జగతిపై వ్రాలె
మేదినీసుతయు సౌమిత్రియుఁ దూలి, మేదిని వ్రాలిరి మృతులైనపగిది
నొలసినధృతి రాముఁ [illegible] దెలిసి, పలుమాఱు విలపింప భరతుఁ డిట్లనియెఁ
గృతమతివయ్యుఁ బ్రాకృతునిచందమున, నతిశోకమును బొంద నగునయ్య నీకు
దేవ లక్ష్మణుఁడు వైదేహియు మీరు, వేవేగ దశరథోర్వీనాథునకిఁక
బరలోకవిధులెల్ల భక్తితోఁ జేయుఁ, డరయంగ నది యుక్త మనిన రాఘవుఁడు
మందాకినికి వచ్చి మది నిష్ఠ వెలయ, నందుఁ గృతస్నానుఁడై తండ్రి కపుడు
మొనసి తిలోదకములు వోసి పగలు, వెనఁగొన మఱి గారపిండిచేఁ బుణ్య
ధనుఁ డర్థిఁ బిండప్రదానముల్చేసి, ఘనతరశోకసంకలితుఁడై మగుడి
సన్నుతగతిఁ బర్ణశాల కేతెంచి, యున్నచో రఘురాముఁ డున్నసన్నిధికిఁ
బౌరవర్గముతోడ బంధులతోడఁ, జారువర్తనులైన సచివులతోడ
ఘనుఁడు వసిష్ఠుండు కౌసల్య మొదలు, జననులఁ దోడ్కొని చనుదెంచుటయును
నూనినశోకాగ్ని లోలుక రాఘవుఁడు, తాను సీతయు సుమిత్రాతనూజుండు
వారియంఘ్రులమీఁద వ్రాలి శోకింప, వారును శోకింప వారించె నంత
నావసిష్ఠమునీంద్రుఁ డమలవాక్యముల, నావేళఁ గౌసల్య యవనినందనను
వనవాసకలితవివర్ణాంగిఁ జూచి, తనమది విధిఁ దూఱి తద్దయుఁ బొగుల
గిరిమీఁద వర్తించుకిన్నరయతు, గరుడోరగామరకాంతలు వచ్చి
రామునిసతి దశరథరాజుకోడ, లీముగ్ధ జనకమహీపాలుపుత్త్రి
వివిధసంకటముల వేఁగుచున్నదియు, భువిఁ జోద్యములుగావె పోలఁతి యీవిధికి
నని సీతఁ జేర్కొన నారామచంద్రుఁ, డనఘుఁడై నవసిష్ఠునడుగుల కెఱఁగి
జననులఁ జుట్టాల సచివుల హితుల, మునులను గుశపీఠములనుండఁ బనిచి
తనతమ్ముఁడును దాను దర్భాసనముల, జనలోచనోత్పలచంద్రుఁడై యుండె.
నావేళ భరతునియాకృతిఁ జూచి, యోవత్స జడలును నురువల్కలములు
నీవేల తాల్చెదు నృపునాజ్ఞఁ బూని, వేవేగ జనమహీవిభుఁడవై యుండు
మని పల్కుటయు రామునాననాంబుజముఁ, గనుఁగొని భరతుండు కరములు మొగిచి
దేవరాఘవ కైక ధృతిదూలి మిమ్ము, భావింపనేరక పాపంబుచేసి
యడవులనుండు పొమ్మన్నమాటలకుఁ, దడయక జనుదేరఁ దగునయ్య మీకు
మిముఁ బాసి దశరథమేదినీపతియు, నమరలోకంబున కరిగె నీఘోర
పాపంబు మాతల్లి పచరించె నరక, కూపకోటుల నింకఁ గూలకయున్నె
యేను మీదగురాజ్య మిమ్ములఁ బూనఁ, గానేర నాచేతఁగాదు భూనాథ

నీ వయోధ్యకు నింక నేఁడె విచ్చేసి, పావనమతితోడఁ బట్టంబుఁ బూను
వల్లభు నెడఁబాసి వగలఁ బెల్లెడలు, తల్లుల నూరార్చి తక్కినహితుల
సచివులఁ జుట్టాల సకలపౌరులను, సుచరిత్ర కృపతోడఁ జూచి పాలింపు
నన్ను నీబంటు మన్నన సేసి కావు, విన్నపం బాలింపవే దయామూర్తి
యని పాదముల వ్రాలి యటు లేవకున్న, తనమతమ్ముని నెత్తి తమిఁ గౌఁగిలించి
భరత నీ విది యేమి బాలుండవైతి, కరుణఁ బల్కెడు ధర్మగతిఁ దప్పనాడి
యాకైక నేల పోనాడెదు తండ్రి, పోకకు నీవేలఁ బొగిలె దీవేళ
ఢాకతో నదిని గాష్ఠంబు కాష్ఠంబు, జోకమైఁ బాసినచొప్పు దీపింపఁ
బుత్రమిత్రకళత్రములు వాయుడాయు, మైత్రి ఋణానుసంబంధరూపములు
నవనిపైఁ బుట్టినయప్పుడె చావు, ధ్రువము జీవున కని రూపింప నరుఁడు
తనకు నుచితమైన ధర్మమార్గమున, మనినవాఁ డిహపరమాన్యుఁడై యుండుఁ
గావున మనతండ్రి కమనీయసత్య, భావుఁడై నీతితోఁ బ్రజలఁ బాలించి
ఘనయాగదానసత్కారముల్ పెక్కు,లొనరించి రాజ్యసౌఖ్యోన్నతి మించి
మనవంటితనయుల మనమారఁ గాంచి, జనులెల్లఁ గొనియాడ స్వర్గస్థుఁడయ్యె
నతనికై వగచుట యనుచితం బింక, నతనివాక్యము మనమటు చేయఁదగును
పితృవాక్యకరణంబు ప్రియధర్మ మెందు, సుతునకు నటు సేయుసుతుఁడు విశ్రుతుఁడు
వనములఁ బదునాల్గువర్షముల్ నన్నుఁ, ఘనరాజ్యభోగముల్ గైకొని నిన్నుఁ
నుండఁ గట్టడ చేసె నుర్వీశుఁ డట్లు, యుండుద మిందుకు నొండాడవలదు
అని తెల్పుచో నంత నర్కుండు గ్రుంకె, ననుపమప్రీతిమై నా రాత్రిఁ దీర్చి
మఱునాఁడు సంధ్యాసమాధు లొనర్చి, మఱి వసిష్ఠాదులు మంత్రివర్గములు
విశదంబుగాఁ బరివేష్టించి కొలువఁ, గుశపీఠమున రఘుకుంజరుఁ డుండె
నాసభామధ్యంబునందుండి భరతుఁ, డాసమయంబున హస్తముల్మొగిచి
దేవ మీయానతి తెఱఁగున నీతి, భావించి పితృవాక్యపద్ధతిఁ బుడమిఁ
గైకొంటి నాభూమి కడపట నేను, మీకిత్తు నందు కేమియు ననవలదు
సర్వసర్వంసహాచక్రభారంబు, పర్వి తాల్పఁగ ఫణిపతి యోపుఁగాక
యసలు డింపక జలవ్యాళి మెట్లోపు, వసుధేశ యే నట్టివాఁడ బాలుఁడను
ఈధారణీభార మేడ నే నేడ, సాధురక్షణ మేడ చర్చించి చూడ
బాలార్కు చేనొప్పు ప్రథమాద్రియందుఁ, బోలింప మిణుఁగురుఁబురుగున్నయట్లు
శ్రీనిధి నీవుండు సింహాసనమున, నేనుండఁ గనుపట్టు నీభూమిప్రజకుఁ
గావున మానిలక్షణములు మాని, నీవయోధ్యకు వచ్చి నీతివహించి
యెల్లవారలకోర్కు లీడేర రాజ్య, మెల్లఁ బాలింపు మింకేమియు ననక
నొనరు నీవిటు చేయనొల్లవైతేని, వినుమేను నీయొద్ద విడుతుఁ బ్రాణములు
కాకున్న సౌమిత్రిగతి నిన్నుఁ గొలిచి, కాకుత్స్థతిలక యిక్కడ నుండువాఁడ
నని దర్భశయనుఁడై యవనిపైనున్న, యనుజన్ము నెత్తి యిట్లనియె రాఘవుఁడు
ఇది యేమి భరత నీవిట్లాడఁ దగునె, మదిఁ దలపోయవో మనతండ్రియాజ్ఞ

దశరథేశునకు మీతల్లిని మున్ను, విశదంబుగా నిచ్చువేళ మీతాత
నామాతునకుఁ గల్గునందను నఖిల, భూకాంతుగా నీవు పూన్పుమీ యనుచు
నమ్మికపడసి వెన్కను బెండ్లిచేసె, నమ్మాటపట్టున నసురదైతేయ
యుద్ధంబులో విభుం డొసఁగినవరము, బుద్ధిఁదప్పక కైక భూమీశు నడిగె
ధారుణి నీకుఁ గాంతారంబు నాకుఁ, గోరిన దశరథక్షోణిపాలకుఁడు
సత్యంబుదప్ప కీజాడ గావించె, నిత్యకీర్తులు గాంచి నెగడె నిందందు
మనమున మనుజేంద్రుమాట పాటించి, ఘనకీర్తిసుకృతముల్ గైకొంద మెలమి
నరుగఁడే గయకొక్కఁడైనకన్యకను, బరఁగ దానముచేసి వఱలఁడే యొకఁడు
విడువఁడే యొకఁడైన వృషభ మటంచుఁ, గొడుకులఁ గాంచుట కోరి పితాళ్లు
ధాత్రిఁ బున్నరకసంత్రాతయౌటకతనఁ, బుత్త్రుఁడై యొప్పు నీపుణ్యంబు లెఱిఁగి
యిరవొందఁ దండ్రిపల్కులు సేయకున్న, నరయ దండ్రులమాట లవియెట్లుసాగు
ధర 'యథా రాజా తథా ప్రజా' యనెడు, నరుదారసామెత నరుఁడు దానరుగు
వరబుద్ధి గైకొన్న వ్రతము నిండించి, యరుదెంచె దేను నీవాగ్రహం బుడుగు
నామాటలాలింపు నాపంపుమీఁద, భూమికిఁ బతి గమ్ము పురి కింకఁ బొమ్ము
అనిన రావణుఁ డింక నాజిలోఁ గూలు, నని నిశ్చయముఁ జేసి రందున్న మునులు
సురలు దిగ్వరులు భాసురధర్మనిరత, భరత రామునిమాట పాటింపు మనిరి

**జాబాలి యనుముని శ్రీరామునకు నీతిఁ జెల్పుట**

యప్పుడు జాబాలి యనుమౌని రాముఁ, దప్పకఁ గనుఁగొని తగవేది పలికె
రామ యిదేమి నిరర్థకబుద్ధి, నేమించి మునిపోలె నృపవేష ముడిగి
రాజోపభోగమౌ రాజ్యంబు విడిచి, యీజాడ నుండుట కేమి కారణము
యెక్కడితలిదండ్రు లెక్కడిసత్య, మెక్కడిసుతధర్మ మిదియెల్ల కల్ల
తలిదండ్రు లొండొరుల్ తమసౌఖ్యమునకుఁ, గలయుచో శుక్లరక్తము లైక్యమొంది
యొకఁ బిండాకృతి నుదయించె నరుఁడు, బీజమాత్రము తండ్రి పెక్కులై యింక
నిమురుక నారిపోయినదీపమునకుఁ, జమురువోసినయట్టు చచ్చినయట్టి
వారికిఁ బరలోకవైదికకర్మ, మూరక జనులు సేయుటయు వ్యర్థంబు
గావున నామాట గైకొని రామ, నీవయోధ్యకువచ్చి నృపుఁడవై యుండు
మని యిట్లు జాబాలి యాడువాక్యములు, విని కోపమున రఘువీరుఁ డిట్లనియె
నిట్టి నాస్తికబుద్ధి యెవ్వరికైనఁ, బట్టి బోధింపు జాబాలిమునీంద్ర
మాకు మాపెద్ద లేమర్యాద నడచి, రాకైవడి మెలంగ నదియె సమ్మతము
సత్యమూలంబులు సకలధర్మములు, సత్యంబుకంటె నెంచఁగ ధర్మమెద్ది
యట్టిసత్యముదప్ప కనఘ మాతండ్రి, పట్టినధృతి నన్నుఁ బనిచెఁ గానలకుఁ
గాన నాతనియాజ్ఞ గడచినఁ బుణ్యహీనుండ నాకన్న నితరుండు గలఁడె
సత్యంబు ధర్మంబు శమమును దమము, నిత్యభూతదయయు నీతివిక్రమము
ప్రియవాక్యమును దేవపితృప్రపూజనము, రయమొప్పు స్వర్గమార్గము లండ్రుబుధులు
ఇవియెల్లఁ గల్లగా నీవు బోధించి, తవునవు నీవెట్టి యగ్రజన్ముఁడవు

నిన్ననఁ బనిచేమి నిన్ను నాస్తికుని, మన్నన నరసిన మాతండ్రి నసుట
యని రామవిభుఁ డాడునట్టివాక్యములు, వినిఁ బ్రీతి జాబాలి వెండియు ననియె
నన్ను నాస్తికునిగా నరనాథచంద్ర, యెన్ని తయోధ్య కేగ్లేని విచ్చేసి
భూమియేలుము వనుబుద్ధి నిట్లంటి, రామ యయోధ్య మటంచుఁ బ్రార్థనచేసె
నంత వసిష్ఠసంయమి సూర్యవంశ, మంతయు నిక్ష్వాకుఁ డాదిగా నెన్ని
యనఘ మాకులమున నగ్రజులుండ, ననుజుండు రాజౌట నగసిన లేదు
కావునఁ బెద్దలక్రమమున నీవు, భూవలయం బెల్లఁ బూనుట లెస్స
యెంతైనఁ బితృవాక్యమే దాఁట ననుచు, నింతగా నిశ్చయం బిట్టిదయేని
యాదట నినుఁ గొల్చినట్ల నీదైన, పాదుకాయుగళంబు భరతుండు గొలిచి
నెమ్మదినుండెడు నీపాదుకంబు, లిమ్మన్నఁ దల్లులు హితులు నాశ్రితులు
పౌరులు మంత్రులు బాంధవు లప్పు, డోరామ యిటుసేయు టుచితమటంచుఁ
బలుకంగ వేవేగ భరతుండు హేమ, విలసితపాదుకాద్వితయంబు రామ
ముందర నిడిన సంఫుల్లారుణార,విందపల్లవగర్వవిభవభేదములు
యతివధూతిలకశాపాపనోదములు, శ్రుతిశిరోభవనవిశ్రుతవినోదములు
తనదుపాదుకలు సంతతసనకాది,మునివివాదములు రాములు మోపి యొసఁగఁ
జేకొని యవి రెండు శిరమునఁ దాల్చి, కైకేయికొడుకు రాఘవున కిట్లనియె
నీవేషమున నేను నృపవేష ముడిగి, తావకపాదుకాద్వంద్వంబునందుఁ
బదిలంబుగా రాజ్యభారంబు మోపి, పదునాల్గువర్షముల్ పాలించువాఁడ
నామీఁద మీ రయోధ్యకు రాకయున్న, స్వామిపాదములాన వహ్ని యేఁజొత్తు
నని పల్కి యన్నకు నతిభక్తి మ్రొక్కి, ననుజుని దీవించి యక్కునఁ జేర్చి
తల్లుల నూరార్చి ధన్యులౌ మౌని, వల్లభులను మంత్రివరుల బాంధవుల
నెల్లవారలఁ బ్రియం బెసఁగ వీడ్కొలుప, నుల్లంబులో శోక ముప్పొంగుచుండ
భరతుఁ డప్పుడు రామపాదుకంబులకు, సరి ప్రదక్షిణనమస్కారముల్ చేసి
పట్టంపుటేనుంగుపై నొప్పఁ దెచ్చి, పెట్టె లోకములెల్లఁ బ్రీతిఁ గీర్తింప
ఛత్రచామరములు సరిదాల్చి పొలిచి, శత్రుఘ్నుఁడును దాను సద్భక్తిఁ గొలిచి
చెలఁగి నల్దిక్కుల సేనలు గొలువఁ, గులపవిత్రుఁడు చిత్రకూటంబు డిగ్గి
యుబ్బంగి భరతేశుఁ డింపార నరిగి, యబ్బరద్వాజునియడుగుల కెఱఁగి
యతనితో నట్టివృత్తాంతంబు దెలిపి, యతఁ డంతఁ బనుప సైన్యంబులు దాను
నట పోయి గంగామహానది దాఁటి, యట శృంగిబేరంబునందు నాగుహుని
పటుయశోధనుని సంభావించి నిలిపి, యటపోయి మఱి యయోధ్యాపురిఁ జొచ్చి
తడయక నగరిలోఁ దల్లుల నునిచి, కడుమూలబలముల గాపుగాఁ బెట్టి
మణిలేనిపెట్టియమాడ్కి నాకాశ, మణిలేనిపగలింటిమాడ్కిఁ జూడ్కికిని
చతురపుణ్యుఁడు రామచంద్రుఁడు లేని, యతిశూన్య మగునయోధ్యాపురిఁ జూచి
యాయతశుభశీలుఁ డందండ రోసి, పోయి నందగ్రామపురిని వసించి
పనివడి రఘురామపాదుకాయుగళ,మున రాజ్యభార మిమ్ముల నావహించి

శ్రీరామునకుఁబోలె సేవచేయుచును, నారచీరలు జడల్ నవయుచుఁ దాల్చి
యారాఘవునిపునరాగమనంబుఁ, గోరుచు సతనిసద్గుణము లెన్నుచును
సరససజ్జనమంత్రిసమ్మతితోడ, భరతుండు మహియెల్లఁ బాలించుచుండె
యిది యయోధ్యాకాండ మెల్లలోకముల, విదితమై యిహపరలోకసుఖదమౌఁగాక
అని యాంధ్రభాష భాషాధీశనిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి, భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
తనతండ్రి విట్ఠలధరణీశుపేరఁ, గమనీయగుణధైర్యకనకాద్రిపేరఁ
బని బూని యరిగండభైరవుపేర, ఘనుపేరమీసరగండనిపేర
నాచంద్రతారార్కమై యొప్పుమిగిలి, భూచక్రమున నతిపూజ్యమై వెలయు
నసమానలలితశబ్దార్థసంగతుల, రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావనల్నిండఁ, గరమర్థి నయోధ్యకాండంబుఁ జెప్పె
నారూఢి నార్షేయమై యాదికావ్య, మై రసికానందమై యలనాఁడు
నివ్వసుమతి నొప్పు నీపుణ్యచరిత, మెవ్వరు చదివిన నెవ్వరు వినిన
సామాదిబహుదేవచయధామరామ, నామచింతామణినవ్యభోగములు
పరహితాచారముల్ ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
ఆయురారోగ్యంబు లైశ్వర్యములును, బాయనిశుభమును పాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యచయసమృద్ధియును
యేవిఘ్నములు లేక నిండ్లలో నధిక, లావణ్యవతు లైనలలనలపొందు
కొడుకులతో నెప్డు గూడియుండుటయు, నెడగాక యాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులఁ గూడుటయు,నిష్ఠుల కామ్యంబు లపుడుఁ గూడుటయు
సతతంబు దేవతాసంతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
నిది మోక్షసాధనం బిది పాపహరము, యిది దివ్య మిదిభవ్య మిది శ్రీకరంబు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవభోగాదివాసులఁ జేయు
నెందాఁక కులగిరు లెందాఁక దార, లెందాఁక రవిచంద్రు లెందాఁక దిశలు
ఎందాఁక వేదంబు లెందాఁక ధరణి, యెందాఁక భువనంబు లేపువీపించు
నందాఁక యీకథ యక్షతానంద, సందోహదోహళాచారమై పరఁగు.

అయోధ్యాకాండము సంపూర్ణము.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీరంగనాథరామాయణము

## ఆరణ్యకాండము



శ్రీచిత్రకూటమహా చిత్రకూటమున, వాచంయమశ్రేణి వర్ణింపనుండి
యంత రాముఁడు భరతాగమనంబు, చింతించి యిచట వసింపరాదనుచు
నిచ్చట నేనున్న నెల్లపౌరులును, ముచ్చటపడి దినంబును వత్తురనియు
దంతిరథాశ్వపదాతివర్గముల, నెంతయుఁగాసిలు నీవనం బనియు
ఖరదూషణాదిరాక్షసకోటిబాధ, పరిహరింపుమటంచుఁ బరమసంయములు
చెంతలఁ జేరి సూచించినారనియుఁ, జింతించి మఱునాఁడు చిత్రకూటాద్రి
మునులవీడ్కొని యత్రిమునియాశ్రమమున,కనురాగమున నేఁగ నమ్మహామౌని
తనశిష్యులును దాను దగ నెదురేఁగి, కొనిపోయి పలుతెఱంగులఁ బూజచేసె
నమ్మునిపత్ని యానసూయ ప్రీతి, నమ్మహీతనయకు నాతిథ్య మొసఁగి
తెఱఁగొప్పఁ గొన్నిపతివ్రతాగుణము, లెఱిఁగించి రఘురాము నెడఁబాయలేక
తనబంధుజనుల నందఱ నెడఁబాసి, వనముల కాసీతవచ్చుట పొగడి
పిమ్మట ననసూయ ప్రీతితోఁ దాను, నమ్మహీతనయకు నంగరాగములు
వాఁడనిపువ్వులు వరుసఁ దోడ్తోడఁ, గూడమాయనిమణుంగులు నా నొసంగి
రమణి నిన్ను స్వయంవరమున రాఘవుఁడు, క్రమమొప్పఁ గైకొన్న కథఁ జెప్పుమ
జిలిబిలిసిగ్గును జిఱునవ్వుఁ దొలుకఁ, బలికె జానకి తనపతిని వీక్షించి [నిన
వినవమ్మ మిథిలకు విభుఁడైనయట్టి, జనకుఁ డొక్కఁడె యాగశాల దున్నింపఁ
గలిగితి నే నది కారణంబునను, కలితసీతానామకమున నొప్పితిని
అనపత్యుఁ డౌట నయ్యవనిపాలకుఁడు, దయమీఱ నన్ను మోదంబునఁ బెనిచె
నంత యౌవనవతి యగునన్నుఁజూచి, చింతించి తనయింటిశివునిచాపంబు
నెక్కుఁబెట్టినవాని కెలమిఁ బెంపెక్క, నిక్కన్యకామణి నిత్తు నే ననుచు
వరబుద్ధిమై స్వయంవరము చాటింప, ధరణినాయకులెల్లఁ దారటవచ్చి
శైలజారమణునిచాప మెత్తంగఁ,జాలక మోపెట్టఁజాలక చనిరి
అంత రాఘవుఁడు విశ్వామిత్రుఁ గొలిచి, కొంతకాలంబునకును నటవచ్చి
కరి యిక్షుకాండంబు ఖండించునట్లు, హరువిల్లు విఱిచి చయ్యన వరియించె
నని తనపెండ్లివార్తను నంత దాను, వినిపింప ననసూయ విని ముదమందె
నప్పుడు రవి పశ్చిమాంబుధి మునుఁగఁ, దప్పక సాంధ్యకృత్యము లెల్లఁ దీర్చి

శ్రీరాముఁ డత్రి పూజింప సద్గోష్ఠి, నారాత్రి గడపి సంధ్యాక్రియల్ దీర్చి

**శ్రీరాముఁడు దండకారణ్యమునకుఁ బోవుట**

ముద మొప్ప నయ్యత్రిముని వీడుకొలుపఁ, గదలి యమ్మునినాఁడు కమలాప్తకులుఁడు
సరళతాలతమాలసాలహింతాల, కురువకాగరువటకుటజగణ్యంబు
చండాంశునిభమానిజనశరణ్యంబు, గండకహర్యక్షగవయవేదండ
గండభేరుండాదిఖగమృగోదగ్ర,దండకారణ్యంబు దరియంగఁ జొచ్చి
వేదనాదములచే విస్తారమహిమ, వేదులచేతఁ బవిత్రంబులైన
పర్ణశాలలచేతఁ బవనాంబుజీర్ణ,పర్ణాశు లగుచుఁ దపంబుగావించు
మునులచే మిగుల సమున్నతి నొప్పు, జననుతతాపసాశ్రమములు పెక్కు
గనుఁగొంచు వారలు గావించుపూజ, లనురక్తిఁ గైకొంచు ననుజుండు దాను
నరుగుచో నాదండకారణ్యవీథి, సురపర్వతాకారుఁ డుగ్రలోచనుఁడు
ఘనవక్త్రనాసుండు కఠినవిగ్రహుఁడు, ఘనుఁడు విరాధుఁ డన్ గడిఁది రాక్షసుఁడు
అట్టహాసముచేసి యాకసం బదువ, బెట్టుగా వనమెల్ల భేదిల్ల వచ్చి
గరుడుండు బాలనాగము బట్టి నొడిసి, యిరవొప్పు నద్దివి కెగయుచందమునఁ
బటుశూలముఖచంచుబాహుఁడై సీత, కుటిలకుంతల నెత్తుకొని మింటి కెగసి
జనకజదెసఁ జూచి చాల చింతించు, ఘనుల శ్రీరామలక్ష్మణుల వీక్షించి
యోరి వీరులవలె నోడక వచ్చి, యీరసంబునఁ జొచ్చి యేనున్న యడవి
శరచాపహస్తులై చరియింప నెంత, బిరుదులై భుజశక్తిఁ బేర్కొన్న నెంత
తల్లి శతహ్రద తండ్రి జయుండు, తొల్లి యాయుధముల ద్రుంగక యుండ
బ్రహ్మచే వరములు వడసినవాఁడ, బ్రాహ్మణాశనుఁడ విరాధుఁ డన్వాఁడ
నేనల్గి చూచిన నింద్రాదిసురల, నైనను మ్రింగుదు నట మర్త్యు లెంత
యీయింతి నొప్పించి యీకాన విడిచి, పోయి మీమీప్రాణములు గాచికొనుఁడు
కాదేని నాచేతిఘనశూలహతికి, నాదట నఱిమి రండని పేర్చి పలుక
సౌమిత్రి యప్పుడు జనకజభయము, నాయహోరాక్షసునదటును జూచి
యోరి రామునిదేవి సురపుణ్యసాధ్వి, ధారణీనందనఁ దగదోరి నీకుఁ
గొనిపోవ నెక్కడఁ గొనిపోయె దింక, నినుఁ బట్టి వధియింతు నేఁడు నాకడిమి
నని బాణసంధాన మలుకమైఁ జేసి, ఘనబాణతతుల వక్షము గాఁడ నేయ
నరుదుగా వాఁ డట్టహాసంబుచేసి, కెరలుచు శూల మంకించి వ్రేయుటయు
ఘనఘనాఘనముసంగడిఁ బాసి పిడుగు, చనుదెంచుకరణి రా జానకీవిభుఁడు
నది రెండుశరముల నలవుమైఁ ద్రుంప, పదరి వాఁడట సీతఁ బడవైచెఁ బుడమి
నారాక్షసునిఁ బాసి యాకాశవీథి, ధారణీసుత సీత తల్లడిల్లుచును
జలదంబు నెడఁబాసి చనుదెంచు మెఱుము, చెలువునఁ జనుదేరఁ జెచ్చెఱఁ జూచి
గరుడాస్త్రమున డించెఁ గడఁగి రాఘవుఁడు, వరబాణములు పెక్కు వాఁ డేయుట
నవి లెక్కసేయక యట్టహాసంబు, భువనభయంకరంబుగ బిట్టొనర్చి [యును
శరముల రామలక్ష్మణుల నిద్దఱినిఁ, గరమర్థిఁ బట్టి రక్కసుఁ డుక్కుమీఱి

మూపున నిడి రయంబునఁ ద్రోవఁబట్టి, చాపుగా నడచుట జనకజ గాంచి
వాపోవ నటఁ గొంతవడి పోయిపోయి, ప్రాపితకోపులై రామలక్ష్మణులు
మెఱుఁగుఁదీఁగెలరీతి మెఱయుఖడ్గంబు,లొరలూడ్చి వానిబాహులు రెండు దునుమ
గిరివజ్రమునఁ గూలు క్రియ దిక్కు లదుర, నురుపడి నొరలుచు నుర్విపైఁ గూలి
యసువులు విడువ నయ్యసుర యుండుటయు, ససమానపదముష్టిహతుల నందంద
ముద్దగాఁజేసి సముద్ధతిఁ జంపి, రద్దిరా యని మును లాశ్చర్యపడఁగ
నతఁ డంత గంధర్వుఁడై రాముఁ బొగడి, యతులవిమానంబునందుండి పలికె
నేను గంధర్వుఁడ నేను తుంబురుఁడ, భూనాథ మును రంభఁ బొంది కొల్వునకు
రానిగర్వ మెఱింగి రాక్షసాకృతిగ, నేను గుబేరుచే నిటు శాపమంది
నేఁడు మీభుజశక్తి నీశాపముక్తి, పోడిగాఁ గాంచితిఁ బోయెద నింక
నిరవొప్ప నాదేహ మిటఁ బూడ్చి చనుఁడు, శరభంగమౌనియాశ్రమమున కనుచ
బోయి మ్రొక్కుచువాఁడు పొలుపొంద వాని, కాయంబు ధరఁబూడ్చి కడుభయఁ
ధరణీతనూభవఁ దగఁ గౌఁగిలించి, పరమసమ్మదమున భయమెల్ల మాన్పి [బంధ
తలకొన్న ప్రేమతోఁ దమ్మునిఁ జూచి, యిలమీఁదఁ గల్గునె యిట్టి దుర్గములు
కావున వేగ మీగహనంబు దాఁటి, పోవలె మనము భూపుత్త్రిఁ దోడ్కొనుచు
నని యంత శరభంగుఁ డనుమునిచంద్రుఁ, గను గొనుతలఁపునఁ గాకుత్స్థకులుఁడ

## శ్రీరాముఁడు శరభంగాశ్రమంబుజేరుట

చనుచోట నుదయార్కసంకాశ మగుచు, నొనర నమ్మునియాశ్రమోపాంతవీథి
హరితహయాకీర్ణమై సితచ్ఛత్త్ర,పరివృతంబై దేవభరితంబు నగుచు
నకళంకమణిరోచు లందందఁ బర్వ, నొకవిమానము గాంచె నుడువీథినంతఁ
గని విమానములోని కమనీయశీలుఁ, గనుఁగొనుతలఁపునఁ గదియవచ్చుటయు
నది యదృశ్యంబయ్యె నంత రాఘవుఁడు, ముదమంద శరభంగమునిఁ గాంచి మ్రొక్కి
మునిచేత దివ్యాస్త్రములు చాలఁ బడసి, యనురాగమును బొంది యతని కిట్లనియె
నేము నిన్నిటఁ జూడ నేతెంచుచోట, నోమునీశ్వరచంద్ర యొకవిమానంబు
చదలెల్ల వెలుఁగ నిచ్చటనుండి పోయె, నది యెందులకు వచ్చె నది యెందుఁ బోయె
నావిమానములోనియతఁ డెవ్వఁడనిన, భూవరునకు మునిపుంగవుఁ డనియె
దేవేంద్రుఁ డాతఁడు దేవేంద్రవంద్య, దేవ నాకడకును దివినుండి ప్రీతి
ననిమిషులును దాను నర్థి దీపింప, నను బ్రహ్మలోకంబునకుఁ బిల్వ వచ్చె
వచ్చిన నోమహీవరచంద్ర నీవు, విచ్చేయు టిచ్చ భావించి నేనిపుడు
నెఱసినకడమిమై నిన్నుఁ బూజించి, మఱిపోవువాఁడనై మది నిశ్చయించి
యంతకు రానని యతనిఁ బొమ్మంటి, చింతించి వజ్రియు శ్రీరామ నిన్ను
గాంతారఖిన్ను నిక్కడఁ జూడఁ గలిగె, నింతలో విచ్చేసి తినకులాధీశ
ధరణీశ నీప్రసాదంబునఁ దపము, నరుదార నొకవిఘ్నమైనను లేక
పలిపితి నిష్ఠలు సఫలంబులయ్యె, నెలకొని శ్రీరామ నినుఁ జూడఁగంటి

ననఘ సుతీక్ష్ణసంయమి నింక నీవు, కనుఁగొని యతనిచెంగట నుండుమేను
బనివినియెద నింక బ్రహ్మలోకమున, కని చెప్పి రాముసమక్షమంబునందు
ననలముఖంబున నమ్మునీశ్వరుఁడు, తనమేను మంత్రపూతముచేసి వేల్చి
యెడపక యింద్రాదులెల్లను గొలువఁ, గడునొప్ప బ్రహ్మలోకమునకుఁ బోయె
నాయాశ్రమావాసు లైనసంయములు, వాయుభక్షకులును వైఖానసులును
వాలఖిల్యులు మౌనవంతులు పర్ణ, శాలావిహీనులు స్థండిలశయులు
మననశీలు రుదాత్తమౌను లేకాంతు, లనశనవ్రతులుఁ బంచాగ్నిమధ్యగులు
మొదలైనతాపసుల్ మూఁకలుగట్టి, సదయాత్ముఁ డగురామచంద్రునిఁ జేరి
పితృవాక్యపాలనప్రియుఁడవు సత్య, రతుఁడవు నీవు నిర్మలయశోధామ
రామ నీయంతటిరాజు గల్గియును, నేము రాక్షసబాధ నిట గుందఁ దగునె
వ్రతము రక్షించునృపతికిని గల్గు, నతనిపుణ్యములోన నాలవపాలు
ఈతటి దైత్యులనెల్ల ఖండించి, మాతపోవ్రతములు మైత్రినిండించు
సొరిది నీశరణంబుఁ జొచ్చితి మనిన, శరణాగతత్రాణసదయుండు గాన
నాయాశ్రమంబులయం దుండుమునుల, కాయతమతిరాముఁ డభయంబు లిచ్చి
మీయనుగ్రహమున మేటిరక్కసుల, దాయల ఖండింతు దలఁకకుఁ డనుచు
వారి వీడ్కొని ఘోరవనసీమ కరిగి, యారూఢమతి సుతీక్ష్ణాశ్రమంబునకు
వచ్చి యామునిచంద్రు వలగొని పేరు, గ్రుచ్చి సద్భక్తిపైకొని మ్రొక్కుటయును
వారల కెదురుగా వచ్చి సుతీక్ష్ణుఁ, డారాము దీవించి యర్థిఁ బూజించి
యనఘాత్మ చిత్రకూటాద్రికి నీవు, మునివృత్తి వల్కలంబులు గట్టి వచ్చు
నునికి యాకర్ణించి యుల్లంబులందుఁ, గొనకొని మీరాకఁ గోరుచుండుదుము
నీవు విచ్చేసితి నినుఁ జూడఁగంటి, మేవిధంబుల నింక నేము ధన్యులము
ఆయతభుజసత్త్వులైనరాక్షసులు, మాయాశ్రమములకు మత్తులై వచ్చి
హోమవేదులఁ గాల్చి యూపముల్ గూల్చి, సోమపానము గ్రోలి సురలఁ బోఁదోలి
తపములు చెఱచి పాదపములు విఱిచి, జపమాలికలు ద్రెంచి శాటికల్ చించి
ఫలములు డుల్చి పుష్పములెల్ల రాల్చి, కొలఁకులు కలఁచి పెక్కులు గాసిచేసి
పెక్కండ్రమునులఁ జంపిరి దురాత్మకులు, దిక్కులే దీపాటు దీర్ప నేత్రోవ
నేచిన దనుజుల నేము కోపించి, చూచిన నీఱుగాఁ జూడ నోపుదుము
నెలకొని మహిమీఁద నీయట్టిరాజు, గలుగుటఁ జేసి యెక్కడ నల్ల మేము
కావున దుష్టరాక్షసుల మర్దించి, నీవు మాతపములు నిష్ఠఁ బాలింపు
మనిన రాముఁడు రాక్షసాధీశవరుల, ననిలోనఁ జంపెద నని యూఱడించి
శరభంగునాశ్రమస్థలమున మునుల, కిరవొప్ప నభయంబు నిచ్చుట తెలిసి
రక్కసులను జంపఁ బ్రతినలు పలికి, యక్కడ సుఖగోష్ఠి నారాత్రి నిలిచె
మఱునాఁడు పెక్కండ్రు మౌనులువచ్చి, మఱియును దమయాశ్రమములకుఁ బిలువ
దిననాథకులుఁడు సుతీక్ష్ణు వీడ్కొనుచు, మునులపుణ్యాశ్రమంబులు చూడఁగోరి
చనుచోట రఘురాము జానకి చూచి, యనఘ రాజ్యముమాని యడవికి వచ్చి

సముచితవృత్తిమై జడలును వల్కలములు ధరించి మెలంగుచు నుఱక
యసురులదెస మీకు నలుగ నేమిటికి, పోసఁగ నీమాటలు బుద్ధిఁ జింతింప
మునులతో రాక్షసముఖ్యులఁ ద్రుంతు, నని యాలోచించిన నంతనుండియును
గలఁగుచున్నది మది కాకుత్స్థతిలక, వల దీతెఱంగులు వర్జింపవయ్య
ప్రాణులఁ జంపఁ బాపముగాదె తొల్లి, ప్రాణేశ యొకముని బహుతపోనిష్ఠ
నుండుచో భటరూపయుక్తుఁడై వజ్రి, యిందుఖడ్గము మానియొద్ద దాఁపుచును
ఇదె పోయివచ్చెద నేనని చనియె, తదనంతరమున నాతఁడు ఖడ్గముంది
యూరకుండక తీవ లోకటవృక్షముల, సారెఁ ద్రుంపుచును హింసారతుం డగుచు
జడమతియై తపశ్చర్యకుఁ బాసి, కడపట నతఁడు దుర్గతిఁ గూలెఁ గాన
తపమేడ మఱి రాజధర్మంబు లేడ, విపులాయుధము లేడ విడువవే దేవ
యనవుడు విని నవ్వి యధిపతి సీతఁ, గనుఁగొని విప్రమార్గంబు నీపలుకు
క్షత్రమార్గముగాదు సాధ్వి నావలని, మైత్రిఁ బల్కెదవు నామత మెఱింగియును
తరుణి యుత్తమరాజధర్మైక్యపరులు, శరచాపములు దాల్చి చరియించుటెల్ల
శరణాగతులఁ గావఁ జర్చింపఁగాదె, పరికింప వెయ్యేల పరమధర్మములు
నమ్మహామునులతో నాడినప్రతిన, యిమ్మెయిఁ గావింతు నిదియె నిశ్చయము
విడుతుఁ బ్రాణమునైన విడుతు నిన్నైన, విడుతుఁ దమ్మునినైన విడువనే ప్రతిన
ననిన నూరకయుండె నవనిజ యపుడు, విని లక్ష్మణుఁడు చాల విస్మయంబందె
నటమీఁద నొక్కొకయాశ్రమంబునను, బటుధర్మనిధి రామభద్రుండు ప్రీతి
మూఁడేసినెలలు నిమ్ముల నాల్గునెలలు, పోడిగా నిలుచుచుఁ బుణ్యాశ్రమముల
ధీయుక్తిఁ జూచుచు తెరువున యోజ,నాయతం బైనమహాతటాకంబుఁ
గని గీతవాద్యమంగళనినాదములు, దనర నయ్యుదకమధ్యమున మించుటయుఁ
గడుఁ జోద్యపడి తటాకముఁ జేరి దానిఁ, గడుధర్మరతుఁడు తాఁ గని మ్రొక్కి పలి
నిదియేమి మునినాథ యీతటాకంబు, నుదకంబులో ఘోష మబ్బుచున్న దియుఁ
గడుఁజిత్ర మనుడు రాఘవుఁ జూచి పలికె, నడరెడు వేడుక నాధర్మరతుఁడు
కదలక మును మందకర్ణియన్ మౌని, యుదకమధ్యంబున నురునిష్ఠ నిలిచి
యెనసినమహిమ ననేకవర్షములు, తనియక యత్యుగ్రతప మాచరింప
నాతపంబునకు నింద్రాదిదేవతలు, భీతిల్లి మునిపతి పెంపెల్లఁ గలఁగ
నమ్మునికడ కేవు రప్సరస్త్రీల, నిమ్ములఁ బుత్తెర నేతెంచివార
లతనికి భార్యలై యంబుమధ్యమున, నతఁడు నిర్మించిన హైమసౌధముల
మునినాథుముందఱ ముద మొప్ప నిలిచి, యనురక్తి వారిప్పు డాడుచున్నార
లదిగానఁ గొలను పంచాప్సరంబయ్యె, నిది వారిబహువాద్యహృద్యశబ్దములు
అనవుడు విని రాముఁ డతిభక్తితోడ, ఘనపుణ్యుఁ డగుమందకర్ణికి మ్రొక్కి
మఱియు మహాటవిమార్గంబునందు, నెఱసినకడిమిమై నెఱి నేఁగునపుడు
మునులకు మ్రొక్కుచు మును లున్నపుణ్య, వనులకుఁ జొక్కుచు వనజకల్హార
సరసులఁ దేలుచు సత్కథాలాప, సరసుల నేలుచుఁ జల్లనిగాలి

రాకలఁ బోగడుచు రణితఝల్లికల, జోకలఁ దెగడుచు శుకమయూరాది
ఖగములఁ బట్టుచుఁ గరివరాహాది, మృగములఁ గొట్టుచు మేఘాస్త్ర మేసి
తపములు నడుపుచుఁ దముఁ జూచువారి, భవములు నడపుచు పరువంపులతల
పువ్వులు చిదుముచుఁ బోదలు తుమ్మెదల, నవ్వులఁ గదుముచు నభమంటఁ దాఁకు
శైలంబు లెక్కుచు జానకి యలయ, మేలంబు దక్కుచు మృదురీతి గుహల
మెల్లనె దార్పుచు మెలఁతకు నెక్కు, డల్లన నేర్పుచు నచటి చెంచెతల
బీరముల్ మెచ్చుచు భేదింపరాని, యారముల్ చొచ్చుచు నినరశ్మిలేని
కోనలఁ గానలఁ గ్రుమ్మరు చట్లు, జానకి తాను లక్ష్మణుఁడు కొన్నేండ్లు
పుణ్యతీర్థంబులు పుణ్యవాహినులు, పుణ్యతపోవనస్థానములఁ గలయఁ
దిరుగుచుఁ బదియేండ్లు దీఱినపిదప, మరలి సుతీక్ష్ణాశ్రమమునకు మఱియు
వచ్చి యమ్మునియొద్ద నిచ్చఁ గొన్నాళ్లు, మచ్చికనుండి రామక్షితీశ్వరుఁడు

## అగస్త్యులఁ గాంచుట

నొకనాఁడు ఘనునగస్త్యునిఁ జూడఁగోరి, యకళంకభక్తి సంయమికి నిట్లనియె
నెందు నగస్త్యమునీశ్వరుఁ డుండు, నందు నెందొక్కొ తదాశ్రమభూమి
తెలుపవే యనిన సుతీక్ష్ణుండు గుఱుతు, లలవడఁ దన్మార్గ మంతయుఁ దెలిపి
దీవించి యనుప గాదిలితమ్ముతోడ, దేవితో దక్షిణదిక్కుకై నడచి
చనిచని నాల్గుయోజనములు దాఁటి, వనముల ఘనశైలవాహినుల్ వెక్కు
గనుఁగొంచు నరిగి యగస్త్యానుజన్ము, ననఘాశ్రమంబున కరిగి సంప్రీతి
నాయతీశ్వరచంద్రునడుగుల కెఱఁగి, యాయాశ్రమంబున నారాత్రి నిలిచి
మునితోడ సుఖగోష్ఠి మొగిఁ జేయుచుండి, యినకులాధీశ్వరుం డిట్లని పలికె
నియ్యగస్త్యమహామునీశుండు దొల్లి, యియ్యెడ వాతాపి నెబ్బంగిఁ జంపె
ననిన నమ్మునిచంద్రుఁ డారామచంద్రుఁ, గనుఁగొని యాపుణ్యకథ చెప్పఁదొడఁగె
నురుతాపి వాతాపియును నిల్వలుండు, ధరణిపై నిరువు రుద్దండరాక్షసులు
గలరందు వాతాపిఘనమేషమూర్తి, యిల్వలుండను నొక్కఋషియునై నిలిచి
యిచ్చటఁ బెనుత్రోవ కెదురేఁగి మిగుల, దచ్చునఁ దమయింటఁ దద్దినం బనుచు
మునులను నియమించి ముదమొప్పఁ దెచ్చి, యెనయంగ మేషంబు నేర్పడఁ జంపి
ప్రీతిఁ గూరలుచేసి పెట్టి భుజింప, వాతాపి రమ్మని వడిఁ జేర జీరఁ
దడయక యపుడు వాతాపి యమ్మునుల, కడుపులు వ్రచ్చి యగ్గలికతో వెడల
నీవిధి మునుల ననేకులఁ జంపి, రావికృతాకారు లడరి యందుండఁ
గొన్నకొని యొకనాఁడు కుంభసంభవుఁడు, చనుదేరఁ గపటభోజన మొప్పఁ బెట్టి
వాతాపిఁ బిల్వ నిల్వలుఁ జూచి నగుచు, వాతాపి యొందుండి వచ్చు జీర్ణించె
నని యగస్త్యుఁడు పల్క నాయిల్వలుండు, కనలి రక్కసుఁడయి కదియవచ్చుటయుఁ
గలశసంభవుఁడు హుంకారమాత్రమున, బలియు నిల్వలుఁ జూచి భస్మీకరించి
మునులకునెల్లఁ బ్రమోదంబుచేసె, విను మదియునుగాక వింధ్యం బణంచె
సరిగాఁగ దక్షిణాశాస్థలి నిలిచె, నరుదుగా నంబుధి నాపోశనించెఁ

బెనుఁబాముగాఁగ శపించె నానహుషు, మునిమాత్రుఁడే పుణ్యమూర్తికుంభజుఁడు
మునివేషమున నున్నముక్కంటిగాక, యన విని రఘురాముఁ డానందమంది
మఱునాఁడు మునిపతి మార్గంబుఁ జూప, తెఱఁగొప్పఁ బూజించి దీవింప వెడలి
చని చని యొక్క యోజన ముత్తరించి, పనసదాడిమశమీబదరికాశ్వత్థ
సాలప్రియాళురసాలతమాల, మాలూరఖర్జూరమందారతరుల
తరులఁ గ్రిక్కిరిసిన తావిక్రొవ్విరుల, విరులతేనియలాని వెలయుతుమ్మెదల
మెదల నింపగునట్టి మేటిపూపొదలఁ, బొదలలోఁ బగ లేక పొదలుమృగములఁ
గలకంఠకలకుహూకారనాదముల, విలసిల్లు బహుశాస్త్రవేదనాదములఁ
జెలఁగుచుఁ గిన్నరసిద్ధగానముల, కలిమి దీపించు నగస్త్యునాశ్రమము
గనుఁగవవిందుగాఁ గాంచి యందొక్క, మునిచేతఁ దమరాక ముని కెఱిఁగించి
చని చొచ్చి యమ్మునిచరణపద్మముల, కనురాగమున మ్రొక్క నక్కునఁ జేర్చి
దీవించి వేవేలు తెఱఁగుల భక్తి, భావించి సంతుష్టిపరులఁ గావించి
యోరామ శుభనామ యుత్పలశ్యామ, క్రూరదానవభీమ గుణధామ నీవు
మునులభాగ్యంబున మునివృత్తిమోచి, వనమునఁ దపసివై వర్తింప వచ్చి
యరుదారఁ జిత్రకూటాద్రి కేతెంచి, వరమతి నొక్కసంవత్సరం బుండి
శరభంగమౌనియాశ్రమము కేతెంచి, శరణుచొచ్చిన మునీశ్వరులను గాచి
దనుజులఁ జంపెదఁ దలఁకకుఁ డింక, నని ప్రీతి మునులకు నభయంబు లిచ్చి
కరుణించి తని విని కాకుత్స్థతిలక, పరమసంతోషసంపన్నుఁడనైతి
నని యర్థిఁ బూజించి యతులదివ్యాస్త్ర, ఘనశస్త్రకోదండకవచాదు లిచ్చె
నిచ్చినఁ గైకొని యినకులాధీశుఁ, డచ్చట సుఖగోష్ఠి నారాత్రి నిలిచె
ఘటసంభవుఁడు భావికార్య మూహించి, పటుతరవాక్యుఁడై పలికె నిట్లనుచు
శ్రీరామ గోదావరీపరిత్పుణ్య, వారిశీతలగంధవాహకుమార
ఘటితనర్తనవనాంగణలతాతటికి, జటికృతపూజధూర్జటికి నాపంచ
వటికిఁ బొమ్మన రఘువంశుఁ డచ్చటికి, ఘటసూతి వీడ్కొని కదలిపోవుచును
నడుత్రోవ నొకపక్షినాథుని తెక్క, లుడివోసికులగిరులో యని చాలఁ
గని దైత్యుఁ డనుబుద్ధిఁ గదిసి నీవెవ్వఁ, డనుటయు ముదమంది యాపక్షి పలికె
గరుడాగ్రజాతుండు కశ్యపతనయుఁ, డరుణసారథియైన యరుణుండు ఘనుఁడు
మాతండ్రి మఱియు సంపాతి మాయన్న, మీతండ్రిసఖుఁడ సుమీ యేను రామ
యితరుండఁగాను మీహితకార్యపరుఁడ, నతులసాహసుఁడ జటాయువన్వాఁడ
నీవనంబును నసురేంద్రసేవితము, గావున వైదేహిఁ గావుఁ డేమఱక
ననవుడు శ్రీరాముఁ డట్లుగా నతని, మనమున యోజించి మైత్రిఁ బూజించి
యట పంచవటి కేఁగి యందున్న మునులఁ, బటుతపోధనుల సంభావించి మ్రొక్కి
కరమర్థి వారు సత్కారముల్ సేయ, ధరణీతనయఁ జూచి తమ్మునిఁ జూచి
పొలుపొంద నెందును బుణ్యాశ్రమములు, గలయఁ బెక్కులు పొడగందుము కాక
యీగౌతమీగంగ యీసరోవరము, లీగిరు లీతరు లీయాశ్రమములు

ఎందును బో[?]గం[?]మీ యిటఁ గ్రింద, నిందుండుదము మన కింపొందు ననుచు
నానందమునుబొంది యందున్నమునుల, యానతిఁ గైకొని యాప్రొద్దె కదలి
తాను లక్ష్మణుఁడును దగుపర్ణశాల, యానిన క్రమముతో నొప్పారఁ గట్టి
తమ్ముఁడు దానును దానిఁ బూజించి, యమ్మహీసుతఁ గూడి యనురాగ మెసఁగ
నాపర్ణశాలలో నందాఱునెలలు, దీపించువేర్మి వర్తించుచునుండె
అంత నీహారధరాక్రాంతదశది,శాంతమై హేమంత మవనిఁ బర్వుటయు
వేకువ నొకనాఁడు వెలఁదియుఁ దాను, తేకువ గౌతమిఁ దీర్థమాడంగఁ
జనుచుఁ రాముఁడు మైత్రి సౌమిత్రిఁ జూచి, కనుఁగొంటివే శీతకాలంబుమహిమ
దిశలెల్లఁ జలికి భీతిలి వెలిపట్టు, ముసుకుఁ బెట్టినయట్లు ముంచె హిమంబు
హేమంత మనుమేఘ మెల్లెడ నిండి, వామిగా వడగండ్లు వర్షించె ననఁగఁ
గురిసినపెనుమంచు కుంభినియెల్ల, నెరసి యొప్పారె ఘనీభవించుచును
ఉర్విపై నామంచు నొక్కొక్కచోట, దూర్వాంకురంబుల తుదలఁ జూచితివె
పచ్చమిన్నసలాక పౌజుపై వేడ్కఁ, గ్రుచ్చినముత్యాలక్రొవ్వలై యొప్పెఁ
గామునమ్మోహనకాండంబు లనఁగ, హైమయుగ్వాయువు లలతిమై సోఁక
వెఱపున వణఁకెడు విరహిణు లనఁగఁ, దెఱఁగొప్పఁ గదలు పూఁదీఁగె వీక్షింపు
మంచున జారుతామరలకన్నీరు, ముంచినవిరహిణులమోములఁ గేరు
పొదిగొన్నయకరువుల్ పొట్టుగా మీఁదఁ, గదలు తేటులపొగల్ గా చలికొన్న
కొలను దేవతలకుఁ గుంపట్లఁబోలె, విలసిల్లు కెందమ్మివిరులఁ జూచితివె
యడవియేనుఁగులు నీరాసనీనదికిఁ, దుడిఁదుడి వచ్చి తత్తోయంబు దొడరి
అడరి గిట్టుచు దుండములు వేవేగ, ముడిచి పాఱెడిని తమ్ముఁడ విలోకింపు
ఇట్టికాలంబున నేనున్నయట్లు, పట్టంబు నామీఁది భక్తిమై మాని
నారచీరలు జడల్ నవతమైఁ దాల్చి, నారాకఁ గోరుచు నమ్మహాఘనుఁడు
పరమపావనుఁడు సౌభ్రాత్రభావనుఁడు, వరపితృవాక్యమద్వాక్యతత్పరుఁడు
చిరకీర్తినిరతుఁ డాశ్రితలాభరతుఁడు, భరతుఁ డుషఃకాలపరిచితి నెట్లు
స్నానంబుసేయునో సరయువులోన, మానసిగ్నై యెట్లొకో మహిఁ బవ్వళించు
నాతండ్రిసత్యంబు నాపూన్కి యతని,చేత నింతయుఁ బ్రకాశించె లోకముల
నేతల్లిపనుపున నెల్లసంయముల, చేత దీవెనలు గాంచితి నీడ నేను
అట్టికైకను నొవ్వ నాఁడునో తెలియ, దట్టేల కావించు ననఘాత్ముఁ డతఁడు
పట్టంబు దొలఁగి తాపసి నైతి నేను, బట్టంబు గలిగి తాపసి యయ్యె నతఁడు
అన్నదమ్ములపాడి యాపుణ్యుఁ జూచి, యెన్న నెవ్వరికైన నిఁక నేర్వవలయు
నట్టియాభరతుని యనుఁగుఁ దల్లులును, చుట్టాల నెన్నఁడు చూతుమో మనము
అని వారిఁ దలఁచుచు ననివారితముగఁ, దనివార నిష్ఠ గౌతమివారిఁ గ్రుంకి
యినునకు నర్ఘ్యంబులెత్తి గాయత్రి, పనుపున జపియించి బ్రహ్మయజ్ఞంబు
తమ్ముఁడు దాను సీతయుఁ బర్ణశాల, కిమ్మెయిఁ జనుదెంచి హితగోష్ఠి నుండె
నొకనాఁడు లక్ష్మణుం డుదయకాలమున, నకళంకచిత్తుఁడై యన్నకు మ్రొక్కి

కందమూలఫలాదికములు దెచ్చుటకు, నందంద వనముల నరయుచు నరిగి
యున్నతం బగుచున్న నొకగిరిఁ గాంచి, మిన్నక యచ్చోట మెలఁగుచున్నంత
మహియెల్ల దేదీప్యమానమై వెలుఁగ, నహిమాంశుకల్పితం బగుఖడ్గ మొకటి
భీషణజలదగంభీరఘోషముల, ఘోషించుచును వచ్చి కో యని పలికె
నందుకొ మ్మింక దైత్యాధీశతనయ, పొందుగా నీతపంబునకును మెచ్చి
భానుండు పనిచె నీపగిదిగ నన్ను, మానక కొనుమన్న మఱి వాఁడు పలికె
మెల్లనే తావచ్చి మెచ్చి నాకిక, యెల్లబోకలు చేసె నొల్లఁబో నిన్ను
నలఘుతపంబెల్ల నవనిపైఁ గలసె, వలసినకడ కేఁగు వనజాప్తహేతి
యని పల్కి తొల్లిటి యచలసమాధిఁ, దనరంగ నుండె నంతట లక్ష్మణుండు

### సౌమిత్రి ఖడ్గముఁ గొనుట

విపులాద్భుతం బంది వెసఁ దానిఁ జూచి, యుపమతో డగ్గరి యొడిసి చేపట్టి
నిపుణుఁడై పరికించి నృపకుమారుండు, తపసుల కెల్ల నాధారమైనట్టి
ఫలవృక్షములు ద్రుంపఁ బాడిగా దనుచుఁ, గలయఁ గ్రమ్మరుచు నగ్గలికమై నచట
భావించి భావించి బాగొప్పఁ జూచి, భావంబునందును బ్రమదంబుఁ గొనుచు
నీఖడ్గ మిం దుండ నేమి కారణమొ, యీఖడ్గ మిచ్చటి కేల వచ్చినదొ
యనియని ఖడ్గంబు సాదృశిఁ జూచి, పనిగొని దానిఁ జేపట్టుచు మఱియు
విలసిల్లు నొకగొప్ప వెదురుజొంపంబు, మలసి ఖండింపఁ దన్మధ్యభాగమునఁ
దెగియొకమాని మేదినిఁ గూలుటయును, నిగిడెడు మూర్ఛ మునింగి సౌమిత్రి
యటఁ గొంతసేపున కల్లనఁ దెలిసి, కటకటా సకలలోకములు నిందింప
బ్రాహ్మణుఁ జంపితిఁ బరికింపలేక, బ్రహ్మహత్యాదోషభరితుండ నైతి
నే నేల వచ్చితి నింతదవ్వులకు, నే నేల యీఖడ్గ మిట్లు గైకొంటి
ననుపమధర్మాత్ముఁ డగురామచంద్రు, ననుజుండ నగునాకు నధికపాపంబు
సమకూరె నీమునీశ్వరుఁ డెవ్వఁడొక్కొ, సమయఁ జేసితి నింక జానకీవిభుఁడు
విని నన్ను నే మని విడనాడునొక్కొ, పెనువేది మునులు శపింతురో పట్టి
చెప్పకుండఁగ రాదు చెప్పకపోదు, తప్పెఁ గార్యము త్రోవ దైవమా యనుచు
నడలుచు నల్లన నడుగులు వణఁక, సుడివడి భ్రమయుచుఁ జొప్పఁ దప్పుచును
నడతెంచి దశరథునకు గురుభక్తుఁ, బడనేసి చంపిన పాపంబువచ్చెఁ
దండ్రికి వలెనె నందనునకు వచ్చె, నండ్రు భూపతులెల్ల నని తల్లడిలుచుఁ
దమయన్నఁ జేరి గద్గదకంఠుఁ డగుచుఁ, గ్రమమేది వగచుచుఁ గడఁగి మ్రొక్కుటయు
ననుజుని నెత్తి యొయ్యన గారవించి, కనుఁగవకన్నీరు గ్రక్కునఁ దుడిచి
యనుకంప మదిఁ బర్వ ననియె రాఘవుఁడు, అనఘ యేఁగలుగ నీకడల నేమిటికి
ధర్మవర్తనుఁడవు దానశూరుఁడవు, నిర్మలాత్మకుఁడవు నీతిమంతుఁడవు
దశరథక్ష్మాపాలతనయమాన్యుఁడవు, పశుపతివిక్రమప్రకటశౌర్యుఁడవు
అన్న నీముఖ మేల యటు చిన్నవోయె, నున్నది యేర్పడ నొగిఁ జెప్పు మనిన
జయశాలి యైనలక్ష్మణుఁ డిట్టు లనియె, భయనివారణ నీదుపంపునఁ బోయి

వనమూలఫలములు వలయునన్నియును, గాని యేను మెలఁగుచోఁ గ్రూరకష్టంబు
నొక్కటి మింట రా నొడిసి చేపట్టి, వెక్కసంబగు నొక్క వెదురుజొంపంబు
నఱికితి దాన నున్నతుఁ డొక్కమౌని, యొఱలుచు ధరఁగూలె నుగ్రుఁడో యనఁగ
నానేరమికిఁ గుంది నరనాథచంద్ర, రానేరకుండియు రానేర వలసె
ననవుడు రఘురాముఁ డాశ్చర్యమంది, యొవరకార్యము మది నూహించుచుండె
నంత నక్కడిమును లందఱుఁగూడి, యెంతయు నత్తెఱం గెఱిఁగింత మనుచుఁ
జనుదెంచి రఘురామచంద్రు దీవించి, ఘనతరమృదువాక్యగరిమ నిట్లనిరి
అఖిలేశ వినుము నీయనుజన్ముఁ డిప్పు, డఖిలలోకద్రోహి యైనరావణుని
చెలియలికొడుకగు జృంభుని నేఁడు, తులువను నిర్జించె దోషంబు లేదు
మునులెల్ల సంతసంబును బొంది రధిప, యనవుడు రఘురాముఁ డనియె మౌనులకు
నేవేల్పుఁగూర్చి వాఁ డిట్టితపంబు, గావించె ఖడ్గ మెక్కడనుండి వచ్చె
చీటికి మాటికిఁ జెడుదురే బుధులు, నాటికి హతుఁడుగా నజుఁ డేల వ్రాసె
నెంతకాలము చేసె నీయుగ్రతపము, సంతుష్టుఁడయ్యె నే సరసిజాప్తుండు
అంతయు నెఱిఁగింపుఁ డనిన నాభూమి, కాంతునితో మునిగ్రామణు లనిరి
తొల్లి దశాస్యుండు దోర్బలశక్తి, నెల్లదిక్కులు గెల్వ నెచ్చోట మదిని
బొరిది నమ్మగలేక సోదరిమగని, నురుపరాక్రముని విద్యుజ్జిహ్వుఁ బిలిచి
మన్నించి లంక యేమఱకుమీ యనుచు, సన్నుతి గావించి చనియె నంతటను
ఏను మాయలు నేర్చి యే దశకంఠు, రానీను లంకాపురంబుఁ గైకొందు
ననుచు విద్యుజ్జిహ్వుఁ డపుడు పాతాళ,మున కేఁగి రాక్షసముఖ్యులదండ
పాయక వారిచే బహువిధంబులైన, మాయలు నేర్చుచు మదవృత్తినుండె
అచ్చట రావణుం డఖిలదిక్పతుల, విచ్చలవిడి గెల్చి వెస లంకఁ జొచ్చి
ఘనత విద్యుజ్జిహ్వుకథ లెల్లఁ దెలిసి, కనుఁగవలను నిప్పుకణములు రాల
నాయాజ్ఞ నుండక నలిరేఁగి వీఁడు, పోయి మాయలు నేర్వఁబోలుఁ గాకేమి
మాయలన్నియు నేఁడు మాయమైపోవఁ, జేయుదు ననుచు నజేయుఁడై యరిగి
అస్మయనగరవాసాసురుల్ బెగడ, విస్మయకోపుఁడై వెస హేతిఁ బెఱికి
మఱది నాచెలియలిమగఁ డితఁ డనక, తఱిమి విద్యుజ్జిహ్వుతలఁ ద్రెళ్లనేసి
క్రమ్మఱ వేగ లంకకు నేగుదెంచి, రమ్మని చెలియ శూర్పణఖ నూరార్చి
యనియె నీవిచ్ఛావిహారిణి వగుచు, మనమున నీకు సమ్మత మైనపురుషుఁ
బొందుము వెఱవక పూని లోకముల, యందుఁ జరింపు పొమ్మనిన నార్నెలల

మునులు జంబునితపఃప్రభావంబు దెల్పుట

గర్భిణియై యున్నకతనఁ బై నెలలు, నిర్భరగతినుండి నెలఁతుక గాంచె
చటులోగ్రబలుఁ డైనజంబుకుమారు, నట వాఁడు పెద్దయై యాతల్లిచేతఁ
దనజనకునిచావు తప్పక దెలియ, విని తండ్రిపగ దీర్ప వెరవుఁ జింతించి
బ్రహ్మనుగూర్చి తపంబుఁ జేసినను, బ్రహ్మ వరం బీఁడు భవునిఁ గోరినను
అతఁడు భక్తుఁడుగాన నలుగఁ డాతనికి, నతులితగతి విష్ణు నర్థింతు నేని

చాల నాతఁడు మెచ్చి చనుదెంచి వరము, పాలించు టెప్పుడు నాపగదీరు టెప్పుడు
అరయఁ ద్రిమూర్తుల హరిహరబ్రహ్మ, లరవిందహితరూపమై యుండు నండ్రు
కావున రవిఁగూర్చి కడునిష్ఠఁ దపము, గావించి మెప్పించి కదనరంగమున
దనుజనాయకుఁ డైనదశకంఠుఁ ద్రుంతు, నని యెంచి తపముసేయఁగఁ బూనునంత
వనరుహాప్తుఁడు మెచ్చి వరఖడ్గ మొకటి, పనిచె దానవునకుఁ బగదీఱుటకును
దానిఁ గైకొనఁడయ్యె దర్పాంధుఁ డగుట, నానిమిత్తమున నీ మనుజునకబ్బె
నాహేతి యటుగాక యసురచేఁబడిన, సాహసంబున నేఁచు జగములన్నియును
దైవకృతంబున దైత్యుండు మడిసె, నీవిచారం బేల యినవంశతిలక
కలన రావణుఁ గెల్చెఁ గార్తవీర్యుండు, చలమొప్ప నాతనిఁ జంపె భార్గవుఁడు
నట్టి భార్గవ రాము నని లోనఁ బట్టి, కొట్టితి వీరంబు క్రొవ్వెల్ల నణఁగ
నట్టి నీచే రావణాదిరాక్షసులు, గట్టిగా దురమునఁ గడ తేరఁగలరు
అనవుడు రఘురాముఁ డాశ్చర్యమంది, వినతుఁడై మునుల వేడ్కతో ననిచె
నంత శూర్పణఖ నిత్యము దెచ్చినట్టు, వింతగా నన్నంబు వివిధభక్ష్యములు
పొసఁగ నించినబోనపుటికె చేఁబూని, వెస వచ్చి తునిసిన వెదురుజొంపంబు
నడుమ ఖండంబులై నలిఁ బడియున్న, కొడుకుఁ గనుంగొని కుంభిని వ్రాలి
తెలిసి యత్తునకలు దృఢముగాఁ గూర్చి, పలవించి పలవించి పడఁతి యిట్లనియె
నో కుమారకచంద్ర యుచితమే నన్నుఁ, గైకొన వదియేమి కన్నులు దెఱచి
తగుమామ యనక ప్రతాపలంకేంద్రుఁ, డగురావణునిఁ జంప నాత్మఁ గోరినను
నీకొనఁగూడునే నేరవై తకట, యా కార్తవీర్యుచే నణఁగెనే యతఁడు
అనరణ్యశాపాగ్ని నణఁగెనే యతఁడు, వనజసంభవుచాపవహ్నిచేఁ దెగెనె
నలకూబరునిచేత నడఁగెనే యతఁడు, అల నందికోపానలార్చులఁ బడెనె
శాండిల్యమౌనిరోషంబునఁ జెడెనె, యెండేల ధననాథుఁ డుండెనే లంకఁ
బగ వలదన్న నాపలుకుఁ గైకొనక, తెగితి రావణుఁ డేల దెగును నీచేత
ధర్మదేవతమాట తల్లిమాటండ్రు, నిర్మలాత్మక విననేరవై తకట
తపము పండె ననంగఁ దగనీకు బుద్ధి, గపటించె దైవంబు కత లేల యింక
నని యని శోకింపు యక్కుమారకునిఁ, గనుఁగొని యగ్నిసంస్కారంబుచేసి
యనతిదూరంబున నచలసమాధిఁ, దనరుచు నున్న పెద్దలఁ జేరఁ బోయి
యోరి కన్నులుమూసి యుడుగక నిష్ఠ, ఘోరతపంబు గైకొని సేయురీతిఁ
దలను మోపెడుజడల్ ధరియించి బూది, యలఁది జన్నంబున నందముఁ గూడి
తోలఁగక మేకపోతులమెడల్ విఱిచి, పాలుపార నుడికించి పొట్టలనిండ
నెట్టన నమలి యొండినకళాసములు, గట్టి యేమియు నెఱుంగనియట్లయుండి
క్రొవ్వి నాశిశువును గుమతులై పట్టి, యెవ్విధిఁ జంపితి రెఱిఁగింపకున్నఁ
దాపసాధములార తాపంబు దీర, వే పట్టి మ్రింగుదు విడువక మిమ్ము
నని యహహారావ మడర డగ్గఱిన, మునులెల్ల భీతిల్లి ముదిత కిట్లనిరి
విను శూర్పణఖ మునివేషుఁ డొక్కరుఁడు, చనుదెంచి నీపుత్త్రు సమయంగఁ జేసి

ఫలములు గొని యల్లపర్ణశాలకును, జలయింప కేఁగి యచ్చట నున్నవాఁడు
ముక్కుమో మేర్పడ మునికార్యమునకు, దిక్కుగల్గితిగాన తెలివ యందరుగు
మని చూపి చెప్పిన నాదుష్టబుద్ధి, కనలుచు నపుడు లక్ష్మణుఁడు వన్నట్టి
యడుగులచొప్పున నరుగ నమ్మునులు, పొడమినభీతిచేఁ బులి నాకి విడిచెఁ
దప్పకఁ దీనికిఁ దగినట్టిబుద్ధి, చెప్పి పంపుదు రింక చెలఁగి రాఘవులు
నాదట సకలదైత్యక్షయంబునకు, నాదికారణ మిది యని ముదమంద
నత్తఱి దరివేచి యసురేంద్రుచెలియ, లుత్తుంగ నాసియు నుగ్రభావంబు
గుఱువిలోచనములు కోఱదౌడలును, పఱపైన కడుపును బల్లనెంద్రుకలు
తెఱనోరు కరిమేను దీర్ఘజిహ్వయును, వికటమైన రూపును విషమదృష్టియును
నరుదార ధరియించి యాఁడురూపమునఁ, గరము గ్రముగ వచ్చు గరళమో యనఁగ
నొడిసి లోకములెల్ల నొగి మ్రింగఁజాలి, పొడమిన నొకమహాభూతమో యనఁగఁ
దఱిలేచి దైత్యసంతతినాశకాల, మెఱిఁగి భూస్థలిఁ దోఁచు మృత్యువో యనఁగ
నడచుచు వెస శూర్పణఖ యనునాతి, కడఁకతో రాముఁడగ్గరఁ జేరఁబోయి

## శూర్పణఖ రామునిఁ జూచి మోహించుట

యిందీవరశ్యాము నినకోటిధాము, సౌందర్యజితకాము జగదభిరాము
రాము దైతేయవిరాము వీక్షించి, కాముభూతము సోఁకఁ గనుఁగొనరాక
తామసగుణమేచి తన్ను లోకాభి, రాముఁగాఁ దలఁచి యారక్కసి నిక్కి
తనపెద్దమొగము నాతనిముద్దుమొగము, తనమహోదరము నాతనితనూదరము
తనతప్పుఁ గన్ను లాతని గొప్పకన్ను, లెనయంచుఁ దన కితఁడే తగునంచు
మొగము చాటంతగా ముసిముసినగవు, లిగురింప రఘురాము నీక్షించి పలికె
శరచాపములు పూని చరియింపనేల, యరుదైన యడవుల నతివయు నీవు
నీవేషమున నుండ నేమి కారణము, నీవెవ్వఁడవు మఱి నీకుఁ బేరేమి
యనవుడు రఘురాముఁ డల్లన నవ్వి, దనుజకామినితోడఁ దగనిట్లు లనియె
రామాభిరామ యోరామ నాపేరు, రాముఁడు దశరథరాజు మాతండ్రి
యాపర్ణశాలవాఁ డతఁడు నాతమ్ముఁ, డీపద్మలోచన యిల్లాలు నాకు
నేను దండ్రియుఁ బంప నీయరణ్యములఁ, బూని చరింతుఁ దపోవృత్తి నిపుడు
నీవెవ్వతెవు మఱి నీకుఁ బేరేమి, నీవేల వచ్చితి నేఁడు మాకడకు
నీవిలాసంబును నీవయోరూప, లావణ్యమును నింతులకు నెందుఁ గలదు
నావుడు నాశూర్పణఖ రాముఁ జూచి, వావిరిఁ బల్కె దుర్వారయై నిలిచి
యావిశ్రవసుకొడు కఖిలకంటకుఁడు, రావణుఁ డుగ్రవిక్రమయశోధనుఁడు
నాపటుసత్త్వన కనుఁగుఁజెల్లెలను, నాపేరు విను శూర్పణఖ యండ్రు తెలియ
నీరూపురేఖ లన్నియు సరిచూచి, కూరిమి నీకు నాకును దగునంచు
కామించి వచ్చితిఁ గడునొప్పురూపుఁ, గామించినప్పుడె కైకొననేర్తు
నెందైనఁ జననేర్తు నేవస్తువైనఁ, బొందుగాఁ దేనేర్తు భోగింపనేర్తు
నున్నదియేల నాయొప్పు భావించి, నన్ను పాణిగ్రహణంబు గావింపు

ఇది కులగుణహీన యిది వికృతాంగి, యిది నీకు మఱి తగునే యటుగాన
నీ మెలఁతుకఁ బట్టి యిప్పుడే మ్రింగి, రామ నీకోరివరతి సల్పెదాన
ననవుడు తనుఁ జేర నాసీతఁ దిగిచి, కొని రాఘవుఁడు దానికోర్కికి నవ్వి
కొంత హాస్యముఁ జేయఁ గోరి యాదనుజ, [illegible] గనుఁగొని పలికె
నేనింతగలవాఁడ నిది నన్ను నమ్మి, పూని నాతో వనంబునకు నేతెంచెఁ
దగిలి నీకొప్పింపఁ దగ దీలతాంగి, పగగొని సవతితోఁ బడఁజాల వీవు
ఈనాతి లేకున్న నింతకుమున్నె, యే నినుఁ గైకొందు నిప్పు డేమందు
వాఁడె నాతమ్ముఁడు వరతపోధనుఁడు, వాఁడు నాకంటెను [illegible]రూపధనుఁడు
తన కొక్కచక్కని దరలాయతాక్షి, ననుకూలసతిని నిత్యముఁ గోరుఁ గాన
నినుఁ బొంద నాతఁడు నేర్పునం దగుఁ, గనవుడుఁ గాఁబోలు నని [illegible]బోయి
నెలకొని లక్ష్మణ నిన్నుఁ గామించి, కలయ వచ్చితి నన్నుఁ గైకొను మనుఁడు
నారామునుపోల్గ మతఁడును దెలిసి, ధీరుఁడై దానితోఁ దెఱఁగొప్పఁ బలికె
మెలఁత మాయన్నఁ గామించితి తొలుతఁ, దలఁపున నటుగానఁ దగదు నిన్బొంద
సీత నిన్ బోలదు చెలువంబునందు, నీతఱిదీటును నీమురిపెంబు
భాతి నింకొకసారి పరికించెనేని, సీత నొల్లక నిన్నుఁ జెందు రాఘవుఁడు
రాముసన్నిధికి నేఁగుమని పొమ్మనిన, సౌమిత్రి మాటలు సత్యంబు లనుచుఁ
దామసి తనరోఁత దలఁపక మఱియు, రామునికడ కేఁగి రతికిఁ బ్రార్థించెఁ
వలవ దాతనిఁ బొందు వనిత నీవనిన, జలజాక్షి మఱియు లక్ష్మణునిఁ బ్రార్థించె
దమ్ముఁ డన్నను నన్న తమ్మునిఁ జూపఁ, ద్రిమ్మరి తనకోర్కి తీవిప్రాఁడ
మఱి మన్మథునిసూత్రమహిమచేఁ దిరుగు, తెరబొమ్మయో యనఁ దిరిగెఁ ఖేరాస
విరసవర్తనముల వెలఁది యిబ్భంగి, నిరువురసన్నిధి కెడ దాఁకి తాఁకి
వేసరి యన్యోన్యవివశవర్తనల, గాసిల్లి యెంతయుఁ గడుసల్గి పలికె
నోరి మానవులార యొకపేదరాలిఁ, గారించు తెఱఁగునఁ గాఁరింపఁదగునె
యేను గోపించిన నింద్రాదిసురుల, నైనను మ్రింగుదు నట మర్త్యులెంత
పొదివి యీయింతితో భువనంబులెల్ల, జదిమి మ్రింగుదు నని సంరంభ మెసఁగ
నది మృత్యువును బోలి యట్టహాసంబు, పొదలి డగ్గరవచ్చుపూనికఁ జూచి
జానకి దలఁకెడి సౌమిత్రి యింక, దీని మేలము చాలు దీని శిక్షింపు
మని రాఘవుఁడు పల్క నాలక్ష్మణుండు, విని పర్ణశాలకు వెలుపల నిలిచి
పడఁతి నీకింత కోపం బేల రమ్ము, కడమట్ట [illegible] గావింతు నిప్పుడె
యని లక్ష్మణుఁడు పల్క నాశూర్పణఖయుఁ, దనమది నుప్పొంగి డగ్గఱఁ జేర
ఘనవిషజ్వాలోరగముపుట్ట వెడలు, ననువున నోరఁ బాపి యదరులు చెదర
దనఖడ్గ మంకించి దానవురాలి, ఘననాసికము చెవు ల్గరమునఁ బట్టి
యేటిమసరసమో యిదియన నతఁడు, మాటిమసరసమో మగువరో యనుచుఁ
జేయొడ్డివలచివచ్చినఁ జెవుల్ముక్కు, పోయెనన్ సామెత పుడమిఁ బుట్టించి
ముక్కును జెవులును మొదలంటఁ గోయ, వెక్కుచు వేసారి వివశాత్మ యగుచు

శృంగంబుపగిలిన జేవురుగొండ, భంగి రక్తములొల్క భయమంది పాఱి
చని చతుర్దశసహస్రనిశాచరేంద్ర, జననవిరాజితస్థానంబునైన
ఖరునియాస్థానంబుకడకు వచ్చుటయు, ఖరుఁడును దానియాకారంబుఁ జూచి
వెఱగంది యిదియేమి వెలఁది నీరూపు, వెఱవక యెవ్వఁడు వికృతంబుసేసె
నెవ్వఁడు కాలాహి నెఱిఁగియుఁ ద్రొక్కె, నెవ్వఁడు మృత్యువు నిత్తఱిఁ జెనకె
వాని నెఱింగింపు వానిరక్తములు, వానిమాంసంబులు వడి నీకు నిత్తు
నని పేర్చి ఖరుఁడు తన్నడిగినఁ జూచి, వినుటకు వ్రేఁగైన వికృతస్వరమున
మునుకొన్నసిగ్గున మోము వంచి, వినిపింపఁ దొడఁగె నవ్వెలఁది యేడ్చుచును
విను మరణ్యమునందు వెఱవక యేను, చనుచోట నాజనస్థానంబునందు
నాసుతుఁ డైనట్టి నాకేశసదృశుఁ, [illegible]దూర్చి యట నిష్ఠనుండ
వాని వధించిరి పౌరుషమొప్ప, వానికిఁ గర్మముల్ వడిఁ జేసి పిదప
విను మరణ్యమునందు విపులసాహసులు, మునివేషధారులు మోహనాకృతులు
రామలక్ష్మణులను రాజనందనులు, కామించి యేను డగ్గఱుటయుఁ జూచి
పటుశక్తి నన్నంటఁబట్టి నావేష, మిటుచేసి విడిచిన నేను దుఃఖించి
నినుఁ గానవచ్చితి నీవింకఁబోయి, యొనసినకడఁకమై నిద్దఱఁ జంపి
వారిమాంసంబులు వడి నాకు నిచ్చి, వారక నాలోనివగలార్ప మనుడు
నింతమాత్రమునకై యేనేల వారి, పంతమదెంత నాపంపుఁ గైకొమ్ము

## ఖరుఁడు సేనలఁ బంపుట

అని పదునలువుర నంతకోపముల, ననలోగ్రతేజుల నప్పుడు పిలిచి
యీశూర్పణఖవెంట నేఁగి యానరుల, నాశంబునొందించి నాసహోదరికి
వారిశోణితము ద్రావఁగఁ జేయుఁ డనిన, వారును దుర్వారవారివాహములు
గాలితో వచ్చినకరణి నాజంత,తో లోలశూలకాంతులు మించులట్ల
చనుదెంచి రామలక్ష్మణసూర్యచంద్రులను గప్పి గర్జితాలాపముల్ చూప
దినకరకులుఁ డంత దేదీప్యమాన, ధనురాదిసాధనోద్దాముఁడై యెదిరి
వారును దనమీఁద వైచినయశని, దారుణశూలముల్ ధారణిఁ గూల్చి
వారినందఱ భూరివజ్రానుకారి, నారాచములఁ గంఠనాళముల్ చిదుమఁ
బరిపక్వఫలశిరోభాగముల్వ్రాసి, నిరుపమాశుగహతి నిట్టఱా ల్గ్లనఁగఁ
బుడమిపై గెడసి రప్పుడు చుప్పనాతి, మడెమెత్తుపరువున మఱియును బాఱి
ఖరునకు లోకభీకరునకు వారి, మరణంబు రఘురామువిహితరణంబు
నుగ్గడించుటయు నావహంతి వెగ్గలముగ, బగ్గుబగ్గునమండుపావకుఁ డనఁగఁ
గోపించి యపుడు మిక్కుటమైనకడిమి, దీపించి దూషణత్రిశిరులు మొదలు
వీరులు పదునాల్గువేలరాక్షసులు, ఘోరసత్త్వులు గొల్వఁ గొమరుదీపించి
తెరలిన సురలతో దివి తల్లడిల్లఁ, బొరలిన గిరులతో భువి పెల్లగిల్ల
రణభేరి వ్రేయించి రత్నశైలాభ,గణనీయశబళాశ్వకలితవైడూర్య
మణిఖాభరసువర్ణమయచక్రదశక, రణజయప్రదధనుర్బాణాసిపూర్ణ

రణితకింకిణి యైనరథమెక్కి వెడలె, రణబలోదగ్రుఁడై రఘురాముమీఁదఁ
ద్రిశిరుండు కంకపత్రశరుండు విలస,దశనికల్పుఁడు దిక్కు లదర నార్చుచును
వాసవవారణోజ్జ్వలభాసమైన, భాసురరాసభప్రకరసంభరిత
హాటకస్థగితశతాంగంబు నెక్కి, మేటికయ్యమునకు మేనుబ్బి వెడలె
బర్హిణవర్ణనిబర్హణపవన, గర్హణదణకాంతిఘనవేగతురగ
సందోహసంభృతస్యందనోత్తమము, ముందుగాఁ దోలించి ముదము గీలించి
సేనాముఖంబునఁ జెలఁగి దూషణుఁడు, నానాముఖంబుల నలువొప్ప డించె
ప్రేమతో మఱిపృథుగ్రీవుండు సైన్య,గామియు నవ్విహంగముఁడును మేఘ
మాలియు నగు మహామాలియు మఱియు, నాలోకభీకరుం డగుమహాసర్ప
ముఖుఁడును గాలకార్ముకుఁడు దుర్జయుఁడు, మఖశాత్రవుండును మఱి పరుషుండు
కారుణ్యదూరుఁ డాకరవీరనేత్రుఁ, డారుధిరాశనుండన నొప్పువాఁడు
ద్వాదశదైత్యు లత్తఱి ఖరుఁ గొల్వ, ద్వాదశాదిత్యప్రతాపులై చనిరి
త్రిశిరుండు మఱిప్రమాథియు రణోదగ్ర, యశమునఁ బేర్చుమహాకపాలుండు
స్థూలాక్షుఁడును రణోద్యోగులై సేన, నాలుగుముఖముల నడచి రేమఱక
భీషణకరిఘటాబృంహితతురగ,హేషారథస్వనానేకపదాతి
పటుతరహుంకారపటహభాంకార,పటుకేతుపటపటస్ఫారనాదములఁ
గ్రుంకె భూతలము దిక్కులు వ్రక్కలయ్యె,పొంగెఁ బయోధులు భూతముల్వణఁకె
బలములకెంధూళి భానుమండలము, కలదు లేదనఁ గప్పె గగనంబు నిండ
ఖరునికేతనముపై గ్రద్దలు వ్రాలెఁ, దురగముల్ మ్రగ్గె నెత్తురువాన గురిసె
నక్కలు వాపోయె నభము భేదిల్లెఁ, జుక్కలు డుల్లెఁ బఱులు చుట్టు నఱచె
మఱియు నుత్పాతము ల్మహినాకసమునఁ, దఱచుగాఁ దోఁప నింతయు భీతిలేక
ఖరుఁ డీతెఱంగునఁ గడఁకతో నడచి, యరుదైన యాదండకాటవిఁ జొచ్చె
ననుపమాకృతి రాముఁ డక్కలకలము, విని పర్ణశాలకువెలుపల నిలిచి
యవనిపై దివముపై నవశకునములు, వివిధముల్గనుఁగొంచు వెసఁ దమ్ముఁ బిలిచి
సౌమిత్రి సమరసూచకనిమిత్తములు, భూమిపైఁ బెక్కులు పుట్టుచున్నవియు
రట్టడి ముక్కడిరక్కసి మఱియు, దిట్టయై బలములఁ దెచ్చెఁ గావలయు
నదె సైన్యఘోషంబు లట్లకానోపు, నదె మహాబలధూళి యఖిలంబుఁ గప్పె
నవమైన రణమబ్బె నా కటుగాన, నదహితమతిఁ బూని యాలస్య ముడిగి
జనకజ నిక్కడఁ జన దుంచ నింకఁ, గొనిపోయి యగ్గిరిగుహ నుండు మనిన
నినవంశవల్లభ యే నెట్లు పోదు, నిను డించి యటుగాన నీవు సీతయును
బర్వతగుహఁ జేరి పరికింపు మేను, దుర్వారదనుజులఁ ద్రుంతు మీకృపను
అన విని వీరితో నాలంబుసేయ, నెనసె వేడుక నాకు నీ వుఁడవలదు
జనకజ తలఁకెడుఁ జనుమన్న సీతఁ, గొనిపోయి పర్వతగుహఁ జొచ్చియుండె
అంత రాముఁడు ప్రళయాంతకుపగిది, నెంతయుఁ గోపించి యేపుదీపించి
యమితమునిత్రాణ మగుకృపాణంబుఁ, గ్రమమొప్పగా వజ్రకవచంబుఁ బూని

శరశరాసనములు చతురుఁడై తాల్చి, యురుతరతూణీరయుగళంబుఁ బిగిచి
కొండపొల్లుగవచ్చు కుండలికుండ, లుండన విల్లు పెల్లుగ నెక్కుపెట్టి
యగణితధ్వనుల మిన్నంతయుఁ బగుల, తగిలి చాపము గుణధ్వనిచేయుచుండె
నింద్రుండు మొదలుగా నెల్లదేవతలు, సాంద్రరత్నవిమానసహితులై యపుడు
చదలెల్ల నిండి యెంచఁగ రాముఁ డొకఁడు, పదునాల్గువేల నప్రతిమవిక్రముల
ఖరదూషణాదిరాక్షసుల నేరీతిఁ, బొరిఁగొనునో చోద్యముగఁ జూత మనుచు
గనుఁగొనుచుండిరి కపటదానవుల, ఘనుఁడు రాముఁడు ద్రుంచుగాకంచు సారె
దేవర్షిగణములు దివినుండి తాము, దీవించుచుండిరి దివిరి పల్మాఱు
పదివేలకోటులభాను తేజములు, పొదిగొని లోకము ల్పొదివినయట్లు
రాముని తేజ మరణ్యభూజములు, భూమియు నభము నభ్రులు గప్పుటయును
జడమతులై సర్వసంభ్రమం బుడిగి, మిడుకుచుఁ గన్నులు మిఱుమిట్లుగొనఁగ
కడు నంధులైనరాక్షసులను జూచి, కడఁకతోఁ బల్కె నాఖరుఁడు దూషణుని
ఇదియేమి దూషణ యీసేన నడవ, దెదిరెనో పరసేన యేఆడ్డపడెనొ
యనిన దూషణుఁ డేగి యటఁ జూచివచ్చి, దనుజేశ రామునుద్దండ తేజంబు
కలయఁ బర్వుటయును గలిదప్పె ననుడు, నలుకమై ఖరుఁడు సైన్యములఁ దిట్టుచును

**ఖరునిసేనలు రాము నెదుర్కొనుట**

నరద మత్యుగ్రత నటఁ దోలుకొనుచు, నరుగుచో రాక్షసులందఱుఁ గూడి
భుజబలాటోపవిస్ఫురితప్రతాప, గజరథభటవాజికలితులై యకట
మండుకార్చిచ్చుపై మలయుచు మిడుత,తండంబు లొక్కటఁ దార్కొన్నకరణి
గడు నుగ్రవేగులై కాకుత్స్థరాము, వడిఁ జుట్టు ముట్టి దుర్వారులై కదిసి
శరచాపపట్టసశక్తిత్రిశూల, కరవాలకుంతముద్గరభిండివాల
పరశుతోమరగదాప్రాసఖడ్గములు, గురిసి యార్చిరి దేవకోటి భీతిల్ల
నప్పుడు రఘురాముఁ డంబుదపంక్తిఁ, గప్పిన చండాంశుగతిఁ గానఁబడక
కొంతసేపునకు రక్షోగణముక్త,కుంతాదిబహుశస్త్రకుటిలాస్త్రతతులు
నన్నియు మాయించె నైంద్రజాలమునఁ, జెన్నునఁ దను సురశ్రేణి కీర్తింప
మఱియుఁ దోడ్తో దైత్యమండలి గురియుఁ,దఱుచగు నస్త్రశస్త్రములఁ ద్రుంచుచును
ముందట నిరుపార్శ్వముల పిఱుందటను, సందడించిన దైత్యసైన్యంబుమీఁదఁ
గరలాఘవము మీఱఁ గవదొనలోన, శరములన్నియు నొక్కసారె సంధించి
పదియు నూఱును వేయుఁ బదివేలు లక్ష, పదిలక్షలటుకోట్లు పదినూఱుకోట్లు
మండితపరివేషమధ్యందినార్క, మండలపరివేషమహితానుకారి
కుండలీకృతచండకోదండదండ, భండనాత్యుత్సాహబాహుఁడై ప్రేయఁ
దునియు గంభీరవేదులును జోదులును, దునుకలై పడెడుపీరులును రౌతులును
ద్రుంగెడుబహుపదాతులును హేతులును, ముంగలఁ బడుశరంబులు శిరంబులును
మ్రొగ్గెడు యోధాంగములు రథాంగములు, మ్రగ్గెడు సగుణధర్మములు వర్మములు
తూలెడు రథికజాతులును సూతులును, గూలెడి వెలిగొడుగులుఁ బడగలును

నలిరైన మాంసఖండములు మొండెములు, గలిగి లోకైకభీకరమయ్యె రణము
అంత భానునిదీప్తి కంధకారంబు, [illegible] బటాపంచలైనట్లు
అతులవిక్రమధాముఁ డగు రామునకును, హతశేష మగుసైన్యమంతయు విఱిగి
ఖరునకు శరణన్న ఖరుఁడును వారిఁ, బురికొల్పి దూషణుఁ బోరికై పనుప
వాఁడును హతశేషవాహినుల్ దాను, వేఁడిమి సూపుచు వేవేగఁ బోదివి
తాలసాలశిలావితాననానాస్త్ర, జాలవర్షము రామచంద్రుపైఁ గురిసెఁ
గురిసిన తనమేనఁ గ్రొన్నెత్తురొలుక, నరుణారవిందాక్షుఁడై రాముఁ డలుక
గాంధర్వశరము రాక్షసులపై నేయ, సైంధవసింధురస్యందనసుభట
వీరుల కమ్మహావిశిఖరాజంబు, తేరిచూడఁగరాక దేదీప్యమాన
ధారాకరాళమై దనుజవర్గముల, గారించి నొంచి చీకాకు గావించి
దండించి ఖండించి తల లుత్తరించి, చెండాడఁ-చో రణక్షితియెల్ల నిండి
యెందుఁ జూచిన తురంగేభఖండమ్ము, లెందుఁ జూచిన నింగి కెగయు మొండెములు
నెందుఁ జూచినఁ బ్రేవు లెఱచియు మెదడు, నెందుఁ జూచిన నెత్తుటేర్లు నైయుండె
శాకినీభూతపిశాచభేతాళ, డాకిను లంతఁ దండంబులై యపుడు
నేనుంగుతలకాయ లెసఁగఁ గుండలుగఁ, బూని యందలిముత్యములు దండులముగ
దండి రామునిరణధర్మసత్రమున, వండివా రిదె రండు వరుస భుజింప
నని వేడ్కఁ బైకొన్నయధికారముద్ర, గొని రొనగాకుండఁ గూర్చుండఁబెట్టి
రక్తచందనమును రక్తాక్షతములు, రక్తసంకల్పపూరంబును దాల్చి
శరవహ్నిపక్వమాంసంపుటన్నములు, పొరలిన మెదడుపప్పును గొవ్వులందు
వరదలై యాజ్యప్రవాహముల్ కండ, లెరిగి కారిజము లనేకశాకముల
పాలప్రేవులు శాపపాశముల్ మేలి, వాలుగుండెలు పిండివంటలు మఱియు
నెత్తురు తియ్యనినీరుగాఁ దలఁచి, యత్తఱి విప్రయోగ్యాహార మగుచు
నానందతృప్తులై యధికసమ్మదము, చేసూని సభగూడి శ్రీరామచంద్ర
'ధీవిజయోఽస్తు'ని దీవించికొన్ని, యావలఁ గొన్ని 'తథాస్తు'ని పల్క-
నింతలో మఱికొన్ని యేనుంగు జీవ, దంతములేతను తాళము ల్పూని
పొలసు లెమ్ములు సంకుపూసలపేర్లు, కళుకు కామాక్షులుగా ధరియించి

**శ్రీరామునితో ఖరదూషణము పోరుట**

కరఘంటికాతాళగతుల కుబ్బుచును, దరి జేరి కాపు లత్తఱిఁజూపెఁ గొన్ని
అంతదూషణుఁడు మత్తారిభీషణుఁడు, వంతనొందుచుఁ దనచెంతయోధులను
విజయశీలుర నైదువేలఁ బంపుటయుఁ, ద్రిజగము ల్వణఁక నెదిర్చి వారపుడు
చాపవిద్యాప్రౌఢి సకలంబుఁ జూపఁ, జూపులఁ గోపంబు చూపుచు నృపుఁడు
నొక్కొక్క శరమున నొక్కొక్కదనుజుఁ, దక్కక ద్రుంచి విదారించి విభుఁడు
కొందఱ నందందఁ గుదులుగాఁ గ్రుచ్చి, యందఱఁ దెగటార్చి యార్చినఁ జూచి
దూషణుం డత్తఱి దూరుఁడై పరుష, భాషణుండై రాముపైఁ దేరుఁ బఱపి
దశదిగంతంబులు దట్టంబుగాఁగ, నశనికాలాహితుల్యంబులై యొప్పు

నమ్ములు నిగుడింప నవి ద్రుంచి నాలు,గమ్ముల రథమును హయములఁ ద్రుంచి
వెరవొప్ప నొకకోల విలుద్రుంచుటయును, దురమున విరథుఁడై దూషణుఁ డలుక
[illegible] కారణాంతకగదాకల్పమై యొప్పు
పరిఘంబుఁ ద్రిప్పుచుఁ బఱతేర రాముఁ, డురుశరద్వయమున నురుబాహుయుగము
నరుదుగా దెగనేసి యాముఖ్యబాణమున, నురమేయుటయు దైత్యుఁ డొరలుచుఁ
దంతము ల్విరిగిన దారుణభద్ర,దంతావళేంద్రంబు ధరఁ గూలినట్లు [కూలె
కూలినఁ జూచి ముగ్గురుదండనాథు, లాలోఁ బ్రమాథిమహాకపాలుండు
స్థూలాక్షుఁడును బరశువు త్రిశూలంబు, కేలఁ బట్టసము లంకించి వైచుటయు
వారిశస్త్రంబులు వారిమస్తకము, శ్రీరాముఁ డొక్కఁడె చెండిచెండాడె
నప్పుడు ఖరుఁడు సేనాధినాయకుల, ముప్పిరిగొనురోషమునఁ బురికొల్పె
వారుపన్నిద్దఱు అవార్యశౌర్యమున, వీరరాఘవుఁ దాఁకి వేర్వేఱఁ బోరఁ
గులిశధారాంకారఘోరబాణములఁ, గలిమిఁ జూపుచు సైన్యగామి నుక్కణఁచి
కాలకార్ముకుఁ ద్రుంచి కరవీరనేత్రుఁ, దూలించి సర్పాస్యుఁ ద్రుళ్లడంగించి
యావిహంగము నొంచి యజ్ఞశత్రువుని, చేవ యడంచి శిక్షించి దుర్జయుని
కేలి మహామాలిఁ గెడపి యామేఘు, మాలిని వధియించి మర్దించి పరుషుఁ
బృథు[illegible]ంబు పృథ్విపైఁ గూల్చి, రుధిరాశనుని జంపి రోషంబు మిగుల
దిక్కేది ఖరుఁడును ద్రిశిరుండు దక్కఁ, దక్కినవారినందఱ నేలఁ గూల్చె
నీలీల రాముచే నెల్లసైన్యములు, గాలిచేఁ గూలినకారాకు లనఁగఁ
గూలినఁ గోపంబు గొని కాలత్రిశిరుఁ, డాలోన రాముపై నరదంబుఁ బఱపి
సింహనాదముఁ జేసి సింధురోత్తమము, సింహంబు నెదిరిన చెలువున నెదిరి
గుణనాద మెసఁగ రక్షోవీరుఁ డకట, గణనాపరంపరల్ గడవ నందంద
నతులబాణము లేయ నలిగి రాఘవుఁడు, ప్రతిబాణతతులచే బలువిడిఁ ద్రుంచె
వాఁడును మఱి పేరువాఁడి వాఁడిమిని, మూఁడుబాణముల రామునిఫాలమేసె
నావాఁడిబాణంబు లళికంబు దాఁక, నవ్వుచుఁ గినుకమై నళినాప్తకులుఁడు
త్రిశిరుని నేసినఁ ద్రిశిరము ల్కసుసు, దశదాల్చె నిఁకఁ జతుర్దశభువనములు
దూరిన నినుఁబట్టి తునుమాడునట్టి, దారుణతరచతుర్దశసాయకముల
లేనేయువాఁడ సహింపుమీ యనుచుఁ, దానేసెఁ బదునాల్గుదారుణాస్త్రములు
అవి త్రొమ్ము గొని గాడి యవ్వల వెడల, నవనీస్థలముగాడె నంత రాఘవుఁడు
అరదంబు మఱినాలు గమ్ముల విఱిచి, యురువడి పదియుంట నురమేయుటయును
సురవైరి కోపించి శూలంబు వైవ, నరనాథుఁ డది ద్రుంచె నాలుగస్త్రములఁ
ద్రుంచి మూఁడమ్ముల దుదమూఁడుతలలఁ, ద్రుంచినఁ ద్రిశిరుండు దురమునఁ గూలె
మూఁడుకొమ్మలతోడ మొదలంటఁ ద్రవ్వి, పోఁడిమిచెడి కూలుభూజంబుపోలెఁ
ద్రిశిరుండు గూలఁగ దృష్టించి ఖరుఁడు, దశరథరాముచేఁతకుఁ జోద్యమంది
మఱిచాలఁ గోపించి మహనీయరథము, దఱిమి యుగ్రాస్త్రసంతతు లేయఁజూచి
శరలాఘవము మెచ్చి జానకీవిభుఁడు, ఖరునిపైఁ బ్రతిసాయకములు వేయుటయు

ఖరునిబాణములు రాఘవునిబాణములు, ధరణీతలము వియత్తలమును బొదివె
నప్పు డర్కునిదీప్తు లన్నియు మాసెఁ, గప్పెను నిబిడాంధకారంబు దిశల
ఖరుని రాఘవుఁడు రాఘవుని నాఖరుఁడు, సరకుగాఁ గొని రాజి జయకాము లగుచుఁ
గాసరయుగళంబు కలభద్వయంబు, కేసరియుగళంబు కెరలి యొండొండఁ
బోరెడుగతిఁ దోఁప భుజబలాటోప, భూరిప్రతాపులై పోరాడుచోట
ఖరుఁ డప్పు డలిగి రాఘవుచేతివిల్లు, సరిద్రుంగు వెస నర్ధచంద్రబాణమునఁ
ద్రుంచి జోదును ద్రుంచఁ దొడ్తొడ మఱియు, ముంచె రాముని దేహమున నంపవెల్లి
నాయంపతండంబు నాతఁడు సరకు,సేయక తను సురశ్రేణి కీర్తింప
నుష్ణాంశకులుఁ డగస్త్యునిచేతఁ గొన్న, వైష్ణవచాపంబు వడి నెక్కువెట్టి
శింజిని మ్రోయించి శితసాయకముల, భంజించె రాక్షసప్రవరుకేతనము
మఱివాఁడు రాముమర్మము లుచ్చిపాఱఁ, గఱకుటమ్ములు నాల్గు గద్దించి యేయ
రక్తసిక్తాంగుఁడై రాఘవుం డంత, నక్తంచరుని నొంచె నారాచనిహతిఁ
బటుబాణ మొకటఁ జాపము ద్రుంచివైచె, నటు నాలుగిట వాని హయములఁ జంపి
సారథిఁ బడనేసి సాయకవహ్ని, కారథం బపుడు పూర్ణాహుతి చేసె
విలుగోలుపడి యిట్లు విరథుఁడై ఖరుఁడు, ప్రళయకాలాంతకప్రతిముఁడై కేలఁ
జలమున గద గొంచుఁ జనుదెంచుటయును, జలియించె గిరులతో జగతియంతయును
నప్పుడు రఘురాముఁ డాదుష్టదైత్యుఁ, దప్పకఁ గనుఁగొని దర్పించి పలికె
నోరిరాక్షస వినరోరి నాచేత, శూరత నీకేల చొప్పడు నింక
నీబలంబులు సచ్చె నీవారు తెగిరి, నీబాణసంపద నిర్మూలమయ్యె
నరుదుగా నీదండకాటవిఁ ద్రొల్లి, పెరిగి సన్మునులఁ జంపినపాపఫలము
కుడువఁ గాలమువచ్చెఁ గుడుతుగా కింక, నడరి వధింతు ఘోరాజిలో నిన్ను
ననవుడు ఖరుఁ డప్పు డారాముఁ జూచి, కనలుచుఁ బలికె దోర్గర్వంబు మెఱసి
యేల రాఘవ నీకు నింత గర్వింప, నాలంబులోఁ గొంద ఱల్పులఁ జంపి
కెలయుచు నిను నీవె కీర్తించుకొనెదు, కులజుండు తనుఁదానెఁ గొనియాడుకొనునె
ఇదె గదాధరుఁడనై యేతెంచినాఁడ, కదిసి పోరాడు నాకడిమియుఁ జూడు
దేవతలకునైనఁ దీరదు గెలువ, నీవు నాముందఱ నిలువ శూరుఁడవె
యొండొండఁ గడఁగి నీయొడలిమాంసములు, చెండాడి నేఁడు నాచెలియలి కిత్తు
నని మహాగదఁ ద్రిప్పి యడరి వైచుటయు, ననిలునివేగంబు నర్కుతేజంబు
ననలునివేడిమి యశనిబెట్టిదము, ఘనగదారూపమై కదిసినయట్లు
చనుదేర నుద్దండచండకాండములఁ, గనల కారాముఁ డాగదఁ ద్రుంగనేసి

ఖరుఁడు శ్రీరాముల నెదుర్చుట

యోరి నీగర్వోక్తు లుబ్బును మదము, దీరెనె బింకముల్ దీరెనే యనుడు
గద్దించుచును వాఁడు కడువడితోడ, నద్ధనుజుండు మహారోషమునను
గ్రక్కున వృక్ష మొక్కటి పెల్లగించి, చిక్కనభుజశక్తిఁ జిరజిరఁ ద్రిప్పి
చావుమటంచును జయ్యన వైవ, నావృక్షమును ద్రుంచి యపుడు రాఘవుఁడు

ఖరునిపై ఖరకరకరసహస్రాభ,శరసహస్రము లేసి చాల నొప్పింప
నొచ్చియు వాఁడు తనూరక్తధార, పిచ్చిలఁ దెచ్చుకోల్చిరంబు మీఱ
నెదురుగాఁ జనుదేర నీక్షించి రాముఁ, డదయుఁడై భువనంబులన్నియు వణఁక
నురవడి నైంద్రాస్త్ర మొకట సంధించి,యురమేయుటయు దైత్యుఁ డుబ్బెల్లఁ బొలిసి
పిడుగడచినకొండ పృథివిపైఁ గూలు, వడువున ఖరుఁ డంత వసుధపైఁ గూలె
నని ముహూర్తము ముహూర్తార్ధంబులోన, దను నెదిర్చిన చతుర్దశసహస్రముల
ఖరదూషణాదిరాక్షసుల నీరీతిఁ, బొరిగొనుటయు రాముఁ బొగడిరి సురలు
మునులు దీవించిరి మొగిఁ బుష్పవృష్టి, యనిమిషు ల్గురియించి రారామునిమీఁద
ఘనశైలగుహనుండి కడఁకతో నంత, జనకజఁ గొనివచ్చి సౌమిత్రి మ్రొక్కి
యభినుతు లొనరించి యప్పు డారాము, విభునిచే శోభిల్లువిల్లందుకొనియె
నూనినసంతోష ముల్లంబు నిండ, జానకీపతి పర్ణశాల కేతెంచి
కలహించి తెగినరాక్షసుల భూమిజకుఁ, దెలియఁ జెప్పుచు వినోదించుచునుండె
అప్పు డకంపనుఁ డఖిలకంపనుఁడు, విపులార్తి లంకకు వేగంబె పోయి
యారావణునిఁ గాంచి యసురాధినాథ, వీరులు పదునాల్గువేలరాక్షసులు
ఖరదూషణాదులు కాకుత్స్థరాము, శరవహ్ని నీఱైరి సత్యంబటన్న
అక్కజంబుఁబొంది యాయకంపనుని, దిక్కుచిక్కనిరోషదృష్టిఁ జూచుచును
నేమేమి యిదివింత యెట్లు రా యోరి, రాముఁ డెవ్వఁడు రాజరాజో స్వారాజో
యమరాజో వారైన నామహాఖరుని, సమరానఁ ద్రిశిరదూషణులను గెల్వఁ
జాల రట్టిప్రతాపశాలుర నొక్కఁ, డేలీలఁ గెల్చె మా కెఱిఁగింపు తెలియ
నిదె యభయంబు నీకిచ్చితి ననినఁ, బదరక మఱి యకంపనుఁడు రాఘవుని
చరితంబు ధైర్యంబు శౌర్యంబు నతఁడు, ఖరదూషణాదుల ఖండించుటయును
సౌమిత్రియందంబు జానకియంద, మామూలముగఁ జెప్ప నతఁడు రోషించి
యుద్ధంబునేయ నుద్యోగింప నతఁడు, బద్ధమైత్రిని నకంపనుఁ డిట్టులనియె
రాక్షసేశ్వర విను రఘురాముఁ గెలువ, పక్షివాహనశూలపాణుల వశమె
మాటమాత్రంబున మహియు నాకసము, మీటను నాట నమ్మేటియే నేర్చుఁ
గార్చిచ్చునైనను గరువలినైన, నార్చను గూర్చను నాతఁడే నేర్చు
భువనంబులన్నియు బూదిగావింప, నవి బోదిగావింప నాతఁడే నేర్చుఁ
బొల్పడ బ్రహ్మాండభాండంబునైన, నిల్పఁ బగుల్ప నానిపుణుండె నేర్చు
నదిగాన నొకయుపాయంబును గలదు, కదనంబు వలవ దాకాకుత్స్థకులుని
దేవి లావణ్యవార్ధిని దెచ్చితేని, యావియోగాగ్నిచే హతుఁడగు నతడు
నావిని రాక్షసనాయకుం డదియ, భావించి యాతనిఁ బదినోళ్లఁ బొగడి
హాటకరథమెక్కి యాయబ్ధి దాఁటి, తాటకేయుని మంత్రిధౌరేయుఁ జేరి
యతనితో ఖరదూషణాదిరాక్షసులు, హతులౌటయును దాను నారాముదేవి
సీతఁ దెచ్చుటకు నాసించివచ్చుటయు, ప్రీతిఁ జెప్పుటయు మారీచుఁ డిట్లనియె
నిదియేమిః రావణ యెల్లభోగములు, కొదలేక సుఖమునఁ గుడిచి కూర్చుండి

యిట్టిదుర్బుద్ధి నీ కెట్లొకో పుట్టె, నెట్టిదుర్మతియు నీ కేబుద్ధి చెప్పె
వాని నీవటు పగవానిగా నెఱుఁగు, మే నీకుఁ బోరాని హితమతిగాని
యితరుండఁ గాను నీ కేబుద్ధిగాదు, క్షితిఁ బతివ్రతల కాశించుట తగదు
ఆశించితేని నీయన్వయంబెల్ల, నాశమౌఁగాన దానవనాథ నీవు
చనుము లంకకు సుప్రసన్నుఁడ వగుము, గనుము సౌఖ్యము నీదుకాంతలవలన
ననిన మారీచువాక్యంబు లప్పటికి, విని లంక కేతెంచె వింశతిభుజుఁడు
అంత నాఖరదూషణాదిరాక్షసులు, పంతంబుచెడి రామబాణాగ్నిఁబడుట
యంతయు నటచూచి యాచుప్పనాతి, సంతోష మెడలినఁ జనిలంకఁ జొచ్చి
యాసుధర్మాస్థానమందుఁ జింతామణిసింహపీఠినుండెడియింద్రుఁ డనఁగ
మానితం బగుసభామంటపవేదిఁ, బూనిక సింహాసనంబున నున్నవాని
గరుడోరగామరగంధర్వయువతు, లురుమతిఁ గొల్వఁ గొలువున్న రావణుని
యిరావతోగ్రదంతాగ్రసంఘట్టి, తోరస్థలస్థగితోరుభూషణునిఁ
సకలలోకైకభీషణుని సంగ్రామ,వికటభాషణుని విద్వేషదూషణునిఁ
గని మ్రొక్కి యేడ్చుచుఁ గరములు మొగిచి, తనలోనిఘనవిషాదము తోఁపఁ బలికె
అసురేంద్ర లోకంబు లన్నిటియందు, నసమానసత్త్వుండ వనుకొందువీవు
కడిమిమై మూఁడులోకంబుల రిపులఁ, గడగి చంపితినని గర్వింతువీవు
కడఁక నారాజ్యమకంటకం బనుచు, నొడివి పెల్లుబ్బి వినోదింతు వీవు
చారులయందును జనవరులందుఁ, గోరి బొక్కసమందుఁ గోరికలందు
గూఢచారులయందు గుప్తంబులందు, రూఢిగాఁ దెలియుచు రూపించువాఁడె
సకలలోకములకు స్వామినాఁబడును, వికటంబులైన నీవిద్యలకలిమి
నీవిక్రమంబును నీభుజాబలము, నీవిభవంబులన్నియు మున్నెకాక
యింకఁ జెల్లునె యిది యెట్లంటివేని, కొంకక విను భానుకులపావనుండు
తనతండ్రి దశరథధరణివల్లభుఁడు, తనుఁ బంప రాముఁడు తాపసవృత్తిఁ
దనకు గాదిలిసహోదరుఁడు లక్ష్మణుఁడు, తనదేవి సీతయుఁ దాను నేతెంచి
మును దండకావనంబునకును వచ్చి, యనుకంప మునులకు నభయంబు లిచ్చి
వచ్చి యిమ్ములఁ బంచవటి నున్నచోట, నిచ్చలోఁ గామించి యేను దగ్గఱినఁ
గరమల్గి నన్నిట్లు గాసిసేయుటయు, ఖరునితోఁ జెప్పిన ఖరుఁడు బిట్టలిగి
రోషించి లయకాలరుద్రుండువోలె, దూషణత్రిశిరులతో దండు వెడలి
నరభోజనులు పదునాలుగువేలుఁ వరవీరభటులతో వడి నేగుదెంచి
బలువడి రఘురామబాణాగ్నిశిఖల, బలములు దానును భస్మమై మడిసి
రటుగాన నాభంగమంతయు నీగ, నిట నీవెకాక దిక్కెవ్వరు గలరు
ఇదె నాదుముఖభంగ మీక్షింపు నాదు, కొదువ నీకొదువగాఁ గోర్కి భావింపు
మనిన నచ్చెరువంది యాత్మ భావించి, దనుజాధినాథుఁ డాదానవి కనియె
జ్ఞాతివధంబు నీచన్నవిధంబు, ఖ్యాతి వింటిని గంటి నది యటులుండె
నోరామ యారామునురుసత్త్వమెంత, యేరూప మేప్రాయ మెంతటివాఁడు

అతనితమ్మునిరూప మది యెట్టి దతని, సతియైనసీత యేచందంబురూపు
చెప్పుమా నీవు చూచిన తెఱంగెల్లఁ, దప్పి తీరుతు రక్తధారల నీకు

### శూర్పణఖ శ్రీరాములరూపాతిశయముఁ దెల్పుట

నావిని యాశూర్పణఖ యిచ్చఁబొంగి, రావణునకు నేర్పడ నిట్టు లనియె
నున్నతోన్నతవక్షుఁ డుత్పలశ్యాముఁ, డిన్నిలోకములకు నెక్కుడువాఁడు
మిగులఁ జక్కనివాఁడు మిహిరమండలముఁ, దెగడుతేజమువాఁడు ధీరవర్తనుఁడు
నాజానుబాహుఁ డుదగ్రవిక్రముఁడు, రాజీవనేత్రుండు రామచంద్రుండు
అతఁడెపో ఖరదూషణాదిరాక్షసులఁ, గృతమతి నొంటిగా గెలిచినజోదు
హేమవర్ణుఁడుగాని యిన్నిచందముల, సౌమిత్రి రఘురాముచందంబువాఁడు
వాఁడెపో నా కీయవస్థ గావించి,వాఁ డింక సీతసౌందర్యంబు వినుము
తెఱఁగొప్పఁ జూచితి దేవకామినులఁ, దఱిఁగొని చూచితి దనుజకన్యకలఁ
గేలిమైఁ జూచితిఁ గిన్నరాంగనలఁ, బోలించి చూచితి భోగికామినులఁ
గలయంగఁ జూచితి గంధర్వసతుల, నలవడఁ జూచితి యక్షకామినులఁ
జూచితిఁ బార్వతిఁ జూచితి సతినిఁ, జూచితి భారతిఁ జూచితి లక్ష్మిఁ
జూచితి రంభను జూచితి శచిని, జూచితి భూలోకసుదతుల నెల్ల
మునుకొని చూచితి మునికన్యకలను, బనివడి చూచితి బ్రాహ్మణస్త్రీల
నాచన్ను లాకన్ను లాముద్దుపల్కు, లాచెక్కు లాముక్కు లాసోయగంబు
లాతీరు లాకురు లావాలుచూపు, లాతొడ లాయొడ లాయొయ్యారంబు
లామందహాసంబు లావిలాసంబు, లామృదుగమనంబు లాసుమనంబు
నేముందు పొడగాన నేయింతులందు, భూమిజ నేమని భూషింతుఁ జెపుమ
నెగడ లోకములేలు నీయట్టిపతికి, దగుఁగాక యాయింతి తగునె యన్యులకు
నాయిందుబింబాస్య యాచకోరాక్షి, యామొలజవ్వని యాకుందరదన
యామత్తగజయాన యాలతకూన, యామానినీమణి యాపద్మగంధి
యాయింతి నీయింతి యైయుండెనేని, నీయాన దనుజేశ నీరాజ్య మొప్పు
ననిన రావణుఁడు కామాతురబుద్ధి, మును నకంపనుమాట ముద్దియమాట
విన నొక్క తెఱఁగంచు విస్మయంబంది, గొనకొన్న ప్రేమమైఁ గొలువు చాలించి
తనపాలివిధి తన్నుఁ దగిలి ప్రేరేపఁ, జని యేకతంబున సారథిఁ బిలిచి
యరదంబుఁ దెమ్మన్న నతఁ డట్ల సేయ, ఖరకరసదృశంబు కామచారంబు
ననుపమాయుధపూర్ణ మగురథం బెక్కి, దినకరకోటీరదీప్తుఁడై మెఱసి
గగనమార్గమున సాగరమధ్యవీథిఁ, దగినవస్తువిశేషతతులు చూచుచును
దమకించి వడి సముద్రము దాఁటి పోయి, క్రముకమరీచికాగరునారికేళ
సాలతక్కోలరసాలవిశాల, వేలావనంబులు వేడ్కఁ గన్గొనుచు
గరుడుండు మును సుధాకలశంబు దేరఁ, గరమర్థిఁ బోవుచో గజకచ్ఛపముల
భక్షించుకొఱకునై పదమూఁదినట్టి, వృక్షంబు పక్షీంద్రవృతలక్షణంబు
శతయోజనాయతశాఖంబు మాని, వ్రతము సుభద్రాఖ్య వెలయువటంబు

శ్రీసుముఖుఁడై కనుఁగొంచు సురుచిరమహిమ, నమరిన యాసుచంద్రాశ్రమభూమిఁ
గ్రమ మొప్ప జడలు [illegible] దాల్చి, సమచిత్తుఁడై కడుసాధుత్వభావమున
భూరితపోనిష్ఠఁ బొలుపారుచున్న, మారీచుఁ జేరి సన్మానంబు వడసి
య[illegible]ఁడై యాపంక్తికంఠుఁ, డతనితోఁ దనదుకార్యముఁ జెప్పఁదొణఁగె
మారీచ నీవాప్తమంత్రివి గాన, వారక మఱియును వచ్చితి వినుము
తరణివంశుఁడు రామధరణివల్లభుఁడు, ధరణి యేలఁగనీక తండ్రి పొమ్మనిన
ననుజన్ముఁడును దాను నతివయుఁ గూడి, వనమునఁ దపసులై వర్తింప వచ్చి
తనసత్త్వమునఁ జేర్చి దండకారణ్య, మునులకు నభయ మిమ్ముల నిచ్చి వచ్చి
నడుకక మనశూర్పణఖ ముక్కుఁజెవులు, కడునల్కఁ గోసె నక్కట యకారణము
ఖరదూషణాదిరాక్షసుల ఖండించె, దరమిడి మఱి చతుర్దశసహస్రములఁ
దెగినబంధులకుఁ బ్రతీకారమేను, నెగడి సేయకయున్న నెంజిలి పోదు
నీవు మున్ గఱపిననీతి నట్లున్న, నావల నభిమానహాని గాకున్నె
తగదటుగాన నాతనిదేవి మాయఁ, బొగడొందఁ గొనితేరఁ బోవుచునుండి
యలవడ నొకయుపాయము గంటి నేను, దలకొన్న నది నాకుఁ దగిలి సిద్ధించు
నడరెడుకడఁకతో నాపర్ణశాల, కడకేఁగి మాయామృగంబవై నీవు
చెలఁగుచు వర్తింప సీత నిన్ జూచి, మెలుపొంద రామసౌమిత్రులఁ బిలిచి
నినుఁ బట్టి తెమ్మన నీవును వారిఁ, గొనిపోయి మృగవృత్తిఁ గుశలత మెఱసి
పోయి దుర్గాంతరంబుల గాఁడుపఱచి, మాయమై నీయాశ్రమము వచ్చి చొరుము
ఏనును జానకి నిట లంకలోని, కూనినవేడ్కమై నొగిఁ దెచ్చుకొందు
నారాముఁడును విరహాగ్నిచేఁ గుందుఁ, గోరి యేనును గోర్కి కొనసాగియుందు
నిది యిట్లు కావింపు మేను నారాజ్య, పదవిలో సగఁబాలు పంచి నీకిత్తు
ననవుడు మారీచుఁ డానీచుఁ జూచి, ఘనభీతి నెంచి శోకసముద్రవీచి

## మారీచుఁడు శ్రీరాముని ప్రభావముఁ దెల్పుట

మునిఁగి మూర్ఛిలి లేచి మోమోట ద్రోచి, దనుజేశ మఱియు సీతఁ బెట్టు పుట్టెఁ
గూడునే యిటు పల్కఁ గోరి యాత్రోవ, యోడక నీకెవ్వఁ డుపదేశమిచ్చె
సుకసుకంబుననుండి సుతసోదరాది, సకలబాంధవులతోఁ జావఁ గోరెదవు
కటకటా యెవ్వనిగాఁ జూచినావు, కుటిలరాక్షసలోకకులభీము రాము
నేను బాల్యంబున నెఱుఁగుదుఁ గొంత, యానిత్యకల్యాణుఁ డసమసాహసుఁడు
అడరి విశ్వామిత్రుయాగంబుఁ గావఁ, గడఁగి యాతఁడు వచ్చి కాపున్న చోట
బలిమిమై నేను సుబాహుండు పోర, నలుక సుబాహు నొక్కమ్మునఁ ద్రుంచె
నొకకోలఁ బుచ్చి పయోధిమధ్యమునఁ, బ్రకటితగతి నన్నుఁ బడవైచె నుఱక
నకృతాస్త్రుఁడై బాలుఁడై పిన్ననాఁడె, యకలంకుఁ డిట్టి శౌర్యముఁ జూపినాఁడు
నేఁ డస్త్రబలశౌర్యనిధి రామచంద్రు, వాఁడిమిఁ జెనకి యెవ్వరు నిల్చువారు
ఇప్పటిశౌర్యంబు నెఱుఁగుదు కొంత, తప్పక విను ముగ్రదానవాగ్రణుల
నిరువురతోఁ గూడి యేఁ బూర్వరోష, భరమున వ్యాఘ్రరూపముఁ దాల్చి ర

తపమునఁ గృశుఁగాఁగఁ దలఁచుచుఁ బోవ, నపుడేమిచెప్ప మూఁడంబకంబులను
ముగ్గురినేసిన మ్రొగ్గి యిద్దఱును, మ్రగ్గి రాయుశ్శేషమహిమ మెట్టిదియొ
యే నొక్కవిధమున నిక్కడఁ గూలి, ప్రాణంబు లుండుటఁ బట్టి చూచుకొని
యంతనుండియు రామునతులవిక్రమము, చింతించి నాలోనిచేవఁ బోవిడిచి
రవమన్న రథమన్న రమణీయమన్న, రవియన్న రతియన్న రత్నంబులన్న
మఱియు రేఫాదినామము లెవ్వి విన్నఁ, దఱుచైనభీతి నాతనిగ నెన్నుచును
ఈవిధిఁ దపసినై యిట్లున్నవాఁడ, రావణ యెఱుఁగవు రాముపౌరుషము
తలఁపక తనరోఁత దలఁప కింతయును, నలిమీఱి మనశూర్పణఖయ తాఁబోయి
యనుపమగుణధాము నభిరాము రాముఁ, గనుఁగొని యీరీతి కామింపఁదగునె
తనకు నీవేషంబు తానె కావించి, కొనియె నిందుకు మదిఁ గ్రోధించిపోయి
పరుషత రఘురామబాణాగ్ని శిఖల, ఖరదూషణాదిరాక్షసులు నీఱైరి
వీరికై నీవేల విపరీతబుద్ధి, శ్రీరాముఁ బగఁగొని చెడఁ దలంచెదవు
ఇది విచారంబుగా దిది బుద్ధిగాదు, ఇది నీతిగా దింక నీతలం పుడుగు
నీవు లంకకుఁ బోయి నెమ్మది నుండు, పోవ రామునిచేతఁ బోవుఁ బ్రాణములు
ఏను నీకపకార మెన్నఁడుఁ జేయ, నేనేమి చెప్పిన హితముగాఁ గొనుము
ఒచ్చె మెంచకఁ గార్య మొనరించితేని, యిచ్చెద రాజ్యార్థ మీ నంటి విపుడు
చెచ్చెర రఘురాముఁ జెనకి యే బ్రతికి, వచ్చుట కిందు కెవ్వఁడు పూఁటచెపుడు
యని యిట్లు మారీచుఁ డాడువాక్యములు, విని రావణుఁడుక్రోధవివశుఁడై పలికె
లోకైకభర్త త్రిలోకభీకరుఁడ, నాకెక్కుఁడని యొకనరునిఁ జెప్పెదవు
కడు బ్రాణభయమునఁ గారులాడెదవు, విడువక నాకొక్కవెఱపు చెప్పెదవు
నన్ను రాజనుచు మనంబునఁ గొనవు, చిన్నఁబుచ్చెద వేను జెప్పినపనులు
నీ వేమిటికిఁ దోడు నినుఁ దోడు వేఁడ, నీవిధివచ్చెనే యిప్పుడు నీకు
నని చంపఁ దొణఁగిన నతనిరోషంబు, కనుఁగొని మదిలోనఁ గడువిచారించి
మారీచుఁ డీనీచమరణంబుకంటె, నా రాముచేఁ జచ్చుటది యొప్పు ననుచు
దనుజాధిపతిఁ జూచి తగునీతి నీకుఁ, గొనకొని చెప్పినఁ గోప మేమిటికి
మఱి బుద్ధిచెప్పిన మంత్రులఁ బట్టి, నఱకఁ దలంచు భూనాయకు ల్గలరె
నీవేమి చెప్పిన నీచెప్పినట్లు, గావింపఁగలవాఁడఁ గడముట్ట ననఁగ
ననురాగమునుబొంది యతని మన్నించి, తనరథం బెక్కించి తద్దయుఁ బ్రీతి
నసమానవేగుఁడై యతఁడును దాను, నసురాధిపతి వచ్చె నటఁ బంచవటికి
అట్టిదకాదె కామాతురబుద్ధి, యెట్టును జెడుత్రోవనే పడఁద్రోయు
నాయెడ మారీచుఁ డరదంబు డిగ్గి, యాయసురాధిపుఁ డపుడు ప్రార్థింప
మాయావి గాన నమానుషమహిమ, మాయామృగాకృతి మదివిచారించి
మేలైన కనకంబు మేనును రుచిర, నీలనీలాయతనేత్రయుగ్మంబు
పవడంపుబొమలును భాసిల్లు వజ్ర,నివహాకర్ణంబులు నీలవాలములు.
పొలుచు పచ్చనిశృంగములు ముత్తియంబు, తొలుకుల రత్నబిందువులైనపాడలు

రాజిల్లు నవపద్మ రాగోదరంబు, రాజితఖురములు రమణమై యమర
జగతిపై రోహణాచల మొప్పు మిగిలి, మృగరూపమై వచ్చి మెలఁగుచున్నదియొ
కాదేని రాక్షసక్షయముఁ గావింప, నాదట చింతించి యబ్జసంభవుఁడు
మెఱుఁగులెల్లను గూర్చి మృగముగాఁ జేసి, కఱటిగ్గ్యొ పుత్తేరఁగా వచ్చినదియొ
జానకి నెఱివేణి శక్రనీలముల, నానాతిసంతంబు లాణిముత్యముల
భామినికెమ్మోవి పవడంపులతలఁ, గామినిచెక్కులు కడిమివజ్రముల
వైదేహితనుకాంతి వైడూర్యమణుల, నాదేవినూగారు హరితరత్నముల
భామపాణిద్యుతుల్ పద్మరాగములఁ, గోమలిముఖకాంతి గోమేధికములఁ
బటుతేజమున చాలఁ బ్రహసించుటయును, నటుల గీడ్పడివచ్చి యఖిలరత్నములు
రత్నగర్భాత్మజారత్నంబు నలఁప, యత్నంబుతో మృగంబై వచ్చినవియొ
సీతకై తనవిల్లు చేకొని విఱిచె, సీతఱి రఘురాము నెలయింతు ననుచు
హరుఁడు వృత్తేరఁగా నాతనిచేతి, హరిణ మిచ్చోటికై యరుదెంచినదియొ
సీతమోమున కోడి సీత భ్రమింప, శీతాంశుఁ డనుప వచ్చినమాయలేడొ
యని చిత్రవర్ణంబులైనదీధితులఁ, బెనఁగొని యందందఁ జేర్చి శోభిల్లఁ

మారీచుఁడు మాయామృగరూపధారియై వచ్చుట

గపటసారంగమై కదియ నేతెంచి, యుపమింప నరుదైనయొప్పుల నొప్పి
నెమకుచుఁ బులుమేయు నిజవాలరుచుల, రమణమై వనమయూరముల నాడించుఁ
దఱిమిడి యొకమాటు తనపార్శ్వరుచుల, బఱపైన వనమెల్లఁ బసిఁడిగావించు
గుదియక నొకమాటు కుప్పించి దాఁటి, త్రిదశేంద్రచాపంబు తెఱఁగుగావించు
నొకమాటు చెంగున నుప్పరం బెగసి, ప్రకటించు నతులశంపాలతారుచులఁ
దఱిగొని యొకమాటు తనపార్శ్వరుచుల, నెఱిచంద్రకాంతముల్ నీరుగావించు
మృగయూథములఁగూడి మెలఁగుచు మేయు, మృగములఁ బెదరించు మెల్లనె డాఁగు
నంతంతఁ బొడచూపు నటఁ జేరవచ్చు, నంతలో బెదరి బిట్టదరి కుప్పించుఁ
దరులనీడలకుల్కుఁ దగఁ బర్ణశాలఁ, జొరఁబాఱునంతనె స్రుక్కి క్రేళ్ళుఱుకు
వసుధ మూర్కొనిచూచు వాల మల్లార్చు, దెసలకుఁ జెవిచేర్చుఁ దెలియనాలించుఁ
గంచుమింపై పాఱఁ గ్రమ్మఱఁ జేరుఁ, గుంచితాకృతి చెవికొనఁ గదలించుఁ
బచ్చికపట్లపైఁ బవళించి లేచు, మచ్చిక నచ్చోట మానులఁ జేరు
ఖురములఁ జెవిగోఁకు గొమ్ములతుదల, విరులతీఁగె గదల్చి విరులెల్ల రాల్చు
నందంద నందమై యాపర్ణశాల, ముందట మృగ మిట్లు మోదించుచుండె
నావేళ సీతయు నలరులు చిదుమ, లావణ్యశీల యల్లన పర్ణశాల
మంజులశింజానమంజీరరవము, రంజిల్ల వెడలి సౌరభములఁ బొదలు
పొదల డాయుచు విరుల్ పోఁగఁ గోయుచును, మదికి విస్మయమంది మాయంపు లేఁ
గనుఁగొని వైదేహి కడుఁ జోద్యమంది, యినకులాధిపుఁ జేరి యిట్లని పలికెఁ
జూపుల కింపార సొంపు గల్పింప, నేపారి యున్న దిదేమి చోద్యంబు
నీపొంత వింతయై యిదియొక్క మృగము, భూపాల చూచితె పొదలుచున్నదియు

ఎన్నఁడుఁ బొడగాన మిన్నిచందముల, వన్నెలమృగముల వనభూములందు
జగతీశ యీమృగచర్మంబునందుఁ, దగిలి సుఖింప నెంతయు వేడ్క పుట్టె
దినవాథ కులనాథ దీని వెంటఁదగిలి, చని వేసి వెస దీనిచర్మంబు దెమ్ము
అదియేల నీయుపాయంబున దీని, చెదరక పట్టి తెచ్చెదవేని మిగుల
మంచిది ప్రాణేశ మనవనవాస, మెంచఁగ నిది తీర్చి నీపైఁడిమృగముఁ
బురికి వేడుకఁ గొనిపోయి యత్తలకు, భరతాదులకు వేడ్కపఱుపంగవచ్చు
నని సీత ప్రీతిమై నాడు వాక్యములు, విని లక్ష్మణుఁడు రామవిభుఁ జూచి పలికె
మృగరాజునకు నిట్టిమేను లేదుర్వి, మృగమాత్రమున కిట్టిమేనెందుఁ గలదు
మాయామృగము దీని మఱి నమ్మఁ దగదు, మాయావులసురలమాయ గానోపు
నదిగాక యిచటిసంయములు మారీచుఁ, డదయుఁడై మాయావియై యిందు మెలఁగు
నని పల్క వినమె యాయసుర గాఁబోలు, మనల భ్రమింప నీమాడ్కి నేతెంచె
జిత్తంపు దీనిపైఁ జేరిచి మీఁద, నుత్తలపడి పట్ట నూహింపవలదు
ఆరయ వైదేహి యతిముగ్ధయైన, మీరలు ముగ్ధలే మేదినీనాథ
యనిన రాముఁడు సీత యాననాంబుజము, కనుఁగొని నవ్వి లక్ష్మణుఁ జూచి పలికె
జలియింప నేటికి సౌమిత్రి యింత, యిల రాక్షసుల మాయ లెదురునే నన్ను
మృగమేని కొనివత్తు మేటిరక్కసులఁ, దెగ నేను పొలివుత్తుఁ దెలిసి యీరెండు
మగుడ నెక్కడఁబోవు మాయామృగంబు, దెగువమై లక్ష్మణ దీని వెంటఁదగిలి
చంపి చర్మముఁ దెచ్చి జానకి కిత్తు, నింపార లక్ష్మణ యిప్పుడే దీని
యిన్నినాళ్లకు నెల వీకోర్కి వేఁడఁ, జిన్నఁబుత్తునె సీత చెప్పినచేత
హితమతివై పూని యీపర్ణశాల, నతిగ నేయుఱకు మీవని యొప్పగించి
యల్లన రఘురాముఁ డనుజుచే నున్న, విల్లంది మోపెట్టి వెరవొప్పఁ గదలి
యామృగంబు మున్నర్థి వెన్కొనిన, యాగజాసురవైరి యనఁ జెన్ను మిగిలి
కొంకుచుఁ బొదమఱుంగునఁ బొంచిపొంచి, క్రుంకుచు నంతంతఁ గూడ దాఁటుచును
మగిడి చూచుటయును మఱుగున నిలిచి, తగులున బట్టంగఁ దఱకమందుచును ॥
విల్లు నమ్ములు వెన్క వ్రేలిచి పట్టి, యల్లన చరణంబు లవనిపై నిడుచుఁ
జప్పుడు గాకుండఁ జనుచుఁ బట్టుటకుఁ, జొప్పడు నొప్పును జూచి డాయుచును
నదె చేరి పట్టెద నదె చేరె ననుచు, నదియె లోఁబడియె నాకని చెలంగుచును
నివ్విధంబునఁ బోవ నేచి యామృగము, దవ్వులఁ బొడచూపుఁ దనుఁ జేరవచ్చుఁ
బట్టఁబోయిన మిట్టిపడి పాఱిపోవుఁ, గట్టల్క రామునిఁ గన్నంత నిలుచుఁ
బలుదెసలకుఁ బాఱు బాళితోఁ గూడి, నెలవుల పులు రాల్పుఁ జేష్టలు మాను
నెసఁగి వీక్షింపఁ బైకెగసి క్రేళ్లుఱుకుఁ, బసమించి మిన్నులపైఁ బాఱుచుండుఁ
గుప్పించి దాఁటుఁ జెంగునఁ దీఁగ మెఱుఁగుఁ, ద్రిప్పినగతి జిహ్వ ద్రిప్పనందంద
కొఱవి ద్రిప్పినరీతిఁ గుమ్మరిసారె, తెఱఁగున భ్రమసి దిర్దిరఁ దిరుగుచును
బడలినగతి మ్రొగ్గుఁ బజ్జ కేతేఁ, వడి సాళువంబుకై వడి మింటి కెగయు
నలసి రాముఁడు వెఱఁగంది నిల్చుటయుఁ, గేఁకులఁ బొడచూపుఁ గికురించి మెలఁగుఁ

డెగియేయఁ దలఁప నదృశ్యమైపోవు, మగిడిరాఁ దలఁచిన మఱి మ్రోల నిలుచుఁ
గలగొని యాభంగిఁ గాకుత్స్థముఖ్యు, నలయించి యలయించి యవలకు నవలఁ
గొనిపోయి పోయి యాఘోరదుర్గములఁ, గనుఁబ్రామి యటఁబోవ గడఁగినఁ జూచి
మాయామృగంబని మఱి రాముఁ డెఱిఁగి, దాయ నీవెక్కడ దప్పిపోయెదవు

### మాయామృగము రామునిచేఁ గూలుట

అగపడితంచు బ్రహ్మాస్త్రంబు దొడుగ, నగములు వడఁకెఁ బన్నగభర్త దలఁకె
జగములు బెదరె దిక్చక్రంబు లదరెఁ, దెగఁగొని దృష్టి సంధించి వేయుటయు
నాలోన నొఱలుచు నాహాప ముడిగి, హాలక్ష్మణా యనునార్తరావమున
దెసలద్రువఁగ మహాదీర్ఘదేహమున, నసువులు వెడవాసి యసురుఁడై పుడమిఁ
గూలె రాక్షసలక్ష్మి గూలె రావణుఁడు, గూలె లంకాపురి గూలె నన్నట్లు
అంత మాయామృగ మవనిఁ ద్రెళ్లుటయు, సంతోసమున దాని జానకీవిభుఁడు
గనుఁగొని మారీచుఁగా నిశ్చయించి, తనతమ్ముమాటలు దలఁచి మెచ్చుచును
సౌమిత్రి సీత యీచపలరాక్షసుని, యీమహారవమున కెంత వేఁగెదరో
యని తలంకుచునుండ నాయార్తరవము, విని సీత భీతిల్లి వెస నుర్విఁ ద్రెళ్లి
తెలిసి దిక్కులు చూచి ధృతి దిఱ డించి, లలిఁ దూలి యెలుఁగెత్తి లక్ష్మణుఁ జూచి
సౌమిత్రి యిది యేమిచందమో నేఁడు, రాముఁడు నిన్నార్తరవమునఁ జీరె
ననఘ నీవాపలు కాలింపలేదు, విననొల్లవో కాక వినరాదో నీకు
నులుకవు భీతిల్ల వాకకొంత గలఁగ, వలయవు శోకింప వదియేమి నీవు
నానావిధంబుల నాయంతరంగ, మూనినవగలఁ బెల్లుడుకుచున్నదియు
నడవులకొంటిమై నటు పోయినాఁడు, తడవాయె రాఁడు యుద్ధంబున నేఁడు
కడిఁది రక్కసుల కెక్కడఁ జిక్కినాఁడొ, తడయక పోవన్న ధరణీశు వెదుక
నని యశ్రుపూరంబు లందందఁ దొరగు, జనకనందనకు లక్ష్మణుఁ డిట్లను
దల్లి నీవేటికిఁ దలఁకెదు రామువల్లభునకుఁ గీడు వచ్చుట లేదు
ఎఱుఁగవే నీకూర్మిహృదయేశుమహిమ, లెఱిఁగి యీవెడమాట లిట్లాడఁదగునె
నివ్వటిల్లెడివగ నిన్నింత గలఁప, నెవ్వాఁడొ రాక్షసుం డిటు చీరెఁగాక
యినకులాధిపుఁ డేడ నీదైన్యమేడ, జనకజ నీవేల చంచలించెదవు
దలమీఱి రఘురామధరణీశుఁ దొడరి, పోలియక నిలుతురే ఘోర రాక్షసులు
మిడుతలు కార్చిచ్చుమీఁద గర్వించి, పడి నిల్వనేర్చునె భస్మంబుగాక
కావున రామాజ్ఞఁ గడఁచి నిన్ డించి, పోవఁజూచుట నాకు బుద్ధిగా దింక
నీకానలోపల నే డించిపోవ, నేకీడు వచ్చునో యేఁ బోవ వెఱతు
నలయక నామాట లాత్మలో నమ్ము, తలఁకకు మనవుఁడు ధాత్రీతనూజ
యొలసినకోపాగ్ని లాగి మండుచుండ, నలఘుచు సౌమిత్రి నటుచూచి పలికె
నీవు రాముని దెస నెఱయ భక్తుఁడవు, నీవేల నేఁడింత నీచుండవైతి
శ్రీరాముఁ డిట నిన్నుఁ జీరుట వినియు, దారుణమతిఁ బగదాయచందమున
నెమ్మది నున్నావు నీ కిది దగునె, తమ్ముఁడు ప్రాజ్ఞుఁ డుత్తముఁ డీతఁ డనుచు

భూపతి నిను నమ్మి పోయినచోట, నీపాపవర్తన మేల కైకొంటి
వగు నెఱింగితి రాముఁ డసురులచేతఁ, దెగుట నిక్కముగాఁగఁ దెలిసి నీవర్థి
ననుచితమతిఁ బూని యాలస్య ముడిగి, ననుఁ బొందఁ దలఁచెదో నాన వోవిడిచి
కాదేనిఁ గొనిపోయి కైకేయి సుతుని, కాదట నొప్పింతునని తలంచెదవొ
ఏను నాదగుజీవ మీశరీరమునఁ, బూనఁ దలంచుట బుద్ధిగా దింకఁ
దడయకపోయి గోదావరిలోనఁ, బడి ప్రాణము ల్విడ్తుఁ బలుకు లింకేల
యని బెడిదపుమాట లవనిజ పలుక, విని లక్ష్మణుఁడు చాల వేదనఁ బొంది
రాముఁ జేర్కొని కర్ణరంధ్రముల్ మూసి, దీనసంబున నాల్గుదిక్కులు చూచి
తెలియ వింటిరె వనదేవతలార, పలుకులు పాపముల్ పలుకుచున్నదియు
మీఱిందఱును సాక్షి మేదినీతనయ, ఘోరభాషల నన్నుఁ గ్రూరతఁ బలికె
నని బాష్పలోచనుండై లక్ష్మణుండు, తనమది నిఁక నిల్వఁ దగవుగాదనుచుఁ
దల్లి యేనిదె పోయి తడయక నీదు, వల్లభుఁ గొనివత్తు వగవకు మనుచుఁ
బర్ణశాలకుఁ జుట్టు బరులేదు వ్రాసి, వర్ణించి యీబరుల్ వడిదాటకమ్మ
ఎవ్వఁడే నీబరుల్ వెసదాఁటివచ్చు, నవ్వీరవరుతల లవియు నాక్షణమె
యనిపల్కి యనలుని నపుడు ప్రార్థించి, వనిత నేమఱకు నీవని యొప్పగించి
జగతీతనూజకు సద్భక్తి మ్రొక్కి, పొగలుచు రాముచొప్పునఁ బోయె నంత
నత్తఱి రావణుం డరుదార వేచి, యుత్తలంబునఁ జిత్త ములుకుచునుండఁ

### రావణుఁడు భిక్షుకవేషధారియై సీతాదేవియొద్ద కేతెంచుట

గరమున దండంబు ఘనకమండలువు, నురులలాటంబున నూర్ధ్వపుండ్రంబు
కొలఁదులౌ వ్రేళ్లను గుశపవిత్రములు, పొలుపొందు పేరురంబున జన్నిదములు
నరుదార వలకేల నక్షమాలికయు, సరిఁబూనియున్న కాషాయవస్త్రములు
తులసిపూసలపేర్లతోడ ముందఱికి, వలనొప్ప నొకకొంత వ్రాలినమెడయు
బడుగుదేహంబును బావలు చింపి, గొడుగును వెడముడిగొన్నట్టి శిఖయు
నలవడఁ గపటసన్న్యాసివేషంబు, విలసిల్ల వెడవెడ వ్రేళ్లెన్నికొనుచుఁ
గొన్నిమంత్రంబులు గొణుగుచు మునులు, తన్నెఱింగెదరని తత్తఱించుచును
దలకొన్నముదిమిచేఁ దలవడంకంగ, నలయుచు నొలయుచు నసురుసు రనుచు
నంతంత నిలుచుచు హరిహరి యనుచు, శాంతిఁ బొందుచుఁ బర్ణశాల కేతెంచు
తనుఁజూచి వనదేవతలు జగద్ద్రోహి, చనుదెంచె వీఁడని సభయులై యొదుగ
నిక్కపుమునివోలె నిలిచినఁ జూచి, యక్కపటాత్ము సంయమిఁగాఁగఁ దలఁచి
గ్రక్కున వైదేహి కడుభక్తి మెఱసి, మ్రొక్కి హస్తాంబుజంబులు ముకుళించి
సౌమిత్రి వ్రాసిన చక్కనిబరులు, నమరంగఁ గడఁచియు నతిభక్తితోడఁ
బొలఁతి యభ్యాగతపూజ గావించి, కలఁగుచు నట్లున్నఁ గల్యాణిఁ జూచి
యోభామ నీవిట్టియుగ్రదుర్గముల, నేభంగిఁ జరియించె దిట్లొంటి నిలిచి
రతివో శ్రీసతివో భారతివో కాకున్న, క్షితి మర్త్యసతుల కీచెలువంబు గలదె
నీమోము పండువెన్నెలపిండు దెగడు, నీమోవి కెంపుఱానిగ్గులఁ దెగడు

నీమేను సౌదామినీలతఁ గేరు, నీమాట సుధ తేటనీటులఁ జేరు
నీవేణి జలదవేణికలఁ బోఁదరును, నీవిలాసంబు వర్ణింప నాతరమె
తరుణి నీకౌఁగిటఁ దవిలి సుఖించు, పురుషుఁడే తలపోయఁ బురుషోత్తముండు
కామిని నీపొందుగలవాఁడె పూర్ణ,కాముఁ డాతఁడు నిత్యకల్యాణుఁ డరయ
నిచ్చట నీయునికి కెంతయు వగపు, నచ్చరువయ్యెడి నబ్జాక్షి మాకు
నెలఁత నీవ్వెరు నీవేల యింత, నలఁగెద విక్కాననములోన నిలిచి
యంతయు నెఱిఁగింపు మనిన నాసీత, యెంతయు భక్తితో నిట్లని పలికె
ననఘాత్మ రఘురాము నతివ మాతండ్రి, జనకుండు దశరథేశ్వరుఁడు మామామ
నాపేరు సీత యున్నతకీర్తి రాము,భూపతి తనతండ్రి పొమ్మన్న వెడలె
కాననంబులనుండఁ గడఁగివచ్చుటయు, నేను లక్ష్మణుఁడు తో డేఁగుదెంచితిమి
ఈయాశ్రమంబున నేము ముప్వురము,పాయనినియతిఁ దాపసుల మైయుండ
నొలసి మాముందఱ నొకపైఁడిమృగము, పొలయుచుండఁగఁ జూచి భూనాథుతోడ
దాని నాకేగతినైనఁ దెమ్మనినఁ, బూని రాముఁడు వోయిఁ బోయినపిదప
హాలక్ష్మణా యనునార్తరావంబు, శూలమై నాచెవి సోఁకి గాడుటయుఁ
బొగిలి లక్ష్మణు నేను బొమ్మన్నఁ బోయె, మగిడిరాఁ డిది యేమి మాయయోయనుచుఁ
ననిపల్కి మునిఁ జూచి యనఘ నీపేరు, వినుపింపు మిందేల విచ్చేసి తనినఁ
గొంకక తనదైనకుహాకత్వ ముడిగి, లంకాధినాథుఁ డాలలన కిట్లనియె
వనజాక్షి విను మేను వనధిమధ్యమున, నెనయు లంకాపుర మేలెడివాఁడ
రాక్షసాధిపుఁడ విశ్రవసునందనుఁడ, యక్షేశుననుజుండ నఖిలదిగ్జయుఁడ
రావణుం డనువాఁడ రణములోపలను, దేవాసురులనైనఁ దెగటార్చువైతు
వనిత నీరూపలావణ్యసంపదలు, విని చూడవచ్చితి వేడ్కలుప్పొంగ
ననయుచుఁ బేదమానవునితోఁ గూడ, నువిద నీకడవుల నుండ నేమిటికి
నారాజ్యమంతయు నలినాయతాక్షి, గోరి యేలుము నీవు కొమరుదీపింపఁ
బొగడొందుపెంపునఁ బుష్పకంబాది, యగువిమానములందు హర్మ్యంబులందు
సుసగరుడోరగాసురసిద్ధసాధ్య, వరకన్యకలు గొల్వ వర్తింతుగాక
నీయంఘ్రిరుచులు నానిలయభూములకు, మాయనిమణికుట్టిమము లగుఁగాక
చెలియ నీచూపులసరులు నామేడఁ, గలువలతోఁ జాలఁ గలహించుఁగాక
నీమందహాసంబు నిత్యంబు నాదు, ప్రేమాంబునిధికిఁ జంద్రికలగుఁగాక
రమ్ము నాలంకాపురంబున కనుడు, నమ్మాట విని సీత యతిభీత యగుచు
ధీర గావున వానిఁ దృణముగాఁ జూచు, తీరునఁ దనచేతితృణము చూచుచును
సారపతివ్రతాచారగా యనక, యోరి నన్నిటులాడ నుచితమే నీకు
ననిమిషయోగ్యపూర్ణాహుతి శునక,మునకు దుర్లభమైనపోల్కి భావింప
శ్రీరామచంద్రునిఁ జెందిననన్నుఁ, గోరి కామింప నీకును నెన్నితలలు
పొమ్ము గుట్టున నీదుపురవరంబునకు, నెమ్మనిఁబోక దుర్నీతి నేమేని
దలఁచితివేని నాథవుఁడు రాఘవుఁడు, విలసితశస్త్రాస్త్రవిదితలాఘవుఁడు

హరచండకోదండహరణవినోది, ఖరదూషణాదిరాక్షసశిరశ్ఛేది
నిన్ను నీవంశంబు నీఱుఁగావించు, నెన్నంగ నీకు నాయినకులాగ్రణికి
నక్కకు సింహంబునకును దోమకును, దిక్కరికిని బయోధికిని గాల్వకును
వాయసంబునకును వైనతేయునకు, నేయంతరము పెద్ద లేర్పఱింపుదురొ
యాయంతరముగల దటుగాన నీవు, ధీయుక్తి లంకకుఁ జెరిగిపొమ్మింక
నన విని రావణుం డాగ్రహోదగ్ర, జనితోగ్రదృష్టిమై జానకిఁ జూచి
యనుపమాటోపుఁడై యారూప ముడిగి, తనమనోవీథిఁ గందర్పుండు వెలుఁగఁ
బదియవస్థలు దోఁచి భాసిల్లుపగిదిఁ, బదితలల్ మణిజూటసంక్తులనొప్ప
నాయవస్థలఁ గోర్కులవి యున్మడింపఁ, బాయనిగతినొప్ప బాహు లిర్వదియుఁ
గొన లిన్మడింపఁ గోర్కులు పల్లవించె, ననఁ బద్మరుచులైన హస్తంబు లొప్ప
లలిదోఁచుకోర్కి పల్లవముల పుష్పములఁబోలు నాయుధంబులు పొల్పుమిగులఁ
బరఁగ దివ్యాంబరాభరణౌఘకాంతు, లరుదార మదనాగ్నులై మండుచుండ
నతిభీకరాకారుఁడై నిల్చుటయును, ధృతి దూలి సీత భీతిల్లి మూర్ఛిల్లి
వడిగాలిఁ బడియున్నవనలతవోలెఁ, బడియున్నఁ గనుఁగొని పఙ్క్తికంధరుఁడు
గ్రమ్మి యశ్రువులొల్క గొఁదిఁగయుల్కఁ, గ్రొమ్ముడి ముడివీడఁ గుచము లల్లాడ
నందంద దెగి రాల హారరత్నములు, పొందిన భయశోకముల మేనువడఁక
నచ్చారులోచన నదయుఁడై యెత్తి, తెచ్చి రథంబుపైఁ దెఱఁగొప్పఁ బెట్టి
దైవంబు ప్రేరేపఁ దనపాలిమృత్యు, దేవతఁ గొనిపోవు తెఱఁగు దీపింప
నమరారి గొనిపోవ నాకాశవీథి, గమలలోచన దేరి కనువిచ్చి చూచి
పెదవులు దడపుచు బిగిచన్నుదోయిఁ, బ్రిదిలిన పయ్యెద బిగియఁ జేర్చుచును
నెలుఁగెత్తి కొదమకోయిల గూసినట్లు, పలుమాఱు విధి దూఱి ప్రాణేశుఁ జీరి

## జానకి శోకించుట

యలఁతయుఁ గోపంబు నతివిషాదంబు, వెలవెలపాటునై విలపింపఁదొడఁగె
నో రాఘవేశ్వర యో రామచంద్ర, నీరజహితవంశ నీదేవి నన్ను
ననదచందంబున నక్కటా యిపుడు, గొనిపోవుచున్నాఁడు కుటిలరాక్షసుఁడు
వేవేగ చనుదెంచి వీని మర్దించి, కావవె నాలజ్జ కావవే నన్ను
నేలరా రాక్షస యీనింద నీకు, నీలంక నేలరా నీవె కాల్చెదవు
తగదురా నీకు నీదారుణక్రమము, దెగటార్చురా నిన్నుఁ దివిరి రాఘవుఁడు
కనకమృగము నేల కనుఁగొంటి నేను, నినవంశవల్లభు నేల పొమ్మంటిఁ
గాదన్నపలుకేల కైకొననైతి, మేదినీవిభుఁడేల మృగము దేఁబోయె
జగతీశులావేల చర్చింపనైతిఁ, బొగిలి లక్ష్మణు నేల పొమ్మంటిఁ దిట్టి
నాపాలివిధి యేల ననుఁబోవనిచ్చు, నీపల్కు లేటికి నిటు సేయకున్న
నన్న లక్ష్మణ నిన్ను నభిమానధన్యుఁ, గన్నతల్లిగ నన్నుఁ గరమర్థి నెన్ను
నున్నతగుణమాన్యు సుదితసౌజన్యు, నన్ని తెఱంగుల నాడినఫలము
గుడిచితి వేవేగ కోపంబుదక్కి, కడువేగమునవచ్చి కావవే నన్ను

నక్కటా కైక నీవడిగినవరము, లిక్కడఁ జేకూరెనే యిటుమీఁద
నీకుమారుండును నీవునుగూడి, యేకాతపత్రత నేలుఁడీ వసుధ
నని రామవిభుఁ జీరి యసురేశు దూఱి, తనమఱఁది బొగడి దుర్దైవంబుఁ దెగడి
కాకుత్స్థతిలకు లక్ష్మణుఁ గొనియాడి, కైకఁ బోనాడి శోకంబున మఱియు
మిథిలేశుకూఁతుర మేదినిఁ బంక్తిరథునకుఁ గోడల రామునిదేవి
వలఁతులై కావ నెవ్వరు లేనిచోటఁ, బొలవిండి చెఱఁగొనిపోవుచున్నాఁడు
తరులార నాసహోదరులార మీరు, ధరణీశ్వరునితోడఁ దగఁజెప్పరయ్య
సురలార మీరైన సురవైరిఁ దాఁకి, వెరవొప్ప నాచెఱ విడిపింపరయ్య
నిండినభక్తితో నిన్నాశ్రయించి, యుండితి ననుఁగావ నుచితమీవేళఁ
దగిలి నీవైన గోదావరీదేవి, జగతీశ్వరునితోడఁ జని చెప్పుమమ్మ
ప్రల్లదుచేఁ జెఱఁబడి చిక్కువడితిఁ, దల్లి నీవైనను దగఁ గావఁగలదె
భూదేవి రఘురామభూపాలుఁ జేరి, నీదురవస్థపెం పెఱిఁగింపుమమ్మ
వీరు వారనక యివ్విధమునఁ జీర, నోరెండె ధృతిఁదూలె నొచ్చెఁ బ్రాణములు
ననుఁ గావరయ్య కిన్నరులార పుణ్యాత్ములార ఘనులార తాపసులార
కృతులార హితులార ఖేచరులార, వ్రతులార యతులార వనవాసులార
కరులార హరులార గంధర్వులార, నరులార సురలార నాగేంద్రులార
యని పెక్కుభంగుల నమ్మహీతనయ, పొనుపడి శోకింప భూదేవి వడఁకె
గౌతమి పాఱక గ్రక్కున నిలిచె, నాతఱి సకలభూతాక్రోశ మెసఁగె
నన్యాయ మన్యాయ మని మునుల్ కపటసన్న్యాసి రావణు దంభంబు దెలిసి
పొగిలిరి శోకాశ్రుపూరముల్ దొరుగ, మృగములు వినుచుండి మేఁతలు మఱచెఁ
బక్షులు వాపోయెఁ బవనంబు లడఁగె, వృక్షముల్ వాడె నా నుస్యు నభము
దిక్కులు పగిలె నాదినమణి నొగిలె, దిక్కేది యని ధర్మదేవత పొగిలె
వనదేవతలు చాల వగచిరి సాధు, జనులెల్ల నేడ్చిరి జానకిఁ జూచి
యత్తఱి విహగేంద్రుఁ డరుణతనూజుఁ, డుత్తమసాహసుఁ డొకకొండనుండి
యొక్కరుం డగుజటాయువు బిట్టు వినియె, నక్కట రఘురామ యనునార్తరవము
విని సంభ్రమించి నివ్వెఱఁగంది దిశలు, గనుఁగొని మొగమెత్తి గగనంబుఁ జూచి
యదయుఁడై రావణుం డారామదేవి, నాదిని యిమ్ములఁ గొనిపోవుచున్నాఁడు
నాఁ డీవనంబున ననుఁగన్నమొదలు, పోఁడిమి ఘనమైత్రిఁ బ్రోచు రాఘవుఁడు
తగదింక వర్జింప దైత్యు నిర్జించి, తెగువమై వైదేహిఁ దెత్తు నొండేని
యినకులాధిపునకు నింకఁ బ్రాణముల, నని మొన నొప్పింతునని నిశ్చయించి
కులిశంబుధారతాఁకునకు నేభంగి, నలవిగా కెగయు మహాద్రిచందమున
నురుశక్తిమైఁ బెంచి యుంకించి యెగసి, పొరిఁబొరి గిరిశృంగములు నుగ్గుగాఁగ
మరలించి పుక్కిటిమాంసఖండములు, ధరణిపై నుమిసి యుదగ్రభావమున
ఖరనఖంబుల నున్నకరిసింహశరభ, శిరము లంతంత కచ్చెరువుగాఁ దొరగఁ
ఘటుతుండరోచులు పక్షదీధితులు, చటులకోపోగ్రలోచనములు దనరఁ

బహునీలంబులఁ బర్వతాగ్రముల, వృక్షము ల్వ్రాలిగి దిగ్వివరముల్ నిండఁ
బరఁగు రావణుతమఃపటలంబు నడఁప, నరుదెంచు మధ్యందినాదిత్యకరణి
నాసన్నబలరావణాదిత్యు మ్రింగ, రానియుగ్రతపచ్చురాహుచందమున
వడిఁబేర్చి కదియు రావణరాహు మ్రింగఁ, దడయక చనుదెంచుతార్క్ష్యనిభంగి
నిలు నిలు నిలు పోకు నిలు పోకు పోకు, నిలు నిలు రఘురామ నృపచంద్రు దేవిఁ
గుటిలరాక్షసయెందుఁ గొనిపోయె దింక, నెటుపోయె దెటుపోయె దెందుఁబోయెదవు
పోయినఁ బోనీను బోనీను నిన్ను, వ్రేయుదు ఖండింతు విదళింతుఁ ద్రుంతు
దండింతు దండింతుఁ దల లుత్తరింతుఁ, జెండు బెండుగ నంచు సీత నీక్షించి
యోడ కోడకు దేవి యుగ్రరాక్షసుని, నీడాడి నీచెఱ నేవిడిపింతు
ననిన నాపల్కు మహానిదాఘమున, వనమయూరికి ఘనధ్వనియునుబోలె
వేడుక కొంతగావింపఁగా నలరి, వాడినమోముతో వగలఁ గుందుచును
నాసీతపల్కె జటాయువా నన్ను, నీసురకంటకుం డెత్తి యుద్వృత్తి
మాయచే రామలక్ష్మణుల వంచించి, యోయన్న కొనియేగుచున్నవాఁ డిదిగో
యనిపల్కె విని యంత నరుణనందనుఁడు, ఘనమైనకోపంబు కడిమియుఁ దోఁప
నలుకమై రథమున కడ్డంబువచ్చి, ప్రళయాభ్రనిర్ఘోషపటుభాషణములఁ
బలుమాఱు దశకంఠు భర్జించు చలుక, నిలిచి యిట్లనియె నూనినధైర్య మెసఁగఁ
బరమపావనుఁడైన బ్రహ్మమనుమఁడు, వరపుణ్యనిధివిశ్రవసుతనూజుఁడవు
ధనదానుజుండవు దానవాగ్రణివి, విను నిట్టికృత్యంబు విహితమే నీకు
జగదేకపతి రామజననాథుదేవిఁ, దగదోరి కొనిపోవఁ దగదోరి నీకు
మదలించి తేక రాముని డాఁగురించి, సుదతి నీభంగిఁ దెచ్చుట బంటుతనమె
నీలంకయును నిన్ను నీబంధుజనులఁ, గాలుచు రోరి రఘువుకోపవహ్ని
యొఱఁగియు విషమిట్లు లేల క్రోలెదవు, ఎఱిఁగొన్న పెనుఁబాము నేల త్రొక్కెదవు
అఱువదివేలేండ్ల యతివృద్ధు నన్ను, నెఱుఁగుదో యెఱుఁగవో యేజటాయువును
నీపుణ్యసాధ్వి నీవిప్పు డొప్పించి, పోపొమ్ము పోకున్నఁ బోరిపుత్తు నిన్నుఁ

రావణునితోఁ జటాయువు పోరుట

దుండాగ్రమున విల్లు తునుకలుచేసి, ఖండితవర్మమర్మములు భేదించి
యదరి నీదైన ప్రాణాభిమానములు, విడిపించి జానకి విడిపింతు ననిన
నరదంబు నిలిపి యుదగ్రుఁడై దైత్యవరుఁ డల్గి విలు గుణధ్వనిఁ జేసి పేర్చి
ఘోరబాణము లేయఁ గోపించి విహగవీరుఁడు తద్బాణవితతులు విఱిచి
యుర్రుపక్షయుగమున నురము ఘట్టించి, పోరి ఫాలములు చీఱి భుజములు దన్ని
తరమిడి ఖరనఖతతుల నొప్పించెఁ, గరము గోపించి రాక్షసకులేశ్వరుఁడు
ఖగరాజు నెఱకలు గాఁడ నుగ్రంబు, లగుబాణము ల్పది యదరియేయుటయుఁ
దుండాగ్రమున విల్లు తునుకలుచేసి, ఖండించి వడిఁ బతాకలు నేలఁగలిపి
దనుజేశుమకుటముల్ ధరడొల్ల వ్రేసి, పెనఁచి సారథిఁ జంపి ప్రేవులు చీల్చి
తలమీఱి దనుజురథ్యములఁ జెండాడి, చలమొప్ప నరదంబు చదియమోదుటయు

విరథుండై రాక్షసవిభుండు కంపించి, ధరణిపైఁ బడి లేచి ధరణిజఁ గొనుచు
మాయాబలంబున మఱి మింటి కెగసి, పోయి పోయినఁ జూచి పోనీక పేర్చి
యడ్డగించి జటాయు వాకాశవీథి, నొడ్డినగతిఁ దాఁకి యోరిపాపాత్మ
జుణిగి యేలోకంబుఁ జొచ్చిననైనఁ, దృణముగాఁ బట్టి వధింతు నిన్ననిఁ
దిరిగి రోషమున దైతేయవల్లభుండు, గరము గ్రమైన ముద్గరము వైచుటయు
నది తుండమునఁ ద్రుంచి యతని మస్తకముఁ, జదియంగ నడిచి కేశములు ద్రెంచుటయు
సురవైరి కోపించి స్రుక్కక కదిసి, యుఱవడిఁ బక్షీంద్రు నొడిసి రాఁ దిగిచి
మొగిఁ బట్టి యందంద ముష్టిఘట్టనలఁ, దగిలి నొప్పించె నుద్ధతశక్తి మెఱసి
దనుజేంద్ర విహగేంద్ర దారుణయుద్ధ, మనిమిషాదులు చూచి యాశ్చర్యపడిరి
యరుదైన కడిమిచే నంత రావణుండు, కరము గ్రమగు నట్టి ఖడ్గ మంకించి
యెఱకలు పదములు నెగసి త్రుంచుటయు, నెఱఁదూలి ఖగపతి నేలకు వ్రాలె
వ్రాలిన వైదేహి వగ నొక్కవృక్ష,మూలంబు చేరి రామునిఁ బేరుకొనుచు
వాపోవుచుండ రావణుఁ డంకసీమ, నా పరమపతివ్రతాంగన నునిచి
యంత సంతోషించి యాకాశవీథి, నెంతయు రయమున నేగె రావణుండు
అప్పుడు బ్రహ్మాదులగు సురల్ మునులు, తప్పక రాముచే దశకంఠుఁ డీల్గు
మనమనోరథములు మనకు సిద్ధించు, నని చెప్పుకొని యుబ్బి రందఱు ప్రీతిఁ
ననిమిషపథమున కంత రావణుండు, చన రయంబున సీతచరణనూపురము
సురవైరి కుత్పాతసూచకం బగుచు, సురువడిఁ జను దెంచి యుల్కయై పడియె
జగతిపై జాహ్నవి జలధార లొలుకు,పగిది నయ్యాకాశపథమున నుండి
చెలువకుచంబులఁ జెందుహారములు, దెలియ కందంద మేదినిఁ దెగిపడియె
నాలోన సీత హాహారవంబున, లోలోనఁ గడు నడలుచుఁ బోయి పోయి
యట ఋశ్యమూకంబు నందు వానరులు, పటుసత్త్వ లేవురఁ బరికించి కాంచి
తనవస్త్రమునఁ గొంత తగఁ జించి పుచ్చి, తనభూషణంబులు దాని బంధించి
వీరైన రామభూవిభున కీవార్త, లారయఁ దెలుపరే యనుబుద్ధి నపుడు
దడయక రాముచే దశకంఠుఁ డింకఁ, జెడు నంచు ముడియు వైచినవిధంబునను
వారిమధ్యంబున వైచుచుఁ బోవ, వారును దాఁచిరి వడిఁ బుచ్చి దాని
దనుజాధిపతి యంత దశరథాత్మజులు, తనవెంట వత్తురో దల్లడం బొదవ
వెలవెలఁ బాఱుచు వెనుకఁ జూచుచును, దలఁకుచు వడి సముద్రము దాఁటిపోయి
జడిగొన్న మరణసూచకనిమిత్తములు, పొడచూపఁ గని రయంబున లంకఁ జొచ్చి
యనుపమ వివిధభోగాస్పదంబైన, తననగరికి వచ్చి తగు రాజసమున
జనకపుత్రికిఁ దనసకలసంపదలు, మునుకొని యెంతయు ముదముతోఁ జూపి
యివె నానివాసంబు లివె నాధనంబు, లివె నాతురంగంబు లివి నాగజంబు
లివి యేను దివిజులనెల్ల భంజించి, తివుటమైఁ గైకొన్న దివ్యభూషణము
లిదె కుబేరుని గెల్చి యేను గైకొన్న, మదికింపుగా వించు మణిపుష్పకంబు
వీరె నాకుడిగముల్ వేర్వేఱఁ జేయు, చారణామరసిద్ధసాధ్యకామినులు

వారె నామాట గర్వమునఁ గైకొనక, కారాగృహంబుల గాసిల్లుసతులు
అవె నాట్యశాలల లల్లవె కేళివనము, లివి చంద్రశాలలో యిందీవరాక్షి
కరమర్థి నింతకుఁ గర్తవై నీవు, నరుదార భోగింపు మఖిలసంపదల
ననవుడుఁ దృణఖండ మతివ చేపట్టి,కొని పల్కె వానిఁ గైకొనక యెంతయును
యోరి నీ కీపాప మూరకపోదు, ఘోరాగ్నియై నిన్నుఁ గొని కాల్చుఁగాని
నిడివిగాఁ బ్రతుకరు నీవు నీవారు, చెడిపోవఁగలవారు సిద్ధమీపలుకు
రాముబాణానలరాశిలో మునిఁగి, నీమేను వడిఁ గాలి నీఱుగాకున్న
ఘనమైన యీపాతకము లెట్లు దీఱు, ననిపల్కె వైదేహి యందంద బొగిలి.
యిట్టి మదాన్యక్యంబు లీవు నాచెవులఁ, బెట్టితి నేఁడు నాపెంపెల్లఁ బొలిసె

జనకజను అశోకవనమునం దుంచుట.

నామాన మిటుచేసె నన్నింతచేసె, నేమని విలపింతు నింక నావిధికి
నని మహారోదన మందంద జేయఁ, దనమదిఁ గోపించి దనుజవల్లభుఁడు
తెఱఁ గొప్ప నప్పుడు త్రిజటాదులైన, తెఱవలఁ బిలిచి ధాత్రీపుత్రిఁ జూచి
యెందు నేమఱక మీారందఱు గాచి, పొందుగా ననుఁబొంద బోధింపుఁ డనుచు
నెనసినకడఁక నియ్యింతి నశోక,వనములో నిడుకొని వర్తింపుఁ డనుచుఁ
బనిచి కాఁపులువెట్టి పంక్తికంధరుఁడు, దనమది మదనాగ్నిదగ్ధుఁడై యుండె
మాయామృగముఁ జంపి మఱిరామవిభుఁడు, ఆయెడ మఱియొకయన్యమృగంబు
జంపి తన్మాంసంబుఁ జర్మంబు గొనుచు, నింపొంద మరలి తా నేతెంచుచోట
మ్రోయుజంబుకరవంబులకుఁ గుందుచును, నాయాసమందుచు నటవచ్చివచ్చి
రామభూపాలుఁ డరణ్యమధ్యమున, సౌమిత్రిఁ బొడఁగని చాల భీతిల్లి
యకట లక్ష్మణుఁడ నాయాజ్ఞ గైకొనక, వికలధైర్యమున వివేకివై యుండి
యత్తన్వి నీత నయ్యడవిలో డించి, వత్తురే యిట్లేల వచ్చితి వీవు
జగతిపైఁ గలుగురాక్షసులెల్ల మనకుఁ, బగయౌట యెఱుఁగవే పరికించిచూడఁ
గులహాని గుణహాని గురుధర్మహాని, తలపోయవలదొకో తమ్ముఁడ నీవు
అనవిని లక్ష్మణుండ దతిభీతిఁబొంది, యనయంబు కంపించి హస్తముల్ మొగిచి
జగతీశ నాకిటు చనుదేరఁదగదు, తగకున్కి యెఱుఁగుదుఁ త్రైలోక్యనాథ
మాయామృగాకృతి మఱిమిమ్ముఁ ద్రిప్పి, పాయక మీాదివ్యబాణాగ్నిశిఖలఁ
గూలుచునుండి యాకుటిలరాక్షసుఁడు, హాలక్ష్మణా యన్న యార్తరావంబు
సీతామహాదేవి చెవిసోఁక మిగుల, భీతిల్లి మీాదైన పెంపెల్ల మఱచి
యన్న మీాయన్న చొప్పరయఁ బొమ్మన్న, నెన్నఁడు నెఱిఁగింపఁ డీదీనవృత్తి
సౌమిత్రి యనవుడు జానకిఁ జూచి, యామహీతనయ కిట్లంటి నేనపుడు
పనివడి మనయందు భయముఁ బుట్టింతు, నని రాక్షసుఁడు క్రూరుఁడై చేరెఁగాక
యినకులాధిపుఁడేడ నీదైన్య మేడ, జనకజ నీవేల చంచలించెదవు
అనవుడుఁ గోపించి యద్దేవి నన్ను, వినరానిపలుకుల వెస దూఱి పలుక
నేను నామదిలోన నెంతయు వగచి, దానికి వనదేవతల సాక్షిఁ జేసి

యిట కేనువచ్చితి నిక్ష్వాకుతిలక, యిటుగాన దప్పుగా నపధరింపకుము
అని బాష్పలోచనుండై మ్రొక్కియున్న, యనుజుని కరముల నల్లననెత్తి
కనుఁగవ దొరఁగెడుకన్నీరుఁ దుడిచి, యనయంబు వగచి యిట్లనియె రాఘవుఁడు
ఆజన్మశుద్ధుఁడై యఖిలజ్ఞుఁడైన, యాజనకునిపుత్త్రి యైన వా ర్తకెక్కు
నాపుణ్యవతియు నిట్లాడుట యెల్ల, నాపదలకు మూలమని విచారించి
నిలువక యత్తురే ... కలుగంగఁ దగునయ్య యతివమాటలకు
ననుచు సౌమిత్త్రి నూరార్చి యెంతయును, జననాథుఁ డట నిజాశ్రమభూమిఁజొచ్చి
యిదియేమి లక్ష్మణ యీయాశ్రమంబు, తుదముట్ట శూన్యమై తోఁచుచున్నదియు
వనదేవతానందవచనఘోషములు, వినరావు వినరావు విహగనాదములు
ఏలొకో మునివరు లిట సంచరింప, రేలొకొ సీత నాకెదురుగా రాదు
కడుదీనమై బుద్ధి గలఁగెడు నాకు, నెడమకన్నదరెడు నేమొకో నేఁడు
ఇక్కాననలోపల నేనును నీవు, నక్కట యేదుఃఖ మనుభవించెదమొ
అని పర్ణశాలకు నటు చేరవచ్చి, దినకరరుచి లేనిదినలక్ష్మివోలి
రేరాజుకళలేని రేయును బోలి, శారిక లేని పంజరమును బోలి
యెనయుకోయిలలేని యెలమావిఁబోలి, కనుఁగొన విన్ననై కడువాడఁబాఱి
యున్నచందముఁ జూచి యుల్లంబు గలఁగి, విన్ననై ధృతిఁదూలి వెలవెలఁబాఱి
పన్నిశోకరసంబు ప్రవహించె ననఁగఁ, గన్నులబాష్పాంబుకణములు దొరుగ
బెదవులు దడపుచు భీతిఁ బ్రాణములు, చెదర దమ్మునిఁ జూచి శ్రీరాముఁ డనియెఁ
బోలఁజూచితి నేను భూమిజ పర్ణ,శాలలోపల నున్నచందంబు లేదు
పొదలఁ బూవులుగోయఁ బోయెనో లేక, వెదుక నొండొకజాడ వెడలెనో కాక
సరసులఁ గ్రీడింపఁ జనియెనో కాక, కరముగ్ర మగుభీతిఁ గ్రాఁగెనో కాక
డాసినపులులకై డాఁగెనో కాక, యీసునఁ గొనియొక్కఁ డేగెనో కాక
యేచందమో నాకు నింతయుఁ దెలియ, దేచకదమున సీత యిందులో లేదు
అని వితర్కించుచు నాపర్ణశాలఁ, జనఁ జొచ్చి లోపల సకలంబు వెదకి
జానకి నాపర్ణశాలలోపలను, గానక ప్రాణముల్ కలఁగి కంపించి
మనసెల్ల చెడి మేను మ్రాన్పడి బోధ, మనురవిశోకాబ్ధి నస్తమించుటయు
భ్రాంతియను చీఁకటి ప్రబలమై పర్వి, యంతరంగము గప్పి యత్తులు గప్పి
మరలెడిధృతిఁ గప్పి మానంబుఁ గప్పి, నెరసిన వికలుఁడై నేలకు వ్రాలి
వదలక సీతకై వగచెడి నన్నుఁ, బ్రదిలిపోనీక నొప్పించె నీవగలు
యీవల నాకిపు డేత్రోవవచ్చె, నేవెంట ధరియింతు నింక నీవగల
నేమెయి వచ్చితి మిక్కాననముల, కేమాటలాడుదు నితనితో నింక
నేనన్న నితనికి నితఁడు నాతమ్ముఁ, డేను సీతఁడుగూడి యిట్లు వ్రేఁగెదము
అని విచారము బుద్ధి నణుమాత్రమైన, నునుపనేరక రాముఁ డుల్లంబుఁ గలఁగి

## శ్రీరాముఁడు ప్రలాపించుట

మదనవేదనల నున్మత్తుచందమునఁ, బెదరి చూచుచుఁ దనపెంపెల్ల మఱచి
తనుమధ్య నీవింత తడవెందుఁ బోయి, తని చూచు నిందు రమ్మని చేరఁబిలుచుఁ [చు
బ్రియమొప్పఁ బైఁబడుఁ బెనచి రాఁ దిగుచు, బయలు కౌఁగిటఁ జేర్చుఁ బలుమాఱువగ
నొయ్యన నూరార్చు నొకకొంతవడికి, నొయ్యనఁ దనలోన నొకకొంత దెలియు
నక్కటా సౌమిత్రి యవనీతనూజ, యెక్కడఁ బోయెనో యేమైన యదియొ
వెలఁది యడ్డులచొప్పు వెదకియుఁ గాన, జలజాక్షి యీపర్ణశాలలో లేదు
ఏదెసఁ జోయెనో యిందీవరాక్షి, కాదొకో యిది దండకావనభూమి
యీదెస గాదొకొ యిది పర్ణశాల, కాదొకో రాముఁడఁ గానొకొ నేను
ఐన నాప్రాణంబు లకట యీబొంది,లోన నెట్లున్నవి లోలాక్షిఁ బాసి
పూని యీయెడఁ బ్రాణములతగుల్ రోసి, తానును దివి కేఁగఁ దలఁచితి నేని
వ్రతము చెల్లింపకవచ్చె వీఁడెట్టి, సుతుఁ డంచు నను గణించునె దశరథుఁడు
కాదేని వ్రతము సాంగంబుగాఁ దీర్చి, మేదిని పాలింప మిన్నక పురికిఁ
జనినచో మిథిలుఁ డచ్చటికి రానతనిఁ, గనుఁగొనఁగా సిగ్గు గాదొకో నాకు
నటుగాన నన్ను నీయడవిలో విడిచి, పటుబుద్ధిఁ బురి కేఁగి భరతునిఁ గాంచి
తనయనుమతి సర్వధరణిఁ బాలింపు, మని చెప్పి కైకకు నాసుమిత్రకును
కౌసల్యకును జనకజ చన్న తెఱఁగు, నాసుద్దియును దెల్పు నను మది నిల్పు
మని రాఘవుఁడు చెప్ప లల్లన వ్రాల్చెఁ, జనకజ మును పర్ణశాలలోనుండి
పోయినగతి మనంబుననుండి వెడలి, పోయెడు నని యడ్డముగఁ జేర్చె ననఁగ
నప్పుడు లక్ష్మణుఁ డన్నచందంబుఁ, దప్పక చూచి యెంతయు శోకమంది
యేతల్లిపని నేతు నేతల్లిఁ గొలుతు, నేతల్లిఁ దల్లిగా నిటమీఁదఁ జూతు
నినకులాధిపుశోక మేత్రోవ మాంతుఁ, దనదుతల్లులకును దనసహోదరుల
కెనయ సీతనితోడిదే లోక మగుట, మనువంశమంతయు మడిసెఁ బొమ్మనుచు
నందంద విలపింప నంతలో రాముఁ, డొందినమూర్ఛ దానొయ్యనఁ దెలిసి
తలకొన్నవగలలో దండకావనము, కలయ నాలోకించి కన్నీరు నించి
వనజాక్షిఁ జింతింప వగలు రెట్టించి, తనమది శోకించి ధైర్యంబు డించి
పోయితే సీత యీబొందితోఁ బాసి, పోయితే నన్ను నీబొందితో డించి
పారి సురాసురలోకపూజార్హ మనక, హరువిల్లు విఱిచితి నతివ నీకొఱకుఁ
ఖరుఁడని తలపోసిఁ బ్రాహ్మణుం డనక, పరశురాముని భంగపఱచితిఁ గడఁగి
నీరజలోచన నీకునై పూని, యీరెండునిందల నేరు గైకొంటిఁ
గడపట నినుఁ బాపెఁ గష్టదైవంబు, పడఁతి నిందలఁబడఁ బాలైతి నేను
నీవేడుకలు చూచి నీకు నేప్రియముఁ, గావింతునని పోయి కపటమృగంబుఁ
జంపి తెచ్చితి దానిచర్మంబు గడఁగి, యింపార నెవ్వరి కిత్తునే నింక
మది నెల్లసుఖములు మఱచి కానలకు, వదలక నను నమ్మి వచ్చినచోట
నినుఁ గావలేనైతి నీచన్నత్రోవఁ, గని రయంబున వచ్చి కదియలేనైతిఁ

బరువడి జగమెల్లఁ బాలింపఁజాలు, వరశక్తిగలిగినవానిచందమున
మునుకొని శరచాపములు దాల్చి ఘోర,వనదుర్గభూముల వర్తింప వచ్చి
వెడలితి మావారినెల్ల మఱచి, పడఁతుక నినుఁ గోలుపడితినే నేఁడు
ఏణాక్షి నినుఁ బాసి యీశరీరమునఁ, బ్రాణంబు లెబ్భంగిఁ బట్టుదు నింక
మేదినీతనయ యిమ్మేదినిఁ బాసి, యేదెస భరియింతు నీదేహ మింక
నెలఁత నీవిరహాగ్ని నీదులావణ్య, జలరాశి మునుఁగక చల్లార్పరాదు
తగిలి యీశోకాబ్ధిఁ దాఁట నీమేను, తగుతెప్ప లేకెట్లు తరియింపవచ్చు
మగువ నీపాలిండ్లమలుఁగు లేకున్న, నొగిఁ గాముశరవృష్టి కోర్వంగరాదు
నన్నట్లు గొని చనె నళినాక్షి పిదప, నిన్నిట్లు కొనిపోయె నేఁ డింక మనల
నిరువురఁ బాపిన యీదైవమునకు, నరుదెందుఁ గల దసాధ్యము లెందుఁ గలవు
కోమలి నిన్నెత్తుకొని పోవునప్పు, డేమని పలవించి తేమంటి నన్ను
నేదేశముల కేఁగి తెందున్నదాన, వేదుఃఖముల వ్రేఁగె దేమి చేసెదవు
ఎవ్వరు గొనిపోయి రేత్రోవఁ బోతి, వెవ్విధి వాటిల్లెనే నేఁడు మనకు
నీయట్టిచదురాలు నీయట్టిముగ్ధ, నీయట్టిలావణ్యనిధి యెందుఁ గలదు
కలదొకో యొకనాఁడు గరమర్థి నిన్నుఁ, గలిసి వినోదింపఁ గమలాక్షి నాకు
జలజాక్షి నినుఁగూడి సాకేతపురము, గలవాఁడ ననికాని కాన నొండొకటి
కలకంఠి నినుఁగూడి కనకహర్మ్యములు, గలవాఁడ ననికాని కాన నొండొకటి
అలివేణి నినుఁ గూడి యఖిలభోగములు, గలవాఁడ ననికాని కాన నొండొకటి
నెలఁతుక నినుఁగూడి నిఖిలసౌఖ్యములు, గలవాఁడ ననికాని కాన నొండొకటి
యిది మహారణ్యమై యిప్పుడు తోఁచె, నిది పర్ణశాలయై యిప్పుడు తోఁచె
నిదినాకుఁ దపముగా నిప్పుడు తోఁచె, నిది నాకు దుఃఖమై యిప్పుడు తోఁచె
నేలె మహీపుత్రి యేలె మృగాక్షి, యేలె సరోజాక్షి యేలె లతాంగి
యేలె వధూమణి యిన్నిచందములఁ, గ్రాలుచు నున్నాఁడఁ గటకటా యనవు
అలసయానములబా గంచల కిచ్చి, లలితాంఘ్రిరుచి ప్రవాళంబుల కిచ్చి
వరకుచోన్నతిచక్రవాకుల కిచ్చి, కరములకెంపు పంకజముల కిచ్చి
మెయిచాయఁ గ్రొక్కారుమెఱుఁగుల కిచ్చి, నయనవైభవము మీనములకు నిచ్చి
చల్లనిముఖదీప్తి చంద్రున కిచ్చి, తెల్లనినగవు చంద్రికలకు నిచ్చి
చెలువంపుఁబలుకు రాచిలుకల కిచ్చి, యలకలనునుఁగాంతి యళులకు నిచ్చి
సన్నపునడు మాకసంబున కిచ్చి, నిన్ను దైవము మ్రింగెనే నేఁడు సీత,
హా వామలోచన హా పద్మగంధి, హా వారిజానన హా సీత యనుచు
వివశుఁడై రామభూవిభుఁడు పల్వగలఁ, దవిలి దీనతఁబొంది తమ్మునిఁ జూచి
యేదెసఁ బోయెనో యిందీవరాక్షి, పోదమా లక్ష్మణ భూమిజ వెదుక
నొలసి యీపొదలలో నున్నదో పోయి, పిలుతమా లక్ష్మణ పృథ్వీతనూజ
నేతరుచాటుల కేఁగెనో యింతి, చూతమా లక్ష్మణ శుకమంజువాణి
యిత్తమ్మికొలఁకుల కేఁగెనో సీత, వత్తమా లక్ష్మణ వనజాక్షి నరసి

యని యిట్లు పలుకుచు నలిదీనవృత్తి, మనమునఁ గొని జాలి మటిమటి తూలి
ధరియింపరానివేదనలతో రాము, ధరణీవల్లభుఁడు గౌతమి చేరఁబోయి
యోలోకపావని యోలోకమాత, యీలోకపావని నెఱుఁగవే సీత
నోలోకబాంధవ యోకర్మసాక్షి, యేలీలనైన నీవెఱుఁగవే సీత
నోసర్వసంచార యోజగత్ప్రాణ, యాసీత నెఱుఁగవే యనఘ నీవైన
నెలదీఁగ కానవే యెలదీఁగఁబోఁడి, జలజంబ కానవే జలజాతగంధి
హరిమధ్యఁ గానవే హరిరాజ నీవు, కరిరాజ కానవే కరిరాజగమన
హరిణంబ కానవే హరిణాయతాక్షిఁ, బరభృత కానవే పరభృతవాణి
నళినాథ కానవే యలినీలవేణిఁ, దిలకంబ కానవే తిలకాంచితాస్య
ననుచు విభ్రాంతుఁడై యటులనందందఁ, జని చని వెదకుచు జాలిఁ దూలుచును
నెడపక నిబ్బంగి నెందు వైదేహిఁ, దడవి కానక జనస్థానంబు నెడలి
విన్ననై విరహార్తి వివశుఁడై యున్న, యన్న నీక్షించి యిట్లనియె లక్ష్మణుఁడు

### లక్ష్మణుఁడు రాముని శాంతిపఱుచుట

అన్న నీ వఖిలలోకారాధ్యపరుఁడ, వున్నతచిత్తుండ వురుబలాఢ్యుఁడవు
ఇంతికై వెనుబడి యిన్నిచందముల, నింత శోకింతురే యినకులాధీశ
యీమోహశోకంబు లిట నీకుఁ గలవె, తామసమోహసార్థముగాదె జగతి
నరుఁగుగా నీదు విల్లందితివేని, సురలైన నీదిక్కు చూడ నోడుదురు
అసమానసత్వుండ వఖిలేశ నీవు, వసుధేశ నాయంతవాఁడు నీబంటు
అక్కటా నీ కసాధ్యము లెందుఁ గలవు, దక్కఁగ నీవేర్మి దలఁపవుగాక
అనిన రాముఁడు శోకమంతయు నుడిగి, తనమదిఁ దెలివొంది తమ్మునిఁ జూచి
యేనింక నిటమీఁద నెన్నిచందముల, జానకి నెడఁబాసి సైరింపఁజాల
వారక నాదుదుర్వారబాణముల, ధారణీతలము విదారించి చించి
పాతాళవాసులఁ బట్టి సాధించి, శీతాంశుముఖయైన సీత సాధింతుఁ
గాదేని సప్తసాగరములు గలఁచి, మేదినీధరముల మెదిచి నుగ్గాడి
యీరసంబున దిగ్గజేంద్రకుంభములు, దారించి మేదినీతనయ సాధింతుఁ
గాదేని నఖిలదిక్పాలమర్మములు, ఛేదించి యాదిత్యబింబంబుఁ ద్రుంచి
పోరిఁబోరి నక్షత్రముల డుల్లనేసి, ధరణిఁ జీకటిఁజేసి తరుణి సాధింతుఁ
గాదేని సకలరాక్షసుల భస్మంబుగా దివ్యబాణముల్ కడఁకతో నేసి
యవనియరాక్షసమై యుండఁజేసి, తివుటమై నేఁడు వైదేహి సాధింతుఁ
గాదేని బ్రహ్మలోకంబెల్లఁ గలఁచి, యాదిమబ్రహ్మసంహారంబుచేసి
బలసి జీవులకెల్ల భయముఁ బుట్టించి, నెలకొన్నకడిమినై నెలఁత సాధింతు
నీరీతి భుజశక్తి నేఁ జూపకున్నఁ, జేరి మిన్నక సురల్ సీతఁ జూపుదురె
యదెచూడు నాదుబాణానలశిఖలు, పొదలుచునున్నవి భువనంబు లదర
నదె చూడు వైదేహి నని విజృంభించి, త్రిదశులు మెచ్చ సాధించెద ననుచు
నొదవి లోకములకు నుత్పాతహేతు, వుదయించె నన రాము లుఱక నిక్కించి

బలసి జీవులతోడ బ్రహ్మాండమెల్ల, నలిఁజేయుసంకర్షణస్వరూపంబు
రూపించులయకాలరుద్రుఁడువోలెఁ, గోపించి విల్లందుకొన్నమాత్రమునఁ
దలఁకె జీవములు భూతలమెల్ల వడఁకెఁ, గలఁగె లోకంబులు గగన మల్లాడె
బ్రహ్మాండభాండంబు పగిలినట్లయ్యె, బ్రహ్మమంత్రము దప్పె రవి దప్పె నడచె
నక్షత్రములు డుల్లె నభవుండు వెఱచె, యక్షదేవాసుర లాత్మఁ జేడ్పడిరి
అత్తఱి సౌమిత్రి యారాముఁ జేరి, చిత్తంబు భయమందఁ జేతులు మొగిచి
కాకుత్స్థ నీ వతికారుణ్యనిధివి, లోకరక్షణకళాలోలచిత్తుఁడవు
జనకజకొఱకునై సకలలోకములు, మునుమిడి నిర్మూలములు సేయఁదగునె
యొండొండ వనముల నొగి సముద్రముల, నిండినపురముల నిఖిలదేశముల
నలయక వైదేహి నరసి లేకున్న, జలము పెంపున మఱి సాధింతుఁగాని
యని లక్ష్మణుఁడు వల్క నతఁడును బ్రీతి, విని కోప ముడిగి తా విల్లెక్కుడించి
యఖిలేశుఁ డగురాముఁ డట దక్షిణాభి,ముఖుఁడునై తానుఁ దమ్ముఁడు వోవుచుండె
నాతఱిఁ దెరువున నందంద మెఱసి, సీతకొప్పుననుండి చిందినవిరులు
ఆతన్వివక్షోజహారరత్నములు, నాతతమణిమయం బైనయానాతి
పదనూపురము లుర్విఁ బడియున్నఁ జూచి, ముదము శోకంబును మూర్ఛయుఁగదుర
నప్పుడు రఘురాముఁ డాత్మఁ జింతించి, తప్పదెవ్వఁడో క్రూరదానవుం డొకఁడు
కుటిలకుంతల నెత్తుకొనిపోయినాఁడు, గటకటా యని త్రోవ గనుగొంచుఁబోవ
నంతంత రాక్షసునడుగులచొప్పు, నంత నా తెరువున కనతిదూరమున
నరయుచు నరయుచు నందంద పోయి, కరమర్థిఁ జూచి రాకమలాప్తకులులు
రాలినయెముకలు రక్తపంకమున, గూలినసూతుపైఁ గూలిన తేరు
దేరుక్రిందటఁ బడి తెగినయశ్వములు, ధారణిఁ బడిన పతాకఖండములు
విఱిగి ముందటనున్న వింటితున్కలును, నఱిముఱి బడియున్న యస్త్రశస్త్రములు
గనిలక్ష్మణుఁడు చూపఁ గడుఁజోద్యమంది, ఘను లెవ్వరో యుందుఁ గదనసౌఖ్యంబు
లనుభవించినవార లని యవ్విధంబు, గనుఁగొనుతలఁపునఁ గాకుత్స్థకులుఁడు

## జటాయువునకు అగ్నిసంస్కారము సేయుట

తెరువంతకంత శోధించుచు నుండ, నరుగుచో రఘురాముఁ డాసమీపమున
నెలమి నెంతయుఁ దూలి యెముకలు విఱిగి, కలయ నెత్తుటఁ దోగి కాళ్లును దునిసి
పవిచేతఁ గూలిన భర్మాద్రివోలె, వివశుఁడై పడియున్న విహగేంద్రుఁ గాంచి
సౌమిత్రి చూచితే చపలరాక్షసుఁడు, భూమిజ మ్రింగి తాఁ బోడచూప వెఱచి
చలియించి పక్షివేషమున నున్నాఁడు, బెలుకుటి వీనిఁ జంపెదనంచుఁ గడఁగి
ఘనచాపహస్తుఁడై కదసిన రాముఁ, గని పక్షివిభుఁడు గద్గదకంఠుఁ డగుచు
నెత్తురుఁ గ్రక్కుచు నిట్టూర్పు లెసఁగఁ, గుత్తుకఁ బ్రాణముల్ గుదివడఁ బలికె
ధరణీశ యేను మీతండ్రికి సఖుఁడఁ, బరఁగంగఁ గశ్యపబ్రహ్మపౌత్రుఁడను
నరుణనందనుఁడ జటాయువన్వాఁడఁ, జరియింతు నడవుల శైలశృంగముల

నని నాదువృత్తాంతమంతయు నీకు, వినుపింపనే మున్న విశదంబుగాఁగ
నట్టివానికి నిట్టి యాపద యెట్టు, పుట్టె నటన్న నోపుణ్యాత్మ వినుము
వలనొప్ప నేఁడు రావణుఁడు నీదేవి, నెలమి మ్రుచ్చిలి కొని యేఁగుచో నేను
బోనీక యడ్డమై భూరిసత్త్వమున, వానితోఁ బోరాడి వసుధఁ గూలితిని
ఇదె వానికేతుసమేతసూతాశ్వ, విదితరథం బాజి విఱిగె నాచేతఁ
జలమున దివినంతఁ జపలరాక్షసుఁడు, నెలఁతుకఁ గొనిపోయె నీవు రావైతి
నేను నీ కీవార్త యెఱిఁగింపఁగంటిఁ, బూని నీశుభమూర్తి పొడఁగానఁగంటి
నతిపుణ్యకృతినైతి నని విన్నవింప, మతిలోన శోకమిన్మడిగ రాఘవుఁడు
విల్లటు పడవైచి వివశుఁడై ధరణిఁ, ద్రెళ్లి సౌమిత్రి బోధింపఁగాఁ దెలిసి
యయ్యో మహాత్మ జటాయువా నీకు, నియ్యవస్థలువచ్చెనే మదర్థముగ
నని జటాయువుదేహ మందంద తడవి, తనురక్తమంతయుఁ దానె తుడ్చుచును
దమ్మునిఁ జూచి యీతఁడు మనకొఱకు, నిమ్మాడ్కి రావణు నెదిరిపోరాడె
నిటువంటిపుణ్యాత్ముఁ డెందైనఁ గలఁడె, యటుగాన దివి కేఁగఁ దరుగకమున్నె
రావణుఁ డేలెడిరాజధానికిని, త్రోవయు వానిబంధుపరాక్రమము
నన్నియు నడుగు మీవన్న లక్ష్మణుఁడు, క్రన్నన రఘురామకార్యసహాయు
నాజటాయుని నిర్జరాదివిధేయు, నోజఁ దద్విధమెల్ల నుచితోక్తి నడుగఁ
గొన్నిమాటలు వేరుకొనుచుఁ గుత్తుకకుఁ, గ్రొన్నెత్తురొలుకఁ బల్కుల కెడలేక
యతులపుణ్యోదయుం డగురాముఁ జూచి, మతిలోన నతనిసంస్మరణ మేమఱక
మోక్షపథానందమునఁ బులకించి, పక్షివల్లభుఁ డంతఁ బ్రాణముల్ విడిచె
ధరణీశసుతు లంత దశరథాధీశు, మరణంబుకంటెను మదిఁ జాల వగచి
విహగవల్లభునకు వేదోక్తయుక్తి, దహనాదికృత్యముల్ దగ నాచరించి
యంత వేవేగ క్రౌంచారణ్యమునకు, నెంతయుఁ గడఁకతో నేఁగి యచ్చోట
నానాలతావృతనగమృగోదగ్ర, మైనట్టి యొకకోన నరుగుచో నచట
నెఱసినకురులును నిడుదకోఱలును, బఱపైనకడుపును బడబాకినోరు
మిడిగ్రుడ్లకన్నులు మీఁగాళ్లదాఁక, విడిబడ్డచన్నులు వెక్కిచిన్నెలును
నలర నయోముఖి యనుదైత్యవనిత, కలితసౌందర్యలక్షణుని లక్ష్మణుని
గనుఁగొని కామించి కరమంటఁ బట్టి, తనుఁ బొంద రమ్మని తరితీపుసేయ
జొప్పనాతికి నెట్టిసుఖమిచ్చె దాని, కప్పాట నసిధార ననువార నొసఁగె
దుందుభిపటహాదితూర్యనాదముల, క్రందునకంటె నగ్గలముగా నపుడు
ముందఱ నొకమ్రోత మోయంగ దాని, చందంబు గనుఁగొనఁ జనుచు రాఘవులు
యోజనాయతబాహుఁ డొగిఁ బారసాచి, యేజంతువులనైన నేపుమై నొడిసి
యఱిముఱి మ్రింగుచు నావలించుచును, జాఱువుచ్చి మస్తకశూన్యుఁడై నిలిచి
యుదరంబు నోరుగా నున్నకబంధు, విదళితబహుజీవవితతకబంధుఁ
ద్రిదశనిర్బంధు సందీప్తమదాంధుఁ, గదిసి రాముఁడు చూచి కడుఁజోద్యమందె
వాఁడును దనకరద్వయమున వారి, వేఁడిమిచెడఁ బట్టి వేవేగ దిగువ

నన్నను జూచి యిట్లనియె లక్ష్మణుఁడు, నన్ను వీనికి భక్షణముచేసి మీరు
సీత నన్వేషించి చేకొని సకల, భూతల మేలంగఁ బొండన్న నతఁడు
చింతించుచును వానిచేతుల వెంటఁ, గొంతదూరముపోయి కూర్మితమ్ముఁడును
దానును బుద్ధినెంతయు విచారించి, పూనికమీఱ గొబ్బున నొఱల్ వెఱికి
కడువాఁడిఖడ్గముల్ గైకొని వానిఁ, గడఁగి చేతులు రెండు ఖండించుటయును
నుబ్బెల్లఁ జెడి దైత్యుఁ డొఱలుచుఁ దూలి, గొబ్బునఁ దెలివిగైకొని వారిఁ జూచి
మీరెవ్వ రనుడు సౌమిత్రి సర్వంబు, శ్రీరామచరితంబు చెప్పిన దాని
వినుటచే నంతట విజ్ఞానమొదవఁ, దనదువృత్తాంతమంతయుఁ జెప్పఁదొడఁగె
దనువను దివ్యుండ ధరణీశ యేను, ఘనమైన మునిశాపగతి నిట్టులైతి
గనకగర్భునిచేతఁ గామరూపత్వ,మును జిరంజీవిత్వమును గాంచి క్రొవ్వి
యిట్టిరూపము దాల్చి యెల్లసంశయములఁ, బట్టి బాధింపఁగఁ బరమకోపనుఁడు
స్థూలశిరుండన శోభిల్లు మునికి, నీలోకమునఁ దొల్లి యెగ్గుఁ గావించి
యతిఘోరరూపుఁడ నై యేను మరల, నతనిఁ బ్రార్థించిన నతఁడు మీవలన
నతులశాపవిముక్తి యగునంచుఁ బలుక, మతిలోన నదియెల్ల మఱవక పిదప
నదియాదిగా నిట్టి యాకృతిఁ బూని, త్రిదశేంద్రునాజి కేతెమ్మన్న నతఁడు
కంఠంబు తలతోడఁ గడుపులోఁబోవ, గుంఠితంబుగ వ్రేసెఁ గులిశపాతమున
ననిన రాఘవుఁడు దశాననుచంద, మనఘ నీవెఱుఁగుదె యనిన వాఁ డనియె
నెఱుఁగుదుఁగాని మౌనీంద్రుశాపమున, నెఱుక చాలదు నాకు నీశరీరమున
ననలంబు దరికొల్పుఁ డామీఁద మీకు, వినుపింతుఁ దెలియ నవ్విధమున్న వారు
దనువుశరీరంబుఁ దగసంస్కరింప, ననలుని కాదేహ మాహుతియయ్యె
నతఁ డంత దివ్యుఁడై యాకాశవీధి, నతులవిమానంబు నందుండి పలికె
నో రఘురామ యాయోధనోద్దామ, కారుణ్యతారుణ్యగాంభీర్యధుర్య
కాకుత్స్థవర్య నీకారుణ్యదృష్టి, పైకొన నాతొంటిపదముందఁ గంటి
విను మింక రావణువిధమెల్ల నేను, వినిపింతుఁ దేటగా వివరించి యతఁడు
ధనదానుజుఁడు పులస్త్యబ్రహ్మమూర్తి,మనుమండు తనతపోమహిమ మెప్పించి
నలువచే వరము లున్నతిఁ గాంచినాఁడు, చెలఁగి దిగ్విజయంబుచేసినవాఁడు
తొలివేలుపులకెల్ల దొరయైనవాఁడు, కలవేలుపులకెల్ల గంటైనవాఁడు
బలుతలల్ పదియును బాహు లిర్వదియుఁ, గలవాఁడు లవణసాగరఖేయమైన
లంకాపురంబు పాలనసేయువాఁడు, బింకాన రజతాద్రిఁ బెఱికినవాఁడు
అనిచెప్పి రావణుం డాసీతఁ గొనుచుఁ, జనినమార్గముచెప్పి సరగ నాదనువు
మఱిత్రోవ గుఱుతులు మార్గంబుచెప్పి, తఱచైనవస్తువుల్ తప్పక చెప్పి
మేరఁగాఁ బంపాసమీపంబునందు, నారూఢమతియుతంగా శ్రమంబొప్పు
నమ్మునిశిష్యురా లయినట్టిశబరి, మిమ్ముఁ బూజించు నమ్మెలఁతయున్నెడకు
మీరలు పోవ నమ్మిహిరసూనునకుఁ, గూరిమిచెల్మి గల్గును దానివలన
జానకిఁ బొందెదు సామ్రాజ్యపదవిఁ, బూని కాంతు వటంచుఁ బోయె నద్దివికి

దనువటు దివ్యపదంబున కరుగ, మనువంశతిలకులు మఱునాఁడు కదలి
పంపాసరోవరపశ్చిమస్థలిని, సంపూర్ణతరులతాసంపదఁ బొదలి
ప్రబలి పుణ్యములకుఁ బట్టైనయట్టి, శబరియాశ్రమవనస్థలికిఁ బోవుటయు

### రామలక్ష్మణులు శబరిని గాంచుట

నెదురుగా వచ్చి యయ్యింతి సద్భక్తిఁ, బదముల కటు సాఁగఁబడి లేచి మ్రొక్కి-
దశరథవరపుత్ర తాటకాజైత్ర, కుశికసంభవయాగకుశలప్రయోగ
చిరమునిధ్యేయ శిక్షితతాటకేయ, పరమగంగాతీరపాదసంచార
పదరజోనైర్మల్యపాలితాహల్య, విదళితహరచండవిపులకోదండ
భీమభార్గవరామ బిరుదాభిరామ, కామితపితృవాక్యకరణసుశ్లోక
ప్రకటాపరాధవిరాధనిరోధ, సకలమునిత్రాణ సత్యప్రవీణ
ఖరదూషణాదిరాక్షసశిరశ్ఛేది, మరణార్థిమారీచమర్దినారాచ
సీతావియోగసూచితమోహరాగ, ఖ్యాతఖగాధ్యక్షకల్పితమోక్ష
యలఘువిక్రమధామ యతిపుణ్యనామ, నెలకొని రఘురామ నినుఁ జూడఁ గంటిఁ
బరికింప నాతపఃఫల మందఁగంటి, సరుదైనపుణ్యంబు లన్నియుఁ గంటి
గాకుత్స్థ తెరువునఁ గడుడస్సి తెందుఁ, బోక మాయాశ్రమంబున నేఁడు నిలువు
అనఘాత్మ మాగురుఁ డైనమతంగ,మునిచేత నీకథ మును వినియుందు
నీవాద్యుఁడవు సర్వనిగమవేద్యుఁడవు, గావున నిను నుతుల్ గావింపఁదరమె
యిది యామతంగమునీంద్రునాశ్రమము, విదితతపశ్చర్యవిశ్రాంతికరము
అని యామహత్త్వంబు లన్నియుఁ దెలిపి, వనమూలఫలములు వలనొప్పఁ దెచ్చి
యిచ్చిన భుజియించి యెలమి నారాముఁ, డచ్చటఁ బ్రీతిమై నారాత్రి నిలిచి
ఘనజటాబంధైకకబరి నాశబరిఁ, గనుఁగొని మఱునాఁడు కాకుత్స్థుఁ డనియెఁ
దరమిడి మిగుల సీతావియోగాగ్ని, దరికొన నెంతయుఁ దలఁకుచున్నాఁడ
నొకచోట నిలువలే కులుకుచున్నాఁడ, వికచాబ్జముఖిసీత వెదుకఁబోవలయుఁ
బనివినియెద నన్నఁ బరమసంతోష,మునుబొంది శబరి రామునిఁ జూచి పలికె
దనువనుఘనుఁడు ముందఱఁ జేయఁదగిన,పనులెల్లఁ దెలిపె నేర్పడ వేడ్కతోడ
నైనను మఱియు నే నదియు తెల్పెదను, మానవనాథ నీమది కెక్కునట్లు
రావణుఁ జంపెదు రామ నీకూర్మి,దేవిఁ గూడెదవు సందేహంబు వలదు
ఐనను నేకాకులై పోవఁ దగదు, భానుకులాధీశ పరఁగఁ బైనిపుడు
ఇనకులాధిప యింక నిట ఋశ్యమూక, మనుపర్వతంబున కరుగుము నీవు
మునిసితమదిసూర్యసుతుఁడు సుగ్రీవుఁ, డనువానరాధిపుఁ డాకొండనుండుఁ
దనవధూరత్నంబు తనరాజ్యపదము, తనయన్న వాలిచేఁ దాఁ గోలుపోయి
యతఁడు శోకాతురుఁడై యున్నవాఁడు, అతనికిఁ గపిసేన లప్రమాణములు
అతనికి విశ్వాస మాత్మఁ బుట్టించి, యతనికి నుపకార మలవడఁ జేసి
యతఁడు నీవునుగూడి యటు లంక కరిగి, యతిసత్త్వరావణు ననిలోనఁ జంపి
బలవిక్రమంబులు ప్రస్తుతికెక్కఁ, జెలువొప్ప నీదేవి సీతఁ గైకొనుము

అని యొప్ప శబరి కార్యములెల్లఁ దెలిపి, తనగురువాక్యంబు తలఁచి యాక్షణమె
యనలంబు దరికొల్పి యయ్యగ్నిలోనఁ, దనశరీరమున వేల్వఁ దా సమకట్టి
యాసమయంబున నంతరిక్షమున, వాసవప్రముఖగీర్వాణులందఱును
మణిఘృణిదేదీప్యమానవిమాన, గణసమారూఢులై కనుఁగొనుచుండ
నారదసనకసనందనప్రముఖ, సారమునీంద్రులు సంతోషమందఁ
బరముఁ బరంధాముఁ బరమకల్యాణుఁ, బరిపూర్ణుఁ బరమాత్ముఁ బరమేష్ఠివినుతు
నవ్యయు నవికారు నఖిలాంతరాత్ము, నవ్యక్తు నఖిలేశు నాద్యంతరహితు
భవముఖామరవేద్యు భవరోగవైద్యు, రవికులాంబుధిచంద్రు రఘురామచంద్రుఁ
దనమది నిలిపి యత్తఱి వలగొనుచు, వినుతించి శబరి యావిభుసన్నిధిని
ననలునియందు రామార్పణంబుగను, దనశరీరము వేల్చి దైవతానీక
మానితదివ్యవిమానంబునెక్కి, నానావిధముల వర్ణనసేయ సురలు
దేవలోకమున కెంతేవేడ్కఁ జనియె, దేవదుందుభులు ధింధిమి యని మ్రోయ
ననలముఖంబున నారీతి శబరి, యనిమిషసౌఖ్యంబు లందినయంత
రమణీయమూర్తులు రామలక్ష్మణులు, నమితబలోదగ్రు లచ్చోటు వెడలి
యనవరతాలోకమతిగుణానేక, మునిలోక మగుఋశ్యమూకంబుఁ గనిరి

### శ్రీరాములు ఋశ్యమూకమును జూచి హర్షించుట

త్రైలోక్యవిభులైన తమరాక చూచి, యాలోలమతి పొంగి యానందమంది
యనయంబు నొప్పెడు నశ్రుపూరంబు, లన సెలయేరుల నమరినదాని
నిల మేరుమందరహిమశైలపతుల, నలిమీఱి నగియెడి నగవులో యనఁగ
సాంద్రంబులై యెందుఁ జరులదీపించు, చంద్రకాంతోపలచ్ఛాయలదాని
సరసిజాసనుఁడు భూచక్రంబుమీఁదఁ, బరఁగఁ బర్వతరాజపట్టంబు గట్టి
శిరసునఁబెట్టినఁ సేసఁబ్రా లనఁగ, నురుశృంగములఁ జొక్కలొప్పెడిదాని
నురుమతిఁ దనుఁ జొచ్చియున్నసుగ్రీవుఁ, బరిభవించినవాలిపై మండుచుండు
గతిసూర్యకాంతముల్ గలయ వెలుంగ, నతులప్రతాపోగ్రమై యున్నదాని
మెఱుఁగులు కొమ్ములై మెఱయ నేతెంచి, నెఱయుసానువులందు నీలమేఘములు
పొలుపొందు మదగజంబులుగాఁగఁ దలఁచి, మలయుసామజముల మానైనదాని
నంగజహరుమౌళి నలరు నాకాశ, గంగయై యొప్పులఁ గరమొప్ప నొప్పి
యారెడఁ గ్రీడించు హంసమాలికలు, మాయనివిధుశిరోమాలికల్ గాఁగ
బహుశృంగభూరుహపల్లవచయము, విహితజటాజూటవిభవమై యొప్ప
నాసన్నులై సిద్ధు లర్థి సేవింప, నాసదాశివమూర్తి యననొప్పుదాని
బలభేది మొదలుగాఁ బరఁగుదేవతలు, కలయనంబుధి ద్రచ్చి కన్నవస్తువులు
పనివడి తమలోనఁ బాలుపోకున్న, సునిచిరో యమృతపానోన్మత్తు లగుచు
మఱచిరో యంతయు మంచితావగుటఁ, దెఱఁగొప్ప దాచిరో దీనిపై ననఁగఁ
గల్పవృక్షంబులఁ గామధేనువుల, వేల్పుకన్నియలను వివిధౌషధములఁ
జింతామణుల నెందుఁ జెడనిపెన్నిధుల, సంతానతరువుల సరినొప్పుదానిఁ

గని దానిమహిమకుఁ గడుఁ జోద్యమంది, యినవంశవల్లభుం డెంతయుఁ బొగడి
యఱలేనిభక్తితో ననుజుండు గొలువ, మెఱయు నాశైలసమీపంబునందుఁ
దఱచైనతొగలనెత్తమ్ములతోడ, వఱలు పంపాసరోవరమున కరిగి
యందును నియతితో నాసరోవరము, నందుఁ గృతస్నానుఁడై రామవిభుఁడు
కలయఁ గనుంగొని కడుఁ జోద్యమంది, విలసిల్లు నొక మావివృక్షంబునీడ
అలసట దీరంగ నపుడు లక్ష్మణుఁడు, సలలితశైత్యోపచారముల్ సలుప
నీక్షించి రఘురాముఁ డేపుదీపించి, వృక్షంబుఁ బరికించి వేడ్క నిట్లనియె
వనవాస మిటు తుదవచ్చిన మొదలు, ఘనమైనయద్రులు ఘనపుణ్యనదులు
దరమిడి కంటిమి ధారణి నిట్టి, తరువెందుఁ గాన మీతరువుకు సవతు
సురపతి మొదలగు సురలెల్లఁ గూడి, కరమర్థి నీతరు గావించి రొక్కొ
యజుఁడె యీతరువున కాయువుఁబోసి, నిజముగా నిచ్చట నిలిపినాఁడొక్కొ
రవిసుతుతపమున రాగిల్లి బ్రహ్మ, భువిని నీతరువును బుట్టించినాఁడొ
సేవించి యమృతంబు చేకొని సురలు, భావించి రవిసుతుపక్షంబు గలిగి
మురయంగ మేలైన యమృతంబుతోడఁ, బురణింపఁ దరువుగాఁ బుట్టించినారొ
యినునితో నిష్టంబు లింపొందఁజేయఁ, జనుధర్మముననుండి శాఖలున్నతము
లష్టదిక్కులకును ననువందఁ బాఱె, యిష్టఫలంబుల నీఁగోరినట్లు
పఱచుశాఖలరుచిప్రభ నొప్పుమీఱె, తెఱచి పర్ణంబులు తేజంబు లొప్ప
రవిదృష్టి చొరనీదు రాత్రులఁ బేర్మిఁ, దవిలి యాశశిదీప్తి దనుఁ గాననీదు
ఫలము లాయమృతపుఫలములకంటెఁ, గలశతగుణములఁ గడునొప్పుదాని
తరురాజపట్ట మీధాత్రిపై వేడ్కఁ, గరమర్థి దివిజులు గట్టిరో ప్రీతి
నని తమ్మునికిఁ దెల్ప నగుగాక యనుచు, వినయోక్తి నారామువిభుచిత్త మెఱిఁగి
యాలోన సౌమిత్రి యన్నకు భక్తి, శాలియై మృదుపర్ణశయ్య గావింప
సముచితస్థితి మృదుశయ్య రాఘవుఁడు, విమలచిత్తంబున వేడ్క శయింప
సౌమిత్రి రఘురాముచరణంబు లొత్త, శ్రీమీఱ నిద్దఱు చెలఁగుచునుండ
ననఘుని రఘురాము నట లక్ష్మణుండు, గని వెండి యెలుగెత్తి గ్రక్కునఁ బలికెఁ
గైకొందు చెలినని నిలయంగ రొప్పి, చేకొని చిఱుతరాచేరువఁబట్టి
యెల్లెడ శుభములె యొసఁగు నీకనుచు, బల్లి దీప్తంబుగా బలికెఁబో చెవికి
భానునిపైఁ బక్షపరుసున నెలుఁగు, మానుగాఁ గూర్చెద మహిపుత్రి నీకు
ననియు నించుక చేరి యంతయు రొప్పఁ, దనయాత్మఁ గడు మెచ్చి తమ్మునిఁ జూచి
యినవంశవల్లభుం డిట్లని పలికె, వనచరాధీశుండు వడి నేఁగుదెంచి
ఘనభక్తి మనలను గలయు నిచ్చటను, చనుదుము లంకకు సరగున మనము
గూలురావణుఁ డాజిఁ గూడును సీత, యేలుదు లోకంబు లెలమిఁ బెంపొంద
నన రామసౌమిత్రు లధికసంతోష, మును బొంది సుఖగోష్ఠి ముద మొప్పనుండి
రారణ్యకాండ మింపారంగ నుతుల, నారవితారార్కమగు నుర్విమీఁద
నని యాంధ్రభాష భాషాధీశవిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు

పాలితాచారుం డపారధీశరధి, భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
తమతండ్రి విఠ్ఠలధరణీశుపేరఁ, గమనీయగుణధైర్యకనకాద్రి పేర
నాచంద్రతారార్కమగు నొప్పమిగిలి, భూచక్రమున నతిపూజ్యమై వెలయ
ననమానలలితశబ్దార్థసంగతులఁ రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగునలంకారభావనల్నిండఁ, గరమర్థి నారణ్యకాండంబు చెప్పె
నారూఢి నార్శేయమై యాదికావ్య, మై రసికానందమై యెల్లనాఁడు
ఇవ్వసుమతి నొప్పు నీపుణ్యచరిత, మెవ్వారు చదివిన నెవ్వారు వినిన
సామాదిబహువేదచయ యథామరాదు, నామచింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్ ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాదిరతులు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును, బాయక విరచున్నఁ బాపక్షయంబు
వరపుత్ర లబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యచయసమృద్ధియును
నేవిఘ్నములు లేక యిండ్లలో నధిక, లావణ్యవతులైన లలనలపొందుఁ
గొడుకులతో నెప్డు గూడియుండుటయు, నెడగాఁగ నాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులఁ గూడుటయు, నిమ్ముల కామ్యంబు లెడపకుండుటయు
సతతంబు దేవతాసంతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవలోకాధివాసతఁ జేయు
నెందాఁక కులగిరు లెందాఁక తార, లెందాఁక రవిచంద్రు లెందాఁక దిశలు
ఎందాఁక వేదంబు లెందాఁక ధరణి, యెందాఁక భువనంబు లేపుదీపించు
నందాఁక నీకథ యక్షయానంద, సందోహదోహళాచారమై పరఁగు.

ఆరణ్యకాండము సంపూర్ణము.

---

శ్రీ ర స్తు

# శ్రీరంగనాథరామాయణము

## కిష్కింధాకాండము

శ్రీరాముఁ డయ్యెడ శీతలవారి, వారిజోత్పలకైరవంబులనొప్పు
పంపయు మధుమాసఫలితతత్తీర, చంపకసహకారచారుకాంతార
సంపదయును జూచి జానకీవిరహ, కంపితుం డగుచు లక్ష్మణున కిట్లనియె
సౌమిత్రి యీపంప సకలనిలింప, కామినుల్ జలకేళి కరముఁ గాంక్షింప
నొప్పు నీసరసితో నుపమాన మరసి, చెప్పంగ శక్యమే శేషాహికైన
ననుకూలమలయానిలాహతి దీన, జనియించుఁ బో బిందుసరము లెన్నైన
దీనిమహత్త్వంబుఁ దెలిసినచోట, మానసంబును నణుమాత్రంబుగాదె
పావనజీవనాస్పద మైనదీని, కావేల్పుడిగ్గియ యైన సమంబె
యున్నాళికస్ఫురితోరుకర్ణికలఁ, దిన్నగా విరిసిన తెల్లనెత్తమ్మి
మరకతస్తంభనిర్మలహేమకుంభ, భరితాతపత్రమై పార్శ్వద్వయమునఁ
దేటిఱెక్కలఁ గ్రమ్ము తెమ్మెరవలన, నూటాడుతరగల సుయ్యెలలూఁగు
విప్పారుఱెక్కల వెలయురాయంచ, లొప్పారఁగా వైచు నుభయచామరము
లింపొంద నీపంప యీక్షింప నొప్పె, శ్రీపూర్ణపట్టాభిషిక్తునికరణి
నామని జవ్వనం బలరినరుచుల, చే మించు చిన్నారి చిగురుమానికపు
సొమ్ములు దాల్చుచుఁ జొట్టును గ్రమ్మి, కొమ్మ లీనిద్దంపుఁగొలఁకుదట్టమున
నిక్కి నీడలు చూచి నిజవిలాసముల, కొక్కింత యాదల నూఁచుగందమునఁ
గొండొకగాలిసోఁకుల తుదల్గదల, నొండొంటిఁ బొగడుచు నున్నచందమునఁ
గీరశారిక లర్థిఁ గెరలు నిచ్చోటి, తీరవనీవాటి దృష్టింప నిపుడు
తాపంబు మరునిప్రతాపంబుకరణి, దీపించె నామేన ధృతి నటుగాన
సౌమిత్రి యిది వనస్థలి గాదు చూడఁ, గాముని యాయుధాగారంబుగాని
చింతింప నివి మావిచిగురులు గావు, కంతుని క్రొవ్వాడి కత్తులుగాని
భావింప నివి పూవుబంతులు గావు, భావజాతుని వాడిబాణముల్ గాని
యీయెడ భృంగఝంకృతు లివి గావు, డాయు మన్మథుచాపటంకృతుల్గాని
వర్ణింప నివి పికధ్వనులు గావతను, కర్ణకఠోరహుంకారముల్గాని
యటుగాన నావంటి యంగనారహితు, లెటువలె వేఁగింతు రీకాననమునఁ
గలకంఠకలకుహూకారనిస్వనము, చెలఁగించు వనము గర్జిలు ఘనాఘనము

గులుకుపుష్పాడిమించు గ్రొక్కారుమించు, జలిదంగొమ్మలు శక్రధనువులయనువు
వసుధ రాలెడివిరుల్ వర్షోపలములు, ముసరు తేఁటులయోన నిండినవాన
గా నొప్పుచు వసంతకాలంబుఁ జూడ, వానకాలముఁ బోలి వసుధ నొప్పెడిని
చిగురాకుశాఖలతోఁ జిట్టాడుతేఁటి, పొగలతోఁ బొగడపుష్పాడిబూదితోడ
బూరుగుపూవునిప్పుకలతో నెగడి, యారయ విరహుల కగ్నియై నిగుడి
కంతుప్రతాపాగ్నికంబెను గడఁగి, యెంతేని నాచిత్త మెరియింపఁ దొడఁగె
నేమిచేయుదు నింక నెట్లు వేఁగింతుఁ, గామినీమణి సీతఁ గాంతు నెన్నఁటికి
బంపాసరోవరప్రాంతకాంతార, సంపదతోడ వసంతంబు గుండి
చెలువైనచందాన సీతతోఁ గూడఁ, గలుగునే నాకు నొకానొకనాఁడు
ఈపంపలోఁ దమ్ములే చూచినట్లు, భూపుత్రివదన మప్పుడు చూచువాఁడ
నిందు మీనవిహార మీక్షించినట్లు, నింపునగవుసొంపు నెప్పుడు చూతు
జలపక్షు లిచ్చట జత గూడినట్లు, జలజాక్షి నెన్నఁడు జతఁగూడువాఁడఁ
దేటి యిచ్చటఁ దమ్మితేనె గ్రోల్కరణి, బోటికెమ్మోవి నెప్పుడు గ్రోలువాఁడఁ
నెక్కడి తలపోఁత లెక్కడి సీత, యెక్కడ వెడనేఁత లివి యెట్లు పోనఁగుఁ
దమ్ముఁడ నీవయోధ్యకుఁ జను మింక, నెమ్మినఁ బ్రాణంబు లిఁక నిల్పఁజాల
నని యనాథునిక్రియ నందంద వగవ, విని లక్ష్మణుఁడు రామవిభుఁ జూచి పలికె
నిదియేమి రఘురామ యెల్లలోకములు, ముదలింపఁ బురుషోత్తముఁడవైననీవు
ఈమోహశోకంబు లేల తాల్చెదవు, కామిని వంచనఁ గైకొని చనిన
రావణుఁ జంప నారంభంబు సేయు, మీవని తెలుపుచో నెంతయుఁ బ్రీతిఁ
గనుబంటి యెలుఁగిచ్చె గబ్బిల్లు పలికెఁ, గనుఁగొని తచ్చెలి కలయంగ రొప్పె
చేకొని చిలుక దాఁజేరువఁ బెట్టెఁ, గైకొందు చెలినని కలయంగరొప్పె
నెల్లెడ శుభములు నిత్తు మీకనుచు, బల్లి దీప్తంబుగాఁ బలికెఁబో చెవికి
భానుపై వామాక్షిపరుసనియెలుఁగు, నాని యించుక చెవి యనుఁగొప్పెఁ
దనయాత్మఁ గడు మెచ్చి తమ్మునిఁ జూచి, యినవంశవల్లభుఁ డిట్లని పలికె
వనచరాధీశుండు వడి నేఁగుదెంచి, ఘనభక్తి మనలను గలయంగఁ గలఁడు
కూలు రావణుఁ డాజిఁ గూడును సీత, యేలుదు లోకంబు లెలమి ధరింప
నని రామసౌమిత్రు లధికసంతోష,మునుబొంది సుఖగోష్ఠి మునుమందుచుండ
నాలోన సుగ్రీవుఁ డాఋష్యమూక, శైలసానువులందుఁ జరియించుచుండి
యాపంపచేరువయం దున్న రామ,భూపాలు లక్ష్మణుఁ బొడఁగాంచి వెఱచి
యచలంబుపైకి గుండనక చెట్టనక, కిచకిచధ్వనులఁ బోఁ గిచకొట్టుకొనుచు
నెగఁబ్రాఁకి యెక్కుచో నేకాంతమందు, నగచరులకువారి నట చూపిచూపి
విలువూని యిద్దఱు వివిధశస్త్రాస్త్ర,కలితులై యదె పంపకడ నున్నవారు
వినుఁ డిందుఁ బ్రచ్ఛన్నవేషులై వాలి, పనుపున మనలఁ జంపఁగ వచ్చినారు
కాదేని మునులకు ఖడ్గతూణీర,కోదండశరముల గొడవ యేమిటికి
వినుఁడు పావనులైన వీరివేషములుఁ, గనుఁగొని నాబుద్ధి గలఁగుచున్నదియు

నెక్కడికైనను నేఁగుట కార్య, మిక్కడ నుండుట యిది బుద్ధిగాదు
అనుచు మంత్రులతోడ నాడువాక్యములు, విని హనుమంతుండు విమలుండై పలికె
పూని వీరలఁ జూడఁ బుణ్యమానసులు, గాని కానేరరు కపటమానసులు
ఆరవిచంద్రులో యనఁ నొప్పు వీరు, కారుణ్యపురుషులు కడ విచారింప
నేరూపమున వచ్చి యిందున్న వారొ, వీరి వెం పెఱుఁగక వెఱవ నేమిటికి
ననిన సుగ్రీవుఁడు హనుమంతుఁ జూచి, విను వాలిపనుపున వీర లిచ్చటికిఁ
జనుదెంచి రనుశంక జనియించెఁగానఁ, గినిసి యేవేళ నే కీడెంచునొక్కొ
తనపగతుని నమ్మఁ దగదటుఁగానఁ, జని నీవు వారలఁ జతురతఁ గదిసి
వీరేల వచ్చిరో వీరి లోఁ తెఱఁగి, వీరితో భాషించి వేవేగ వచ్చి

### శ్రీరాములవద్దికి హనుమంతుఁడు వచ్చుట

పవనజ నాలోని భయమెల్ల మాన్పు, మవిరళగతినేఁగు మని వీడుకొలిపి
యలమెడుభీతిమై నందుండ వెఱచి, మలయాద్రి కటువోయి మంత్రులుఁదాను
అత్తఱి హనుమంతుఁ డతిశౌర్యవంతుఁ, డుత్తమగుణశీలుఁ డురుబాహుబలుఁడు
ఖరకరతేజుండు కమనీయమూర్తి, తరుచరులకు రక్ష ధర్మార్థమోక్ష
యతులకు గురుభక్తి యభినవయుక్తి, శ్రుతకీర్తి యంజనాసుతుఁడు తా వేడ్క
నమరలోకమునకు నావాలిఁ బనుప, రమణమై సుగ్రీవు రాజుగా నిలుప
వావిరి సురలను వరభక్తిఁ బ్రోవ, రావణుజయలక్ష్మి రామున కొసఁగ
నవనిజ ఘనశోక మంతయు మాన్ప, రవిసూనుమన సెల్ల రాణింపఁజేయ
వచ్చెనో యనఁగ నవ్వనచరేశ్వరుఁడు, అచ్చుగా నాగిరి నల్లన డిగ్గి
వటువేషధారియై వాయునందనుఁడు, అటు పంపకడకుఁ దా నర్థితోఁ బోయి
ననుపమం బగుశౌర్యహస్తంబుతోడఁ, జని మహాత్ములఁ గానఁ జన దటుగాన
నలరామునకు నియ్య నర్హమైనట్టి, ఫల మొక్క టపుడు చేపట్టి వేడుకను
అరుదెంచు ననిలజు నపుడు తాఁ జూచి, ధరణీశుఁ డిట్లనె తమ్మునితోడఁ
గనకపువన్నెయుఁ గర మొప్పుముంజి, ఘనరత్నకుండల కలితకర్ణములు
సురుతరహారంబు లొంటిజన్నిదము, కర మొప్పు గోఁచియుఁ గరకంకణములు
నుపమింప నరుదైన యొప్పులనొప్పు, గపిరూపు మనుజుఁడు గైకొనె నొక్కొ
ఈరూపురేఖయు నిల గోరి రుద్రుఁ, డారూఢిగా నితఁడై పుట్టినాఁడొ
గాక యీవసుధపైఁ గపిమాత్రమునకుఁ, బ్రాకటంబుగ శుభప్రభ యేల గలుగు
నని యిట్లు కొనియాడు నవనీశుఁ జూచి, తన మేను పులకించి తడయక వచ్చి
యురుమతి సీతశిరోరత్న మెలమి, గురుతుగాఁ దెచ్చి గ్రక్కున నిత్తునన్న
కరణి నాఫలము రాఘవమహీపతికి, గరిమతో కానుకగా సమర్పించి
నీవ శరణ్య మీదృష్టి నా సోకె, నైనవి నాభూషణావళు లింక
నేను కృతార్థుండ నేను ధన్యుండ, నేను మీభృత్యుండ నెలమితోడుతను
నని పల్కి హనుమంతుఁ డనువేరివాఁడ, నినతనూజునిమంత్రి నేవాయుసుతుఁడ
నాంజనేయుఁడ భిక్షుకాకృతి నిపుడు, నంజక మీచెంద కరయ వచ్చితిని

వినుఁడు సుగ్రీవుఁడు విశ్రుతకీర్తి, వనచరులకు రాజు వరబలాధికుఁడు
భానుసూనుఁడు బృహద్భానుతేజుండు, మానభూషణుఁ డసమానవిక్రముఁడు
అన్నయౌ వాలిచే నపహృతరాజ్య,ఖిన్నుఁడై యిప్పు డిగ్గిరి నున్నవాఁడు
ఆర్తుఁడు మీసఖుఁడై యుండఁజేయ, నేర్తు నావుడు రామనృపుచిత్త మెఱిఁగి
కరమర్థి రామలక్ష్మణులకు మ్రొక్కి, కరములు ముకుళించి కడుభక్తిఁ బలికె
నవని నింద్రోపేంద్రు లగ్నినశ్వినులు, రవిచంద్రులన రూపరమ్యతతోడ
నెగుబుజంబులతోడ నిందుబింబంబు, నగు మొగంబులతోడ నళినపత్రములఁ
దెగడుకన్నులతోడ దివిజాలు మెచ్చి, పొగడు విక్రమకళాభుజశక్తితోడ
నరుదైన రాజచిహ్నములతో మీరు, శరచాపహస్తులై చనుదెంచినారు
భూరి తపోవేషములు మీకు నేల, మీ రెవ్వ రిచటికి మీరు రా నేల
నని సుధామధురవాక్యంబుల నధిక, వినయవిధేయుఁడై విన్నవించుటయు
నతని వాక్శుద్ధికి నతని బుద్ధికిని, నతని చమత్కృతి కతని యాకృతికి
నతని మనఃప్రీతి కతని నీతికిని, మతి సంతసిల్లి రామక్షితీశ్వరుఁడు
దమ్మునిఁ జూచి యీతని యట్లు వలుకఁ, దమ్మిచూలికిని నాతనివధూమణికిఁ
దగు గాన నొరులకుఁ దరమె వ్యాకరణ,నిగమశాస్త్రంబు లన్నియు నేరఁబోలు
నితని సల్లాపంబు నితనిరూపంబు, నతులలక్షణలక్షితానురూపంబు
ఇటువంటిదూత నాకిపు డబ్బెనేని, ఘటియింపకున్నె మత్కార్యంబులెల్లఁ
గావున మత్కార్యగతుల నీతనికిఁ, గోవిదాత్మక పూసగూర్చినరీతిఁ
జెప్పు మేర్పడనన్న శ్రీరాముతమ్ముఁ, డప్పుడు ప్రియమంది హనుమంతుఁ జూచి
మేమన్నదమ్ముల మిక్ష్వాకుకులుల, మీమహాత్ముఁడు రాముఁ డేను లక్ష్మణుఁడ
దశరథరాజనందనుల మిద్దఱము, దశరథుపనుపునఁ దపసుల మగుచు
దండకావనమునఁ దవిలి వర్తించు, చుండ రామునిదేవి నుర్వీతనూజ
మము డాఁగురించి దుర్మదుఁడు రావణుఁడు, క్రమమేదికొనిపోయెఁగపటమార్గమున
వాని పోయినజాడ వదలక వెదకి, కానలనడుమ నొక్కట వచ్చి వచ్చి
శబరి సుగ్రీవునిచరితంబు చెప్పఁ, బ్రబలుఁ డాతఁడు మాకు బంటుగాఁగోరి

### హనుమంతుఁడు తనజన్మప్రకార మెఱిఁగించుట

వచ్చితి మిచటి కెవ్వఁడవు నీవింక, నచ్చుగా నెఱిఁగింపు మనఘ నీ తెఱఁగు
ననవుడు హనుమంతుఁ డారఘుకులులఁ, గనుఁగొని మ్రొక్కి తక్కక విన్నవించె
నెలమి మాతల్లికి నెలమి జన్మించి, వలనొప్ప నొకకొన్నివర్షము ల్చనఁగ
నొకకారణమునకై యొకబ్రహ్మఁగూర్చి, ప్రకటితమతి నేతపంబు సేయఁగను
పరికించి సరసిజభవుఁ డేఁగుదెంచి, వరము వేఁడుమటన్న వలగొని మ్రొక్కి
వేవేలువిధముల వినుతులు చేసి, రోవిమలాత్మ యీయుర్విపై నాకు
గతిమోక్షకామార్థకారణంబులకుఁ, బతియెవ్వఁ డతనినే ప్రార్థించి కొలుతు
నని విన్నవించిన నబ్జసంభవుఁడు, తనమనోవీథిని దలపోసి చూచి
యొనరంగ నీమేనియురుభూషణములు, కనుఁగొన్నయాతఁడె గతియును బతియు

ధాతయు మన కిష్టదైవంబు సకలభూతజాలములకు భువికెల్లఁ గర్త
నతఁ డెవ్వఁడనిన వాఁ డతఁడె విష్ణుండు, అతఁడె నీగతి యని యది యాత్మఁ దెలియు
మని బ్రహ్మ చనియె నే నదియునుగాక, ఘనబుద్ధి చరియింతుఁ గలయ లోకముల
భూపాలతిలక నాభూషణావళులు, దీపించఁ గానరు దివిజులందఱును
మఱియును సౌమిత్రి మారుతిఁ జూచి, తెఱఁగొప్ప నతనితో ధీరుఁడై పలికె
విను రాఘవుఁడు లోకవిఖ్యాతసత్త్వుఁ, డనుపమదివ్యాస్త్రుఁ డతులసాహసుఁడు
కరుణాపయోధి యగాధమానసుఁడు, శరణాగతత్రాణసద్ధర్మపరుఁడు
జగదేకనాథుఁ డశరణశరణ్యుఁ, డగణితగుణగణ్యుఁ డధిక తేజుండు
అతిలోకవిక్రముం డతిసత్యవాది, హితుఁడనై బంటనై యేను వర్తింతుఁ
గావున రాఘవక్ష్మాపాలమణికి, లే వసాధ్యంబులు లెక్కింప నెందుఁ
గుటిలరాక్షసుఁ డున్నగుఱుతు మున్నెఱిఁగి, యిట సీత సాధింప నేము చాలుదుము
అలపుమై నేకాకులై పోవఁ దగదు, దలపోయ నది రాజధర్మంబు గాదు
గాన నీసుగ్రీవుఁ గైకొనుతలఁపు, మానవాధీశ్వరుమదిలోనఁ గలదు
ఇటమీఁద నీకార్య మేవెంటనైన, ఘటియింపు మనవుఁడు కపివలిసుతుఁడు
నెఱయ సంతసమంది నిజమూర్తిఁ జూపి, మఱి దన్ను రామలక్ష్మణులు మన్నింపఁ
దనుఁ గృతకృత్యుఁగాఁ దలఁచె నాబలులు, వనచరరాజునె వరుస నెన్నుచును
గనుఁగవ హర్షాశ్రుకణములు దొరుగఁ, గొనియాడి కొనియాడి కోర్కె దీపింప
మనమున సంతోషమగ్నులై యపుడు, అనిలజు వీడ్కొల్ప నతిసంభ్రమమున
నిఁక సూర్యసూనుని నేలింతు రాజ్య, మకలంకమతి రాముఁ డనుఁగుసఖుండు
గాఁగ నేకొదువలు కల్గునె జగతి, వేగమ పోయెద వింతమై ననుచు
నరిగి రాఘవులవృత్తాంత మంతయును, దొరకొని సుగ్రీవుతోఁ జెప్పఁదొడఁగె
రమణీయమూర్తులు రామలక్ష్మణులు, కమనీయగుణములు గలిగి వర్తింత్రు
జగతిపై నతిశోకసాగరమగ్నుఁ, డగునీకు రఘురాముఁ డను తెప్ప దొరకె
బ్రదికితి సుగ్రీవ పగయెల్లఁ దీఱెఁ, దుదముట్టఁ గలిగె సంతోషంబు నీకు
నాదశరథపుత్త్రుఁ డాసుచరిత్రుఁ, డాదయాపరమూర్తి యాసత్యవాది
యామహాభుజశాలి యామహా*బలుఁడు, శ్రీమహావిష్ణుండు శ్రీనివాసుండు
ఆపుణ్యనిధి రాముఁ డట నీకుఁ గర్త, నీపుణ్య మేమన నేర్తు సుగ్రీవ
యామహాత్ముఁడు తండ్రియానతి దండ, కామధ్యమున నుండఁగా దశాననుఁడు
తనదేవి బ్రుచ్చిలితనమున నెత్తి, కొనిపోవ వాని మార్కొని త్రుంచివైవఁ
జింతించి నీతోడి చెలిమి వాటింప, నెంతయుఁ దలపోసి యేతెంచె నిటకు
ననిన సుగ్రీవుండు హర్షంబునొంది, యనిలనందనుఁ జూచి యర్థితోఁ బలికెఁ
బవనజ నాలోని భయమెల్ల నడఁగెఁ, దవిలి యేఁ జేసిన తపమెల్లఁ బండె
నలవడ నాకు నీయట్టియంజనము, గలుగుటఁ గంటి రాఘవనిధానంబు
గలఁగక నీవంటి కర్ణధారుండు, గలుగ నీశోకాబ్ధి గడ తేరఁగంటిఁ

* ధీరుఁ, డామాన్యచరిత్రుఁ డసదృశగాత్రుఁ, డాపుణ్యనిధి.

గడఁకతో ఋశ్యమూకమునకు వారిఁ, దోడ్తెచ్చి నాలోని తొందఱ మాన్పు
పొమ్మనవుడు వాయుపుత్త్రుండు వోయి, నెమ్మితో రఘురామనృపతికి మ్రొక్కి
దేవ సుగ్రీవుండు దేవరసఖుఁడు, దేవ నిన్ దర్శింపఁ దివురుచున్నాఁడు
విచ్చేయుఁ డని విన్నవించిన రాముఁ, డిచ్చలో హర్షించి యింపుసొంపొంది
హనుమంతుఁ గొనియాడి యతిపుణ్యలగ్న,మున హనుమంతునిమూఁపులమీఁదఁ
దనతమ్ముఁడును దాను దమి ఋశ్యమూక,మున కేఁగి యానందమును బొందె నపుడు
హనుమంతుఁ డంత నేకాంతంబునందు, మనుజేశ్వరులఁ బెట్టి మలయాద్రికరిగి
శ్రీరామదర్శనోద్గ్రీవు సుగ్రీవుఁ, జేరి నీకోరిక చేకూఱె నింక
రా దేవ వచ్చిరి రామలక్ష్మణులు, ఆదట ఋశ్యమూకాద్రికి ననుడు
నినతనూజుఁడు ప్రీతి నిచ్చలో నుబ్బి, మనుజవేషముఁ బూని మకుటకేయూర
ఘనతరశృంగారకలితుఁడై మిగిడి, తనమంత్త్రులును దానుఁ దడయ కేతెంచి
దక్షిణభక్తితో డాసి రామునకుఁ, జక్క సాగిలి మ్రొక్కి సంప్రీతినొంది
ముకుళితహస్తుఁడై ముందఱనున్న, యలంకసుగ్రీవు నధిపతి చూచి
యాలింగనముచేసి యప్పు డిట్లనియె, నాలోన దరహాస మమృతమై తొరుగ
నీవాయుపుత్త్రుచే నినసుత యేను, నీవిక్రమంబును నీభుజాబలము
విని ప్రీతినొందితి వెఱవకు మింక, నెనసినపగవాని నేనె చంపెదను
నాకాప్తబంధుండు నమ్మినసఖుఁడు, నీకంటె నొకఁడు గణింపఁగఁ గలఁడె
యని యూఱడించిన నర్కనందనుఁడు, ననిచినబంటుగా నన్నుఁ గైకొంటి
దేవ నీకారుణ్యదృష్టి నాసోఁక, నేవెంట ధన్యుఁడ నేనెపో యింక
నలినాప్తకులనాథ నాయట్టిబంటుఁ, గలిగె నీకటుగానఁ గడిమిమై నింకఁ
దివిరి రావణుని వధించితిఁ గడఁగి, యవనిజఁ గైకొంటి నని నిశ్చయింపు
మని రామసుగ్రీవు లన్యోన్యభాష, లనలుసన్నిధిఁ జేసి యకలంకులైరి
అట నంగదుండు మదంచితాంగదుఁడు, ఆటప్రాయముగాఁగ నప్పు డావనుల
గిరులను గనవచ్చు క్రియనాఁడుచుండి, యారామసుగ్రీవు లన్యోన్యముగను
నెన్నఁగా ననలుసన్నిధిఁ బల్కుపల్కు, లన్నియు విని వచ్చి యాతారతోడ
విన్నవించిన మది వేఁగుచునుండి, కొన్నిదుశ్శంకఁ గుందుచునుండె
నపు డర్కసుతునకు నారాఘవునకు, విపులభూరుహశాఖ విఱిచి వాయుజుఁడు

### సుగ్రీవుఁడు జనకజతొడవు లిచ్చుట

ఆసనంబును వైవ నందుఁ గూర్చుండి, యాసక్తిఁ బరిణామ మరయుచున్నంత
నహిమాంశునందనుం డంత రాఘవుల, గుహలోపలికిఁ దోడుకొనిపోయి ప్రీతి
భూమిజ మును వైచిపోయినతొడవు, లా మెయిఁ గొనితెచ్చి యప్పు డిట్లనియె
దనుజుండు నీదేవి ధరణీతనూజ, వనసీమలోపల వంచన మిమ్ముఁ
గనుఁబ్రామి గగనమార్గంబున నెత్తి,కొనిపోవఁ బోవ నీకొండపై మమ్ముఁ
గనుఁగొని మిముఁ బెక్కుగతులఁ జీరుచును, జనుఁగునఁ బయ్యెదకొంగుఁ జించి బంధించి
తనతొడవులు వైచి తరలాక్షి పోయె, నని చెప్పి యిచ్చిన నధిపతి చూచి

మున్నుగా వగలను మున్నీట మునిఁగి, కన్నీట నాసొమ్ము కసవెల్లఁ గడిగి
యందంద యురమున నాభూషణములు, పొందించి పొందించి భూమిజఁ దలఁచి
పెలుకుచే లక్ష్మణుఁ జేరొక్కని పిలిచి, పలికెఁ బల్కులఁ దొట్రుపాటు రెట్టింపఁ
గంటె లక్ష్మణ సీతకై నేఁతలెల్ల, మంటిపాలయ్యె నిమ్మాడ్కి నేమందు
సీతొడవులు వైవ నేమికారణమొ, యీతొడవులతోడ నేమైన యదియొ
యిది నాకుఁ బ్రాణనాయక యైనసీత, కుదురునిండిన గబ్బిగుబ్బలమీఁదఁ
బాయని యీజిల్గు పయ్యెదచీర, కీయవస్థలు వచ్చె నేమనవచ్చుఁ
బన్నీట నాపాదపద్మముల్ గడిగి, యున్నతిఁ దడియొత్తు నొప్పుగ దీన
సురటిగావించి భాసురలీలతోడ, భరితశ్రమాంబువుల్ పలుచగాఁ జేయు
మెలుగారుమైఁదీఁగ మెఱయుచుండంగ, మఱి యడుగులకును మడుగులు వైచు
నని యని శోకించు నశ్రులు నించు, ననయంబు మూర్ఛిల్లు నంతలోఁ దెలిసి
ప్రియభక్తి వినమితగ్రీవు సుగ్రీవు, నయత నాథుఁడు రఘునాథుఁ డీక్షించి
నాదేవిఁ గొనిచన్న నాకేశవైరి, యేదేశమున నుండు నెద్ది పురంబు
చెప్పుమా సుగ్రీవ సీత సాధింతు, నిప్పుడ దైత్యుని నేపడఁగింతు
నావిని యారవినందనుం డనియె, దేవ యాద్రోహిమందిరము నే నెఱుఁగ
నెఱుఁగకుండిననేమి యిటమీఁద వాని, నెఱుఁగు తెఱంగెల్ల నేను గావింతు
నీవె శోకము మాని నిశ్చలధైర్య, భావగుణాస్పదపరుఁడవు గమ్ము
అతిపరాక్రమశాలి యగువాలిచేత, హృతకళత్రుఁడనయ్యు నేనింత వగవ
నాపద యనువార్ధి కాత్మధైర్యంబు, దేప సేయునరుండు దెలివిమైనుండు
మావంటిప్రాకృతమనుజులయట్ల, నీవును శోకింప నీతియె దేవ
యనుఁడు సుగ్రీవునియాప్తవాక్యములు, విని ధీరుఁడై రఘువీరుఁ డెంతయును
ఇంతివోయినజాడ నెఱిఁగినపిదప, నంతరంగంబున నడలుచు నునికి
మగపాడి గాదని మది నిశ్చయించి, జగతీశుఁ డంతట సంతాప ముడిగి
సరసిజాననఁ బూని సాధించుపనికిఁ, బరికించి మును వీని పగదీర్తు ననుచు
మీనాక్షితొడవు సౌమిత్రికి నిచ్చి, భూనాథుఁ డట నర్కపుత్రు నీక్షించి
యాపదమున సఖుఁ డైనట్లు చుట్ట, మూపాటి గానేరఁ డారసిచూడ
గుణవంతుఁడైనను గుణహీనుఁడైన, గణియింప సఖుఁడె సద్గతి యండ్రు బుధులు
గావున నీచెల్మి గలిగిన నాకు, నేవెంటఁ గొదువలే దిది నిశ్చయంబు
నీపత్నిఁ గైకొని నినుఁ జంపఁగోరు, పాపాత్ముఁ డగువాలిఁ బరిమార్తు నిపుడు
అన్నదమ్ములమైత్రి నలరుటకంటె, నున్నదా సౌఖ్యమా యొరిమెకు మాని
యగచరాధిపుఁడ నీయన్నకు నీకుఁ, బగయైనవిధము దప్పక చెప్పు మనిన
నోరామ వాలికి నొగి నాకు నైన, వైరానుకథనంబు వర్ణింతు వినుము
కడఁగి మంథరగిరి కవ్వంబుఁ జేసి, తడయక వాసుకిఁ దరిత్రాడు చేసి
మమ్ము దేవతలెల్ల మన్ననసేయఁ, గ్రమ్మిన తెలివిరై ఘనభుజాబలిమి
వాలియు నేనును వడినొక్కవంక, వ్రాలితి మొకవంక వ్రాలిన వారు

సురగరుడోరగాసురసిద్ధసాధ్య, వరులందఱును క్షీరవారిధిఁ దరువ
గరళంబు పుట్టి లోకము లెల్లఁ గాల్ప, హరుఁ డదియును మ్రింగ నద్భుతంబుగ
నలరంగ జ్యేష్ఠయు నం దుదయింపఁ, గలిరాజు దానిని గైకొనెఁ బ్రీతిఁ
బ్రస్తుతి కెక్కుచు బహుళంబులైన, వస్తుచయంబు లవ్వారిధిఁ బుట్టెఁ
దమతమకోర్కెకుఁ దగినవస్తువుల, నమరంగఁ గైకొని రందఱు ప్రీతి
నలిఁ బుట్టె నైరావణము మేషమహిష, ములు మకరకరేణువులు హయవృషభ
ములు జనియింప నింద్రాదిదిక్పతులు, వివిధయానములుగా వేడ్కఁ గైకొనిరి
మహనీయసౌభాగ్యమహిమలు తనకు, సహజంబులై లక్ష్మి జనియింపఁ జూచి
యామహాలక్ష్మి నారాయణుం డపుడు, కామించి తనదేవిగాఁగఁ గైకొనియెఁ
జంద్రుఁడు దేవతాసతు లుదయింప, నందఱిలోఁ దార యనునాతి మాకు
దేవత లిచ్చినఁ దివిరి గైకొంటి, మావిధంబున మఱి యందఱుఁ దరువ
జనియించె నమృతంబు సకలదేవతలు, ననురాగమును బొంది యాసుధారసము
కామధేనువు కల్పకములాదిగాఁగ, సోమునిఁ గొని తమచోటికిఁ జనుచు
నమరులు సమ్మింప నర్థితో వచ్చి, కమనీయపదమునఁ గాంతతోఁ గూడి
కలిసియుంటిమి కొంతకాలంబుదనుక, అలరుసుషేణుని యనుఁగుఁగూఁతురును
జెలువొప్పఁ బెండ్లియై చెలఁగువేడుకల, వలనొప్ప రుమఁగూడి వర్తించుచుండ
మాతండ్రి తర్వాత మంత్రులు పెద్ద, యీతఁ డంచును వానరేంద్రపట్టంబు
వాలికిఁ గట్టి రావాలియు నన్నుఁ, జాల మన్ననచేసి సంప్రీతి నడుప
నతనికి బంటనై యహరహం బేను, బితృసమానునిగాఁగఁ బేర్మి సేవింతు
నీరీతి నన్యోన్యహితులమై మెలఁగ, శ్రీరామ యొకనాఁడు చిరవైరమూని
తొడరిన కడఁకతో దుందుభిగన్న, కొడుకు మాయావి యను ఘోరరాక్షసుఁడు
నడురేయి కిష్కింధనగరంబు బెదర, వడి నార్చి గర్వదుర్వారుఁడై పేర్చి
యని సేయఁ బిలిచిన నలుక దీపింప, ననుపమజయశాలి యగువాలి వెడలి
ననుఁ గూడి యున్న సన్నద్ధుఁడై కడఁగి, తనమీఁద నడువ నిద్దఱఁ జూచి వాఁడు

వాలి మాయావితో యుద్ధముచేయుట

అనిసేయ మది భీతుఁడై పాఱిపోయి, తనగుహఁ జొచ్చిన దర్పించి వాలి
యధికగర్వోద్ధతుం డగువానిఁ బట్టి, వధియించి వత్తునే వచ్చునందాఁక
నిచ్చట నేమఱ కీవు వేఱొకఁడు, చొచ్చిరాకుండ నిచ్చో నుండు మనుచు
గుహవాత నన్నుంచి గుహలోనఁ జొచ్చి, గుహలోన నొకయేఁడు ఘోరయుద్ధంబు
కడఁకతోఁ జేయ రక్తము వెల్లివిరిసి, యుడుగక గుహవాత నుబ్బినఁ జూచి
కనుఁగొని యార్పు రాక్షసునియార్పులను, విని వాలి రాక్షసవిభునిచేఁ జచ్చె
నిచ్చట నే నుండు టెఱిఁగిన వెడలి, వచ్చి యాదైత్యుండు వధియించు నన్ను
నని నిశ్చయముచేసి యప్పుడే పోయి, కొనివచ్చి యొకకొండ గుహవాత నునిచి
యచ్చట వాలికి నటఁ దిలోదకము, లిచ్చి కిష్కింధకు నేను వచ్చుటయు
వాలి పోయినతరువాత నీరాజ్య, పాలనంబున కీవె ప్రాప్తుండ వనుచు

వదలక మంత్రులు వానరరాజ్య,పదమున ననుఁదెచ్చి పట్టంబు గట్టి
వానరకులచక్రవర్తినై యేను, నూని రాజ్యము సేయుచుండితి నంత
మనుజేశ మఱి వాలి మాయావిఁ జంపి, ననుఁ జీరి చీరి యంతట గుహా నేను
వెనిచి వైచినకొండ పిండిగాఁ దన్ని, చనుదెంచి నేలేమిఁ జాలఁ గోపించి
కినుకతో మఱి వాలి కిష్కింధఁ జొచ్చి, తనకు నేఁజేయు వందనము గైకొనక
యోరి తమ్ముఁడవని యూఱడి నమ్మి, పోరాడఁ బగరపైఁ బోయినచోట
నను డించి చనుదెంచి నారాజ్యపదము, గొని ప్రీతి నేలుట కూడునే నీకు
కడుఁ బాపబుద్ధివి గావున నిన్నుఁ, దొడరి చంపిన నాకు దోసంబు లేదు
అనవుడు నేవాలి యడుగుల వ్రాలి, వినయంబు భయమును వెలయ నిట్లంటి
నొకరేఁడు మాయావియును మీరుఁ బోరఁ, బ్రకటించి రక్తపూరము గుహావాత
వెడలిన భయమంది విపరీతబుద్ధి, వడిఁ బాఱి యిచటికి వచ్చినఁ జూచి
రట్టడిమంత్రు లీరాజ్యంబు నాకుఁ, గట్టి రింతియకాని కపటమే నెఱుఁగ
నాకు నీయాగమనంబె శోభనము, నీకపిరాజ్యంబు నీవె కైకొనుము
వావిఁ దమ్ముఁడఁగాని వాలి నీకేను, సేవకుండ సుతుండఁ జెప్ప నేమిటికిఁ
గరుణాఢ్య నాయెడఁ గల్ల గల్గినను, గరుణింపు మని పెక్కుగతులఁ బ్రార్థింప
నంతకంతకు మండి యనుజునిపట్ల, నింతేల యని మంత్రు లెంత దెల్పినను
అనయుఁడై నాపత్ని యగురుమఁ బుచ్చు,కొని రాజ్యమును బుచ్చుకొని చంపఁగడఁగె
వెఱచి యేకాకినై వెనుకొని వాలి, తరుమ భూలోకమంతయు నేను దిరిగి
యేపఱి పఱతెంచి యిందున్నవాఁడ, నీపర్వతము వాలి కెక్కరాకునికి
ననిన రాముఁడు వెఱగంది యీకొండ, యినతనూభవ వాలి కెట్లెక్కరాదు
వినుపింపు మనవుడు వినతుఁడై నిలిచి, యినతనూజుఁడు ప్రీతి నిట్లని పలికెఁ
దొల్లి ధుందుభి యనుదుష్టరాక్షసుఁడు, బల్లిదుఁడై వరబలము రంజిల్ల
ముల్లోకములు తనమొనకు భీతిల్ల, మల్లడియై కారుమహిషమై పోయి
తఱిమి సముద్రుని తనతోడ ననికి, నఱిమి పిల్చుటయు నయ్యంబుధి గలఁగి
ఘనరత్నకోటులు కానుక లిచ్చి, తునియక బల్మి నీతోను బోరాడ
ఘనుఁడైన వింధ్యాద్రిగాని యేఁ బూని, యనిసేయఁజాలఁ బొమ్మనిన నేతెంచి
జంభారిదోస్తంభసంభావితోగ్ర,దంభోళినైశిత్యదర్పభంగముల
నతులశృంగముల వింధ్యాద్రిఁ గోరాడ, నతిభీతుఁడై పర్వతాధీశుఁ డనియె
నీసరివాఁడనే నిల్చి నీతోడ, నోసరింపక పోర నేర్తునే యేను
నీలోకమున నిన్ను నెదిరి పోరాడ, వ్రాలినభుజశక్తి వాలికిఁ గలదు
బలియుఁడై కిష్కింధపాలించు నతఁడు, కలహంబుపై వాంఛ గలదేని నీకు

వాలిదుందుభుల యుద్ధము

నలఘువిక్రమ యింక నం దేఁగుమనినఁ, జెలఁగి రాక్షసుఁడు కిష్కింధ కేతెంచి
విలయకాలాభీలవేళ గర్జిల్లు, జలదంబుగతి నార్చి సరిఁ దనతోడ
నాలంబుసేయ రమ్మని తనుఁ బిల్వ, వాలి కోపించి వెల్వడి వచ్చి యార్చి

దుందుభిగతి మ్రోయు దుందుభిఁ దాకి, యెందుఁ బోవఁగవచ్చు నింక నీ కనుచు
శిలలు పాదపములు చెచ్చెర నువ్వి, తలముష్టిహతులఁ గొందలముందఁ జేయ
వాఁడును వానరేశ్వరునివక్షంబు, వాఁడిగొమ్ములఁ గ్రుమ్మ వాలి కోపించి
అతిఘోరుఁడై పేర్చి యచలంబు వైవ, గతిదప్పు నురికి రక్కసుఁడును వైవ
గండశైలము బుచ్చి కపిరాజు వైవ, నొండొండఁ గొమ్ముల నోహరించుచును
అరిగ్రమ్మికొని వాలి నదరంట వ్రేయ, తరిమి వృక్షంబునఁ దరువరుం డదవ
మూటున నసుర క్రమ్మఱ వచ్చి తాఁక, మోట తానెత్తుక మోఁదె నావాలి
కదిసి కొమ్ములఁ జిమ్మఁ గపిరాజు నిలిచి, కదలనిముష్టివక్త్రంబునఁ బొడువ
రక్కసుఁ డొడువ మర్కటరాజుఁ బొడువఁ, దక్కక యిరువురు దర్పించి పేర్చి
కొనకొని నూతేండ్లు ఘోరయుద్ధంబు, మనువంశవల్లభ మఱి చేసి వాలి
క్రేళ్లురికియుఁ బిడికిటఁ దోఁకఁబట్టి, యెల్లెడఁ గుదియించి యెడపక త్రిప్పి
వడి దూలి యసురయు వాపోవ వైవఁ, గడఁగి మర్మముఁ గాంచి కడువడిఁ బొడిచి
బలిమిఁ గొమ్ములు పట్టి పడవైచి చంపి, తలకొన్నలావుమై తన్నెఁ దన్నుటయు
ముక్కునఁ జెవుల మోమున నెత్తురొలుక, నక్కులిశాహతి నద్రియవోలె
నాయుగ్రదైత్యుమహాకళేబరము, పోయి యోజనమాత్రమునఁ దూలి పడియె
గైరికనిర్ఝరాకారంబు లగుచు, నారక్తకణము లయ్యద్రిపైఁ బడిన
నారసి యచట నిత్యము తపంబున్న, దారుణశక్తి మతంగుఁడు గినిసి
యీపర్వతము వాలి కెక్కరాకుండ, శాపంబు గావించె జగదేకనాథ
కాన నీఋష్యమూకమునందు వెఱవ, కేను గాపుండుదు నెల్లకాలంబు
కడగి యీదుందుభికాయంబుఁ బుచ్చి, పుడమిపై యోజనంబును బాఱవైవ
వలనైన భుజశక్తి వాలికిఁగాని, తలపోయ నొరులకుఁ దరముగా దధిప
గైకొని నీవంతకంటె దూరముగ, నీకళేబర మిప్పు డిట మీటకున్న
నెనసిన మీసత్త్వ మిచ్చ నే నమ్మ, ననవుడు రఘురాముఁ డల్లన నవ్వి
యాదుందుభిశరీర మవలీల మీటి, నీదుసందేహంబు నేఁడు వాపెదను
ఇనతనూభవ దాని నేర్పడఁ జూపు, మనవుడు సుగ్రీవుఁ డర్థితోఁ జూప
ఘనమేరుమందరాకారమైయున్నఁ, గని కళేబరము డగ్గఱి నేతెంచి
గొనకొని దానిఁ గైకొనక నంగుష్ఠమునఁ బదియోజనంబులు మీటివైచె
వైచిన రఘురామువరశక్తి పేర్మిఁ, జూచియు నమ్మక సుగ్రీవుఁ డనియె
నెలమిమై నిది వాలి మీటెడునాఁడు, దలమైనరక్తమాంసములతో నుండు
మను జేశ నేఁ డస్థిమాత్రమైయుండుఁ, గని నీవు మీటితి గాక యొక్కింత
వడిఁ బేర్చి నీలావు వాలిలావునకుఁ, గడు నెక్కుడని నమ్మఁగారాదు దేవ
యతఁ డిదియునుగాక యలవొప్ప మీటు, క్షితిధరంబులు పుట్టచెండులమాడ్కి
జతురంబునిధులందు సంధ్యలు వార్చి, శితికంఠపదముల శిరమర్థిఁ జేర్చు
వాయువుకన్న జవంబు హెచ్చుగను, దోయధు లన్ని దోడ్తో దాఁటివచ్చు
వాలికి నిర్జరేశ్వరదంతి హేమ,మాలి కెవ్వరు సాటి మఱియొండు వినుము

ధరణీశ యియ్యేడుతాళ్లను దొల్లి, పరశక్తియుక్తిమై వాలి బిట్టిగసి
కరముల నొక్కటిగాఁ గూడఁబట్టి, తరమిడి వానిపత్రములెల్లఁ ద్రుంచు
నడరి తాళంబుల నందొక్కటైన, వడిఁ గదల్పఁగలేరు వాసవాదులును
దలకొని యొకకోల తాళంబు లేదు, నిలుపక గాఁడిపో నేసితివేని
వసుధేశ నీలావు వాలిలావునకు, నసమానగతి నెక్కుడని నమ్మవచ్చు
ధరణీశ యీసప్తతాళంబు లొక్కశరమునఁ దెగవ్రేయ శౌర్యంబు గలుగు
పురుషునిచే వాలి ప్రాలియు నటంచు, నరయ నాకు మరుత్తుఁ డనుముని చెప్పె
నన విని రఘురాముఁ డల్లన నవ్వి, వనచరాధిప తాళ్లు వదలక చూపు
మనవుడు సుగ్రీవుఁ డారాము వేగ, కొనిపోయి యాతాళ్లగుఱుతెఱిఁగింప
నశనిసంకాశమై యసదృశంబైన, నిశితాస్త్ర మరివోసి నిపుణుఁడై నృపుఁడు
ముంచి యొక్కట పంక్తిముఖునాళ్ల త్రాళ్లు, ద్రెంచినగతిఁ దాళ్లు తెగనేయుటయును
నవనిపై వక్రంబులైయున్నత్రాళ్లు, నవిరతంబుగఁ బడినవి గాడిపాఱి
చేరువగిరి దాఁటి చెచ్చెర మీఱి, ధారణి దూఱి పాతాళంబుఁ జేరి
యలయక తీవ్రత నమ్మహాశరము, తొలఁగక రఘురాముదొన వచ్చి చొచ్చె
నతులితం బగురవ మాకాశవీథి, నతులవిమానంబునందుండి పలికె
పరమాత్మ యే సురపతికడ నుందుఁ, గరుణావతి యనెడు కన్నికఁ దొల్లి
నిరతంబు దుర్వాసు నిందించుటయును, గరగుల్లి శాపంబు గావించె నిట్టి
రూపమై ధరణీశ రూఢి నీకతన, శాపమోచనమయ్యెఁ జనియెద నింక
నని చెప్పి యాలేమ యమరేంద్రుపురికిఁ, జనుటయు రఘురామునిశరము తాఁ దూఱి
జొచ్చినఁ గనుఁగొని సుగ్రీవుఁ డప్పు, డచ్చెరువును బొంది యానందమంది
సప్తపాతాళసంసక్తమూలములు, సప్తాశ్వమండలాచ్ఛాదిపత్రములు
నగుసప్తతాళంబు లస్త్ర మొక్కటనె, తెగనేసె నాదు సందేహంబు వాయ
వాలి రాఘవునిచే వడిఁ జచ్చు నింక, నేలితి లోకంబు లేలితిఁ దార
నేలితిఁ గపిరాజ్య మేనని పొంగి, యాలోనఁ గపివీరు లానందమందఁ
కమలాప్తకులనాథుఁ గాకుత్స్థుఁ జూచి, కమలాప్తసుతుఁ డంతఁ గరములు మొగిచి
దేవ దేవరమూర్తి దృష్టించి లావు, భావింపలేనైతిఁ బశుబుద్ధి నైతి
నినజుండ నేను నీవినవంశభవుఁడ, వని సమబుద్ధినై యపరాధి నైతి
నీలోకమునకెల్ల నేలిక వీవు, పాలింపు నన్ను నీబంటుగా నేలు
నాశత్రుఁ దెగటార్చి నారాజ్య మిచ్చి, నాశోక ముడుపవే నరనాథచంద్ర
యనవుడు సుగ్రీవు నతికృపాదృష్టిఁ, గనుఁగొని మన్నించి కాకుత్స్థుఁ డనియె
చెచ్చెఱ నీవు కిష్కింధకుఁ బోయి, యచ్చట వాలితో ననిసేయుచుండు
మవలీల నొకకోల నావాలిఁ జంపి, ప్రవిమలకపిరాజ్యపదము నీ కిత్తు
వెఱవక సుగ్రీవ వేగ పొమ్మనిన, నఱలేనికడఁకతో నప్పు డుప్పొంగి
నలుఁడు నీలుఁడు నంజనాతనూభవుఁడు, బలియుఁ డాతారుండు బలసి తోనడువ
నాజికి సన్నద్ధుఁడై బల్మి మెఱసి, రాజిల్ల వెనుక నారామలక్ష్మణులు

వచ్చి కిష్కింధ కవ్వల నున్నవనము, చొచ్చి గూఢముగ నచ్చోఁ దన్నుఁ బనుప
వడిఁ బోయి కిష్కింధవాకిట నిలిచి, యడరి సుగ్రీవుఁ డుదగ్రుఁడై యార్చి

### వాలిసుగ్రీవులు పోరుట

తడయక తనతోడఁ దగిలి పోరాడ, వడి నేఁగుదెమ్మని వాలిఁ బిల్చుటయుఁ
గరిబృంహితంబు లాకర్ణించి వెలుచ, గరివైరి కోపించుకరణిఁ గోపించి
శితికంఠధరణరాజీవాలి వాలి, కృతబంధ రావణగ్రీవాలియైన
వాలి సుగ్రీవుని వడి వచ్చి తాఁకె, వాలిసుగ్రీవు లవక్రవిక్రములు
చెలరేఁగి పూర్వపశ్చిమసముద్రములు, బలువిడి పోరాడుభంగిఁ బోరాడ
సమరూప సమకోప సమజవాటోప, సమసుప్రతాపులై జానుజంఘోరు
జత్రువక్షోనాభిజఘనదేశములు, చిత్రవైఖరి నొంచి చించి చెండాడ
నాయెడ ధృతి రాముఁ డమ్ము సంధించి, యేయ నుద్యోగించి యిరువురఁ జూచి
వదనముల్ రదనము ల్వాలము ల్బాహు, లుదరంబు లధరంబు లూరులు బరులు
కక్షము ల్వక్షము ల్కాళ్లును వ్రేళ్లు, వీక్షలు శిక్షలు వేషభాషలును
చెక్కులు ముక్కులు శిరము లంసములు, ప్రక్కలు పిక్కలు పాదయుగ్మములు
కర్ణము ల్వర్ణము ల్కరము లంగములు, నిర్ణయింపఁగ నొక్క నెఱియైనఁ జూచి
యేతెఱంగునఁ జూడ నిరువురయందు, నీతఁడు సుగ్రీవుఁ డీతఁడు వాలి
యని యేర్పఱింపంగ నలవిగాకున్నఁ, దనలోన వెఱగంది దశరథాత్మజుఁడు
ఎడపక యేసిన యీయమ్ముచేతఁ, దొడిఁబడి యెవ్వండు త్రుంగునో యనుచు
నమ్ము విడువకుండె నంత సుగ్రీవుఁ, డిమ్మెయిఁ గడు నొచ్చి యేపెల్లఁ బొలిసి
వలఁతియై పోరాడి వాలికి నోడి, బలమేది యాతని బలుముష్టిహతుల
గుల్లలతిత్తియై కట్టూర్పు లెసఁగ, చెల్లఁబో నేనేల శ్రీరాము నమ్మి
వచ్చితిఁ బదివేలు వచ్చెఁ జాల్నాకు, వచ్చినత్రోవఁ బోవఁగవలె ననుచు
మెలఁకువచెడి తోఁక మెడమీఁద వైచి, సొలసి కెలంకులఁ జూచుచుఁ బాఱి
తనఋశ్యమూకంబు తడయక యెక్కి, తనమది శోకించుతఱి రాముఁ డరుగ
నలఘువిక్రమధాముఁ డగురాముతోడఁ, దలవంచుకొని యర్కతనయుఁ డిట్లనియె
వసుధేశ నిను నమ్మి వాలితోఁ గదిసి, యసమానబలరూఢి నడరి పోరాడ
నన్నుపేక్షించితి ననుఁ గావవైతి, మిన్నక చూచితి మేకొనవైతి
జగతిపై సూర్యవంశంబునఁ బుట్టి, తగునయ్య నీకిట్లధర్మంబు సేయ
దేవ నీసత్యంబు తేజంబు నమ్మి, యే వాలిఁ దొడరితి నింతియే కాని
యతఁ డేడ నేనేడ యాహవం బేడ, బ్రతికి వచ్చుట యేడ భావించి చూడ
నేమిభాగ్యముననో యిప్పటియట్ల, రామ యీపర్వతాగ్రము చేరఁగలిగెఁ
బగతునిచే భంగపాటు లీరీతి, నగుఁబాటు నొందవె నిన్నమ్మినకతనఁ
దగవును గృపయును ధైర్యంబు శక్తి, మిగుల నీయెడఁ జూచి మెచ్చి నమ్మితిని
అనవుడు సుగ్రీవ యాత్మలో నింత, యనుమానపడనేల యకట నావలనఁ
దప్పు లేశములేదు దాయకు నిన్ను, నొప్పగింతునె విను మొకమాటఁ దెలియ

విశ్వమోహనరూపవిఖ్యాతు లైన, యశ్వినీకుమారులయట్ల యేపట్ల
వరరూపరేఖలు వాలికి నీకుఁ, బెరసిన సములులై భేదింపరాక
నేనేమ వెఱచితి నిట నమోఘంబు, గాన నీకిది కీడుగాఁ జూడవలదు
కరమొప్ప నింక నీగజపుష్పమాల, ధరియించి పోయి యుద్ధము సేయుచుండు
బెదరక వాలిఁ జంపెద నిశ్చయింపు, కదలుము కిష్కింధకడకు నీవనుచు
గాదిలితమ్ముచే గజపుష్పమాల, నాదట తెప్పించి యతనికంఠమునఁ
జొక్కంబుగాఁ జేర్ప సుగ్రీవుఁ డొప్పెఁ, జుక్కలు పెనఁగొన్న సోముఁడో యనఁగ
సరిబలాహకతోడి సంధ్యాభ్ర మనఁగ, మఱసి యంతయుఁ గడు మీఱి యేతేర
నంతఁ గాకుత్స్థుఁడు ననుజుండు దాను, సంతతంబును యుద్ధసన్నద్ధు లగుచు
నలనీలతారాంజనాతనూభవులు, కెలఁకులఁ గొల్వ సుగ్రీవుఁ దోడ్కొనుచు
నదులు పూపొదలు పున్నాగ నారంగ, కదళికాసహకారకాంతారములును
భాసుర కైరవ పద్మకల్హార, వాహితబహుసరోవరవిశేషములు
కాసరకేసరికరివరాహములు, నాసక్తిఁ గనుఁగొంచు నటఁ బోయి పోయి
దీప్తవైశ్వానరతేజు లై యొప్పు, సప్తజనాహ్వయసంయమీశ్వరుల
యాశ్రమ మీక్షించి యంతయుఁ దెలిసి, సుశ్రీమహత్వంబు సుగ్రీవుచేత
బలశాలి యగువాలి పాలించుసిరుల, విలసిల్లు కిష్కింధ వీక్షించి నృపుఁడు
తొల్లింటిచందాన దుర మొనరింపు, బల్లిదుఁ డగువాలిఁ బరిమార్తు ననుచుఁ
గృతమతి నంత సుగ్రీవు మన్నించి, యతనిఁ బొమ్మని పంచి యాసమీపమున
ననుజుఁడు సౌమిత్రి యటు చేరియుండి, మనుజేశుఁ డొకమానిమాటున నుండె
నహిమాంశునందనుం డంత కిష్కింధ, గుహ లెల్ల భేదిల్ల ఘోషించి యార్చి
తనతోడ ఘోరయుద్ధమునకు నింద్ర, తనయుఁ బిల్చుటయు నెంతయు బిట్టుగినిసి
మానక వీఁడొక్క మగవాఁడుపోలెఁ, బూనినభుజశక్తిఁ బొంగుచున్నాఁడు
వీని సైరించుట వెరవు గాదింక, వీనిఁ జంపెద నని వెస నిశ్చయించి

## తార సుగ్రీవునితోఁ బోరవద్దని వాలి నడ్డగించుట

యతిసత్త్వజయశాలి యగువాలి వెడలఁ, బతిఁ జూచి వెస నడ్డపడి తార పలికె
దేవేంద్రనందన దినపజుమీఁద, నేవిచారము లేక యేల పోయెదవు
నతఁడు నీతో నిప్పు డనిచేసి నొచ్చి, మతిచెడి పాఱి క్రమ్మఱ వచ్చుటెల్ల
నెగడినకడిమిమై నీకంటె నెక్కు, డగుసహాయము లేక యతఁ డిందు రాఁడు
అనిమిషేశ్వరపుత్ర యదియునుగాక, యొనర నంగదుచేత నొకమాట వింటిఁ
బనివడి తమతండ్రిపనుపునఁ జేసి, వనవాసమున నుండ వచ్చినచోట
దశరథరాముఁడు తనధర్మపత్ని, దశకంధరునిచేతఁ దాఁ గోలుపోయి
తనతమ్ముఁడును దాను దడయక వెదక, నని వారు ఋశ్యమూకాద్రికి వచ్చి
పనిగొని సుగ్రీవు బంటుగా నేలి, యని నిన్నుఁ జంపెద నని వచ్చినాఁడు
ఆగాఘువుఁడు విష్ణుఁ డంబుజోదరుఁడు, వైరంబుగొని గెల్వ వశముగా దతని
నినసుతునకుఁ బ్రీతి నీరాజ్య మిచ్చి, చని నీవు రఘురాము సంధిగావింపు

వినుమదిగాదేని వీర్యంబు విడిచి, మునివృత్తిఁ జని ప్రాణమును గాచికొనుము
అని తార పలికిన నావాలి గినిసి, విను నాదు పత్నివై వెఱపేల యింత
బలశాలినైనట్టి బలియునినైనఁ, గలన జయంబు నేఁ గైకొందుఁగాని
పరులకు నే నోడఁ బగవాఁడు వచ్చి, పెరిగి యుద్ధమునకుఁ బిలిచినచోట
ధీరత వొఱఁగి సంధికి నియ్యకొనుట, వీరధర్మము గాదు వెలఁది నా కింక
నలినలోచన విను నాయంతవాని, బలియుఁ జేపట్టక పట్టె సుగ్రీవుఁ
గాన రాముఁడు నీతిగలవాఁడుగాఁడు, గాన రామునిపొందు గావింపఁదగదు
తెరలి సుగ్రీవుండు దిక్కులేకున్న, నరిగి రామునకు బంటై చేరెఁగాక
నాకేల రాముఁడు నాకేల సంధి, నా కేమిటికి వేఁడ నలి దూలి యొకని
నామహితాత్మకుం డతిధర్మపరుఁడు, రాముఁడు నన్ను నూరక యేల చంపుఁ
బోల వీమాటలు పోయి సుగ్రీవు, వాలాయముగఁ గ్రూరవజ్రప్రహార
మూలమై యొప్పు నాముష్టిఘట్టనల, నేలఁ గూలిచి వత్తు నెమ్మదినుండు
మని తార మరలిపొమ్మని వీడుకొలిపి, యనిమిషేశ్వరపుత్త్రుఁ డగువాలి వెసలెఁ
గలఁగొనచుట్టిన కర్మపాశములు, నెలకొని దిగిచిన నిలువరాకున్న
వెడలుచందంబున వెరవును లావు, కడిమియుఁ దెంపు నుత్కటముగా వెడలి
శరధులు గలఁగ భూచక్రంబు వడఁక, గిరు లొడ్డగిల్లఁ గిష్కింధ ఘూర్ణిల్ల
గర్జించి చనుదెంచి కదిసి సుగ్రీవు, తర్జించి చూచి యుదగ్రుఁడై పలికె
నాతోడఁ బోరాడి నాకోడి పాఱి, యేతెంచితివె యిప్పు డిటు లజ్జ మాని
యేతెంచితేనేమి యిప్పుడే జముని, వాలికి నిను నుట్రవడియం బొనర్తు
బెదరక చెదరక బెట్టుబీరములు, వదరక యొక్కింతవడి నిల్వు చాలు
నాలంబులో ముష్టిహతి నిన్ను నేలఁ, గూలిచి ప్రాణము ల్గొందు నే ననుచు
నుఱుమునిపిడుగుతో నుల్లసంబాడు, కఱకైన తనముష్టి గట్టిగాఁ బట్టి
పఱతెంచి పొడిచిన భానుతనూజుఁ, డొఱగి నెత్తురు గ్రక్కి యొయ్యనఁ దెలిసి
ధీరుఁడై నిలిచి గద్దించి యింద్రజుని, కేరడంబాడి సుగ్రీవుఁ డిట్లనియె
నన్నవు నాకుఁ బూజార్హుండ వనుచు, నిన్నాళ్లు సైచితి నింతియే కాని
విగ్రహంబున కేను వెఱతునే తొంటి, సుగ్రీవుఁడను గాను జూచి పోరాడు
వాలి నిన్నిప్పు డవశ్యంబు చంపి, పాలింతుఁ గపిరాజ్యపదము నేననుచుఁ
గడునల్గి సాలవృక్షము వేగ దెచ్చి, వడినార్చి వైచిన వాలి కంపించి
పుడమిపైఁ బడి మూర్ఛ బొంది యొక్కింత, వడిఁ దేఱి గర్వదుర్వారుఁడై మిగుల
ధీరుఁడై శూరుఁడై దివిజు లుప్పొంగ, నారవిజుని వైచె నదరి శైలమున
నదరక సుగ్రీవుఁ డడఁచె వాలమునఁ, బదముల నొప్పించె బలియుఁడై వాలి
కరనఖంబుల వ్రచ్చెఁ గడఁగి సుగ్రీవుఁ, డురుముష్టి నొప్పించె నుగ్రుఁడై వాలి
యంతటఁ దనియక నార్పులు నిగుడ, నంతకంతకు లావు లడరి యిద్దఱును
ఘనపదాపది కచాకచి నఖానఖిని, జెనసి ముష్టాముష్టి చెలఁగి పోరుచును
ఘుమ్మని మ్రోయుచు నూర్పు లొండొండఁ, గ్రమ్మ నంగముల రక్తంబులుబ్బుచును

వాలము ల్బాహువులు వరుస నొండొండఁ, గీలించి పెనఁగుచుఁ గినిసి తాఁకుచును
బాయుచు డాయుచు బలిమి నొండొరుల, వ్రేయుచుఁ ద్రోయుచు విపులసత్త్వముల
దూటుచు దాఁటుచుఁ దోడ్తోనఁ బగలు, చాటుచు మీఁటుచు సాంద్రమర్మముల
నిరువురు కడిమిమై నిబ్బంగిఁ బోర, సురలోకనాయకసుతునకు లోఁగి
తరణితనూజుఁ డత్తఱిఁ జాల నొచ్చి, గరువంబు దక్కి సంగరభూమిఁ జిక్కి
పెదవులు దడపుచుఁ బెంపెల్లఁ బొలిసి, కుదిసి భీతిల్లి దిక్కులు చూచుచుండె
నిగ్రహానుగ్రహనిధి రాముఁ డంత, సుగ్రీవుఁ డలవడ స్రుక్కుటఁ జూచి

### ఆమోఘాస్త్రముచే వాలి గూలుట

యీలోననే వాలి నే నేయకున్న, వాలి సుగ్రీవుని వధియించు ననుచు
జలనిధు లేడును జగము లీరేడు, కలఁగి భూతలమెల్లఁ గడఁగి కంపింప
గుణనాద మొనరించి కోరి మైఁ బెంచి, తృణముగా దృష్టించి తెగఁదీసి పోసి
వెస నమోఘాస్త్రంబు వింటఁ సంధించి, యసమానబలశాలి యగు వాలి నేసె
నేయుడు నబ్బాణ మినవహ్నిరుచుల, మూయించి వడి నభోమండలి నిండి
యురుతరానలకీల లొలుక నొండొండ, గరుడోరగామరగంధర్వు లదరఁ
దనపుత్త్రు రక్షింప దాయ శిక్షింప, నినుఁ డిట్టి యస్త్రమై యేతెంచె ననఁగ
దపనపుత్త్రుఁడుగాన దండధరుండు, కృపఁ దమ్ముఁడైన సుగ్రీవునిఁ బ్రోవఁ
దనకేల దండ ముద్ధతి వాలిమీఁదఁ, బనిచెనో యన మహాపవనవేగమున
నురవడిఁ జనుదెంచి యురమున నాటఁ, దరుచరపతి గూలె దర్పంబు దూలి
కెరలి దిక్కరులతో గిరులతోఁ బెలుచఁ, దరులతో నందంద ధరణి గంపింప
నురముగాడినబాణ మువ్వడి వెడలి, ధరఁ గాడె నత్తఱిఁ దరుచరేశ్వరుఁడు
నవిరళరక్తసిక్తాంగుఁడై వాలి, యవనిఁ ద్రెళ్లిన పుష్పితాశోక మనఁగఁ
బ్రళయకాలంబునఁ బ్రభ లెల్ల మాని, యిలమీఁద వ్రాలిన యినునిచందమున
నవశుఁడై యవనిపై నమ్మతో నుండ, నవనీశుఁ డగురాముఁ డటఁ జేరవచ్చె
వచ్చిన రఘురాము వాలి వీక్షించి, యిచ్చ లోపలికోప మెసఁగ నిట్లనియె
నోరాఘవేశ్వర యోరామచంద్ర, ధారణిపై నిన్ను ధర్మాత్ముఁ డండ్రు
దమమును శమమును దయయు సత్యంబు, సమబుద్ధి నీతియు సౌమనస్యంబు
మొదలైన షడ్గుణంబులరాశి యగుచు, పొదవిన నీపెంపు పొల్లుగాఁ జేసి
యొనసి సుగ్రీవుతో నేను బోరాడ, నను నేయ నగునయ్య నడుఁజొచ్చి నీవు
ఏను నీ కపకార మెన్నఁడు సేయ, నేను నీకును దోష మిచ్చఁ జింతింప
నీకు శత్రుఁడగాను నీశత్రుఁ గూడ, నీకు శత్రులు లేరు నిక్కృతు లే నెఱుఁగ
నెఱిఁగి యుపేక్షింప నిటు సేయఁదగునె, నెఱిఁగియు నెఱుఁగవై తినవంశతిలక
శబరకంఠీరవశార్దూలకోల, కరిహరిణాదుల ఖండింపఁ గోరి
వసుధ రాజులు వేఁటవత్తురు కాక, యొనఁగఁ గోఁతులఁబట్టి యెందుఁ జంపుదురు
అర్కసూనుఁడు మేము నన్నదమ్ములము, కర్కశమతిఁ బూని గారవం బెడలి
యడర మేమెల్లన నైతిమి కాక, కడఁగి నీవిటు చంపఁ గారణం బేమి

కుందేలు నముఁగును గూర్మంబు నేదుఁ, [illegible] భక్ష్యముల్ గాని
వంచరఁ జంపి యీప్లవగంబుఁ దినరు, పొంచి నన్నిట్లేసి పొలియించి తేల
మనుజేశ యింక నామాంసరక్తంబు, లనుభవింపుము నీవు ననుజుండుఁగూడి
విశదకీర్తుల జగద్విఖ్యాతుఁడైన, దశరథు పనుపున ధర్మంబు పూని
వనములఁ దపసివై వర్తింప వచ్చి, జననాథ జీవహింసకు రోయవైతి
ధరణిపై మే మొక తప్పుచేసినను, భరతుండు తగుఁ గాక పట్టి శిక్షింప
నీకుఁ గారణ మేమి నీవు భూపతివె, చేకొని యిట్లేల చేసితి నన్ను
నీదేవిఁ గొనిచన్న నీచరావణుని, నాదట సాధింతు నని యేఁగుదెంచి
నను డించి నీ వర్కనందనుఁ బట్టి, తనయంబు నీతి జేలైతి లోకముల
నీవార్త నీవు నా కెఱిఁగించితేని, దేవ నీదేవి సాధింపనే యేను
నాతతబలశాలి నై యేఁగుదెంచి, సీతామహాదేవి చెఱఁగొని చనిన
వానిని ముచ్చు నా వాలరోమములఁ, బూని బంధించి యంబుధు లెల్ల ముంచి
కరుణించి విడిచిన ఘనబాహుశక్తి, సొరిది లోకములను సుగ్రీవుఁ డెఱుఁగుఁ
బెలుకుర నన్నుఁ జంపెడివాఁడ వకట, బలిమిమై నాదృష్టిపథమున నిల్చి
ననుఁ జేకొని పిల్చి నను మందలించి, జననాథ కడిమిమైఁ జంపలేవైతి
చలము గైకొని డాఁగి చంపితి నన్నుఁ, దలపోయ నిది రాజధర్మంబె యనిన
వాలిమాటలు విని వసుధేశుఁ డనియె, వాలి యీమాటలు వలవదు నీకు
గపివంశమునఁ బుట్టి కపులతోఁ బెరిఁగి, చపలుఁడవై ధర్మశాస్త్రంబు లెఱుఁగు
తెలియక నీవు నా దెసఁ దప్పుమోపి, పలికెద విది ధర్మపద్ధతి గాదు
నీవన్న పలుకు లన్నిటికి యుక్తముగ, నావాక్యములు కొన్ని నయబుద్ధి వినుము
అనుజునిఁ దనుజన్ము నట్లగ్రజుండు, మనుపంగవలె నండ్రు మహి ధర్మవిదులు
ఆ మేర దప్పి నీవపరాధహీనుఁ, దామరసాప్తనందనుఁ బురి వెడల
నడఁచి వానిని గోడలై యొప్పు నతని, పడఁతిని రతిఁ బట్టి బల్మి భోగించు
కామాంధుఁ డెందైనఁ గలదె నీవంటి, పామరుఁ డొకఁడుదప్ప జగత్త్రయమున
నది యటులుండని మ్మతఁడును నేను, కదిసి సఖ్యము సేయుకతమున నీవు
జగతిపై నామిత్రశత్రుండ వగుటఁ, దెగినాను నిన్ను వధించుట తగవు
అకలంకులై వేఁటలాడెడివారు, నొకటి దీమమునొడ్డి యొకటి నేయుదురు
ఉరుశక్తిమాటున నుండి వేయుదురు, పరికింప దీనఁ బాపము లేదు నాకుఁ
గావున శాఖామృగంబగు నిన్ను, నేవిధిఁ జంపిన నెగ్గేల కలుగు
చతురబాహాశక్తి జగతి నంతటికిఁ, బతియైన భరతుని పంపున వచ్చి
దుష్టమృగంబుల దుష్టరాక్షసుల, సృష్టిపై మేము శిక్షించుచుండుదుము
నీతమ్ముఁ డగు వాని నెలతఁ గైగొన్న, పాతకుఁడవుగానఁ బట్టి చంపితిని
రాజదండితుఁడు నారకబాధఁ బొరయఁ, డోజమైగానఁ నాయుగ్రాస్త్రనిహతి
మనికితపడక నిర్మలుఁడవై యింక, ననిమిషరాజ్యసౌఖ్యముఁ బొందుమీవు
అనియొప్ప రఘురాముఁ డాడువాక్యములు, విని వాలి కనుమూసివివశుఁడై యుండె

కొంతసేపునకుఁ దేర్కొని రామచంద్రు, నంతయుఁ గనుఁగొని యిట్లని పలికె
ఓరామగుణధామ యుగ్రాంశుధామ, తారాధిపానన తార నాదేవి
దేవరశౌర్యంబు దెలిపి నేఁడనికిఁ, బోవలదన్న దుర్బుద్ధి పాటించి
విధివిహితంబున వెనకనే వెడలి, యధిప కయ్యమున నిట్లవనిపైఁ బడితిఁ
బడినకోపమున దుర్భాషలు కొన్ని, జడమతిఁ బల్కితి సైరింపవయ్య
తనపాటు చింతింపఁ దారకు వగవఁ, దనయు నంగదునకై తలఁకెద నధిప
నింత కేమగుదురో యింతియు సుతుఁడు, ఇంతటిదురవస్థ యే వచ్చు టెఱుఁగ
నని శోకమోహంబు లనుపయోరాశి, మునిఁగి మూర్ఛిలియుండె మూఁగచందమున
అంతఃపురంబున కావార్తపోవ, నంతలోఁ దారాదు లైనకామినులు
వాలి గూలినమాట వజ్రమై తమదు, వాలుగుండెలు నాట వసుధపైఁ గూలి
యంతలోఁ దెలియుచు హా యని వారు, నంతలోఁ దాగుచు నచట సోలుచును
హా యంగదా నేఁడు నావాలి దివికిఁ, బోయెఁగదా యంచుఁ బొగలంగ గ్రుంగ
నంగదుఁ దోడ్కొని యతులశోకమునఁ, బొంగియుఁ బొంగి యేడ్పులు నింగిముట్ట
వేవేగ కిష్కింధ వెడలిరా నడుమఁ, ద్రోవ వారల నెదుర్కొని కపు లనిరి
వాలి రాఘవుచేత వసుధపైఁ గూలె, నేలపోయెదరు పోయినఁ బ్రమాదంబు
రాకమానదు మిా రామసుగ్రీవు, లేకమైయుంట మిా రెఱుఁగరే మొదల
నీయంగదునిఁబట్టి యేమి సేయుదురొ, దాయల మదినమ్మఁ దగదటుగాన

## తార ప్రలాపించుట

నితనిచేఁ గపిరాజ్య మేలింత మింక, మతిమంతు లగుకపు ల్మనకు నున్నారు
పోవలదన్న నప్పుడు తారతగవు, భావించి వెస వారి పలుమాఱు దూఱి
యేటి కంగదుఁడు మిా రేటికి రాజ్య, మేటికి నాకుఁ బ్రాణేశ్వరుఁడైన
వాలిఁ జూడక యంచు వారి వారించి, యాలోనఁ దార తారాధిపవదన
తనమదిలో వాలిఁ దలపోసి పోసి, ఘనశోకమునఁ జనుఁగవ చూచి చూచి
యమరేంద్రసుతురాక యల్లంతఁ జూచి, సమకట్టి డాయుచు నత్కీడఁ గోరి
రాసిగ నాసురరాజేంద్రసుతునిఁ, బాసితి రింక నీఫలము చేఁజేతఁ
గుడువు డింతటనుండి కుచములారనుచుఁ, గడునల్క వెస నుగ్రగతిమోదుకొనుచుఁ
బుడమి గంపింప నద్భుతశోక మడర, నెడపక నిబ్బంగి నేతేరఁ దార
హారముల్ దెగి రాల నలివేణి దూల, భారంపుఁజనుఁగవ పయ్యెదజాఱ
నీరజంబునను దేనియగారినట్టు, తోరమై కన్నీరు దొరుగ నందంద
బలువిడి నేతెంచి పవనవేగమున, లలిఁ దూలిపడు పుష్పలతికయుఁబోలె
నావాలిపైఁబడి యందఱుఁ బొగుల, లావేది తార ప్రలాపింపఁదొడఁగెఁ
గపికులాధీశ్వర కపిరాజచంద్ర, కపిరాజశేఖర కపిసార్వభౌమ
సకలసురాసురసంఘంబులందు, నకలంకసత్త్వుండ వధినాథ నీవు
అతిముఖి వింధ్యాదు లగుమహాగిరులు, పెఱికి వేఁటాడిన బిరుదవు నీవు
బలియుఁడై త్రిభువనపాలుఁడై వెలయు, కులశైలభేదికిఁ గొడుకవు నీవు

కోలంబుఁ దనువేరి క్రూరగంధర్వు, నేలఁ గూల్చిన రణనిపుణుండ వీవు
నీవు మానవునిచే నీచేతఁబొంది, యీవిధిఁ బడితింక నేమనఁగలను
ఇనతనూజుఁడు నిన్ను నెదుర లావేసి, యనిలోన నినుఁ గెల్తు నని రాముఁ దెచ్చె
రాముని ననిఁ గెల్వ రాదని యంటి, నా మాట వినవైతి నామున్ని గొంటి
వాయుపుత్త్రుఁడు విష్ణు పటుపోతునంటి, భీమశౌర్యుఁ డతండు బిరుదేల యంటి
నినుఁ జంపవచ్చిన నీపాలిమృత్యువు, వనక రాముని చేత నాఁడిపడితి
వాలసి దేవాసుర లొగిఁ దర్చితర్చి, బలమఱి యటఁ బాయఁబడియున్నఁ జూచి
యడరి వాసుకి మందరాద్రికిఁ జుట్టి, వడి సముద్రము దీర్చు పరశక్తి పేర్మిఁ
ద్రిజగంబులందును దీపించునట్టి, భుజములు పెంధూళి బ్రుంగనే నేఁడు
అతిసత్త్వుఁ డగు రాక్షసాధీశుఁ బట్టి, ధృతి విలపింప నీదృఢముష్టిఁ గట్టి
ముసుకొని వార్ధుల ముంచి ముంచెత్తు, ఘనవాల మిట ధూళిఁ గలిసెనే నేఁడు
కలికంతు శ్రీపాదకమలంబు మీఁద, తెలిఁగొప్ప నీమౌళి తేటియై వ్రాలు
నట్టి నీమస్తకం బకట యిచ్చోటఁ, వట్టినేలను గూలవలసె నేఁడందు
హృదయేశ నినుఁబాసి యేనిల్వఁజాలఁ, గదిసి నీవున్న లోకమునకు వత్తు
వేదన నిటు మీఁద వేగ పాలైతి, నాదిక్కు లేమికి నాకేమి వగవ
గోత్రారినందన కోరి నీకన్న, పుత్త్రు నంగదుఁ జూచి పొక్కెదఁ గాని
దూలితోఁ బాటి నీ తొడలపైఁ బొరలు, బాలు నంగదు నేలి పాలింపవయ్య
యురముపైఁ దొడలపై నుంచి మన్నించి, శిరము మూర్కొని ముద్దుచెక్కిళ్లు పుణికి
కరము ముద్దాడి నీగారాపుఁబట్టి, వరుస నంగదు నేల వారింప వధిప
యని ప్రలాపించుచు నతివ సుగ్రీవుఁ, గనుఁగొని పల్కె శోకము వెల్లివిరియఁ
దలకొని వాలిముందఱ నిల్వలేక, పలుమారు దెసచెడి పందవై పాఱి
గతమాలిపోయి రాఘవుఁ దోడితెచ్చి, కృతకజయంబునఁ గిష్కింధఁ గొంటి
నీకోరినట్లయ్యె నీపగ దీఱెఁ, గైకొని భోగింపు కపిరాజ్యపదవి
నెడమాటలాడ నాయినవంశుతోడఁ, గడక నీహనుమయుఁ గలిగెనే నీకుఁ
బలుమాఱు బుద్ధులు పరికించి చెప్ప, నలనీలతారు లున్నారులే నీకు
ననిపల్కె రఘురామ నజ్జాతిఁ జూచి, జననాథ యీవాలిఁ జంప నేమిటికి
మెలసి నిన్నిటు చేయ మీతండ్రితోడ, గలపెనే రఘురామ గణుతింప వాలి
వెరవొప్ప నీ రాజ్యవిభవంబు గొన్న, భరతుఁడే రఘురామ పరికింప వాలి
చెనఁటియై నీదేవిఁ జెఱగొని చన్న, దనుజుఁడే రఘురామ తలపోయ వాలి
వాలి నకారణ వైరంబుఁ బూని, యేలయ్య తెగటార్చి తిబ్భంగిఁ గడఁగి
నీయట్టి సుకృతికి నీయట్టి పతికి, నీయట్టి కారుణ్యనిధి కిట్లు తగునె
జనకజతోఁ గూడి చనిరయినో యొలుక, ఘనమైన విరహాగ్నిఁ గ్రాఁగెనో యొలుక
భూమీశ నేఁడు నాపుణ్య మిట్లుండె, నేమి సేయుదు నింక నేమందు విధిని
నీవాలి నెడఁబాసి యేనుండఁజాల, దేవ నన్నును బట్టి తెగటార్పవయ్య
యని యురంబును మోము నందంద మోది, కొనుచు వాలిని జేరుకొని ప్రలాపి

నావేళ హనుమంతుఁ డట తారఁ గదిసి, నీవెఱుంగనిధర్మనిష్కృతులు గలవె
దైవయత్నములంచుఁ దాఁబలుమాఱు, ధీవిచక్షణుఁ డిట్లు తెలుపుచునుండె

వాలి సుగ్రీవునకు హేమదామ మిచ్చుట

నంతలోఁ గనువిచ్చి యమరేంద్రతనయుఁ, డింతింత యనరాక యింతశోకింప
నంతకంటెనుమించె నంగదు వగపు, నంతయు నటుచూచి యర్కజుఁ జూచి
పూని రామునిచేత భువనంబు లెఱుఁగ, భానుజ నేఁడు నీపగ సాధ్యమయ్యె
క్షితిమీఁద రాజులకృప నమ్మఁదగదు, మతినుబ్బి చెడక యేమఱక వర్తింపు
మడర రామునితోడ నాడినప్రతిన, యెడపక గావింపు మిటమీఁద నీవు
పాయక నాతోన బలిమి పోరాడి, మాయాని కడిమిమై మడిసిన మెచ్చి
పూనినవేడ్కతోఁ బురుహూతుఁ డిచ్చె, మానైన యీ హేమమాలిక దాల్చి
యిది నీవు ధరియింపు మీకపిరాజ్య, పదమున కిది నీకుఁ బరఁగుచిహ్నంబు
లీయంగదునిశోక మింక వారింపు, నాయట్ల గొనియాడు నన్మఱపింపు
మాసుషేణునిపుత్త్రి యైనయీతార, ధీసార దీని బుద్ధిని బ్రవర్తిలుము
ఏను జేసినతప్పు లెల్లను మఱవు, మూని నామోముఁ బ్రాణములు నిల్వవింకఁ
గైకొను మీమాలికారత్న మనుచు, శోకానతగ్రీవు సుగ్రీవుఁ బిలువ
నతఁడును రఘురాము నానతివడసి, యతిభక్తిఁ దాల్చె నాహేమదామంబు
అనువొప్ప మఱి వాలి యంగదుఁ జూచి, తనమదిలోనున్న దయతోడఁ బలికె
నోకుమారక శోక ముడుగుము నీవు, శోకింపనేటికి సుగ్రీవుఁ డుండ
నలినాప్తసూనుండు నాకంటె నిన్ను, ఎలిఁ బెంపుతో నుపలాలింపఁగలఁడు
సుగ్రీవుఁ డెక్కడ శూరతఁ జూపె, నగ్రణివై యుండు మన్న నీ వచటఁ
జిరతరకీర్తులు సిద్ధించు నీకు, సురుతరసౌఖ్యంబు లొగిఁ బొందు నీకుఁ
బరఁగ గిష్కింధకుఁ బట్టంబుగట్టి, యరయుచునుండఁ బుణ్యము సేయనైతి
ననిమిషపురమున కరిగెద నింక, నని చెప్పి రఘురాము నర్థితోఁ జూచి
యోరామ యేనిట్టు లోదవి సుగ్రీవు,తో రాసిబోరాడ తుది పథ్యమయ్యె
నారంగనంగదుం డబల యేమైన, నేరముల్ చేసిన నేర్పుగాఁ గొనుము
ఇనసుతుతర్వాత నితని రాజుగను, మనువంశతిలకుండ మహి నిల్పవలయు
వేదశాస్త్రంబుల వెదకి నిన్గాన, రాదిమధ్యాంతంబు లవిలేవు నీకుఁ
జనుదెంచి ప్రాణావసానకాలమున, నొనర నాకిదె తోఁచుచున్నాఁడ వీవు
ఆటుపోయె ననియెడి యామూర్తిఁ గంటి, నటుగాన నేను గృతార్థుండనైతిఁ
బంకజహితవంశ పరమకల్యాణ, యింక ప్రాణములుండ వీయమ్ముఁ బెఱుకు
మనిన రామునియాజ్ఞ నాదివ్యశరము, పొనుపొంద నీలుండు పెఱికివైచుటయుఁ
గరమొప్పఁ దనబాహ్యగతుల బంధించి, మరలిసపవనుతో మనసు సంధించి
యీమెయిఁ బరమమై యింపారురాము, శ్రీమూర్తి మనములోఁ జెలువొప్పఁ జేర్చి
బ్రహ్మపదానందపరుఁ డైనవాలి, బ్రహ్మరంధ్రంబునఁ బ్రాణము ల్విడిచె
నావేళఁ దారాదు లైనకామినులు, నావాలిపైఁబడి యందంద వగవ

నంగద సుగ్రీవు లచ్చటిప్లవగ,పుంగవుల్ హా వాలి పోయితే యనుచు
విలపించుచుండ నావేళ సౌమిత్రి, నలినాప్తసుతుని నందఱి విచారించి
హనుమంత నీవింక నంబరమాల్య,ఘనగంధసారాదికములు దెప్పింపు
శిబికఁ దెప్పింపుము శీఘ్రంబె తార, కనకహాటకరత్ననిర్మితంబుగను
అని పంప వారెల్ల నట్లు గావింప, వనచరులందఱు వచ్చి రచ్చటికి
మఱితార మొదలైనమగువలయెడలు, తెఱఁగొప్పవారించె దిననాథసుతుఁడు
నాలోన రఘురాము ననుమతిపడసి, వాలికిఁ బరలోకవైదికక్రియలు
చేసి యాదశయాత్రశేషకృత్యములు, భాసురగతిఁ దీర్చి పరిశుద్ధిఁ బొంది
యంగదుండును దాను హనుమదాదులును, సంగతి నారామచంద్రుఁ గాంచుటయు
విపులసంతోషంబు విలసిల్ల నంతఁ, గపినాయకులకు రాఘవుఁ డిట్టు లనియె
మీరింక నాయాజ్ఞ మీఱకపోయి, శ్రీరమ్యముగను గిష్కింధ సైసేసి
స్థిరమైన కపిరాజ్యసింహాసనమునఁ, బరఁగ సుగ్రీవునిఁ బట్టంబుఁగట్టి
యొందంగ నంగదు యువరాజ్యపదము, నందఁ బట్టము గట్టుఁ డని యొప్పఁ బలుకఁ
దడయక వానరదండనాయకులు, కడుఁగూడి కిష్కింధ కప్పు డేతెంచి
నూత్నశృంగారమనోహరాగార, రత్నవితర్దికారమణీయహార
రంగవల్లీహార రంజితద్వార, రంగధ్వజోదార రమ్యపటీర
నీరపూరితమార్గ నిరుపమాకార, పౌరసంచార సంభరితంబుగాఁగ
జెలఁగి యాపురము సైసేయించి నగరు, కొలువుకూటంబు మిక్కుటమైనసిరికిఁ
గారణంబుగ నలంకారం బొనర్చి, వారిధి నదనదీవారియు మఱియుఁ
దగుమంగళద్రవ్యతతులుఁ దెప్పించి, మొగిసిఁడ శుభతూర్యములు మ్రోయుచుండ
బుణ్యాంగనామణు లొప్పాలుపొందఁజాలఁ, బుణ్యాహవాచనపూర్వకంబుగను
సింహచర్మంబునఁ జిహ్నితంబైన, సింహపీఠిని గపిసింహంబు నునిచి
సురపతిఁబోలె భాసురలీలఁ బ్లవగ,వరు లభిషేకపూర్వకంబుగాఁ గడిసి
లలితపుణ్యోదయలగ్నంబునందు, బలియు సుగ్రీవునిఁ బట్టంబుగట్టి
యురుసత్త్వునంగదు యువరాజ్యమునకుఁ, గర మొప్పఁ బట్టంబుగట్టిరి ప్రీతి
నంగదు యువరాజ్యమందును నిలుపఁ, బొంగె వేడుక లంతిపురవరంబునను
అల నీలతారాంజనాతనూభవులు, కలబంధువులు పొడఁగనిరి సుగ్రీవు
నితరవానరనాథు లెల్లఁ గేల్మోగిచి, రతిమోదమునఁ గొనియాడిరి ప్రీతి,
అంత సుగ్రీవుఁ డుదాత్తసంపదల, నెంతయుఁ బెంపొంది యింపుసొంపొంది
వనచరబలముతో వడి నేఁగుదెంచి, ఘనరత్నకోటులు కానుక లిచ్చి
యాదటఁ బెంపొంచి యారామచంద్రు, పాదపద్మములకు భక్తితో మ్రొక్కి
కరములు ముకుళించి కడుఁ బ్రేమ నిలిచి, పరమసమ్మదమున భానునందనుఁడు
ఇచ్చోట నేటికి నింక నాపురికి, విచ్చేయుదురు గాక విశ్వలోకేశ
యనవుడు సుగ్రీవునాననాంబుజము, కనుఁగొని ప్రీతి రాఘవుఁ డిట్టు లనియెఁ
దపసులు పురమునఁ దగదు వర్తింపఁ, దపనజ కిష్కింధ తగదు మా కింక

మహిమీఁద నాషాఢమాసంబు వచ్చె, సహితులపైఁ బోవ సనువు గా దింక
వానకాలము మాల్యవంతంబునందు, నేనుండఁగలవాఁడ నెబ్బంగి నైన
ఇనతనూభవ నీవు నీవానకాల, మొనరఁ గిష్కింధలో నుండుము పోయి
తలకొని మఱి శరత్కాలంబునందుఁ, బోలుపొందఁ బగరపైఁ బోదము కడఁగి
యనిచెప్పి మన్నించి యతని వీడ్కొలిపి, యనుజన్ముఁడును దాను నచ్చోటు వాసి

### శ్రీరాములు మాల్యవంతముఁ జేరుట

వసుధేశుఁ డమ్మాల్యవంతంబునం దుండి, గుసుమకోమలిసీతగుణము ప్రాయంబు
నసమానరూపవిలాస మెన్నుచును, అసమాన శోకార్తుఁ డై యుండె నంత
ధరణిజ నెడఁబాసి తలఁకెడు రాముఁ, బోరిపోరి దుఃఖము ల్పొదువుచందమున
నఱిముఱి దివినుండి యంబుజమిత్త్రు, మెఱయనీ కందంద మేఘము ల్పొడమె
రావణురాజ్యంబు రఘురాముచేత, నీవిధి చలియించు నింక నన్నగిది
నొలసి యొండొండ విద్యున్నికాయములు, జలదంబులందుండి చలియింపఁదొడఁగెఁ
గైకొని యింక [illegible], నాకారిపై దండు నడుపుచున్నాఁడు
అని సురలకుఁ జెప్ప నరిగెనో ధాత్రి, యన వాయువులతోడ నట ధూళి యెసఁగె
నాలంబులో దైత్యు నణఁగింపు మనుచుఁ, గాలుఁడు తనచేతి కాలదండంబుఁ
బొనర రాముని కిచ్చి పుత్తెంచె ననఁగఁ, దనరార దివి నింద్రధనువొప్పెఁ జూడ
నమరులు రామునికై దండువెడలఁ, గొమరార భేరులు ఘోషించుపగిది
నున్నతధ్వనులతో నొండొండఁ బర్వి, మిన్నెల్ల భేదిల్ల మేఘంబు లుఱిమె
నలరు ప్రావృట్కాల మహాపురుషుండు, లలిమీఁద నాకాశలక్ష్మితోఁ గదియ
నొగి సరుద్దెగి రాలుచున్న ముత్యముల, పగిదిఁ దొల్చినుకులు పడియె నందంద
యగపడి చెఱవోయెనని కూఁతుఁ దలఁచి, వగచి నిట్టూర్పులు వడిఁ బుచ్చు ధరణి
వెఱపున నావులు వెడలె నందంద, ధరణి నెల్లెడల నుదగ్రంబు లగుచుఁ
జనుదెంచి రామలక్ష్మణపయోదములఁ, గనుఁగొని సురచాతకము లుబ్బుపగిదిఁ
గనుఁగొనఁ బర్వెడుఘనపయోదములఁ, గనుఁగొని దివి చాతకము లుబ్బఁదొడఁగె
ధిమిధిమి యనుచు మద్దెల మ్రోయుపాట, లమరనదీమణులాడుచందమునఁ
ఘుమఘుము మనుచు మేఘుండు గర్జింప, నమరఁ గేకాస్ఫూర్తి నాడె నెమళ్లు
రాక్షసాంగములపై రాముబాణములు, రక్షింపఁబడునిట్టి లాగునన్నట్లు
పర్వతాగ్రములపై భయదఘోషములు, పర్వి నిర్ఘాతము ల్వడియె నందందఁ
బ్రకటంబుగా దైత్యపతిమేనిమాంస, శకలంబు లిటు రణస్థలి నిండె ననిన
పరుసున నింద్రగోపము లంతకంత, నరుణారుణంబులై యవనిపైఁబడియె
రావణుఁ జంపుచో రఘురామమీఁద, దేవతల్తలలూచి దివ్యపుష్పములు
నెడనెడ వర్షింతు రీక్రియ ననిన, వడఁపున మహిరాలె వర్షోపలములు
రావణుకీర్తి పరంపర లణఁగి, పోవు నింకిట రామభూపాలుచేత
ననినచందమున రాయంచలపిండు, చని క్రౌంచగిరిమీఁదఁ జయ్యన నడచె

నని మొనఁ దనపుత్త్రుఁ డైన సుగ్రీవుఁ, డనిమిషాధిపసూను నకట చంపించె
నలుగు నాపై నింద్రుఁడని సూర్యుఁడున్న, బలితంపు గోటన్నఁ బరివేష మొనరెఁ
గుడియనికడఁకతోఁ గోరి యాకాశ, నదినాడఁబోయిన నాగకన్యకలు
చనిచని మగుడ రసాతలంబునకుఁ, జనుదెంచుగతి వర్షజలధార లమరె
వాసిగాఁ దమకు జీవనము లవ్వారి, గా సమర్పించిన ఘనుని వేనోళ్లఁ
బొగడు చందమున నద్భుతవృత్తిభేద, మనుచు మండూకంబు లఱచె నందంద
వలయ మేఘములు ప్రావృడ్వధూమణికిఁ, గలయ మైఁబూసినకస్తూరి యనఁగ
ధరణి నెల్లెడలను దనువుసొంపెక్కఁ, బరఁగ నీలచ్ఛాయ పంక మొప్పారు
వారాశి నొడఁగూడి వలనేది రాము, ఘోరబాణాగ్నిఁ గ్రాగుట విచారించి
చఱచి పో వెఱచిన చాడ్పున వరద, లఱిముఱిఁ జెఱువుల నందంద నిలిచె
లోకకంటకదైత్యు లోఁబెట్టుకొంటిఁ, గాకుత్స్థుఁ డిదె నిన్ను ఖండించు ననుచు
సుడిఁబడి మొఱవెట్టుచును ఘనకరణి, వడిమ్రోయుచును జొచ్చె వార్ధిఁ బెన్నదుల
నంత వానలు నిల్చె నవనిపై నపుడు, నంతంత దివినున్న యభ్రము ల్విరిసెఁ
దెలివొందఁ గిరణము ల్దిశలెల్ల నిండెఁ, జెలువొంద రవి ప్రకాశించె లోకముల
ధరణి నిష్పంకమై తనరె నెంతయును, గర మొప్పఁ గొలఁకులఁ గమలంబు లమరె
గూలము ల్మదకరుల్ గ్రుచ్చి గోరాడెఁ, దేలు నక్షత్రచంద్రికలు పెంపారె
వచ్చె నంచలు సరోవనికిఁ గాపురము, మెచ్చె దామరతూండ్లు మెలత లుల్లమున
చెఱకు రాజనమును జేనులపంట, తఱుచయ్యె వృషభయూథము రంకెవ్రేసెఁ
గలక నంతయుఁ బాసి కనుపట్టె జలము, ఇలఁ దెరువరులకు నిచ్చెసౌఖ్యంబు
చదల నిర్మలములై జలదంబు లొప్పె, నదులెల్ల నింకి కాల్నడలయ్యె నంత
అటమున్నె హనుమంతుఁ డర్కజుఁ గదిసి, యిట శారదాగమం బేతెంచె నింక
శ్రీరాముకార్యంబు సేయంగవలయు, వారువీరన కెల్లవానరాధిపుల
రప్పింపు మనవుడు రవిసూనుఁ డలరి, యిప్పుడే పడవాలుఁ డగునీలుఁ బిలిచి
వివిధపర్వతసరిద్ద్వీపాధిపతులఁ, బ్లవగగోలాంగూలభల్లూకపతుల
రావింపు మొకఁడైన రాకున్న నాజ్ఞ, గావింపు మని యన్పెఁ గడఁకమై నిచట
తమ్ముఁడు చెయ్యూఁత తనతాల్మి కొసఁగ, క్రమ్మినవగ వానకాలంబు గడపి
రామభూవరుఁడు శరత్కాలమైనఁ, గోమలిఁ జింతించి కోర్కులు మెదలి
మదనాతురుండునై మదిఁ జాల భ్రమసి, యుదయాద్రిపై నున్న యుడురాజుఁ జూచి
యిదియేమియుత్పాత మిదియేమిచంద, మిదియేమి యీరాత్రి యినుఁడేల పొడిచె
నామేనితాప మిన్నడిగాఁగఁ జొచ్చె, సౌమిత్రి ననుఁ దరుచ్ఛాయలఁ జేర్పు
మనినఁ జంద్రుఁడుగాని యర్కుండు గాఁడు, జననాథ హరిణలాంఛన మదె చూడు
మని లక్ష్మణుఁడు పల్కఁ హరిణాక్షిపోయె, నని సీతఁ బేర్కొని యట మూర్ఛఁబో
దశరథాత్మజునకుఁ దమ్ముఁ డాలోన, శిశిరోపచారము ల్చేసి తేర్చుటయు
మఱి వివేకమునూని మనుజవల్లభుఁడు, తఱి లంకపై నింక దండెత్తవలయు
సౌమిత్రి చూచితే జలజాప్తసూనుఁ, డేమని భాషించె నే మని పోయె

వానకాలముఁ బుచ్చి వచ్చెద ననియె, వానకాలము వోయె వచ్చుట లేదు
ఒదవి నాచేసిన యుపకారమెల్ల, మదిలోన మఱచి యున్మత్తుఁడై వాఁడు
తారతో రతికేళిఁ దగిలియున్నాఁడో, యారాజ్యమున మత్తుఁడై యున్నవాఁడో
కాకున్న మత్కార్యగతులు భావింపఁ, డీకృతఘ్నత కోర్చి యేటికిఁ గడయ
మతి నుపకారంబు మఱచినవాఁడు, ప్రతిఁదప్పినవాఁడు పాడిమైఁ దనదు
చెలికానికార్యంబు సేయనివాఁడు, తలపోయ మానవాధముఁడండ్రు బుధులు
అలవుమై నటఁ బోయి యర్కజుఁ బిలువు, పిలిచిన రానని బిరుదాడెనేని

**లక్ష్మణుఁడు కిష్కింధకుఁ బోవుట**

యని వాలిఁ జంపిన యమ్మెందుఁ బోయె, నని రమ్ము పొమ్మన్న నన్నకు మ్రొక్కి
కనుఁగవఁ బ్రళయాగ్నికణములు దొలఁగ, ఘనశరచాపముల్ గైకొని వెడలె
నేల యల్లలనాఁడ నిడుజంగ లిడుచు, గాలివేగమున వృక్షములెల్లఁ గూలఁ
గృతమతి నటఁ బోయి కిష్కింధఁ జేరి, యతిభీతులై కపు లందందఁ బఱఁగ
నాపురద్వారస్థు లగుకపు లప్పు, డే పఱతెంచి వీఁ డెవ్వఁడో యనుచుఁ
గోటవాకిళ్లు గ్రక్కున వేసి ప్లవగ, కోటి గావలిపెట్టి కోరి యత్తెఱఁగు
వడి రాజు కెఱిఁగింపవలెనని వారు, కడుభీతులై పాఱి కరములు మొగిచి
వడి తారపరిచార వనితలతోడఁ, దడయ కాచందమంతయుఁ దెల్ప వారు
ఇది వేళగాదన్న నెలమి నంగదుని, కదిసి సాగిలి మ్రొక్కి కరములు మొగిచి
వినవయ్య యువరాజ విఖ్యాతతేజ, మనవీటివాకిట మౌనివేషంబు
గనపడ జడలు వల్కలములు దాల్చి, తనకేల బాణకోదండములూని
యొకఁ డంతకుని బోలియున్నాఁడు వచ్చి, యకలంకసత్త్వుఁడై యనిన నంగదుఁడు
నా రామునను జన్ముఁ డని నిశ్చయించి, తారాతనూజుఁడు తడయక వచ్చి
సౌమిత్రి పొడఁగన్నఁ జండకోపమునఁ, దామరసాప్తనందనుని కంగదుఁడు
నారాక చెప్ప నా నతఁడును బోయి, మారవికారాబ్ధిమగ్నుఁడై మిగుల
గారవంబునఁ జేరి కరపల్లవముల, నారుమసతి యంఘ్రు లల్లనఁ బిసుకఁ
దారామృదూరులు తలగడగాఁగ, నూరక సుఖయించుచున్న సుగ్రీవుఁ
గనుఁగొని వాఁడె లక్ష్మణుఁ డున్నవాఁడు, మనవీటివాకిట నుండుచు ననిన
మది సంశయించుచు మంత్రులఁ బిలిచి, యిది యేమి సౌమిత్రి హితమైత్రి దప్పి
యీరీతి వచ్చుట కేమికారణము, నేరము నావల్ల నెఱకిన లేదు
అని వితర్కింపఁగా నాంజనేయుండు, దిననాథసుతుతోడఁ దెలియ నిట్లనియె
ఆమహేంద్రకుమారు ననిఁగూల్చి నీకు, నీమూఁడ్కిఁ గపిరాజ్య మిచ్చినయట్టి
రామునికార్య మారడివుచ్చి యిట్లు, కామోపభోగసౌఖ్యంబులఁ బొదలి
యుందురే యందుకై యుగ్రభావమున, సందేహ మేటికి సౌమిత్రి యిటకు
వచ్చినాఁ డమ్మేటి వాకిట నుండ, వచ్చునే లోకైకవంద్యుఁ డాఘనుఁడు
రావింపు సేవింపు రాముకార్యంబు, గావింపు భావింపు కడఁగి నీప్రతిన
నావిని యారవినందనుండట్లు, రావింపఁ బంచిన రామానుజుండు

భర్మగోపురహర్మ్యపటలంబు విశ్వకర్మనిర్మితచిత్రకపటకౌశలంబు
కైలాసశైలసంకాశసౌధంబు, కేళీసరోవరాంకితవనాంతరము
దేవగంధర్వావతీర్ణప్లవంగ, సేవితాగ్రంబు కిష్కింధపురంబు
చొచ్చి యచ్చోటి నిస్తులవస్తుమహిమ, కచ్చెరువందుచు నటఁ బోయి పోయి
ఇంద్రగేహముతోడ నెనయైనవానరేంద్రగేహము సొచ్చి హెచ్చినకినుక
నచ్చరకామినుల నందచందములు, మెచ్చనిమెలఁతల మిసిమిపాటలను
వారివీణావేణువాద్యమృదంగ, భూరిభూషణరవస్ఫూర్తియు వినుచు
నంతకాకారుఁడై [illegible] డగుచు, నంతఃపురద్వార మటుచేరి నిలువ
నారాక విని యొంటిఁ దారాక యపుడు, తారాసమేతుఁడై తడయక వచ్చి
యతనికోపంబును నతనిరూపంబు, నతిభీతిఁ గనుఁగొంచు నర్కనందనుఁడు
అలరెడుభక్తిమై నడుగుల కెఱఁగి, వలయు నర్చనము లీవచ్చినఁ జూచి
ఓరి రామద్రోహి యోరి కృతఘ్న, యోరి నీయర్చన లుచితమే నాకు
జానకీపతితోడ సత్యాత్ముతోడ, వానకాలముఁ బుచ్చి వచ్చెద నంటి
రావైతి తప్పితి రఘురామునాజ్ఞ, భావింపలేవైతి పరిశుద్ధవైతి
వాలిఁ జంపినరామవసుధేశుశరము, కాలాగ్నికణములు గ్రక్కుచున్నదియు
నిను నీఱుసేయక నిలుచునే యింక, వనచరాధమ వెఱ్ఱివాఁడవై చెడితి
వనిన తారాదేవి యతిభీతిఁ బొంది, యనఘ మీదాసుఁ డీయర్కనందనుఁడు
ఈరాజ్యసంపద లీభోగకోటు, లారయ మీరిచ్చినవియు యీతనికి
మీరుపెట్టినచెట్టు మిహిరనందనుఁడు, వైరంబునకుఁ నెంతవాఁడు మీకితఁడు
రణవిశారదుఁడైనరామునియాజ్ఞ, గణుతింపకున్నాఁడుగా యర్కసుతుఁడు
పొలుపొందఁ గార్తిక పున్నమనాఁటి, కిలమీఁదఁ గపిసేన నెల్లనుగూర్పఁ
బడవాలు నీలునిఁ బంచి తాఁబోవ, నడరెడుప్రేమతో ననియున్నవాఁడు
గాఁడు రామద్రోహి గాఁడసత్యుండు, గాఁడు కృతఘ్నుండు గాన మీరితనిఁ

**లక్ష్మణుఁడు సుగ్రీవుని మన్నించుట**

గరుణింపుఁ డనవుడు గలుషంబుదక్కి, నరనాథసుతుఁ డర్చనములు గైకొనియెఁ
గైకొన్నపిమ్మటఁ గనకపీఠమున, రాకొమారునినుంచి రవితనూభవుఁడు
తదనుజ్ఞఁ గైకొని తాను గూర్చుండి, మృదుమధురోక్తుల ముద మొప్పఁ బలికెఁ
సౌమిత్రి రాఘవస్వామికార్యంబు, నేమఱతునె యిపు డెల్లవానరులఁ
దెచ్చెద వైదేహి దిక్కులవెదకఁ, బుచ్చెద వచ్చెదఁ బొందు మీవెనుక
నేశరంబున వాలి యిలమీఁద వ్రాలె, నేశరంబునఁ గూలె నేడుతాళములు
నాశరంబే చాలు నఖిలదానవుల, నాశంబు నొందింప నాతి సాధింప
నైనను రఘురాము నతిభక్తిఁ గొలిచి, యేను గీర్తులకెల్ల నెక్కుడై పొలుతు
ననిపల్క హనుమంతు నతినీతిమంతుఁ, గనుఁగొని మనవీటఁ గలకపికోటి
చాటించి వెడలింపు సమకట్టి కపులఁ, బాటించి యెడసేయఁ బాడిగా దింక
మన మిప్పు డారామునను జేరఁ గావఁ, జనవలెనని పల్కి సంభ్రమం బెసఁగఁ

ధరణీనందనుఁ డంతఁ దారాదిసతుల, వెరవొప్ప నప్పుడు వీడ్కొనివచ్చి
కలయ దిక్కులనున్న కపిముఖ్యపతుల, బలములఁ బిలిపించి పయనంబుచేసి
మేదినీభాగంబు మిన్నును దిశలు, భేదిల్లఁ బ్రస్థానభేరి వేయించి
ప్రబలకాంచనరత్నరమ్యమహోన్నత, శిబికపై లక్ష్మణుఁ జెలిమి నెక్కించి
చామరద్వయసితచ్ఛత్రచిహ్నములు, నామహాత్మునిముందల నరుగ నేమించి
సబలుఁడై తానును సౌమిత్రి వెనుక, శిబిక యొక్కటి యెక్కి చిత్రవైఖరిని
ముందుగా శుభతూర్యములు బోరుకలుగఁ, గ్రందుగా వందిమాగధనుతుల్ సెలఁగ
నెడనెడఁ గపినాథు లేతెంచి తన్నుఁ, బొడఁగగన నుడుగణస్ఫురి తేందుపగిది
సకలవానరవీరసైన్యసన్నాహ, మకలంక మైయొప్ప నప్పుడే కదలి
యరుదైనపేర్మితో నవని గంపింపఁ, గరము సొంపెక్కి లక్ష్మణుఁ గొల్చి నడచె
అట మాల్యవంతంబు నందున్న రాముఁ, డటుమ్రోయుకలకలం బప్పు డాలించి
యదె వచ్చెఁ గపిసేన లని కోప ముడిగి, రవితనూజునిమీఁద రాగిల్లుచుండె
అందమై మణికాంచనాంచితంబైన, యాందోళికాద్వయం బల్లంత డిగ్గి
తామరసాప్తనందనుఁడు సంప్రీతి, సౌమిత్రియును దాసుఁ జనుదెంచి మ్రొక్కి
యవిరళం బగుభక్తి హస్తముల్ మొగిచి, యవనివల్లభున కిట్లనియె నర్కజుఁడు
దేవ సేనలఁ బిల్వ దెసలకుఁ బంపి, వావిరి నివి గూడి వచ్చునందాఁక
దండెత్తి యిటకురాఁ దడసితిగాని, రెయుండొక వెంటమై నున్నాఁడఁ గాను
అనిన నర్కజు రాముఁ డతికృపాదృష్టిఁ, గనుఁగొని మన్నించెఁ గడఁకతో నంతఁ
గైలాసగిరియందుఁ గనకాద్రియందు, నీలాచలమునందు నిషధాద్రియందు
ద్రోణాచలమునందుఁ దుహినాద్రియందు, శోణాచలమునందు సోమాద్రియందు
వృషభాచలమునందుఁ వింధ్యాద్రియందుఁ, ఋషభాచలమునందు ఋక్షాద్రియందుఁ
బారియాత్రమునందుఁ బ్రగ్గిరియందుఁ, ఆరత్నగిరియందు నస్తాద్రియందు
మలయాచలమునందు మంథాద్రియందుఁ, గలగొని వర్తించు ఘనబాహుబలులు
పవమానసూనుండు పనసుఁ డంగదుఁడు, గవయుండు నీలుండు గంధమాదనుఁడు
పావకాత్మజుడు కాలపాశుఁ దుర్గ్రధనుఁ, డావేగదర్శియు నగ్నవాతుండు
నలుఁడు మైందుఁడు మహానాథుండు ధూమ్రుఁ, డలఘుండు జంభూలి యగ్గిరిభేది
సుముఖుండు కేసరి జ్యోతిర్ముఖుండు, విముఖుండు తారుండు వినతుండు గజుఁడు
జాంబవంతుండును సంపాతిరంభుఁ, డంబురాశితనూజుఁ డగు సుషేణుండు
శతబలిహరుఁడును సన్నాథు లనఁగ, నతివీరవరులు వీరాదిగా కపులు
తమ సుతుల్ తమ పితుల్ తమ సహోదరులు, తమ చుట్టములు తాము దట్టమైకూడి
యివి పదు లివి నూఱు లివి వేలు లక్ష, లివి కోటు లవ్వల నివి శతకోటు
లనరాక పద్మ మహాపద్మ ఖర్వ, మనఁగఁ బర్వినసంఖ్య లన్నియుఁ గడచి
యెలమి సొంపున నేల యీనినయట్లు, చెలఁగి యేదిక్కు చూచిన వెల్లివిరిసి
మేమెయి కొలఁదిగా కేపుదీపించి, భూమియు నాకసంబును నిండఁ గప్పి
కరముగ్రగతిఁ గ్రాలు కాలదండముల, వరుసను దీపించు బాహుదండములు

కెడఁ బేర్చుబడబాగ్నికీలలఁ బోలి, వడిఁ బర్వి దివి రాయు వాలపాశములఁ
బొరిఁబొరిఁ గాలాభ్రములకాంతుఁ లనఁగ, సురవడిమైగ్రాలు నుగ్రదంష్ట్రములు
నలరెడుప్రళయకాలాదిత్యబింబములఁ బోలి మండెడుముఖగహ్వరములు
లోలాబ్ధివిపులకల్లోలఘోషములఁ, బోలి ఘోషించునార్పులు వెల్లివిరియ
బలములతోఁ గూడ ప్లవగవల్లభులు, కలగొనవచ్చు నగ్గలికలు చూచి
యిచ్చలోపల నప్పు డిక్ష్వాకుకులుఁడు, నచ్చెరువడి చూచి హర్షించుచుండె
ఆవేళ సుగ్రీవుఁ డధిపతిఁ జూచి, దేవ నాసేన లేతెంచుచందంబు
లవధరించితిరె వీరం దొక్కరొకరె, తివిరి మీపనులు సాధింపనోపుదురు
అని చెప్పి వారల యలవులపేళ్లు, జననముల్ జాతులు సత్త్వసంపదలు
తనువులు వర్ణము ల్తగుభోజనంబులును గులదేశంబు లోలి వర్ణించి
బడబాగ్నిముఖమునఁ బడియున్నవైనఁ, గడువేగఁ జని యుగ్రగతి యొప్పమిగిలి
వడిఁ జేర్చి యార్చి దుర్వారులై కదిసి, పుడమియు నభము నబ్ధులు చొచ్చియైన
నట మృత్యువక్త్రంబునం దున్నవైన, నెట నందుఁ బోరాని యెందున్నవైన
నా వానరాధీశులం దొక్కరొకరు, దేవ నీదేవి వైదేహిఁ దెచ్చెదరు
ఆనతియిమ్మన్న నర్కజుఁ దిగిచి, భూనాథుఁ డాదరంబునఁ గౌఁగిలించి
బలసంపదలయందు భానుజ నీకుఁ, దలపోయ ధుఱి యసాధ్యము లెందుఁ గలవు
పూని నీపౌరుషంబులు చూచికాక, యేనేలఁ గైకొందు నిటఁ గ్రింద నిన్ను
అని పల్కి వైదేహి నరసిరాఁ బనుపు, మనవుడు హర్షించి యర్కనందనుఁడు

### వానరవీరుల సీతను వెదకఁ బంపుట

ఒనర నుత్తరమైన యొకలగ్నమందు, వినతుఁ డన్వానరవీరునిఁ బిలిచి
యేవంక నెచ్చోట నెందు నేమఱక, నీవు సేనలఁ గూడి నెఱిఁ దూర్పు నడచి
యామహీతనయనయ్యమునలో వెదకి, యామినీగిరి చూచి యటమీఁదఁ బోయి
సురనదిలోఁ జూచి శోణనదంబు, కరమర్థి నరసి యాకౌశికి వెదకి
యల సరస్వతి జూచి యట సింధువరసి, పొలుచు పౌండ్రవిదేహభూములు వెద
మాళవ కోసల మాగధబ్రహ్మ, మాలాఖ్యశైలంబు మైథిలి నరసి
జలధితీరముఁ జూచి చని మందరాద్రి, నిలయకిరాతులనిలయము ల్వెదకి
తివుటమై నట నవద్వీపంబుఁ గడచి, యవల జంబూద్వీప మటమీఁద దాఁటి
చెచ్చెర నటఁ బోయి శీతాద్రి వెదకి, యచ్చోటఁ గాకోల మనుమడుగరసి
తనరు లోహితసముద్రము దాఁటిపోయి, చని కూటశాల్మలిచ్ఛాయల నరసి
మఱిపోయి గరుడాశ్రమంబున వెదకి, వఱలు గోశృంగపర్వతము శోధించి
అందలి శృంగంబులందు వర్తించు, మదయుక్తరాక్షసమండలి నరసి
యట దుగ్ధసాగర మవలీలఁ గడచి, యట సుదర్శన మను నద్రిలో వెదకి
వలనొప్పు శుద్ధార్ణవము దాఁటిపోయి, బలువైన జాతరూపశిలాద్రి వెదకి
యందు వేదలలతో నాసీనుఁడైన, యిందువర్ణు ననంతు నీక్షించి మ్రొక్కి
యొగిఁ బదునాల్గువేయోజనంబులకు, మిగిలి యవ్వలనున్న మేరువు వెదకి

యామేరుగిరిచుట్టు నరుగున కెరఁగి, యామెయి వాలఖిల్యాదుల కెరఁగి
యావల నుదయాద్రియందు శోధించి, రావణునిలయ మారసి వార్తఁ దెండు
రవిలేనియంధకారము గ్రమ్ముకతన, భువిలోన నవ్వాలి భూము లేనెఱుఁగ
నివిడి నీవటఁబోయి నెలలోన రమ్ము, అవమతి రాకున్న నాజ్ఞ గావింతు
నావుడు లక్షవానరులతోఁగూడ, వేవేగ వినతుండు వెడలెఁ దూర్పునకు
వినతసూభవుఁ డంత హితశీలు నీలు, హనుమంతు నంగదు నట జాంబవంతు
గజుగంధమాదను గవయు గవాక్షు, విజయుని మైందుని ద్వివిదునిఁ దారుఁ
దగఁ బిల్చి మీరింక దక్షిణంబునకుఁ, దగువానరులఁ గొంచుఁ దడయక పోయి
యర్మిలి వింధ్యాద్రి యాదిగాఁ దొడరు, నర్మదయు దశార్ణనగరంబు వెదకి
దండకారణ్యంబు తప్పక వెదకి, దండిగా నవల గోదావరి నరసి
వలనొప్ప నట వేత్రవతిలోన వెదకి, నెలకొని కాళింగనిషధదేశముల
నారసి కర్ణాటకాంధ్రచోళేంద్ర, చేరకేరళపాండ్యపీఠులనెల్ల
నరసి యమ్మలయాద్రి నరసి కావేరి, నరసి యగస్త్యునియాశ్రమం బరసి
యమ్మహాత్మునిఁ గాంచి యతనియనుజ్ఞ, నెమ్మితోఁ దామ్రపర్ణినది దాఁటి
జలధివేలావనస్థలముల వెదకి, పొలుపొందు నాహేమపురములో వెదకి
యెదిరినకడఁక మహేంద్రాద్రియందు, వెదకి యవ్వాలనున్నవృషభాద్రిఁ జూచి
యావలఁ బుష్పాద్రియందు శోధించి, క్రేవఁ గుంజర మనుగిరిఁ బరీక్షించి
యచటియగస్త్యగేహము విశ్వకర్మ, రచితమై తగు నందు రమణి శోధించి
యంజనానది దాఁటి యవ్వాలమణుల, రంజిల్లుఫణులచే రక్షింపఁబడిన
వదలక యాభోగవతిలోన వెదకి, వెదకి యవ్వాల నున్న విషమాబ్ధి కరిగి
యందుపై గంధర్వు లప్సరల్సొగలు, నుందు రాచోటుల నోడక వెదకి
తలఁగక యరిగి వైతరణి లంఘించి, పొలుచు వైవస్వతుపురమున కరిగి
యందు నాసమవర్తి యనుమతి వడసి, పొందుగాఁ బితృలోకమును గలయంగ
వెదకి సీతాదేవివృత్తాంత మరసి, పదిలులై నెలలోనఁ బ్రతివార్త దెండు
ఆవల నంధకారావృతం బగుట, దేవతలకునైనఁ దీఱదం దరుగ
ననిన నాకపినాథు లందఱుఁ గూడి, యనుమోదరసవార్ధియందు నోలాడి
దినవాథతేజుఁడై దీపించురాము, జననాథుతోఁ దమసత్త్వము ల్దెలిసి
జానకి నెబ్భంగి సాధించికాని, మానవేశ్వర రిత్త మగిడిరా మేము
అని పల్క రాముఁ డాహనుమంతుఁ జూచి, యనువుగా భావికార్యము నిశ్చయించి

## శ్రీరాములు హనుమంతునిచేత తనముద్రిక నిచ్చుట

తనదయాదృష్టి యాతనిమీఁద నుంచి, యనిలజ యిందు రమ్మని చేరఁ బిలిచి
జనకజఁ గనుఁగొనఁ జాలుదు వీవె, యనఘ నీచేతఁ గార్యము నిర్వహించు
నీవంతవాఁడవు నీబాహుబలము, భావింప నట్టిదె పవమానతనయ
యిదె నాదుముద్రిక యిది సీత కిచ్చి, సుదతిచిత్తములోని శోకంబు మాన్పి
సీతకు మేమున్న సేమంబు చెప్పి, సీతసేమముఁ గొంచుఁ శీఘ్రంబె రమ్ము

అని ముద్రిక యొసంగ ననిలనందనుఁడు, తనమ స్తకంబున ధరియించి మించెఁ
దనర్చార సుదయాద్రి తనదుశృంగమున, దినమణిఁదాల్చి యెంతే నొప్పుకరణి
నంత నాహనుమంతుఁ డానందమంది, గంతులు వేయుచుఁ గరములు మొగిచి
యినకులాధీశ్వర యెంతదవ్వైనఁ, జని సీతయున్నెడ సాధించి వత్తు
సోమసూర్యులఁ బట్టి శోధించినైన, భూమియు నభము నబ్ధులఁ జొచ్చియైన
నామహీసుత నింక నారసి వత్తు, నీమహిలోపల నెచ్చటనున్న
నసమాన మగుసత్త్వ మభిసుతకెక్క, వసుధేశ రావణువాసంబుఁ జొత్తు
నరిగెదనని మ్రొక్కి యట దక్షిణమున, కరిగె వాయుజుఁ డంగదాదులతోడ
మఱి సుషేణునిఁ బిల్చి మర్కటేశ్వరుఁడు, వఱల నీవాకలక్ష వానరుల్గొలువ
సౌరాష్ట్రదేశంబు చని చొచ్చి వెదకి, ధీరులై బాహ్లీకదేశంబు నరసి
శ్రీకరమై యొప్పు సింధుసౌవీర, కేకయదేశము ల్కృతమతి వెదకి
వలనొప్పఁ బున్నాగవనములో నరసి, తెలిసి పశ్చిమవార్ధి దృష్టించి చూచి
నలి నారికేళవనంబు శోధించి, యలయక పోయి వజ్రాద్రి శోధించి
పారియాత్రనగంబు పరికించి యచటఁ, గూరిమి గంధర్వకోటులఁ దెలిసి
బలియు హయగ్రీవుఁ బంచజనాఖ్యుఁ, గలన ఖండించి శంఖంబు చక్రంబుఁ
జక్రి యచ్చోఁ దొలి జతఁగాంచినట్టి, చక్రవంతం బనుశైలంబు వెదకి
తరణి యెచ్చోట నస్తము గాంచునట్టి, చరమాద్రి నీక్షించి సావర్ణి నరసి
వెలయంగ నేనుబదివేలసంయములు, గలకాంచనాద్రులఁ గలయ వీక్షించి
చరితార్థుఁడగు మేరుసావర్ణిమౌనిఁ, బరికించి నెలలోనఁ బ్రతివార్తఁ దెండు
అర్కహీనము నమర్యాదంబుగానఁ, జేర్కొన నవ్వలిపృథివి యేనెఱుఁగ
ననిన సుషేణాదు లగుమహాకపులు, పనిఁబూని పోయిరి పడమటిదెసకు
జలజాప్తసుతుఁ డంత శతబలిఁ బిలిచి, నలి నీవు లక్షవానరులతోఁ గూడ
మొటటఁ బుళిందభూములు సొచ్చి పోయి, చెదరక యాసౌరసేనంబు వెదకి
భరతభూములనెల్లఁ బరికించి యవన, ధరణీశుదేశంబు తడయక వెదకి
కడఁగి కాంభోజకొంకణభూము లరసి, యొడపక యటఁ బోయి హిమవంత మరసి
సోమాశ్రమంబునఁ జొచ్చి శోధించి, శ్రీమించుకాలాఖ్యశిఖరి నీక్షించి
యామై సుదర్శన మనునద్రి వెదకి, కామించి యట బోయి కనకాద్రి వెదకి
కైలాసగిరియును గౌబేరవనము, నాలోలనయన మీరలయక వెదకి
ధనదునిపురము నాతనిసరోవరము, ననుమోదభరము పాయక విలోకించి
యందుఁ గుబేరుని నడిగి క్రౌంచాద్రి, యందు మీరందఱు నవనిజ వెదకి
చని యట మైనాకశైలంబు గడచి, యనఘ వైఖానసం బనుకొల నరసి
తనరుశైలోదాఖ్యతటిని లంఘించి, గొనకొని యుత్తరకురుభూము లరసి
యచ్చట గంధర్వు లప్సరల్ సురలు, నిచ్చలు నుందు రానెలవులు వెదకి
నిలువ కుత్తరపయోనిధి దాఁటిపోయి, సొలయక యటమీఁద సోమాద్రి వె
యచట బ్రహ్మయు శివుఁ డర్థి వర్తింతు, రచలితగతి మీర లందుండి మరలి

యొక నెలలోపల సుగ్రీవుకడకుఁ, బ్రకటంబుగా మీఁరు ప్రతివార్తఁ దెండు
అనవుడు శతబలి యవనీశు వీడు,కొని యుత్తరంబు దిక్కున కేఁగె నంత
అప్పుడు రఘురాముఁ డర్కజుఁ జూచి, యెప్పుడు జూచినా వీభూములెల్ల
నా విని వాలికి నాఁడేను వెఱచి, వేవేగ యతఁడు నావెనువెంటఁ దగులఁ
గలగొన గుఱుతులుగా మహియెల్ల, నలుదిక్కులును చూచినాఁడ నే ననియె
ననిన నచ్చెరువంది యటఁ గొంతకాల, మినజానుజులు గొల్వ నినకులుఁ డుండెఁ
దగఁబూర్వపశ్చిమోత్తరములు చూడ, జగతీశుపనుపునఁ జనినవానరులు
నినరశ్ము లెందాఁక నిలమీఁదఁ బర్వు, ననుపమసత్త్వులై యందాఁకఁ దిరిగి
నలినాక్షి నెందుఁ గానక వచ్చి పతికిఁ, జెలువేది ప్రతివార్త చెప్పి రందఱును
అటరామసుగ్రీవు లంగదముఖ్యు, లిటమీఁదఁ బ్రతివార్త లేమి చెప్పెదరొ
యదియేమిచందమో యని వారి రాక, కెదురుచూచుచునుండి రెంతయు వగచి
అంత నంగదముఖ్యు లగుమహాకపులు, పంతంబులాడుచుఁ బరమహర్షమున
సంతతజవసత్త్వసంపద మ్మెఱసి, మంతుకెక్కిన హనుమంతుఁడుఁ దాము
చెదరక రవిజుండు చెప్పినయట్ల, మొదల వింధ్యాచలంబున కేఁగుదెంచి
యందలిగుహల మహాగహనముల, నందంద వైదేహి నరయుచుఁ గదలి
యదియాదిగా దక్షిణంబున కరిగి, పొదలఁ బూపొదలందు భూజంబులందు
నదులందు గిరులందు నగరంబులందు, వెదకి జానకిఁ గాంచువెరవు లేకునికి
చింతాసమాక్రాంతచిత్తులై పోయి, యంతంత గుమురులై యటఁ బోయిపోయి

### అంగదాదులు కణ్వాశ్రమముఁ జేరుట

పదియేండ్ల తనకూర్మిపట్టి యచ్చోటఁ, గదలి నీటను బడి కాలునిపురికిఁ
బోయినఁ బొగలుచుఁ బుత్రశోకాగ్నిఁ, బాయక పడి కాలి పలవించుచున్న
కణ్వమహామునిఘనశాపవహ్ని, మండి నిర్మృగము నిర్మానుష్య మగుచు
నుండు నీడయుఁ ద్రావ నుదకంబు లేక, పండక బహుశూన్యపథమైనయడవి
చొచ్చి యెంతేనియు సొలసి లోఁ దారు, నచ్చోట నుదకంబు నరయుచున్నంత
నందొక్కరక్కసుం డగచరాధిపుల, ముందఱ నీలాభ్రమో యన నిలిచి
యోరి వానరులార యుర్విపై నేను, మారీచతనయుండ మహితవిక్రముఁడ
దేవగంధర్వులు తివిరి యే నున్న, యీవని దృష్టింప నెవ్వరు వెఱతు
రిందేల వచ్చితి రిందఱుఁ గూడి, యెందుఁ బోవఁగవచ్చు నింక నాచేతఁ
జావక మీ కంచు సంరంభ మెసఁగఁ, గోయని యార్చినఁ గుపితుఁడై యపుడు
అంగదుం డాదైత్యు నదరంట వ్రేయ, బొంగి రక్తము వాత బొడబొడ వెడల
వసుధపైఁ బడె నంత వానరులెల్లఁ, బొసఁగంగ నొకమహాభూజంబునీడ
నలసి కూర్చుండి తోయంబు లేచోటఁ, గలవొకో యని దప్పిగదుర నున్నంత
దరిమిడి యొకబిలద్వారంబు వెడలి, యురువడి జలపక్షు లొండొండ యెగయఁ
గనుఁగొని యుదక మిక్కడ నుండఁబోలు, నని వచ్చి బిలములో నందఱు డిగఁగఁ
గలగొని విపులాంధకారమై తెరువు, తెలియ కొండొరులను ధృతిఁ జీరికొనుచు

ననుపమసత్త్వులై యటఁ బోవఁబోవఁ, గనుఁగొని యయ్యంధకారంబు విరిసి
యరుదుగా జగదద్భుతాకారమైన, పుర మొక్కఁ డచ్చోటఁ బొడఁగాంచి వచ్చి
పసిఁడిగోపురములు పసిఁడిమేడలును, పసిఁడియట్టళ్ళను పసిఁడికోటలును
పసిఁడివృక్షంబులు పసిఁడిపూపొదలు, పసిఁడిపర్వతములు పసిఁడితామరలు
నై చూడ నాపురం బతిరమ్యమైనఁ, జూచి యెంతేనియుఁ జోద్యంబునొంది
ప్రకటసంపదలచేఁ బరఁగుచుండియును, నకట నిర్మానుష్య మైనది పురము
ఏలొకో యీపురం బిట్లయ్యె ననుచు, నీలీల వెడలుచో వ్వెలుఁగంగలేక
చాలఁ జింతిలుచు నచ్చటఁ గొన్నినాళ్లు, పోలఁ జరించుచు పురమధ్యవీథి
మిన్నులతో రాయు మేదినియందు, నున్నతం బగుచున్న యొకమేడఁ గాంచి
కని దానిమీఁదికిఁ గపులెల్లఁ బ్రాకి, కనిరి తపోవృత్తిఁ గర మొప్పు గాంచి
హరిణాజినాంబరయై యొప్పుదానిఁ, దరుణేందుకళఁ బోలి తనరారుదాని
నొకపుణ్యకాంత నయ్యువిదకు మ్రొక్కి, యకలంకచిత్తుఁడై హనుమంతుఁ డనియె
ఓతన్వి నీవెవ్వ రొంటిమై నిచట, నీతపం బొనరింప నేమి కారణము
ఏమహాత్మునిపురి యీహేమనగర, మే మెన్నఁడును గాన మిట్టిచిత్రములు
అనిన నక్కోమలి హనుమంతుఁ జూచి, తనపూర్వకథ లెల్లఁ దాఁ జెప్పఁ దొడఁగె
దగఁ దొల్లి మయుఁ డనుదానవేశ్వరుఁడు, తగిలి పద్మజుఁ గూర్చి తప మాచరించి
పసనొప్పు నిర్మాణపటుశక్తి వడసి, పసిఁడిగోపుర మిట్లు పరఁగ నిర్మించె
నవిరళగతి హేమ యనుదివ్యవనిత, గవిసి యాతఁడు పెద్దకాల మిందుండ
నాతని వజ్రధారాహతుఁ జేసి, యాతన్విఁ గొనిపోయె నమరవల్లభుఁడు
ఆతరలాక్షి నెయ్యపుఁజెలి నేను, మాతండ్రి సావర్ణి మహితమానసుఁడు
ఆయింతిపనుపున నతితపోనిష్ఠఁ, బాయకుండుదు స్వయంప్రభ యనుదాన
నని చెప్పి కందమూలాదు లందఱికిఁ, దనివిదీఱ నొసంగి తాపంబు దీర్చి
యనఘు మీ రెవ్వ రిందరుగుదే నేల, యనిమిషులైన నిం దరుగుదేరాదు
వినుఁ డిందు మీర లెవ్విధిని జొచ్చితిరి, యన విని హనుమంతుఁ డతివ కిట్లనియెఁ
దనతండ్రిపనుపున దండకాటవికి, మునివృత్తి రాముఁ డిమ్ముల వచ్చియుండ
వనజాక్షి నారామువరపత్నిఁ గొనుచుఁ, జనిన రావణు వెంటఁ జని చని యేము
జనకజ వెదకుచు జలశూన్యమైన, ఘనమైన దప్పిచేఁ గడు డస్సి యొక్క
బిలములోపలఁ జొచ్చి పెద్దచీఁకటికిఁ, దలఁకక యొక్కట దైవయత్నమున
నీయాశ్రమంబున కేతెంచి వెడలి, పోయెడుమార్గంబు పొడగాన లేక
తిరుగుచున్నారము ధృతిఁ బెక్కుదినము, లురిఁబడియున్నార మొకదిక్కు లేక
యనిన రామునికార్యమై వచ్చినారు, అనఘులు పుణ్యాత్ము లని భక్తిఁ జేసి
మీ కెద్ది యిష్ట మిమ్మెయి వేఁడుఁ డనిన, మా కీబిలద్వారమార్గంబు వెడలఁ
జేయుము వేవేగ సీతను వెదకఁ, బోయెద మనుడు నుప్పొంగి యామగువ
మొగి మీరు కన్నులు మూసికొండనుచుఁ, దగఁ బుచ్చి వారలఁ దనతపశ్శక్తి
నెలఁతుక యవలీల క్షణమాత్రమున, బిలముఖమునఁ దెచ్చి పెట్టి తాఁ బోయె

బోయిన కపిభల్లపుంగవు లెల్ల, నాయింతి పొగడుచు నటఁ బోయి పోయి
యాయతోన్నతబలు లందొక్కసరసిఁ, బాయక జలములు బలువిడి ద్రావి
యంత నందఱు మహేంద్రాద్రికిఁ బోవ, నంత నంగదుఁడు నిట్లనుచు శోకించె
నినజునిమితి దప్పె నినవంశుదేవి, వనజాక్షిఁ బొడగన్నవారము గాము
ఆజ్ఞాధురంధరుఁ డైనసుగ్రీవుఁ, డాజ్ఞ దప్పిరి వీర లంచును మనలఁ
బొడగన్నయప్పుడే భూపతి మెచ్చ, నడిమికి రెండుగా నఱికించు నుఱక
గావున మన మింకఁ గపిరాజుఁ గానఁ, బోవుట తగవును బుద్ధియుఁ గాదు
వెలువడి మన మిట్లు వెసవచ్చినట్టి, బిలములోపలఁ జొచ్చి పేర్మి నుండుదము
అది యష్టదిక్పాలకాభేద్యమార్గ, మది పక్వఫలభరితారామ మరయఁ
బొందుగా నచటఁ గాపురమున్న మనల, నెందు నెవ్వరికైన నెఱుఁగఁజొప్పడదు
అనఁ గొంద ఱగచరు లాపని కియ్య,కొని రంత మారుతి కోపించి పలికె:
బెద్దబుద్ధివి నీవు పినతండ్రి పనుప, గద్దరివై రాముకార్యమై వచ్చి
కపులతోఁ గూడి యాగంభీరబిలము, చపలతఁ జొచ్చి యచ్చట నుండినపుడె
భానుజుతో మల్లఁబడునదిగాన, దాను నీలుండును తారుండు నలుఁడు
దీని కెవ్విధి సమ్మతింపము దక్క, వానరు ల్తనుబంధువర్గంబుఁ బాసి
నినుఁ గొల్చియుండంగ నేరరు సుమ్ము, విను మదియునుగాక వృత్రారి తొల్లి
యర్మిలి తనవజ్రహతిని బిలంబు, నిర్మించె నిటువంటి నిశితవజ్రాస్త్ర
కోటి లక్ష్మణునకుఁ గొలఁది కగ్గలము, మాటమాత్రమున నీమర్కటాధముల
నిన్ను నీబలమును నీఱుగాఁ జేయు, నున్న యీదుర్బుద్ధు లొక్కట విడిచి
యవనిజఁ బొడగాన మైతి మటంచు, రవిజునికడ కందఱము పోయి మ్రొక్కి
విన్నవింతము జగద్విఖ్యాతి నతఁడు, నిన్నును మమ్ము మన్నించు మోమోడి
యామీఁద మీతల్లి కనురక్తుఁ డగుట, నీమీఁద నలుగఁడు నీవు పుత్రుఁడవు
కావునఁ గడు నిన్నుఁ గట్టుఁ బట్టంబు, నావిని యావాలినందనుం డనియెఁ
బితృసమానుని వాలిఁ బృథ్విపైఁ గూల్చి, యతనిభార్య వరించి యామీఁదఁ దనకు
నుపకారి యగురామునుద్యోగమెల్లఁ, జపలుఁడై మఱచి లక్ష్మణుఁ డాగ్రహింప
మఱి గాదె చనుదెంచె మాపినతండ్రి, యెఱుఁగవే యాతనిహీనవర్తనము
అట్టికామాంధుని నట్టికృతఘ్ను, నెట్టు నమ్మఁగవచ్చు నిదియది యేల
శ్రీరాముకార్యంబు సేయకపోయి, యారవిసూనుచే నటఁ జచ్చుకంటె
నీయెడఁ జచ్చుట యిది లెస్స మనకుఁ, బ్రాయోపవేశనపరులు గం డనుచు
వారును దానును వరదర్భశయను, లైరాక వృథ యని యాత్మఁ జింతించి
కెవులును ముదిమియుఁ దీవ్రవేదనయు, నవతయు లేని ప్రాణంబులు గాన
లేచియు మఱి పవ్వళించియు దిశలు, చూచియుఁ దమతమ చుట్టాలసతులఁ
దలఁచియు బాపురే దైవమా యిట్లు, చలపట్టి మము వృథా చంప నిచ్చోట
సమకట్టితే యంచు సకలవానరులు, గుములు గుములై కూడి యొండొరులు

నలినాప్తకులుఁడు కానలకు రా నేల, కులభామ నసురచేఁ గోల్పడ నేల
యొకపి దైత్యుఁడు జటాయువుఁ జంప నేల, ధరణీశుఁ డమణానందనుఁ గన నేల
ధరణిజవార్త నాతఁడు చెప్ప నేల, తరణివంశ్యులు పంప దరికి రా నేల
సుగ్రీవుకడకు రాసుతులు రా నేల, సుగ్రీవుఁ డాతని సొమ్ము గా నేల
వలనొప్ప వాలి భూవరుఁ జేయ నేల, బలిమితోడుతఁ గపిబలము రా నేల
యింతయూజాఁడు మమ్ము నిటు పంప నేల, పనివడి మనకు నిప్పాటు రా నేల
ఊనినప్రాణంబు లుడిగిపో నేల, పోనేల యక్కటా భువి కైకవరము
మనువంశయుతముగా మనవంశ మణఁచె, నని యని శోకించి యలయుచున్నంత

## అంగదాదుల సంపాతి చూచుట

నాయొక సంపాతి యనుపక్షినాథుఁ, డాయతదేహుఁ డత్యంతవృద్ధుండు
ప్రాయంబు రెక్కలు బలిమియు లేమి, నాయద్రిగుహనుండి యల్లన వెడలి
మెల్లనఁ జనుదెంచి మృతిఁగోరి ధరణిఁ, ద్రెళ్లిన వనచరాధిపుల నీక్షించి
దైవంబు కృపచేసెఁ దనకు నాహార, మీవేళ నని చేర నేతేరఁ గపులు
చపలులై మరణనిశ్చయబుద్ధి వగవ, నపు డాంజనేయుతో నంగదుం డనియె
నిది పక్షిగాదు మమ్మిందఱఁ జంప, నదయుఁడై యముఁ డిట్టు లరుదెంచినాఁడు
ఆజటాయువు నరనాథునిదేవిఁ, బోఁడిమిఁ జెఱగొని పోవు రావణుని
దాఁకి నాతనిఖడ్గధారచేఁ జచ్చి, తేకువఁ బడయఁడే దివ్యపదంబు
రామకార్యార్థమై ప్రాణము ల్మనము, నీమహాపక్షికి నిచ్చుట లెస్స
యనుచోట నామాట లాలించి యరుణ,తనయుండు శోకగద్గదకంఠుఁ డగుచు
నాకపివీరుల నటఁ జేరఁ బోయి, యోకపులార యెందుండి వచ్చితిరి
యాజటాయువు నాకు నర్మిలితమ్ముఁ, డాజటాయువు నేను నరుణపుత్రులము
నిశితోగ్రనఖుఁడు మానితమహామహుఁడు, దశరథుసఖుఁడు సంతతసత్యధనుఁడు
నతఁ డేమిటికిఁ జచ్చె ననవుడు వాలి, సుతుచేత నంతయుఁ జొప్పడఁ దెలిసి
యెంతయు శోకించి యిచ్చలోఁ జాల, వంతనొందుచునున్న వనచరు లెత్తి
చెంతనున్నపయోధిఁ జేర్చిన నందు, సంతాపమునఁ గృతస్నానుఁడై వచ్చి
విపులశోకముతోడ విహగవల్లభుఁడు, కపులతోఁ దనపూర్వకథఁ జెప్పఁదొడఁగె
నాలోలగతుల జటాయువు నేను, గైలాసగిరియందుఁ గవగూడి యుండ
ఘనజవసత్త్వము ల్కడిమిమై మెఱసి, మొనసి మేమిద్దఱమును మచ్చరించి
యుడువీథి కిద్దఱ ముదయకాలమునఁ, గడఁకతో నెగసి సంగడిఁ బోయిపోయి
పరువడి నట పట్టపగలింటికోలఁది, కిరువురు దడసితి మినమండలంబు
నుగ్రాంశుకిరణంబు లొండొండఁ దాఁకి, యుగ్రుఁడై యాజటాయువు మండుటఁ
బదిలమై వాని నాపక్షంబులందుఁ, బొదివిన నాపక్షములు గాలిపోయి
నెఱకలుగాలిన నేపెల్లఁ బొలిసి, మఱివచ్చి యీయాశ్రమంబునఁ బడితి
నాపక్షినాథుఁ డెం దరిగెనో యెఱుఁగ, నీపల్కు మీచేత నిట వింటి నేఁడు

వీనుల మీవార్త వినియున్న వాఁడ, హీనబలుండనై యెఱకలు లేమి
పక్షముల్ తొల్లింటిపగిది నాకున్న, దక్షత నింతకుఁ దనసహోదరుని
పగదీర్ప శ్రీరామభద్రుని దేవి, మగఁటిమిఁ దేనేర్తు మాటల కేమి
నావిని భల్లూకనాథుఁ డిట్లనియె, నావాయుజుఁడు నంగదాదు లుప్పొంగ
నాజటాయువుతమ్ముఁ డగు నీకు మొదల, నీజగంబులలోన నెదు రెందుఁ గలదు
నీవు చూడనియట్టి నెలవులు లేవు, రావణుఁ డిప్పుడు రఘురాముదేవి
నెందు దాఁచినవాఁడొ యెఱిఁగింపు మనిన, సందేహ మెడఁబాయ సంపాతి పలికెఁ
దనతనూభవుఁడు దుర్దమపరాక్రముఁడు, ఘనుఁడు సుపార్శ్వుండు కడుభక్తియుక్తి
జెక్కలు గాలి యాక్రియనున్న నాకు, నక్కఱతోఁ దెచ్చి యాహార మొసఁగు
నతఁ డొక్కనాఁడు నాకశనంబు దేక, దడసి వచ్చిన నేల తడసితి వనిన
నోతండ్రి నీకు నే నుపహార మరయ, నాతతగతి మహేంద్రాద్రిసముద్ర
తీరమార్గమున నెంతయుఁ బొంచియుండ, నారవిప్రభవంటియంగనఁ గొంచు
గాటుక వడకొండకైవడి నొకఁడు, ధాటిమై చనుదెంచి తనకుఁ బ్రియంబుఁ
జెప్పి యేఁ దెరువియ్యఁ జెచ్చెరఁ జనియె, నప్పు డచ్చటిమౌను లందఱు నన్ను
సంతసించుచు నేఁడు చావుకుఁ దప్పె, నంతకుం డగు రావణాసురుం డతఁడు
చెఱగొని లంకకు శ్రీరాముదేవి, నుఱకఁ గైకొని పోవుచున్నవాఁ డనిరి
అందుకై తడసితినని వాఁడు పలికె, సందేహ మేటికి జనకతనూజ
బలసి రాక్షసవధూపరివృత యగుచు, జలదమాలికలోని చంద్రికఁ బోలి
యున్నది లంకలో నొగి శతయోజ, నోన్నతి నాదృష్టి యుర్విఁ జరించు
తెల్లంబుగా మనోదృష్టియు నాకు, నెల్లపక్షులకంటె నెక్కుడై పరఁగు
నని పల్కి మఱియు నిట్లనియె సంపాతి, తనపక్షయుగళంబు దగ్ధమైనపుడు
ఏవచ్చి మూర్ఛిల్లి యిచ్చోటఁ ద్రెళ్ళి, చావునఁ దప్పి యెంచఁగరానిదప్పిఁ
గుట్టూర్పు లేసఁగంగఁ గొన్నేండ్లు గడపి, గట్టిగా నాభాగ్యగతి నొకనాఁడు
ఘననిష్ఠఁ దప మిందుఁ గావించు సకల, జనతాపహరుని సాధుని నిశాకరుని
నానిశాకరుని నొయ్యనఁ గాంచి మ్రొక్కి, భానుదీప్తులచేతఁ బక్షముల్గాలి
తనువున్న చందమంతయు విన్నవింప, మునిశిఖామణియును మున్నె నన్నెఱుఁగుఁ
గావున నెంతయుఁ గరుణించి మీఁదు, భావించి యాశ్రియఃపతి పరాత్పరుఁడు
విష్ణుండు దశరథవిభునకుఁ బుట్టి, యుష్ణాంశుకులుఁ డంత నుగ్రాటవులకుఁ
జనుదేర నాతనిసతిని రావణుఁడు, కొనిపోయి చెఱసుంచుకొని యున్నయపుడు
అమృతాన్న మాయింతి కమృతాంశుఁ డిడిన, తెమలక యాహారతృష్ణలు వాసి
యుండునంతట రాముఁ డొయ్యనవచ్చి, చండాంశజునిఁ గాంచి శక్రజుఁ ద్రుంచి
యాలోలగతి సీత నరయ వానరుల, నాలుగుదిశల కున్నతిఁ బంపఁగలఁడు
ఆరాము నిజదూత లగువారితోడ, చేరి నీ వీకథ చెప్పిననాఁడు
ఘనపక్షయుగళము గలుగు పొమ్మనుచు, మును నిశాకరుఁ డనుముని చెప్పిపోయె.

నతఁ డానతిచ్చినయట్లు మీతోడ, హితమతి నీకథ యెఱిఁగింపఁగంటి
నివె పక్షములువచ్చె నిదె చూడుఁ డనుచుఁ, దివిరి కుప్పించి యద్దివికి లంఘించి
వడి లంకచేరువ వనములో సీతఁ, బొడగాంచి యదె సీతఁ బొడగంటి ననుచు
నదె శతయోజనం బైనదూరమున, నదె లంకలోపల నదె పుణ్యసాధ్వి
చాలుఁ బ్రాయోపవేశన మింక లెండు, పౌలస్త్యపతి లంక పరికింపఁ బొండు
అని లంక కటుఁబోవ నటఁ ద్రోవఁ జూపి, చనియె హేమాద్రికి సంపాతి యపుడు
అంత వానరవీరు లందఱుఁ గూడి, సంతోషచిత్తులై జవ మొప్పఁ బోయి
చండవాతాఘాతజాతడిండీర,గండూషితాకాశకాశనీకాశ
వీచీసమీచీనవిహారమాణాది,వైచిత్ర్యకరవాలవరవాలములను
ఘోరనక్రగ్రాహకోటు లుప్పొంగఁ, బోరాడుచున్న యంభోరాశి డాసి
అందు నిశ్చేష్టితులై కొంతతడవు, గుందుడెందములతోఁ గూర్చుండి యపుడు
ఈసముద్రము దాఁట నెవ్వఁడు చాలు, నీసత్వ మెవరికి నిందులోఁ గలదు
అని యిట్లు చింతింప నంత నంగదుఁడు, వనచరుల్ తాను నవ్వనధితీరమున
నారాత్రి వేగించి యమ్మఱునాఁడు, వీరవానరుల వేర్వేఱ వీక్షించి
ఈరీతి మీ రెంత లేసివానరులు, పౌరుషంబులు నేలపాలుగాఁ జేసి
జలరాశిలోపల శతయోజనములు, కొలఁదిదాఁటుట కిట్లు గుందెద రేని
అపకీర్తి కెనయివి యగణితాంభోధిఁ, గపివర్యులార యేకరణి దాఁటెదరు
మీమీజవంబులు మీదాఁటుకోలఁదు, లీమాత్రమని పల్కుఁ డెఱుఁగంగ నాకు

## వానరవీరులు తమతమసత్త్వములఁ దెలుపుట

ఘనులార యొక్కఁ డొక్కఁడు చెప్పుఁడనుచుఁ, గినిసిన నందఱుఁ గృతమతు లగుః
దమతమసత్త్వముల్ తగ విచారించి, అమితసత్త్వోన్నతు లందఱుఁ గూడి
నలి మీఱి పదియోజనంబులు దాఁటఁ, గలవాఁడ నే నని గజుఁ డర్థిఁ బలికె
నిలమీఁద లావుమై నిరువది దాఁట, సొలయ నే నని గవాక్షుఁడు పేర్చి పలికె
మొనసినకడిమిమై ముప్పది దాఁట, ఘనశక్తిగల దని గవయుండు పలికె
నాలావు పెంపున నలువది దాఁటఁ,జాలుదు నేనని శరభుండు పలికెఁ
బనిగొని జలధి నేఁబది దాఁటువాఁడ, నని గంధమాదనుం డలవుమైఁ బలికె
నస మెంతడింపక యఱువది దాఁట, మసల కోపుదునని మైందుండు పలికె
డెగఁబడి కడిమిమై డెబ్బది దాఁటఁ, దెగువ కోపుదునని ద్వివిదుండు పలికె
నెనుబది దాఁటుదు నేపుదీపింపఁ, దనియక నే నని తారుండు పలికె
నోపిన తమలావు లొకఁడును దాఁప, కేపుమై నందఱు నిటు పల్కుచుండ
భల్లూకనాథుండు బహుకాలవృద్ధుఁ, డుల్లోకవిక్రముఁ డొకమాట పలికె
చిన్ననాఁటిబలంబు చెప్పవచ్చినను, గ్రన్నన హాస్యకారణము లిప్పటికి
అయినను వినుఁడు మున్నమృతంబుకొఱకు, దానవుల్ సురలు యుద్ధములుగాఁ
నమరులకై సహాయంబుగా వచ్చి, యమృతంబు ద్రావితి నర్థి వారొసఁగ

నుదధు లేదును దాఁటనోపి యస్తాద్రి, కుదయాద్రిపైనుండి యొకజంఘ యిడుచు
ఎల్లలోకముల నాకెదు రెందు లేదు, బల్లిదుఁ డగుబలిబంధంబు నాఁడు
ఇర్వదియొక్కమాఱులఁ బ్రదక్షిణము, తివిరి త్రివిక్రమదేవునిఁ గొలుచు
తఱిఁగొండ కాలిలోఁ దనరార విఱిగి, పఱిఁబోయి మఱి జరాభారంబు నొదవె
నరయంగఁ గడువృద్ధు నైతి నిప్పటికిఁ, బరికింప నేను తొంబదిగాని చాలఁ
బొలుపొంద నీత్రోవఁ బోయెదుపసికిఁ, వలఁతి గా నని జాంబవంతుండు పలికె
తొంబదియేడు వోడ్డో దాఁటువాఁడ, నంబుధి నని నీలుఁ డత్తఱిఁ బలికె
నామారుతాత్మజుఁ డాత్మపౌరుషము, లేమియుఁ బలుక కయ్యెడ నూరకుండె
వాలినకడిమిమై వడి నూఱు దాఁటఁ, జాలుదు మగిడి రాఁ జాలనుగాని
యని యంగదుఁడు పల్క నాజాంబవంతుఁ, డనఘ మాకందఱ కధిపతివీవు
వాలితనూజ యీవారాశి దాఁటఁ, జాలుదు మగిడి రాఁజాలవు నీవు
యువరాజ వీకపియూథంబులకును, రవితనూజునియట్ల రాజవుగానఁ
దగ మమ్ముఁ బనిగొనఁ దగుఁగాక యిట్లుఁ, దగునయ్య నీకింత దైన్యమే మిటికి
రామకార్యపరుండు రవిజునిమంత్రి, యీమర్కటావళి కెల్లఁ బ్రాణంబు
తక్కక పవమానతనయుండు గలుగ, నక్కటా నీకసాధ్యము లెందుఁ గలవు
వల దని వారించి వాయునందనునిఁ, బిలిచి యాతనితోడఁ బ్రియములు పలికి

## జాంబవంతుఁడు హనుమంతుని ప్రార్థించుట

మారుతి యీపని మామీఁద బెట్టి, యూరకున్నాఁడవే యుచితమె నీకు
లలితలావణ్యవిలాసరూపముల, వలనొప్ప నప్సరోవనితలయందుఁ
బుంజికస్థలియనఁ బొలుచు మీతల్లి, యంజన యటఁ దొల్లి యగ్నిశాపమున
వానరవనితయై వసుధఁ గేసరికి, మానినియై యుండి మఱియొక్కనాఁడు
వనగిరిస్థలులందు వర్తింపుచుండ, ననిలుఁ డాయంగన యలసయానంబుఁ
దొడలబెడంగును దొరంపుఁబిఱుఁదు, నుడురాజబింబంబు నొరయు నెమ్మోము
కలదు లేదనుకౌను గబ్బిగుబ్బలును, దలచుట్టివచ్చు బిత్తరికన్నుఁగవయుఁ
గనుఁగొని మోహంబు గడలుకొనంగ, మనసిజశరభిన్నమానసుం డగుచుఁ
జెలరేఁగి కదియుచుఁ జెలువమై డాసి, యాలింగనము సేయ నంజన యలిగి
నాదుపాతివ్రత్యనైపుణి చెఱుప, నేదుష్టమతియొకో యిటు సమకట్టె
నావిని యలుగకో నాతి నేవాయు, దేవుండ నీదుపాతివ్రత్యమునకు
భంగంబుగాకుండఁ బరికించి హృదయ,సంగంబు సలిపితి జలజాక్షి దీనఁ
బలువేగ విక్రమపౌరుషశౌర్య,ములు గలతనయుఁ డిమ్ముల నీకుఁ బుట్టు
ననిపల్కి చనుటయు నావధూమణియు, మనమున నలరుచు మఱి వాయుదేవు
ప్రవిమలకృప నిన్నుఁ బడసెఁ గావునను, భువిని వాయువుతోడి భూరిసత్త్వుఁడవు
వేగ విక్రమకళావిస్ఫూర్తులందు, నాగరుడునికంటె నధికుండ వీవె
పరుసఁ బంకజగర్భువరమునఁ జేసి, మఱి నీకు నాఁటుఁ దమరణంబు లేదు

నీసమానులు లేరు నిఖిలలోకముల, నీసత్త్వ మెఱుఁగుదు నిజముగా నేను
జలనిధి లంఘించి జనకజఁ గాంచి, కలఁకమై నిటు రామకార్యంబుఁ జేసి
కపులప్రాణములు రాఘవుల ప్రాణములు, కపినాథుప్రాణము ల్గరుణతోఁ గాంచి
తడయక యోజగత్ప్రాణనందనుఁడ, పడయు ముత్తమలోకపదములు నీవు
అనవుడు హనుమంతుఁ డౌఁగాక మీరు, పనిదీనఁ జేయుదుఁ బతికార్య మొనర
నగచరు ల్వాడుఁడు నాశక్తి నేఁడు, జగదేకహితయుక్తి జలధి లంఘించి
పఱతెంచి సుర లడ్డపడిన సాధింతు, నెఱసి లోకములెల్ల నీఱుగావింతు
నక్కజం బగుశక్తి నటు లంకఁ జొత్తు, స్రుక్కక వైదేహిఁ జూచి నే వత్తు
నాలంకయైనను నగలించి తెత్తు, వాలాయముగ సీత వసుధేశుఁ గూర్తుఁ
గాకున్న జలధులు గలఁతు నొండేని, మీఁకతో నమరాద్రి విఱుతు నొండేని
పుడమి తత్తుమురుగాఁ బొడుతు నొండేని, తొడరి మృత్యువునైనఁ ద్రుంతునొండేని
దీవులన్నియును శోధింతు నొండేని, చేవమీఱఁగ లంకఁ జేరి యచ్చోట
దుష్టాసురులనెల్లఁ ద్రుంతు నొండేని, సృష్టి చీఁకటిచేసి చెఱుతు నొండేని
కాని యూరక రాను గడఁగి మీఁకడకు, నేనని పూని మహేంద్రాద్రి యెక్కి
యుదధులతోఁ గూడ నొగి సృష్టి గ్రుంగఁ, గదిసినలయకాలకాలుఁడో యనఁగ
వెసఁ ద్రివిక్రముఁడైన విష్ణునిరీతి, నసమానదేహుఁడై యందందఁ బెరిఁగిఁ
యంగదాదులచేత నసుమతి వడసి, యంగమంతయుఁ బొంగ నంతరంగమునఁ
దనతండ్రి పవమానుఁ దలఁచి శ్రీరాము, జననాథుపదపంకజము లాత్మ నిలిపి
యడుగులు తరముగా నద్రిపై మోపి, మెడయెత్తి యెక్కింతమెయి గ్రుంగ నిలి
బొమలెత్తి కలయ నంభోరాశిఁ జూచి, యమరారిపురిమీఁద నటదృష్టి నిలిపి
వఱలంగ నిలమీఁద వాల మల్లార్చి, నెఱి కర్ణములు రెండు నిక్కించి పొంచి
యట నద్రిశిలమీఁద హస్తంబు లూఁది, పటుజవంబున దాఁటెఁ బవమానసుతుఁడ
అల సుధాహరణార్థమై వైనతేయుఁ, డిలనుండి మును దివి కెగయుచందమున
నారభసంబున నద్రిశృంగములు, భూరేణువులకంటెఁ బొడియునై రాలె
నారావణుండు మున్నార్జించినట్టి, భూరికీర్తులపెంపు పొడియైనయట్లు
నాయురవడి మ్రాఁకు లతనితో నెగసి, తోయధిలోఁ జొచ్చి తునియలై రాలె
ఖావి సేతువునకై పవననందనుఁడు, తా వచ్చి శంకువు స్థాపించె ననఁగ
వెసఁ బేర్చి యచ్చట విషమవాయువులు, దెసలకుఁ జెడిపాఱెఁ దివిరి మేఘములు
వక్రించె లంకపై వాయుజుం డనుచు, శక్రాదులకుఁ జెప్పఁ జనినచందమున
నావడి నబ్ధినీ రంతయు నెగసి, యావలి పాతాళ మటుఁ గానవచ్చె
జనకజఁ దెచ్చి నాజలములోఁ దాఁపుఁ, డని మారుతికిఁ జూపె నంభోధి యనఁగ
దనపతిహితకార్య ధైర్య శౌర్యములు, తనవేగలాఘవోదాత్తసత్త్వములు
చూచి యింద్రాదులు సొరిదిఁ గీర్తింప, నీచందమున దాఁటి యేగుచున్నంత
నీసితక్షకృతి జగద్ధితముగాఁ బూని, పూని యెంతయు దవ్వు పోవుచున్నాఁడు

ఇతనికి విశ్రాంతి యిచటఁ గావించి, యితనిఁ బుచ్చెద నని యిచ్చలోఁ దలఁచి
యప్పుడు మైనాకు నంబుధి పిలిచి, యిప్పుడు హనుమంతుఁ డేతెంచె నిటకు
నొప్పార నాతిథ్య మొసఁగు నీవనుచుఁ, జెప్పి పొమ్మనుటయు శీఘ్రంబె యరిగి

## హనుమంతునకు మైనాకుఁ డాతిథ్య మొసఁగుట

యురుతరనిజపక్షయుగళసంజాత, మరుదుచ్చలద్వార్ధిమధ్యంబు వెడలి
శ్రీకరకాంచనశృంగసంకలిత, నాకమై యొప్పు మైనాకపర్వతము
ఎదుటఁ దోఁచినఁ జూచి యిది దైత్యమాయ, కదిసి నాపనికి విఘ్నము సేయఁగోరె
దానికి నేమి నాదర్పంబుపేర్మి, దీనిఁ ద్రుంచెదఁగాక తెగియంచు నదరి
పరవజ్రకఠినమహా వక్షంబుచేత, నురవడి హనుమంతుఁ డుదరి తాఁకుటయుఁ
గరువలి సుడిఁగొన్న కారాకువోలెఁ, దిరమేది ధృతి దూలి దిర్దిరఁ దిరిగి
మనుజుఁడై పొడసూపి మైనాకశిఖరి, యనిలనందనుఁ జూచి యర్థితోఁ బలికె
అనిలజ నేను నీ కపకారి గాను, వనరాశిపంపున వచ్చితిఁ గాని
యమ్మహాత్ముఁడు నీకు నాతిథ్య మొసఁగు, పొమ్మన్న వచ్చితిఁ బూర్వకాలమున
పర్వతంబులకెల్ల పక్షముల్గలిగి, గర్వించి మెలఁగ నాఖండలుం డలిగి
పవిధార నొక్కటఁ బక్షము ల్దునుమఁ, బవనుఁడు మీతండ్రి పరికించి నన్ను
నవలీల నీలవణాంబుధిలోనఁ, గవియించి పక్షము ల్గాచి రక్షించెఁ
గాన మీవాఁడను గాని యన్యుఁడను, గాను శీతాచలాగ్రణికుమారుండ
నేను మైనాకుండ నీవు నాయందుఁ, బూని యీఫలమూలములఁ దృప్తిఁబొంది
బడలికలును బాసి పవనకుమార, కడు లావు మీఱ లంకాపురంబునకు
నరుగుము నీవన్న నమ్మహాబలుఁడు, వెరవుగా నిప్పుడు విశ్రమించుటకు
జలనిధినడుమ నెచ్చట నిల్వ ననుచుఁ, జెలఁగి మున్ను ప్రతిజ్ఞ చేసినవాఁడ
నిట రామకార్యార్థ మేగుచున్నాఁడ, నటుగాన నిల్వరా దద్రీశనాకు
నని పాణితలమున నయ్యద్రిఁ దడవి, యనఘాత్మ నీపూజ లన్నియు వచ్చె
నని పల్కి పోవుచో ననిలనందనుని, ఘనశక్తికమరులు కడుఁ జోద్యమంది
నానావిధముల నానందించి రంత, మైనాకగిరి కింపుమై నాకవిభుఁడు
కనుఁగొని శ్రీరామకార్యమై యేఁగు, హనుమంతునకుఁ బ్రియం బాచరించితివి
యటుగాన నీకు నే నభయమిచ్చితిని, ఇటు సుఖస్థితి నుండు మీవంచుఁ బలికె
నప్పుడు గంధర్వు లమరులు మునులుఁ, దప్పక యంజనాతనయుఁ జూచుచును
ఇతనిలా వెట్టిదో యెఱుఁగుద మనుచుఁ, జతురులై సురసనాఁ జను దేవదూతఁ
బనిచిన రాక్షసభావంబు దాల్చి, యనిలసూనునకుఁ దానడ్డమై పలికె
నీవార్ధిలోనుండి యే నిన్నుఁ గంటి, దైవయత్నంబునఁ దానింకమంటి
అనిలజ యాఁకొంటి నటనిటఁ జనక, మునుకొని నావక్త్రమున వచ్చి చొరుము
నీవనవుడు రామనృపుకార్యమునకుఁ, బోవుచున్నాఁడను బోలఁతి రారాదు

ధరణీశుకార్య మంతయు నెఱవేర్చి, తిరిగి యేతెంచుచోఁ దీర్తు నీకోర్కె
పోయివచ్చెద నంత బొంకుగా దనిన, నాయింతి కోపించి యటుఁ గ్రమ్మి నిలిచి
చననీను నినుఁ బట్టి చంపుదుఁ గడిమి, నని నోరు దెఱచిన ననిలనందనుఁడు
తనమేనుఁ బెంచెను దశయోజనంబు, లినుమడిగాఁ బెంచె నింతి యాననము
ముప్పదియోజనంబులు పెంచె నాతఁ, డప్పుడు నలువది యదియును బెంచె
నొండొరు లిటు శతయోజనంబులుగ, దండిమైఁ బెంచిరి తనువు వక్త్రములు
నంత నాహనుమంతుఁ డసమానబుద్ధిమంతుఁడై యంగుష్ఠమాత్రగాత్రమున
నతిసూక్ష్ముఁడై వచ్చి యాయింతివదన, మతిరయంబునఁ జొచ్చి యవలీల వెడలె
ముడిగొన్న సంసారమోహబంధములు, విడఁదన్ని, సుజ్ఞాని వెడలినమాడ్కి
వెడలి నీకోర్కె గావించితి నింకఁ, గడలి దాఁటెదనన్నఁ గపికులోత్తముని
బుద్ధి కెంతయు మెచ్చి పొగడుచుఁ గార్యసిద్ధి నీకయ్యెడు శీఘ్రంబె యనుచు
నట దివ్యవనితయై యాయింతి ప్రీతిఁ, బటుసత్త్వనిలజుఁ బరఁగ దీవించె
నతఁ డంతఁ బ్రణమిల్లి యటఁ బోవుచుండ, నతిరయంబున వచ్చి యాతనిఁ గదిసి
యొలసి దేహచ్ఛాయ లాడిసిరాఁ దిగిచి, చెలఁగి జీవుల మ్రింగు సింహిక గదిసి
పదియోజనంబుల పఱపును మూఁడు,పదులయోజనములై పరఁగెడునిడుపు
నగుమోమ నాతని నలమి చేఁబట్టి, తిగిచి మ్రింగుచునుండ ధీరుఁడై యతఁడు
ప్రతికూలవాతూలపవనసంఘాత, హతుల నోడయుఁ బోలె నటు పోక నిలిచి
యెడద ఛాయగ్రాహి యిది యని తెలిసి, మడవక యటమీఁద మకరివక్త్రంబు
చొచ్చివత్తు నటంచు సూచించినట్లు, అచ్చెరువంది యింద్రాదులు చూడఁ
గడుసూక్ష్మరూపుఁడై కదలక దాని, కడుపులోపలఁ జొచ్చి కడిమిమై వ్రచ్చి
యాదుష్టరాక్షసి నబ్ధిలో వైచె, నాదట సురలెల్ల నానందమంది
వినుతించి వరపుష్పవృష్టులు గురియ, వననిధి నవలీల వడిదాఁటి పోయి
యాసమీరజుఁ డనాయాసంబుతోడ, నాసువేలాచలం బవలీల నెక్కె

నని యాంధ్రభాషభాషాధీశవిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుం డపారధీశరధి, భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
తమతండ్రి విట్ఠల ధరణీశు పేరఁ, గమనీయగుణాఢ్యకనకాద్రి పేరఁ
బనిబూని యరిగండభైరవు పేర, ఘను పేర మీసరగండని పేర
నాచంద్రతారార్కమై యొప్పుమిగిలి, భూచక్రమున నతిపూజ్యమై వెలయ
నసమానలలితశబ్దార్థసంగతుల, రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగు నలంకారభావసల్నిండఁ, గరమర్థిఁ గిష్కింధకాండంబుఁ జెప్పె
నారూఢి నార్షేయమై యాదికావ్య,మై రసికానందమై యెల్లనాఁడు
నివ్వసుమతి నొప్పు నీపుణ్యచరిత, మెవ్వారు చదివిన నెవ్వారు వినిన
సామాదిబహువేదచయధాముఁ రాము, నామచింతామణినవ్యభోగములు

పరహితాచారముల్ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
ఆయురారోగ్యంబు లైశ్వర్యములును, బాయనిశుభములు పాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యపశుసమృద్ధియును
ఏవిఘ్నములు లేక యిండ్లలో నధిక, లావణ్యవతులైన లలనలపొందు
కొడుకులతో నెప్డు గూడియుండుటయు, నెడగాంగ నాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులఁ గూడుటయు, నిమ్ముల కామ్యంబు లెడపకుండుటయు
సతతంబు చేసి పితృతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవభోగాదివాసులఁ జేయు
నెందాఁకఁ గులగిరు లెందాఁకఁ దార, లెందాఁకఁ రవిచంద్రు లెందాఁక దిశలు
నెందాఁక వేదంబు లెందాఁక ధరణి, యెందాఁక భువనంబు లేపుదీపించు
నందాఁక నీకథ యక్షరానంద, సందోహదోహళాచారమై పరఁగు.

కిష్కింధాకాండము సంపూర్ణము.



శ్రీరస్తు

# శ్రీరంగనాథరామాయణము

## సుందరకాండము



శ్రీరాముకార్యంబు సేయంగఁ బూని, వారిధి పిల్లకాల్వయుఁ బోలె దాఁటి
చారుశృంగంబుల సానుదేశముల, భూరిభూరుహలతాపుంజకుంజములఁ
గలిమిచే నొప్పు లంకాసమీపమున, వెలయు సువేలాద్రి వేడ్కమై నెక్కి
యంత నాహనుమంతుఁ డాయద్రిమీఁద, నెంతయుఁ గడకతో నేపుమై నిలిచి
యట దక్షిణము చూచి యప్పు డిట్లనియె, నటఁ ద్రికూటాద్రిపై నమరెడుదానిఁ
గదలక ధర్మార్థకామము ల్మూఁడు, పొదిగొన్నసిరివోలెఁ బొలుపొందుదాని
నమరావతీపురం బబ్ధిమధ్యమునఁ, గమనీయగతినొప్పఁ గలిగినదాని
నలకుబేరుతో నలుకమై నచట, నెలకొన్న కైవడి నెగడెడుదానిఁ
గలకాలమును నధోగతి నుండలేక, తెలివిమై భోగవతీనగరంబు
జలరాశి వెలువడి సరిత్రికూటమున, వెలసినకైవడి విలసిల్లుదాని
నంబుధియావరణాంబువుల్గాఁగఁ, బంబిన ప్రభనొప్పు బంగారుకోట
బ్రహ్మాండవిధముగాఁ బరికింపనొప్పు, బ్రహ్మాద్యభేద్యమై పరఁగెడుదాని
మొనసి లోకములకు మొనయెక్కు డగుచుఁ, ననుపమాకృతితోడ నమరెడుదా
బొలుపొంద బహుదివ్యభోగసంపదల, నలిమీఱ నెక్కుడై యందంద వెలుఁగ
నలినసంభవు గేహ మననొప్పునట్టి, లలితమై యొప్పెడు లంకాపురంబు
కని చాల వెఱగంది కనుఱెప్పఁ బెట్ట, కనిలతనూభవుం డందంద చూచి
యెల్లలోకంబులు నెక్కటి గెలిచి, బల్లిదుఁడై పేర్చు పంక్తికంధరుఁడు
ఇట్టిసంపదలచే నెనయునీలంకఁ, బట్టాభిషిక్తుఁడై బ్రతికి పాలేది
సకలేశుఁడగు రామచంద్రుని దేవి, వికలుఁడై కొనివచ్చి వీఁడేల పొలిసె
నని వానిదూషించి యాలంక చొరఁగ, ననువు విచారించి యాసత్త్వధనుఁడు
తగ లంకయుత్తరద్వారంబుఁ జేరి, తగవును నీతియుఁ దలపోసి మఱియు
నీసముద్రము కపు లెట్లు దాఁటెదరు, వాసి దాఁటిననైన వాసవాదులకు
సాధింప మిగుల నసాధ్య మీలంక, సాధింప నలవియె సకలయత్నముల
భీమసాహసమునఁ బేర్చు రావణుని, రాముఁ డెట్లు జయించు రణములో నెదిరి
యని ముహూర్తము తనయాత్మఁ జింతించి, మనమున శ్రీరాముమహిమంబుఁ
యీసముద్రం బెంత యీలంక యెంత, యీసురారియు నెంత యినకులేశ్వరు

కని తిరస్కారంబుగాఁ దలపోసి, యనలేనిపొడవైన యామేనితోడఁ
బగటున నీపురిఁ బగలు చొచ్చినను, బగలోను రాక్షసభటులకు నాకు
జానకిఁ బొడగానఁజాల నేనట్లు, కాన సూక్ష్మాకృతిఁ గైకొని పోయి
యీలంకదైత్యుల నెల్ల వంచించి, వాలాయమునఁ గాంతు వైదేహి ననుచు
మదిలోన సూర్యాస్తమయ మొప్పఁ దలఁచి, పదిలుఁడై యెంతయుఁ బరికింపుచుండ
నవిరళసత్త్వుఁడై యఖిలేశుదేవి, నవనీతనూభవ నరసిపో వచ్చె
నేనున్న ననువుగా దీలంక చొరఁగ, వీఁకి నన్నట్లు వెసఁ గ్రుంకె నినుఁడు
అనిలనందనునకు నసమిచ్చి దైత్య, ఘనపాపములు పూని కలఁగొనఁ బర్వె
ననఁ బర్వెఁ గలయ ఘోరాంధకారంబు, ఘనమైన దైత్యులకలకలం బణఁగె
నంత నాకలకలం బణఁగుట నాత్మ, నంతయుఁ బరికించి యనిలనందనుఁడు
మనమున రఘురాము మఱువక నిలిపి, తనతండ్రి వాయువుఁ దప్పక వేఁడి
మార్జాలమాత్రుఁడై మఱి లంకఁజొచ్చి, కర్జ మూహింపుచు ఘనుల రాఘవులఁ
దలఁచుచు మెలఁగ నత్తఱి విస్మయముగఁ, గలితభయంకరాకారంబుతోడఁ
బెన్నిధి సాధింపఁ బ్రీతిమై నరుగు,చున్న సాధకునకు నొగినడ్డపడఁగ

హనుమంతుఁడు లంకాపురిఁ జొచ్చుట

వడి మహాభూతంబు వచ్చుచందమున, నడరి లంకిణివచ్చి యడ్డమై నిలిచి
యట్టహాసము చేసి యనిలనందనుని, ఘట్టించి పలికెఁ గ్రోధంబు రెట్టింప
నీవెవ్వఁడవు మఱి నీకుఁ బేరేమి, నీ వీపురంబులోనికి వచ్చు టెట్లు
ఎవ్వరు పంచినా రెఱిఁగింపు మనిన, నవ్వాయునందనుం డచలుఁడై పలికె
నీ వెవ్వతెవు మఱి నీకుఁ బేరేమి, నీవేల యడ్డమై నిలిచితి నాకు
మున్ను నీవెఱిఁగింపు ముదిత యావెనుక, నున్నట్లు నాతెఱం గొప్పఁ జెప్పెదను
అని పల్క నేను దశాననునాజ్ఞఁ, బనిపూని యీపురి బలిమి రక్షింతుఁ
బేరు లంకిణి యంద్రు పెఱవారిఁ గన్న, బోరనఁ బొరిగొందుఁ బోనీక యనిన
హనుమంతుఁ డయ్యింతి కనియె వెండియును, వనిత యీపురి జూచువాఁడనై యేను
జనుదెంచితిని వేగ చనఁగని మ్మనినఁ, గనలి కోపంబున కఱకురక్కసియు
నెక్కడఁ బోయెద వింక నాచేతఁ, జిక్కితి గాకంచు చెలఁగి మైఁ బెంచి
కఱకఱి నినుఁ బట్టి కదిసి నీమేను, దఱిగి నీరక్తము ద్రావుదు ననుచుఁ
గడుకోప మెసఁగ నక్కపినాథుఁ ద్రొమ్ము, పొడిచిన పోలఁతి జంపుట పాప మనుచుఁ
దడయక మారుతి దానివక్షంబు, పిడికిటఁ బొడిచిన పెంపెల్లఁ బొలిసి
యిలఁ గూలి మిక్కిలి హీనస్వరమునఁ, బలుమాఱు హనుమంతుఁ బ్రార్థించి పలికెఁ
గపికులోత్తమ నన్నుఁ గరుణింపవయ్య, నిపుణుఁడై యీపురి నిర్మించునాఁడు
వనజాసనుఁడు నాకు వరమిచ్చినాఁడు, వనచరుఁ డొక్కఁడు వచ్చి నిన్నెదిరి
యెన్నఁడు నొప్పించు నిల నది మొదలు, క్రన్నన రాక్షసక్షయమగు ననుచుఁ
గాన నీతలఁచిన కార్యసంసిద్ధు, లౌనంచు దీవించి యాయింతి చనియెఁ
దనమది మారుతి దానిమాటలకు, ననువొంద నుబ్బి మిన్నంది పెల్లార్చి

చెడవలె రాక్షసుల్ శీఘ్రింబటంచు, నెడమకా ల్మున్నుగా నిల నడుగిడుచుఁ
గడుసూక్ష్మరూపంబు గైకొనిపోయి, యడరుకోటలు దాఁటి యడఁకఁ జేర్చి
వడిఁ గోటవాకిలివారు తలార్లు, పొడగానకుండ నప్పుడు గూఢవృత్తి
వీథులు పరికించి విపణిమార్గములు, శోధించి రచ్చలు సొరిది నీక్షించి
ఘనగోపురము లెక్కి గజశాల లరసి, మునుమిడి వరహర్మ్యముల సంచరించి
దేవాలయంబులు తిరిగి యిల్లిల్లు, భావించి గొందులు పరికించి చూచి
యుప్పరిగెలు గాంచి యోసరు ల్నెమకి, చప్పరంబులు డాసి సౌధము ల్వెదకి
చాలఁ జెన్నగు రథశాలలు వాజి,శాలలు శస్త్రాస్త్రశాలలుఁ దడవి
మాడువు ల్పరికించి మణిమయంబైన, మేడలవాడల మిగుల చెన్నైన
మంత్రులయిండ్లు సామంతులయిండ్లు, తంత్రిపాలురయిండ్లు దైవజ్ఞులిండ్లు
నావిభీషణుగేహ మతికాయుగృహము, దేవకాంతునియిల్లు త్రిశిరుమందిరము
గంభీరమగు కుంభకర్ణునినెలవు, కుంభనాలయము నికుంభసద్మంబు
శ్రీమించు నయ్యింద్రజిత్తునినగరు, నామహోదరుగేహ మాదిగా నయిన
దనుజనాథులనికేతనపంక్తు లచటఁ, గనుఁగొంచు నద్భుతక్రాంతుఁడై వారి
యంతగపురంబుల నంతయు వెదకి, కాంతాజనంబులఁ గలయంగ నరసి
వెండియు దనుజులవేశ్మముల్ గలయ, నొండొండఁ గనుఁగొంచు నొక్కొక్కచోట
నొకకన్ను నొకచెవి యొకకేలుగలుగు, వికృతవేషులఁ జూచి వెఱఁగుఁబొందుచును
బహుపాదబహుభుజబహుమస్తకోరు, సహితులఁ గొందఱ సారె గన్గొనుచు
జపతపస్స్వాధ్యాయసత్కర్మనిష్ఠఁ, దపసులౌ దానవోత్తములఁ జూచుచును
మకరతోరణబద్ధమాల్యజాలములఁ, బ్రకటితధూపసౌరభవిశేషముల
రత్నముక్తాఫలరంగవల్లికల, నూత్నేందుకాంతబంధురవితర్దికల
మణిగణహాటకమయకవాటముల, గణనాధికోగ్రవిష్కంభసూత్రముల
స్ఫుటవజ్రకలితకపోతమాలికల, ఘటితేంద్రనీలప్రకాశదేహళుల
మరకతస్థగితనిర్మలగవాక్షములఁ, గురువిందసందీప్తకుట్టిమస్థలుల
మహనీయతరవిద్రుమస్తంభతతుల, బహుశిరోగృహముల భవనపాళికల
నాయుధోజ్జ్వలహస్తులైనరాక్షసులఁ, బాయక యేప్రొద్దు బలసినయట్టి
రావణునగరు చేరఁగఁబోయి యచటఁ, గావలివారలఁ గలయ శోధించి
పెక్కువాకిండ్లు నిర్భీతిమైఁ గడచి, యక్కొల్వుకూటంబు లన్నియు వెదకి
యంతఃపురము చేర నరుగు నావేళఁ, గంతునిమామ సత్కళలకునికి
కలువలపైఁ బ్రేమ గలచందమామ, కలితబింబలలామగతి నుదయించి
జలరాశిఁ దేలించి జలజషండములఁ, గలవాసిఁ దూలించి గబ్బిజక్కవల
విరహార్తి నెలయించి వెడవింటివాని, వరకీర్తి నలయించి వాడినకలువ
మొత్తము నలరించి ముగ్ధజారిణుల, చిత్తంబు లదరించి చిమ్మచీఁకటుల
పంతంబు దరలించి పదునైనచంద్ర,కాంతంబుఁ గరఁగించి ఘనచకోరముల
విందులఁ దనియించి విటపిటీజనుల, పొందుల నలయించి పూర్ణచంద్రికల

దిక్కులకెల్లను దెలివి దీపించి, చుక్కలగమికాఁడు చూపట్టె మింట
పావని వీడెల్లఁ బరికింపవలసి, దేవత లెత్తిన దీపమో యనఁగ
నట్టిచందురుఁ జూచి యంతరంగమున, దొట్టినవేడ్క వాతూలనందనుఁడు
అరయోజనము వెడలై్ప యోజనంబు, విరివియౌ నొకయిల్లు వేగ కన్గొనుచు
నంతఃపురంబెల్ల నరయుచు రత్న,కాంతవంతము విశ్వకర్మనిర్మితము
కామచారము చిత్రకరకౌశలంబు, సోమార్కనిభమునై సురలోకవైరి
యాకుబేరునిఁ దొల్లి యాజిలో గెలిచి, కైకొన్నమణిపుష్పకంబు వీక్షించి
యావిమానంబులో నంగనామణులు, రావణు సౌఖ్యవారాశిఁ దేలించి
పానాభిరతికేళి పరవశ లగుచు, మేనుదీఁగెలు సోల మిసిమిపెందొడలఁ
పస బయల్పడి నీవిబంధముల్జార, పసివాళ్లువాడిన వదనంబు లడరఁ
గమ్మనిట్టూర్పులు గ్రమ్మఁ గెమ్మోవు, లెమ్మెలు గైవ్రాల నెలనవ్వు దేర
నరమోడ్పుఁగనుఁగవ లంగజుకేళి, పరవశత్వముఁ దెల్పఁ బాదపద్మముల
నందియల్ రొదసేయ నమ్మోములందుఁ, జందనతిలకముల్ శ్రమవారిఁ గరఁగ
వేణీభరము వీడ విరిదండ లూడ, నాణిముత్యము పేరు లత్యంతకఠిన
వక్షోజపర్వతద్వయిఁ జిక్కువడఁగ, నక్షులాసవమదాలసతఁ జెన్నొందఁ
గటిసైకతంబులఁ గచశైవలముల, స్ఫుటనాభిసరసుల భ్రూతరంగముల
స్తనచక్రములవిలోచనమీనతతులఁ, గనుపట్టి సుఖసుప్తిఁ గైకొన్ననదుల
కైవడి నిద్రించు కామినీమణుల, నావాయునందనుఁ డందందఁ జూచి
యిట్టిట్టి సతులుండ నీరావణుండు, కట్టెఁడియై రాముకాంతను దెచ్చెఁ
బరవధూమర్మము ల్వరికించుటకును, బురపురఁ బొక్కుచుఁ బుణ్యమానసుఁడు
స్వామికార్యార్థమై సతులమర్మముల, నీమాడ్కిఁ గనుఁగొంటి నింతియకాని
కానికేతల వీరిఁ గనుఁగొన్నవాఁడ, గానింతి నీయింతిగమిలోన వెదుక
వలను గాదనుచు భావమున నెన్నుచును, కలయఁ దా వెదకుచుఁ గానక యెచటఁ
జప్పుడు గాకుండఁ జనుచు ముందఱను, విప్పైన యొకరత్నవేదికమీఁదఁ
బువ్వుపాన్పున నిద్రఁబోయెడువాని, నవ్వాసవునిభోగ మణఁగించువాని
సంజకెంపులతోడ జలదంబువోలె, రంజితగంధాంగరాగంబువాని
నీటైన నెలయేర్ల నీలాద్రివోలెఁ, దేటముత్యపుపేర్లు దీపించువాని
నైదుమస్తములఘోరాహులఁబోలెఁ, బ్రోదినంగుళిరమ్యభుజములవాని
జిలుఁగువెన్నెలతోడి చీఁకటివోలెఁ, జలువదుప్పటి మేనఁ జతనొప్పువానిఁ
వెడఁదఱొమ్ములనొప్పు వేల్పుటేనుంగు, కడిదికొమ్ములపోటు కైఫులవానిఁ
గర్పూరమణిదీపకళిక లిర్వంక, నేర్పుమైఁ గదలించు నిట్టూర్పువాని
మకుటకుండలదీప్తిమయమూర్తివాని, సకలారిగర్వనిర్వాపణుండైన
రావణుఁ డనువాని రాక్షసాధిపుని, భావించి యాంతనిపార్శ్వభాగముల
నడపంబుగట్టియు నాలవట్టములఁ, గడువేడ్కఁ బట్టియుఁ గరకంకణములు
రాయంగ వింజామరములు వ్రేసియును, హాయిగాఁ బాడియు నాడియు వీణ

మీఁటియు మద్దెల ల్మృదుమార్గలీల, సూటి వాయించియు సొక్కి యొండొరులు
తమసాధనంబులు తగఁ గౌఁగిలించి, తమి నిద్రఁబోవు గంధర్వకామినుల
దేవకామినుల దైతేయకామినుల, భావించి యంత నా పవమానసుఁడు
గగనమండలి చంద్రకళయునుబోలె, మొగులు చెంత మెఱుఁగు మొలకయుఁబోలె
నా రావణునిశయ్య నభినవయావ,నారూఢయై దేవతాంగనకరణి
నున్నమందోదరి నొయ్యనఁ గాంచి, యన్నెలఁతుక సీత యని నిశ్చయించి
యవనిజ నేఁ గంటి ననుచు నానంద, వివశుఁడై గంతులు వ్రేయుచు నచటి
కంబము ల్ప్రాఁకుచుఁ గలితవాలాగ్ర, చుంబనం బొనరింపుచును నటింపుచును
గాపేయజాతివికారము ల్గొంత,సేపిటు చూపుచుఁ జిత్తంబులోన
మఱి వివేకముఁ బూని మనుకులేశ్వరుని, తెఱవ పతివ్రతాతిలకంబు పరమ
పావని జనకభూపాలునిపుత్త్రి, దేవదేవుని రామదేవునిఁ బాసి
రావణుఁ గోరునే రాగిల్లి మధువు, ద్రావునే యిట్లేల తనబుద్ధి భ్రమసె
నానావిధంబుల నాకుఁ జూచినను, దానవిగాని యీతరళాక్షి సీత
గాదని తెలిసి యక్కడ నుండ కవల, మేదురపరికరామ్రేడితామోద
మానితాసవరక్తమధుమాంసయుక్త, పానశాలాపరంపర లెల్లఁ జూచి
గరుడోరగామరగంధర్వసిద్ధ, వరసతు ల్చెఱలున్న వాడలు చూచి

—శ్రీహనుమంతుఁడు ఉద్యానవనంబుఁ జూచుట—

వారిదుఃఖంబులు వారియాపదలు, నారంగ వీక్షించి యాత్మలో వగచి
వెఱవకుం డిటమీఁద విను రాముఁ డింక, నెఱి రావణునినాజి నిర్జించి మిమ్ము
విడిపించు నందఱు వెఱవకుఁ డింక, దడవు లేదని వారిఁ దగ నూఱడించి
నీడల నందంద నిలిచి యేకాంత, మాడెడువారల నటఁ జేరఁబోయి
యిది నాకుఁ జొరఁబోలు నిది నాకుఁ బోల, దిది నాకుఁ జొరవచ్చు నిది నాకు రాదు
అనక లంకాపుర మంతయు వెదకి, మనుజవేషముతోడ మగువ నెబ్భంగి
నెందును బొడగాన కిచ్చలో వగలఁ, బొందుచు నటఁ బోయి పురసమీపమునఁ
బసిఁడికోటలచేత భాసిల్లుచున్న, యసమానమైన యుద్యానంబుఁ గాంచి
మెల్లన నటఁబోయి మెలఁగ వీక్షించి, యల్లనల్లనఁ బ్రాఁకి యాకోట లెక్కి
చందనపున్నాగసహకారతరుల, మందారఖర్జూరమాతులుంగములఁ
బనసపిప్పలినింబపాటలీవకుళ, ఘనసారసౌవర్ణకర్ణికారముల
మల్లికామాలతీమాధవీలతల,సల్లకీకురవకజంబీరతరులఁ
దాలతమాలహింతాలరసాల, నాళికేరాశోకనాగవల్లరుల
నేడాకుటరఁటుల నేలాలవంగ, దాడిమనారంగతక్కోలతరులఁ
గదళికాకేతకీక్రముకపూగములఁ, బదనైనగోస్తనీఫలగుళుచ్ఛములఁ
బరిపక్వబహుపుష్పపరిమళమిళిత, భరితమై వాయుసంపదల నింపెక్కి
కలకంఠశుకనీలకంఠశారికలఁ, జెలువొందునళులచేఁ జెలు వగ్గలించి
కమలాకరంబులఁ గరము శోభిల్లి, కుముదషండంబులఁ గొమరుదీపించి

శశికాంతవేదుల సన్నుతికెక్కి, విశదచంద్రికలచే వేడ్కసొంపెక్కి
సికతాతలంబులచేఁ జెన్నుమీఱి, సకలర్తువిహారణస్థాన మైమిగుల
రమణమై నది చైత్రరథమును మించి, యమరేంద్రునందనమునఁ జూడ నొప్పి
యలరు రావణవినోదారామభూమి, గలయంగఁ గనుఁగొని కడుచోద్యమంది
యొప్పునావనభూమి కొయ్యన డిగ్గి, చప్పుడు కాకుండఁ జరణంబు లిడుచుఁ
గొలఁకులయందును గూలంబులందుఁ, బులినదేశములందుఁ బొదరిండ్లయందుఁ
గేళీగృహములందుఁ గృతకాద్రులందు, శైలశృంగములందు సానువులందు
నుర్వీరుహములందు నోలంబులందు, నుర్వీతనూభవ నుడుగక వెదకి
ఆవనమధ్యంబునందు రేవగలు, కావలియుండు రాక్షసకోటి కెపుడుఁ
దావలంబై మిన్ను తలఁదన్ను పొడవు, చేవెలుంగుచు మేరుశిఖరాళిఁ గేరు
పసిఁడికుంభములచేఁ బసమీఱి వెలయు, పసిఁడికంబములచే పఱపుదీపించి
వరరత్నతోరణావళుల శోభిల్లి, యురుతరం బగుచున్న యొకమేడఁ గాంచి
యామేడలోపల నంతయు వెదకి, భూమిజఁ గానక బుద్ధిలో వగచి
యినవంశవల్లభుఁ డేకతంబునను, మును నన్ను రమ్మని ముదమొప్పఁ బిలిచి
జనకజ పొడగానఁ జాలుదు వీవ, యనిచెప్పి నాచేతి కానవా లిచ్చెఁ
బనిపూని వచ్చితి బంటనై యేను, గనుఁగొనలేనైతిఁ గమలాక్షి నెందు
నీదురాత్ముఁడు సీత నిటఁ దెచ్చుచోట, వేదనఁ బ్రాణము ల్విడిచెనో యింతి
యంబరగతిభీతి నరుదెంచుచోట, నంబుధిఁ బడియెనో యసురచేఁ దప్పి
యిచ్చటిదనుజుల నీక్షించి బెదరి, చచ్చెనో విరహాగ్ని సమసెనో లేక
కమలాక్షి నొరులకుఁ గానరాకుండ, భ్రమపెట్టి మాయలు పన్నెనో వీఁడు
ఒందుదేశంబుల నునిచెనో కాక, దండించి చంపెనో తరలాక్షి నసుర
యేమని మగుడుదు నేమందుఁబోయి, యేమిచేయుదు నింక నిటమీఁద నేను
వామాక్షిఁ గానక వచ్చితి ననిన, రాముఁ డప్పుడె పాయుఁ బ్రాణవాయువుల
నన్నకై సౌమిత్రి యడఁగు నీవార్త, విన్నంత భరతుండు విడుచుఁ బ్రాణముల
నతనికై శత్రుఘ్నుఁ డఖిలబాంధవులు, హతులౌదు రినవంశమంతట సమయు
నదిచూచి సుగ్రీవుఁ డాయంగదుండు, మొదలైన కపివంశమును నాశమొందు
గాన వానప్రస్థగతి మహాటవుల, నేను గాపుండుదు నదియుఁ గాదేని
సొదఁ జేర్చుకొని యగ్నిఁ జొత్తునొండేని, యుదధులఁ బడి చత్తు నుసురాసఁ దక్కి
యక్కట సంపాతి యాడినమాట, నిక్కంబుగా నమ్మి నీరధి దాఁటి
యిచ్చటికొంటిమై యే వచ్చుటెల్ల, నచ్చుగా వృథయయ్యె నౌఁగాక యేమి
త్రిదశులతోఁ గూడఁ దెగువమైఁ జేర్చి, త్రిదశేంద్రుఁ బట్టి బాధింతునొండేనిఁ
జెలఁగి కీలలతోడ శిఖి నీటముంచి, యిలఁ బ్రామి ప్రభలు మాయింతునొండేనిఁ
గ్రందుగా జమునిఁ గింకరులతోఁ బట్టి, దెందంబు వగుల దండింతునొండేనిఁ
జలమొప్ప నిర్ఋతి రాక్షసులతోఁ గూడఁ, బెలుకుఱఁ బట్టి నొప్పింతునొండేని
గరువలి నయ్యేడు గాడ్పులఁ బెనచి, కెరలి యందంద శిక్షింతునొండేనిఁ

నలిరేఁగి ధనదుఁ గిన్నరులతోఁబట్టి, చెలువేది శూల భర్జింతునొండేని
నెనయఁ బ్రమథులతో నీశానుఁ బట్టి, చెనసి యొండొండ శిక్షింతునొండేనిఁ
గుతలంబుఁ గిరులతోఁ గుమ్మరసారె, గతిఁ ద్రిప్పి త్రిప్పి యుక్కడఁతునొండేని
నీలంకదైత్యుల నీయబ్ధి ముంచి, లీలమైఁ గలఁచి కాలింతునొండేని
నేనింతచేసిన నెల్లదేవతలు, నానతులై వచ్చి యతివఁ జూపెదరు
కాకున్న రాఘవు లక్కరుణమైఁ దామె, యీకీడు వలదని యింక మాన్పెదరు
అని నిశ్చయముచేసి యామేడశిఖర, మునిలనందనుఁ డెక్కె నాసమీపమున
వాయువు నొండయు వడిఁ జొరరాని, యాయశోకవనాంతరావనిలోన

## హనుమంతుఁడు సీతను జూచుట

నెలమిఁ బొంపిరివోయి హేమవర్ణమున, విలుసిల్లు శింశుపావృక్షంబుక్రింద
వ్రతములఁ గడుడస్సి వనటల గ్రుస్సి, యతిదుఃఖములఁగుంది యాత్మలోఁ గంది
విపులాశ్రువుల దోఁగి విరహాగ్నిఁ గ్రాఁగి, కపటవృత్తులఁ జిక్కి కడుముట్ట స్రుక్కి
జీవంబుపైరోసి చెలువంబుఁ బాసి, యావిధి మది దూఱి యలసత మీఱి
చెక్కిటఁ జేయిఁజేర్చి చింతలకోర్చి, దిక్కులేమి దలంచి ధృతి దూరడించి
యినరశ్మి వాడిన యొలదీఁగెఁబోలె, ఘనధూమయుతదీపకలికయుఁ బోలె
జలదమాలికలోని శశికళవోలెఁ, బలుమంచుఁ బొదివిన పద్మినివోలెఁ
జెలఁగి పిల్లులలోని చిలుకయుఁ బోలెఁ, బులులలో నావునుబోలె దుర్వార
ఘోరరాక్షసవధూకోటిలోనున్న, నారీశిరోమణి నలినాయతాక్షి
మలినాంగి యలివేణి మాతంగగమన, కలితభూషణజాల గద్గదకంఠి
జనితోష్ణనిశ్శ్వాస సతతోపవాస, జనకతనూజాత జగదేకమాత
నిఖిలసన్నుతపూత నిర్మలఖ్యాత, యఖిలగుణోపేత యయినయాసీతఁ
బొడగని సీత గాఁబోలుఁ బొమ్మనుచుఁ, గడుభక్తి రామలక్ష్మణులకు మ్రొక్కి
కడువేడ్క సురలను గడఁగి వేఁడుచును, నడరెడుముదమున నామేడ డిగ్గి
మదినుబ్బి యంగుష్ఠమాత్రుఁడై కదిసి, పదిలుఁడై యాశింశుపావృక్ష మెక్కి
బాలుఁడై యల వటపత్రంబునందు, వేలీలఁ గ్రీడించు విష్ణుఁడుపోలె
శాఖామృగేంద్రుండు జడిగొన్నదాని, శాఖలలో డాగి చతురుఁడై యుండెఁ
బావనచరితుఁ డాపద్మాయతాక్షి, భావించి భావించి పలుమాఱుఁ జూచి
కడఁకతో ఋశ్యమూకమునందుఁ గన్న, తొడవులు నీయున్నతొడవులు జూడ
నేకప్రకారంబు లీపద్మనయన, కాకుత్స్థుసతి సీత గాఁబోలు ననుచు
మఱియును బరికించి మారుతాత్మజుఁడు, నెఱిసినబుద్ధిమై నెలఁత నీక్షించి
శ్రీరాముఁ డానతిచ్చినప్రకారమున, నారమణీమణి యవయవశ్రీలు
కర్ణవేష్టనములు కరకంకణములు, స్వర్ణాంబరంబును సరిఁ బరికించి
వలవంతఁబడి వ్రేగువారిచిహ్నములు, వలనొప్పఁగల పతివ్రతలచిహ్నములుఁ
జదురుగల్గిన మర్త్యసతులచిహ్నములుఁ, జెదర కన్నియుఁ జూచి చింతించి మఱియుఁ
గొనకొని రాముఁ డేర్కొని ప్రలాపింపఁ, గనుఁగొని మఱి సీతగా నిశ్చయించి

యా విన్ననగుమోము నాకృశాంగంబు, నావిరిసినవేణి యాయున్నయునికి
యాదురవస్థయు నావిలాపంబు, నాదైన్యమును జూచి యాత్మ శోకించి
చంద్రునిఁ బాసినచంద్రికరీతి, చంద్రాస్య యారామచంద్రునిఁ బాసి
యుండునే యీయింతి నొగిఁబాసి రాముఁ, డుండునే యిది చోద్యమూహించిచూడ
గుణశీలదాక్షిణ్యగుణవయోధర్మ, లలితరూపము లొక్క లాగొటఁజేసి
యారామువిభున కీయంగనామణియు, నీరామ కారామనృపతియుఁ దగును
ఈకాంతకై కాదె యినకులేశ్వరుఁడు, శ్రీకంఠు విలుఁద్రుంచెఁ జెఱకుచందమున
దొలుతఁ బట్టినయంతఁ ద్రుంచె విరాధు, నలిఁ గోసె నాశూర్పణఖముక్కుచెవులు
ఖరదూషణాదిరాక్షసుల ఖండించె, మరణంబునొందించె మారీచు నీచు
వాలి నొక్కమ్మున వధియించి కపుల, నాలుగుదిశల కున్నతశక్తిఁ బనిచె
వారిలోపల నన్ను బలవంతుఁ డనుచు, నారూఢిగతి నంగదాదులఁ గూడి
ఘనపుణ్యనిధియైన కాకుత్స్థునెదురఁ, బనిపూని వచ్చితిఁ బంతంబు మెఱసి
నాపుణ్యవశమున నాకోరినట్లు, లీపుణ్యవతిఁ గంటి నిచ్చోట వచ్చి
దారుణాసురవధూతతినట్టనడుమఁ, గారణాకృతిఁ జిక్కి కలఁగు నీసతికి
నెబ్భంగిఁ జూపుదు నింక నారూపు, నెబ్భంగి భాషింతు నీయింతితోడ
నెబ్భంగి నూరార్తు నీపుణ్యసాధ్వి, నెబ్భంగి నిబ్భంగు లెఱఁగింతు సతికి

### రావణుఁడు సీతాదేవివద్దికి వచ్చుట

నని యిట్లు చింతింప నంత రావణుఁడు, జనకజఁ జింతించి సంతాపమంది
వేకువజామున వేగ మేల్కాంచి, తేకువ మనసిజాధీనచిత్తమున
దివ్యమాల్యంబులు తెఱఁగొప్ప ముడిచి, దివ్యగంధంబులు తెఱఁగొప్పఁ బూసి
దివ్యాంబరంబులు తెఱఁగొప్పఁ గట్టి, దివ్యభూషణములు తెఱఁగొప్పఁ బెట్టి
తనకిరీటప్రభాతతు లెందుఁ బర్వ, ఘనచంద్రహాససంకలితుఁడై వేర్చి
కరమణికంకణక్వణనము ల్మెఱయ, సరసనచ్చరలు వింజామర లిడఁగ
ఘనకుచహారము ల్గ్రాల గంధర్వ, వనితాజనము లాలవట్టము ల్పట్టి
గొడుగును ధరియించి కుచమూలరుచుల, నడయాడుచున్న కిన్నరసతుల్నడువ
బాహుపార్శ్వంబులఁ బరఁగంగ హస్త, వాహికలై యక్షవనితలు నడువఁ
బరిమళోదకపానపాత్రికల్పట్టి, గరుడకామిను లిరుగడల నేతేర
నెడనెడ సందడి నెడగల్గ జడిసి, కడఁగి ముందట నాగకన్యకల్నడువ
విద్యాధరస్త్రీలు వీణాదివాద్య, హృదయసంగీతంబు లింపుగాఁ బాడఁ
దనగుణోన్నతుఁ లొగిఁ దగ సిద్ధసాధ్య, వనితలు చేరి కైవారము ల్సేయ
బాగొప్ప వరఖడ్గపాణులై కదిసి, రాగిలి వెనుక నారాక్షసస్త్రీలు
కలగొనఁ గరదీపికాసహస్రములు, వెలుఁగ మండోదరి వేడ్కఁ దోడ్కొనుచు
మెఱుఁగుల వెనుకొను మేఘంబుపోలె, మఱియును గలసతు ల్మెలసి తన్గొలువ
నురుపాదహతినోలి నుర్వి గంపింపఁ, బరిహాసరవము లంబరమును గప్ప
మంజీరమేఖలామణిభూషణాది, శింజితంబులు విందు సేయ వీనులకు

నాయశోకారామ మపుడు సొత్తెంచె, వాయుసూనుఁడు దన్ను వాంఛతోఁ జూడ
నిద్రావశేషఘూర్ణితదృష్టితోడ, భద్రకేయూరాంకబాహులతోడ
వసుధపై జీరాడు వలెవాటుతోడ, వసివాళ్లు వాడినవదనంబుతోడ
ఘనతరభీషణాకారంబుతోడ, జనకజ ముందటఁ జనుదెంచి నిలిచె
నిలిచిన భీతిల్లి నివ్వెఱగంది, తలఁపులో రఘురాముఁ దప్పక నిలిపి
యూరులు నుదరంబు నురుకుచద్వయము, చారుహస్తంబులఁ జక్కసవరించి
పులిఁ గన్నలేడిని బోలె చిత్తమునఁ, గలఁగుచున్నట్లున్న కల్యాణిఁ జూచి
వనితలలోన దుర్వారగర్వమునఁ, దను దైవమూడింపఁ దగవేసి పలికె
నింతి సీతనుమధ్య యింక దాఁచనేల, కాంత నీనెమ్మోము గైవ్రాలనేల
పొలఁతి బల్మిని బట్టి భోగించువాఁడ, నెలఁత యీగుణములఁ నెఱిఁ గనుంగొనుము
వనిత యీగుణముల వఱలెడునన్నుఁ, గొనుము నీయనుమతిఁ గోరియున్నాఁడ
మానక కైకొందు మగువ నిన్నింకఁ, గాన నామాటలు గైకొని వినుము
ఈరూపముననుండ నేమి కారణము, దారుణాటవి దాఁటి తమ్ముఁడుఁ దాను
వనిత రాముఁడు వచ్చి వనధి బంధించి, పనిచినకడిమిమైఁ బద్దు సాధించి
గొనకొన్న వేడ్కతోఁ గొనిపోవు నిన్ను, నని విచారించెద వాత్మలో నీవు
అమరేంద్రయమవరుణాదులకైన, సమరంబులో నన్ను సాధింపరాదు
ఈపేఁతనమేల యిందీవరాక్షి, నాబాహుశక్తికి నరులెంతవారు
అడవుల నాకులు నలములు నములి, యిడుమలు పడుచున్న హీనమానవుని
పొందేల కోరెదు పొలఁతి నన్బొంది, పొందనొల్లవె రాజ్యభోగంబు లకట
యనిమిషాధిపుఁడైన నంతకుండైన, విను జలాధిపుఁడైన విత్తేశుఁడైన
ననలనైరృతివాయుహరిహరులైనఁ, జనుదెంచి యీలంక సాధింపలేరు
లంక మానవులకు లక్షింపఁ దరమె, యింక నెక్కడి రాముఁ డిందెటు వచ్చు
వచ్చి లంకాపురవర మెట్లు చొచ్చుఁ, జొచ్చిన నెబ్భంగి స్రుక్కక యెదురు
నెదిరి నన్ బొడఁగని యెబ్భంగిఁ గదియు, గదిసి నాసత్త్వ మేగతి సైఁపఁజాలుఁ
జాలుట యెందాఁక సముకూరఁ బోలుఁ, బోల వీమాటలు పోవిడు మింతి

జానకి రావణుని తిరస్కరించుట

అని యిట్లు పలుమాఱు నరమి రావణుఁడు, వినరానిపలుకులు వెస దూఱి పలుకఁ
గడునల్గి గద్గదకంఠంబుతోడఁ, బుడక ద్రుంచి యవశ్యము రాముచేతఁ
జెడుదు వీవని చాటి చెప్పినరీతిఁ, బడతుక తృణము చేపట్టి యిట్లనియె
పాపాత్మ నీవు నాపతి డాఁగురించి, యేపున లంకలోనికి నన్నుఁ దెచ్చి
యిదియొక్క కడిమిగా నేల గర్వించె, దిదియొక్క మేలుగా నేల ప్రేలెదవు
పరవధూరతిఁ గోరు పాపాత్మకులకు, సిరియు నాయువు కీర్తి చెడునటు కానఁ
దగవును ధర్మంబు తలపోసి నన్ను, మగుడ రామునకిమ్ము మసఁగోరితేని
కాదేని దుర్బుద్ధి గైకొంటివేని, కోదండదీక్షాదిగురునిచే రాము
జననాథుచే నీవు చచ్చుట నిజము, వనవాసకృశుఁడు కేవలదుఃఖలుండు

ననఁద రాజ్యవిహీనుఁ డసహాయుఁ డతఁడు, మనుజమాత్రుఁ డటంచు మది నెన్నవలదు
దండకాటవి చతుర్దశసహస్రోగ్ర, చండరాక్షసకోటిఁ జంపఁడే తొల్లి
దండధరోద్దండదండంబు నోడిసి, చండాంశుకిరణోగ్రసంరంభ మణఁగ
గణనాపరంపరల్గడచి యందంద, రణభీషణములైన రాముబాణములు
పరువడి నీలంకపైఁ బాఱునాఁడు, తరమిడి నీయురస్స్థలి గాఁడునాఁడు
మునుకొని నీశిరంబులు ద్రుంచునాఁడు, మునుమిడి నీరక్తములు గ్రోలునాఁడు
రావణ నీలావు రఘురాములావు, నీవు చూచెదుగాని నేనేల చెప్ప
నెండతోఁ బ్రాలేయ మెదిరించినట్లు, కొండతో దగరు మార్కొనినచందమున
మదహస్తితోఁ దోమ మార్కొన్నకరణి, నుదధితోఁ గాల్వ మెండొడ్డినపగిది
శ్రీతర్వుతో వేము శ్రీశుతో జోగి, ధాతతో విప్రుండు ధనికుతోఁ బేద
జాతిరత్నముతోడ సరి గాజుపూస, భూతలంబున సరిపోల్చినయట్లు
తెగువమై రాఘవాధిపునకు నీకు, మగఁటిమి మదహస్తిమశకాంతరంబు
మిగుల నోరులుగల్గి మీఱి పల్కెదవు, జగతి రామునితోడ సరియె రాక్షసుఁడ
ఒకలంక యేలుచు నుబ్బెద వీవు, సకలలోకములకు స్వామి రాఘవుఁడు
అఖిలకంటకుఁడ వీ వన్నిలోకముల, నఖిలలోకారాధ్యుఁడా రాఘవుండు
వేదచోరుఁడ వవివేకివి నీవు, వేదంబులకు నెల్ల వేద్యుం డతండు
కర్మపూరితఘనకాయుండ వీవు, నిర్మలగుణయశోనిధి రాఘవుండు
సర్వజీవాళిభక్షకుఁడవు నీవు, సర్వజీవులకును సముఁడు రాఘవుఁడు
ఉన్నతోన్నతుఁడైన యుర్వీశునకును, ఎన్నిసారెలపెట్ట నెఱుఁగంగ నీవు
ఇందుసూర్యాగ్నిసురేంద్రులు గారు, ఇందుధరార్చితుం డినవంశజుండు
నిన్నిట మర్దించి నీరూపమణఁచి, నన్నుఁ దోడ్కొనిపోవు నమ్ము మింతటికి
నాకు నీకును సాక్షి ననుఁ దెచ్చునపుడు, నైకొని యొకపక్షి కడఁగి యేతెంచి
నీలావుశక్తియు నీపరాక్రమము, నేలపాలుగఁ జేసి నెఱిప్రేసి నిలుపఁ
గపటభాషలు పల్కి ఘనపక్షినాథు, నపుడు ఖండించిన యధముఁడ వీవు
తరమెఱుంగక రామధరణీశుతోడఁ, దొరలితే భస్మమై త్రుంగెదుగాక
యేమిటి కెదురుద న్నెఱుఁగనిమాట, లేమిటి కీగర్వ మినకులేశ్వరుఁడు
ఈమూఁడుజగముల నెందు డాఁగినను, ఈమెయి నిన్నేల యిట్లుండనిచ్చు
ననిన రావణుఁడు మహారోషదృష్టి, జనకజ మక్షిఁ జూచి చలముతో ననియెఁ
బరమేష్ఠిఁ దపమునఁ బరఁగ మెప్పించి, పరశక్తి నతనిచే వరములు గాంచి
సురపతి మొదలుగా సురల నోడించి, గరళకంధరుతోడఁ గైలాస మెత్తి
కడిమిమై నూర్ధ్వలోకములు సాధించి, వడిఁ జెర్చి పాతాళవాసులనోర్చి
సకలోన్నతుండనై సడిగన్ననన్ను, వెకలియై తరుతండ్రి వెడలంగఁ ద్రోవ
నలిహీనసత్త్వుఁడై యడవులలోన, బతిదూలి ఫలములఁ బర్ణాశనముల
వికృతాంగుఁడై తపోవృత్తిమై నన్ను, నొకపేదమానవుఁ డోపునే చెనక
నని రాము నిందింప నందందఁ బొగిలి, మనమున నొగిలి యుమ్మలికంబు మిగిలి

ఘనశోకగద్గదకంఠరై యప్పు, డినకులాధిపుదేవి యెలుఁగెత్తి యేడ్వ
ధృతి దూలి నలుగడ దేవగంధర్వ, సతులెల్ల నేడ్చిరి జానకిఁ జూచి
రావణుగర్వంబు రమణిశోకంబు, భావించి కోపతాపంబులు నిగుడ
ననిలతనూభవుఁ డప్పు డాదుష్ట, దనుజుపై లంఘింపఁ దలపోసి చూచి
బిరుదనై వీనిఁ జంపితినేని పతికి, ధరణిజనేమంబుఁ దగఁ జెప్పఁగలను
అమరారిచేత నాయసువెల్లఁ బొలసి, సమరంబులోపలఁ జచ్చితినేని
లంక దిక్కెఱుఁగక లలన నెవ్వగల, నింకుచు నిందున్కి యెఱుకఁ జొప్పడక
యేను జచ్చుటయును నేర్పడ వినక, భానుకులాగ్రణి ప్రాణముల్విడుచు
నింతచేసినచేత లేమియుఁగాక, నంతయుఁ జెడిపోవు నధిపుకార్యంబు
ఎడపక నిటమీఁద నీదైత్యుతోడఁ, గడఁగి కయ్యము సేయఁగలవాఁడఁగాను
దనుజుతోఁ బోరాడి దర్పించి గెలుతు, నని తలంచిన గెల్వ నదిగానరాదు
అని నిశ్చయముచేసి యాత్మలో మున్ను, దనుజుతోఁ బోరుట తగవు గాదనుచు
నెలఁతను దర్శించి నిష్ఠతోఁ బిదపఁ, గలకార్యములు సేయఁగలవాఁడఁగాని
అనిసేయ నిది సమయము గాదు నాకు, నని ధీరుఁడై యుండె నామ్రానిమీఁద
మఱియు రావణుఁడు కామంబు ప్రేమంబు, వెఱపును నొఱపును వెఱగును గదుర
నాడినమాటల కన్నిటికాత్మ, నోడక యతినిష్ఠురోగ్రవాక్యముల
వనితలందఱు విన వసుధాతనూజ, తను దూఱఁబల్కిన దనుజేశుఁ డంతఁ
గుటిలభావమువ భ్రూకుటిలసన్నిటల, చటులరక్తాస్యుఁడై జాజ్వల్యమాన
లోలకీలాభీలలోకసంహార, కాలాగ్నిరీతి నాగ్రహమున నుండి
ఘోరహుంకారుఁడై క్రూరుఁడై నీతి, దూరుఁడై యాసీతఁ దొడరి భర్జించి
చంద్రహాసం బెత్తి జానకినేయ, నింద్రారి గమకించు నెడఁ గేలుఁ బట్టి

### మండోదరి రావణునికి నీతిఁ దెల్పుట

యమలమందోదరి యడ్డమై నిలిచి, కొమరొప్పఁ బలికె నాకులతి యావిభుని
దండిమై నెదిరిన ధరణిపాలకుఁడె, ఖండింప నీకు నీకాంత దైత్యేశ
యెన్ని చెప్పిన విన వేమి సేయుదును, నిన్ననఁ బనియేమి నీపురాకృతము
మ్రుచ్చిలి పరసతి మనుఁ దెచ్చుటొకటి, చెచ్చెఱ భువి నిందఁ జెందుట రెండు
తెగువతోఁ దుతఁ బట్టి తెచ్చిన మొదలు, పగఁగొని యుండు టేర్పఱుపఁగా మూఁడు
ఒనర దుర్బుద్ధి నాయువిదను గూడి, యనుభవించెద నను టారయ నాల్గు
కనుత్తమస్త్రీలఁ గడఁగి పల్మాఱు, వినరానిపల్కులు వెసఁ బల్కుటేను
గాదు మఱపలేక కామినిఁ జంపఁ, దామదినెంచుట దనుజేశ యాఱు
తగవెంచనేర కింతయుఁ జేసి తుదిని, మగఁటిమివోపుల మఱియును నేడు
నేడు చేటులు నర్యొ నీయింతివలన, నేడు గడపఁగరాదు నిజముగా నెన్నఁ
బోరిఁ బాతకంబుల పుట్టయీ మేను, దొరఁగిన సద్గతి దొరకునె నీకు
నభిమానవతి మానవాంగనసీత, కభిలాషపడి యింత కలుగంగ నేల
నీయంతిపురమున నెలఁతలలోన, నీయింతి చింతింప నెవ్వారిఁ బోలు

ననుఁ గూడి క్రీడింపు నాథ యీచెంత, నినువంటివానికి నీతి గాదెందు
బొలిసెనే నీబుద్ధి పోపొమ్మటంచుఁ, బలిమిఁ దొలంగించెఁ బతికేలువాలు
కడు సిగ్గుపడి చాల కలుషించి సీత, కడనున్న దుష్టరాక్షసవధూజనుల
నతిదీర్ఘతనుల భయంకరాకృతుల, సతతనిష్ఠురవాక్యసమరకర్కశుల
వినతనయోముఖి వికట హేమాస్య, యనుదాని హరిజట యనుదానిఁ ద్రిజట
ప్రఘసమహోదరిఁ బాటించి పిలిచి, లఘువృత్తిఁ బలికె నిర్లజ్జుఁడై నిలిచి
ప్రియనయోక్తులచేత బెదరించియైన, భయదచేష్టలనైన బాధించియైన
మాసద్వయంబున మగువ నాసొమ్ము, చేసి తెం డిటుమీరు సేయలేకున్న
నంతటిమీఁద నయ్యబ్జాక్షిఁ జంపి, యింతలింతలు కండ లిందఱు గొనుఁడు
అని యశోకారామ మాప్రొద్దు కదలి, తననగరికిఁ బోయె దనుజవల్లభుఁడు
అపుడు జానకి దానవాంగనలెల్లఁ, గృపమాలి తమతమకృతకవాక్యముల
బోధించి రావణుఁ బొందు మీవనుచు, బాధించుతఱి శూలపాణియై యొక్క
రక్కసి బెదరించి రాముఁ డీలంక, దిక్కు చూడఁగ లేఁడు తెలివ యాయాస
విడుమంచు నొకయింతి వెడనీతిఁ బలుకు, నిడుములఁ బడియుండ నేల నీకిట్లు
వరియించు దానవేశ్వరునిఁ గాదేని, పొరిగొందు నని యొక్కపొలఁతి భర్జించుఁ
దెందు ఖడ్గము తల తెగఁగొట్టి దీని, కండలు కమ్మగాఁ గల్లుతో నద్ది
చవి చూత మని యొక్క జంతమారొలయు, నవునవు నటు సేయుఁడని యోర్తుపదరుఁ
నీరీతిఁ బెదరింప నిందీవరాక్షి, ధారణీతనయ కొందలమంది కుంది
కన్నీరు దొరుగఁ గద్గదకంఠ యగుచుఁ, దన్ను గాఱించు దైత్యస్త్రీల కనియెఁ
దలఁప మానవులకు దానవులకును, గలుగునే దాంపత్య గౌరవశ్రీలు
ఇందఱు దుర్భాష లిట్లాడనేల, చంద్రునిఁ బాయని చంద్రికవోలె
భానుని బాయని ప్రభయును బోలె, నేను శ్రీరఘురాముఁ నెడఁబాయఁజాల
నానృపాలుఁడు దీనుఁడైనను రాజ్యహీనుఁడైనను నాకు నిష్టదైవంబు
జలధికన్యకరీతి శర్వాణిభాతిఁ, బలుకుఁదొయ్యలిమాడ్కిఁ బౌలోమిమాడ్కి
రోహిణిచరణి నరుంధతికరణి, స్వాహాంగనాగతి సావిత్రిమతిని
రతిచందమునఁ బతివ్రతనిష్ఠఁ బొదలి, పతియైన రఘురాము భజియించుదానఁ
జంపిన జంపుఁడు శాతాసి శిరము, తెంపినఁ దెంపుఁడు ధృతి రాముఁగాని
యితరుల నేనొల్ల నిటువంటికల్ల, మతముల నేనొల్ల మానుఁ డింకనిన
మందుచు వార లామాటకు మిగులఁ, గండక్రొవ్వునఁ బెక్కుగతులఁ గాఱింప
ధూళిధూసరితయై తూలి లోదారి, నీలాహిఁబోలిన నెఱివేణి చెదర
నేలపైఁ బడి వేఁడినిట్టూర్పునిగుడ, హాలక్ష్మణా యంచు హారామ యనుచు
హాయత్త కౌసల్య యనుచు నెల్గెత్తి, యాయుత్తమాంగన యార్తియై సేడ్చె
అంత నాత్రిజటయు నవనితనూజ, సంతాప మటుఁ జూడఁజాలక తొలఁగి
నేలకొని యొకచోట నిద్రించి లేచి, కలఁగని రాక్షసకాంతలఁ జూచి
యొకకలఁ గంటినే నోయింతులార, ప్రకటించి చెప్పెదఁ బాటించి వినుఁడు

రాముఁ డేనుఁగు నెక్కి రాఁజూడఁగంటి, సౌమిత్రి భృత్యుఁడై చనుదేరఁ గంటి
నామహాగజముపై యవనీతనూజ, కోమలి నెక్కించుకొని పోవఁ గంటిఁ
బట్టాభిషిక్తుఁడై బ్రహ్మాదిసురలుఁ, గట్టిగాఁ గొల్వ రాఘవుఁ డుండఁ గంటిఁ
గమనీయ మగుపుష్పకముమీఁదనుండి, భ్రమసి రావణుఁ డుర్విపైఁ గూలఁ గంటిఁ
గూలినరావణుఁ గ్రూరాసి యొకతె, నీలాంబరముతోడ నెత్తిఁ జేరఁగంటి
చేరి రావణుతల ల్చెలువేది కూల్చి, భూరిగార్ధభములఁ బూనినరథము
నందు గ్రమున వైచి యామ్యదిక్కునకుఁ, గొందలపడి యెత్తుకొనిపోవఁ గంటి
గురుతరోష్ట్రము నెక్కి కుంభకర్ణుండు, తిరమేది దక్షిణదిశ కేఁగ గంటిఁ
దనరారు తోరణతతులతోఁ గూడ, వనధిలోపల లంక వడిఁ గూలఁ గంటి
నతికాయ మకరాక్షు లాయింద్రజిత్తు, ప్రతనవిక్రము లుర్విపైఁ గూలఁ గంటి
గనకపీఠంబుపైఁ గారుణ్యమూర్తి, యొనర విభీషణుం డుండంగఁ గంటి
రావణుమరణంబు రఘురాముజయము, నీవిధంబున సిద్ధ మిటమీఁద నింక
నటుగాన మీర లీనవనీతనూజఁ, బటుదుష్టభాషల భర్జింపవలదు
తొలఁగిపొం డనవుడుఁ దొలఁగి నిద్రించి, యలసి రాక్షసభామ లందఱున్నంత
నాసమయంబున నవనీతనూజ, గాసిల్లి భయశోకకంపిత యగుచుఁ
దన్ను రెన్నెలలకు దయమాలి చంపు, నన్న రావణుమాట లందందఁ దలఁచి
శోకంబు గ్రమ్మ నశోకంబుఁ గొమ్మ, యాకొమ్మ యూఁతగా నటు లేచి నిలిచి

రాక్షసస్త్రీలబాధలకు జానకి వలపించుట

లోలత నడవులలో నొంటిఁబడిన, బాలికయునుబోలెఁ బలవింపఁ దొణఁగె
అక్కటా దైవంబ యదయత నన్ను, నిక్కడఁ జెఱఁబెట్టి యిటు లేఁచఁదగునె
ఖలదైత్యుచేఁ జావఁ గలవు నీవనుచు, నలినసూతి లిఖించినాఁడో నానొసటఁ
గాకున్న మఱి దండకావనంబునకుఁ, గాకుత్స్థకులుఁడు రాఁ గారణం బేమి
పైఁడిమృగంబు నా భ్రమియింపనేల, వీఁడిటు చెఱఁదెచ్చి వెతఁబెట్టనేల
నాకేమి చింతింప నాకూర్మివిభుఁడు, లోకరక్షణకళాలోలమానసుఁడు
రాకేందువదనుండు రామచంద్రుండు, నాకుఁగా ఘోరకాంతారమధ్యమున
సౌమిత్రియును దాను జాలిమై దూలి, యేమి గాఁగలవాఁడో యెట్లున్నవాఁడో
యెన్నఁ డాఘనశౌర్యుఁ డిటకెత్తివచ్చు, నిన్నిచదైత్యుల నెన్నఁ డుక్కణఁచు
దుది నన్ను నెన్నఁడు దోడ్కొనిపోవు, నది యెన్నఁటికి గూడు నది యెట్లుపొసఁగు
నీదురాత్మునిచేత నిటు చచ్చుకంటె, చేఁదు మ్రింగుట మేలు చేఁదును నాకు
వాలినదయ నిచ్చువా రిందు లేరు, హాలక్ష్మణాగ్రజ హాధర్మనిరత
నీకైన యేకపత్నీత్వంబు నేఁడు, చీకాకుపడి హత్యచేఁ జచ్చుననుచు
గెరలెడు తనదీర్ఘకేశపాశముల, నురిపెట్టుకొని చావ నూహించె నంత
అలోన నెడమకన్నదరె నాసతికి, వాలుమీనులచేత వనజంబువోలె
వలపుఁదెమ్మెరచేత వనలతఁబోలెఁ, బొలఁతికి మఱి వామభుజమును నదరె
నయ్యెడ మదహస్తిహస్తంబుపోలెఁ, దొయ్యలి దాపలితొడయును నదరె

శుభసూచకంబు లీచొప్పున నడువ, నిభరాజగమన యయ్యెడఁ జెంపుమాని
జనకుని శ్రీరామచంద్రుని నతని, యనుజుల నత్తల నటఁ దలంచుచును
దనుజులచేతిబాధలఁ జాల నలసి, తనదిక్కు లేమికిఁ దరళాక్షి వగవ
సుదతిచిత్తములోని శోకంబు మాన్ప, నిది నాకు తఱి యని యిచ్చఁ జింతించి
రవికులక్రమమును రాముపౌరుషము, వివిధభంగుల వేడ్క వినుతిసేయుచును
మానిమీఁదనె యుండి మారుతాత్మజుఁడు, వానరభాష గీర్వాణభాషయును
ఈనాతి యెఱుఁగునో యెఱుఁగదో యనుచు, మానవభాషల మగువ కిట్లనియె
ఓమహీనందన యోపుణ్యసాధ్వి, యీమెయి శోకింప నేటికి నీవు
మగువ నీవిభుఁడు నేమముగ నున్నాఁడు, జగదేకనిధి రామజనపాలవిభుఁడు
వనధి బంధించి రావణు సంహరించి, నినుఁ దోడుకొనిపోవు నిక్క మీపలుకు
సహజన్ముఁడైన లక్ష్మణుఁడు తఱ గొలువ, మహనీయమహిమతో మాల్యవంతమున
నున్నాఁడు కపిసేన లొగి ననేకములు, తన్నర్థిఁ గొల్వఁగా దశరథాత్మజుఁడు
అనవుడు నిది యెక్కడియాకాశవాణి, యని శింశుపావృక్ష మవనిజ చూడఁ
బన్నిన నీలాభ్రపటలంబులోనఁ, గ్రొన్నెలగతి మెఱుంగును బోలెఁ జూడ
సన్నమై యామ్రానిశాఖలనడుమ, నున్నమర్కటరూప మొయ్యనఁ గాంచి
కలలోనఁ బ్లవగంబుఁ గంటి నేననుచుఁ, గలఁగి యాకలకీశు కాకుత్స్థజులకుఁ
గాకుండుఁ గాకంచు ఘనుల దేవతల, నాకాంత గొనియాడి యటఁ దెలివొంది
కంటకాసురకోటి గాఱించుకతనఁ, గంటికి నిదుర నేఁ గాన రేవగలు
గాన నిద్దురలేని కల యెందుఁ గలదు, వూని యింకొకసారి పోలంగఁ జూతు
నని తనవదనాబ్జ మల్లన నెత్తి, హనుమంతు మఱియును నందంద చూచి
యెందుండి వచ్చెనో యీమ్రానిమీఁది, కెందును గడుచిత్ర మిది యెక్కడికోఁతి
చెలువొప్ప నరుఁడు భాషించుచందమున, నలినాప్తకులము నానాథు నేమంబు
నలవడఁ దెలుపుచు నమృతంబులొలుకఁ, బలుమాఱు ప్రియములు పలుకుచున్నదియు
వానరజాతి కీవార్తలు గలవె, నానావిధంబుల నాకుఁ జింతింప
కడఁగి రాక్షసమాయగాఁబోలు ననుచుఁ, బడఁతి యూరక యుండెఁ బ్రతిభాష లుడిగి
అనిలనందనుఁ డంత నవనీతనూజ, మనసులోఁ దన్ను నమ్మమిఁ జూచి యెఱిఁగి
యాతరువటుడిగ్గి యతిభక్తియుక్తి, నాతికి దండప్రణామము ల్సేసి
కరములు మోడ్చి యోకల్యాణి నన్నుఁ, బరికింపు మేను నీపతిగూర్చుబంట
జనపతి నీకు విశ్వాసంబు పుట్టు, నని యిచ్చి పుత్తెంచె నంగుళీయకము
అని చూపి మ్రొక్కిన నవనీతనూజ, హనుమంతుఁ గనుఁగొని యతని కిట్లనియె
అడరెడుదనుజమాయల ననుకలము, నుడుకులఁబడి వ్రేగుచుండుదుఁగాన
ననఘాత్మ రఘురామునంగుళీయకము, గనియు విశ్వాసంబు గలుగదు నాకు
నీవెవ్వఁడవు మఱి నీకుఁ బేరేమి, భూవరునకు నీకుఁ బొందెటు లయ్యె
ఇనకులాధిపువేష మెట్టిది యతని, యనుజుండు సౌమిత్రి యతఁ డెట్టివాఁడు
గాకుత్స్థుఁ డిప్పు డెక్కడ నున్నవాఁడు, నీకు నేమని చెప్పి నిన్నుఁ బుత్తెంచె

నీచందమున వచ్చి తీవార్ధి దాఁటి, నాచిత్త మూరడ నాతోడఁ జెప్పు
మనియొప్ప నడిగిన నవనినందనకు, హనుమంతుఁ డంతయు నటఁ జెప్పఁదొణఁగె

### హనుమంతుఁడు సీతకుఁ దనజన్మము దెల్పుట

వనజాక్షి వాయుదేవతవరంబునను, ఘనుఁడు కేసరి యను కపికులాగ్రణికి
ననుఁ బుత్త్రుఁగా నంజనాదేవి గనియె, హనుమంతుఁ డనుపేర నమరినవాఁడ
వసుధ సుగ్రీవుఁడ న్వానరేంద్రునకు, నసమానమతి మంత్రినై మెలంగుదును
ఆతనిరాజ్యంబు నాతనిపత్ని, నాతనియగ్రజుం డగువాలి గొన్న
మద మేది నలుగురుమంత్రులు దాను, నది మొదల్ ఋశ్యమూకాద్రిపైనుండఁ
బటుసత్త్వమునఁ బేర్చి పఙ్క్తికంధరుఁడు, కుటిలుఁడై నిన్నెత్తికొని పోవునపుడు
ఒదవిన యాక్రోశ మూరక వినుచు, సుదతి నిన్దల లెత్తి చూచుచుండితిమి
నెలఁత యప్పుడు మము నీవును జూచి, తొలఁగక నీమేనితొడవులు పుచ్చి
నీవస్త్రమునఁ గట్టి నేలపై చుటయు, నావేళ సుగ్రీవుఁ డవి పుచ్చి దాఁచి
యచ్చుగా రఘురాముఁ డట నిన్ను వెదుక, పంపాసరోవరతీరభూమి
దాను తమ్ముఁడు నుండుతఱి నంత నర్కసూనుండు వారల జూచిర మ్మనుడు
నే నేఁగి రాముని నెఱిఁగి యేతెంచి, భానుజు రామభూపాలుఁ గాన్పించి
యన్నరనాథున కర్కనందనుఁడు, కన్నసొమ్ములు సూపి కడుభక్తి మ్రొక్క
నాతొడవులఁ జూచి హర్షించి రాముఁ, డాతని నిజశత్రు డగువాలిఁ జంపి
యుపకారశీలుఁడై యొప్పుసుగ్రీవుఁ, గపిరాజ్యపదమునఁ గర మొప్ప నిలిపె
నతిభక్తి సుగ్రీవుఁ డంత రాఘవునిఁ, బతియుఁగా నిజభృత్యభావంబు మోచి
అక్షీణబలధన్యులైనవానరుల, లక్షల రెండేసి లక్షలకపుల
గర్వాంధు లగుదైత్యకటకంబు లరసి, యుర్వీతనూభవయున్నచోటెఱిఁగి
మసలక నెలలోన మరలి రండనిన, నసమునఁ గపు లేఁగి రన్నిదిక్కులకుఁ
బటుశక్తి దక్షిణభాగంబు వెదక, నిటు నంగదుఁడు మొద లేము కొందఱము
చనుదెంచి పెక్కుదేశంబులు వెదకి, నినుఁ గాననేరక నివ్వెఱగంది
శోకింప నరుణునిసుతుఁడు సంపాతి, మాకు లంకాపురిమార్గంబుఁ జూపెఁ
జూపుటయును నిన్నుఁ జూడ నర్థించి, యేపునఁ బఱతెంచి యే నబ్ధి దాఁటి
మఱి యంత సూర్యాస్తమయమున నితరు, లెఱుఁగకుండగవచ్చి యీలంకఁ జొచ్చి
విలసిల్లు నామహావేషంబు దాఁచి, పొలవక నిన్నెల్లచోటుల వెదకి
యెందును గాడగాన కిటు లేఁగుదెంచి, యిందు నిన్ దర్శింప నేర్పడఁ జూచి
రవికులోత్తముఁడైన రామునిదేవి, యవునొకో కాదొకో యని విచారించి
స్పృష్టీశుచే విన్నచిహ్నంబు లెల్ల, దృష్టించి పిదప సందేహంబు వాసె
వలనేది యిప్పుడు వచ్చి రావణుఁడు, తలఁకక మిముఁ బల్కుతఱి నున్నవాఁడ
ఘనశక్తి వానితోఁ గయ్యంబు చేసి, యని వానిఁ జంపెద నని విచారించి
పూని నిన్ దర్శించి పొందొంద నీకు, నీనాథు సేమంబు నిజముగాఁ జెప్పి
దనుజుఁ బిమ్మటఁ జంపఁ దలపోసి కాని, వనిత నాప్రాణము ల్వంచించి కాదు

అనిచెప్పి రఘురామునలవుప్రాయంబు, కనుఁగవచెలువంబు గళముసోయగము
నగుమోముకళయును నఖములతీరు, నెఱిబుజంబులబాగు నెరికొనులాగు
వెడఁదఱొమ్ముబెడంగు పీనులరంగు, నడలయందంబును నాభిచందంబు
ఘనజఘనము పెంపు కరములకెంపు, తనువులక్షణమును దప్పక చెప్పి
యాశౌర్య మాధైర్య మాబ్రహ్మచర్య,మాశాంతి యాదాంతి యామహాక్షాంతి
యాశక్తి యాయుక్తి యాపితృభక్తి, యాశీల మాలీల లన్నియుఁ జెప్పి
రూపించి లక్ష్మణురూపెల్లఁ జెప్పి, యాపుణ్యుఁ డంగుళీయక మప్పుడిచ్చె
నిచ్చినఁ గైకొని యిపుడు ప్రాణములు, వచ్చెఁగా యనుచు నెవ్వగ నూఱడిల్లి
రాముఁ జూచినకంట రాము రాగిల్లి, సేమ మేర్పడ భద్రసింహాసనమునఁ
బ్రేమతోఁ గూర్చుండఁబెట్టినకరణి, నామణిముద్రిక నక్కునఁ జేర్చి
యనురక్తి నర్ఘ్యపాద్యము లిచ్చినట్లు, కనుఁగవ హర్షాశ్రుకణములు దొరుఁగ
ధూపంబు దీపంబుఁ దోడ్తోడ నొసఁగి, యేపార సాష్టాంగ మెఱఁగినపగిదిఁ
బులకించి తిలకించి పొలఁతి మూర్ఛిల్లి, తెలిసి యాహనుమంతుదెసఁ జూచి పలికెఁ
గపివంశవర్య రాఘవకార్యధుర్య, యుపకారనిరత లోకోన్నతచరిత
పవమానసుత నాకుఁ బ్రాణదానంబు, తవిలి చేసితి నీకుఁ దగఁ జేయలేను
గాకుత్స్థతిలకంబుకరుణ నీవింక, నాకల్పముగ నుండు మనుచు దీవించె
నలఘువిక్రమశీలుఁ డగువాయుసుతుఁడు, చెలువ జానకిఁ జూచి చేతులు మొగిచి
హరునకునైన నింద్రాదులకైనఁ, బరమేష్ఠికైనను బడయఁ జొప్పడని
నీకృప వడసితి నినుఁ జూడఁగంటి, నా కింత చాలదె నలినాయతాక్షి
అనిన సీతాదేవి యనిలజు వెండియును, మనుజేశుసేమంబు మఱఁదిసేమంబు
మనమార నడుగుచు మమత రెట్టింప, ననఘాత్మ రఘురాముఁ డభిరామబలుఁడు
ననుఁ నెడఁబాసియున్నాఁడె ధైర్యమున, ననుజుండు దానును నప్పటప్పటికి
దయ నన్ను దలఁతురే దండెత్తి యిటకు, రయమున వత్తురే రణకాంక్ష ననిన

హనుమంతుఁడు సీతతో శ్రీరాములక్షేమము దెల్పి శిరోరత్నము గొనుట

వినవమ్మ నీప్రాణవిభునిసేమంబు, నినుఁ బాసినది మొదల్నిత్యవేదనల
నేలపైఁ బవళించు నిద్రయెఱుంగఁ, డోలి మాంసాహార మొల్లఁడెన్నఁడును
వాసిమై దండకావనములో నిన్ను, మోసపోవుట లెంచు మోమురవాంచు
నిట్టూర్పు నిగుడించు నించుఁ గన్నీరు, నెట్టన మూర్ఛిల్లు నేలపైఁ ద్రెళ్లుఁ
దెలివిమై లేచు నల్దిక్కులు చూచు, గలఁకు నివ్వెఱగందుఁ గళవళంబందు
హాసీత హాసీత యని ప్రలాపించు, నాసుమిత్రాపుత్త్రుఁ డది చూచి వగచుఁ
గావున మీర లిక్కడ నుండువార్త, వేవేగ నాచేత విన్నంతఁ గదలి
నాకంటె ఘనులైన నగచరాధిపుల, భీకరాకృతుల నభేద్యవిక్రముల
నగశృంగతరుసంఘనఖముఖాయుధుల, నగణితబలుల దేవాంశసంభవుల
సుగ్రీవ నల వాలిసుతు లాదియైన, యుగ్రవీరులఁ గూడి యుదధి లంఘించి
యెల్లభంగుల వచ్చు నింతి నీవిభుఁడు, తల్లి నిన్గొని యయోధ్యాపురి కేఁగు

రాముచే రణమున రావణుఁ డీల్గు, నీమదికోర్కులు నీకు సిద్ధించు
నైన సీతడ వేల యఖిలైకమాత, యేను నావీఁపున నిడికొని ప్రీతి
నాదవినగడఁకతో నుదధి లంఘించి, యుదయవేళకుఁ బోదు సుగ్రీవుకడకు
విచ్చేయు మనవుడు వెలఁది వాయుజుని, సచ్చరిత్రమునకు సంతోషమంది
యోసమీరాత్మజ యోపుదు వీవు, నీసత్త్వ మిట్టిది నిజము చింతింప
ననఘాత్మ యేఁబెండ్లి యైనది మొదలు, జనలోకనుతు రామచంద్రునిఁ గాని
పోలువేరఁగా నన్యపురుషాంతరములఁ, గలలోన నైనను గదిసి యేనెఱుఁగ
నీనీచమతి నన్ను నిటఁదెచ్చుచోట, వీని నంటుట కేను వ్రేగుచుండుదును
వెఱవక బలిమిమై వీఁడంటెఁగాని, మఱి యన్యపురుషుల మది నంట నేను
నానాథునకు నీవు నమ్మినబంట, వైనను నిను నెక్కి యరుదెంచు టొల్ల
తనదేవి మ్రుచ్చిలి దైత్యుండు చనిన, నినకులుం డారీతి నేతెంచె నండ్రు
ఇది విచారముగాదె యినకులేశ్వరుఁడు, గాదలేక మును చిత్రకూటంబునందు
నొకనాఁడు తనతోడ నొఱగి నిద్రింపఁ, గ్రకచోగ్రముఖ మొక్క కాకంబు చేరి
చంచుపుటంబునఁ జనుఁగవనడుమ, పొంచి చించిన రక్తపూరంబు దొరఁగఁ
గాకుత్స్థతిలకుఁ డొక్కఁడ నిద్రఁదేరి, కాకంబుపై నిషీకము ప్రయోగింప
నదియు బ్రహ్మాస్త్రమై యఖిలలోకైక, విదితోగ్రశక్తిమై వెనువెంట నంట
నాకాకి యేకాకియై యెందుఁ దిరిగి, కైకొని తనుఁ గావు కావు మటంచు
మరలి క్రమ్మఱఁ దనపదములఁ జొచ్చుటయు, శరణాగతత్రాణచరితుండుగాన
దాని నేత్రము నిజాస్త్రమున కిప్పించె, నానిమిత్తంబుగా నలినాప్తకులుఁడు
నాటి నాపై ప్రేమ నాటియస్త్రంబు, నేటికి మఱచెనో యిది హెచ్చరింపు
పదివేలభంగుల బాధలకోర్చి, పదినెలల్గడపితిఁ బతిఁ బాసి యేను
నాయున్కిఁ జూచితి నాపాటుగంటి, యేయుపాయంబుల నిందోర్వరాదు
ఉడుగనివగలతో నొక్కొక్కదినము, గడచు టొక్కొకవార్ధి గడచుట నాకు
నరనాథు మదిలోన నామీఁదఁజాలఁ, గరుణపుట్టెడునట్లుగా విన్నవింపు
మాతండ్రి జనకుండు మహిమీఁదఁ దన్ను, నే తెఱంగున వీరుఁ డితఁ డని నమ్మి
తనకు నిచ్చినఁ దెచ్చి తగదు నన్విడువ, నని యేను బల్కితి నని పల్కు మీవు
విలసిల్లు కల్యాణవేదిపైనుండి, వలనొప్ప నగ్ని దేవరసాక్షిగాఁగఁ
గరమొప్ప నన్నెల్లకాలంబు విడువ, నుసి రక్షించెద నని తెచ్చి నన్ను
నరయ కుపేక్షించి యనదఁగాఁజేసె, పరికింపుఁడని విన్నపము సేయు మనఘ
తనయింతి నొకనిచేఁ దాఁ గోలుపోయి, మన నిచ్చఁ జేయుట మగపాడిగాదు
అటుగానఁ దన కిది యపకీర్తిగాన, ఇటు విన్నవించితి నింతయే కాని
కలఁగక నామనోగతులప్రాణంబు, లొలసి తన్నేఁడ బాయకున్నది యనుము
చతురాత్మ మఱి నీవు సౌమిత్రిఁ జేరి, యతనితో నొక్కమాటాడుము తెలియ
ననుఁ దల్లిగాఁ జూచు నాపాటుఁ జూడ, తన కెన్నిభంగులఁ దగ దని చెప్పు
వావిరి దండకావనములోఁ బరము,పావనుఁడగు తన్ను పలికినఫలము

కుడిచితినని చెప్పఁ గొదవలేకుండ, తడయకుముని తెల్పు దయబుట్టఁ జెప్ప
నవసరోచితముగా నంగదుతోడ, రవిజుతోఁ దక్కు మర్కటకోటితోడ
వినయమ్ముల్వాలికి యెవ్విధినైన వారి, నినకులులను వేగ నిటకుఁ దోడ్తెమ్ము
మిక్కిలి తెగువమై మీరాక తెలిసి, యొక్కమాసము చూతు నుండలే నవల
ఈలోన రఘురాము నెబ్భంగినైన, వాలాయముగఁ దెమ్ము వడి నింకఁ బొమ్ము
అని సీత పల్కువాక్యము లెల్లఁ దెలియ, విని హనుమంతుండు విమలుఁడై పలికె
అవుఁగాక చెప్పెద నన్ని కార్యములు, నువిద నీమదిలోన నూరడు మింక
నచ్చుగా రఘురామునంగుళీయకము, తెచ్చి యొప్పించితి దేవి నీకర్థి
ధరణిజ రిక్తహస్తంబులతోడ, మరలుట దూతధర్మము గాదు నాకు
అతివ ముద్రారత్న మానతి మ్మనిన, నతనితోఁ దెలియ నయ్యవనిజ పలికె
నీవు విచారింప నిసుమంతగాని, లేవు సముద్ర మేలీల దాఁటితివి
యారూఢబలవిక్రమాస్పదంబయిన, నీరూప మెట్టిదో నిజముగాఁ జూపు
మేను నీనిజరూప మేర్పడఁ జూచి, కాని నాతలమానికము నీకు నీను
అనిన నాహనుమంతుఁ డాకాశ మెల్లఁ, దన మేను నిండ నుద్దండుఁడై పెరిగి
మాలతీమల్లికామాల్యమై మెడకు, నాలోలతరతారహారమై కటిని
గలధౌతమయఘంటికాదామ మగుచుఁ, దళుకుచుక్కలపిండు తన మేననలమ
నతిభీషణాకారుఁడై నిల్చుటయును, నతివ చిత్తములోన నతిభీతిఁ బొంది
యసమానగాత్ర యోయంజనాపుత్ర, వినువకి నీరూపు వెస దాఁచు మనుచు
హనుమంతుఁ గొనియాడి యతని దీవింపఁ, దనవిశ్వరూపంబు తగఁజూచి సురలు
వినుతింప నది దాఁచు వెన్నుండువోలె, ననిలజుఁ డెంతయు నలఁతియై నిలిచె
నిలిచిన హనుమంతు నెమ్మిమైఁ జేరఁ, బిలిచి లోఁగొంగున బిగియంగఁ గట్టి
యున్నశిరోరత్న మొయ్యన విడిచి, యన్నాతి ప్రీతిమై నవుడొసంగుటయు
వనితశిరోమణి వలనొప్ప నంది, కొని మ్రొక్కి సీత వీడ్కొని వేడ్క నరిగి
పంతంబు తానింక పంక్తికంఠునకు, నింతటఁ దనరాక నెఱిఁగింతు ననుచుఁ
దల్లి నేనాఁకొంటిఁ దనరఁగ వనము, నెల్లెడ ఫలములు నేను గైకొందు
ననవుడు సీత యాహనుమంతుఁ జూచి, యనె రాక్షసావలి యల్ల కాపుండుఁ
గ్రమ్మి రాలినపండ్లు క్రమముతో నములి, పొమ్ము వేగ యటంచుఁ బొందుగా ననుపఁ
దనమదిఁ గొండొకతడవు చింతించి, వనభంగ మొనరించువాఁడునై పెరిఁగి
తొడలందుఁ బొడము వాతూలఘట్టనలఁ, బడుగుఁబేకయుఁ బోలెఁ బడ మహీజములు

## హనుమంతుఁడు అశోకవనమును జెఱుచుట

ఆనిత్యమతి యశోకారామభూమి, మానైనహర్మ్యము ల్మహిఁ గూలఁ దన్ని
యొనర కేళీగృహంబులు నుగ్గుఁ జేసి, వనమహీరుహములు వడి నేలఁ గలిపి
కొమ్మలు ఖండించి కుసుమము ల్రాల్చి, కమ్మతేనెలు చల్లి కాలువ ల్చెఱిచి
పూవుఁదీఁగెలు ద్రెంచి పొదరిండ్లు చదిపి, బావులు గలఁచి దోర్బలకేళిఁ దేలి
కలకంఠబకబిసకంఠికాక్రౌంచ, కలహంసశుకశారికామయూరాది

వనపతు లార్తరావములతోఁ బాఱ, వనపాలకులు భీతి వడి మేలుకాంచి
హనుమంతునేతకు నగ్నులై మండి, యనుపమకరవాలహస్తులై కదియఁ
దనపేరు తనరాక తనపరాక్రమము, వినఁ జెప్పి శ్రీరామవిభుమూర్తి బంట
నొక్కొక్కరాక్షసు నుద్దండవృత్తి, నొక్కొక్కతరువుతో నొగిఁ గూలనేసి
ప్రథమసంగరకళాప్రారంభుఁ డగుచుఁ, బృథివిపైఁ బీనుఁగుపెంటలు గాఁగ
భూరిసత్త్వంబులఁ బొలుపొందువారి, వీరుల నెనిమిది వేలరాక్షసులఁ
బవమానతనయుఁ డప్రతిముఁడై వేర్చి, యవలీలఁ దెగటార్చి యార్చినఁ జూచి
యేపటి ధృతి దూలి యినవంశుదేవి, కాపున్నఘోరరాక్షసభామ లరిగి
రావణు లోకవిద్రావణుఁ గాంచి, దేవ నేఁ డొకకోఁతి తెగువమై వచ్చి
తొలితొలి వైదేహితో మాటలాడి, కలగొన వనమెల్లఁ గాసిలఁ బెఱికి
వెనుదన్ని యెనిమిదివేలరాక్షసుల, వనపాలకులఁ జంపి వ్రాలుచున్నాఁడు
వాఁడు రాఘవుఁ దంప వచ్చినవాఁడు, కాఁడేని యాసీత గాపుగా నున్న
తరు వొక్కటియుఁ దక్క తావకవనము, కరమల్గి పెఱుకంగఁ గారణం బేమి
వాని తెఱంగేమి వైదేహి నడుగఁ, దానెఱుంగ నటంచు దాఁచుచున్నదియు
నావుడు నల్గి దానవలోకవిభుఁడు, రావణుఁ డుగ్రనిగ్రహదృష్టిఁ జూచి
దీప్తాగ్రనిర్గతదీప్తశైలంబు, లై పావకజ్వాల లతులఁ దొరుఁగఁ
దనకింకరులఁ బంచె దండి రాక్షసుల, నెనుబదివేవుర నిద్ధవిక్రములఁ
బనిచినఁ బనిపూని బలియులై వారు, ధనురస్త్రశూలముద్గరభిండివాల
ఘనగదాకరవాలకలితులై వేర్చి, యనికి సన్నద్ధులై యార్చుచు వెడల
నంత సూర్యోదయం బయ్యె నొంటయును, నెంతయుఁ గడఁకతో నేపగ్గలించి
యకలంకగతిఁ బర్వతాకారుఁ డగుచు, మకరతోరణమెక్కి మారుతాత్మజుఁడు
తనుఁదాఁకి శస్త్రాస్త్రతతుల నొప్పించు, దనుజవీరులఁ జూచి దర్పించి పలికె
నోరి రాక్షసులార యుర్విపై నేను, శూరత విలసిల్లు సుగ్రీవుబంట
రామునిదూత నారాముపేరుంబు, భూమిజతోఁ జెప్పి పోవుచున్నాఁడ
హనుమంతుఁ డనువాఁడ నతిబలాధికుఁడ, ననతనూజునిమంత్రి నేవాయుసుతుఁడ
పూని లంకాపురంబున నున్నమగల, కేనంతకుండనై యింట వచ్చినాఁడఁ
జెడఁగోరి నన్నేల చెనకెద రనుచు, వడిఁ జేర్చి యాధీలవాలంబునందుఁ
బదులనూఱులవేల బలియుఁడై పట్టి, త్రిదశారివరుల బంధించి బంధించి
యారూఢవిక్రమాహవకేళిఁ దేలి, తోరణస్తంభంబుతో వ్రేసివ్రేసి
పూని యొక్కనినైనఁ బోరిలో బ్రదికి, పోనీక నిశ్శేషముగఁ జంపివైచె
నంతలో ఫణిహారు లసురారికడకు, నెంతయు భీతులై యేతెంచి మ్రొక్కి
దనుజేశ విను కోఁతి తనదువాలమున, నెనుబదివేవుర నేపుమైఁ జంపి
మలయుచు నున్నాఁడు మకరతోరణము, తలదన్ని రణబలోదగ్రుఁడై యనిన
నాపంక్తిముఖుఁడు కాలాంతకుపగిదిఁ, గోపించి పింగళాక్షుని దీర్ఘజిహ్వు
వక్రనాసుని నక్షవతుని వైరి, చక్రభీకరుఁడైన శార్దూలముఖుని

వేవేగ రప్పించి వీరులై మీఱ, లావానరునిఁ దెగటార్చి రండనుచుఁ
బనిచిన నేవురు ప్రబలసైన్యములు, గొని రథారూఢులై క్రూరులై వెడలి
పరువడి నార్చుచుఁ బవనజుఁ దాఁకి, శరవృష్టిఁ బొదివినఁ జలియింప కాతఁ
డాతోరణంబుపై నార్చుచుఁ జేర్చి, వాతూలసుతుఁ డేఁచి వాలమంకించి
రథముల విఱిచి సారథుల నుగ్గాడి, రథతురంగంబుల రణవీథిఁ ద్రుంచి
వారణంబులఁ గూల్చి వాజుల గెడపి, యారాక్షసులసేన నట రూపుమాపి
ధరణికి లంఘించి తనదువాలమున, నురుశక్తిగళముల నుఱిగా బిగించి
యురువడి కనుగ్రుడ్లు నుఱికంగఁ ద్రిప్పి, నురుఁగక వక్రనాసుని వ్రేసి చంపెఁ
జంపి యంతటఁబోక సమయనికినుక, దెంపుసొంపును బెంపుసొంపు దీపింపఁ
బెడపెడ నార్చుచుఁ బిడుగునకంటె, బెడిదమై కనుపట్టు పిడికిటిచేతఁ
బుడమిపై నురురక్తములు గ్రక్క గూల, వడి నశ్వవక్షునివక్షంబు పొడిచె
పొడిచి బాహాగర్వమున మేఱలేక, కడఁకఁ గనుంగొని కఱకురాక్షసుల
మొగిద్రుంచి శార్దూలముఖులలాటంబు, పగులంగ గదద్రిప్పి పడవైచి చంపె
నటుచంపి క్రోధాగ్ను లందందనిగుడఁ, గుటిలరాక్షసకులక్షోభంబుగాఁగ
గ్రూరుఁడై పింగళాక్షుని తోఁకఁ గట్టి, కారాకుసుడిగాలి గడువడిఁ ద్రిప్పు
తీరున వాని దిర్దిర మింటఁ ద్రిప్పి, తోరణస్తంభంబుతో వ్రేసి చంపె
వాని నిమ్మైఁ జంపి వరశక్తియుక్తి, పూని దానవసైన్యములఁ జొచ్చి కలఁచి
యురవడి దీర్ఘజిహ్వుని వచ్చి తాఁకి, యురుముష్టిసంహతి నుర్విపైఁ గూల్చి
యాలోనఁ బవనజుఁ డసమానవిజయ, లోలుఁడై వానినాలుక వీకి చంపె

**హనుమంతునిమీఁదికి రక్తరోముఁడు మొదలైనరాక్షసుల రావణుఁడు పంపుట**

నంతఁ దక్కినదైత్యు లటఁ బాఱిపోయి, యంతయుఁ జెప్పిన నద్దశాననుఁడు
సోమించి నిజమంత్రిసుతులైనరక్త, రోముని శతజిహ్వు రుధిరలోచనుని
స్తనితహస్తుని శూలదంష్ట్రు దుర్ముఖుని, ఘనుఁడగు నవ్యాఘ్రముఖునిఁ బిలిచి
యిది యొక్కవానరుఁ డేచి రాక్షసులఁ, బొదివి పెక్కండ్రఁ జంపుచు నున్నవాఁడు
ఆమర్కటునిఁ జంపుఁడని పూని పనుప, నామహాబలగర్వు లార్చుచు వెడలి
చతురంగబలము లసంఖ్యలు గొలువ, నతులరథారూఢులై పేర్చి వచ్చి
మకరతోరణముపై మేఱలేకిట్లు, నకళంకుఁడై యున్న హనుమంతుమీఁద
వరదివ్యశస్త్రాస్త్రవర్షము లురియఁ, బరమపావనుఁడైన పవమానసుతుఁడు
అప్పు డాదైత్యులయస్త్రశస్త్రములు, దప్పించుకొనుచును దను దాఁకకుండఁ
దననఖాగ్రంబుల దంతకుంతముల, ఘనపాదకూర్పరకరఘట్టనములఁ
జెలరేఁగి వడి మహాశిలల వృక్షముల, బలముల నలుగడఁ బఱపి నుగ్గాడి
కంఠీరవంబును గజములపైకిఁ, గుంఠితగతిఁ దాఁకి కుప్పించుకరణిఁ
బటుమాంసమస్తిష్కవారము ల్చెదర, కుటిలోగ్రనఖములఁ గుంభముల్వ్రచ్చి
లేళ్లపైఁ బులి చౌకళించినపగిదిఁ, ద్రుళ్లుగుఱ్ఱములఁ దోడ్తో రూపుమాపి
జంతుపారణసేయు జమునికైవడినిఁ, బంతంబుతోఁ గ్రాలు బలము మాయించి

కులశైలములఁ దాఁకి కులిశాయుధంబు, పెళపెళధ్వనులతో భేదించినట్లు
బలువిడి రథములపైకి లంఘించి, పొలుపార రథసంఘములు నేలఁ గలపి
రథులఁ జెండాడి సారథుల నుగ్గాడి, పృథుశక్తియుక్తిమైఁ బెఱికి వేఁటాడి
మునుమున్న రక్తరోముని నేలఁగూల్చి, స్తనితహస్తునిఁ ద్రుంచి శతజిహ్వునణఁచి
రుధిరాక్షుఁ జంపి దుర్ముఖు విదారించి, కదనవిక్రము వ్యాఘ్రకబళు ఖండించి
శూలదంష్ట్రు వధించి శూరత మించి, కాలపాశాభీలకరవాలుఁ డగుచు
నురవడి నిబ్బంగి నొక్కొక్క తెగువ, తరమిడి పెలుచ నుద్దండరాక్షసుల
బలములతోఁ గూడ భస్మంబుఁ జేసి, తలఁకక మారుతాత్మజుఁ డున్నఁ జూచి
పోరిలో నిలువక పోయినవారు, వారిచావులు చెప్ప వడి కోప మెచ్చి
యటఁ బ్రహస్తునిపుత్రుఁ డగుజంబుమాలిఁ, జటులప్రతాపసంచలితాంశుమాలిఁ
గుటిలారిపర్వతక్రూరదంభోళిఁ, బటుబాహుబలశాలిఁ బనిచె రావణుఁడు
పనిచిన నాదైత్యపతికి మ్రొక్కుచును, ననురక్తి రక్తమాల్యాంబరోదగ్ర
సమరోగ్రశస్త్రాస్త్రసన్నద్ధుఁ డగుచు, నమితరథారూఢుఁడై యేఁగి యపుడు
శింజినీటంకారసింహనాదములఁ, గంజజాండము హల్లకల్లోలముగను
హరిఁ దాఁకు నున్మత్తహస్తిచందమున, నరుదైనకడిమిమై హనుమంతుఁ దాఁకి
కెరలి మేఘము మహాగిరిఁబోలె దివ్య,శరవృష్టి గురిసినఁ జలియింప కతఁడు
పెనుశిల దైత్యుపైఁ బెఱికి వైచుటయుఁ, గని దాని శరగశకంబుచేఁ దునిమి
హనుమంతు వదనాబ్జమర్ధచంద్రాస్త్ర,మున నొంచి పదిబాణముల బాహుయుగము
నాటించి యొకశక్తి నడునెత్తి పగుల, మేటియై యేసిన మిగుల రోషించి
పవమానతనయుండు బాహుదర్పమున, నవలీల నొకసాల మగలించి వైవ
నాలుగమ్ములఁ దాని నడుమనె త్రుంచె, నాలోన హనుమంతుఁ డాదైత్యురథము
పదములఁ బడఁ దన్ని పట్టి దంష్ట్రములఁ, గదిసి విచారించి గర్జించి వ్రేసి
పొదివి మహావాలమున నశ్వసమితిఁ, జదిపిన విరథుఁడై జంబుమాలియును
బలుకయు నడిదంబు బలువిడిఁ గొనుచు, నలవు పెంపును గూడ నార్చుచు వచ్చి
పవమానతనయునిఫాలంబు వ్రేయ, నవశుఁడై మూర్ఛిల్లి యంతలోఁ దెలిసి
పిడుగుతో సరిపోలు పిడికిటఁ బొడిచె, పొడిచి భంగముఁ జేసి పోనీక కదిసి
యొడిసి కైదువఁగొని యుగ్రుఁడై కదిసి, తడయక యాదైత్యుతలఁ ద్రవ్వనేసె
ధృతిదూలి యతఁ డుర్విఁ ద్రెళ్లెఁ ద్రెళ్లుటయు, హతశేషు లతనిపాటంతయుఁ దెలుపఁ
గడుఁజోద్యమంది రాక్షసమంత్రివరులఁ, దడయక పిలిపించి తగఁ గొలువిచ్చి
దనుజనాథుఁడు గొంత తడవు చింతించి, యనిమిషేంద్రునినైన నాజిఁ గైకొనని
యలఘువిక్రము విరూపాక్షు యూపాక్షుఁ, గలహదుర్ధరుభాసకర్ణాఖ్యుఁ బ్రఘసు
నదయులఁ బంచసేనాగ్రనాయకులఁ, గదనకర్కశుల నొక్కటఁ జూచి పలికె
నేలోకముననైన నిల్ల మర్కటులకు, నీలావు గలదె వీఁ డెవ్వఁడో తెలియ
రాదు మీరేవురు రణబలోదగ్రు,లై దర్పమేర్పడ నాత్మ నేమఱక
యగణితసైన్యసహాయులై వానిఁ, దెగువమై నిటఁ బట్టి తెండు పొం డనిన

వారును బహురథవారణతురగ, వీరదైత్యులతోడ వేవేగ కదలి
ప్రాగ్గిరిపైనుండు భానుండుపోలె, దిగ్గగనాంతరదీప్త తేజమునఁ
దోరణం బెక్కి బంధురదైత్యవరుల,తో రణం బొనరింప దొరఁకొనువాని
ననిలసూనుని దాఁకి యవనియు దిశలు, చినుగంగఁ గూగుచు సింహనాదముల
నందఱు దివ్యశస్త్రాస్త్రముల్గురియ, నందులో దుర్ధరుం డను పేరువాఁడు
ఐదుబాణంబుల ననిలజునురముఁ, ఛేదించుటయు రోషభీషణుం డగుచు
కపివీరుఁ డార్చి యాకసమున కెగయ, నపుడు దుర్ధరుఁ డంత నతనితో నెగసి
విలునారి సారించి విలయకాలోగ్ర,జలదంబుకై వడి శరవృష్టి గురియ
నాయుగ్రశరవృష్టి నడచి వాయుజుఁడు, నాగొడఁ బొడవుగా నట మింటి కెగసి
వడివడిఁ బఱతెంచి వానిపైఁ బడినఁ, బొడిపొడియై కూలెఁ బుడమి రక్కసుఁడు
అదిచూచి యావిరూపాక్ష యూపాక్షు, లదయులై ముద్గరహస్తులై కదిసి
యాకసంబున నిల్చి యార్చి పేర్చుటయు, నాకిరువలిపట్టి యటఁ దాను నెగసి
వారితోఁ బోరాడ వారును నతని, ఘోరముద్గరములు గొని వ్రేయుటయును
జగతిపైఁ బడి లేచి సాలభూరుహము, నగలించి మఱియును నార్చుచు నెగసి
చిక్కనిభుజశక్తిఁ జిరచిరఁ ద్రిప్పి, యొక్కదెబ్బనె వారి నుర్విపైఁ గూల్చె
భాసకర్ణుండును బ్రఘసుండు నంత, నాసమీరాత్మజు నదరంటఁ దాఁకి
పటుశూలపట్టిస ప్రహతుల నొంప, నట రక్తసిక్తాంగుఁడై వాయుసుతుఁడు
కోపించి మిక్కిలి కులశైలసదృశ, మాపర్వతం బెత్తి యసురులమీఁద
ద్రొక్కక వైచినఁ జూర్ణమై పడిరి, రక్కసులు వడగంటఁ గూలుచందమున
వాయునందనుఁ డంత వారిసైన్యముల, నాయంతకుఁడువోలె నణఁగించె నపుడు
పడుశిరుల్ చెడుహారుల్ వ్రఱచు కాల్బలము, కడతేఱు తేరులు కలఁగుశూరులును
మడియు మహారథుల్ మ్రగ్గుసారథులు, పొడియైనశస్త్రము ల్వ్రాలినయస్త్రములు
కడికండలైన చక్రప్రాసములును, మడిసినగుఱ్ఱముల్ మ్రగ్గుకాల్బలము
కూలెడుమావుతుల్ గ్రుంగురావుతులు, తూలెడుగొడుగులు త్రుంగుపడగలు
పఱచు నెత్తురుటేర్లు బహుమాంసములును, నఱుక్రమ్ము భూతంబులై రణంబొప్ప
క్షణమాత్రమున వారిఁజంపి వాయుజుఁడు,రణకాంక్ష మఱి నుండి తోరణ మెక్కియుం
బంచసేనాగ్రజుల్ ప్రంచత్వమొంది, రంచును హతశేషు లయ్యెడఁ దెలుప [దెం

హనుమంతునిమీఁదికి అక్షకుమారుఁడు వచ్చుట

రాక్షసపతి యంత రణబలోదారు, నిక్షుచాపాకారు నిర్ధవిచారు
నక్షీణదోస్సారు నసహాయశూరు, నక్షకుమారు మహావీరుఁ జూచి
యలవుమై నాశీతి ననిలోనఁ జంపి, తలగోసి తోరణస్తంభంబునందుఁ
గట్టి రమ్మనవుడుఁ గడఁకతో నతఁడు, నెట్టిన శస్త్రాస్త్రనిచయంబుతోడఁ
దురగాష్టకముతోడ ధ్రువగతితోడ, బిరుదుటెక్కెముతోడ బృథుకాంతిఁబొదలి
యుదయార్కనిభమైన యొకరథం బెక్కి, కదలి భూభాగంబు గంపింప నడచె
నరదంబుమ్రోఁతయు హయహేషితములు, కరిబృంహితములు రక్కసులయార్పులును

దనుమహాకార్ముకధ్వనియు నొండొండ, ఘనములై యాకాశావకాశముల్నిండఁ
దోరణారూఢుఁడై తొలఁగక చెలఁగు, మారుతి నక్షకుమారుండు దాఁకి
త్రిజగముల్బీతిల్ల దిశలు ఘూర్ణిల్ల, భుజశక్తి పుంఖానుపుంఖంబు గాఁగ
ఘనబాణతతుల నక్కజముగాఁ బొదువ, నని మొన మఱి బాలుఁడని యెంచరాదు
ఘనపరాక్రమకళాఖని వీఁడటంచు, హనుమంతుఁ డచలుఁడై యాబాణతతుల
వాలముఖంబున వడిఁ ద్రుంచివైవ, మేలని హనుమంతు మెచ్చుచు వాఁడు
బాణత్రయంబునఁ బావనిశిరము, శోణితంబులు గార సూటి నేయుటయు
కీలాలధారలు కిరణముల్గాఁగ, బాలభానుఁడువోలెఁ బరఁగఁ జూపట్టి
యాలోనఁ బ్రళయకాలాగ్నియై మండి, తాలస్పృశమున రథ్యములు ద్రుంచుటయు
నేలపదాతియై నిలిచి వాఁ డతని, ఫాలంబు శరములఁ బదియింట నొంప
నవశుఁడై తెప్పిరి యతఁడు వాలమునఁ, దవిలించి యక్షునితనువు నొప్పింప
నక్షుండు గదగొని యనిలతనూజు, వక్షంబు వ్రేసిన వడిఁ దూలి తెలిసి
కదిసి యగ్గదఁ బుచ్చి కడుపడినేయ, బెదరి వాఁడొకవింటఁ బెట్టొనరించి
తప్పించుకొని వియత్తలమున కెగసె, నప్పుడు పలుకయు నడిదంబుఁ గొనుచు
నలవుమై నంతలో నావాయుసుతుఁడు, తొలగక నాదైత్యుతోడ నే యెగసి
గదవ్రేయుటయుఁ జూచి ఖడ్గమంకించి, గద రెండుతునుకలుగా వ్రేసి డాసి
తొడలు వ్రేయుటయు వాతూలనందనుఁడు, పుడమిపైఁ బడి నభంబునకు బిట్టెగసి
ఖగనాథుఁ డురగంబు కబళించినట్లు, లాగి వానిచరణంబు లొడిసి రాఁ దిగిచి
తెగువఁ గుమ్మరసారెతీరునఁ ద్రిప్పి, జగతిపై వ్రేసిన జనమెల్లఁ దూలి
పొలుపరి తలనున్న బొమిడికమూడి, కలభూషణము లుర్విఁ గనుకని చెదరఁ
గుండియ పగిలి ప్రేగులువాతదొట్టి, కండ లెల్లెడ రాలి కనుగ్రుడ్లు చెదరి
యగలి యద్దానవునంగంబులెల్లఁ, బగిలి నెత్తురు గ్రక్కి ప్రాణము ల్విడిచె
వానిచావటుచూచి వాసవాద్యమరు, లానందభరితాత్ములై తన్నుఁ బొగడ
నంత నాహనుమంతుఁ డసమానవిజయ,వంతుఁడై యార్చి దుర్వారుఁడై యుండ
చెదరినదనుజు లచ్చెరువుగాఁ బాఱి, త్రిదశారిసభఁ జొచ్చి దీనులై నిలిచి
బలియుఁ డావానరపతిబాహుబలము, తలఁప నచ్చెరువెందు దానవాధీశ
పొలిసిరి వనపాలపుంగవు ల్గింకరులు గీటణంగి రారూఢవిక్రములు
శతజిహ్వుఁడును గూలె శార్దూలముఖుఁడు, గతజీవుఁడయ్యెఁ బింగళనేత్రుఁ డీల్గె
స్తనితహస్తుఁడు చచ్చె శార్దూలకబళుఁ, డనిఁ ద్రుంగె మృతుఁడయ్యె నట జంబుమాలి
సోమించి వక్రనాసుఁడు ముగ్గె రక్తరోముండు లయమయ్యె రుధిరాక్షుఁ డణఁగె
దళములతో శూలదంష్ట్రుఁడు మడిసెఁ, జెలువేది మది దీర్ఘజిహ్వుండు దెగియె
రూపఱిపోయె దుర్ముఖుఁడు దుర్ధరుఁడు, ప్రాపించె మరణంబు ప్రఘసుఁడు పడియె
నుఱుమయ్యె భాసకర్ణుండు యూపాక్షుఁ, డొరిగె విరూపాక్షుఁ డుసురుతోఁ బాసె
నక్షుండు దెగటారె హతుఁడయ్యె నశ్మ,వక్షుండు మడిసె దుర్వారసైన్యములు
ఇంక నావానరు నింద్రాదిసురలు, శంకింప కనిమొన సాధింపలేరు

ప్రళయాంతకునినైనఁ బట్టి నిర్జింపఁ, జలమెక్కి యసమానసత్త్వుఁడై వాఁడు
నావుడు వెఱఁగంది నాకారి వగల, భావించి యక్షునిఁ బలవింపఁ దొడఁగె
హాకుమారక యక్ష హావీరవర్య, హా కపిచే నీవు నణఁగితే యనుచుఁ
దలఁకుచుఁ బలవించుతండ్రినిఁ జూచి, తొలఁగక యింద్రజిత్తుఁడు చేరి పలికె

ఇంద్రజిత్తు తండ్రి నూఁగార్చి హనుమంతునిపైకిఁ బోవుట

దేవ నీకేటికి ధృతి దూలి వగవ, నావానరాధము నవలీలఁ దాఁకి
వారక యటఁ జంపి వచ్చెద నొండె, ధీరత నిటఁ బట్టి తెచ్చెద నొండె
నావిని తనయగ్రనందనుఁ జూచి, రావణుఁ డనియె ధైర్యస్ఫూర్తి నిగుడఁ
జిరకాల మమరేంద్రుఁ జెఱఁ బెట్టినావు, పరఁగుమాయారణప్రౌఢుండ వీవు
నాకంటె విక్రమోన్నతి మించినావు, నీకెన రెవ్వరు నిఖిలలోకముల
నసమున నటులయ్య వానరేంద్రు, నపుడుగా వదలక నాత్మ నేమఱక
బహుదివ్యబాణప్రభావముల్ చూపి, సహజశౌర్యంబున జయముఁ గైకొనుము
అనఁ దండ్రివీడ్కొని యామేఘనాదుఁ, డనఘార్కసంకాశ మగురథం బెక్కి
యగణితనిజధనుర్జ్యాఘోషమునకుఁ, బొగిలి దిగ్గజకర్ణపుటములు పగుల
జగములు బెదర దిక్చక్రబంధములు, పగుల నార్చుచు వచ్చి పవనజుఁ దాఁక
నాసమయంబున నమరులు మునులు, వాసవప్రముఖదిగ్వరులు కిన్నరులు
నుప్పరంబుననుండి యొదిగి వీక్షింప, నప్పంక్తికంధరు నగ్రనందనుఁడు
నడరి యాతనిదేహ మణుమాత్రమైనఁ, బొడకట్టకుండ నద్భుతశితాస్త్రములు
గురియ నయ్యస్త్రముల్ ఘోరపాలమునఁ, దరమిడి చదియుచుఁ దప్పించుకొనుచు
శరవేగ లక్ష్యగోచరుఁడుగా కిట్లు, దుర మొనరించె నద్భుతపౌరుషమున
రావణి నిర్జితైరావణి యంతఁ, బావని యసమానబలవేగమునకు
నరుదంది మఱియు దివ్యాస్త్రంబులేయఁ, బరువడి ఖండించి పవనజుఁ డతనిఁ
దరుశైలముల వైవ దర్పించి యతఁడు, శరములనాటి జర్జరితముల్ సేసెఁ
జేసినఁ గని యింద్రజిత్తుపై నలిగి, యాసమీరాత్మజుం డవలీలఁ దన్ని
మొనయుచు రథరథ్యములు నగ్గుసేయ, నని మొన విరథుఁడై యాయింద్రజిత్తు
హనుమంతుకడిమికి నచ్చెరువంది, వినుతోగ్రబలవాయువీర్యాస్త్ర మేయ
వాయుపుత్త్రుఁడుగాన వానరాధీశుఁ, డాయస్త్రమునఁ దూల కచలుఁడై యున్న
నరుదైన రౌద్రాస్త్ర మతనిపై నేయఁ, బెరిగి యాతఁడు రుద్రబీజంబుగానఁ
గదలక నిలిచినఁ గని యింద్రజిత్తు, మదిలోనఁ గోపించి మారుతిమీఁద
సురసిద్ధసాధ్యులు చూచి నిందింపఁ, బరమదుర్జయమైన బ్రహ్మాస్త్ర మేయ
నాయస్త్రరాజంబు నవనియు మిన్ను, రాయుచుఁ దనమీఁద రా వాయుసుతుఁడు
బ్రహ్మాస్త్రమునఁ బ్రాణభయము లేకుండ, బ్రహ్మచే వరములు వడయుటఁ జేసి
బలువిడిఁ బఱతెంచు బ్రహ్మాస్త్రమునకు, దలఁకక బ్రహ్మమంత్రము లుచ్చరింప
నది చంపఁజాలక యతని బంధించి, కుదియించి పడవైచెఁ గుంభినిమీఁదఁ
బడినమారుతిఁ జూచి పట్టుఁడు కట్టుఁ, డడవుఁడు పొడుఁ డంచు నఖిలరాక్షసులు

సుట్టుముట్టి కఠోరసూత్రజాలములఁ, గట్టిగాఁ గట్టిరి కట్టల్కనిగుడ
నంత నాహనుమంతుఁ డవశుఁడై యున్న, నెంతయు రయమున నింద్రారిఁ జేరి
నలువబాణంబుచే నాశంబుకాక, బలియుఁడై యటు పట్టువడియున్నయపుడె
యెనయ నీవానరుం డెవ్వఁడో వీని, ననిమొనఁ జంపరా దని నిశ్చయించి
అమితసత్త్వోన్నతుఁ డై పట్టితెచ్చి, తమతండ్రిముందఱఁ దడయక పెట్టఁ
దనమంత్రివరులును దాను వేర్వేఱఁ, దనయులావునకుఁ దద్దయు సంతసించి
కనుఁగవఁ బ్రళయాగ్నికణములు దొరుఁగ, హనుమంతుఁ జూచి యిట్లనియె రావణుఁడు
ఓరి వానరుఁడ నాయున్నపట్టణము, శూరత నొంటిమైఁ జొచ్చుట యెట్లు
నీ వెవ్వఁడవు మఱి నీకుఁ బేరేమి, యేవెరవున వచ్చి తీవార్ధి దాఁటి
హరుఁడు పంచినవాఁడో హరి పంచినాఁడో, పరమేష్ఠి నిన్నిటఁ బంచినవాఁడో
సురగరుడోరగాసురవియచ్చరులు, నరసిద్ధసాధ్యులు నాపేరు విన్న
వెఱతురు నీవిట్లు వెఱవక వచ్చి, తెఱఁగంటిదొరకైన దృష్టింపరాక
వఱలెడు నాపురి వంచనఁ జొచ్చి, పెఱికితి వనమెల్ల బీఱంబు మెఱసి
బహుగురక్కసుల దుర్బలులఁ గొందఱిని, మడియించితివి మేటిమగవాఁడవోలె
నిప్పు డీనేరంబు లిన్నియుఁ గాతుఁ, దప్పక నీరాక తగఁ జెప్పితేని
యనిన నాహనుమంతుఁ డద్దశకంఠుఁ, గనుఁగొని యెంతయుఁ గనలి యిట్లనియె

### హనుమంతుఁడు రావణునితో తనరాక యెఱింగించుట

ఓరి రాక్షస వినరోరి నీచాత్మ, దూరీకృతాచార దుష్టమానసుఁడ
విశదకీర్తులు మున్ను విశ్వంబు నిండ, దశరథేశ్వరునకుఁ దనయుఁడై పుట్టి
యరిగి విశ్వామిత్రుయాగంబు గాచి, హరువిల్లు విఱిచి మహాశక్తి మెఱసి
పరశురాముని బట్టి భంజించివిడిచి, ఖరదూషణాదుల ఖండించె మఱియు
నీపెంపు గుదియించి నినుఁ దోఁకఁ గట్టి, యేపున నిన్నబ్ధి నీడ్చినవాలిఁ
బోలుపార నొకబాణమునఁ గూలనేసి, బలియుఁడై సుగ్రీవుఁ బట్టంబుగట్టి
యక్షీణశక్తిమై నతులకోదండ, దీక్షాగురుం డనఁ దేజంబు మెఱసి
తగిలి రాక్షసకులాంతకుఁడైన రామ, జగతీశునిజదూత చతురమానసుఁడ
హనుమంతుఁ డనువాఁడ నర్కజుమంత్రి, నినవంశనిధి రాముఁ డిట నన్నుఁ బనుప
ముదమొప్పఁ బతివ్రేలిముద్రికఁ గొనుచు, నొదవినకడిమిమై నుదధి లంఘించి
వచ్చి నీపురిఁ జొచ్చి వైదేహి నరయ, నెచ్చటఁ బొడగాన కెంతయుఁ బోక
యవనిజ వనములో నారసి కాంచి, యవనీశుఁ డిచ్చిన యానవాలిచ్చి
దేవి నీపురినున్కి తెఱఁగొప్ప రామ, భూవరునకుఁ జెప్పఁబోవుచునుండి
యెనసి నారాక నీ కెఱిఁగింపఁగోరి, పెనిచిన వనమెల్లఁ బెఱికిపోవైచి
వనపాలు రగుదైత్యవరులఁ గింకరుల, నెనుబదివేవుర నేపుమైఁ గడఁగి
మడియించి మునుమిడి మంత్రినందనుల, మడియించి యక్షుని మడియించి పిదపఁ
దగిలి నీయున్నచందములెల్లఁ జూచి, మగిడిపోయెద నని మఱి పట్టుపడితి
నారాము నిజభృత్యుఁడైనసుగ్రీవు, భూరిసైన్యములలోఁ బోలుపు దీపింప

నలవుమై నాకంటె నతిబలాధిపులు, కొలఁదిఁబెట్టఁగరాని కోటు లున్నారు.
అనిమి బ్రహ్మాదులనైన సాధించు, మనయూతు లీవన్న మండుచుండుదురు
గొనకొని యావీరకోటులతోడ, వననిధి బంధించి వచ్చి రాఘవుఁడు
లంకపై విడిసి చలంబు పెంపెక్కి, కిన్కమై నసురుల గీటణంగించి
నీతల ల్నుగ్గాడి నిను సంహరించి, సీతఁ దోడ్కొని సోఁపు సిద్ధ మీపలుకు
నెఱకొని నీవింక నీతిమార్గమునఁ, దొలఁగక బుద్ధిమంతుఁడ వైన వినుము
సీత నొప్పించి యాశ్రితశోకహారి, జాతంబు రఘురాము శరణంబుఁ జొరుము
వలవదు వైరంబు వసుధేశుచేతఁ, బోలి యుక నీప్రాణములు గాచికొనుము
అని బుద్ధిచెప్పిన హనుమంతుఁ జూచి, కనలుచుఁ బెంపు మొక్కలమును గదుర
ఘనఘనాఘనమేచి గర్జించినట్లు, తనియక భర్జించి దశకంఠుఁ డలిగి
వెఱవక జనుదెంచి వీఁడు నాయెదుట, నఱుగ్రమ్మి దుర్భాషలాడుచున్నాఁడు
కొనిపోయి చంపుఁ డీ కోఁతికీటకంబు, నని ప్రహస్తునిఁ బంప నసురేశుఁ జూచి
వినయభాషణుఁడు వివేకభూషణుఁడు, ననఘపోషణుఁడు మహామతిభీషణుఁడు
నావిభీషణుఁడు కార్యము దీర్ఘచింత, భావించి చూచి యేర్పడ విన్నవించె
మగువల బ్రాహ్మల మఱిబాలకులను, దగదు దూతలఁ జంప దనుజాధినాథ
వలనొప్పఁ బతిపను ల్వచ్చినమాత, లలవున్నమై నేమైన నాడుచుందురు
అది దూతలకు ధర్మ మని విచారించి, మదిలోనఁ గోపంబు మట్టు గావింపు
తుద దూత లెందు వధ్యులు గారుగానఁ, బోదివి యీకోఁతిఁ జంపుట పాటిగాదు
చలము కోపము రామసౌమిత్రులందు, వెలునరింపుము వీని విడిచిపోనిమ్ము
మగుడక కిన్క నీమదినుండునేని, దగినదండము కొంత దండించి పుచ్చు
మని నీతిచెప్పిన నతనివాక్యములు, విని రావణుఁగు దైత్యవీరులఁ జూచి
కోఁతులకెల్లను గుఱుతువాలంబు, బ్రాఁతిగా నటుగానఁ బ్రజలెల్లఁ జూడ
వీనివాలము గాల్చి వీథులఁ ద్రిప్పి, పోనిండు నావుడుఁ బోదివి రక్కసులు
బలుమోకు లాగిఁ దెచ్చి పవనజుఁ గట్టి, బలిమి చేతులుగాళ్లు బంధించి తెచ్చి
మనవారి పెక్కండ్ర మడియించినట్టి, చెనఁటకీటము లెస్స చిక్కెరా యనుచు
బురవీథులందుఁ ద్రిప్పుచు నంతకంత, వరుస తూర్యంబులు వాయించికొనుచు
నెల్లెందు మెలఁగ నయ్యెడ వాయుసుతుఁడు, కల్లరిదనుజుల కలయఁ గ్రేఁగంట
గనుఁగొంచు మఱియు లంకాపురంబెల్లఁ, గనుఁగొనుతలఁపున గాసికి నోర్చి
హీనసత్త్వుఁడుపోలె నిటునటు దిరుగ, నానావిధంబుల నగుచు రేఁగుచును
ఆబాలగోపాల మతని వెఱదగుల, నాటూమెలకుఁ బుణ్య లాత్మలో వగవఁ
దలకొని యెంతయు దైతేయవరులు, చలమునఁ జీర లసంఖ్యము ల్దెచ్చి
కాలసర్పాకృతు ల్గాతిరుల్దాల్చి, లోలత నవి నూనెలోఁ దోఁచి తోఁచి
యిది యశోకారామ మెల్ల ఖండించె, నిది దానవేంద్రుల నెందఱిఁ జంపె
దీనికిఁ దగుశిక్ష దేవారి పెట్టె, దీనిఁ గాల్పుఁ డటంచుఁ దెగువ నొండొరులు
నొదవిన లంకలో నుత్పాతహేతు, వుదయించె నని పేర్చుచున్న వాలమున

నచ్చలంబునఁ జీర లన్నియుఁ జుట్టి, చిచ్చుఁ దగిల్చి రచ్చెరువుగా మంద
దనుజులు సింహనాదములు సేయుచును, వెనువెంటఁ దగుల నావృత్తాంతమెల్ల
తప్పక దనుజకాంతలు చూచి పోయి, చెప్పిన నప్పుడు సీత శోకించి
యక్కటా నీతిజ్ఞుఁ డైన నీకిట్టి, యిక్కుపాటును గల్గెనే తండ్రి యనుచు
జలములు దడవి సుస్థలమున నిల్చి, చెలువొప్ప నగ్నికిఁ జేతులు మొగిచి
యారామవిభుఁడు ధర్మాత్ముఁడౌనేని, వారిధి నాకుఁగా వడి దాఁటునేని
యీరావణుని రాముఁ డిలఁ గూల్చునేని, వారక నే పతివ్రత నౌదునేని
జనకభూపతి సర్వసముఁ డగునేని, దనరు వేదములు సత్యము లగునేని
పవమానమిత్ర యోపరమపవిత్ర, సనకేకిశరదదోషాహ్రాదద్విరద
వరద వైశ్వానర వానరోత్తముని, పరమశీతలుఁడవై పాలింపవయ్య
యని సీత ప్రార్థింప ననిలసూనునకు, ఘనవాల మనుపేరి కాలాహితలను
గనుపట్టు మాణిక్యకళికన మెఱసి, యనలుండు కడుఁజల్లనై యుండె నంత
ఆవిధంబునకుఁ దా నాశ్చర్యమంది, పావని తమతండ్రి పావకసఖుఁడు
గావున నన్నగ్ని కరుణించె నొక్కొ, దేవతలెల్లఁ బ్రార్థించిరో రాము
దేవువిక్రమమొ యేదియుఁ గాదు సీత, దీవెన యిది యంచు తెలివిమైనుండి
ప్రవిమలసత్త్వైకపరులైనజనుల, భవపాశములు వీడు భావన దోఁప
బ్రహ్మమంత్రములు తప్పక యుచ్చరింప, బ్రహ్మపాశములూడెఁ బవనసూనునకు
అంత నాహనుమంతుఁ డసురేశులంక, యంతయుఁ గాల్పఁగ ననువు చింతించి
యలవడ దనకునై యగ్నిసూక్తములు, జలములలోఁ గ్రుంకి జపియింపవలయు
నని పోయి మునిగిన ట్లపరాంబురాశి, నినుఁ డస్తమించిన నేచి వాయుజుఁడు
కనకమహీధరాకారమై యొప్పు, తనమేనుఁ బెంచి బంధములెల్ల ద్రుంచి
కీడాచరించుచు గేలిసేయుచును, వేడుకతోఁ దన వెనువెంటఁ దిరుగు

హనుమంతుఁడు లంకఁ గాల్చుట

దనుజుల నిర్జించి దనుజేశుఁడున్న, ఘనమైన మేడ కుత్కూటముగా నెగసి
తనవాలవహ్ని లంతటఁ దరిగొల్పఁ, దనివి యంతంత కుదగ్రంబు లగుచు
భుగులున పొగలొప్పెఁ బొగలకుమున్నె, నిగిడి ఘన్మంటల నిండె నాకసము
నాకసమున మంట లడరి మండుటయుఁ, బైకొని యట మున్నె పర్వె నుల్కములు
అడరు నయ్యుల్కలకట మున్నెతొలఁగి, వడి దిక్కులకుఁ బాఱు వరవిమానములు
నప్పుడు హనుమంతుఁ డడరి యొండొండ, గుప్పించి మణికొల్వుకూటముల్గాల్చి
వరశస్త్రశాలలు వడి నీఱుచేసి, యిరవంద భండారపిండ్లను గాల్చి
పరువడి సౌధము ల్భస్మంబుఁ జేసి, సొరిది చప్పరములు చూర్ణంబుఁ జేసి
మణిచంద్రశాలలు మసిగా నొనర్చి, ప్రణుతశయ్యాగేహపటలి దహించి
రమణీయగజవాజి రథశాలలోలి, కమలిచి దగ్ధముల్గాఁ జేసె నపుడు
ఎడపక యెగసిన యెఱమంటతునుక, లుడుకక నుడువీధి నొండొండఁ బర్వి
ఖచరోరగామరగణవిమానములు, ప్రచురవిభాగైకపరతఁ జలింప

సొరిదిమై రావణాసురుచేటు దెల్పఁ, దొరగు నుల్కలయట్లు దోఁచెఁ బెల్లుగను
రాజన్యుఁడగు రఘురామభూపాలుఁ, డోజమై దండెత్త నుద్యుక్తుఁ డగుచు
బలువిడి లంకలోపలఁ బ్రతాపాగ్ని, యొలమిమై నిర్గమ మిడియెనో యనఁగ
దహనుండు నిర్భరధ్వనుల బ్రహ్మాండ, కుహరంబు నిండి మిక్కుటముగాఁ బర్వె
రావణుఁ డట ఘోరరణకళాకేళి, కావళుఁ డగుచు దిక్పాలుర నెల్ల
పఱచిన తొల్లింటిభంగము ల్మాఱు, పఱపక పోఁ డనుభంగిని నెగసి
బలసి విభీషణుభవన మొక్కటియు, వెలిగాఁగ పురమెల్ల వ్రేల్మిడిలోన
దరికొని మండునత్తఱి దైత్యవరులు, కరము భయభ్రాంతిఁ గంపించువారు
తలలును జీరలు దరికొని మండ, బలమీది నలుగడఁ బాఱెడువారు
తమతమవారలు తమబంధుజనులు, కమలుటఁ జూచి శోకము నొందువారు
హాహానినాదంబు లడరించువారు, సాహనుమంతుపై నలిగెడివారు
నావిష్ణుఁ డారాముఁ డతనికి నెగ్గు, గావించె నీపాపకర్ముఁ డన్వారు
అట్టికీ డొనరించినట్టిరావణుని, కిట్టియాపద వింతయే యనువారు
ననుచుండ నెంతయు నత్యుగ్రుఁ డగుచు, వనచరవీరుండు వడిఁ జెలరేఁగి
యొకచోటఁ దప్పక యుండ నాలంక, సకలంబు గాల్చి యుత్సవకేళిఁ దేలి
యెడపక పైవ్రాలు నెఱమంటతునుక, లుడుగక వ్రేయుచు నొగిఁ దూలి తూలి
సోలి సురాపానసుఖసుప్తి మునిఁగి, కాలుట యెఱుఁగక కాలెడువారు
నాయెడ మృదులశయ్యలయందు నిదుర, పోయి పోయినయట్ల బొందులు కమలి
తెలివికి నెడమీక తీవ్రాగ్నిశిఖల, మెలఁగి మిడుగలేక మృతిఁ బొందువారు
తమతమబంధులఁ దమవధూమణులఁ, దమతమబిడ్డలఁ దమప్రాణసఖులఁ
దమతమవారలఁ దగఁ దోడుకొనుచు, గుమురులుగట్టి యేఁగుచు మ్రగ్గువారు
తెగి యిండ్లసరుకులు దిగిచి తేఁబోయి, మగిడి రానేరక మ్రగ్గెడువారు
సతులఁ గౌఁగిటఁ జేర్చి సరి తెచ్చి తెచ్చి, ధృతిదూలి వాకిండ్లఁ ద్రెళ్లెడువారు
నైలంకఘూర్ణిల్ల నంతంతఁ గలయ, నాలోకభయదంబులై మీఱిమీఱి
యురుసింహములఁ బోలెఁ నుగ్రతఁ బట్టి, కరికుంభపదళనగతి మండిమండి
యోజ పెంపారు నాహుతులచందమున, వాజులమీఁదికి వడి దాఁటి దాఁటి
తగిలించు వరవిటోత్తములచందమున, మొగి కామినీకుచంబులఁ బ్రాకి ప్రాకి
భావించి యన్యులఁ బ్రహసించువారు, కైవడి నాలుకల్ గఱచియుఁ గఱచి
తగిలి సంతాపంబు దలకొన్నవారు, మిగిలి యుబ్బెడుగతి మిన్నందియుండి
బెలుకుఱి పఱతెందు భీతులపగిది, తొలఁగక నిగుడి గొందుల దూరి దూరి
వాలుచు నిబ్భంగి వాయునందనుని, వాలాగ్ని లోఁగి లంక వడిచుట్టుఁ గాల్చెఁ
గాల్చిన నుబ్బి దిక్పతులు దేవతలు, మేల్చుట్ట మితఁడని మెచ్చి తన్బొగడ
హనుమంతుఁ డంతట నంతరంగమున, జనకజభీతిమై శంకించి బెదరి
యీలంకతోఁగూడ నినవంశుదేవి, గాలిచెలిని గన్నుగానక క్రొవ్వి
యేనింక రఘురాము నేమని కాంతు, జానకినేమి మోసరణఁ దెల్పుదును

దప్పెఁ గార్యమటంచుఁ దల్లడంబంది, యప్పుడు తనమది నట వివేకించి
యేతల్లిదీవెన నీఘోరవహ్ని, నాతోఁక రోమమైనను గాల్ప వెఱచె
నట్టి సీతాదేవి కగ్ని చే భయము, పుట్టునే యిది యేటిబుద్ధి యటంచు
ధరణిజమదిలోనఁ దాపాగ్ను లార్పు, వెరవున వాలాగ్ని పయోధిలో నార్చి
వెస నశోకారామవీథికిఁ బోయి, యసురకాంతలు భయమంది వీక్షింప
దనుజకాంతలచేతఁ దనసేమమెల్ల, విని మున్నె సంతోషవివశయై యున్న
జనకపుత్రికి మ్రొక్కి సన్నిధి నిలిచి, తనపౌరుషములెల్లఁ దగ విన్నవించి
యిదె పోయి తెచ్చెద నినకులేశ్వరుని, మదిలోన నీవు సుమ్మలికంబు వలదు
అని యింకఁ బనివిందు ననుచు సీతకును, వినయంబుతో మ్రొక్కి వీడ్కొని కదలి
తడయక పశ్చిమద్వారంబునందు, వెడలుచు పావని వెసనేర్పు మిగిలి
తలుపులు వడఁ దన్నఁ దలుపులు విఱిగి, యిలఁ గూలె రాక్షసులెల్ల భీతిల్ల
నురవడి నాలుక యొకటఁ గంపింపఁ, బరవసంబున బేర్చి పదిలుఁడై వెడలి
వరుసతో నట్టిళ్లు వడిఁ గూలఁదన్ని, యలరి సువేలాద్రి నవలీల నెక్కి
కలయ లంకాపురిఁ గలదైత్యులెల్ల, బెలుకురి భీతిల్లఁ బెల్లార్చియార్చి
కడఁగి పానుపులు భగ్నంబులై యబ్ధి,చెడి కూలవడి మహాశిలలెల్ల డుల్ల
నంగదమైఁ బెంచి యద్రిశృంగములు, క్రుంగి కుంభినిఁ గ్రుంగఁ గుప్పించి దాఁటి
యటు దాఁటి బలువిడి యాకాశవీథిఁ, బటుసత్త్వదేహసంపద వచ్చి వచ్చి
యరుదైనపేర్మితో నబ్ధిమధ్యమునఁ, బరఁగు మైనాకుఁడను పర్వతాధీశుఁ
గని యందుఁ దనమేనఁ గలదప్పిఁ దీర్చుకొని పర్వతుని వీడుకొని యట వచ్చి
పొలుపొంద తనజవంబును పెంపుసొంపు, తలకొని జలధియుత్తరతీరభూమి
సలిసత్త్వసంపన్నుఁడై వచ్చి నిలువ, నతనిసంతోషచిహ్నములెల్లఁ జూచి
యంగదుఁ డాదిగా నగచరాధిపులు, సంగతి నెదురుగాఁ జని కౌఁగిలించి
ప్రకటించి యందంద పరిణామ మరసి, యొకచోట నందఱు నొలిఁ గూర్చుండి
పోయినకార్యంబు పొలుపొంద నడుగ, నాయున్నతోన్నతుం డందఱఁ జూచి
కపులార యేను మీకరుణమైఁ జేసి, యుపమింప నరుదైన యుదధి లంఘించి
యగణితవైభవం బగులంకఁ జొచ్చి, తగిలి శోధించి సీతాదేవిఁ గాంచి
యినకులాధిపుఁ డానతిచ్చినత్రోవ, జనకనందనతోడ సకలంబుఁ జెప్పి
యింతికి ముద్రిక నిరవంద నిచ్చి, యింతిశిరోమణి యిదె పుచ్చుకొనుచు
వచ్చితి నే నన్న వనచరాధిపులు, నిచ్చలో హర్షించి యింపు సొంపొంది
హనుమంతు నందఱు నన్నిచందములఁ, గొనియాడి కొనియాడి కోర్కులఁ దేలి
యున్నచో నంగదుఁ డురుపరాక్రముఁడు, క్రన్నన నుత్సాహకలితుఁడై పలికె
జనకజ మన మింక సాధించి తోడుకొనిపోయి రఘురాముఁ గూర్చుట లెస్స
యటుగాన నిప్పుడీయంబుధి దాఁటి, పటుపరాక్రముఁడైన పఙ్క్తికంధరుని
సుతులతో హితులతోఁ జుట్టాలతోడ, నతిరయంబునఁ జంపి యవనిజఁ గొనుచు
వత్తము లెండను వాలిసూనునకు, నత్తఱి ఋక్షేశుఁ డనియెఁ భావించి

మనల సుగ్రీవుండు మైథిలి వెనుకఁ, బనిచినపను లెల్లఁ బాపనివలన
ననఘాత్మ సఫలంబు లయ్యె నీమీఁద, నసమానధీరునితో నీవార్తఁ జెప్పఁ
బోవుట తగునన్న బుద్ధి నొండొరులు, భావించి దాని కేర్పడ సమ్మతించి
వనచరు లాఁడెల్ల వసధితీరమున, ననిలసూనుఁడు దాము నర్థితో నుండి
బహుమూలఫలములఁ బరితృప్తిఁ బొంది, మహితసత్త్వాధికు లమ్మునాఁడు కదలి
ధరణిపై మేరుమందరములకంటెఁ, బరమైన దర్దరపర్వతంబునకుఁ
జనుదెంచి యగ్గిరిసానుదేశముల, వనమూలఫలములు వడి నాస్వాదించి
యాయద్రిపతిమీఁద నారాత్రి నిలచి, యాయమితభుజబలు లంత వేగుటయు

అంగదాదులు మధువనంబునకు వచ్చుట

మన మింక సుగ్రీవుమధువనంబునకు, నెనసి యకడఁకతో నేఁగి యందఱము
తనివోవఁ దేనియ ల్త్రావకయున్న, మనదప్పి పోదని మది విచారించి
యినకులాధిపుపను లెల్ల సాధించి, చనియెద మటుఁగాన జలజాప్తసుతుఁడు
మనమీఁదఁ గోపించి మర్దింప వెఱచు, నని నిశ్చయముఁ జేసి యందఱుఁ గూడి
హనుమంతు నంగదు నపుడు ప్రార్థించి, యనుకూలముగ వారియనుమతి వడసి
యాతతబలులు మధ్యాహ్నంబుకాలంది, నేతెంచి మధువనం బేర్పుమైఁ జొచ్చి
దిక్కులవెదచల్లు తేనెతావులకు, గ్రుక్కిళ్లు మ్రింగుచు గునిసియాడుచును
గొనచెవు లిక్కించి కొక్కరింపుచును, గిసిసి యొండొరులఁ దర్కింపుచు వేడ్క
నెనయంగఁ దమతమ కిష్టంబులైన, వనభూములకుఁ బారి వనచరాధిపులు
ధీనిధుల్మఱి పువ్వుతేనియల్గుంటి, తేనియలును బుట్టతేనెలు నైన
పలుతేనె లొగిఁద్రావి ఫలములు నమలి, కలయఁబువ్వులు రాల్చి కాయలు డుల్చి
తలిరుకొమ్మలు ద్రుంచి తరుకోటి వంచి, మలయుచుఁ గొమ్మకొమ్మకు నూటి దాఁటి
యొలసి పూఁదీఁగెల నుయ్యెల లూఁగి, కోలఁకులఁ గ్రీడించి గూడి వర్తింప
నాలోన దధిముఖుఁ డనఁగ నావనము, పాలింపుచుండెడి ప్లవగుఁ డొక్కరుఁడు
అసమానకోపుఁడై యందఱఁ గిసిసి, పెసఁ దమ్ము భర్జించి వెడలిపొమ్మనుచు
వనపాలకులచేత వరుసఁ ద్రోయింప, వనచరు ల్వేసఁ బొఱి వారి వారించి
వడి నంగదుండును వాయునందనుఁడు, తడయక దధిముఖు ధరణిపై లీల
గెడపి పెట్టుక మోము క్రిందుగా నీడ్చి, పొడిచి త్రోచుటయును బొలుపేది వాఁడు
కోపించి మొఱపెట్టుకొనుచును బోయి, యాపద్మహితసూనునడుగుల కెఱఁగి
దేవదానవులకు దృష్టింపరాని, దేవ నీవనమెల్లఁ దెజంబు మఱిసి
పెనఁగొని వనచరు ల్పెక్కండ్రతోడఁ, జనుదెంచి యసమానసత్త్వులై కూడి
యామరుత్తనయుండు నావాలిసుతుఁడు, నీమధువనములోనికి నేఁగుదెంచి
తగిలి మ్రాఁకులు ప్రాఁకి తరుశాఖ లలమి, తిగిచి పండులు తిని తేనియల్గ్రోలి
యిది రాజవన మని యిచ్చ భీతిలక, కడయక యంతఁ గైకొనకున్నఁ జూచి
యెడపక జంకించి యేను మీయాన, పొడిచి త్రోచుటయును బొడిచిరి నన్ను
నని వాఁడు మొఱయిడ నలిగి సుగ్రీవుఁ, డెనసి మర్దింప నూహించినఁ జూచి

యంత నావృత్తాంత మంతయు నెఱిఁగి, సంతతజయశాలి సౌమిత్రి పలికెఁ
దొలఁగక యంగదాదులు మహాకపులు, నెలకొని సుగ్రీవ నీయొక్కవనము
తలఁకొకింతయు లేక తమయంతఁ జొచ్చి, నలిఁ దేనెఁ ద్రావుచున్నారని వినుము
ఆతతబలసత్త్వు లగువారిచేత, సీతాధిపతిపను ల్సిద్ధింపనోపుఁ
గావున్న నీయాజ్ఞ గడవ నోపుదురె, గైకొని పిలిపింపు కడఁకతో వారి
నని బుద్ధిసెప్పిన నర్కనందనుఁడు, తనబుద్ధి గైకొని దధిముఖుఁ జూచి
శ్రీరాముకార్యంబు చేసిరిగాన, వారిచేసినసేత వారికిఁ జెల్లె
నూరక యీశోక ముడిగి నీవింక, వారిఁ బుత్తెమ్మన వాఁ డంత నరిగి
హనుమంతు నంగదు నాజాంబవంతుఁ, గని మ్రొక్కి నాతప్పు గాచి మన్నించి
వనచరోత్తములార వడినేఁగుఁ డింక, వనములోపలనుండ వలవదు మీరు
మిమ్ము బుత్తెమ్మని మిహిరనందనుఁడు, నిమ్ముల నాకాన తిచ్చి పుత్తెంచె
ననువార్తఁ జెప్పిన నందఱు నుబ్బి, యినసూనునాజ్ఞకై యెదకొన్న వాలి
తనయుని నూరార్చి తడయక వేర్మి, వనచరాధీశులు వనభూమి వెడలి
యుప్పొంగుకడకల నుప్పరం బెగసి, యప్పుడు మేఘంబు లట్ల మ్రోయుచును
వారక చనుదెంచువారిచిహ్నములు, దూరంబులందు సంతోషించి చూచి
యినజుండు కపిసేన నెదురుగాఁ బంచి, యనురక్తి రప్పింప నర్థితో వచ్చి
జగదీశుఁ డగురామచంద్రు నంఘ్రులకు, నగచరు ల్దండప్రణామము ల్చేసి
తదనంతరంబునఁ దగ లక్ష్మణునకుఁ, బిదప సర్కజునకుఁ బ్రీతితో మ్రొక్కి

### హనుమంతుఁడు సీతను చూచిన తెఱం గెఱింగించుట

యందఱుఁ గొనివచ్చి హనుమంతు నపుడు, ముందఱ నిడికొని ముదము దీపింప
శ్రీరామచంద్రుని సింహాసనంబు, చేరువ నోలి యాసీను లై యుండ
వలనొప్పఁ దముపోయి వచ్చిన తెఱఁగుఁ, దలకొని వినఁగోరు ధరణీశుతలఁపు
హనుమంతుఁ డెంతయు నాత్మలో నెఱిఁగి, ఘనమైనభక్తితోఁ గరములు మొగిచి
కమలాప్తకులనాథ కంటి వైదేహి, ప్రమదాశిరోమణిఁ బరమకల్యాణి
ధరణీశ మీయాజ్ఞ తలమోచికొనుచు, నరుదైనదేశంబు లన్నియు వెదకి
చిరభక్తి సంపాతిచేఁ ద్రోవ యెఱిఁగి, యరిగి సముద్ర మే నవలీల దాఁటి
యొనర దక్షిణదేశమున మహామహిమఁ, దనరు త్రికూటాద్రిఁ దద్దయు నొప్పి
దానవకులపాలితం బైనలంక, యేనొక్కరుఁడ చొచ్చి యిల్లచో వెదకి
ధరణిజఁ గానక తద్దయు వగచి, యరిగి రావణునియుద్యానంబు గాంచి
పరికించి రాక్షసభామలు దన్ను, తిరిగి చుట్టుచునుండ దేవ మీ దేవి
యుపవాసముల డస్సి యొకమ్రాని క్రింద, విపులదుఃఖంబులవెల్లిలో మునిఁగి
చెక్కుటఁ జెయ్యూఁది చిత్తంబుచూపు, నెక్కొన్నవగలతో నీయందె చేర్చి
దనుజుండు చనుదెంచి తనుఁ దెచ్చుతెఱఁగు, తనదిక్కులేమికిఁ దలపోసి చూచి
యుడుగనికన్నీరు లున్నంతప్రొద్దుఁ, బడియు నిట్టూర్పులు వడిఁ బుచ్చిపుచ్చి
మాసినచీరతో మలినయై ధూళీ ధూసరితాంగియై తూలికై వ్రాలి

తలయూఁచి తలయూఁచి తలకొన్నవగలఁ, బలుమాఱు వ్రేఁగుచుఁ బలవింపఁ జూచి
మీనాక్షిచిహ్నము ల్మీఱ నాతోడ, సానతిచ్చినత్రోవ లన్నియుఁ జూచి
క్రమమున మఱి సీతగా నిశ్చయించి, కమలాక్షిఁ బిదప దగ్గఱఁబోయి మ్రొక్కి
తామరసాక్షితోఁ దగుమాటలాడి, లేమకు మీయంగుళీయక మిచ్చి
మగుడశిరోమణి మఱిఁబుచ్చుకొనుచు, మగుడక యారామమంతయుఁ బెఱికి
కమలాకరంబులఁ గలఁచి నిద్దలఁచి, కదులాక్షసుతుబాజ్ఞఁ గడుమది నెంచి
కరిబృందములఁబట్టి కలఁచుసింహంబు, తరి వనపాలకతతి రూపుమాపి
తరమిడి తమతండ్రి తలఁపు దీపింప, నరుదెంచినట్టి యాయక్షుయుఁ ద్రుంచి
చెలఁగి రాక్షసవీరసేనలఁ జంపి, యల యింద్రజిత్తుతో నచటఁ బోరాడి
రావణిచేఁ జిక్కి రాక్షసేశ్వరుని, కావర మణఁచంగఁ గడఁగి నే వాని
వరమందిరముఁ జేరి వలయువాక్యములఁ, బరువడి నేఁదెల్ప వాఁడు నన్గనలి
వాలమగ్నిఁ దగిల్చి వడి నేఁగు మనినఁ, గాలిచి లంకను గడువడిఁ గదలి
యగణితంబైనట్టి యంబుధి దాఁటి, మగుడ నిట గాంచఁగ మదిఁ దలపోసి
వచ్చితి నేనని వసుధాధిపతికిఁ, నచ్చుగా సతివియోగాగ్నికీలలకు.
మచ్చిది యననొప్పు మాణిక్య మిచ్చె, నిచ్చిన సారత్న మేర్పడఁ జూచి
యనురాగమున దాని నల్లనఁ బుచ్చుకొని డెందమునఁ జేర్చుకొని మూర్ఛఁబోయి
యొకకొంతప్రొద్దున కొయ్యనఁ దెలిసి, ప్రకటధైర్యంబునఁ బ్రాణము ల్నిలిపి
నృపతిబాష్పాకులనేత్రుఁడై చూచి, కపినాథు ననిలజుఁ గరమర్థిఁ బలికె
భానుజ నాప్రాణపదమైనయట్టి, మానినీమణిశిరోమణిఁ జూచినపుడె
నామది గరఁగుచున్నది లక్కవోలె, నీమణి మామామ కిచ్చె నింద్రుండు
యాగసంతృప్తుఁడై యఖిలంబు నెఱుఁగ, నాగుణనిధి జనకావనీవిభుఁడు
నట్టి యీమణి సీత యాఁదలవేడ్కఁ, గట్టి పెండ్లియునర్చెఁ గరమర్థి నాకు
నన్నులతలమిన్న యైనయాసీత, నెన్నఁడు నెడఁబాయ దీమణి నేఁడు
నాతిని నన్ను మన్ననఁ గూర్చవచ్చు, దూతిక యనసిరు ల్గులకింపవచ్చె
నియని యందంద యక్కునఁ జేర్చి, హనుమంతు మఱియును నటఁ జూచి పలికెఁ
రమపుణ్యాత్మక పవనజ నీవు, మరలి యేతెంచుచో మగువ యేమనియెఁ
జెప్పు మేర్పడనన్న శ్రీరాముఁ జూచి, చెప్పంగఁదొణఁగె నంచితసత్త్వధనుఁడు
యెడపనివగలతో నేశోకభంగిఁ, గడపితిఁ బదినెల ల్కాకుత్స్థుఁ బాసి
వలమాఁది రెండుమాసములకుఁ బిదపఁ, బెలుకుర నన్ను జంపెదనన్నవాఁడు
రావణుఁ డటుగాన రామభూపతికిఁ, నేవిధంబునఁ బ్రాణ మిటమీఁదనిల్వ
దని విన్నపము సేయు మనఘు నాతండ్రి, తనుసత్యధనుఁడని తగనిచ్చె నన్ను
విలసిల్లు కల్యాణవేదిపై నుండి, వలనొప్ప నగ్నిదేవత సాక్షిగాఁగఁ
గరమర్థి నన్నెల్ల కాలంబు విడువ, కరసి రక్షించెద నని తెచ్చి నన్ను
నరయ కుపేక్షించి యనదగాఁ జేసి, పరికింపఁడని విన్నపము సేయు మనిరొ
దక్కఁగ బనుదెంచి తనధర్మపత్ని, నొక్కఁ డెత్తుకపోవ నూరక యునికి

మహిలోన వీరధర్మము కాదుగాన, విహిత మంతయు విన్నవించితిఁగాని
వలనొప్ప సామనోవాక్కాయకర్మములు పూని తనయందె పొంది వర్తించు
నెనయంగ నాయెడ లెందుండెనేని, యని విన్నపము సేయు మనియె మీదేవి
తనుచిత్రకూటాద్రిఁ దగ నొక్క కాకి, చెనకుటయును మనశ్శిలచేత మీరు
లీలతో మకరికల్లిఖియించుటయును, శీలించి గుఱుతుగాఁ జెప్పె నన్నియును
నీతిదప్పిన లోకనియతులు దప్పు, నీతియే తోడవగు నిఖిలనృపులకు
నని విన్నపము సేయు మనియె నాదేవి, యినవంశుతోఁ జెప్పి యిప్పుడే దండు
అనువొంద వెడలింపుమని విన్నవించె, నని లక్ష్మణునితోడ నర్కజుతోడ
జనకజపలుకులు సకలంబుఁ జెప్ప, ఘనశోకమును మానె ఘనుఁడు రాముండు
చెప్పినఁ గపివీరసింహంబులెల్ల, నప్పుడు దమలోన హర్షించి రంతఁ
గర మొప్ప సుందరకాండంబు నతుల, ధరఁబర్వి లోకసుందరమయ్యెఁ గృతుల
నని యాంధ్రభాషభాషాధీశవిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి, భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
తమతండ్రి విట్టలధరణీశుపేరఁ, గమనీయగుణధైర్యకనకాద్రిపేరఁ
బనిపూని యరిగండభైరవుపేర, ఘనుపేర మీసరగండనిపేరఁ
నాచంద్రతారార్కమై యొప్పుమిగిలి, భూచక్రమున నతిపూజ్యమై వెలయు
నసమానలలితశబ్దార్థసంగతుల, రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావనల్మిండఁ, గరమర్థి సుందరకాండంబు సెప్పె
నారూఢిసాశ్లేయమై యాదికావ్యమై రసికానందమై యెల్ల నాఁడు
నివ్వసుమతినొప్పు నీపుణ్యచరిత, మెవ్వరు చదివిన నెవ్వరు వినిన
సామాదిబహువేదచయధామరాము, నామచింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును, పాయనిశుభములు పాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యచయసమృద్ధియును
ఏవిఘ్నములు లేక యిండ్లలో నధిక, లావణ్యవతులైన లలనలపొందు
గొడుకులతో నెప్డుఁ గూడియుండుటయు, నెడగాఁగ నాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులఁ గూడుటయు, నిమ్ముల కామ్యంబు లెడపకుండుటయు
సతతంబు దేవతాసంతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవభోగాధివాసము గలుగు
నెందాఁక కులగిరు లెందాఁకఁ దార, లెందాఁక రవిచంద్రు లెందాఁక దిశలు
నెందాఁక వేదంబు లెందాఁక ధరణి, యెందాఁక భువనంబు లేపుదీపించు
నందాఁక నీకథ యక్షరాసంద, సందోహదోహళాచారమై పరఁగు.

సుందరకాండము సంపూర్ణము.

శ్రీ ర స్తు

# శ్రీరంగనాథరామాయణము

## యుద్ధకాండము



శ్రీరామచంద్రుఁ డాశ్రితహితోదయుఁడు, వారిజబాంధవవంశవర్ధనుఁడు
ప్రియములయందెల్లఁ బ్రియమైనయట్టి, ప్రియవాక్యమంజనాప్రియసుతుచేతఁ
బ్రియమున వినఁగోరి ప్రియసతియునికి, ప్రియము రెట్టింపంగఁ బ్రీతితో ననియె
హనుమంతుచేసిన యంతకార్యంబు, చను నె సేయంగ నిర్జరులకునైన
నరిది సత్త్వమున నీహనుమంతుఁ డొండె, కరువలి యొండె నగ్గరుఁడుండు నొండె
వనధిదాఁటఁగఁజాలు వారలుగాక, మనమునఁ దలపోయ మఱియెవ్వఁడోపు
దేవగంధర్వదైతేయకిన్నరులు, భావించి చొరరాదు పగలును రేయు
రాక్షసానీకవిరాజితబాహు, రక్షితమా లంక రమణమైఁ జొచ్చి
ప్రాణంబుతోడనే బ్రతికి క్రమ్మఱను, ఏణాంకధరుఁడైన నెట్లు రానోపుఁ
గడుమోదమునఁ బెద్దకార్యంబుపతికి, వడిఁజేయు నెవ్వఁడు వాఁడుత్తముండు
ఏలినపతికార్య మెడరైనయెడను, వాలూర నటుసేయువాఁడు మధ్యముఁడు
పలుమాఱు మాల్గుచుఁ బతిపంపునకుఁ, దొలఁగఁబాఱెడువాఁడు దుస్సేవకుండు
ఈమువ్వురందును నెక్కువగ్గైన, యామేటివాఁడునై యలయింతలేక
యనురాగమునఁ బెద్దగ్గైనకార్యంబు, ననుపముంబుగఁజేసె ననిలనందనుఁడు
కావునఁ బ్రత్యుపకార మీతనికి, నేవిధంబునఁజేయ నే నేర్చువాఁడ
నాలింగనంబె నాయర్థము చతని, నాలింగనముసేసె నప్పు డవ్విభుఁడు
ఈభంగి మెచ్చిన నినసూతి వినఁగ, నాథవృష్యఁ డనియె నాయాంజనేయునకు
ననిలతనూజ నీ వంబుధి దాఁటి, జనకజఁ గని రాఁగ సంతోష మొదవె
నిట నాకుఁ బొడమిన యీముదంబెల్ల, నిటమీఁద మఱి తుది యెట్టిదో కాని
యది యెట్టి దంటేని యగ్గలంబైన, యుదధిలంఘింపంగ నోపెడివెఱవు
కపిసేన కెట్టంగిఁ గలుగునో యనుచుఁ, గపినాథ నామది గలఁగంగఁజొచ్చె
ననిపల్కి యటమీఁద నాస్యంబు వంచి, మనుజేశుఁ డేమియు మఱిపల్కకున్న
శ్రీరామదేవుని చిత్తంబుకలఁక, యారవిజుఁడు మాన్పు నని విచారించి
యిదియేమి దేవ నీవితరులభంగి, మదిలోన శోకంబు మానవయ్యెదవు
దాటరా దననేల దాఁటెద వబ్ధి, దాఁటి సువేలయు దాఁటి యాలంక
సాధించి రావణుఁ జంపి లోకముల, బాధ మాన్పెదవు భూపాలక చూడు

ముర్వీశ కపులెల్ల నుద్యోగయుతులు, దోర్విజయాఢ్యులు దుర్జయక్రములు
వీరుండ రాఘవోర్వీనాథ నీకు, వారక యిబ్బంగి వగవ నేమిటికి
నుద్యోగి వగుము సముద్యోగి కెందు, సద్యఃఫలంబులు సకలకార్యములు
ఉత్సాహి యగువాని కులుకుదు రహితు, లుత్సాహరహితున కులుకరుగాని
యని యతం డిబ్బంగి నాడువాక్యములు, విని హనుమంతుతో విభుఁ డర్థిఁబలికె
వేఁడెదఁ గాదేని వెడలు నాయంప, వాఁడిమినైనను వార్ధి నింకింతు
బంధింతుఁ గాదేని పవనతనూజ, కంధిదాఁటుట కెంత గగనంబు నాకు
నదియెంత పని విను మనిలతనూజ, పదిశిరంబులవానిపట్టణంబునకు
నెన్నికోటలు బల మెంత వీక్షింప, నన్నిటగవనులు నవి యెవ్విధములు
కావలియుండురాక్షసు లెంద ఱందు, భావింపఁ దద్గృహపంక్తు లేతెఱఁగు
చూచి వచ్చితిగాన చూచినతెఱఁగు, నీచేత వినియెద నిక్కంబు చెప్పు

## హనుమంతుఁడు లంకాప్రభావము దెలుపుట

మనిన నంజలిమోడ్చి యాంజనేయుండు, వినయోక్తు లెసఁగ నవ్విభున కిట్లనియె
ఉడుగనిమదధార లొలుకుచునుండ, కడుఁగ్రొవ్వి పర్వతాకారంబు లగుచు
రౌద్రంబు మోముల రంజిల్లుచుండు, భద్రదంతావళప్రతతు లగ్గలము
పెక్కాయుధంబులఁ బెఱిఁగి చూడ్కులకు, నక్కజంబై ఘోరమై కనుపట్టు
గొడుగులఁ బడగలఁ గొమరారుచుండు, నడియాలముల లెక్కయంబులు గ్రాలు
భానుబింబప్రభాపటలంబుకరణి, మానైనమణిదీప్తి మహిమ వెలుంగు
రథము లెక్కుడు దశరథరాజతనయ, రథికసారథిమనోరథములై యుండు
ఘనవీరరసవారికరడులో యనఁగఁ, దనరారి యెంతయుఁ దఱుచువన్నియలు
మెఱసినచూడ్కులు మిఱుమిట్లుగొనఁగ, వఱలినహేషారవంబులు చెలఁగ
హరిఘోటకంబుల నైన వేగమున, హరియింప నోపిన హరిశక్తి గలిగి
హరు లెంతయును మనోహరములై యుండు, హరిహరాదులు మెచ్చునట్టియగ్గలము
పిడుగులతోడఁ బ్రబ్బినల్లమొగులు, ఉడరి దానవరూప మయ్యెనో యనఁగ
నేర్చి రౌద్రంబుతో నెనసి యంగంబు, గూర్చిన నల్లనికొండలో యనఁగ
గాదేని హరుఁడు మ్రింగిన నాఁటిగరళ, మీదైత్యకోటియై యెసఁగెనో యనఁగఁ
బ్రళయకాలమునాఁటి పావకధూమ, ములవడ రాక్షసులైరొకో యనఁగఁ
గలిగినయట్టి రాక్షసులకు సంఖ్య, గలుగదు దేవ రాఘవ ధరాధీశ
దట్టమై యట్లిట్లఁ దనరి చూపట్టు, నిట్టికకోటయు నిరవైనతాతి
కోటయుఁ బొడవునఁ గొమరొందు నినుప, కోటయు నట యుక్కుకోటయుఁ గంచు
కోటయు మఱి వెండికోటయుఁ బసిఁడి, కోటయు నను నేడుకోట లొప్పారుఁ
గాలునివక్షంబు కరణిఁ బొల్పెక్కు, మేలైనతలుపులు మెఱసి యెంతయును
అక్కోట లన్నిటియందును జూడ, మిక్కిలి దీప్తుల మిక్కుటం బగుచు
నఖిలరత్నముల మేలైనవాకిళ్ల, నఖిలావనీనాథ యరయ నాల్గేసి
వరమంత్రవిధుల దివ్యంబులైనట్టి, శరచాపచయము లసంఖ్యలై యుండు

నాకోటచుట్టును నఖిలలోకేశ, భీకరమకరసంభృతములై పరఁగు
నాలుగగడ్తలు నాల్గుదిక్కులను, జాలంగఁ బాతాళ సమితి నొప్పారు
దేవ యానాలుగు తెరువులయందుఁ, గావలియుండు రాక్షసకోట్లు దఱచు
అమితశిలాబాణయంత్రజాలములఁ, దమతమయంత నే దాయలఁ జంపు
ధాత్రీశ యింటింటఁ దప్పకయగ్ని, హోత్రము లున్నవి యోంకార మెసఁగ
ననవుడు విని యతఁ డతిచోద్యమంది, మనమునఁ జింతింప మారుతి యనియె
సత్యంబు ధర్మంబు శౌచంబు దయయు, నత్యంతసౌజన్యంబ నసురులయందు
ననిపల్కుటయు సాధ్యమానని లంక, జనపతి ముదమందఁ జతురుఁడై పలికె
నవియెల్ల నిట్టిట్టివని యున్నవేల, యపనీతలేశ మహావైభవమున
వారక సేనతో వాహ్యాళి వెడల, నారావణుండు నిత్యము తోడుచూచు
వాలినమదమున వడిఁ గయ్యమునకుఁ, గాలుద్రవ్వుచునుండుఁ గమలాప్తవంశ
యగ్గలికయు లావు నదర వైరులకు, లగ్గఁబట్టఁగరాదు లంక భూనాథ
జలవనకృత్రిమస్థలశైలదుర్గ, ములు నాల్గునుండు సముద్రంబులోన
నవి యెల్లకాలంబు నైనను గాల, కదియఁబోవఁగ రేవు కానంగరాదు
మత్యుజిహ్వయుఁబోలె మెఱుఁగులతోడి, యత్యుగ్రశూలంబు లనిశంబుఁబట్టి
కడు నుగ్రరాక్షసు లొక్కచి యుండుదురు, పడమటివాకిటఁ బదివేలసంఖ్య
లక్షదైతేయు లాలంకాపురంబు, దక్షిణద్వార ముద్ధతిఁ గాతు రెపుడు
నటఁ దూర్పువాకిట నమరారియుండుఁ, బటుతరచతురంగబలసమేతముగ
నగణితశస్త్రసహాయులై యుండుఁ, దగ నొక్కలక్ష యుత్తరపువాకిటను
చాల రాక్షసులు లక్షయు నిర్వదేను, వేలు తత్పురమధ్యవీథి నుండుదురు
ఆలంక మీకృప నక్కడు లేశ, యే లీలఁ బొచ్చితి నింతఁ గైకొనక
వడిఁ జొచ్చి యట్టళ్లు వడిఁగూలదన్ని, యడరి కోటలఁ బ్రాకి యగడితలూపడ్చి
యచ్చెరువుగ లంకయంతయుఁ గాల్చి, వచ్చి మీ శ్రీపాదవనజము ల్గంటి
నదరి యక్కడికార్య మంతయు వింటి, దడయ నేటికి యబ్ధి దాటుద మింక
దాటినయప్పుడే దశకంఠు లంక, మీటివైచెదరు ప్రేల్మిడిలోనఁ గపులు
అనవుడు రఘురాముఁ డక్కజుఁ జూచి, యినసుత యాలస్య మేటికి నింక
వెడలింపు కపిసేన విజయలగ్నమున, గడు లెస్స మధ్యాహ్నకాలంబు మనకు
నాయత్తమును దక్క . నరభోజనునకు, నేయుపాయముగల దెందు దాఁగెడిని
అని నీలు దెసఁ జూచి యర్కవంశజుఁడు, వినుమని బుద్ధిగా వివరించె నపుడు
కడునింపుదనమును కడునిర్మలంబు, కడుతీపునీరును గలుగంగఁ జూచి
పరిపక్వఫలముల భరితంబులైన, తరువులు నజ్జాడ తఱుచయ్యె నేని
నడుపుము మ్రుంగలి నడుచోరనీక, వడిఁ బరికింపు మొప్పని లాఁతివారి

సుగ్రీవుఁడు కపిసేనల వెడలించుట

ననిన నారాముని నానతియెల్ల, విని నీలుఁ డట్ల కావించె శీఘ్రమున
నప్పుడు సుగ్రీవుఁ డఖిలవానరుల, దప్పకుండఁగఁ బిల్చి దండెత్తఁ బనిచెఁ

బనిచినఁ దమతమపటురభసమున, ఘనగుహాలందుండి కపిసేన వెడలె
భూరిపదాఘాతములఁ దల్లడిల్లి, ఘోరరావంబుల గుహాలు ఘూర్ణిల్ల
వీరగర్జనములు వీరహాసములు, వీరనాదంబులు వెస నింగిముట్టఁ
బెల్లునఁ గోపించి పెడబొబ్బ లిడుచుఁ, ద్రుళ్లుచుఁ బటుశక్తితో దాఁటువారు
కొందఱు పండినకుజములు మూపు లందిడి నములుచు నరిగెడివారు
రావణుతోఁగూడ రాక్షసప్రతతి, నేవిధంబుననైన నేమె చంపుదుము
రామభూపాలక రణమున ననుచు, రామునిముందఱ రాగిల్లువారు
కెరలి పైకుఱుకుచుఁ గేక వైచుచును, వెరవారఁ దోఁకల విసరియాడుచును
జెచ్చెఱ పర్వతశిఖరంబు లెక్కి, ఇచ్చఁ గొందఱు బొబ్బ లిడువారు నగుచు
నప్పుడు కపివీరు లందఱు చెలఁగి, యప్పరమేశ్వరుఁ డానంద మొంద
నారవంబున మ్రోసె నాకాశవీథి, నారవంబున భూమి యటునిటుపడియె
నారవంబునఁ బెల్ల నద్రులు వణఁకె, నారవంబున మ్రొగ్గె నాదిగ్గజములు
నారవంబున భార మయ్యె శేషునకు, నారవంబునఁ గూర్మ మణఁచె శిరంబు
ఇటు సేన నడవంగ నెగసినధూళి, పటలంబు మిన్నంది బహువర్ణములను
ఆరవంబున భార మై యిల నెసఁగు, తోరంపునిశ్వాసధూమంబు లనఁగ
నప్పుడు ముంగలి రై నీలుతోడ, నొప్పు సైన్యంబు లత్యుగ్రతుండముఁగ
నిరుదిక్కులందును నేపారినడుచు, తరుచరబలము లుద్ధతపక్షములుగ
స్ఫురణ మొప్పఁగ మధ్యమునవచ్చువారు, ధరణీతలేశుఁడు తనయాత్మ గాఁగఁ
గడఁగ నొంపారి చక్కఁగ వెన్కఁగాచి, వడివచ్చుసైన్యంబు వాలంబుగాఁగ
నురగపాశంబుల నొందంగ నున్న, తరణివంశజు నవస్థలు తొలఁగింప
గరుడుండు భూస్థలిఁ గైకొని నడచు, కరణి నొప్పారె మర్కటమహాసేన
సరిప్రజంఘుండు కేసరి దధిముఖుఁడు, పరువడి సందడిఁ బాయవ్రేయఁగను
విరళమై శ్రీరాము వెల్లువ నడువ, పరమసంతోషసంభరితాత్ము లగుచు
గవయుండు తారుండు గంధమాదనుఁడు, పవమానసూనుఁడు పనసుఁ డంగదుఁడు
శరభుండు నలుఁడును జాంబవంతుండు, హరుఁడును మైందుండు నాదిగాఁగల్గు
వనచరపతులెల్ల వడి నేగుదేరఁ, జనుదెంచి రఘుపతి సహ్యపర్వతముఁ
గని యందు విడిసె లక్ష్మణసమేతముగ, ఘనతతో నపుడు నగ్గలముగా నందుఁ
బెంపారువనములఁ బెక్కదటాకముల, నింపారునీడల నిరవైనయెడల
విడుదులు గైకొని వెలయు నబ్బలము, విడిసె సుగ్రీవుండు విడియంగఁ బనుప
మఱునాఁడు నెప్పటిమాడ్కి లక్ష్మణుఁడు, దొరలు మహీపతి త్రోచియేఁగఁగను
నురువీరరసమున నుప్పొంగి పొంగి, భరితస్వనంబునఁ బరిపొంది యొంది
తనుకాంతికరడులఁ దనరారి యారి, ఘనమైనమ్రోఁత నాకస మంది యంది
మునుకొని వనశైలముల నొప్పి యొప్పి, మనువంశచంద్రుచే మదినుబ్బి యుబ్బి
యాసముద్రము పెంపు నడఁగింప నడచె, భాసురం బగుకపిబలసముద్రంబు
ధైర్యాఢ్యు లామహీధవులభ్రమధ్య, సూర్యచంద్రులమాడ్కి శోభిల్లి రంత

నదులలోఁ జొచ్చి వానరసేన నడువ, నెదురుదొట్టుచు నుబ్బి యెసఁగి యానీరు
సహ్యాద్రిమలయాద్రిసంధులనడుము, సహ్యాపై కపిబలసమితితోఁ బోడము
చిఱుగాలిచేఁ దరుశిఖరాగ్రసమితి, నొఱపైనకొమ్మ లొండొంటితో రాసి
యగచరావళిమీఁద నలరులు రాల్చెఁ, దగనట్టిదే కాదె తలపోసి చూడ
వనలక్ష్మి శ్రీరామవల్లభుఁ జూచి, యొనయఁ బుష్పాంజలు లీకేల మాను
నప్పుడు కపివీరు లయ్యయియెడల, నొప్పెడుకొలఁకుల నురవడిఁ జొచ్చి
యానిర్మలపునీరు లారంగఁ గ్రోలి, యానందమును బొంది యందంద గదిసి
కమనీయమృదుకరకమలయుగ్మములఁ, గమలము ల్దుంచుచు కమలంగఁ బట్టి
కమలాకరంబులఁ గమలాప్తకులుండు, కమలారియును బోలి కమలముల్ నొంచుఁ
గ్రమ మొప్పఁగా దశకంధరువదన, కమలంబు లని తెల్పుకరణిఁ జెలంగి
తొగలు వెట్టింతుము దుష్టారిసగుల, తొగలు జానకి యింకఁ దొలగంగవైచుఁ
దొగలార యింకమీఁదఁ దొగదొట్టిదనుచుఁ, దొగలెల్ల జివిమివైతురు పెచ్చుపెరిఁగి
బిరుదులై యసురులప్రేవులు పెరుకు, కరణిఁ బెరుకుదురు ఘనమృణాళములు
ఇటు వినోదింపుచు నెల్ల వానరులు, తటములమీఁది కుద్ధతశక్తి దాఁటి
గిరులెక్కి ఫణములఁ గ్రిక్కిరియంగఁ, బెరలకేనియలాని ప్రేలరింపుచును
గడునుత్సహించి యుత్కటబలాధిపులు, నడిచిరి వానరనాయకోత్తములు

## శ్రీరాములు మహేంద్రాద్రిఁ జేరుట

ఇనవంశుఁ డపుడు మహేంద్రాద్రి యెక్కి, యనతిదూరంబున నంబుధిఁ గనియె
కరిమకరంబులు కరిసమూహములు, తరగలు గుజ్జుపుదళములు పెల్లు
కమఠకర్కటములు ఘనరథావళులు, సమదజలార్భకసమితి భటాళి
పొలుపార ఫణిఫణంబులు కేతనములు, లలిఁ జోరమీనవాలము లడిదములు
చలదురు మీనాళి చామరప్రతతి, పొలుపొందు నురువు నొప్పఁగ ఛత్రసమితి
పెనుపైనఘోషంబు భేరీరవంబు, వినుతింపఁగా నీరు వీరరసంబు
గానున్నఁ జేరిన కడిఁది రావణుని, నేనేల చంపంగ నిత్తునన్మాడ్కి,
దనరిన క్రూరసత్త్వస్థితిఁ బెర్చి, తనకెదురై మహోద్ధతి నున్నదానిఁ
గని పెద్దవెఱగంది గాంభీర్యధనుఁడు, వనధితీరముఁ జేర వచ్చి రాఘవుఁడు
ప్రకటంబుగా సర్వబలము గూడుటకు, నొకదుంచిచంద్రకాంతోపలస్థలిని
జలధితీరంబునఁ జరియించుచున్న, బలితంపు రావణపాతీనవరుని
నసుపమం బగుతన యంపగాలమునఁ, గొని తివుచుటకునై కూర్చున్నపగిది
నాసీనుఁడై యున్న యర్కజుతేశుఁ, డాసన్నుఁడై యున్న యర్కజుఁ బలికె
వచ్చితి మిప్పుడీ వారిధిఁ జేర, నెచ్చోటప్పు ఘటియింత మిది దాఁట మనకు
నాయుపాయము మఱి యాత్మ చింతింత, మీయగచరకోటి నెందుఁబోనీక
యింపైనయెడ విడియింపంగఁ బనుపు, సొంపారఁగాఁ దోడుచూడంగవలయు
నని రాఘవేశ్వరుఁ డర్కజుఁ బలుక, ననసుతుండును నీలు నిటు సేయఁ బనిచె
నీలుండు నప్పుడు నిరతంబుగాఁగ, వాలినసేనల వడి విడియించె

వనచరారవము నావలనను గలిగి, వనచరారవము నీవలననుఁగలిగి
యునికి సహింతునే యోసముద్రుండ, యని యప్పు డావార్ధి నదరించుమాడ్కి
విడియు వానరసేన వెడలెడుమ్రోఁత, నడచుపెల్లైన యాయంబుధిమ్రోఁత
నటరెండువేలంబు లై యాపయోధి, తటవనభూములఁ దరుచరుల్విడియ
నప్పుడు రాముఁ డేకాంతంబునందు, నొప్పెడులక్ష్మణు నొయ్యనఁ బలికె
సౌమిత్రి వింటె యీజలనిధికైన, నీమెయిఁ దుద నిశ్చయింపఁగవచ్చు
నివి యంత యింతని యెన్నంగరాదు, తుదలేదు నామనోదుఃఖవారిధికి
నని రామవిభుఁడు శోకాంబుధిలోన, మునుఁగుచుండఁగ మూఁడుమూర్తులు గలిగి
యతనితోడిదె లోక మనినచందమున, నతివేగమున నినుఁ డపరాద్రిఁ గ్రుంకె
నినుఁడు గ్రుంకుటయును నెల్లలోకములు, పెనుపొందమణిలేని పెట్టియఁబోలె
మనసిజానలతీవ్రమానసు రాముఁ, గనుఁగొని యనువుగాఁ గప్పుటకొఱకు
చెలివోలు నపరాశ చెంగావిచీర, నెలమి నిచ్చినక్రియ నెరసంజ యొప్పె
నినవంశచంద్రుచే నింద్రారిమోము, ననిశంబు నిటువాఁడు ననినచందమున
దళమున బిగువెల్లఁ దప్పి యందంద, లలిఁ దక్కుచును గమలంబులు మొగిడె
చెలువుగా రాముని శీతలక్రియకు, నలిరేఁగి యాశాంగనలు గూడవైచు
లలితతమాలపల్లవరాసు లనఁగఁ, గలయంగ బలువుచీఁకటు లగ్గలించె
దిననాథకులుదేవిఁ దెచ్చిమోదించు, దనుజనాథునిమోము దమ్ములు విరియు
నని నగియెడిమాడ్కి నప్పు డందంద, తనువొందఁగాఁ గుముదంబులు విరిసె
శ్రీరామదేవునిశితమార్గణముల, నారత్నములుదక్క నంబుధిఁ గ్రుంకె
నీరూపముననుండు నిక్ష ననుమాడ్కి, తారకావలిచేతఁ దనరారె మిన్ను
యానిశీథిని రాము నంగతాపమున, కై నిబిడంబుగా నమరించియున్న
సారంబు మల్లికాశయ్యన నొప్పెఁ, దారల ప్రతిబింబితం బైనయబ్ధి
విరహంబుచే రామవిభుఁడును నరిగె, నరిదియే విరహులమాటమే మనుచు
దెసలకుఁజెప్పెడి తెఱఁగునఁబాసి, వెస మఱిమఱి చక్రవాకములనియె
రాజనై యేను వారాశి యుబ్బింతు, రాజవై నీవు వారాశి యింకింపఁ
దలఁచుట పాడియే ధరణీశవర్య, విలసితసత్కళాన్వితుఁడగు నీవు
నటుచేసితేని దోషాకరత్వంబు, పటువృత్తి నీయందుఁ బ్రభవించు నంచు
దూఱవచ్చినమాడ్కిఁ దోఁచెఁ జందురుఁడు, మీఱినకరములు మిన్నులముట్టి
జనకజకై రామజననాథతిలక, వనుఁ దలఁ దాల్చి మన్ననఁ జేసినట్టి
హరువిల్లు విఱిచిన యాదోషమునను, విరహివై తివి సీతవెఱపున ననుచుఁ
జందురుఁ డట్టహాసముచేసె ననఁగ, నందందఁ జంద్రిక లతిశయమొందె
శరనిధి నురువను చందనంబర్థిఁ, గరమొప్ప వీచికాగణములఁగల్చి
కరములు పుచ్చి దిక్కాంతలమేనఁ, బొరిఁబొరి యారాజు పూసెనో యనఁగఁ
దలకొని మఱియును దట్టమై పర్వి, వెలయంగ వెచ్చనివెన్నెలయొప్పె
నప్పుడు వేడుక నాచకోరములు, నొప్పుచిత్తములఁ బెంపొలయంగఁ గదిసి

పొరిఁబొరిఁ దమచంచుపుటములు చాఁచి, నిరతంబుగాఁగ వెన్నెల పుక్కిలించి
లలితోడఁ దమప్రియులకు నిచ్చి యిచ్చి, యెలమితో నవియంది యీఁగ్రోలి గ్రోలి
మలసియాడుచుఁ బలుమఱు సోలిసోలి, పొలుచు వెన్నెలరసంబులఁ దేలి తేలి
గమిబాసి యడుగులు గనతారి తారి, కొమరారియింతులఁగూడి యుండుటయుఁ
గనుఁగొని మదనమార్గణవర్గభిన్న, తనుఁడైన రాముఁ డాధరణిజఁ దలఁచి
యంతకంతకు మదనాగ్ని చేఁ గుంది, యంతరంగంబున నడలుచునుండె
అప్పుడు లక్ష్మణుం డన్నసంతాప, ముప్పొంగుటయుఁ జూచి యొగిమాన్తు ననుచు
నిదె యబ్ధి దాఁటుద మిదె దాఁటిపోయి, పదిశిరంబులవాని పటుశక్తి నాజి
భంజించి మిథిలాధిపతికూర్మిపుత్త్రిఁ, గంజాస్యయగుసీతఁ గైకొనె దధిప
వసుధేశ నీవింక వగవ నేమిటికి, నసమానవీరుండ వారూఢకృతివి
యనవుడు తమ్ముని యనునయంబులకు, జననాథుఁ డెంతయు సంతోషమందె
ఆదట వెన్నెలయందు వానరులు, మోదంబుతోడ నిమ్ముల నెల్లెడల
నారామదేవుగుణాంకంబు లింపు, లారంగఁ బాడుచు నాడెడువారు
కూడి యాజలనిధికూలంబునందు, వేడుకతో నుబ్బి విహరించువారు
హరియవతారంబు లన్నియుఁ గథల, వెరవుగా నింపుగా వినుచుండువారు
కడఁగి యాయాచంద్రకాంతోపలముల, వడలుసొంపారఁగాఁ బవళించువారు
నై ప్రొద్దుగడపి ప్రియంబును బొదల, రయమున నంతఁ బూర్వమున కింపెసఁగ
జలనిధి రాఘవేశ్వరుఁ డేఁగునపుడు, బలుశిలీముఖములఁ బడుదునో యనుచు
కడువేగ తొలఁగి యాకంపంబు నొంది, బడబాగ్ని యుదయాద్రిఁ బ్రాకెనో యనఁగ
రాముబాణాగ్ని వారాశి దహించు,చో మిన్నుముట్టి యర్చులు పర్వె ననుచు
వెఱచి తొలంగిన విధమునఁ గ్రుంకె, నెఱసినచుక్క లన్నియుఁ దోడుతోడ
నిదియేల దడసెద వీయబ్ధిఁ గట్టి, వదలక చంపు రావణు రాఘవేంద్ర
యని మనుమనికిఁ దోడై రేపకడను, జనుదెంచె ననఁగ భాస్కరుఁ డుదయించెఁ
గమలాప్తకులుని రాఘవుని సద్విజయ, కమలయుఁ దద్రాజ్యకమలయుఁ గీర్తి
కమలయు నని మేలుకనినచందమునఁ, గమలంబు లెల్ల నొక్కట మేలుకనియె

## రావణుండు మంత్రులతో నాలోచించుట

నప్పుడు తగినసంధ్యాదికృత్యములు, నొప్పంగ సలిపి రాయుర్వీశు లంత
నక్కడ రావణుఁ డఖిలమంత్రులను, తక్కఁగ రావించి తగవారి కనియె
మంత్రికోవిదులార మర్కటుం డొకఁడు, జంత్రంబుఁ జూపిన చందాన వచ్చి
లంకిణి నొంచి యీలంక శోధించి, పంకజానన సీతఁ బరికించి కాంచి
నావనంబుఁ జెఱిచి నాసుతుఁ జంపి, నావిక్రమము మీఱి నాపురిఁ గాల్చి
పెక్కువ నసురులఁ బెక్కండ్రఁ జంపి, చిక్కియు మనచేతఁ జిక్కకపోయె
నదె తెచ్చె రాముని నావానరుండు, పదిలుఁడై యంబుధిప్రాంతంబునకును
భల్లూకబలములు ప్లవగసైన్యములు, వెల్లువలై వచ్చి విడిసిరి వార్ధి
స్థిరముగా నీవార్త తెఱఁగెల్ల దెలియఁ, జరజను ల్చెప్పిరి సకలంబు నాకు

నిసకులుఁ డీయబ్ధి యింకించిరైయైనఁ, దనసేనఁ బంచి యుద్ధతిఁ గట్టిమైన
దాఁటివచ్చిన మఱితప్పఁ గార్యంబు, దాఁటకమున్నె మీ త్రద్దిజ్ఞతమెఱసి
యిదికార్యమని చెప్ప డిందఱుగూడ, నదియు సేయుదము మేలగుతెఱఁగైన
నని యడిగిన రాక్షసాధీశుతోడ, ననిరి మంత్రులు కడునల్పజ్ఞులగుచు
దివ్యులకైనను దృష్టింపరాని, దివ్యాస్త్రములు పెక్కు దేవరయందుఁ
గ్రక్కునవిషములు గ్రక్కంగఁబట్టి, యుక్కడఁగించితి పురగాధిపతిని
రుద్రునిసఖుఁ గుబేరునిమదం బణఁచి, భద్రకం బైనపుష్పకముఁ గైకొంటి
మయునిప్రఖ్యాతుని మర్దించి యతని, ప్రియసుతఁ బెండ్లియుఁ బేర్మితోనైతి
వంతకు నెక్కుడై యంతకుఁ గిట్టి, యంతకునకు నీవ యంతకుఁడైతి
వారనిబలుఁడైన వరుణునియాత్మ, నీఱు గావించితి నిర్జరారాతి
చక్రవర్తులరాజ్యచక్రము ల్ద్రిప్పి, చక్రము ల్గొంటి రాక్షసచక్రవర్తి
శూలాయుధునిఁ గిట్టి శూరత మెఱసి, మూలకుఁ జొనుపవా ముక్కంటి యనక
వాసవు నన్నాకవాసులతోడ, వాసిదప్పింపవా వాసికి నెక్కి
వేఁడికిఁ బలుమాఱు వేఁడిమిఁ జూపి, వేఁడిమిఁ బాపవా వేఁడికోననలు
బలియునిఁ గోణాధిపతిదైత్యనాథు, నలిగి మర్దింపవా యధికశౌర్యమున
నిలిచినచోటను నిలువంగనీక, పలుమాఱుఁ దూలవా పవనునిదూత
మనుజుఁ డాతఁడు నీవు మనుజాశనుఁడవు, మనుజుండు నీచేత మనుటేల కలుగు
నీశ్వరుఁగూర్చి మహేశ్వరక్రతువు, శాశ్వతకీర్తిమై సలిపె నీసుతుఁడు
సాంద్రానుమోదిరై సఫలత నొంది, యింద్రుని భంజి.ప నింద్రజిత్తయ్యె
నాయింద్రు జెఱఁబెట్టె నజుఁడు వేఁడుటయు, నాయజునకు విడ్వఁ డాయింద్రజిత్తు
అతఁడు చాలఁడే యాలంబు గెలువ, దైతేయకులనాథ తగదు చింతింప
అని మంత్రులాడుచో నధికదర్పమున, ఘనమైనలావులు గలదైత్యవరులు

## రాక్షసాధిపులు రావణునితో ప్రతాపముదెల్పుట

ప్రళయకాలాంతకబలులైనవారు, సులభశౌర్యుఁడు ప్రహస్తుఁడు నింద్రజిత్తు
శతమాయుఁడును బలశాలి దుర్ముఖుఁడు, అతికాయుఁడును మకరాక్షుండు ఖడ్గ
రోముండు వృశ్చికరోముండు సర్పరోముండు మఱియు విరూపాక్షుండు
అక్షీణబలుఁడు ధూమ్రాక్షుఁడన్వాఁడు, అక్షతోన్నతుఁడు యూపాక్షుఁడన్వాఁడు
రమణీయబలశాలి రశ్మికేతుండు, అమితవిక్రమపూర్ణుఁ డగ్నివర్ణుండు
వజ్రదంష్ట్రుండును వజ్రకేతుండు, వజ్రదేహుఁడు బలవంతుఁడైనట్టి
సుప్తఘ్నుఁడగు మఱి శోణితాక్షుండు, ప్రాప్తిశౌర్యుఁడు మహాపార్శ్వుఁ డన్వాఁడు
ఒనర కుంభుఁడు నికుంభుఁడు సూర్యనేత్రుఁడును నగ్నికోపనుఁడును మహోదరుఁడు
దివ్యుల గెలిచిన దేవాంతకుండు, నవ్యవిక్రమశాలి యానరాంతకుఁడు
కడునుగ్రుఁ డగుమహాకాయుఁడన్వాఁడు,నడరి విద్యుజ్జిహ్వుఁ డనువాఁడు మఱియు
గంపనుఁడును మహాఘనుఁ డకంపనుఁడు, పెంపారుచున్నయభేద్యవిక్రముఁడు
నాదిగాఁగలుగుమహాదైత్యవరులు, నాదైత్యవల్లభు నగ్రభాగమునఁ

గన్నులఁ గోపంబు గడలుకొనంగ, మిన్నులు ముట్టంగ మీఱి పల్కుచును
బ్రళయావసరమహాపవననిర్ఘాత, కులపర్వతములనఁ గుంభిని యదర
గొండొరుఁ జూచుచు నుద్దండవృత్తి, నొండొరు మెచ్చక యుగ్రత మెఱసి
యార్పులు నిగుడ నత్యుగ్రతమ్రగ్గు, సర్పంబులును బోలె సరభసవృత్తి
శూలంబు లంకించి సురియలు బిగిచి, వాలము ల్జళిపించి వరతనుత్రాణ
సబళంబు లమరించి చక్రము ల్ద్రిప్పి, ప్రబలంబులగు భిండివాలము ల్దిగిచి
పట్టసం బెసఁగించి ప్రాసము ల్ద్రిప్పి, గట్టివిండ్లును గుణకంపము ల్సేసి
యుడుగక యెలుగు లొండొంటితో రాయ, మిడుగురు ల్మంటలు మిక్కుటంబుగను
బొండొరువిపులకేయూరంబు లొరయ, నొండొరుమకుటంబు లుగ్రతరాల
భాసురమౌక్తికప్రకరము ల్చెదర, రాసిననవహేమరజములు దొలుగ
సందడింపుచు మహాసంరంభ మెసఁగ, బృందారకారితోఁ బేర్చి యిట్లనిరి
దేవగంధర్వ దైతేయకిన్నరులు, దేవ నిన్ జూడ భీతిల్లుదు రనిన
నరు లెంతవారు వానరు లెంతవారు, సురవైరి నినుఁ జూచి స్రుక్కక నిలువ
నేము నాఁడొకకొంత యేమఱియుండ, నామర్కటాధముఁ డల్లఁగేఁగాక
యింక మాముందఱ నీలంకఁ జొచ్చి, శంకింప కెవ్వరు చనఁగలవారు
వానరు లనియెడి వార్తలేకుండఁ, బూని నిర్జించి యిమ్ముల మహీధవులఁ
జంపి యేతెంతుము చయ్యన మమ్ముఁ, బంపు దానవనాథ పలుకు లింకేల
యని గర్వదుర్వారులై పల్కుచున్న, దనుజుల నందఱఁ దప్పక చూచి
యురవడింపకుఁడు యోహో మానుమానుఁ, డరసి కార్యము చూత మని విభీషణుఁడు
చిత్తంబులోనఁ జేర్చినయింద్రియముల, నొత్తి యడంచిన యోగియుఁ బోలె
బరఁగ గర్జించు నుత్పాతమేఘముల, నిరువునఁ బెట్టిన యింద్రునిభంగి
ననువొంద నెప్పటియట్లకూర్చుండఁ, బనిచి కార్యముముట్టఁ బలికె వారలకుఁ
బెనుపొందఁగా సామభేదదానములఁ, గొనరానికార్యంబు గొనకొనెనేని
మఱిగదాదండంబు మాయలఁ బెనచి, నెఱిపుట మున్నె దుర్నీతి యేమిటికి
నెనయంగ శాత్రవుఁ డేమఱియుండ, మన కేక నేమఱి మనుటకుఁ దోఁచు
నాతల కొకశత్రుఁ డతనిపై విడియ, నేతెఱంగున నేన నెత్తిపోఁజనును
దానిపై నతనికి దైవశక్తియును, హీనమైయున్న నీయింతయుఁ దగును
నెన్నఁడు నేమఱఁ డెదురెందు లేదు, మున్నె దైవంబు రాముఁడుగాఁడె మఱియు
హరువిల్లువిఱిచిన యట్టిసాహసుఁడు, పరమవివేకి దోర్బలజయాధికుఁడు
మీచేత సాధ్యుఁడే మిహిరకులేశుఁ, డేచి మీరతనిపై నెన్నియాడినను
గడలేని యీవార్ధి కాలువకరణి, వడి దాఁటిరాఁడె యావాయునందనుఁడు
వచ్చి యీలంకలో వలసినయూడ్కి, నచ్చెరువంది మీ రందఱుఁ జూడ
నేమేమిచేసెనో యెఱుఁగరా మీరు, రామునివింటిశూరత్వంబు చూప
నతఁ డొక్క వానరుఁడా యెన్నిచూడ, నతనికి నెక్కుడైనట్టివానరులు
నావానరుల కెక్కుడైనవానరులు, భావింపఁగా లెక్క పరఁగంగరాదు

మీరు రాఘవుని నెమ్మెయి నోర్చువారు, వారసికోపంబు వలన నేపారి
యెదిరిని దన్నును నెఱుఁగక పలుకు, టిది వివేకమె దానవేశ్వరులార
రామలలో నభిరామ యాసీత, రాముని దేవి నరణ్యమధ్యమున
భయమున రామునిఁ బలుమాఱుఁ జీర, రయమునఁ దెచ్చె నీరాక్షసేశ్వరుఁడు
మదిలోనఁ దలపోయ మఱికీడె కాక, యితనికిఁ జేసిన యొగ్గేమి యతఁడు
ఖరదూషణాదుల కడిఖండములుగ, ధరణిపైఁ గూల్చెఁ గదా యని మీరు
తలఁచెద రతనిపై దైత్యులపోక, తల పుచు వారిపై దాడిపోఁదగునె
తమనేరముల వారు ధరణిపైఁ గూలి, యమరలోకము కేఁగి రదిచెప్పనేల
మేటివానరు లిట మీఱకమున్నె, కోటలు వారిచేఁ గూలకమున్నె
సౌమిత్రిబాణవర్షము రాకమున్నె, రామునికోపాగ్ని రాఁజకమున్నె
యాయగ్నిచే లంక యడఁగకమున్నె, యీయసురావళి యీల్గకమున్నె
సీతఁ బుచ్చుఁడు వేగ శ్రీరాముకడకు, సీతఁ దెచ్చినకీడు చేఁజేతఁ గుడుపు
ధర్మాత్ముఁడౌ రామధరణీశ్వరుండు, ధర్మంబువలననే తగనుండు జయము
అని పెక్కుభంగుల నావిభీషణుఁడు, దనుజవీరులఁ బల్కి దశకంఠుఁ జూచి
తలపోయ సుఖమును ధర్మంబుఁ జెఱుప, వలతియై పరఁగు దుర్వ్యసనంబు విడువు
సుఖము కీర్తిని జేయు సుచరితధర్మ, మఖిలనీతిజ్ఞుఁడ వగుచుఁ గైకొనుము
చలము మానుము సుప్రసన్నుండ వగుము, కులమెల్ల రక్షించుకొనఁ జూచితేని
జనకజ విడువుమా జననాథుతోడ, మనకేల వైరంబు మదిమదినుండి
యని విన్నవించిన నతనివాక్యములు, విన బుద్ధిపుట్టక వెసఁ గొల్వు విడిచి

విభీషణుఁడు రావణునియొద్దకుఁ బోవుట

రావణుఁ డంతఃపురంబున కరిగె, నావిభీషణుఁ డంత నామఱునాఁడు
ప్రథమసంధ్యావిధు ల్పరిపాటిఁ దీర్చి, రథమెక్కి నల్గడ రాక్షసుల్ గొలువ
రమణీయచిత్రతోరణరాజవీథి, కమనీయశిల్పము ల్గనుఁగొంచు వచ్చి
పటుహేషితంబులు పటుబృంహితములు, పటహశంఖాదుల బహునినాదములు
సేవాగతాంగనాశింజితంబులును, సావాసు లడరించు చండహుంకృతులు
సూతమాగధవందిశుభకీర్తనములు, నాతతభటసంకులాలాపములును
మాతంగనిశ్వాసమారుతోద్ధూత, కేతనాంశుకపటాత్కృతులోలిఁ బెరయ
బధిరదిగ్భాగమై బహుళోర్మిజలధి, విధమున మ్రోయంగ విశ్వాసమొదవ
రాక్షసవీరులరక్షచే నమరి, నక్షత్రపరివృతనవసౌధ మనఁగఁ
దెలిపిలే కిభములు తేరులు హరులు, గిరికొన్న నగరివాకిటఁ దేరు డిగ్గి
ఆజ్యపాత్రాదుల నర్చితు లగుచుఁ, బూజ్యగుణంబుల భూసురోత్తములు
పుణ్యాహవాచనపూర్వకంబైన, పుణ్యశాంతులు సేయఁ బోరిఁ గన్గొనుచు
మనసింపనాస్థానమంటపంబునకుఁ, జనుదెంచి యన్నకు సద్భక్తి మ్రొక్కి
యలమి నాతఁడు చూప నర్హపీఠమున, నెలమితోఁ గూర్చుండి యేకాంత మెఱిఁగి
మంత్రులసన్నిధి మహనీయమంత్ర,తంత్రజ్ఞుఁ డనిరియు నాదశకంఠుతోడ

అవధరింపుము దేవ యసురాధినాథ, యవనిజఁ దెచ్చినయంతనుండియును
దుర్నిమిత్తంబులు తోఁచుచున్నవియు, నిర్ణయింపఁగరాదు నిక్కంవం బరయ
హోమకుండంబుల నున్నత్రేతాగ్ని, లేమియు వెలుఁగ వీయీదివసముల
నాగుండములఁ జొచ్చి యలమిఁ జుట్టియును, సాగిలబడియుండు సర్పముల్పెక్కు
నుడుగనిమదముల నొలయుతమ్మెదలు, కడునొప్పు నమ్మదకరులెల్ల నిపుడు
కడుమేనుడిల్ల మైకంబులతోడ, మెడలెత్తుకొని స్రుక్కి మెదలకున్నవియు
నున్నతస్థితిగల నుత్తమాశ్వములఁ, గన్నులనీళ్లను గాఱుచున్నవియుఁ
గవణంబు నీరును గడ్డియు నుడిగి, జవసత్త్వములు దూల సడలియున్నవియు
వానితోఁకలయందు వడినగ్నిశిఖలు, మానుగా నలుగుల మంటలు వెడలు
నరదాలపై నగ్నులట రాలుచుండుఁ, బోరిపోరియుల్కము ల్పుంవి బడఁ దొణఁగె
జడిగొని వీరమస్తములవాయసము, లడరుచుఁ బురములో నాడంగఁ దొణఁగె
ఖ్యాతిగా శిఖలతోఁ గడఁగి కూపముల, భాతిగా మండూకపతు లుద్భవించె
దేవగేహముల భూదేవగేహముల, భావింప శిథిలాధిపత్యులు పుట్టె
ఇంద్రధనుస్సులు నిట రాత్రులందుఁ, జంద్రధారికినైన జయములేదండ్రు
పూని చూడఁగ శుభంబులుగావు మనకు, వీని విచారించి విగ్రహం బుడుగు
మటుఁగాన నిన్నిటి కసురాధినాథ, శత మేల విను మొక్క శాంతి చెప్పెదను
శ్రీరామునకు నిమ్ము సీతఁ గొంపోయి, నేరమిఁ బట్టఁ డా నృపకుంజరుండు
ఎందు నీతిజ్ఞుల కిది లెస్సకార్య, మిందఱు నెఱుఁగరా యిది బుద్ధి యనుట
దనుజేశ నీచిత్తధర్మంబు నూఁది, వినుమని చెప్పంగ వెఱతురుగాక
నాకు బోరాదు దానవనాథ గాన, నీకుఁ జెప్పితి నిట్లు నీతిమార్గంబు
అని బుద్ధిచెప్పిన నవ్విభీషణుని, వినుతవాక్యంబులు వీనులఁజొరక
నెవ్వరిదిక్కున నేభయం బెఱుఁగ, నెవ్విధంబున సీత నేను రామునకు
దుర్జయుం డగునాకు దురములో నెదిరి, నిర్జరుల్తోడైన నిలుచునే యనుచుఁ
గోపంబు దీపింపఁ గొలువెల్ల విరిసి, వేపోయె దానవవిభుఁడు లోపలికి
మఱునాఁడు లేచి క్రమ్మఱ రావణుండు, మఱువక సంధ్యాసమాధులు దీర్చి
యనుజునివచనంబు లాత్మఁ జింతించి, తనప్రధానులు దాను దలపోయఁ దలఁచి
భానుమండలసుప్రభగలయట్టి, మానైనదివ్యవిమానంబు నెక్కి
కమనీయబహురత్నకలితంబులగుచుఁ, గొమరారఁగాఁ బైఁడికుంభముల్ మెఱయ
వెన్నెలచూలన విరచించినట్టి, యున్నతఛత్త్రంబు లొప్పారుచుండఁ
గంకణఝణఝణత్కారము ల్మెఱయ, నంకించి చామర లతివలు వీవఁ
బెక్కుతూర్యంబులు పెల్లుగా మ్రోయఁ, జెక్కుండ్రుసుభటులు పెంపారి కొల్వ
వందిమాగధులు కైవారంబుసేయ, సందడిజడియ నైశ్వర్యంబు మిగులఁ
జనుదెంచి బహుమంత్రిసహితంబుగాఁగ, మనుజాశనుఁడు సభామంటపంబునకు
నర్కవంశునిశరాహతిఁ దెగి పిదప, నర్కబింబముఁ జొత్తు నని తెల్పుకరణిఁ
జొచ్చి సింహాసనస్థుండునై పిలువఁ, బుచ్చె నాయకుల నప్పుడు పడవాళ్ల

వారును దమరథావళులపై నెక్కి, వారణంబుల నెక్కి వాజుల నెక్కి
చారుచామీకరచ్ఛత్త్రంబు లొప్ప, వారక భీషణాకారంబు లొప్ప
తమతమతూర్యనాదములతో వచ్చి, క్రమమున మంటపాంగణములయందుఁ
దమవాహములు డిగ్గి తనరుసింహములు, కొమరారఁగా గిరిగుహఁ జొచ్చుకరణి
నామంటపముఁ జొచ్చి యాదానవేంద్రు, మన్ననలు గాంచి చిత్తంబు లలర
నుచితాసనంబుల నుండిపడాలు, రుచితంబు లెఱిఁగింప నుత్తముం బనుచు
దేవ నేఁడెంతయుఁ దెలిసియున్నాఁడు, దేవరతమ్ముఁ డుద్దీపితబలుఁడు
ఘనుఁడగు నాకుంభకర్ణుండు నాఁగ, విని పిల్వుఁ డనవుడు వేగ వారేఁగి
దేవారి సభకు నేతెంచి కొల్వుండి, దేవ నిన్బిలువఁ బుత్తెంచె నావుడును
కొడుకులు కుంభనికుంభులు గొలువఁ, గడువేగమునఁ గుంభకర్ణుఁ డేతెంచి
మణిమయంబై దివ్యమహిమలు గలిగి, గణికాసమూహంబు గాననాదముల
నెంతయు నింపార నెసఁగినమంటపాంతరంబునను సింహాసనస్థలిని
నున్నయన్నకు మ్రొక్కి యొగిఁ గొల్వుఁజొచ్చి, యున్నతాసనమున నున్నయావేళ
నన్నతోడనె వచ్చి యావిభీషణుఁడు, క్రన్ననఁ గూర్చుండెఁ గనకపీఠమున
నప్పుడా రావణుం డమరవల్లభుని, యొప్పెల్లఁ గైకొని యుండి ప్రహస్తు
గనుఁగొని పలికె లంకాపురంబునకుఁ, బనుగొనఁ బెట్టుము బలువైనకాపు
మఱి నేమఱకు మెల్లమార్గంబులందుఁ, బ్రతిదివసంబులోపలను వెల్పలను
నని దానవాధీశుఁ డాకుంభకర్ణుఁ, గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింప

రావణుఁడు కుంభకర్ణునితో రామునిరాక యెఱింగించుట

విను కుంభకర్ణ నీవిన నిది యొకటి, జనపదంబున కేఁగి చయ్యన నేను
రాముని దేవి ధరాసుత సీతఁ, గామించి తెచ్చితిఁ గంజదళాక్షి
మఱి మొన్న నొకహనుమంతుఁడన్ కోఁతి, పఱతెంచి సీతకుఁ బరిణాము మొసఁగి
దేవి నీపతి రామదేవుండు వచ్చు, నావిని మదిలోన నమ్మి మోదమున
నున్నది యాసీత యుద్ధండవృత్తి, నన్నరుండును నబ్ధి కవ్వల విడిసె
వనములలోఁగల వనచరావలిని, బెనుమూఁకగాఁ గూడెఁ బెట్టుకేతెంచె
సురనాథసురలను స్రుక్కించినాఁడ, హరుఁడున్నకైలాస మగలించినాఁడ
శంభుచేఁ జంద్రహాసము గొన్నవాఁడ, నంభోజభవు వరం బడిగికొన్నాఁడ
దానిపై నీలావు తవిలియున్నాఁడ, మానవుండే నన్ను మర్దించువాఁడు
రాముఁ డెన్నఁడు గెల్చు రణభూమి నన్నుఁ, గోమలి నెన్నఁడు గొనిపోవు నతఁడ
అనవుడుఁ గోపించి యాకుంభకర్ణుఁ, డనియె రావణుతోడ నందఱు వినఁగ
రాము వంచించి యారాముని దేవి, నేమఱియుండంగ నెత్తి యుద్వృత్తిఁ
దెత్తురే యిటులేల తెచ్చితి కడఁగి, చిత్తంబులో నీతి చింతింపవైతి
ధర్మమార్గము నీవు దలపోయవైతి, వర్మిలి కులమెల్ల నడఁగఁజేసితివి
సీతఁ దెచ్చినయప్డె చెడియె నీలంక, నేతెఱంగుననైన నిదియ నిశ్చయము
ఎట్టైననేమి యా యినకులేశ్వరుని, నెట్టనశరములు నెఱిగాడకుండ

బ్రతికివచ్చితి నీదుభాగ్యంబుకతన, నిదిమేలు కీడని యెన్నంగనేల
పోవచ్చునా యింకఁ బూనుదుగాక, రావణ యింతకార్యము చక్కఁబెట్ట
నామీఁదఁబడియె వానరుల రాఘవుల, నేమియుఁ దలఁపక యింక సుఖంపు
మని పల్కుచుండ మహాపార్శ్వుఁ డనియె, ఘనభుజ యెల్లలోకములకు నీవ
పతివఁట యాసీత బలువునఁ బట్టి, రతిసల్పనేరవా రాక్షసాధీశ
యనవుడుఁ జిత్తంబునందు మోదించి, దనుజాధినాథుఁ డాతనిఁ జూచి పలికె
విను మహాపార్శ్వ యేవేధ కొల్వునకుఁ, జనుచోటఁ బుంజికస్థల యనునాతి
వలుపూడిపడఁ బట్టి వడఁ గుదియించి, బలిమి భోగించితి పైఁబడి తొల్లి
యామేరలెల్లను నబ్జజుం డెఱిఁగి, నామీఁదఁ గోపించి నయమింతలేక
యోరిరాక్షస కడు సుచితంబుదప్పి, నారీజనమునెడ నయమింతలేక
బలిమి నెవ్వతెనైనఁ బట్టి భోగింపఁ, దలతు వెప్పుడు నీదు తలలప్పు డవిసి
వారక యిలనూఱువ్రయ్యలై రాలు, పోరోరి యనుచు శపునిఁజేసి విడిచె
నదికారణంబుగా నంగనాజనుల, హృదయంబె కదియక యేనెందుఁ గదియ
నాలావుగొనక వానరులతోఁగూడి, యీలంకపై రాముఁ డిటవచ్చునెల్ల
నిద్రించుసింహంబు నిరిమేలుకొల్పు, భద్రదంతావళప్రతతివిధంబు
అని పల్కుటయు నవ్వి యవ్విభీషణుఁడు, దనుజనాథునితోడఁ దగ విన్నవించె
మొనయు నిట్టూర్పులె మ్రోఁగుటగాఁగ, ఘనమైనచింతయే గరళంబుగాఁగఁ
గోపంబు చలమును గోఱలు గాఁగ, నేపరియుండుటే యొరగొంటగాఁగ
నమరంగఁ జెక్కున హస్తినచేయి, కమనీయతరఫణాకారంబుగాఁగ
నిజనఖంబులు మణినికరంబుగాఁగ, భుజయుగమధ్యంబు భోగంబుగాఁగ
దారుణంబైన సీతాకాలసర్ప, మేరూపముననైన నేలపోనిచ్చు
నపకీర్తియఁట పాపమఁట సుఖంబునకు, విపరీతమఁట యిట్టివిత మేల యుడుగు
మని యన్నతోఁ బల్కి యంతటఁబోక, సునిశితమతిఁ బ్రహస్తునిఁ జూచి పలికె
నెఱిపిడుగులఁబోలు నృపునిబాణములు, గఱులాని నీదువక్షముగాదునాఁడు
ఎఱిఁగెదు గాకేల యిట్టట్టుపడెదు, కఱుసులాడెదు మాడ్కి గాదుమీఁదటను
ఈకుంభకర్ణుండు నీనికుంభుండు, నీకుంభుఁడును మఱి నీమహోదరుఁడు
నీమహాపార్శ్వుండు నీయింద్రజిత్తు, రాముని గెల్చువా రారణంబునను
నీపుచూపక యప్పు డెందుఁబోయెదరు, ప్రాపులై మీరడ్డపడెదరుగాక
కడఁగి యింద్రుఁడు వచ్చి కాచిననైనఁ, గడుసడ్డపడి సురల్గాచిననైన
కాలాగ్నిరుద్రుండు గాచిననైనఁ, గాలమృత్యువు వచ్చి కాచిననైన
రావణుఁ జంప కాకాముభూపాలుఁ, డేవిధంబునైన నేల పోనిచ్చు
దనుజేశుపై విల్లు ధరియించునపుడు, మనచేతఁబోవునే మనుకులేశ్వరుఁడు
పిడికిట నడఁగునే పేర్చుకాలాగ్ని, పుడిసిట నడఁగునే పొంగారుజలధి
పట్టంగ నలవియే పాతాళతలము, గట్టింప నలవియే గగనభాగంబు
తెంపంగవచ్చునే దిగ్వితానంబు, త్రుంపంగవచ్చునే ధూర్జటివాలు

నఱచేత నడఁచిన నడగునే సూర్యుఁ, డెఱుఁగని మీతోడ నిట్లాడనేల
కడుమూర్ఖ నాకారికామాతురుండు, మడియఁడె మీయట్టి మంత్రులు గలుగ
నాబుద్ధి వినునె యీనాకేశవైరి, మీబుద్ధిఁ జెడుఁగాక మిక్కిలి క్రొవ్వి
యని మొగమోడక యాడఁ బ్రహస్తుఁ, డనువాఁడు గైకొన కావిభీషణుని
నురగులతోఁ బోరి యోడ మెన్నఁడును, సురలతోఁ బోరాడి స్రుక్క మెన్నఁడును
యక్షులతో గిట్టి యలయ మెన్నఁడును, రాక్షసావళిచేతఁ గ్రాగ మెన్నఁడును
నరుఁడైన యారామనరనాయకునకు, దురములో నేమోడుదుమె విభీషణుఁడ
యేచందమున వారి నెఱుఁగుదో కాని, నీచేత వింటిమి నేఁడింత వింత

ఇంద్రజిత్తు విభీషణునికి తనలా వెఱింగించుట

దనుజులలావంత తక్కువే యనినఁ, జనియె నాగ్రహమెత్తి జంభారిజిత్తు
తోరమై పేర్చిన దుర్మదగ్రంథి, యారాముతమ్ము శరాగ్నిచేఁ గాలఁ
గారణం బటమీఁదఁ గలుగుటఁ జేసి, యేరూపమున నీతి నిచ్చలో నిడక
విను విభీషణ నీవు వెఱచెదుగాక, మనయందు రాక్షసమహిమ లూహింప
హీనుఁడైనను నోపు నింతటిపనికి, మానక రామలక్ష్మణుల మర్దింప
మూఁడులోకములు నిమ్ముల నేలువానిఁ, వాఁడివజ్రముగల వాసవుఁ బట్టి
చెఱఁబెట్టనా వాని సితకరిఁ బట్టి, విఱువ నాకొమ్ములు వింతయే నీకు
ననలు గాఱించి యయ్యంతకు నొంచి, దనుజుఁ దూలించి యాతఱి పాశి నోడిచి
గాలిఁ దూలించి యక్షుపుని మర్దించి, శూలి నోడించి నిష్ఠురత వాటించి
యేచిన నాచేత నీనరుల్చావ,రా చెప్పె దుబ్బి వారలఁ బెద్దచేసి
కలఁతునా సప్తసాగరములు సొచ్చి, ములపుదునా మేరుమందరంబులను
దాఁటుదునా ధరాతలమెల్లఁ గడవ, మీటుదునా నేలమింటితో నంటి
వంతునా జగములు వనచరకోటి, ముంతునా బెగడొంద మున్నీటిలోనఁ
బుడమిమోచిననాగపుంగవుఁ బట్టి, పిడుతునా విషమెల్లఁ బిచ్చిలిపోవ
నొక్కట దండంబు లొడిసి రాఁదిగిచి, దిక్కరీంద్రుల నీడ్చి తెత్తునా పూని
భూమితో నిప్పుడు భుజశక్తి మెఱసి, ప్రాముదునా చంద్రభానుబింబముల
వనచరకోటుల వైతునా పట్టి, దినకరబింబంబు దిక్కులు గడవ
నాలంబులో వానరాలిరక్తములు, గ్రోలింతునా భూతకోటులచేతఁ
గప్పుదునా యంపగములచే మిన్ను, నిప్పుడమియు దిక్కు లిన్నియుఁ గూడఁ
గడునొగల్కులములఁ గబళించి త్రిప్పి, యడఁతునా నేలతో నర్కునిరథము
పెడచేతలోఁ చేతఁ బృథివియు మిన్ను, నడఁతునా పొడిపొడియై రాలిపోవ
దనుజాధినాథుని తమ్ముఁడవగుట, నిన్ను నొండనక మన్నించితిఁ గాక
యొరుఁడైన సైఁతునే యూరకయుండు, వెరవిడిమాటలు వేయాడనేల
ననవుడుఁ గోపించి యావిభీషణుఁడు, గనుఁగొని పలికె నుద్గాఢవాక్యముల
నెవ్వనిగాఁ జూచి తినకులేశ్వరునిఁ, గ్రొవ్వులు పలికె దీకొలువులోపలను
గణుతింప నింద్రుండు గాఁడు నీకోడ, రణభీషణుండగు రాముండుగాని

గణుతింప ననలుండు గాఁడు నీ కోడ, రణభీకరుం డగు రాముండుగాని
గణుతింపఁ గాలుండు గాఁడు నీ కోడ, రణమహోగ్రుం డగు రాముండుగాని
గణుతింప నిరృతి గాఁడు నీ కోడ, రణ[illegible] డగు రాముండుగాని
గణుతింప వరుణుండు గాఁడు నీ కోడ, రణజయోన్నతుఁ డగు రాముండుగాని
గణుతింప ననిలుండు గాఁడు నీ కోడ, రణనిపుణుం డగు రాముండుగాని
గణుతింప ధనదుండు గాఁడు నీ కోడ, రణకౌశలుం డగు రాముండుగాని
గణుతింపఁ బశుపతి గాఁడు నీ కోడ, రణవిచక్షణుఁ డగు రాముండుగాని
వారి కోర్చినరీతి వచ్చునే యోర్వ, నా రామవిభునకు నాలంబులోనఁ
దలముకప్పినయట్టి తలఁపులు దలఁచి, తల క్రిందుపడియెదు తథ్యముఁ గ్రొవ్వి
కులనాశకుండవు కొడుకవా నీవు, వలను రావణు పగవాఁడవుగాక
పావకనిభ రామబాణఘట్టనకు, రావణుండే యోర్చు రణములో నిలిచి
యీ రావణుఁడు తనహితులతోఁ గూడ, నా రామభూపాలు నడుగుల కెఱఁగి
మణులతో వారణమణులతోఁ దురగ, మణులతో మానినీమణి నిచ్చుటొప్పు
ననవుడు రావణుం డావిభీషణునిఁ, దనరోషదృష్టులఁ దప్పక చూచి
పగవానితోనైనఁ బాయక కూడి, మిగిలిన యేపుతో మెలఁగంగవచ్చుఁ
బటువిషం బొలికెడుపాముతోనైనఁ, జటులనిర్భరవృత్తిఁ జరియింపవచ్చుఁ
దనవానివలెనుండి దాయలఁ గూడి, మనువాసితోఁ గూడి మనరాదు కాక
వారక నీ వట్టివాఁడవు గాన, వైరుల నాయొద్ద వర్ణించె దుబ్బి
తమ్ముఁడ వని చంపఁ దగదుగా నీవు, తమ్ముఁడవా పగదాయవు కాక
యనవుఁడు బ్రహ్మశాపాతిశయంబు, గొనకొనుట యెఱింగి కుంభకర్ణుండు
తమ్మునిమాటలు తగ వనలేక, గు[illegible] నెట్టనరాక
యగ్గౌరవముతోడ నన్నకు మ్రొక్కి, దిగ్గున గుహకు నిద్రింపంగఁ జనియెఁ
జనినపిమ్మట విభీషణుఁడు రావణుని, కనియెఁ జిత్తంబున నలుక రెట్టింప
నన్నవుగాన నీ యాపదకులికి, యున్నియుఁ జెప్పితి హిత వని నీకుఁ
బొసఁగదు బహుముఖంబులు గాన నీకు, నసురేశ చెప్పిన యాప్తులబుద్ధి
హితవుచెప్పెడిమంత్రు లెందును గలరు, హిత వని వినురాజు లెందు గల్గుదురు
తగు నాకుఁ జెప్పుట తగు నీకు వినుట, తగ సీత నిచ్చుట తగు నీతి నీకు
బలమెంత గలిగినఁ బరికించి చూడ, నల వెంత గలిగిన నది యేమి సేయుఁ
బురుషుని వెరవునఁ బోనీక పేర్చు, బరికింప దైవంబు ప్రతికూల మైన
దైవంబు నా నొండు దైవంబు గలదె, దైవంబు దశరథతనయుండు గాక
యని విభీషణుఁ డాడ నా రావణుండు, విని కోపల్ మండిపడ వికృతాస్యుఁ డగుచు
మిన్నందఁ గోపించి మీసంబు లదరఁ, గన్నుల మంటలు గ్రమ్మ నిట్లనియె
నెన్నెదు రాముని నిటు దైవ మనుచు, నన్నరుఁడే దైవ మయ్యెడునేని
వెడగయి తండ్రిచే వెడలంగనొట్టు, వడి యడవుల నేల పడి మ్రగ్గి స్రుక్కి
వినుమాకు నలమును వేరుపెల్లంకి, దినియెడివానినే దేవర యండ్రు

ననుఁ దాఁకవలదె క్రన్నన నెదిరించి, తనదేవిఁ గొనిరాఁగ దైవంబయేని
నలసి తమ్ముఁడు దాను నడవులలోనఁ, బలవించి పలవించి పలుమాఱుఁ దిరిగి
వచ్చి సుగ్రీవుఁ డన్వానరుమఱుఁగు, చొచ్చుట దైవంబుచొప్పులే తలఁపఁ
బలుమఱు నేటికీ పందమానవునిఁ, జెలఁగి నాతో సరి చేసి చెప్పెదవు
అనిన రావణుతోడ ననియెఁ గ్రమ్మఱను, దనలోన నవ్వుచుఁ దగవిభీషణుఁడు
ఎసఁగి దివ్యులఁ బెంప ఋషుల రక్షింప, నసురుల శిక్షింప నవనిఁ బాలింప
నాదినారాయణుం డర్కవంశమున, నాదశరథునకు నమర జన్మించె
వనజాసనాదులు వర్ణింప లేక, సనకాదులును గూడి చర్చింప లేక
అమహామహిమ నీ కలవియే తెలియ, రాముఁడు మర్త్యుండె రాక్షసాధీశ
కాన రామునిఁ గని కంజాస్య నిమ్ము, దానవేశ్వర మనఁ దలఁచెదవేని
మలఁగక యర్థకామంబులవలనఁ, దలఁ పగ్గలంబైన ధర్మ మెక్కడిది
నీవొల్ల వెన్నఁడు నీతిమార్గంబు, నీవారు నొల్లరు నీకంటె మున్న
కానఁ గార్యాకార్యగతి యెట్టిదనిన, దానవేశ్వర నీకు ధర్మంబు గలదె
వాతూలసుతుచేత వనముచెడ్డట్లు, సీతచే లంకయుఁ జెడఁగల దింక
వచ్చెద రగచరు లవ్వారిధి దాఁటి, వచ్చి యీ రాక్షసవనితల నెల్ల
మోడ్చినకరముల ముందరల్వట్టి, యీడ్చెద రటువలె నీడ్వకమున్నె
యొప్పింపు మా సీత నుర్వీశ్వరునకుఁ, దప్పక చెప్పితి దానవాధీశ
మండెడినగ్నులమాడ్కి రాఘవుని, దండిబాణంబు లుద్దండత వచ్చి
నీరొమ్ము గొని కాఁడ నేర్తునె చూడ, నీరాజ్యగతి చూడ నేర్తుఁ గా కేను
ప్రళయానిలము ఘనపర్వతశిఖరములు ద్రోచుపగిది రాముఁడు భండనమున
నీతల లందంద నేలపైఁ గూల్చు, నేర్చును వీక్షింప నిర్జరారాతి
యనుడు విభీషణు నదరంటఁ జూచి, మునుకొని పదిమొగంబులు జేగురింపఁ

### రావణుఁడు విభీషణునిఁ దన్నుట

గటము లుప్పొంగ నొక్కట నూర్పు లెసఁగఁ, బటుధూమములతోడి పావకుం డనఁ
బడహాలి మేదినీభాగంబు వగుల, నదలుపుబెట్టున నాకస మగల
నద్దిరా యితనికోపావేశ మనఁగ, గద్దియమీఁద డిగ్గన డిగ్గనుఱికి
యడిదంబు జళిపించి యటు వ్రేయఁ బూని, యుడిగి విభీషణు నుగ్రతఁ దన్నెఁ
దన్నిన వజ్రంబు తాఁకునఁ గూలు, నున్నతగిరివోలె నుర్విపైఁ బడియెఁ
బడినవెండియు వ్రేయఁ బాఱఁ బ్రహస్తుఁ, డెడసొచ్చి వల దని యొడలించె వాలు
కొలువెల్ల నాతని కోపంబుఁ జూచి, తలకొని యెంత వింతలు పుట్టె ననఁగ
ననలార్చునతుల నదర దైతేయుఁ, డనియె నిర్దయతఁ బ్రహస్తునిఁ జూచి
వీనిదురుక్తులు వింటె ప్రహస్త, వీని నమ్మెడిది యెవ్విధిఁ దమ్ముఁ డనుచు
వెడలంగఁ ద్రోయుము వేగంబె వీని, నెడచేసి మొగమోడి లేని నాయాన
యనినఁ బ్రహస్తుండు నవ్విభీషణునిఁ, గనుఁగొని పలికె నాగ్రహవృత్తిదోఁప
వలదిట నీ వుండవలసినయెడకు, వెలువడి యరుగు మిప్పాటికిఁ బాసి

యనిన విభీషణుం డతికోపుఁ డగుచు, ననలుండు నలుఁడును హరుఁడు సంపాతి
యనువారితోఁ గూడి యసురేంద్రుతోడ, ననియె నుద్భటగదాహస్తుఁడై నిలిచి
మదనాతురుండవు మఱిపాపములకుఁ, గుదురైనవాఁడవు క్రూరకర్ముఁడవు
మున్నె కదా నిన్ను మూర్ఖునిఁ బాయ, నున్నాఁడ నిది క్రొత్తయును గాదు నాకు
నార్తరక్షకునిఁ గృపాంబుధి దివ్యమూర్తి జగద్ధితంబునకుఁ బుట్టినట్టి
సత్యసంధుని రామజనపాలచంద్రు, నిత్యయశోనిధి నిర్మలాత్మకుని
శరణని పోయెద శరణన నతఁడు, కరుణతోఁ బ్రోచు నెక్కాలంబునందు
నేను పోయిననైన నిటమీఁద నెఱిఁగి, మానైన నీతితో మును దానవేంద్ర
యట్టునుగాదేని యగచరుల్లంకఁ, జుట్టిన యప్పుడైనఁ జొనుపు నాబుద్ధి
యట్టునుగాదేని యర్కవంశజుఁడు, దట్టించునప్పుడైనఁ దలఁపు నాబుద్ధి
నొండేని రఘురాము నుగ్రబాణములు, దండించునప్పుడైనఁ దలఁపు నాబుద్ధి
నని పల్కి యన్నకు నమస్కృతుం డగుచుఁ, దనతల్లినగరి కుద్ధతగతిఁ బోయి
చెలఁగినసింహంబుచేఁ బడి తప్పి, మలుగసింగతోడి మదకరివోలెఁ
భీకరారావసంక్షోభితుఁడై వచ్చి, చేకొని పిడుగ గడఁచినయద్రివోలెఁ
జని యటఁ గైలాససదృశమైనట్టి, ఘనతరంబగు విశ్వకర్మచే నైన
గృహమున నుపవాసకృశమైనమేన, మహితశుక్లాంబరమానిత యగుచు
వెన్నెలరసమున విదళించి తివిచి, మిన్నేటినురువున మెఱుఁగిడ్డకరణి
నరసినబొమలును నరసినశిరము, గర మొప్పఁ బెద్దయు గౌరవం బొప్ప
బన్నుగా ముదుకకుప్పసములు దొడిగి, చెన్నుగ బ్రద్దలు చేతులఁ బట్టి
ముదిసినవిప్రులిమ్ముల నెంగిలేని, వదలక చేరి సావాసులై కొలువఁ
గరుణాప్రవాహంబుగా వచోభంగి, సరళత్వమూర్తులచందంబు గాఁగఁ
బొలుపారు శమదమంబులు తేటంబులుగఁ, గలసరులెల్లఁ జొక్కపు నుర్వ్యాగాఁగ
వెలసిన తనయొద్ది వేదఘోషములు, సలలితం బగుచున్న జలఘోషములుగ
వినుతబహుద్విజవితతులు చెలఁగఁ, గనుపట్టు జాహ్నవి గంగ నా నొప్పి
బహుపురాణంబులు బహువేదములును, బహుశాస్త్రములు పెక్కు బ్రహ్మరాక్షసులు
బహుభంగిఁ జదువంగ బహుభక్తి వినుచు, బహుళనిర్మలశుభప్రభఁ దేజరిల్ల
నుండియు రావణు నొప్పమిఁ దలఁచి, కొండంతవగపు చేకొనియున్నతల్లి

తల్లియొద్దకు విభీషణుండు వచ్చుట

గాంచి దండముపెట్టి కన్నుల నీరు, నించి దుఃఖితుఁడైన నివ్వెఱగంది
కైకసి నందనుఁ గరములనెత్తి, కైకొని యక్కునఁ గదియంగఁ జేర్చి
లోపలియిండ్ల నాలోకింపరాని, యాపద ల్పుట్టెనో యటు కాక మఱియు
బ్రాహ్మణవధయుఁ జొప్పడియునో కాక, బ్రహ్మ కోపించెనో పరికించి చూడ
హరి యల్గెనో హరుఁ డల్గెనో రాముఁ, డరుదారఁ గ్రోధసమగ్రుఁడై నాఁడో
యిది యేమి నాపుత్త్ర యింత శోకింప, నిది యేమి తెలియఁగ నాకింతయుఁ దెల్పు
మది గెద నదివిన్న యంతకు నాకు, నొడలిలోఁ బ్రాణంబు లుండవయ్యెడిని

అనిపల్కు తల్లికి నావిభీషణుఁడు, మునుకొని కరములు మొగిచి యిట్లనియె
నవధారు దేవి నీయగ్రనందనుఁడు, రవికులాధీశ్వరు రాకను నేఁడు
మంత్రులు దానును మంత్రకూటమున, మంత్ర మిట్టిది యని మదిఁ జర్చసేయ
నిన్నివిచారంబు లేల రామునకు, నెన్నిభంగుల సీత నిచ్చుట లెస్స
యీమున్న రాఘవుం డీయబ్ధిఁ గట్టి, యీకులం బడపక నేల పోనిచ్చు
నని యొత్తిచెప్పిన నాపంక్తికంఠుఁ, డనలుండు మండిన యాకృతి మండి
తన్నె గద్దియతోడ ధరఁబడ నన్నుఁ, దన్ని యంతటఁ బోక తాలిమి దక్కి
యడిదంబు జళిపించి యటువ్రేయఁబూనఁ, జెడక నేఁ బ్రతికి వచ్చితి నొకభంగిఁ
బోయెద నారామభూపాలుఁ గానఁ, బోయి యాతనికృపఁ బొంది యుండెదను
ఈవీట నాకింక నెవ్వరు గలరు, భావింపఁగా నాప్తబంధువు లారులు
అనవుండు నతిభీత యై మూర్ఛ నొంది, ఘనమైన ధైర్యంబుకతమునఁ దెలిసి
కైకేసీ నందనుఁ గనుఁగొని పలికె, నీకథ మున్నె నే నెఱిఁగినదాన
నది యెఱింగించెద నమరులు మునులు, త్రిదశేంద్రుఁడును బ్రహ్మదేవుఁడుగూడి
యమృతాబ్ధికడ కేఁగి యచ్యుతుఁ గాంచి, తమపడు నిడుములు తా మెఱింగింప
నీరసంబున మిమ్ము నేచుచున్న, క్రూరుల రావణకుంభకర్ణులను
జంపుటకై యుర్విఁ జనియించువాఁడ, సొంపారవర్తించు సూర్యవంశమున
నని దేవుఁ డాడిన నావార్త నాకు, వినుపించె మాతండ్రి విశదంబుగాఁగ
విని యేను వెఱచి మద్విభున కిట్లంటి, నెనయంగ నీకులం బెవ్వఁడు నిలుపు
నీపుత్రకులలోన నిక్కంబు చెపుమ, ఆపుణ్యుఁ డెవ్వఁడో యనఘ నాకనిన
సత్యంబు ధర్మంబు శౌచంబు గలిగి, నిత్యయశోనిధి నీకడఁగొట్టు
కొడుకు రామునికృపఁ గోరి యీలంక, కడునొప్పఁ బాలింపఁగల వాఁడు మీఁద
ననిచెప్పి తపమున కరిగె మాతండ్రి, యొనర నమ్మేరునగోపాంత్యమునకుఁ
గాన నాతఁడు హరి కంజాప్తకులుఁడు, మానిని యాసీత మహాసీయలక్ష్మి
విశ్రవసునిమాట వేఱొక్కటగునె, విశ్రుతకీర్తి యేవిధముల నైనఁ
జనుము రామునిఁ గని శరణని మ్రొక్కి, మనుము రాక్షసకోటి మనుట చింతింపు
ఆయువును శ్రీయు నగుఁగాక నీకు, నాయన్న పొమ్ము శ్రీనరనాథుకడకు
నని యక్షతలుపెట్టి యర్మిలిఁ జేర్చి, తనయుని దీవించి తగ వీడుకొలుప
నతఁడును తల్లికి నవనతుం డగుచు, మతిలోనఁ బొంగుచు మంత్రులు దాను
రావణుతనువునఁ బ్రాణంబు లైదు, నీవిధంబునఁ బోవు నిఁక ననుమాడ్కి
వేగంబె యాకాశవీథికి నెగయ, నాగుణాఢ్యునిఁ జూచి యాలంకవారు
తమతమవీథులఁ దమదులోఁగిళ్ళఁ, గుమురులుగాఁ గూడుకొని పల్కి రపుడు
ధర్మంబు దిగనాడి తగఁ దమ్ముఁ దనక, పేర్మి వోఁ బల్కు విభీషణు విడిచె
నీతెఱంగున నిపు డీరావణుండు, నీతియు ధర్మంబు నేర్పుఁ గోల్పోయెఁ
జెడియెగా కీలంక చెప్పనే లనుచు, నుడుగనివగఁతో నుండెడువారుఁ
నీలంక యాతఁడె యేలుఁ బొమ్మనుచుఁ, బొలించి తమమనంబుల నెంచువారుఁ

గోరి యాతఁడు రాముఁగూడఁ గాకేమి, యీరావణుఁడు వ్రగ్గునే యనువారు
నరనాథుఁ డీతని నమ్మునే యచటి, కరిగిన ననివార లనుచు నుండఁగను

విభీషణశరణాగతి

అంత విభీషణుఁ డాకాశవీథి, సంతసంబున మంత్రిజనులతో నెగసి
వచ్చుటఁ గనుఁగొని వనచరులెల్ల, నచ్చెరువడి చూచి రటు తలలెత్తి
యెత్తినరాముచే నింద్రారి యింక, నెత్తఁడు దలలు పేడెత్తుఁ దత్కాలము
ఎత్తినభయము వో నిటసురలార, యెత్తుఁ డాత్మలఁదల లెత్తుఁ డన్నాడ్కి
నప్పుడు సుగ్రీవుఁ డగచరాధిపులఁ, దప్పక వీక్షించి తగవారి కనియె
వనచరులార యీవచ్చు రాక్షసునిఁ, గనుఁగొనుం డదె వాఁ డఖండవిక్రముఁడు
ఘనమైన పర్వతాకారంబువాఁడు, ధనురాదిశస్త్రముల్ దాల్చినవాఁడు
మిక్కిలి పొడవున మెఱసినవాఁడు, స్రుక్కక యిటకు వచ్చుచు నున్నవాఁడు
ననవుడుఁ గడఁగి యయ్యగచరాధిపులు, ఘనపర్వతములు వృక్షములు చేఁబట్టి
మముఁ బంపు సుగ్రీవ మముఁ బంపు దేవ, సమరంబులో దైత్యుఁ జంపెద మనఁగ
నావిభీషణుఁ డనె నగచరులార, మీవాఁడ నిటు సంభ్రమింపంగవలదు
రావణుతమ్ముఁడ రాక్షసేశ్వరుఁడ, భావింప నేను నిష్పాపమానసుఁడ
శరణని యారామజనపాలుఁ గాన, నరుగుదెంచినవాఁడ నట లంకనుండి
రావణుతో నేను రామభూపాలు,దేవి నిమ్మని పెక్కుతెఱఁగుల నంటి
ననవుడు నామాట కతఁడు కోపించి, తనసభలోపలఁ దన్నె నన్నిట్టు
తన్ని యంతటఁ బోక తనవీటిలోన, నున్నఁ జంపుదు నని యోటిలకాఁడె
నేనును వెలువడి యీరామచంద్రుఁ, గానంగవచ్చితిఁ గానఁ జింతింపఁ
గపటుండఁగాను నిష్కపటమానసుఁడఁ, గపులార నాయెడఁ గపటంబు లేదు
సభయుండ నగునాకు సంప్రీతి వెలయ, నభయ మిప్పించుఁడీ యవనీశుచేత
ననవుడు సుగ్రీవుఁ డారాముకడకుఁ, జని విన్నపము చేసె సవినయుం డగుచు
రావణుతో నల్గి రాయిడి వుట్టి, దేవ వీఁడొక్కఁ డేతెంచియున్నాఁడు
మొత్తంబుతో నభంబున నున్నవాఁడు, చిత్తంబు మాదెసఁ జేర్చినవాఁడు
అమరారితమ్ముఁడ ననుచున్నవాఁడు, విమలవాక్యంబుల వెలసినవాఁడు
ఆదిత్యకులనాథ యభయమి మ్మనుచు, మోదవాక్యంబుల మొనసినవాఁడు
మీకృపకలిమి యెమ్మెయి నున్నయదియొ, నాకుఁ జూడఁగ వీని నమ్మంగరాదు
నరనాథ కపటంబునకుఁ బుట్టినిల్లు, లరయ రాక్షసులుగా కన్యులు గలరె
దనుజాధినాథునితమ్ముఁ డేమిటికిఁ, జనుదెంచు నీనీచుఁ జంపంగవలయు
ననవుడు నంతట సాంజనేయుండు, వినయసంభరితుఁడై విభున కిట్లనియె

రామునకు విభీషణునియోగ్యత సాంజనేయుం డెఱింగించుట

దనుజాధినాథుఁ డుద్దండకోపమునఁ, దను సభలోపలఁ దన్నె నన్మాట
లఖిలంబు నెఱుఁగంగ నాడె నీయసుర, నిఖిలేశ యీమాట నిజముగా నోపు
సుడుగక మనలకై యుచితమాడుటయు, నెడలఁద్రోచినవాని విడిచివచ్చుటయుఁ

గలుగనోపుదుగాని కపటంబుగాదు, వలవదు శంకింప వసుధేశ యితనిఁ
గపటమానసులెట్టి క్రమముననున్నఁ, గపట మింతటిలోనఁ గానంగవచ్చు
నితనిమాటలలోన నేమాటనైన, గృతకమై తోఁపదు కీడనరాదు
మనుజేశ దనుజులమర్త్యజ్ఞుఁ డితఁడు, మనదెస నుండుట మానైననీతి
నను రావణుఁడు పట్టి నాఁడు బంధించి, యెనలేనిబాధల నేచుటఁ జూచి
యితఁడు నాకై పెక్కుహితవులు పల్కె, నితనిచిత్తస్థితి నెఱుఁగుదుఁ గొంత
యనినమాటలు దనయాత్మకు నెక్క, వనజాప్తసుతుఁ జూచి వసుధేశుఁ డనియె
నర్కజ దీన మే లాటఁ గీడాటఁ, దర్కించ నేటికి ధర్మంబుత్రోవ
శరణని వచ్చిన శత్రువునైనఁ, బరికింపఁగా రాచపాడి రక్షింప
నొకకపోతము డేగ యుద్ధతి తఱుము, వికలభావంబున వేగంబె వచ్చి
శిబిమాటు సొచ్చెఁ జొచ్చిన డేగ యడుగ, శిబి తనువిచ్చి చెచ్చెర గువ్వఁ గాచె
నపకీర్తిఁ బొందక నార్తుఁ జేకొన్న, కృప యశ్వమేధసత్క్రియఫలం బిచ్చు
నీవిభీషణుఁ డేల యేచినయట్టి, రావణుండైన గర్వము దక్కి వచ్చి
శరణన్నఁ గాతు నేచందంబునైన, మరియాద లిట్టివి మాకులంబునకు
నభయ మిచ్చితివేగ నర్కజ పోయి, సభయుని నవ్విభీషణుఁ దోడితెమ్ము
అనవుడు సుగ్రీవుఁ డారామకృపకుఁ, గనువ్రాల్చి యటు శిరఃకంపంబుఁ జేసి
పరికింప నీవేళఁ బగవానితమ్ముఁ, డరయంగ శరణన్న నలరి రక్షింప
నీకె కా కెందు నేనృపులకుఁ జెల్లు, కాకుత్స్థతిలక నిక్కము ధాత్రిలోను
నని పల్కి సుగ్రీవుఁ డాకాశమునకుఁ, దనసేనతో సముద్ధతగతి నెగసి
చేకొని యభయంబు శ్రీరాముఁ డిచ్చె, నీకు విభీషణ నిక్కంబు నమ్ము
రమ్మని కపిరాజు రాక్షసరాజు, నిమ్ములఁ గౌఁగిట నెనయంగఁ జేర్చి
తోడ్కొని వచ్చి సంతోషంబు గృపయు, వేడ్కయు నొసఁగ నవ్విభుఁ గానుపించె
నిండ నానందించి నృపుఁ జూచి యపుడు, దండప్రణామము ల్దగఁ జేసి పలికె

### విభీషణుండు శ్రీరామచంద్రు నుతించుట

నిత్యసత్యత్రాణ నిత్యకల్యాణ, నిత్యజగత్త్రాణ నిత్యగీర్వాణ
జగదన్వయాకార జగదేకవీర, జగదుదయాకార జగదబ్ధిపూర
సర్వసంగాతీత సర్వానుభూత, సర్వజగత్పూత సర్వసమేత
గురులఘుక్రమరూప గురుబోధదీప, గురుమధురాలాప గురుచారుచాప
పద్మసన్నిభనేత్ర బహుజీవసూత్ర, పద్మాకలితగాత్ర పరమపవిత్ర
కవిమనస్సంవేద్య కరుణానవద్య, వివిధశాస్త్రాపాద్య వేదాంతవేద్య
పరమాత్ముఁడవు నీవ పరమంబు నీవ, పరమవిద్యయు నీవ పరికింప నెందు
భువనకర్తవు నీవ భువనంబు నీవ, భువనహర్తవు నీవ భువనైకవీర
యాగభోక్తయు నీవ యాగంబు నీవ, యాగఫలప్రదుఁ డరయంగ నీవ
చంద్రార్కులును నీవ జలధులు నీవ, యింద్రాదులును నీవ యిలయును నీవ
శబ్దార్థములు నీవ శబ్దముల్ నీవ, శబ్దముల్ భేదించు శ్రవణముల్ నీవ

మూఁడుమూర్తులు నీవ మూఁడుమూర్తులకుఁ, బోడిమి నవ్వలిపాదవును నీవ
క్షరమును నీవ యక్షరమును నీవ, క్షరసాక్షి నీవ యక్షరసాక్షి నీవఁ
ద్రిభువనవందిత దేవాదిదేవ, యభయ మీఁదేవ నాకఖిలాధినాథ
జయజయ శతకోటిజలజాప్తతేజ, జయజయ సంసారసర్పసుపర్ణ
లలితాగమస్తోత్ర లక్ష్మీకళత్ర, విలసద్దయాపాత్ర విబుధారిజైత్ర
దినకరశశినేత్ర దివ్యచారిత్ర, యనుపమశుభగాత్ర యఖిలైకసూత్ర
వేయునోరులభోగివిభుఁడైన నుతులు, సేయంగనోపునే శ్రీరామ నిన్ను
నప్పద్మసంభవుండైన నీమహిమ, యొప్పెల్ల నుతియింప నోపునే తెలియ
నే నిన్ను నుతియింప నెంతటివాఁడ, దానవుండను వృథా తరళచిత్తుఁడను
భూనాథ నీవాదిపురుషోత్తముఁడవు, కాన నిన్నితరులు గానఁగ లేరు
నరనాథ యార్తుని నన్ను రక్షింపు, పరమదుర్జనదైత్యపతి ద్రుంచివైవు
మఖిలశరణ్యుండ వైననీయడుఁగు, సుఖ మని యే వచ్చి చొచ్చితిఁ బ్రీతి

శ్రీరామచంద్రుఁడు విభీషణు ననుగ్రహించుట

ననవుడు నతని కృపాంబుధిలోన, మనుజేశ్వరుండు క్రమ్మఱ నోలలార్చి
నమ్మ విభీషణ నాకేశవైరి, తమ్ముఁడవా నాకుఁ దమ్ముఁడ వింతె
మఱుఁగకు మింక లక్ష్మణుకంటె నిన్ను, నఱలేనివానిఁగా నాత్మఁ గైకొంటి
నని భయం బుడిపి దయార్ద్రవాక్యముల, జననాయకుఁడు విభీషణు నాదరించి
నెయ్యంబుతోడ నానృపుఁ డప్పు డితని, చెయ్యూఁదుకొని వార్ధిఁ జేరంగఁ బోయి
మాకు నిక్కము చెప్పుమా విభీషణుఁడ, నాకారిశక్తియు నమ్మినబలము
ననిన విభీషణుం డారామచంద్రుఁ, గనుఁగొని మ్రొక్కి నిక్కము విన్నవించెఁ

విభీషణుండు రామునకు రావణునిబలం బెఱిఁగించుట

దోయజదళనేత్ర తొల్లి నారదుఁడు, వాయువుకడ నాగవరులావుఁ బొగడి
ఫణిరాజు ముందఱఁ బవమానులావుఁ, బ్రణుతించి వారికిఁ బగసేయుటయును
రాసిలావులకు వారలు మత్సరించి, భాసురహేమాద్రి ఫణిరాజు చుట్టి
పట్టంగ దానిఁ గంపమునొంద వీతు, నెట్టన నే నని నియమించె గాలి
తనసత్త్వమంతయుఁ దగఁ బూని శేషుఁ, డనిమిషగిరిఁ జుట్టి యసదృశలీల
వేయుఫణంబుల వేశిఖరముల, నాయతభుజశక్తి నంటంగఁ బొదివి
చలమునఁ బట్టిన సప్తవాయువులు, వెలయంగఁ బవనుండు వీవఁగఁ దొడఁగె
శేషుని ఖేదింపఁ జేకూఱకున్న, భీషణగతి వీచెఁ బేర్చి వాయువులు
ఆగాలి నచలంబు లన్నియు విఱిగె, నాగాలి భువనంబు లన్నియు వణఁకె
నాగాలిఁ జలియించె నర్కునిరథము, నాగాలి భూతంబు లన్నియు నఱచెఁ
గదిసిన లోకసంకట మెల్లఁ జూచి, యిది మహాపద వచ్చె నిత్తఱి ననుచు
నర్థిమై బ్రహ్మాదు లచటికి వచ్చి, ప్రార్థించి పవను మాన్పంగ లేకపోయి
పరమసాత్త్వికుఁడైన ఫణిరాజుఁ గదిసి, యురగేంద్ర నీవైన నోర్వంగవలయు
నీముచ్చిరంబుల మిహిరుండు గాలె, మీముచ్చిరంబుల మేదిని గ్రుంగె

మీమచ్చరంబుల మితిమీఱె నబ్ధి, మామాట లాలించి మమ్ము మన్నించి
గాలిని గెలిపించి కరుణ వాటించి, కేళిమై మమ్ము రక్షింపవే యనిన
సురలప్రార్థనకు శేషుఁడు శాంతి బొంది, కరువలికిని వీఁగా ననువిచ్చి
యించుకయొకఫణం బెత్తినఁ జొచ్చి, మించినబలిమి సమీరుండు ద్రోయఁ
జెలువేది యందొక శిఖరంబు విఱిగి, చలకొన్నగాలిచే దవ్వుగాఁ దూల
గురుతరగతి నద్రికూటంబుగాఁగ, ధరణీశ [illegible] బడియె
దేవ యాసింహళద్వీపంబునందు, దేవేంద్రుపనుపున దేవతాశిల్పి
కరకౌశలమున లంకాపురం బనెడు, పురము నిర్మించెఁ దత్పురవరంబునకుఁ
గోట లేడొప్పు నక్కోటకోటకును, వాటమై నాల్గేసి వాకిళ్లు గలవు
తఱుచైనయట్టి కొత్తడములతోడ, నిజమైన ముందఱి యిట్టికకోట
పడమటిద్వార మేర్పడఁ గాచియుండు, రెడపక రాక్షసు లెనుబదికోట్లు
దానవు లుత్తరద్వారంబు గాచి, యేనూటడెబ్బదియేడుకోట్లుండుఁ
దూర్పువాకిలియందుఁ దొలఁగ కేప్రొద్దు, దర్పించియుందురు తగనూటఁబదికోట్లు
దక్షిణద్వార ముద్ధతిఁ గాచియుండు, రక్షణదానవు లఱువదికోట్లు
అరయ నాలోపలి యాఱుకోటలను, నరనాథ యిరువదినాల్గువాకిళ్లు
వరుస నీచెప్పిన వడువున నెపుడుఁ, దరిగాచి యుందురు ధరణీతలేశ
తిరమగు చున్నట్టి దిడ్డివాకిళ్ల, నురుసత్త్వు లుండుదు రొక్కొక్కకోటి
పురమధ్యవీథి నెప్పుడుఁ గాచియుండు, రిరువదిలక్షలు నార్న్నాఱుకోట్లు
కుంభకర్ణునినిద్రగుహఁ గాచియుండు, జృంభణ మొప్ప వసిం చాఱుకోట్లు
మొనసి యారావణు మొగసాలఁ గాచి, కొనియుందు రొకలక్షకోటిరాక్షసులు
ఒవర నావాకిట నుండు రాక్షసులు, వినవయ్య యిరువదివేలకోట్లమిఁ
జెలువంబుగా నింద్రజిత్తువాకిటను, బలవంతు లుందురు పదివేలకోట్లు
ఘనులైన యాయతికాయాదివీర, దనుజులవాకిళ్లఁ దరలకుండుదురు
ఎన్నికతో మఱి యినకులాధీశ, యెన్న రాదానేన యెంతయు ఘనము
వాసవాంతకులావు వర్ణింపఁదరమె, యీసునఁ గైలాస మెత్తినవాఁడు
వనజజుం డతనికి వరమిచ్చినాఁడు, దనుజులచేత గంధర్వులచేత
నమరులచేత నయ్యక్షులచేత, సమరంబులోపలఁ జావు లేకుండ
సమరంబు లేల యేచందంబులందు, సమయింపరాదు రాక్షసలోకనాథు
నతఁడు మీచేతన యనిఁ జచ్చుఁగాని, క్షితినాథ యితరులచే నసాధ్యుండు
కుంభకర్ణుండు చేకొనఁడు చీరికిని, జంభారినైనను సమరంబులోన
నెత్తినమదమున నెఱుఁగఁ డేభయముఁ, జిత్తంబులో నింద్రజిత్తనువాఁడు
హరునకుఁ బ్రియముగా యాగంబుఁజేసి, వరశక్తిఁ బడసెను వజ్రకవచము
నరుదుగా మాయావియై విల్లువట్టి, యరుల నాకాశంబునందుండి గెలుచు
నతిసత్త్వధనుఁడు ప్రహస్తుఁడన్వాఁడు, చతురుండు రావణసైన్యపాలకుఁడు
ఖండేందుధరుచెలికాని సామంతు, ఖండనంబున మాణిభద్రుని నోర్చె

దనుజవీరులు మహోదరమహాపార్శ్వ, లనువారు నతికాయుఁ డనువాఁడు దేవ
బలిమిఁ గైకొనిన దిక్పాలురనైన, గెలుతురు రణమున గిట్టిన యపుడె
యనిమిషకంటకు లైనబల్లిదులు, దనుజేశునకు లక్షతనయులు దేవ
జ్ఞాతులతో బంధుసమితి లెక్కింప, ధాతకు నైనను దరముగా దధిప
యరయఁ గుబేరాదు లరిగాపులన్న, విరచింపనచ్చునె విభవంబుకొలఁది
నెత్తుట మెదడున నెట్టనఁ దనిసి, మత్తులై సంగరోన్మత్తులై చాల
నదటెక్కినట్టిమహాదైత్యవరులు, పదివేలకోటులు బలియు లుండుదురు
వారిలావునఁ జేసి వసుమతీనాథ, యీరావణుఁడు గెల్చె నఖిలదిక్కులను
అనవుడు రాఘవుం డతనితో ననియె, విను విభీషణ మును విన్నాఁడ నేను
మీయన్న యెంతయు మిక్కిలిబంటు, పాయక యాతనిబలము నట్టిదియ
వాఁడెంతవాఁడైన వచ్చి నాయెదుర, వాఁడిమి వాటింప వాఁడెంతవాఁడు
హరిహరబ్రహ్మాదు లాదిగాఁగల్గు, సుర లడ్డగించినఁ జూర్ణంబు చేసి
వానిఁ జంపుదు నిన్నవశ్యంబు లంకఁ, బూని యేలింతు నిమ్ముల దానవేశ
యనిన విభీషణుం డారాముఁ జూచి, వినయంబుతో మ్రొక్కి విభున కిట్లనియె
నీరావణుం డెంత యీలంక యెంత, శ్రీరామ నీబాణశిఖిపర్వనపుడు
లంకకోటలు ద్రోసి లగ్గలుపట్టి, కిన్కతో నసురుల గిట్టినయపుడు
నాలావుచూడుము నరనాథచంద్ర, కాలాగ్నిరుద్రునిగతిఁ బేర్చువాఁడ
ననవుడుఁ బతి వాని నాలింగనంబు, ఘనముగాఁ జేసి లక్ష్మణునకు ననియె
నీసముద్రమునీట నినజుండు నీవు, భూసురాశీర్వాదపుణ్యనాదములఁ

**శ్రీరాముఁడు విభీషణునకు లంకాభిషేకము సేయుట**

గట్టుము వేగ లంకారాజ్యమునకుఁ, బట్టంబు వానికిఁ బ్రతి విభీషణుని
అని యానతిచ్చిన నతఁడును నతని, వననిధిజలములు వనచరుల్దేర
నభిషేక మొనరించి యసురులకెల్లఁ, బ్రభుఁడవు గమ్మని పట్టంబు గట్టి
తలపోయ నాచంద్రతారార్కముగను, సలలితంబుగ రామచంద్రునికీర్తి
యెంతకాలము గల్గు నిలవిభీషణుఁడ, యంతకాలంబు రాజ్యముసేయు మనుచు
నార్చె వానరకోటి హర్షించి యంతఁ, బేర్చి రాఘవుఁడు విభీషణుఁ జూచి
యీయబ్ధి దాఁటంగ నేయుపాయంబు, సేయుద మనవుడుఁ జేతులు మొగిచి
యీవార్ధిఁ గట్టక యింద్రాదులకును, దేవ యెమ్మెయి దాఁటఁ దీరదు కాన
నిది గట్టుటకునైన నినకులాధీశ, పదిలంబుగా వార్ధిఁ బ్రార్థింపవలయు
నని పల్కుచుండంగ నట దశగ్రీవు, ననుమతి శార్దూలుఁ డనుదూత వచ్చి
కపిసేనకొలఁదియుఁ గపులమాటలను, గపులతో నాఁడు రాఘవునిమాటలును
అరసి క్రమ్మఱఁ జని యసురేశుఁ గాంచి, కరములు మొగిచి నిక్కము విన్నవించె
నుత్తుంగయశులును నుత్తుంగభుజులు, నుత్తుంగసత్త్వులు నుత్తుంగమతులు
నగురామలక్ష్మణు లలవుమై విడిసి, రగచరసేనతో నబ్ధితీరమున
గణుతింప నగు నుడుగణముల నైన, గణుతింపఁ దగు వృష్టికణములనైన

గణుతింపనగు నబ్ధికరడులనైన, గణుతింపఁగా రాదు కపిసేనసంఖ్య
నుచిత మీవేళ సామోపాయమునకుఁ, బచరింపఁ బంపు నేర్పరులైనవారి
ననవుడు శార్దూలుఁ డనువానిమాట, విని శుకునకు దైత్యవిభుఁ డర్థిఁ బలికెఁ
జని నీవు వానరసైన్యంబుఁ జొచ్చి, యినసూనుతోఁ బ్రియం జెప్పడఁ బలికి
పగలేమిఁ దెలిపి యాభానునందనుని, మగుడించి రమ్ము సమ్మతి లెమ్ము పొమ్ము
అనవుడు నతఁడేగి యర్కజుఁ గాంచి, యనియె రావణు చెప్పి నంతయుఁ దెలియ
వైరంబుసేయ రావణుతోడ నీకుఁ, గారణం బేమి యర్కజ నాకుఁ జెపుము
వాలి మీయన్నన వలవదు విభుఁడు, వాలికి నీకును వైరంబు గలదు
వాలి యాదానవేశ్వరుపగవాఁడు, చాల రావణుతోడి సంధి నీ కొప్పు
రావణుం డీరాముభామఁ దెచ్చుటకు, నీవిటు రాఁదగునే కపిరాజ
యనిఁ గుబేరుని గెల్చి యతనిపుష్పకము, గొనినరావణు నెఱుఁగుట లెస్సగాదె
అష్టేభ హరునితో నయ్యద్రి యెత్తి, నట్టి రావణుఁ డల్పుఁ డా కపిరాజ
దేవేంద్రుఁ డాదిగా దివిజులనెల్ల, నావిధంబున గెల్వఁడా దానవేంద్ర
కోలఁదిమీఱినహోమగుండంబులందుఁ, దలలు ఖండించి యుద్ధతగతి వ్రేల్చి
జలరుహసంభవుఁ జాల మెప్పించి, వెలయంగఁ ద్రైలోక్యవిజయంబు గొనఁడె
హీనమానవుతోడ నేటిసఖ్యంబు, దానవేశ్వరుతోడఁ దగఁజేయు సంధి
యనవుఁడు గోపించి యగచరులెల్ల, వినువీథి కెగయుచు వెస వానిఁ బట్టి
చెదిరంబుగాఁ బెక్కుపిడికిళ్లఁ బొడిచి, కడుమీఱి మసఁగి తెక్కలు ద్రెవ్వఁ గొట్టి
ముక్కును జెవులును మొగిఁ గోసివైచి, యొక్కట గడఁగిన నుదరి రాఘవుఁడు
దూత నేటికి నింత దొసఁగులఁబెట్ట, బ్రాతిగా వీని నేఁపక పోవనిండు
అనవుడు రాఘవు నాజ్ఞకు నులికి, వనచరులందఱు వాని విడ్చుటయు
వినువీథి కెగసి యావినువీథినుండి, యినసూతితో శుకుం డేర్పడఁ బలికె
రావణుతోఁ గపిరాజ యేమందు, నావుఁడు దారాధినాథుండు గినిసి
తా నెంచ ద్రోహి యీధరణీశ్వరునకుఁ, గాన నా ద్రోహిని గని సైఁప నను
పోరిది నేలోకంబు జొచ్చిననైనఁ, బొరిగొందుఁ గాని యేపోవనీ ననుము
పటుకార్ముకం బెయూపంబుగా నిలిపి, చటులాస్త్రములు పరిస్తరణముల్సేసి
పరఁగఁ గెంధూళ్లను బ్రభలుగాఁ జేసి, తరుచరస్రుక్స్రువతతులు చేపట్టి
సమరభూవేదికాస్థలమున నిలిచి, యమరులకెల్లఁ బ్రియం బెక్కుచుండఁ
గరమొప్ప వీరాంగకములఁ బెల్లుబ్బి, తొరఁగుచునున్న నెత్తురు నెయ్యివోసి
మహితగుణధ్వనుల్ మంత్రముల్గాఁగ, బహురాక్షసశ్రేణి పశుకోటి గాఁగఁ
దనరిన విరహానాదంబులపేర్మి, యనిమిషావలికి నాహ్వానంబుగాఁగఁ
విడువనికాహళవితతులమ్రోఁత, కడునింపుగా సామగానంబు గాఁగ
ఘనమైన రామలక్ష్మణులకోపంబు, మునుకొని నాకోపమును మండుచుండ
ననుపమాగ్నిత్రయంబై యుండ నందుఁ, దనదుప్రాణముల నత్తఱి నాహుతులుగ
రణమునఁ దనవీరరస మడంచుటయుఁ, బ్రణుతింపఁగా సోమపానంబు గాఁగఁ

ప్రకటరాక్షసవీరపశుపలలముల, సకలభూతవ్రాత సంతృప్తి లెసఁగ
విడువక సంగ్రామవిపులయజ్ఞంబు, గడుకొప్పఁజేయు రాఘవసోమయాజి
యటుగాక మున్నె సీతాంగనఁ దెచ్చి, యిటు యిచ్చి బ్రదుకుట యిది బుద్ధి యనుము
అని పేర్చి సుగ్రీవుఁ డాడువాక్యములు, విని శుకచారుండు వేగంబె పోయి
యంత నావృత్తాంత మా రావణునకు, మంతనంబునఁ జెప్పె మఱి రాముఁ డిచట
వనధితీరంబున వనదర్భశయ్య, యొనరించి తాత్పర్య మొప్పారుచుండ
నమృతపయోధిలో నహిశయ్యమీఁద, నమలచిత్తంబున నానందమంది
మున్నున్నతనయాదిమూర్తిచందమున, నన్నగనాయకుం డతికౌతుకమున
నవరత్నకటకమండనమండితంబు, వివిధోర్మికామణి విపులరావంబు
నుర్వీతనూజామృదూపధానంబు, గర్వితాహితశిరఃకాలదండంబు
ఘోరప్రతాపకుంకుమచర్చితంబు, సారంగమదలేపసంవాసితంబు

### శ్రీరాముడు దర్భశయనము చేయుట

నిరతమహాదాననిపుణతానకము, ధరణీభరణదుర్యతాసమం బగుచుఁ
బొలుపొందు దక్షిణభుజశాఖదాన, తలగడ గాఁజేసి ధరణీశ్వరుండు
ఏవిధంబుననైన నిటు దాఁటి పోవఁ, ద్రోవ నా కిమ్మని తోయధి ననుచు
రామభూవరుఁడు వారక నుపవాసి, యై మూఁడుదివసంబు లటు శయనించి
తెలిదెందమున జలదేవత నిలిపి, పలుమఱు నిష్ఠతోఁ బ్రార్థనఁ జేసె
కడగానరాని నీకడఁదిచిత్తంబుఁ, బడయుటకై యేను బడియున్నవాఁడ
నీకేను మ్రొక్కెద నీరధి వేగ, నాకిమ్ము త్రోవ యాదాకారిఁ జంప
నని వేఁడుకొనుటయు నా రాము నెదురఁ, దనరారి యంతకంతకుఁ బొంగి పొంగి
తోరంపుఁదెరలఁ జేతులు విచ్చి విచ్చి, బోరన నురువు తెల్పున నవ్వి నవ్వి
ఘనమీనరుచినాలుకలు గ్రోసి గ్రోసి, చనుమ్రోఁత నట్టహాసము చేసి చేసి
తుది నిరుదిక్కులతోఁ జెప్పి చెప్పి, కదిసినసుళ్ళ వక్త్రతఁ జూపి చూపి
యుదధి యారాముని నొక్కింతగొనఁడ, యది యట్టిదయొ కాదె యారసిచూడ
జడుఁడైనవాఁడు దుర్జనుఁడైనవాఁడు, కడుఁ గ్రూరజీవసంగతినుండువాఁడు
మలుగక తనలోన మండెడువాఁడు, కులగోత్రమైనఁ జేకొని మ్రింగువాఁడు
నెదురెంత వేఁడిన నెఱుఁగునే పెద్ద, నదరుచు నంతంత వడిసుబ్బుఁగాక
కదియంగవచ్చుచోఁ గడఁదిచిత్తంబు, చెదరంగ విషముపైఁ జిలికించుఁగాక
యడఁగక తనప్రార్థనంబు గైకొనక, జడధి వొంగినఁ జూచి జానకీవిభుఁడు
నిడుదకన్నులఁ గ్రేవ నిప్పులు రాల, ముడివడి బొమలు గ్రమ్ముచుఁ గోప మెసఁగ
జలధిదిక్కును మఱి సౌమిత్రిదిక్కుఁ, బలుమాఱుఁ జూచుచుఁ బలికె భూవిభుఁడు
వీనిగర్వము గంటివే లక్ష్మణుండ, నేనెంత వేఁడిన నింతఁ గైకొనక
పొడచూపకున్నాఁడు పొడచూపకున్నఁ, బొడవడఁగింపక పోనేల యిత్తు
నెడపక క్రోలియు నింకింపలేని, బడబానలంబె నా బాణానలంబు
అటుమాటఁ గాక నా యస్త్రంబు గోలఁది, పటుతరమకరసర్పములు మీనములు

గండకంబులు కూర్మకర్కటంబులును, మండూకముల నీరుమానిసుల్ పశువు
లురవడి నొండొంటి నోరయుంగఁ బాటి, కెరలెడి తిమితిమింగిలతద్గిలములు
దండిరాక్షసులును దఱచు నెగళ్లి, గొండలు మునదూరుగొని రూపుమాపి
పరఁగుచునున్న నాబాణాగ్ని శిఖల, నెరసినతనలోని యెమ్ములో యనఁగ
జలములఁ గప్పి యాజలచరకోటి, మెలగుంట మాన్పించి మీఁదఁ దేలించి
చిప్పలు గుల్లలు చిక్కంగఁ దన్ను, నిప్పుడ ధూళిగా నింకించువాఁడ
సిరితండ్రి యనిపెద్దఁ జేసితిఁగాని, హరిమామ యనుచుఁ బాలార్చితిఁగాని
యిందుకుఁ దనువేఁడ నేటికి నాకుఁ, బొందెలుంగక తేర్చి పొంగెడుజలధి
నన్నశక్తునిగా మనంబునం దలఁచి, యిన్ని చందంబుల నేఁచె సౌమిత్రి
తే విల్లునమ్ములుఁ దెగి పొంగియున్న, యీవార్ధి నాచేత నింకుటఁ జూడు
వనధిలో జగములు వడిఁ జూఱబుత్తు, ననుచు రాఘవుఁడు విల్లందుమాత్రమున
బలభేది వణఁకె దిగ్భాగంబు వగిలె, జలధులు గలఁగె నాకౌకరు లడఁగె
ధారుణి గ్రుంగె భూధరములు గూలె, నీరజాసనుఁడును నివ్వెఱఁగందెఁ
జుక్కలు డుల్లె శేషుండు భీతిల్లె, దిక్కులు ద్రెళ్లె నద్దివి యొడ్డగిల్లె
నినకులాధీశ్వరుం డేపు దీపించి, వినుతులు శోభిల్ల విల్లెక్కుపెట్టి
సమవర్తి సంవర్తసమయదండంబు, సమమైనవాని సుజ్వలమైనవానిఁ
బ్రళయకాలానలప్రభ నొప్పువాని, విలయోగ్రచండాంశువిధమైనవాని
సాయకంబులు పెక్కు సంధించి పేర్చి, తోయధిలోపలఁ దొడరి యేయుటయు
గడఁకఁ బొంగితి నన్నుఁ గరుణింపు మనుచుః, జెడక వారిధి యొరసిల్లెడుమూడ్కిఁ
గడుమ్రోసి పర్వతాకారంబులగుచుఁ, గడువేగఁ దరఁగ లాకస మప్పళించె
బలితంపురామభూపాలునిబాణ,ములు పెక్కునాఁట సముద్రునినోట
క్రమ్మెడులాలలకై వడి నురువు, లమ్మహావీచులయందుఁ జెల్లెసఁగి
సొరిది నేలోకంబు జొత్తు నన్నాడ్కి, ధరియింపరాక యెంతయుఁ దల్లడిల్లె
జలనిధియుదక మాస్వాదింపవచ్చి, మలుగక రామాస్త్రమహిమకు నులికి
మొగుళులు మగిడి వెమ్ముచుఁ బోవుభంగిఁ, బొగలెడఁ ద్రవ్వక పొరిపొరి నెగసె
నొఱయుచు రాక్షసు లొఱలుటఁ జూపు, తెఱఁగున నొఱలె నెంతే జంతుసమితి
మనుకులవల్లభు మార్గణవహ్ని, తునుకనొచ్చిన సముద్రునిచిత్తవృత్తి
ఘనతరంబగు నహంకారాదులెల్లఁ, బెలువేది నిలువక పెడఁబాయుకరణి
దైతేయులెల్లఁ బాతాళంబు విడిచి, భీతిల్లి పాఱిరి పెక్కుదిక్కులకుఁ
దనచేత నింకక తనరినవార్ధి, ననయంబు నింకింతు నని వచ్చుచున్న
యినకులుబాణాగ్ని కెదురుగా వచ్చి, యనువుగా నాలింగనము చేసె ననఁగ
దునుగ కంతయు వడి నొడఁగూడి లోని, బడబాగ్ని వారిధిపై మండఁ జొచ్చె
నప్పుడు లక్ష్మణుం డంతకుభంగి, నుప్పొంగి రౌద్రసంయుక్తుఁడై యున్న
యన్నచందముఁ జూచి యళుకుచు వచ్చి, మున్నిటి కెడసొచ్చి మొద్దుకే లమర
మానవేశ్వర యిది మథనంబుసేయ, రానికాలునివీరరసవార్ధిగాదు

మానవేశ్వర యిది మథనంబుసేయ, రానిరుద్రునిరోషరసవార్ధిగాదు
ఈనీరు నిబ్భంగి నెఱయింపఁదొడఁగె, మాన కిప్పుడు నీదుమార్గణవహ్ని
వెలికి నేతెంచి దిగ్వీతతితోఁగూడఁ, గలయ లోకంబెల్లఁ గాల్చునో తగదు
సర్వజగద్ధితచరితంబుఁ బూని, యుర్వీశ యీకోప ముపసంహరింపు
నీకోపమునకు నీ నీరధి యెంత, తే కార్ముకం బింకఁ దెగఁగొన కధిప
యని విల్లువట్టిన నతఁ డీక కోప, మినుమడింపఁగఁ గను లెఱుపును బొంది
యంబకం బేల నాయంబకంబులనె, యంబుధి నింకింతు ననినచందమునఁ
గ్రూరదృష్టులఁ గనుఁగొని యాడుగఱచి, ఘోరిసముద్రుండ యోడవు నాకు
నీనీరు నింకించి నీయందుఁగలుగు, వానినన్నింటిని వడి నీఱుఁజేసి
భర్జింతు నీవింక బంటవై నిలువు, దుర్జనత్వమునను దొడరి నాయెదుట

## శ్రీరాములు సముద్రునిపై బ్రహ్మాస్త్రమేయుట

యిదె తొడిగెద బాణ మేనారి ననుచు, నదలించి యపుడు బ్రహ్మాస్త్రంబు దొడుగ
బ్రహ్మయు నింద్రుండు భ్రమఁ గానశౌరి, బ్రహ్మాండమెల్లను బగిలినట్లయ్యె
భువనంబులెల్లను బొగిలినట్లయ్యె, భువనత్రయములోనిభూతంబు లఱచెఁ
గలయంగ దిశలఁ జీకట్లగ్గలించె, వెలుఁగవు రవిచంద్రవిపులబింబములు
అశనులు వడియె మహానీల మడరె, నశరీర యెఱలె మధ్యాగ్నులు నెగసె
నుడుగక యొకమ్రోఁత యూరక మ్రోసె, జడధి యప్పుడు గ్రాహసమితియుఁ దానుఁ
బొంగెల్ల నెక్కడఁబోయెనో యనఁగ, దుంగఫేనము లెందుఁ దూలెనో యనఁగఁ
బటుఘోష మెమ్మెయిఁ బాసెనో యనఁగఁ, జటులోగ్రవిష మెందు సడుసెనో యనఁగఁ
బెంపెల్ల నెక్కడఁ బెట్టెనో యనఁగ, సొంపెల్ల నెక్కడఁ జొచ్చెనో యనఁగఁ
భంగంబులేకయుఁ బరికించిచూడ, భంగంబునకుఁ దాన పట్టునం బఱఁగి
సత్త్వంబుచెడియు నాశ్చర్యంబుగాఁగ, సత్త్వసమగ్రుఁడై చలనంబునొంది
భ్రమణంబులేకయు భ్రమణంబునొంది, యమితవేగంబున నధికతదక్షి
యారాముచేతి బ్రహ్మాస్త్రంబు దనకు, బీరంబుచెడి వచ్చిబిందువై యుండె
వరమునఁ బెరుగు రావణుమస్తకములు, కరమరుదార నొక్కటఁ ద్రుంచుకొఱకుఁ
గడఁగి రాఘవుఁ డంపగమివాఁడిసేయఁ, బడబాగ్ని నిడి నీటఁ బదనిడుకరణిఁ
జింతింప దేవ నాజీవనం బెంత, యింతియ కాకని యిబ్భంగి మఱియు
నాసముద్రుం డిప్పు డఖిలంబు చూడ, భాసురరత్నప్రభాయుక్తుఁ డగుచుఁ
బ్రజ్వరిల్లెడుపెనుపడగలతోడ, నుజ్వలదహికోటి యొక్కటఁ గొలువ
గంగాదినదులెల్లఁ గడఁకతో నడువ, మంగళబహుపుష్పమాలిక ల్మెఱయఁ
దఱకొని జలచరతతులోలి నడువ, జలనిధి సనుదెంచి సాష్టాంగ మెఱఁగి
కరపద్మములు మోడ్చి కడుసంభ్రమమున, నరవరాగ్రణికి సన్నుతి విన్నవించె
నేను మాయలకు నెంతటివాఁడ, భూనాథ నీవాదిపురుషోత్తముఁడవు
వాయుభూజలనభోవహ్నులాదిగను, నీయాజ్ఞలోనివి నిక్కువం బరయ
నీయందు నున్నవానికి లెక్కలేవు, నీయధీనంబులు నిఖిలలోకములు

తప్పు సేసితి నని దండింపవలదు, చెప్పు మేపనినైనఁ జేసెదఁ గాని
యని విన్నపముసేయ నంత నారాముఁ, గనుఁగొని యప్పుడు గంగాదినదులు
ధరణీతలము మ్రోవ దండము ల్వెట్టి, కరములు ఫాలభాగంబునఁ జేర్చి
శరణార్థులము రామజగదభిరామ, కరుణింపవే మమ్ము కరుణాసముద్ర
యభయంబు వేఁడెద మయ్య యిందఱము, నభినవంబుగను నీ యర్థిఁ గాచి
శుభతరమంగళసూత్రము ల్నిలుపు, త్రిభువనాధీశ్వర దీనమందార
యపరాధిఁ గాచుట యదియె నీగుణము, కృపఁ జూచి రక్షించు గీర్వాణవంద్య
నీమహిమల నెంచ నేరవు శ్రుతులు, నే మెంతవారము యింట మిమ్ముఁ బొగడ
దేవతామయుఁడవు దేవదేవుఁడవు, కావను బ్రోవను కర్తవు నీవ
భూమీశ లోకేశ భూరిప్రకాశ, భూమిజాహృదయేశ పుణ్యస్వరూప
యని యిట్లు నదులెల్ల నభినుతుల్ సేయ, విని యప్పు డారామవిభుఁడు వారలను
మన్నించి భయ మెల్ల మానుఁ డటన్న, నన్నరనాథున కబ్ధి యిట్లనియె
సరసిజోదర మానిజననుతచరణ, శరణాగతార్తరక్షకదివ్యమూర్తి
తరుచరసేన యుదధి నేఁగునపుడు, కరిమకరాదులఁ గదలంగనీను
ఉప్పొంగి కయ్యల కొత్తి చెల్వారిసి, తప్పింప నమ్మారుతముఁ జూచి మ్రోయఁ
గడలేక మిగుల నగాధమైయుండు, సుడివోడమింప నాసొంపు వాటింప
నలరి సేతువుఁగట్టి యైనను నడుపు, మలఘువిక్రమ యమార్గమైనను నడుపు
మనిన రాఘవుఁ డమోఘాస్త్ర మబ్ధిపై, ననుపున మరుభూమిపైఁ బ్రయోగింప
విలసిల్లు నయ్యంపవేఁడిమిచేత, సొలవకందులనీరు శోషింపఁజేసి
యామరుభూమి కుదాత్తుఁడై సర్వ, కామసమగ్రంబుగా వరం బిచ్చె
నది మరుదేశమై యంతనుండియును, వదలక యప్పుష్కల వర్తించుచుండె
మగుడంగఁ జనుదెంచె మనుజేశుశరము, తగఁ బూర్వవిధంబున నుండె
నప్పు డంభోనిధి యనిరామునకు, నప్పొంగునమ్మున నొప్పువాక్యముల
మీతండ్రి దశరథమేదినీశ్వరుఁడు, దైతేయదేవముఖ్యునఁ బెంపొంది
నన్నయోధ్యకుఁ గొని నరనాథపాయి, మన్నించి యప్పుడు మగుడ వీడ్కొలిపి
పుత్తెరవచ్చితి భూతలాధీశ, యిత్తెఱంగున మీకు నే దక్కినాఁడ
దొరకొని కట్టు సేతువు రాఘవేంద్ర, తరుచరసేన నుదధి నడపింపు

### శ్రీరాములు సుగ్రీవునితో సేతువు గట్ట నాజ్ఞాపించుట

మనవుడు రఘురాముఁ డర్కజుఁ జూచి, పనుపు సేతువుఁగట్టఁ ప్లవగపుంగవుల
రయమున నప్పుడు రవినందనుండు, ప్రియమునఁ బంచె వారిధిఁ గట్టఁ దనుచుఁ
జని రంగదుండును జాంబవంతుండు, ఘనులైన యనిలజ గజగవాక్షులును
పనసుండు నలుఁడును పావకనేత్రుఁడును గంధమాదనుండును గవయుండు
శరమొప్పు నీలుఁడు ఘనుఁడు తారుండు, శరభుండు ఋషభుండు శతబలిబలుఁ
హరిరోమవంతుండు నట సుషేణుండు, సొరిదిఁ గేసరియును జ్యోతిర్ముఖుండు

దధిముఖుండును వేగదర్శియు మఱియు, నధికులు కపిసైనికాధిపు లెల్ల
మ్రాఁకులు గొండలు పెల్లగించి కొనఁగ, వీఁకతోఁ గొనివచ్చి విషధిలో వైవ
నొకటియు నీటిపై నుండక మునుఁగ, వికలురై కపులెల్ల వెఱగంది వచ్చి
పతికిఁ జెప్పుటయు భూపతి యాత్మలోన, నతివిస్మయంబంది యబ్ధి కిట్లనియె
నిదియేమి కపివరు లిబ్భంగిఁ దెచ్చి, వదలక తరులు పర్వతములు వైవ
నొకటియు నీటిపై నునికి లే దనిన, సకలాధిపతికి నాజలధి యిట్లనియెఁ
బరమేశ వినుము లోపలి కవివోవఁ, బోరిపోరి జలచరంబుల మ్రింగె నవియు
నమరంగ శతయోజనాయతం బగుచుఁ, దిమి యనుమత్స్యంబు దిరుగు నాలోన
మ్రింగు నామీను దిమింగిలం బొకటి, మ్రింగు నామత్స్యంబు మిగుల దర్పిలము
నిటువలె నొండొంటి నెఱిఁగొనుచుండుఁ, జతులసత్వంబు లసంఖ్యముల్ దేవ
యన విని యట్టి మహాంబుధిఁ గట్ట, ననువేది చెప్పవే యబ్ధీశ యనుడు
నినకులాధీశ్వర యీనలుఁ బనుపు, ఘనుఁడైన యీవిశ్వకర్మనందనుఁడు
భానుకులేశ యుపాయజ్ఞుఁ డితఁడు, దానంతయును దమతండ్రిచే నేర్చె
నడి వానిచేఁ దప్ప వననిధిఁ బట్టు,నడ దది యెట్లన్న వసుధేశ వినుము
శిశువేళ వింధ్యాద్రిచేరువ నడవిఁ, బశుకణ్వుఁ డనుముని పజ్జనాడుచును
ముని యనుష్ఠాన మిష్టులఁ జేయఁబోవ, మునివేల్పులనుబట్టి మోరతోఁపునను
వనధిలోపలఁ బాఱవైచె నీనలుఁడు, చనుదెంచి యమ్ముని చయ్యన నెఱిఁగి
చాలంగఁ గోపించి శప్తుఁ గావింప, బాలుండు తగఁడని పరఁగఁ జింతించి
తనసొమ్ము పోకుండఁ దాఁ దెచ్చుటకును, ననువుఁ జింతించి యాయర్భకుఁ జూచి
తనతపోమహిమ నత్యుపసోత్తముఁడు, ఘనతరం బగునొక్క కట్టడ సేసె
నీయబ్ధిలోపల నేతృణంబైనఁ, బాయక వీఁడేమి పట్టివైచినను
అవి దేలుగాఁకని యవ్వరంబియ్య, నవి యంతలోఁ దేల నతఁడు గైకొనియె
నదిగాన దేలెడు నతనిచే గిరులు, వదలక నేఁ గట్టువడియెద నిపుడు
ధరణీశ యీవారిఁ దగఁగట్టునంత, గురుభక్తిమై గొల్చి యుండెద నలుని
రప్పింపు మనవుడు రఘుకులోత్తముఁడు, రప్పించి యత్యాదరంబునఁ జూచి
యోవనచరరాయ యోమహావీర, నీవిక్రమం బెల్ల నీరధి సెప్పెఁ
గాన నీవిపు డబ్ధిఁ గడఁకతోఁ దుతను, బూనికఁ గపులచేఁ బొంకంబు మీఱఁ
దరుగిరులందఱు తార తెచ్చెదరు, వెరవొప్ప నసదృశవిద్య యేర్పడఁగఁ
గట్టు మంభోరాశిఁ గడఁకతో నీవు, నెట్టన నీలావు నేర్పున మెఱసి
యనవుడుఁ గరయుగం బర్థితో మొగిచి, వినయంబుతో రామవిభునకు ననియె
నుర్విపై నేనిట నుదయ మొందుటకు, సుగ్రీవ కలిగెఁ బ్రయోజనం బిపుడు
దేవ యీజలధి బంధించెదఁ బనుపు, మావెరవెల్లను మాతండ్రిచేత
ధారణీతలనాథ తగనేర్చినాఁడ, నారయ దేవర యానతిఁ జేసి
నానేర్పు మీయెద్ద నరనాథ చెప్ప,గా నేల యిపుడు సాగరము బంధించి
చెచ్చెర దేవరచిత్తంబు వడసి, మెచ్చించువాఁడ సమ్మికఁ బంపుమనుడు

నలినాప్తకులమణి నలునిఁ బంపుటయు, నలునితోఁగూడ వానరసేనలెల్ల
నేలయు నింగియు నిఖిలదిక్కులును, వాలినయార్పుల వ్రయ్యఁ జేయుచును
ఆయతశైలవృక్షావళి వైచి, తోయధిఁ గట్ట నుద్యోగించి రపుడు
రామచంద్రుండను రాజు గణేశు, దామదిలోపలఁ దలఁచి మ్రొక్కుచును
అం యోజనంబైన యద్రి సుగ్రీవుఁ, డురవడిఁ గొనివచ్చి యుర్వరవగులఁ
గలయంగ దేవతాగణములు పొగడ, నలవునఁ దొలి తొలి నలుచేతికిచ్చి
దొరకొని నలుఁడును దోయధియందు, వెరవార నిలిపె నవ్విపులశైలంబు
తనచేయు సేతుబంధమునకు రాము, ననుపమకీర్తికి నావిభీషణుని
వినుతపట్టమునకు విశదప్రభాతిఁ, దనరారుశాసనస్తంభంబుమాడ్కి
నంత వానరవీరు లాశావితాన, మంతయుఁ దారరై యద్రులుఁ దరులు
నవలీలఁ బెఱుకుచు నవిదెచ్చి నలున, కవసరోచితముగా నందియిచ్చుచును
ఒకకొండపైనుండి యొకకొండపైకిఁ, బ్రకటజవంబు లొప్పంగ దాఁటుచును
గెరలుచు నొకకొన్ని గిరులెత్తికొన్ని, గిరులఁ గ్రిందులఁ బెల్లగిల్ల వైచుచును
గొండలు తలనెత్తి గునిసియాడుచును, దెండని కొందరఁ దిట్ట నవ్వుచును
గొండపైఁ గొండ యాకొండపైఁ గొండ, నొండొండ డొల్లక యుండఁ బేర్చుచును
నిమ్ముల గిరులంది యిరుచేతులందు, నిమ్మపండులమాడ్కి నెగరవైచుచును
నొకఁడు కొండలమోచి యురవడి నడువ, నొక డడి పడఁద్రోచి యుబ్బియార్చుచును
దాఁటి యాకొండ లుద్దండతఁబట్టి, మీఁటుదునా నీవు మెచ్చంగ ననుచు
నీతరు లీగిరు లింత వేగిరమె, త్రోతునా నలునియొద్దకుఁ బాఱ నిపుడు
అని బాసలిచ్చుచు నగ్గించుకొనుచు, వనచరు లిబ్బంగి వడిఁ దెచ్చితెచ్చి
తరువులు నగములు తగనిచ్చుచుండ, దొరకొని నలుఁడు సేతువుగట్టఁదొడఁగె
ముందటిచందాన మునుఁగకయుండె, నందొక్కటైన నయ్యంబుధిలోన
నట్టిచందంబున నాకపికోటి, గట్టెను గటాకటా కష్టజీవనము
గలిగె నాకనిమది గలఁగెడుమాడ్కిఁ, గలయ నంభోరాశి గలఁగె నెంతయును
నలుఁడు నిమ్మెయిఁ బదునాల్గుయోజనము, లలవడఁ దొలినాఁడె యబ్ధి బంధించె
నంత సూర్యుఁడు గ్రుంక నాసేతువునకు, నెంతయు బలుకాపు లిడి వలీముఖులు
వచ్చి వేలముల నివాసస్థలములఁ, జొచ్చి యెంతేనియు సొంపుతో నుండఁ

## చంద్రోదయవర్ణనము

కృతకృత్యుఁ డగురాము కీర్తిపుష్పములు, చతురతమై వెదచల్లినయట్లు
కరమొప్పఁ జుక్కలు గాన్పించె నంతఁ, జిరకాలము లసీమ శిశువులమాడ్కి
బాలుపొందుకలువల పోరానివిందు, కలసినజక్కవకవఁ బాపుమందు
పాలవెల్లిని ద్రచ్చి పడసినవెన్న, శూలియౌదలఁ బూవు చుక్కలనవ్వు
నెరిచకోరములకు నెలనెలపంట, యురువేది విరవాల నుడికించుమంట
గగనంబుతోడవు దొంగలగుండెదిగులు, నొగినబ్ధిఁ బొంగించు నూరటపట్టి
హరిహర బ్రహ్మల యానందదృష్టి, సరసిజరిపుఁడైన చంద్రుఁడు వొడిచె

నినుపారి కలశాంబునిధి వెల్లివిరిసె, ననఁగ వెన్నెల పర్వె నట నిద్రలేక
యెన్నండొకో సేతు వేము గట్టెదము, ఎన్నండొకో లంక యేము సూచెదము
యెన్నండొకో దానవేంద్రుండుఁ గూలు, నెన్నండొకో సీత యీరాముఁ గూడు
నెప్పుడు వేగునో యీరేయి యింక, నప్పుడు వచ్చితి మాత్మలో సొలసి
యేల వచ్చితిమి రేయెల్ల నందుండి, యోలి సేతువుఁ గట్టుచుండక మనము
అనుచు నవ్వానరు లందఱు నట్లు, మనమునఁ జింతించి మక్కువల్ దక్కి
యారేయి గడపి సంధ్యాదులు దీర్చి, చారుతరంబుగా సకలవానరులు
నొండొరుఁ జీరుచు నుత్సాహ మొప్ప, నొండొరుఁ గడువంగ నురవడితోడఁ
బృథివీధరంబులు పృథివీజములును, బృథులసత్వంబునఁ బెఱికి యేతెంచి
యంబుధిలో వైవ నపుడు సుగ్రీవుఁ, డంబరవీథికి నరిగి వేగమున
వెరవారఁగాఁ బట్టి వింధ్యాద్రిశిఖర, మరయోజనము నిడుపైనది విఱిచి
యాసుషేణునిచేతి కందిచ్చుటయును, నాసుషేణుం డిచ్చె నానలుచేతఁ
దారాతనూజుండు దర్దురశైల, మాదూఘగతిఁ దెచ్చి యబ్ధిలో వైచె
మలయాద్రిశృంగంబు మ్రాఁకులతోడ, నలునకు నీలుఁ డున్నతగతి నిచ్చె
ద్వివిదుండు మైందుండు దెచ్చి యావార్ధిఁ, గవగూడి వైచిరి గ్రావంబు లెత్తి
గజుఁడు గవాక్షుండు గంధమాదనుఁడు, భుజబలాఢ్యుఁడు శరభుండును గవయుఁ
డిల చలియింప మహేంద్రాద్రిశిఖరములు దెచ్చి వైచిరి మున్నీటిలోన
నవియెల్ల మునుఁగక యావేళ నలుఁడు, తవిలి యంబుధిఁ గట్టఁ దరుచరు లిట్లు
ప్రకటించి తెచ్చు పర్వతములు దరులు, నొకకేల నంది పయోనిధియందు
నునుపంగఁ గనుఁగొని యుగ్రకోపమునఁ, గనలుచుఁ బలిమిమైఁ గరువలిసుతుఁడు
చయ్యన నేడుయోజనములకొండ, నయ్యెడఁ గొనితేర నది రాముఁ డెఱిఁగి
యనయంబు నిరుగేల నందననుజ్ఞ, యొనరింప నట్లని యొనరించె నలుఁడు
అప్పుడు కపిసేన యార్పులమ్రోఁత, యుప్పొంగి వారాశి యుబ్బెడు మ్రోఁత
తరుగిరు లొండొంటిఁ దాఁకుడు మ్రోఁత తరుచరు లొండొరు ల్తగఁ బిల్చుమ్రోఁత
కుదిసి భూతంబులు ఘోషించుమ్రోఁత, వదలి దిగ్గజములు వాపోవు మ్రోఁత
కడునగ్గలంబుగా గగనంబు ముట్టు, నుడుగక పెల్లైన యురవు చింతింప
బృందారకాసురబృందంబు లెత్తి, మందరగిరి యెత్తి మథియించునాఁటి
యమృతాబ్ధిమ్రోఁతయో యనఁగ నామ్రోఁత, కమలభవాండదిక్తటమును నిండె
నంతట మధ్యాహ్నమైన వానరులు, శాంతిఁ బుచ్చుటకు వృక్షంబులు చేరి
పలుతెఱంగుల మంచిఫలములు నమలి, నెలవులఁ జల్లని నీళ్లొప్పఁ ద్రావి
నీడల నొక్కింత నిలిచి క్రమ్మఱను, వేడుక రెట్టింప వేలంబు మిగుల
శాకొండ లెత్తితే నరుగుండు కొండ, ఆకొండలను వేగ నెత్తి తెండనుచు
పెక్కైనతరువులు పెక్కైన గిరులు, పెక్కు మొత్తంబులై పెక్కునఁ దెచ్చి
యారక నలునకు నొప్పించువారు, వారిధిలోపల వైచెడువారు
నటనెదురేఁగి పెల్లందుకొన్వారు, నిటఁ దెచ్చి చేరువ నిడియెడువారు

నలుఁ డందుకొనఁగ వానరు లంది యొసఁగఁ, బలుతరుగిరులు నిబ్బంగి మర్చాఁడు
ఆసేతు విరువదియాఁఱుయోజనము, లీసున బంధింప నినుఁ డస్తమించె
నప్పుడు సుగ్రీవుఁ డాదిగాఁ గపులు, చెప్పి రప్పనులెల్ల శ్రీరాముతోడఁ
జెప్పి వేలమునకు జెచ్చెర నేగి, యెప్పెడుసుఖనిద్ర నుండి యారాత్రి
గడపుటయును రేపకడ వలీముఖులు, వడి నందఱునుగూడి వారిధిఁ గట్ట
నేమేమె తెచ్చెద మెల్లభూజముల, నేమేమె తెచ్చెద మెల్లకొండలను
నని పాఱి తరువులు నద్రులుఁ దెచ్చి, వనధిలోపలఁ బడవైచెడివారు
కొందఱంతయుఁ గనుఁగొనుచుండువారు, కొందఱు నీడలఁ గూర్చుండువారు
కొందఱు సేతువు గొలపెట్టువారు, కొందఱు నిద్రలఁ గూర్కెడువారు
కొందఱు తెలినీరు గ్రోలెడివారు, నందఱు నీక్రియ నలసులైయుండ
నప్పుడు రవి చంద్రుఁడై తనువొసఁగె, నప్పు డింద్రుఁడు నించె నమృతంపువాన
యప్పుడు చల్లగా ననిలుండు వీచె, నప్పుడు సౌరభం బానంద మొసఁగెఁ
దరుచరులంత నుత్సాహులై శైల,తరువు లంబుధి మహోద్ధతిఁ దెచ్చి వైవ
నారభసంబున కతిభీతినొంది, వారిధిలోన జీవంబు లన్నియును
దెరలుచు నొరలుచుఁ దిరుగఁబాఱుచును, నెఱియుచు నటుఁ దలలెత్తి చూచుచును
ముందటిపగిది నమోఘబాణంబు, క్రందింపఁ వచ్చునో మమ్మెల్ల ననుచుఁ
దలఁచి యంతటిలోనఁ దగిలినభీతిఁ, దెలిసి సేతువు గట్టు తెఱఁగుగా నెఱిఁగి
మఱిసంతసంబులు మదిలోనఁ గలిగి, వఱలు నిజేచ్ఛల వర్తించుచుండెఁ
బంధురంబుగఁ గపిపతులు నాఁడబ్ధిఁ, బంధించి రెలమి నేఁబదియోజనములు
రవి గ్రుంకె నంత మర్కటనాథులెల్ల, నవిరళలీల సంధ్యలు వార్చి రంతఁ
బంతంబు మెఱయంగఁ బదియోజనంబు, లింతియ గట్టుట యెల్లి యీజలధి
నని మాటలాడుచు నరిగి వేలముల, ననుపమలీల నిద్రానంద మొంది
యుదయావసరమున నుర్వీశుఁ జేరి, ముదమునఁ గపిరాజముఖ్యులు మ్రొక్కి
పని విన్నపము చేసి పరవసం బొప్ప, జని తరువులు మహాశైలంబు లెత్తి
యనుపమలీలమై నతిశీఘ్రవృత్తిఁ, గొనివచ్చి నలునకుఁ గొమ్మని యొసఁగ

**శ్రీరాములు సేతువును జూచి సంతోషించుట**

నప్పుడు శ్రీరాముఁ డాసేతువెల్లఁ, దప్పక కనుఁగొనుతాత్పర్య మొప్ప
వనధీశ్వరుండును వనచరాధిపుఁడు, దనుజనాయకుఁడును దనుఁ జేరి కొల్వ
సౌమిత్రికరముపై సౌభాగ్యలీల, వామహస్తముఁ జేర్చి వడిఁ గట్టమీఁద
సన్నపురహాసచంద్రికల్ వొలయ, నన్నరనాయకుం డటఁ జూచువేళఁ
దరుచరేశ్వరులెల్లఁ దరువులు గిరులు, బిరుదులై వడిఁ బేర్చి పెకలించి తెచ్చి
నలుచేతి కొసఁగ నానలుఁ డవిపుచ్చి, తలకొని కట్ట నాతఱి యొక్క యుడుత
గొబ్బున సేతువు గొనసాగవలయు, నిబ్బలియులకుఁ దోడేనె గావింతు
ననుచు శ్రీరాముని యడుగుఁదామరలు, మనమునఁ జేర్చి యమ్మనుజేశునెదుర
నచ్చుపుభక్తితో నల వార్ధి మునిఁగి, వచ్చి తా నిసుకలో వడిఁ బొరలాడి

తడయక చనుదెంచి తనమేనియిసుక, వడిఁ గట్టుపై రాల్చి వనధిలో మునిఁగి
తేలి గట్టున కేఁగి తిరుగంగఁ బొరలి, వాలినభక్తితో వచ్చి విదుల్చు
నివ్విధంబున నుండ నినకులాధిపుఁడు, దవ్వులఁ బొడఁగాంచి తమ్మునిఁ జూచి
పొందుగా లక్ష్మణ పొల్లదే చూడు, ముందఱ నొకతగుమూషకం బెలమి
నామీఁదభక్తి యున్నతగతిఁ బూని, తా మేను జలములఁ దడిపి గట్టునకుఁ
జని వేగ నిసుకపైఁ జల్లాడి తిరుగఁ, జనుదెంచి కొండలసందున రాల్చి
కరమొప్పుచున్నది కపికులాధీశ, యురుశక్తిఁ దరుగిరు లొగిఁ దెచ్చుచోటఁ
దా నెంత యని మది దలఁపక ప్రేమఁ, బూని సహాయమై పొదలుచున్నదియుఁ
గనుఁగొంటివే యనఁ గమలాప్తవంశ, కనుఁగొంటి భవదంఘ్రికమలయుగ్మమును
నెవ్వఁడు మది నిల్పి యెసఁగుఁ దృణంబు, నవ్వేల్పుగిరిఁ బోలు ననిన: గాకున్నె
కావున భక్తియ కారణం బనఘ, ననపుడు ముదమంది నలినాప్తసుతునిఁ
గనుఁగొని మఱి దానిఁ గనుఁగొనువేడ్కఁ, బెనఁగొనుచున్నది ప్రేమ నిచ్చటికిఁ
దెమ్మన్న వేగంబె దెచ్చి సుగ్రీవుఁ, డమ్మహాత్మునిచేతి కంది యిచ్చుటయుఁ
బలుదెఱంగులఁ జాలఁ బ్రస్తుతిఁ జేసి, కలితదక్షిణకరాగ్రమున దువ్వుటయు
నలయుడుతకు వెన్క నమరెఁ ద్రిరేఖ, చులుకనై చూడ్కుల సుఖకరంబుగను
నెంతయు సంతోష మినుమడింపంగ, నంత లక్ష్మణుఁడును నబ్ధినాయకుఁడు
దనుజేశ్వరుఁడును దరుచరాధిపులు, ననయంబు సంతోష మతిశయింపంగ
నందందఁ గైకొని యలరుచునుండఁ, జందన మందార చంపక క్రముక
పున్నాగ సహకార భూరుహప్రతతు, లున్నచో విడిపించె సుగ్రీవుఁ డంత
హనుమదంగదనీలహరిరోమకుముద, పనసాదివానరప్రముఖులు గూడి
కనుఁగొన నాశ్చర్యకరమైనయట్టి, ఘనతరంబైన యాకట్టపై నిలిచి
బాపురే! యెంత నేర్పరియొకో! నలుఁడు, రూపింపఁ బెద్దయు రూఢికి నెక్కి
యరుగు దీర్చినమాడ్కి నలవడఁ దీర్చి, గొరకొని సేతువు దుదిదాఁక ననుచుఁ
దనబాహుబలమునఁ దనవిద్యగలిమి, ఘనమైన సేతువు గట్టె నీనలుఁడు
అది శతయోజనం బైనట్టినిడుపు, పదియోజనంబుల పరపును గలిగి
వెలసినకులయసువేలాచలముల, నొలసి యెంతయుఁ జూడ నొప్పువహించి
మెలఁగి యాడెడుగండుమీలమెఱుచులు, వెలిఁగెడు చుక్కలవిధమున నుండ
నిరుదెస నల్లనై యేపారు నబ్ధి, కరమొప్పుచున్న యాకాశంబు గాఁగఁ
గలయంగ దీపించె ఘనసేతు వపుడు, వెలసిననక్షత్రవీథిచందమునఁ
దనునట్టు గాంచిన తనపేర్మిఁ జూచి, తనరార మన్నింపఁ దగునని రాము
విభుఁ డాసముద్రుని వేడుకతోడ, నభయపట్టము గట్టె ననమించి మఱియు
నప్పుడు దేవత లామింటనుండి, యప్పౌరుషముఁ గన్నులారంగఁ జూచి
నిక్కంబు నిట్టివ నీచుర్వుదూక్తి, జక్కనేలగు దండసాధ్యుండు గాక
యటు వేడుకొనుటయు నబ్ధిఁ గైకొనమి, నిటు సేయనేరఁడే యినకులేశ్వరుఁడు
చేకొని యివ్వఁ డీసేతువుఁ జూచుఁ, జేకొని యివ్వఁ డీసేతువుఁ దలఁచు

నతనికి విజయంబు నతులకీర్తియును, వితతపుణ్యంబులు వేవేగఁ గలుగు
నెంతకాలం బేని నీసేతు వుండు, నెంతకాలం బేని నీయబ్ధి యుండు
నంతకాలము రాఘవాధీశుకీర్తి, యంతంత కెక్కుచు నానంద మొసఁగు
నని మదిలోపల హర్షించుకొనుచుఁ, దనువునఁ బులకలు తఱుచుగా నెగయఁ
బువ్వులవానలు బోరఁబోరఁ గురిసి, రవ్వేళ దేవతూర్యంబులు మ్రోయ
నప్పుడు రఘురాముఁ డానంద మొంది, యొప్పుసేతువుఁ జూచి యొనర నిట్లనియె
నెలమితో నీసేతు వెల్లకాలంబు, నలువేర సేతువు నానొప్పఁ గాత
అనుటయు రఘురామునానతి నలునిఁ, గనుఁగొని పొగడిరి కపివీరులెల్ల
ముదముతో నపుడు సముద్రుండు రాము, సదనంబునకు సైన్యసహితంబుగాఁగఁ
బొలుపార దోడ్కొనిపోయి దివ్యాస్త్రములును దివ్యాంబరములు భూషణములు
నొకవజ్రకవచంబు నురుభక్తినిచ్చి, యకలంకచిత్తుఁడై యారాముఁ జూచి
రామభూపాలక రాజపుత్రులకు, నీమునివేషంబు లేల యుద్ధములఁ
జారువస్త్రములు భూషణములు నిపుడు, మీరు ధరింపుఁ డిమ్మెయి నుచితంబు
అవవుడు దివ్యాంబరాభరణంబు, ననుపమగంధమాల్యాదులు దాల్చి
చారుతేజముల భాస్వరమూర్తు లగుచు, నారవిచంద్రులో యన వెలుంగుచును
వననిధి యపుడు దీవనలతో ననుప, ననిలజనీలురయంసంబు లెక్కి
సకలదేవతలును సన్నుతిసేయ, సకలలోకంబులు జయపెట్టుచుండ
సకలతరంగిణీశ్వరు వీడుకొలిపి, సకలేశ్వరుం డనుజన్ముండుఁ దాను
రమణీయమైనట్టి రాక్షసలక్ష్మి, సీమంతవీథిపైఁ జెలఁగెడుమాడ్కి
మునుకొని లంకాభిముఖుఁడునై నడిచె, ఘనమైన సేతుమార్గంబున వేడ్కఁ
దగవిభీషణుఁడు గదాహస్తుఁ డగుచు, మొగి గపిసేనకు ముందఱ నడిచెఁ
దనమంత్రులును దాను దర్పంబు మెఱసి, వినుతవిక్రముఁడు సువేలాద్రినుండె
మిగుల మొత్తంబులై మిన్నందియంది, నగచరసేనలు నడువంగఁ జొచ్చె
వడిఁగొని సేతుక్రేవల వచ్చువారు, విడువక త్రోవల వెస వచ్చువారు
వేడుకతో వినువీథిఁ జన్వారు, నాడకాడకు గుమ్ములై యేఁగువారుఁ
దోయధిలోన నీదుచు వచ్చువారుఁ, బాయలుగాఁగూడ పరుగిడువారు
నప్పుడు సేనలయార్పులమ్రోఁత, యుప్పొంగి వారాశి యురుఘోష మడఁచె
దివియుఁ బాతాళంబు దిక్కులు భువియు, నవిరళగతిచేత నల్లలనాడఁ
గడునొప్పసేతువుఁ గడచి యుబ్బంగి, విడిసె రాఘవుఁడు సువేలాద్రియందుఁ

## శ్రీరాములు సువేలాద్రి చేరుట

దడయక వనచరదళము లేతెంచు, కడుసంభ్రమముఁ జూచి ఘనధనుర్ఘోష
మడరింప బ్రహ్మాండ మవిసినట్లయ్యె, నుడువీథిఁ జుక్కలు నురలె మ్రోయుచును
బెడిదంబుగా భూమి బెగడొంది యడరె, నుడుకారి వైదేహియుల్లంబు చెలఁగె
ఖండపరశు శిరఃకంపంబుఁ జేసె, దండి రాక్షసులెల్లఁ దల్లడపడిరి
చారులచే రామజననాథురాక, యారావణుఁడు విని యఖిలరాక్షసులఁ

బిలిపించి నవరత్నపీఠంబునందుఁ, గొలువుండె నసురులు గొలువఁ బెక్కండ్రు
అంత నావృత్తాంత మంతయు నెఱిఁగి, చింతించి కైకేశి చిడిముడితోడ
వంతఁ గుందుచు మాల్యవంతునిఁ బిలిచి, యెంతయుఁ బొగలుచు ననియె నాతనికి
అలఘువిక్రమశీలుఁ డా రామవిభుఁడు, చలమున వానరసైన్యంబుతోడ
విడిసె సువేలాద్రి విను మింక లంక, చెడును దప్పదు బ్రహ్మశివులు గాచినను
బదుఁ డింక మనము నప్పఙ్క్తికంఠుని, విదితంబుగా సీత విడు మని బుద్ధి
చెప్పి వర్తము నీతి శిక్షింబ యిప్పుడు, చెప్పిన మనబుద్ధి చెవియాని వినునె
యైనను తలిదండ్రు లైనట్టివారు, తనయుండు ధర్మంబు దప్పి నడిచినను
దగ బుద్ధిసెప్పుట తగవు ధర్మంబు, లగునంచుఁ జెప్పుదు రనఘాత్మ బుధులు
విను మున్నె నాకు నావిశ్రవసుండు, వినిపించె నంతయు విశదంబుగాఁగ
ననుచు దేవరహస్య మతనికిఁ జెప్ప, విని మాల్యవంతుండు వెఱఁగంది కూఁతుఁ
గనుఁగొని యది యట్ల కాకేల పోవు, మనబుద్ధి వినఁడని మానంగరాదు
అమ్మ నీవును నేను స్వస్థుసుల్మను, నిమ్మహామంత్రంబు లిన్నియుఁ దెలియఁ
జెప్పుదము మన మీస్థితిగతు లెల్ల, నిప్పుడె గదలుద మిది వేళగాన
వలనొప్ప నావిశ్రవసునియాపలుకు, దలగ బ్రహ్మాదులు దప్పింపలేరు
చెప్పుము నీవు నేర్చినరీతు లెల్ల, నొప్పుగ ననవుడు సువిద యాక్షణమె
పసిఁడిపల్లకిమీఁదఁ బరఁగఁ గూర్చుండి, యసమముతో నచ్చరయతివలు మోయ
ధవళాంబరంబులు తగునట్లు గట్టి, ధవళచామరములు ధవళమాల్యములు
ధవళగంధంబులు ధవళాక్షతములు, ధవళభూషణములు తలకొన్నప్రేమ
నవిరళంబుగఁ దాల్చి యతివైభవమునఁ, దవిలి దివ్యాంగనాతతి వెంటనడువ
సుతభృత్యహితబంధుసోదరుల్ నడువ, వ్రతధర్మగుణచారువర్తనుల్ నడువ
శ్రుతిపాఠతంత్రులు సూనృతోన్నతులు, వ్రతధర్మగుణచారువర్తనుల్ నడువఁ
గిన్నరగంధర్వగీర్వాణసిద్ధ, పన్నగాసురయక్షభామలు నడువ
వంకృతియనుమాల్యవంతునివనిత, సంకృతి యనుమాలిసతి కేతుమతియు
మానినియైన సుమాలియింతియును, దానవాంగనలు గొందఱు వెంట నడువ
ముగ్గురుతల్లులు ముందఱ వెనుక, దగ్గరి నడువంగ ధవళచామరులు
గరుడగంధర్వాదికాంతలు వీవ, నరుగుచో నాట్యంబు లచ్చరల్ సేయ
బంధురంబుగ మిత్రభావితలైనట్టి, బంధుజనంబులు బలిమితో నడువ
యాపాతుఁ దతికాయుఁడాగి విహాపాతుఁ, దేపున ముందఱ నేచి తోనడువ
ముదుకకుప్పసములు ముదముతోఁ దొడిగిఁ, ముదిసినరాక్షసముగ్ధలు నడువ
సందడిజడియంగ సాహో యటంచు, ముందఱ ఫణిహారముఖ్యులు నడువ
గురుతపబవాఢ్యవేదఘోషంబుతోడ, సరిలేని యాబ్రహ్మసభతోడఁ గదలి
చంద్రదీధితులతో శారదాదేవి, యింద్రుమందిరమున కేతెంచుకరణి
మందారచంద్రికా మల్లికాశ్వేత, కందరహిమశైల కర్పూరహార
చందనగోక్షీర శరదిందురుచుల, నందమై విలసిల్లు నభినవస్ఫురణ

మందాకినీదేవి మఱి దివినుండి, బృందారకులు దాను పృథివి కేతెంచి
విలసిల్లువిధమున వీక్షింప నొప్పెఁ, గలితనవీనమై కైకేశికొలువు
వరరత్నమణిగణవలయంబులెలమిఁ, గరమొప్ప ముక్తాలకంఠహారములు
వెఱపొప్పఁ దనమేన విలసిల్ల నమరి, మెఱుపులఁ దగుశుభ్రమేఘమో యనఁగ
దీపించు దేదీప్యతేజంబుగాఁగ, నేపారి యంతయు నిభములు నడువఁ
బ్రబలనీలాంబుదపటలంబుభంగి, నిబిడమై రాక్షసనిచయంబు నడువ
రథసింధుఘోటక రాజిసైన్యములు, పృథివి బీటలువాఱఁ బెల్లుగా నడువ
వనజోదరునిపుత్రి వాహినుల్ గొలువ, నెనయంగ నజుసభ కేతెంచె ననఁగ
నమృతవారిధి వొంగి యఖిలదిక్కులకు, విమలమై యటు వెల్లివిరిసెనో యనఁగ
నరిది నక్షత్రంబు లన్నియు వచ్చి, గురిగాఁగ నొకచోటఁ గూడెనో యనఁగఁ
నుదధిముత్యములెల్ల నొక్కటై వచ్చి, పొదిగొని లంకలోఁ బొడమెనో యనఁగ
దిగ్గని వెన్నెలదీవియో యనఁగ, నిగ్గైన గొడుగులనిచయంబు మెఱయ
నీభంగి నప్పు డయ్యింద్రారిసభకుఁ, బ్రాభవస్ఫురణమైఁ బరఁగ నేతేర
విభవశుభాచార వినుతులు చెలఁగ, శుభలీలఁ గైకేశిఁ జూచి రావణుఁడు
ముదముతో గద్దియ మొగి డిగ్గి వచ్చి, ముదితకు నందంద మ్రొక్కి కైదండ
ప్రమదంబుతో నిచ్చి పల్లకి డించి, యదురారఁ గొనివచ్చి యాస్థానమునకు
దనభద్రపీఠంబు దరియఁగ నొక్క, కనకాసనం బిడి కైకేశి యందుఁ
గూర్చుండఁ దల్లులఁ గూర్మిసోదరులఁ, గూర్చినభక్తితోఁ గూర్చుండుఁ డనఁగ
నంతరాంతరముల నందఱు నంత, నంతంతఁ గూర్చుండి రర్హపీఠముల
నంత నాకైకేసీ యనుమతిఁజేసి, చింతామణీభద్రసింహాసనమున
దానవేంద్రుండును దత్ప్రకారమున, నూనినసంతోష మొప్పఁ గూర్చుండి
యచలితమతిమంతు నమ్మాల్యవంతు, నుచితాసనంబున నుండంగఁ బనిచి
యావేళ రావణుం డమరవల్లభుని,భావంబు గైకొని భాసిల్లుచుండె
నలయుప్రోంతయు లేని యంబుధికరణి, యలబలం బుడిగె నాయసురేశుకొలువు
ఆలోన నమరారి హస్తము ల్మోగిచి, కైలాసనిభకేశి కైకేశి కనియె
జనయిత్రి యిబ్భంగి జనులతోడ, నెనయంగ నాసభ కెన్నఁడు రావు
చాలంగ నామది సంతోషమయ్యె, నేల విచ్చేసితి వెఱిఁగింపు మనిన
నప్పుడు కైకసి యమ్మాల్యవంతుఁ, దప్పక కనుఁగొని తగునీతి మెఱసి
ప్రాభవస్ఫురణాఢ్యుఁ బఙ్క్తికంధరుని, శోభనగుణలీలఁ జూచి యిట్లనియెఁ

### కైకేశి రావణునకు బుద్ధి సెప్పుట

తెలియంగ మీతండ్రి దివ్యరహస్య, మెలమిఁ జెప్పినవార్త లెఱిఁగింతు వినుము
సురలు బ్రహ్మాదులు సొరిదిమై మునులుఁ, దరగనిభీతిచే దనుజారిఁ జేరి
తమతమయిడుమలఁ దమపాటులెల్ల, దానవాంతకుతోడఁ దా మొప్పఁజెప్పి
రావణకుంభకర్ణాదిరాక్షసుల, నేవగనైనను నేపడఁగించి
కావవే దీనులఁ గరుణచే ననుచుఁ, గమలజాసనుఁ డాదిగా సురలెల్ల

సభయదానము వేఁడ నతికృపాంభోధి, యభయంబు లిచ్చె నయ్యమరులకెల్ల
నినకులంబున జనియించి రాక్షసుల, ననిలోనఁ దునిమెద నవలీల ననుచు
వరమిచ్చి సకలదేవతల వీక్షించి, తరుచరులై మీరు ధరణి జన్మించి
యనిలోన నాకుఁ దోడగుఁ డని పలికె, నని చెప్పె మీతండ్రి యారీతి నిప్పు
డమరులు వానరులై పుట్టిరెలమి, నమరకంటక నిన్ను నణఁప శ్రీహరియు
వనజసంభవుఁ డిచ్చువరముఁ బాలించి, యినకులంబునఁ బుట్టె నిందఱుఁ బొగడఁ
జెనటితాటకిఁ జంపెఁ జిన్ననాఁడేఁచి, ముని యాగరక్షణంబును జేసి కాచె
పదధూళిచే ఱాయి పడఁతిఁ గావించె, వదలక జనకభూవరుపీటిలోన
నరుదరు దని జనం బభినుతిసేయ, హరువిల్లు మోపెట్టి యవలీల విఱిచి
జనకభూపతి తనూజను బెండ్లియాడి, మొనచిపరశురాముని భంగపఱిచి
తమతండ్రిపనుపునఁ దపసియై మునుల, కమితసత్త్వంబున నభయంబు లిచ్చె
ఘనువిరాధుఁ గబంధుఁ గడువిక్రమమున, దునుమాడి విడువఁడే దోషాచరేంద్ర
వెఱపు చెప్పుటకాదు వేయుభంగులను, వెఱవకుండితివేని వేఱేల నీదు
చెలియలిముక్కును జెవులును బట్టి, బలిమిఁ గోసిననాఁడె పగ గెల్వరాదె
ఘనఖరదూషణు ఖండించుమాట, విని యసూయకుండుట వెఱచుటగాదె
మారీచు నొకకోల మడియించునాఁడు, నూరకె యొకవంక నొరిగితి వీవు
రామునిముందఱ రమణిఁ దేలేక, యేమఱుపాటున నెలనాఁగఁ గొంచు
వెనువెన్కఁ జూచుచు వెలవెల నగుచు, నెనలేనిభీతిచే నెలమిఁ బాఱుచును
వచ్చితిగాక భూవరుల జయించి, వచ్చితివా యోడి వచ్చితిగాక
సచ్చరిత్రను రామచంద్రునిదేవి, ముచ్చిలి తెచ్చుట మొగతనంబగునె
వాలంబునను జుట్టి వారిధి ముంచు, వాలిఁ ద్రుంచుట నిన్ను వంచుటకాదె
యిన్ని యెన్నఁగనేల యినకులేశ్వరుఁడు, మున్నీరు నొకకోల మొనకుఁ దేలేదె
నేఁడోడితే రామనృపశేఖరునకు, నాఁడోడితివి గాదె నాకేశవైరి
మాటిమాటికి జేల మనుజు లటంచు, నేఁటికి నాడెద వెంతయు నేచి
ఘనతపోమహిమచేఁ గరుణించి నీకు, వనజభవుఁడు మెచ్చి వరమిచ్చువేళ
నరుల నెన్నకయున్న నాఁటితప్పల్లఁ, దరమిడి నేఁడిదే తలకూడె నీకు
గెలువేది యిఁక నీకు గీర్వాణవైరి, చలమునఁ గులమెల్ల సమయింతుగాక
యేటికిన్నియు నెంచ నిపుడొక్కకోఁతి, దాఁటి సముద్రం బుదగ్రుఁడై పేర్చి
లంకలోపలఁ జొచ్చి లంక శోధించి, లంకిణిఁ బరిమార్చి లలి శంక లేక
జానకిఁ బొడఁగాంచి జనరాజుసేమ, మానినభక్తితో నొనరంగఁ జెప్పి
మరలిపోవుచు నీదు మధువనం బెల్లఁ, జెరిచి కావలికాండ్రఁ బెక్కండ్రఁ జంపి
యక్షకుమారుతో ననురాధిపతుల, నక్షణంబున నెందఱైనను ద్రుంచి
బలిమినట్లనయుండి పచరించి మఱియు, బలుమఱి లంకను భస్మంబుఁ జేసి
యావిమానము లేక యసురేశ దివికిఁ, బోవఁగా సురవరుల్ పొరిఁ బొరి నగరె
యింతసేసియు మఱి యింటఁ బట్టువడెనె, యెంతయు నెదురులే కేర్చి పెల్లార్చి

నీవును నీవార నెఱి చెడి చూడఁ, బోవఁడె యల వాయుపుత్త్రుండు తొల్త
గురుసత్త్వమున నిన్ను గొనిపోయి రాము, ధరణీశుముందటఁ దటుకునఁ బెట్టి
తెచ్చితిఁ బొమ్మన్న దేవేంద్రవైరి, యచ్చట నీసత్త్వ మది యేమి సేయు
నటుగాక యీలంక నగలించి పట్టి, తటుకున ధరణిపై దాఁటించె నేనిఁ
జిందరవందరై చెదరి పల్వగల, నందఱు ద్రుంగరె యసురు లుప్పొంగ
నతనికి నోడితి వసురాధినాథ, యతని యేలిక గెల్వ నలవియే నీకు
వనచరులని కదా వ్రాలుచున్నావు, వనచరులను గెల్వ వశమె మున్వీనుము
వనచరుచేఁ జేటు వచ్చుఁ బొమ్మనుచు, గొనకొని నంది దాఁ గోపించి నీకుఁ
బాయ కిచ్చినశాపఫలమెల్ల నీవ, వాయుపుత్త్రునిచేత వాలిచేఁ గనవె
ఫాలాక్షవాసవబ్రహ్మాదిదివిజు, లీలీల దైత్యారి యిష్టంబునొంది
నీలంకయును నిన్ను నిఖిలరాక్షసులఁ, గూలఁద్రోయుటకునై ఘోరరూపముల
భూలోకమున వచ్చి పుట్టిరి కాక, యీలాగు వనచరు లెందైనఁ గలరె
యలఘుబలుండవై యఖిలలోకములఁ, జలము పెంపున గెల్చి చనుదెంచునపుడు
కిన్నరగంధర్వ కింపురుషాది, పన్నగగుహ్యకపక్షీంద్ర యక్ష
సురవరమునివర సుదతులనెల్ల, బిరబిరఁ జెఱలను బెట్టెడువేళఁ
బరమపతివ్రత ల్వాడవడ వణఁకి, పరకాంతనెపమున భస్మమై నీవు
కులముతో బలముతోఁ గూలిపొమ్మనుచు, నలిగి శాపంబిచ్చి రది తలకూడె
వాలికి నెక్కుడవ్వాలినందనుఁడు, వాలికి నెక్కుడవ్వాయుపుత్త్రుండు
వారు నీకా రణములో వధియింపలేరె, వారికి నెక్కుడవ్వాలితమ్ముఁడును
సమరంబునను బలసహితంబుగాఁగ, సౌమిత్రి నినుఁ బట్టి సమయింపలేఁడె
మఱియొక్కటియు విను మనుజాశనేంద్ర, యరయంగ నీవింక నెఱుఁగవుగాని
రామలక్ష్మణు లేల రవిసూనుఁ డేల, కోమలి యానీత కోపానలంబె
యరుదుగా బ్రహ్మరుద్రాదిదేవతలు, వరదులై యిచ్చిన వరములతోడ
హరుఁ డొసంగిన చంద్రహాసంబుతోడ, నరయు మూఁడరకోటి యాయువుతోడఁ
గైలాస మెత్తిన ఘనశక్తితోడఁ, జలనంబు లేనట్టి సంపదతోడఁ
దక్కనిభుజబలదర్పంబుతోడ, దిక్కులు గెలిచిన తేజంబుతోడ
రాక్షసకులముతో రావణ నిన్ను, నీక్షణంబునఁ బట్టి యెరియింపలేదె
పరమపతివ్రత పతియాజ్ఞ మీఱ, వెఱచి యూరకయుండ వ్రేగెడుఁగాని
ధర్మపతివ్రతఁ దగదన కీవు, కర్మపాశంబునఁ గైకొని తెచ్చి
యఱిముఱి చెఱపట్టి యాపుణ్యవతిని, మొఱఁగిన సంకటమునఁ బుట్టు వహ్ని
నిన్ను నీకులమును నీవారినెల్ల, నెన్ని భంగులఁ గాల్ప కేల పోనిచ్చు
నసురేశ యిది యెట్టి దనినను వినుము, విడువక నీవు దిగ్విజయంబుచేసి
యకలంకగతి పూని యమరుల గెల్చి, సకలలోకంబులఁ జరియించునపుడు
ప్రథమయుగంబున బ్రహ్మర్షివరుఁడు, ప్రథితోరుసుజ్ఞానపరమార్థవిదుఁడు
పరమసాత్త్వికగుణాస్పదకుశధ్వజుని, వరపుత్త్రి యగు వేదవతియును దలఁపఁ

బరమపతివ్రత పాపాత్మ నీదు, వరగర్వమంతయు వమ్ముగాఁ జేసి
సుతులతో సతులతో సోదరప్రభృతి, హితులతో భృత్యసంఘాతులతోఁగూడ
నమితవిక్రముఁడైన నతనిచే నిన్ను, సమరంబులోపలఁ జంపింతు ననుచు
నరిముఱిఁగోపించి యాధర్మశీల, మరగుచు శపియించె మఱచితే తొల్లి
యాసతి యీసీత యైనశ్రీదేవి, భూసుతయై పుట్టె భువనరక్షకుఁడు
ఆదినారాయణుం డంబుజోదరుఁడు, వేదవేద్యుఁడు రామవిభుఁడైనవాఁడు

## కైకేశి రావణునకు రాముని మహిమ చెప్పుట

అసురుల మర్దింప నమరులఁ గావ, వసుమతి రక్షింప వచ్చె విష్ణుండు
ఎఱుఁగ నీవును నేను నెంతటివార, మెఱుఁగరు బ్రహ్మరుద్రాదిదేవతలు
పుట్టించుఁ బోషించుఁ బొలియించుఁ బిదప, నెట్టునుగాక తా నేక[illegible]
నతఁ డండజేశ మేటి యాతనితోడఁ, బ్రతిపోల్పఁ దలఁచినఁ బాపంబుగాదె
చెదరి లోకములెల్లఁ జెడినపిమ్మటను, వదలక యుండెడువాఁడువో యతఁడు
శరణన్న వేగ నా సామజవరునిఁ, గరుణ లీలామతిఁ గాచె నీఘనుఁడు
మధుకైటభాదుల మహారాక్షసులను, నధికతేజస్ఫూర్తి నణఁచె నీఘనుఁడు
నొచ్చి సోమకుఁ జంపి శ్రుతు లర్థితోడఁ, దెచ్చి బ్రహ్మకు నిచ్చి దీపించె నితఁడు
అమృతాబ్ధి దాఁ ద్రచ్చి యమృతంబు వడసి, యమరులకును నిచ్చెనరయ నీఘనుఁడు
భాసురంబుగ దైత్యుఁ బట్టి శిక్షించి, భూసతి నెత్తిన పుణ్యుఁ డీఘనుఁడు
కడఁగి బాలుని గావఁ గంబానఁ బొడమి, తొడరి హిరణ్యునిఁ దునిమె నీఘనుఁడు
ధరణి మూఁడడుగులఁ దానర్థి వేఁడి, పెరిఁగి యాబలిఁ జెరపెట్టె నీఘనుఁడు
రాజసంబున భృగురాముఁడై పుట్టి, రాజులఁ ద్రుంచిన రణదక్షుఁ డితఁడు
తప్పక చెప్పితి దనుజలోకేశ, యిప్పుడు దేవతాహితము చింతించి
రాముఁడై జనియించె రవివంశమునను, దామసగుణ మేఁచి దనుజేశ నీవు
ఏమిపాపమొ కాని యెఱుకచొప్పడదు, కామాంధునకు ధర్మగతు లేల కలుగుఁ
గొడుకుచేనైనను గూఁతుచేనైన, నడరి కీర్తియకాని యపకీర్తిగాని
వచ్చు గోత్రమునకు వడిఁ బెద్దలకును, జెచ్చెర నని జను లెప్పెడిదెల్ల
నరయ నిందలు రెండు నసురేశ చూడ, మఱియెవ్వరికి వచ్చె మనకుఁగా కిపుడు
అది యెట్టిదం టేని నంతయు వినుము, మదిఁ గొంత దలఁపక మనశూర్పణఖయు
ఆయన పరమాత్ముఁ డనక కామించి, పోయి ముక్కును చెవు లొప్పె కార్చుకొనియెఁ
బరసతి యన కాసపడి పట్టి తెచ్చి, కరకరిఁ గులమెల్లఁ గాల్చెద వీవు
ఇంతకంటెను నింద యిఁక నెందుఁ గలదు, పంక్తికంధర యిట్టి పాపంబు లేల
బలసి రక్షోరాజ్యప్రముఖు లందఱును, నెలమి విష్ణునితోడ నెదిరించె కాదె
చక్రంబుఘాతకు సైరింపలేక, శుక్రశిష్యులు భువిఁ జొచ్చిరి వెఱచి
శంకలేటికి నీవు జన్మించువెనుక, గ్రుంకిన రాక్షసకులమెల్ల నెగడె
నని మనంబునఁ గొంత యలరుచుండంగ, దనుజేశ తలఁపులు దలకూఁడదయ్యెఁ

కైకేశి రావణునికి జలప్రళయము దెల్పుట

జేకొని లోకముల్ చెడినపిమ్మటను, యేకమై యుదకంబు లేపారుచుండ
మక్కువ నాజలమధ్యంబులోన, నొక్కండై తనకుఁ దో డెవ్వరు లేక
బాలుఁడై యట వటపత్రముమీఁద, లోలతఁ దేలాడు లోకరక్షకుఁడు
కమనీయ మగుసృష్టికార్యంబునందు, విమలచిత్తంబున వెసనున్న నంతఁ
గమలోదరునినాభిఁ గమలంబు పుట్టెఁ, గమలంబులోఁ బుట్టెఁ గమలసంభవుఁడు
కమలాసనుఁడు సృష్టికార్యంబుకొఱకు, నమర నవబ్రహ్మ లనువారిఁ బడసె
వరపుణ్యులైనట్టి వారిలోపలను, బరమాత్ముఁడయ్యె నాపౌలస్త్యవరుఁడు
గమలాప్తనిభునకు ఘనయశోనిధికి, విమలాత్ముఁడై పుట్టె విశ్రవసుండు
నరుదార జన్మించి తతనికి నీవు, పరికింప నాలవ బ్రహ్మవుగావె
బ్రహ్మసంతతి యేడ పరదారలేడ, ఇమ్మహాపాతక మిటు సేయుటేడ
చేకొని లోకము ల్చెఱిచెద వీవు, లోకరక్షణగుణాలోలురు వారు
ధర్మఘాతకుఁడవై తనరుదు వీవు, నిర్మలధర్మైకనిపుణులు వారు
మీఱి తాపసులను మ్రింగెద వీవు, వారు తాపసులను వడిఁ బ్రోతు రెపుడు
చేరి పరస్త్రీలఁ జెఱుతువు నీవు, పరదారరక్షకు ల్పరికింప వారు
వేదబాహ్యుండవై విహరింతు వీవు, వేదార్థసత్కర్మవిహితులు వారు
ధర్మ మెక్కడనుండుఁ దగిలి దైవంబు, నిర్మలస్థితితోడ నిలుచు నక్కడను
ఎక్కడ దైవంబు లింపారుచుండు, నక్కడ విజయంబు లమరుచునుండు
వరమిచ్చి చెఱచిన వనజజుతోడ, నురగకంకణుతోడ సురగులతోడ
సురసిద్ధఖేచరు ల్సుముఖులై వచ్చి, యరిమురి నీకుఁగా నడ్డంబు నిలిచి
కాచిననైనను గాకుత్స్థవంశు, డేచిన నినుఁ జంప కేలఁ బోనిచ్చు
నొప్పదొప్పదు చల మొప్పదు విడువు, తప్పక చెప్పితి దనుజలోకేశ
వాలినవరగర్వవహ్నిలోపలను, నేల కాలెదు వడి యెంతయు నేచి
బద్ధవైరము మాని పరికించి నాదు, బుద్ధి నిర్మలమగుబుద్ధిలోఁ గొనుము
తల్లిదండ్రులబుద్ధి దలమోచుధర్మ, వల్లభునకుఁ గీడు వచ్చునే తలఁపఁ
దల్లి చెప్పినమాట తగదన కీవు, ప్రల్లదంబులు మాని పరికించి వినుము
అక్షరుండు మృతుండు నఖిలరూపుండు, పక్షీంద్రవాహుఁడు పరమపావనుఁడు
మోక్ష మియ్యఁగఁజాలు మోహనమూర్తి, రక్షకుం డురుకీర్తి రణకర్కశుండు
ఆదినారాయణుం డమరులఁ బ్రోవ, మోదంబుతో మునిముఖ్యులఁ గావ
భూదేవిభారంబుఁ బుచ్చిపోవైవ, నాదశరథునిక ట్లమరి జన్మించె
నేరాజు జలధుల నింకింపఁజాలు, నేరాజు హరువిల్లు నెలమి మోపెట్టి
తృణలీల విఱిచెను దివిజు లుప్పొంగ, గుణరత్నఘనఖని కోదండగురుఁడు
మనుకులాధీశుండు మాధవుం డరయ, నినవంశుదేవియౌ యిందిరాదేవి
జగతీతనూజాత జగదేకమాత, నిగమసన్నుతపూత నిగమవిఖ్యాత
యమితగుణోపేత యైనయాసీతఁ, బ్రమదంబుతో నీతి పాటించి బుద్ధి

సకలభూషణమణిసహితంబుగాఁగ, సకలేశుఁ డగురామచంద్రుఁ బ్రార్థించి
యిప్పుడె కొనిపోయి యెలమి రామునకు, నొప్పించి నీప్రాణ మొగిఁగాచుకొనుము
తానొరువరములు దప్పింపఁగాని, తానిచ్చువరములు దప్పింపలేఁడు
గురుధర్మపోషణగుణు విభీషణుని, హరిభక్తితోషణు ననఘుపోషణుని
సమరవిభీషణు సత్యతోషణునిఁ, గ్రమమొప్పఁ గనుటయుఁ గడులెస్స నీకు
నతిమృదుభాషణు నావిభీషణుని, నతివేగ ప్రార్థించి యతని రావించి
పరఁగ లంకారాజ్యపట్టంబు గట్టి, శరణని మ్రొక్కు మాజననాయకునకు
శరణన్న నెటువంటి చందంబునందుఁ, గరుణతోఁ గాచు నాకరిగాచురీతి
నని పెక్కుభంగుల నధ్యాత్మవిద్య, ఘనమతియైనట్టి కైకేసి తనకు
నిర్మలతరపుణ్యనీతిమార్గంబు, ధర్మతత్పరబుద్ధి దగిలి చెప్పినను
దలలెల్లను బెద్ద తలగ్రొనయట్టి, తలతోడఁగూడ నాతల లెల్ల వంచి
దండప్రణామంబుఁ దగ నాచరించి, నిండినభక్తితో నిలిచి రావణుఁడు
ఆసనత్సుతునిచే నట మున్ను విన్న, భాసురంబైనట్టి పరతత్త్వమెల్లఁ
దనకు సిద్ధించుటఁ దనలోనఁ దెలిసి, మనమున నెంతయు మగ్నుఁడై యపుడు
తలకొన్నవేడ్కతోఁ దలలెల్ల నెత్తి, తలఁపక యప్పుడు తల్లితో ననియె
నెఱుఁగుదు మున్ను నే నెఱిఁగినయట్టి, మొఱఁగులుగలవె యీమూఁడులోకములఁ
దరమిడి యీపరతత్త్వంబు తెఱఁగు, లెఱిఁగి, యెఱుంగవు హృదయంబు చెదరి
తల్లి నీవెఱిఁగిన ధర్మశాస్త్రంబు, లెల్ల నిష్ఫలములై యిప్పుడు తోఁచెఁ
దల్లిదండ్రులుపల్కు తప్పు లెన్నైన, నుల్లంబులో నాఁటి యుండవుగాని
యామహాత్ముఁడు విష్ణుఁ డైనరామునకు, నీమేనితోఁ బోయి యే మ్రొక్కఁజాల
హేయపదార్థమై యొసఁగుచున్నట్టి, కాయంబు పెంచుట కష్టంబుగాదె
నరులు వానరులు నెన్నఁగ నెంతవారు, సురలన్నను వారు శూరులే తలఁప
గెలుతు నవశ్యంబు గెలుపులేకున్న, నిల రామశరముల నీల్గుదుఁ గాని
హీనమానవునకు నే మ్రొక్కఁజాల, మాను మిమ్మాట ముమ్మాటి కోయమ్మ
చాలు నీబుద్ధులు చాలు నీమమత, చాలించవై లేని జనని విచ్చేయు
గొనకొని నీపిన్నకొడుకుతోఁ గూడి, యొనలేనిసంపద నేలు మీఁదంక
ఈలోకసంపద లిన్ని నీకృపను, నాలోలమతి నేను ననుభవించితిని
బలిమిని గలిమిని భయమింత లేక, బలిసి యుంకేలితిఁ బదిలతఁ లేఁదు
లెలమి నాకును నెదు రెవ్వరు లేక, విలసిల్లు ప్రాభవవిభవంబు మెఱసి
విచ్చేయు నగరికి వేగంబ యనిన, నచ్చుగా రావణుం డాడుమాటలకుఁ
గైకేశి మదిలోనఁ గడుచోద్యమంది, యాకొడుకును జూచి యనియెఁ గ్రమ్మఱను
వరతపోనిధి విశ్రవసుఁ డానతిచ్చు, పరతత్త్వ మదియేల పడిపోవు ననుచు
వనిత యప్పుడు మూల్యవంతునిఁ జూచి, మన మెంత చెప్పిన మానునే యితఁడు
అన విని యిట్లనె నమ్మాల్యవంతుఁ, డెనయంగ నీవిప్పు డేల చెప్పెదవు
ఘనునకు నార్యులు చాటువాక్యములు, కడుప్రీతిఁ జెప్పినఁ గాదని వినఁడు

గానఁ గానఁడు వీఁడు కార్యంబు తెఱఁగు, మానుము నీవింక మానిని లెమ్ము
అనవుడుఁ గైకేశి యట్లకాకనుచు, నెనయంగఁ జెడుత్రోవ యేటికిఁ దప్ప
నేతెఱంగునఁ బోవదిది దైవకృత్య, మోతండ్రి మననీతి యుచితమే యనుచు
దాతయుఁ దానును దలకెడువగల, భ్రాతలు దల్లులు బాంధవుల్ గలఁగఁ
జని యప్పు డాసభాసదనంబుఁ బాసి తననగరికిఁ బోయి ధర్మక్రమంబుఁ
దననిత్యకర్మంబు దప్పక యపుడు, మనమునఁ దెలిసి సమ్మదమున నుండె
నట దశగ్రీవుండు నధికదర్పమునఁ, బటుతరనిస్సాణభాంకృతుల్ చెలఁగఁ
జేయించి రాక్షససేన రావించి, యాయోధనోద్యుక్తులై యేపుమీఱి
యున్న మంత్రులఁ జూచి యుగ్రుఁడై పలికెఁ, గన్నులఁ గోపంబు కడలుకొనంగ
శ్రీరాముఁ డిప్పు డీసేతువుఁ గట్టి, వీరుఁడై వచ్చి సువేలాద్రి విడిసెఁ
బటుగతి నామీఁదఁ బగవాఁడు రాఁగ, నిట నిద్రవోవుట యేనేర్పు మీకు
మిష్టేమి చేయుదు మిము మంత్రు లనుచు, నమ్మిన వీఱిడి నను నండ్రుగాక
కాదుపో మీరు పేక్షాపరులైన, నాదెస కీడొందునా యివ్విధమున
సామభేదంబులఁ జక్కఁగాకున్న, రామునితోఁ బేర్చి రణము సేసెదను
అని రావణుం డాడ నఖిలరాక్షసులు, దనకిననిగ్గులఁ దలయెత్తలేక
యూరకుండిరి యూరకుండ నేలనుచు, ధీరుఁడై యావేళ దివిజారియైన
రావణుతోడ దర్పంబునఁ దనదు, చేవ దోఁపఁగ నింద్రజిత్తుండు పలికె
దేవ రావణ సర్వదేవసంఘముల, నావిధంబున గెల్చు నంతటినీకు
నిలయేలఁగాలేని యారామలక్ష్మణులచేత నేకీడు నూల్కొను నింక
వలదు చింతింప నే వ్రాలినవాఁడ, నలవు చలంబు ధైర్యముఁ గలవాఁడ
నాగపాశంబుల నాకేశుఁ గట్టి, యాగతి నేపనా యసురాధినాథ
కాలకేయాదిరాక్షసవీరవరులఁ, దోలనా దానవోద్ధురసంగరముల
మనుజులఁ గృశులఁ దామసుల దుర్బలుల, దనుజేశ దశరథతనయుల నాకుఁ
జంపుట పెద్దయే సమరంబులోనఁ, జంపెద నీమది సందేహపడకు

రావణున కతికాయుండు నీతి సెప్పుట

మన విని యతికాయుఁ డనువాఁడు పలికె, దనుజేశ్వరునితోడఁ దద్‌జ్ఞులు మెచ్చ
విను దానవేశ్వర విశదనీతిజ్ఞు, డనుపెంపుతోడ నీయఖిలంబు నెఱుఁగఁ
బరులసొమ్ముల కాసపడక వర్తించు, నరనాథుఁ డిలయెల్లనాఁడును నేలు
నిది నీతిగతి యని యిచ్చఁ జింతింప, కెదురెందు లేదని యేల చూచెదవు
ఇనకులోత్తముఁడు నీ కెగ్గేమి చేసె, దనుజేశ నీకు నాతనిదేవి యేల
నీదైనలంకయు నిన్నును జెఱుప, నీదుష్టరాక్షసు లెత్తుకొన్నారు
గావున సీత రాఘవునకు నిచ్చి, యావిభీషణునకు నట లంక యిచ్చి
యానినభక్తితో నూరకయుండి, మానితంబుగ బుద్ధిమంతుండ వగుము
అని పెక్కుభంగుల నతికాయుఁ డపుడు, తనతోడఁ బలుకంగ దనుజేశ్వరుండు
శుకసారణులఁ జూచి శూరుఁడై పలికె, నొకమానవుం డబ్ధి నుఱక బంధించె

ఘనుఁ డిట్టివాఁ డెందుఁ గలఁ డది చిత్ర, మనయంబు రాముఁ డీయబ్ధిని దాఁటె
ననుచున్నవారు మీఁ రాసేనఁ జొచ్చి, ఘనమతులై యెల్లక్రమము వీక్షించి
రండని పనిచిన రయమున వారు, దండి వానరవేషధారులై వచ్చి
వనములయం దుపవనములయందు, ననుపమలీల మహాద్రులయందు
వరసేతువందు నవ్వార్ధికవ్వలను, గురుగుహాంతరములఁ గొమరైనయెడలఁ
గలయంగ విడిసిన కపిసేనఁ జూచి, తలయూఁచి వెఱఁగంది తలఁకి యాచరులు
మేనులు గరుపార మెల్లనఁ జొచ్చి, వానరసేనలో వచ్చుటఁ జూచి
యెఱిఁగి విభీషణుం డేచి పట్టించి, యుఱక వాండ్రను రామునొద్దకుఁ దెచ్చి
మనుజేశ రావణమంత్రులు వీరు, వనచరవేషులై వచ్చినవారు
శుకసారణులు వీరు సొచ్చి యివ్వీట, సకలంబుఁ గనుఁగొని చనఁగలవారు
అనవుడు వారలు నతిభీతినొంది, మునుకొని చేతులు మోడ్చి మ్రొక్కుచును
దేవ రావణుఁడు పుత్తెంచినచరుల, మీవిభీషణుమాట లిన్నియు నిజము
ఏచి యారావణుం డెలమి మీసేనఁ, జూచిర మ్మనవుడుఁ జూడ వచ్చితిమి
అనుటయు నవ్వుచు ననియె రాఘవుఁడు, వినుఁడు రావణుమంత్రివిభులాటఁ జేసి
మిమ్ముఁ జంపుట దగు మిముఁ జంపఁగాని, మిమ్ముఁ జంపఁగ వచ్చు మేలేమి నాకు
నది చెప్పనేల వీడంతయుఁ జూడుఁ, డనిచూడు మిదిచూడు మనక మీ రిప్పు
డిట తెలిగొనక వీడంతయుఁ జూడుఁ, డటఁ బోయి వెసఁ జెప్పుఁ డారావణునకు
నేలావు నమ్మి నీ విట సీతఁ దెచ్చి, తాలావుఁ జూప రమ్మనుఁ డాజిలోన
నెల్లియాలంకయు నెల్లరాక్షసులఁ, ద్రుళ్లడి నిన్నును దునుమాడు ననుఁడు
చనుఁడని రావణుచారులఁ బనిచె, జననాథుఁ డారామచంద్రుండు ప్రీతి
వారు విభీషణువలన నవ్వీట, వారక సకలంబు వడిఁ జూచి పోయి
రావణుఁ గాంచి యారావణుతోడ, దేవ నీపంచిన తెఱఁగునఁ బోయి
కపిసేనయంతయుఁ గనుఁగొనుచుండ, నెపమాత్రమున మమ్ము నీతమ్ముఁ డెఱిఁగి
పట్టించి కట్టించి భానుకులేశు, కట్టెదిరికిఁ దెచ్చెఁ గలుషంబుతోడఁ
జంపింపఁ దలఁచిన సదయుండుగానఁ, జంపింపఁడయ్యె నిక్ష్వాకువల్లభుఁడు
నీలంకయును నిన్ను నిఖిలరాక్షసుల, నాలంబులోపల నడఁగించుటకును
రామభూపాలుశౌర్యముఁ జెప్పనేల, సౌమిత్రి యొక్కఁడే చాలు లంకేంద్ర
సురవైరి సేతువుఁ జూచితి మందు, నెరసి వానరసేన నిండియున్నయది
అది శతయోజనం బైనట్టినిడుపు, పదియోజనంబుల పరపును గలిగి
కపిసేన నెంతయు గణుతింప రాదు, కపులుండఁ గొండకు ఘనగిరులందు
విడిసినసేనయు విడియుసేనయును, విడిదలపట్టకు వెదకుసేనయును
నుదధికి నవ్వల నుంచుసేనయును, వదలక మఱియును వచ్చుసేనయును
నైయుండుటకు మాకు నాత్మలో వెఱఁగు, పాయనివెఱపును బ్రభవించె దేవ
యొక్కొక్కచోటన యున్నయాసేన, లెక్కించి బ్రహ్మయు లిఖియింపలేఁడు
కాన నారామునిఁ గని సీత నిచ్చి, దానవనాథ మోదంబున నుండు

మనవుడు రావణుం డామాటలెల్ల, విని నింపుగాక క్రొవ్విననరోష మెత్తి
దేవగంధర్వు లెత్తినవైన సీత, నే విడుతునె యేల యీపందతనము
మిమ్ముఁ గోఁతులు పట్టి మెదిచిన మీరు, బమ్మరవోవుచుఁ బఱతెంచినారు
వలవ దోడకుఁడు దుర్వారులై మిమ్ముఁ, దలఁచి కోఁతులు రారు దాడిమై వెనుక
నని ధీరుఁడై పల్కి యారావణుండు, చని తనతో శుకసారణు ల్నడువ
మిక్కిలి పొడవైన మేడపై నెక్కి, యక్కపిబలముల నంతయుఁ జూచి
యచ్చెరువంది తా ననియె వారలకు, నీచందమున నున్న యీసేనలోన
నెవ్వఁడు ముంగల నేపారి నడుచు, నెవ్వఁ డెవ్వఁడు వెన్క నేమఱకుండు
నెవ్వఁడు శూరుఁ డిం దెవ్వఁడు వలఁతి, యెవ్వనిమాట లయ్యినసూతి సేయు
నెవ్వనితో రాముఁ డిష్టంబు పలుకు, నెవ్వనిచే సేన యేపారియుండు
నెవ్వరు రేపగ లీసేనఁ గాతు, రెవ్వరు సామంతు లీసేనలోన
నెవ్వఁడు సుగ్రీవుఁ డెవ్వఁడు రాముఁ, డెవ్వఁడు లక్ష్మణుఁ డేరూపువాఁడు
చూపుఁ డేర్పడ మీరు చూచితి రేని, కోపింప నేవారి గుణములు విన్న
ననవుడు సారణుఁ డారావణునకు, వినుపింపఁ దొణఁగెఁ బ్రవీణత మెఱసి
దేవ పుళిందానదీతీరవర్తి, పావకసుతుఁడైన ప్రబలుఁ డీధాత్రి
వీఁడె యీలంకెల్ల వెసఁ బెల్లగిల్లఁ, బోఁడిమి సార్వులు బొబ్బలు చెలఁగఁ

## రావణునకు శుకసారణులు కపిపుంగవులఁ దెలుపుట

గురుతరకపినాయకులు లక్షగొలువఁ, దరుచరసేనముందఱ నున్నవాఁడు
అలఘు సత్త్వుఁడు నీలుఁ డనువాఁడు దేవ, జలజాప్తసుతులకు సైన్యపాలకుఁడు
వీకతో దిక్కులు వెసఁ బెల్లగిల్లఁ, దోఁకఁ దాటించుచు దుర్ధమవృత్తి
వెఱగందఁజేయుచు వేయుపద్మములు, మఱి నూఱుసంఖ్యలు మర్కటోత్తములు
బలవంతులగువారు బలసి తన్గొలువఁ, గొలువున్నవాఁ డొక్కకొండయుఁ బోలె
వాలినందనుఁ డల్లవాఁడె యంగదుఁడు, వాలికంటెను బలవంతుఁడు వీఁడు
అడరంగ నాచందనాద్రివల్లభుఁడు, కడుఁ బ్రసిద్ధుఁడు విశ్వకర్మనందనుఁడు
విను ప్లవంగంబులు వేయుఁగోటులును, నెనుబదిలక్షలు నేపారి కొలువ
ఘనమైన సేతువుఁ గడఁకతోఁ గట్టి, వనచరసేన నివ్వలికి దాటించి
వ్రాలిననలుఁ డుపో వాఁడు దైత్యేంద్ర, వాలినందనున కవ్వలనున్నవాఁడు
తరుచరయూథముల్ తనుఁ బెక్కు గొలువ, సురలోకకంటక సుతరుఁ డన్వాఁడు
తనసేనతోఁ గూడ తా నొక్కరుండు, మనలంక సాధింప మందుచున్నాఁడు
రజనీచరాధీశ రమణీయకాంతి, రజతాద్రిఁ బోలుచు రవిపుత్రు నెదుర
బలముల నన్నింటిఁ బరిపాటిఁ దీర్చు, వలఁతి యాశ్వేతుఁ డన్వానరుఁ జూడు
గురుబలాఢ్యులు వేయుకోటులు గొలువ, వఱలు సాతఁడు వేగవంతుఁ డన్వాఁడు
చూడుము మనదిక్కుఁ జూచుచున్నాఁడు, చూడుము లంకేంద్ర సుగ్రీవసఖుని
దగ వింధ్యశైలసుదర్శనముఖ్య,నగములకెల్లను నాథుండు వాఁడు
కొమరారు సింగపుఁగొదమయుఁ బోలె, నమరినవాఁడు లంకాధీశ వినుము

గాంభీర్యవారిధి కపిలవర్ణుండు, రంభుండు ఘనకేసరంబులవాఁడు
బలువిడి మూటముప్పదిలక్షలెలమి, గొలువనున్నాఁ డిదిగో చూడు దేవ
కుముదుఁ డన్వాఁడు సంకోచనాచలము, నమరంగఁ బాలించు నమరారి యతఁడు
పదికోట్లయగచరపతు లోలిఁ గొలువ, మదమున మలయు నామర్కటుఁ జూడు
రమ్యశైలమునకు రాజైనవాఁడు, రమ్యోరువిక్రమ్రోరస్థ్సలుం డతఁడు
నలువదిలక్షలు నాలుగువేలు, గొలఁవంగ లంకపైఁ గోపంబు మీఱఁ
గుదియక నిరుఁగెలంకులఁ జూచువాఁడు, త్రిదశారి యదె చూచితే శరభుండు
బలసి తన్నెప్పు డేఁబదికోట్లకపులు, గొలువ నున్నాఁ డదే గురుసత్త్వధనుఁడు
పారియాత్రాచలపతి ఘోరసమర, ధీరుండు పనసుండు దేవేంద్రవైరి
లలినొప్పు డెబ్బదిలక్షలకపులు, గొలువ నున్నాఁ డదె గురుబలోన్నతుఁడు
సింధునగతిఁ జాయ చెన్నగ్గలించి, యందమౌ క్రోధనుం డనువాఁడు దేవ
యేనె/చాలుదు లంక నిలఁ గూలఁద్రోయఁ, గానని పూని యిక్కడఁ జూచువాఁడు
బలవంతులగుకపు ల్బలసి తన్నెపుడు, లలినొప్ప డెబ్బదిలక్షలు గొలువ
గవయుఁ డున్నాఁ డదే కనుఁగొను దేవ, వివిధప్రతాపసంవృతుఁ డైనవాఁడు
కామరూపులు వీరు ఘనఘోరసత్త్వ, లిమెయి ననిలోన నెక్కుడౌవారు
తలపోయఁగా దేవదైత్యులకైనఁ, గలఁగనివారు ముంగలివారు వీరు
నడుమ నెప్పుడును సేనాసమేతముగ, నడతెంచువారి దానవనాథ వినుము
ఉరుభుజు ల్వివిధవర్ణోజ్జ్వలు లద్రి,చరులు నానాసహస్రంబులు గొలువ
నీతోడ నెక్కటి నెఱి బోరఁ దివురు, నాతండు హరుఁడను నగచరోత్తముఁడు
నలుపెంతయును మీఱ నానావిధముల, నెలుఁగులసంఖ్యలు నేపారి కొలువ
నతినీలమేఘమధ్యస్థుఁడై పొలుచు, శతముఖుఁ బోలి యుజ్జ్వలుఁడైనవాఁడు
నర్మదాతీరంబునను ఋక్షనగముఁ, బేర్మితో నేలెడు పృథుబాహుబలుఁడు
వాఁడె ధూమ్రుఁడు జాంబవంతుతమ్ముండు, వాఁడిమిఁ దనయట్టివారు తన్గొలువ
నీలశైలంబుల నెలవెల్లఁ దార, లై లీలనొప్పిన యాకృతుల్గలిగి
యుల్లసిల్లుచునున్న యొకకోటిసంఖ్య, భల్లూకములు గొల్వ బలసియున్నాఁడు
తొల్లి దేవాసురోద్ధురయుద్ధకేళి, నెల్లవరంబుల నింద్రుచేఁ బడసి
ప్రాలిన యాజాంబవంతుఁడు వాఁడె, దూలఁ డెన్నఁడు రణధూమ్రలోచనుఁడు
ఒక్కలుండిదె వీనియుభయపార్శ్వముల,నొక్కొక్కయోజనం బొడలిలోఁ బొడవు
గలపద్మసంఖ్యల కపిసేన గొలువ, సలలితుఁ డగువాఁడు సన్నాథుఁ డతఁడు
నాకారిబిరుదు వానరపితామహుఁడు, నాకేశుతోఁ బోరి యని గెల్చినాఁడు
దహనునివలన గంధర్వకన్యకకు, మహనీయమైన జన్మంబు దానొంది
పరపైన యాద్రోణపర్వతం బేలుఁ, దిరముగా జాంబూనదీతీరవర్తి
వేయుకోటులు కపు ల్వేడ్కఁ దన్గొలువ, నీయగచరుఁ జూడు మేదినవాఁడు
నీలునితమ్ముఁడు నిర్జరవైరి, చాలువాఁ డతఁ డింద్రజాలుఁ డన్వాఁడు
కుపితమర్కటు లాఱుకోటులు గొలువఁ, గపివీరుఁ డాతఁ డుగ్రధనుఁ డన్వాఁడు

కరము సంప్రీతి గంగాతీరముననుం, జరియించువాఁడు శాశ్వతబాహుబలుఁడు
చిరతరలీలమై శిశిరాద్రి వేడ్క, నిరవొంద నెప్పుడు నేలెడువాఁడు
పదికోట్లయగచరు ల్బలసి తన్గొలువ, నదె చూడుమా గజుం డనువాఁడు దేవ
కోటికోటులవేయు కొమరుగా జముని, పాటి గోలాంగూలబలములు గొలువ
నదె గవాక్షుం డను నతఁ డాలమునకుఁ, ద్రిదశారి యోధులు దీటుచున్నాఁడు
ధవళవర్ణాంగు లుద్దండవిక్రములు, రవిసన్నిభులు రణరంగభీషణులు
వివిధరూపంబుల విఖ్యాతులైన, ప్లవగసామజములు బలసి తన్గొలువ
నున్న కేసరి జూడు మొప్పారుకాంచ,నోన్నతశిఖరికి నొడయండు వాఁడు
బహువర్ణులై పటుభాషణధ్వనులు, మహి గదలఁగ దంతమండలి వెలుఁగ
1ంగంపుఁగొదమల చెన్నగ్గలించి, పింగళాక్షుంబులఁ బెద్దయు మెఱసి
వేయుకోటులకపు ల్వేడ్కతోఁ గొలువఁ, బాయక రాముకృపారసం బంది ।
తనప్రాణములు రామధరణీశ్వరునకు, ననయంబు నీఁగోరు నతులవిక్రముఁడు
అసురారి వాఁడె యత్యాయతబలుఁడు, సమరకర్కశుఁడైన శతబలిఁ జూడు
వీఁడె సుషేణుండు వేకోట్లకపులు, వాఁడిమిఁ దన్నుఁ గొల్వఁగనున్నవాఁడు
పదికోట్లయగచరపతు లోలిఁ గొలువ, నొదవు నాతని జూడు ముల్కాముఖుండు
ఇటుఁ జూడుమా వీఁడె ఋషభుఁ డన్వాఁడు, భటముఖ్యు లతనికిఁ బదికోటు లధిప
వనచరశతకోటి వలనొప్పఁ గొలువ, దనరు నాతనిఁ జూడు దానవాధీశ
కనకాద్రిధైర్యుఁ డఖండవిక్రముఁడు, ఘనభుజస్కంధుఁడు గంధమాదనుఁడు
మొనకు వేకోట్లుగా ముయ్యేడు మొనలు, తనరఁ గల్గినవాఁడు దధిముఖుఁ డతఁడు
విను మిరువదియొక్క వేయుశంఖంబు,లును మఱి రెండు వేల్పూఁబృందములు
గలయల్ల మొన దివాకరసూనుమూల, బలమావలీముఖప్రముఖులఁ జూడు
మొలయఁ గిష్కింధలో నుండెడువారు, లలి దేవగంధర్వులకుఁ బుట్టినారు
కామరూపముల సంగరకౌతుకముల, భీమవిక్రమములఁ బెంపారువారు
అనికి సన్నద్ధులై యార్చుచున్నారు, కనుఁగొను వారి రాక్షసలోకనాథ
అమృతంబు బ్రహ్మచే నమరంగఁ బడసి, రమరులకంటెను నధికులు వీరు
వినుతింప మైందద్వివిదులనువారు, విను దేవ యేకాంగవీరులు వీరు
పదికోట్లప్లవగులు బలసి కొల్వంగ, నుదధితీరంబున నున్నారు దేవ
వీరలు సుముఖుండు విముఖుండు ననఁగ, ఘోరవిక్రములఁ గన్గొనుము లంకేశ
మృత్యువుకొడుకులు మిగిలినచేవ, మృత్యువుకంటెను మీఱినవారు
మిగిలినతెగువతో మితిమేరలేని, యగచరుల్ తను భృత్యులై కొలువంగ
నున్నవాఁ డదెచూడు ముదధి లఘించి, నిన్ను నీబలమును నీవారిఁ గొనక
చనుదెంచి వనములో జానకిఁ గాంచి, వనమెల్లఁ జెఱిచి నీవరసుతుఁ జంపి
లంక భస్మముఁజేసి లంకిణి నొంచి, జంకెతోఁ గ్రమ్మరఁ జన్నవాఁ డతఁడు
ఆవాయుసూనుండు హనుమంతుఁ డగుట, నీవును నెఱుఁగుదు నిర్జరారాతి
విను చిత్ర మొక్కటి వీఁడు బాల్యమున, నినమండలం బుదయింపంగఁ జూచి

పెరిఁగిన యాఁకటి పెల్లున దానిఁ, బరికించి ఫలబుద్ధిఁ బట్టంగఁ దివిరి
వేగంబుతో మూఁడువేల యోజనము, లాగగనంబున కప్పుడు బిట్టెగసి
యంతటనుండి పూర్వాద్రిపైఁ బడియు, నెంతయు రయమున నీవానరుండు
హనువు భగ్నంబయ్యె నంతనుండియును, హనుమంతుఁ డనునామ మయ్యె నీతనికి
వీరలందఱును బృథ్వీధరంబెల్ల, వారల యొక్కింతవడి గెల్చువారు
ఇట్టి కపీంద్రు లనేకులు దేవ, యిట్టని సంఖ్యగా నెన్నంగవచ్చు
నని సారణుఁడు పల్క నసురేంద్రుతోడ, సునిశితమతియైన శుకుఁ డర్థిఁ బలికె

శుకుఁడు శ్రీరాముల తేజోవిశేషములఁ దెల్పుట

వారలకెల్ల జీవనమైనయట్టి, యీరాముఁ జెప్పెద నసురేశ వినుము
నయమైన నీలవర్ణప్రభఁ బొలిచి, మెయిచాయ నెంతయు మెఱసినవాఁడు
కమలంబులను బోలు కన్నులవాఁడు, విమలనీతిస్థితి వెలసినవాఁడు
ఆజానుబాహుఁడు నఖిలేశ్వరుండు, రాజతేజోనిధి రఘుకులోత్తముఁడు
సత్యంబులోపల సారమౌవాఁడు, నిత్యధర్మంబున నెగడినవాఁడు
శస్త్రాస్త్రవిద్యావిశారదుం డఖిల, శాస్త్రజ్ఞుఁ డురుకీర్తిసంపదవాఁడు
తపసునినైనను దమతాత యనక, తపియింపఁ జేయు ప్రతాపంబువాఁడు
చక్కాఁడు నభమైన శరజాలములను, వ్రక్కలు గాఁజేయు వసుమతినైన
నలిగిన నాతనియలుక వైరులను, దలఁపంగ నృశ్యాప్ర దశకంఠ వినుము
కినుక నీ వాసీతఁ దెచ్చితిగాన, జగతీశుఁ డిబ్బంగిఁ జనుదెంచె ననికి
శరశరణాగతవజ్రపంజరుఁడు, బిరుదులకెల్లను బిరుదైనవాఁడు
శరణన్నఁ గాచు నేచందంబునందు, దాఁకొన్న యలుకకుఁ దుది లేనివాఁడు
మిక్కిలియైన నీమీఁదికోపమునను, నక్కఱున్నలం దెల్ల యశఁరినవాఁడు
మూఁడులోకముల నిమ్ముల నేలువాఁడు, వాఁడెపో రాముండు వనజాప్తకులుఁడు
వారక శుద్ధసువర్ణవర్ణాంగుఁ, డారాము పలపట నటనున్నవాఁడు
చలమున నీరేడుజగములనైన, నలుకతో నిర్జించు నతిశక్తివాఁడు
ఆరామునకుఁ బ్రాణమైనట్టివాఁడు, ఆరాముతమ్ముఁ డుదగ్రవిక్రముఁడు
భావింప మమ్మూర్చి పట్టినవాఁడు, దేవ యాలక్ష్మణదేవునిఁ జూడు
మలుకపైఁ నిన్ను నుగ్రాజిలోఁ గలఁచి, చల మొప్ప లంక నిశ్శంక నేలుటకుఁ
బట్టంబు రామభూపాలుని చేతఁ, గట్టించికొని ప్రీతిఁ గొలుచున్నాఁడు
ఆవిభీషణుఁ జూడు మసురాధినాథ, భూవరు వెనుక నేపున నున్నవాఁడు
ఆరాముతమ్ముని యావిభీషణుని, చేరువ నవ్వలఁ జేరియున్నాఁడు
మహనీయతరధర్మమార్గంబువాఁడు, మహితనీతిస్థితి మరిగినవాఁడు
మానఘనాధివరుతి నొప్పువాఁడు, పూని కిష్కింధ నెప్పుడు నేలువాఁడు
చిరకపిరాజ్యాభిషేచనహేతు, కరహేమమాలికాకలితవక్షుండు
గురుభుజాదండకఘోరవిక్రముఁడు, సురవైరి చూచితే సుగ్రీవుఁ డతఁడు
వీనికిఁ గలసేన వివరింతు వినుము, దానవనాథ చిత్తంబున నిలిపి

సంఖ్య వేకోటులై చను నూఱువేల,సంఖ్యలు మఱి మహాసంఖ్య నాఁబరఁగు
నవి లక్ష గూడిన నగు బృందసంఖ్య, యవి లక్ష గూడిన నగుఁ బద్మసంఖ్య
యవి లక్ష గూడి మహాపద్మమయ్యె, నవి లక్ష గూడిన నగు ఖర్వగణన
యవి లక్ష గూడిన నగు మహాఖర్వ, మవి లక్ష గూడిన నగు సముద్రంబు
అవి లక్ష గూడ మహాసముద్రంబు, నవి లక్షతో మహాదాఖ్యమై పరఁగు
నవి కోటిపో వాలియనుజునిబలము, వివరించి చూడుము విశదంబుగాఁగ
నిది తుద మొదలని యెన్నంగ దీని, చదురుతనంబున సంఖ్య దేరాదు
కావున రాముతోఁ గదిసి పోరాడ, రావణ రాదు దుర్వార మాబలము
అని శుకుం డెఱిఁగింప నారావణుండు, ఘనమైనకపిసేనఁ గలయఁగఁ జూచి
తనలోన బడబాగ్ని దరికొనుచుండఁ, దనదారు వార్ధిచందంబున నపుడు
వెఱచియుఁ దనలోని వెఱపడఁగించి, వెఱవనిగతిఁ గోపవివశుఁడై పలికె
మంత్రి యేలికచిత్తమార్గంబు దప్పి, మంత్రంబుఁ జెప్పనే మనసెల్ల విఱుగ
నేతెఱంగెఱుఁగక యెదిరి నాయెదుర, నితెఱంగునఁ బల్కు టిది మీకుఁ దగునె
యనవుడుఁ దలయెత్త కచ్చోటు వాసి, చని రప్పు డాశుకసారణు లంత
జనినపిమ్మట నాప్తసచివులు దాను, దనుజాధినాథుఁ డెంతయును జింతించి
వారి వీడ్కొల్పి దుర్వారుఁడై వైర, మారవిద్యుజ్జిహ్వుఁ డనువానిఁ బిలిచి
రామునిధనువు శిరంబును బోలె, నీమాయ నతివేగ నిర్మింపు మనిన.
నతఁ డది నిర్మించి యర్థిఁ దెచ్చుటయు, నతనికి మెచ్చు ప్రియంబున నొసఁగి
సురుచిరంబైన యశోకవనమున, కరిగి యాదశకంఠుఁ డవనిజఁ గనియెఁ
బెల్లగు నీవగఁ బెట్టనేమిటికిఁ, దల్లి నన్నని వసుంధర దూరుకరణిఁ
దలవంచుకొని విన్నదనమునఁ దూలి, సొలవక ధాత్రిఁ జూచుచు నున్నదాని
నొడలఁ జిత్తములఁ బెంపొదవు దావాగ్ని, యుడికి పొంగుచు వెలికురుకుచున్న
రాక్షసుపై రోషరసధార లనఁగ, నక్షీణబాష్పధారావళిదాని
పుత్త్రి యీదురవస్థఁ బొందితె యనుచు, ధాత్రి దానును బరితాపంబునొంది
యాలింగనముసేసి నట్టిచందమున, ధూళి గప్పినమేనితో నున్నదాని
రావణ నిన్ను నీరాక్షసకోటి, నేవిధంబునఁ ద్రుంప కే నేల పోదు
నని వానిక్రూరధర్మాధిదైవంబు, గొనకొన్నకైవడిఁ గూర్చున్నదాని
నమరారులను నీరసావనీజములఁ, దమకించి తావిటతాటంబు వేయు
నని దరికొను విలయానిలుపగిదిఁ, దనరు నిట్టూర్పులఁ దఱుచైనదానిఁ

సీతకు శాంబరీమాయచేఁ గల్పితంబైన శ్రీరాములశిరోధనువులను జూపి వెఱపించుట

గని చెడఁదలఁచిన కష్టదానవుఁడు, తనదిక్కుఁ జూడని ధరణిజఁ గనియె
వెరవుచాలని యవివేకి దానవుల, ఖరదూషణాదుల ఖండించె ననుచు
జనకనందన రాముశౌర్యంబు నమ్మి, నను గణుతింప వెన్నఁడుఁ జిత్తమునను
నసమునఁ గపులతో నంబుధి దాఁటి, యసముఁడై యాసువేలాద్రిపైనుండి
యలసి నిద్రింపంగ నగచరసేన, నలమి యీరాత్రి ప్రహస్తుఁ డన్వాఁడు

నాకూర్చుబంటు చూర్ణంబుగాఁ జేసి, కాకుత్స్థుసురకార్ముకంబును దలయుఁ
గొనివచ్చి రాముని కూర్మితమ్ముఁడును, వనచరాధిపుఁడును వగచుచు నుండ
దప్పించుకొని పాఱె. దా విభీషణుఁడు, చుప్పనాతిని ముక్కు సురియచేఁ గోయు
నాపాపమునఁ బాఱె నవ్వుడు నీకుఱఁది, వాపోవుచును జాంబవంతుఁడు పఱచె
నూరక యంగదుం డూడంగఁ బాఱె, దారితప్పనఁ బోయెఁ దారుండు భీతి
నీలుండు శరభుండు నిలిచి పోరాడి, వ్రాలిరి మేనులు వ్రయ్యలై జగతిఁ
బోక నిల్చి సమీరపుత్త్రుండు పడియె, మోఁకాళ్లు విఱిగి రామునిఁ బాయలేక
నెత్తురు గ్రక్కుచు నేఁగె సుషేణుఁ, డుత్తలంబున ధూమ్రుఁ డుదధిలోఁ బడియె
జెయ్యెత్తి మ్రొక్కఁ గూల్చిరి దధిముఖుని, మాయచే గేసరి మయి దాఁచిపోయె
కుముదుండు తలఁ దెగఁగొట్టినఁ బడియె, సమసె మైందుఁడు వీఁగి చనియెను నలుఁడు
పనసుఁ డెఱింగి దబ్బర వచ్చె ననుచుఁ, బనసచెట్టునుబోలి భ్రమసి తా నిలిచె
నాలంబులోపల నఖులపీరులును, గూలుటయును జూచి కూడినభీతిఁ
జివ్వఁ జాలించి వచ్చినకపులెల్ల, నవ్వంగఁ బరుగెత్తి నలినాప్తసుతుఁడు
సేతువుఁ జూడ వచ్చినకపులెల్ల, భీతిచే నిల్లాండ్రు బిడ్డలఁ దలఁచి
ముగిసె కార్యంబని మొనవెలి కంకులకుఁ, దగఁగొట్టఁ బాఱిరి దైత్యులు దఱుమ
గాన గంజాస్య రాఘవునాస విడిచి, సానారులకునెల్ల నాథవై యుండు
నాయింట దాసిజనము లైదువేలు, పాయక మణిమయాభరణముల్దాల్చి
యచ్చరలున్నవారలవ నీసేవ, కిచ్చెద నీమన సిమ్ము నాకిపుడు
విరిపోటలోఁ గల్పవృక్షంబులైదు, తరుణి నీముడిపువ్వుదండల కిత్తు
నమరభూధరరోహణాచలములు, రమణి నీకిత్తు నఘంతులఁ దేలంపు
నామీఁదఁ గామధేన్వాదిధేనువుల, భామిని నీయింటి పాడి కేనిత్తు
గొమ్ము ముప్పదిరెండుకోట్లచేనులు, నెమ్మి సందోకొక్కనికి వేయివేయి
[?] దానవబలపద్మ మార్తాండు నాకు, దినఁబో గెలిచితి దేవతాధిపుల
నాబలంబెల్ల నీయడుగులు గొలిచి, యీబాల యిటమీఁద నుప్పొంగఁగూర్చు
ననుచు విద్యుజ్జిహ్వుఁ డనువానిఁ బిలిచి, వనజాక్షియుండర వైవఁ బంచుటయుఁ
ధనుమధ్య యిదె రాముతలయును విల్లు, నని యటు వైచి వాఁ డరిగె నవ్వుచును
దలకొని రామభూధవుఁ డిప్పు డసురి, తలలెల్లఁ ద్రుంచు నుద్ధతి రణస్థలిని
దలఁకకు నీపతితలయును నింపారు, నిల ధర్మగుణముతో నీక నుమాడ్కఁ
దరలాతీ యాతల తప్పక చూచి, కరమొప్ప రాముని కన్నులు మోము
దలకట్టు మాళి రత్నప్రభావలియుఁ, బలువరుసయుఁ గర్ణభాలయు మోవి
తలపోసి రామునితలయ కాఁ దలఁచి, ఒలుమూర్ఛపాల్పడి వడియె సాధరణి
యిది బొంకు నీపతి కేమియుఁ గాదు, సుదతి నీకిమాయ చూడఁగా దనుచుఁ
దనయురస్థలికి నత్తన్వంగిఁ దివిచి, కొసరియునో కాక యాకుంభిని యనఁగఁ
బడి యంతఁ దనలోనఁ బడఁతుక తెలిసి, యడరెడుకో కాగ్ని నల్లయుచుఁ బలికెఁ
గటకటా కైకేయికలహాంబుఁ బన్ని, యిటు క్రుంగఁ జేసితే యిక్ష్వాకుకులము

నీరాఘవేశ్వరుం డెగ్గేమిసేసె, నూరక యడవుల నుండంగఁ బనుప
వనధి బంధించితి వచ్చి నీవింకఁ, గొనిపోయె దనియెడి కోర్కి దీపింప
బెద్ద నమ్మితిఁగదా పృథ్వీశ నిన్ను, నిద్దెస నాదైవ మిటుసేసె తెలుఁగ
నాకును నీకుఁ బ్రాణం బొక్కటగుట, గాకుత్స్థ యిటు బొంకుగాఁ జేయఁదగునె
పతికంటె ముందఱఁ బ్రాణముల్ విడుట, కతివగా నైతినే నర్కకులేశ
యరుగుదుగాకేమి యడరి నీకడకు, నరనాథ పుత్తెంతు నాదుప్రాణముల
వసుధ నాతల్లి నావరుఁడవు నీవు, వసుధ కౌఁగిటఁ జేర్చ వావియే నీకు
జనకుచే నన్నగ్ని సాక్షిఁ జేపట్టి, కొనివచ్చి యిటు సేయఁగూడునే నీకు
నెట్టొకో రామ నీవిట నూరకున్నఁ, గట్టడిప్రాణముల్ గ్రాఁగవయ్యెడిని
గ్రాఁగనియప్పుడే కారణం బీవు, గ్రాఁగుట నిక్కంబు గాకుండు ననుచు
నీవిధంబున సీత యేడ్చుచునుండ, దౌవారికులు వచ్చి దనుజేశుఁ గాంచి
దేవ కార్యంబు లెంతేని బుట్టటయు, నీవరమంత్రులు నిన్సభాస్థలికి
నరుగుదెమ్మని ప్రహస్తాదులు వచ్చి, తరమిడియున్నారు దారపట్టమున
నని విన్నవించిన నారావణుండు, చనియె శీఘ్రంబున సభకు నత్తఱిని
దనుజుండు చనఁగ నాతలయును విల్లు, విన విస్మయంబుగా వెస మాయమయ్యె
నారావణునిలక్ష్మి యంతలోపలనె, బోరన మాయమై పోవునన్నట్టు
ఇదె రాఘవుఁడు వచ్చె నెత్తిపై ననుచుఁ, ద్రిదశారి యెంతయు ధీరుఁడై కడఁగి
వేగులవారిచే విన్నవార్తలకు, వేగ నిస్సాణంబు వ్రేయంగఁ బనిచి
తనసేనఁ గూర్పఁ బ్రధానులఁ బనిచె, జనకనందన నంత సరమ వీక్షించి
యేల మాయమ్మ నీవిటు ప్రలాపింపఁ, బోల దీవార్తలు బొంకు గానోపు
వనిత నీముందఱ వైచినశిరము, దనుజునిమాయఁగా దలపోయవలదె
వనజాక్షి యసురదుర్వాక్యంబులెల్ల, విని యేను బోయితి వెనుకనే యరయ
నావార్త విను రాముఁ డనికెత్తె ననుచు, దేవారి యెంతయుఁ దిరుగంగఁబడియె
నదె విను నిస్సాణహాసనఘోషంబు, లదె వినుమా రాక్షసావళియుగ్ర
రథములమ్రోఁతయు రథికసారథుల, పృథులభాషణములు పెల్లుగా మ్రోసె
నటుగాన రామున కాపద లేదు, కుటిలకుంతల నీవు కుందంగ వలదు
అని చెప్ప నాలంక యగలనార్చుచును, వనచరసేనలు వచ్చుటఁ జూచి
యంతరంగమున బెట్టడరి రావణుఁడు, చింతించి మంత్రులఁ జెచ్చెరఁ బిలిచి
యదె రాఘవుఁడు వచ్చె ననికి మీ రిపుఁడు, విదితవిక్రమశక్తి వేగంబు పోయి
మనుజుల నిద్దఱ మడియించి రండు, వనచరసేనల వధియించుచుఁ డోలి
నరుగుఁడు లెండన్న నారావణునకు, వరనీతిమతి మాల్యవంతుఁ డిట్లనియె

### మాల్యవంతుఁడు రావణునితో నీతి సెప్పుట

నుచితకాలంబున నొప్పగుసంధి, యుచితకాలంబున నొప్పు వైరంబు
గాన నయోచితకార్యంబు సేయు, వానికి రాజ్యంబు వర్తించుచుండు
నధముతో విగ్రహ మధికుతో సంధి, బుధులమతంబునఁ బొనర్చుటొప్పు

వలవదు మనకంటె వనజాప్తకులుఁడు, బలవంతుఁ డగువాఁడు బలవైరివైరి
దైవకార్యంబుగా ధరఁ బుట్టినాఁడు, దైవబలంబు నాతనియందె కలదు
ఆరయ ధర్మాత్ముఁ డది చెప్పనేల, వారక ఋషులకీవలు గన్నాఁడు
సురల బాధించి భూసురుల మర్దించి, యురుపాపబుద్ధివై యుండుదు వీవె
గెలుపు ధర్మముదెసఁ గీల్కొనుఁ గాని, యిల నధర్మముదెస నేల వర్తించు
నక్కమలజుచేత నటునాఁడు వరము, తక్కిన వారిచేతను జావకుండఁ
బడసితిగాని యిబ్భంగి నీమీఁద, నడతెంచు నరుల వానరులను గెలువఁ
బడయవు నీవెన్ని భంగులనైనఁ, జెడుట తథ్యము వీరిచేతను నీవు
దాని కింతటికి బ్రత్యక్షంబు సూడు, మానైన విపులహోమములధూమములు
జడిసె రాక్షసులతేజంబులు మాసె, నుడుగక మనవీట నొప్పములువుట్టె
నటుగాన నాదినారాయణుం డతఁడు, ఇటు సేయుటకుఁ బుట్టె నిద్ధరమీఁద
రామునితోడ విగ్రహ మొప్ప దుడుగు, రాముని బాణపరంపర ల్బెట్టు
వలదు రామునిఁ గని వనిత నొప్పించి, కులమెల్ల రక్షించుకొనుము లంకేంద్ర
యనవుడు దశకంఠుఁ డమ్మాల్యవంతుఁ, గనుఁగొని రోషసంకలితుఁడై పలికె
మిగులఁ దేజంబున మేటివై యుందు, నెగడిన నాయొద్ద నీపగవానిఁ
జెప్పెదు నిన్నేమి సేయుదు నింక, నెప్పుడు మానవయ్యెదు పందతనము
సీత నేమిటి కిత్తు సీత నిచ్చుటకు, భీతి నా కేమిటఁ జేర్చు నింతటనె
యని మీఱి పలికిన నమ్మాల్యవంతుఁ, డనియె నామాట నీవాత్మఁ గైకొనక
యారామచంద్రుని నాలంబులోన, నూరక గెలువంగఁ జూతువుగాక
యెందుఁ బోయెద మని హెచ్చి కంటకము, లందంద పలుకుచు నలుకమైఁ బోయెఁ
బోయినపిమ్మట బుద్ధిలోఁ దలఁచి, యాయసురేశ్వరుం డప్పుడు గడఁగి
యలఘుబలాఢ్యుఁ బ్రహస్తునిఁ బనిచెఁ, దొలి తొలి బలుకాపు తూర్పువాకిటికి
దక్షిణంబున మహోదరమహాపార్శ్వ, లక్షణబలయుతులై యుండఁ బనిచె
వారక పడమటివాకిట నుండ, నూరక నటఁ బంచె సుతు నింద్రజిత్తుఁ
దనమాఱుగాఁగ నుత్తరపువాకిటకిఁ, జని యుండుఁ డని పంచె సారణశుకుల
నందఱకును ముఖ్యుఁడై పురమధ్య, మందుండఁగా విరూపాక్షునిఁ బనిచె
నీవిధంబున లంక కెల్లఁ గాపిడుచు, రావణుం డంతఃపురంబున కరిగె
నంత నక్కడ రాముఁ డనుజు నర్కజుని, నంతకన్నను హితుం డగువిభీషణుని
వాలితనూజుని వాయునందనుని, వాలిన యాజాంబవంతు సుషేణు
నాలోన రప్పించి యందఱితోడ, నాలోచనంబునకై కూర్చి పలికి
నవగుణంబున కెల్ల నాలయంబైన, దివిజారిలంక యేతెఱఁగొకో యింకఁ
జూతమా యేర్పడఁ జూడుఁడా యొకసి, చేతఁ దక్కులమెల్లఁ జెడుట సిద్ధంబు
నని పల్కె యారాముఁ డనుజుండుఁ దాను, నినసుతుఁ డాదిగా నెల్లవానరులుఁ
గొలువంగ వచ్చి యెక్కుడు వేడ్కతోడ, నలరుచు నాసువేలాచలం బెక్కె
గుణములుగలవాఁడు గోత్రంబునందుఁ, బ్రణుతికి నెక్కనిబ్భంగి నన్నాడిఁ

గనియె రాఘవుఁడు లంకాపురం బపుడుఁ, దనచేతఁ గడక సాధ్యం బగుదాని
ననిలజుఁ బట్టినయంతకుండియును, దనరార లోపల దరికొన్న చిచ్చు
నాఁడు నేఁడును మండు నామణిప్రభల, బోఁడిమిగలుగు గోపురములదానిఁ
గడునొప్పు నారాముఘాతకుఁ జొనుప, మిడికెడు రావణుమృగముఁ బోనీక
విలయకాలుండను వేఁటకాఁ డర్థి, వెలివారు వారినవిధమునఁ జూడఁ
దనరారు పెద్దకొత్తడములతోడఁ, గనుఁగొన నొప్పు ప్రాకారంబుదాని
రావణుఁ బొరిగొన రాము రమ్మనుచుఁ, జేపిచుపడగలఁ జెలువైనదాని
మహనీయతోరణమంగళసూత్ర, మహిమతో [illegible]గముమునఁ
దళతళవెలుఁగు నద్దంబుల నొప్పి, చెలువారఁగాఁ దట్టు చేతులఁగలిగి
పగలును రేయును బాయక కూడి, మగలచే నొప్పు కొమ్మలుగలదాని
నెసఁగ నారాము నట్టెదిరికిఁ గాలుఁ, దసురేశుఁ [illegible] బట్టితేర
నొరపుగాఁ ద్రవ్విన యోదంబు లనఁగ, [illegible] నెలకొన్నదాని
కైలాస మమరారి క్రమ్మఱఁ బెఱికి, మేలైనపేర్మి నిర్మించినమాడ్కిఁ
దనరారి యల మిన్ను దాఁకి తెల్పునను, గనుపట్టు మేడలు గలిగినదానిఁ
ఘనలక్ష్మి నెదురుకోఁ గడఁగె రామునకు, నని చెప్పునట్టి తూర్యధ్వనిదానిఁ
జిలుకలపలుకుల చెలువు వహించి, యళులనాదంబుల నానందమంది
కలకంఠరవములఁ గడుఁ బ్రీతిఁ జేసి, పలికెడుశారికాస్వాగత మెఱసి
పల్లవఘనచయపల్లవం బగుచుఁ, బల్లవంబుల రాగభరితంబు లగుచుఁ
గడవోనిపూవులగంధంబువలన, నెడపక నందంద నింపులు చూపఁ
జెప్పఁ బెక్కగుచు నేచినయట్టితరుల, నొప్పెడివనముల నొప్పారుదానిఁ
గమల కెందును మనకకమలంబులైన, కమలాకరంబులఁ గర మొప్పుదాని
నటు చోద్యపడి చూచు నారాఘవునకు, బటుతరోద్యత్ప్రభాభాతి తా నొసఁగి
యాకాశమణి గ్రుంకె నపరాబ్ధిలోనఁ, గాకుత్స్థమణి నమస్కారంబు సేయ
నారాముఁడును సువేలాద్రియందుండి, యారాత్రి గడ తేర్చి యంత వ్రేగుటయుఁ
గపులు వినోదంబుగాఁ బెల్లురేఁగి, విపినంబులందెల్ల వెసఁ జొచ్చి చొచ్చి
యందలి శరభసింహాదులనెల్ల, నందందఁ దోలుచు నార్చుచుఁ దిరుగ
నట్టి కోలాహలం బంతయు లంక, ముట్టి రాక్షసుల నెమ్ములు పగిలింప
నది విని రావణుం డదియేమిరవము, పొదుఁడని వచ్చి గోపుర మెక్కి చూచె
నప్పుడు గోపురం బతనితోఁ గూడ, నొప్పెఁ జూపరులకు నుజ్జ్వలం బగుచు
ధవళాతపత్రము ల్దఱుచుగాఁ బట్టి, ధవళచామరములు దఱుచుగా వీవఁ
బొరిపొరి సురదంతి పోటుల నదురు, సురమునఁ బతకంబు లొనరుచుఁ గ్రాల
నాయతరత్నసింహాసనాసీనుఁ, డై యెంతయును బొలుపారె నయ్యెడను
నపరాచలముమీఁది యర్కునితోడి, యుపమకుఁ బాత్రుఁడై యుజ్జ్వలుం డగుచు
బహువిధరాక్షసపరివృతుం డగుచు, మహితాయుధప్రభామండలంబులను
మెఱుపులు గలనీలమేఘంబువోలెఁ, దఱచుగా మెఱసి మదంబులఁ గురియ

నెసఁగంగ నాదానవేశ్వరుం డప్పు, డసమానుఁడై యుండె నాగోపురమున
మహనీయరావణమహిమచేఁ జేసి, మహితవిద్యుత్ప్రభామండలంబైన
గోపురం బపుడు దృగ్గోచరంబైన, భూపాలతిలకుఁ డద్భుతమంది పలికె
రావిభీషణ గోపురంబున వచ్చి, యీవిధంబుననున్న యతఁ డెవ్వఁడొక్కొ
ప్రళయకాలమునాఁటి భానుబింబముల, వెలుఁగులపొదిపోలె వెలుఁగుచున్నాఁడు
అనుడు విభీషణుం డారాముతోడ, ననిరో నయ్యసుర మాయన్న రావణుఁడు
సురనాథసురలను స్రుక్కించువాఁడు, సురకామినులఁ జెరఁ జొనిపినవాఁడు
ముల్లోకములఁ దనమూర్తిచే హల్ల, కల్లోలమైపడఁ గావించినాఁడు
అనవుడు సుగ్రీవుఁ డారాముతోడ, ననిరో మీయెదుట నీయసుర గర్వించి

సుగ్రీవుడు రావణునితో మల్లయుద్ధము చేయుట

వైభవ మిటుచూపువాఁడె శ్రీరామ, యీభంగినుండ నే నెట్లోర్తు ననుచుఁ
గుటిలవర్తనుఁడును గ్రూరుండు నగుచు, నటు తలయెత్తిన యసురారిమీఁద
నకుటిలశౌర్యసంపన్నుఁడై యప్పుడు, ప్రగల్భవ్యగ్రుఁగసన్నుఁడై పేర్చి
మస్తకకోటీరమహితశృంగముల, విస్తరోరస్స్థలవిపులసానువుల
గురుకొని వాఁడొక్కకొండయై యున్న, బిరబిరఁ బడవచ్చుపిడుగుచందమున
వెస నగ్గలముగ సువేలాద్రినుండి, యసురేశ్వరునిమీఁది కర్కజుం డెగసి
దేవారిరావణుఁ దృణముగాఁ జూచి, రావణ వినుమేను రామునిబంట
మాకు నీవైభవమా చూపెదనుచు, వీకతో మకుటముల్ వెసడొల్ల వ్రేసె
వ్రేసిన మకుటములై వెలుఁగుచు రాల, భాసురకోటీరపఙ్క్తి యొప్పారెఁ
గాలరుద్రుఁడు మిన్ను గదగొని వేయ, రాలుతారాగ్రహరాజిచందమునఁ
జాలఁ గోపించి దశగ్రీవుఁ డంత, వాలితమ్ముని బట్టి వడిఁ బడవైచె
నంతటిలోన నయ్యర్కతనూజుఁ, డెంతయు రయమున నేచి పెల్లెగసి
యసురచేతులలోన నడఁగంగఁబట్టి, దెసలు గంపింపంగ ధృతిదూలవైచెఁ
గటములు నుదురులు కంధరంబులును, నిటలాటములు నేసి వీఁపెల్లఁ జీరి
కడకాళ్లు దొడలతోఁ గదియంగఁబట్టి, వడిగోపురంబులో వైచి నొప్పించి
సిటుపోరుచో వార లిద్దఱు గప్పి, పటుగతి నేలపైఁ బడగ వచ్చియును
నానేల మోపక యతిలాఘవమునఁ, బూనిక నెఱపి గోపురముమీఁదటను
బెనఁగిరి పెనఁగుచోఁ బృథులసత్త్వములఁ, గొనినవిన్నాణమెక్కుడుగఁ ద్రోయుచును
డాసి మోఁకాళ్లు ఘట్టనలు సేయుచును, బాసి క్రమ్మఱ ముష్టిబలము జూపుచును
బదముల గుండెలు పగులఁ దన్నుచును, గదిసి మోచేతు లంగముల మెత్తుచును
గరవలయంబులఁ గడఁగి యాదలలు, పోఁపోరి నెత్తురుల్ పొడమ వ్రేయుచును
దడఁబడఁ బెక్కువిధంబులఁ బెనఁగి, కడఁగి యప్పటితానకములు గైకొనుచు
నుబ్బునూర్పులతోడ నొకకొంతసేపు, ఉబ్బరింపక పట్టి యూరకుండుచును
నిమ్మెయిఁ బోరుచో నిద్దఱమేనఁ, గ్రమ్మెఁ బెల్లైగయు రక్తప్రపూరములు
కేసులు టేసులఁ జెలువైనగిరుల, బాగున నెంతయు భాసురులగుచు

నున్నచో రావణుం డురవడి మాయఁ, బన్ని తన్నపుడు చంపఁగఁ జూచుటయును
నెఱిఁగి యాకసమున కెగసి వేగమునఁ, గలుషరాక్షసులు వెక్కసమంది చూడఁ
గపులెల్లఁ మ్రొక్క నుత్కటసంభ్రమమునఁ, గపిరాజు వచ్చి రాఘవునకు మ్రొక్క
భక్తిమై రణరజఃపటలపక్ష్మళిక. రక్తపంకము నిజోరస్స్థలం బంటఁ
గపిరాజు రాముఁడు కౌఁగిటఁ జేర్చి, కృప దళుకొత్త వీక్షించుచుఁ బలికె
వాసవాంతకుని రావణునిఁ గైకొనక, నీసాహసము సేయ నిట నీకుఁ జెల్లె
నే వానిఁ జంపెద నీవిభీషణుని, నావీట నిలిపెద ననుబాసకొఱకు
వానిఁ జంపక నీవు వచ్చుట లెస్స, యేను మెచ్చితి నిన్ను నినసూతి నీవు
వాలితమ్ముఁడవు రావణుని నిర్జింపఁ, జాలవే తలఁపంగ సైరించుటెల్ల
నది కాకఁ బాలిడి యనని నాకీర్తి, వదలక చెల్లింప వచ్చితి వనుచు
దేవ యాద్రోహినిఁ దెఱఁగొప్పఁ జూచి, యేవిధంబునఁ గోప మేను సైరింతు
నని యర్కజుఁడు వల్క నతనిమాటలకు, మనమున హర్షించి మఱియు నిట్లనియె
స్ఫురితతారకము భాసురకృష్ణరక్తపరివేషమున నగు భానుమండలము
వలన మంటలు దెగి వ్రాలుచున్నవియు, జలదము ల్పెక్కు రాక్షసరూపములను
జెలఁగుచు నెత్తురు ల్చిలుకుచున్నవియు, కలయంగ నొకటి భూకంప మయ్యెడిని
మేటిగాడ్పులను భూమీధరకోటి, కూటము ల్ధరణిపైఁ గూలుచున్నవియు
బెగడక దినకరాభిముఖంబు లగుచు, నిగిడి వాపోయుచు నెఱి జంబుకములు
సారెకు నిట్లు రాక్షసకులప్రళయ,కారణోత్పాతము ల్గానంగఁబడియెఁ
దిరముగా నాంగిరాస్తికశుభప్రకర,పరసూచకంబు లీవలనఁ గన్పట్టె
మనకు జయం బనుమానంబు లేదు, ఒనఁగూడు నిఁకఁ దడయుటగా దటంచుఁ
గరువలిసుతునిపైఁ గర మొప్ప నెక్కి, వరపుణ్యనిధి జాంబవంతుఁ డంగదుఁడు
సౌమిత్రియును విభీషణుఁడును నలుఁడు, భీమవిక్రమకళాభేద్యులై కొలువ
నానగస్థలి డిగ్గి యతులవిక్రముఁడు, వానరసేనలు వడి తోడు చూప
దాను ముందర ధనుర్ధరుఁడునై నడిచెఁ, దోన యాలక్ష్మణాదులు చేరికొలువఁ
దక్షిణసేన లుద్దండవేగమునఁ, బెక్కుభంగుల దొక్కవెల్లుగాఁ దోఁచె
నడుమ నెంతయుఁ జేర్చి నలినాప్తకులుఁడు, కడుఘోరమైన రాక్షసకోటి చేతఁ
దనరిసలంక యుత్తరపువాకిటను, విన విస్మయంబుగా విడిసె రాఘవుఁడు

### శ్రీరాముఁడు వానరులచే లంక ముట్టడి వేయించుట

ద్వివిదమైందులతోడఁ దెగువ నీలుండు, నవిరళభుజశక్తి నమరులు పొగడఁ
బరువడి కపిసేన బలసి తన్గొలువ, వరమతి విడిసె పూర్వద్వారమునను
గజుఁడు గవాక్షుండు గవయుండు భూరి, భుజుఁ డైన ఋషభుండు పొంకంబుతోడ
దనతోడఁ గూడిరా దక్షిణద్వార,మున వాలి యవ్వాలిపుత్త్రుండు విడిసెఁ
బసతో సుషేణుని బవననందనుఁడు, వెసఁ గూర్చుకొని బాహువిక్రమం బొప్ప
వాఁడె పో యీలంక వడిఁ గాల్చినట్టి, వాఁడనఁ బడమటివాకిట విడిసె
మేటిగాఁ బెద్దనమ్మిన ముప్పదాఱు, కోటులకపినాయకులు తన్నుఁ గొల్వ

వినుతక వీరుఁడై విశదంబుగాఁగ, వెస రాముపదమట విడిసె నర్కజుఁడు
పసగలభల్లూకబలములు గొలువ, నసమానబలయుతుండై మహాబలుఁడు
అంబుధు లేడొక్కటైనచందమున, జాంబవంతుఁడు రామునన్నిధి విడిసె
మనుజేశుఁ డపుడు లక్ష్మణవిభీషణులఁ, గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింప
వనచరావలుల నవారితబలులఁ, బనుపుఁడు మఱియును బైదళంబుగను
నెక్కడ నేమియు నేయఱకుండ, నొక్కొక్కపద్మ మొక్కొక్కవాకిటను
ననుపుడు నలుఁడును హనుఁడు సంపాతి, యనువారు మనము శస్త్రాస్త్రసంపదలఁ
మిగిలి రాక్షసకోటిమీఁదఁ బెల్లుగను, దగిలి యక్కడనె యుద్ధంబు సేయుదము
అని పల్కె రాముఁ డయ్యగచరాధిపులఁ, గనుఁగొని యపు డొక్కకట్టడ సేసి
క్రందైనసందడి కయ్యంబునందు, నిందు నందును మన మెఱుఁగంగవలయు
కపిరూపములె కాని కామరూపములు, కపటరూపంబులు గాకుండఁ డనుచు
నిటు రామునానతి నెల్లవానరుల, నటు లంక చుట్టు నత్యంతవేగమున
నిశ్చలచిత్తులై నెలకొని పూర్వ, పశ్చిమోత్తరయామ్యభాగము ల్నిండి
పదియోజనంబుల పరపున విడిసి, పదిలులై యుండి రప్రతిమవిక్రములు
వికృతవాలంబులు వికృతాననములు, వికృతదంష్ట్రంబులు వికృతనఖాళి
యమరంగఁ దరుశైలహస్తులై పేర్చి, సమరంబు సేయంగ సన్నద్ధులైన
వారియదల్పులు వారియార్పులును, వారిహుంకారరవంబులు చెలఁగ
భీమమై లంకలోఁ జేర్చి యాదైత్య, భామినీజనులగర్భంబులు గలఁగె
నట్టి కోలాహలం బంతయుఁ జూచి, నెట్టన రాక్షసనికరంబు బెదరె
కమలాప్తకులుఁ డప్డు కల్యాణధాముఁ, డమితసత్త్వోన్నతుం డతిదయాశాలి
రావణుకొద్దికి రాయబారంబు, పోవను నెవ్వని బుత్తెంత మనుచుఁ
గపికులోత్తముఁడైన కంజాప్తసుతునిఁ, గపిరాజుఁ బంపుట కార్యంబుగాదు
బల్లిదుం డగుజాంబవంతుఁ బంపుటకు, నెల్లవిధంబుల నెఱుఁగఁడు వాఁడు
పరమవిక్రమశాలిఁ బవమానసుతుని, మరలను బంపుట మర్యాద గాదు
భుజవిక్రమంబున భూరివేగమున, భుజగవైరికి సరిపోలునంగదుని
నంపుట మేలని యతివేడ్క నెంచి, సంపద వెలయంగ సర్వజ్ఞుఁడైన
మనుజేశుఁ డంతట మంత్రులతోడి, యనుమతిఁ గైకొని యంగదుఁ బిల్చి
యరిగి రావణుతోడ నజుని చేఁ గన్న, వరగర్వమున మునివరుల దేవతల
నడఁచి బాధించినయటు గాదు నేఁడు, విడిసె నీపై రామవిభుఁ డని పల్కు
మేలావు నమ్మి నీ వెలనాఁగఁ దెచ్చి, కాలావు చూప రమ్మను మాజిలోన
సందీప్తరామాస్త్రచయఘట్టనలకుఁ, బందవై యొందును బాఱకు మనుము
అటు చాలవై తేని యవనిజఁ దెచ్చి, యిటనిచ్చి బ్రతుకుట యిదిబుద్ధి యనుము
పరఁగ లంకారాజ్యపట్టంబునకును, గరుణ విభీషణుఁ గట్టినాఁ డనుము
చంపెడు రాఘవేశ్వరుఁ డిదె నిన్నుఁ, జంపకమున్నె నీసకలబాంధవుల
జూడుము లంకయుఁ జూడు మేర్పడఁగఁ, జూడుము నీకూర్చుసుందరీజనుల

నీవు నీబంధువుల్ నిరవశేషముగఁ, జావంగఁగలవారు చచ్చిన మీఁదఁ
గార్యంబు నిష్ఫలకార్యంబు మనుట, కార్యంబు విను దశకంఠ నీవింక
ననుము పొమ్మని రాముఁ డానతిచ్చుటయు, మనమున హర్షించి మర్కటోత్తముఁడు
వినయంబుతో రామవిభునకు మ్రొక్కి, యనురాగమున నేగె నమ్మహాబలుఁడు

## అంగద రాయబారము

ఘనతరపర్వతాకారంబుతోడ, ననిమిషు ల్పొగడంగ నాలంకఁ జొచ్చెఁ
గడుదుష్టరాక్షసగహనముల్ గాల్ప, నడరెడువిలయకాలాగ్నియుఁ బోలె
నెగసి యాకసమున నింద్రారిఁ జంపఁ, దగిలినమృత్యుదూతయుఁ బోలె నపుడు
దశరథాత్మజునాజ్ఞఁ దలమోచికొనుచు, దశకంఠుముందటఁ దడయక నిలువఁ
గనుఁగొని యపుడు రాక్షసకోటియెల్ల, నినజుండు క్రమ్మఱ నేతెంచె ననుచు
నాయోధనోద్యుక్తులై సంభ్రమింప, నాయసురులనెల్ల హస్తముల్ సాచి
వలవ దోహోయని వారణ సేసి, పలికె నంగదునితోఁ బంక్తికంధరుఁడు
క్రొవ్వి వానరుఁడ యాకొలువులోపలికి, నెవ్వగ నొందక నేఁడు వచ్చితివి
ఎవరు నిన్ బంచినా రెవ్వండ వీవు, ఎవ్వనితనయుండ వేమి నీపేరు
నివ్వటిల్లెడులంక నీవిటు చొచ్చి, యెవ్వరిపనిఁబూని యేఁగుదెంచితివి
వనచర చెప్పరా వచ్చినకార్య, మని రావణుం డిట్టు లదలించి పలుక
విని క్రోధవివశుఁడై వికృతాస్యుఁ డగుచు, వనచరపతి యంత వాని కిట్లనియె
నీవెవ్వఁ డనిపల్క నెఱుఁగవే నన్ను, రావణ యేను నారామునిబంట
రాముఁ డెవ్వఁడు పరాక్రమమునఁ బరశు,రాముని గెలిచిన రణవిచక్షణుఁడు
అతఁ డెవ్వఁ డుద్ధతుం డై కార్తవీర్యు, నతివీరుఁ ద్రుంచిన యతులవిక్రముఁడు
అతఁ డెవ్వఁ డెఱుఁగవా యాజిలో నిన్ను, జితుఁ జేసికొనిపోయి చెఱనిడ్డవాఁడు
ఎవ్వనితనయుఁడో యెఱుఁగవా నన్ను, నివ్వటిల్లఁగఁబట్టి నినుఁ దోఁకఁ గట్టి
మొఱపెట్ట వార్ధుల ముంచి ముంచిచ్చి, కరుణించి విడువఁడే ఘనుఁడైనవాలి
యావాలి మఱచితే యకట యంతటనె, యేవాలి సుతుఁడౌట యెఱుఁగవా యోరి
యంగదుం డనువాఁడ నాహవవార్ధి, నంగద నిను ముంతు నాతండ్రివోలె
మాతండ్రి యెఱుఁగక మఱి నిన్నుఁబట్టి, యాతతంబుగ నీట నట ముంచెఁగాక
యనవుడుఁ గోపించి యసురేశుఁ డనియె, వనచరాధమ నీవు వచ్చినదూతఁ
జెనఁకి నిన్నిట శిక్ష సేయరా దనుచు, ఘనముగా బెడిదంపుఁ గాఱు లాడెదవు
వలనుగా నిటమున్ను వచ్చినదూత, యలరుచు హనుమంతుఁ డనువాఁడ ననుచు
వలకొప్ప నిటవచ్చి వైదేహితోడఁ, గలవి లేనివి కొన్ని కాఱులు వల్కి
యీచతురోక్తు లనేకంబులాడి, మాచేత దండన మఱి పొంది పోయె
నోరి యావానరుఁ డున్నాఁడో లేఁడో, వెరవారఁగా నాకు వివరించి చెప్పు
మనవుండు నంగదుం డసుర కిట్లనియె, ఘనులు రాముని సేనఁ గపులెల్లఁ గినిసి
బలితహుంకారోగ్రపటుశక్తి మెఱసి, చెలఁగి యాహనుమంతు చెంపలుగొట్టి
యనిరి రావణునితో నరమాటలాడి, పనివడి లంకకుఁ బనిపూని పోయి

యదరి యింద్రారిచే నాలంబులోన, వడిఁ బట్టువడి చిక్కి వనచర నీవు
తోఁకఁ గాల్పించుక తొలఁగి వచ్చితివి, వీఁకతో రాముని వీటిలోపలను
సకలకపికులములో నడితెచ్చి తనుచు, వెరవిడి తోలిన వీటికిం బాసి
యటఁ బంపకడకేగె నావానరుండు, ఇట రామునిసేనలో నిద్దఱి మమ్ము
నినజుండు వానరహీనులఁ జేర్చి, పనివడి యిటువంటి పనులు సేయించు
నని యంగదుఁడు వల్క నసురేశుఁ డంత, మనమున బెగడొంది మగ్నుఁడై యుండె
మలయుచుఁ జలము క్రమ్మఱ నసురాళిఁ గొలిచి, యలఘుఁడై యంగదుం డప్పుడు పలికె
నేర రావణ రాము నెఱుఁగుదుగాక, యీరీతి గర్వింప నేటికి నీకు
లోకవిక్రముఁడు త్రిలోకభీకరుఁడు, లోకశరణ్యుండు లోకైకనుతుఁడు
లోకరక్షకుఁడును లోకశిక్షకుఁడు, ప్రాకటచంద్రమోభానువీక్షణుఁడు
వేదాంతవేద్యుండు వేదగోచరుఁడు, నాదినారాయణుం డతిసత్యవాది
యసదృశుం డారాముఁ డభిరాముఁ డనఘుఁ, డసహాయశూరుఁడు నతులవిక్రముఁడు
ఆద్యంతరహితుండు నాచారపరుఁడు, నాద్యుండు పరుఁడును నగుదివ్యమూర్తి
దశరథరాముభూతలనాయకుండు, విశదోరుకీర్తి విదితశూరుండు
అదరి నీచెలియ లత్యాసక్తి డాసి, నడచిన నాశూర్పణఖముక్కు చెవులు
వడిఁ బట్టి కోసిన వాశిష్ఠశిష్యు, వడిగను నెత్తురుఁ దుడువఁగఁ గోసి వేసి
ఖరదూషణాంగరక్తంబులఁ గడిగి, కర మొప్పఁ జేసిన కాకుత్స్థతిలకు
నెఱుఁగవా రాముని నేటికిఁ బ్రేలె, దెఱఁగొదు కాకేమి యెందుఁ బోయెదవు
మూఁడులోకంబులు ముట్టిగర్వమున, మూడించు నిన్ను నమ్మరుజవల్లభుఁడు
దనిమెడి నుగ్రత దొలఁగక నిలిచి, యనిసేయు బంటవై యంతియ చాలు
లంక నీవింక నేలఁగ లేవు వినుము, లంకకుఁ బతి సుమ్ము లలి విభీషణుఁడు
తడయక నీమీఁద దయగల్గి యిప్పుడు, కడువేగమున నిట్టి క్రమమున మంచి
బుద్ధి నీకును జెప్పఁ బుత్తెంచె నన్నుఁ, వద్దురా రాక్షస వైదేహి నిమ్ము
మదిమదినుండి రామాధిపుజోడఁ, గదిసి కయ్యమునకుఁ గాలుద్రవ్వకుము
రాక్షసాధమ యోరి రామునిదేవి, నీక్షితి మొఱగి నీ విట్లు తేఁ దగునె
లోకపావనసీత లోకైకమాత, నీకుఁ దేఁ దగఁ గోరి నీచ రాక్షసుఁడ
నినుఁ జెప్ప దోషంబు నినుఁ జూడరాదు, ఘనతరమగు పాపకర్ముండ వీవు
లోకంబులకుఁ దల్లి లోలాక్షి సీత, నీకుఁ దల్లియ కాదె నిర్భాగ్య దనుజ
యవివేకమునఁ జేసి యపకీర్తిపడితి, వివి కీర్తులా నీకు నెఱుఁగ లేవైతి
వెడపక రఘురాముఁ దెగ్గనిసేసెఁ, గడుగర్వమున మీఁదుఁ గానంగలేక
యిహపరదూరుఁడ వీవేపుమీఱి, విపరీతమార్గం బింత వివరింపవైతి
వుడుగక రామాగ్ని యొడిఁ గట్టుకొంటి, పుడమిలో భస్మమై పోయెడికొఱకు
నీపాలివిధి పట్టి నీమెడఁ గట్టి, యీపాలు చేసె నిన్నీరసమెత్తి
నీవేమిసేయుదు నీప్రాంతఫలము, గావించి యజుఁ డిట్లు కట్టడ సేసె
కడఁగి రాఘవునంప కార్చిచ్చులోన, వడి శలభంబవై వ్రాలెద వెల్లి

చాల నొప్పినయట్టి శాశ్వత లంక, యేలుభాగ్యంబు లే దేమందు నిన్నుఁ
జెడకుము శరణని చేరు మా రాముఁ, బుడమిలో నీప్రాణములు గాచికొనుము
నీపుత్త్రమిత్త్రాదినిఖిలరాక్షసులు, నేపరి రాముచే నీల్గకమున్నె
కార్యంబు మునుపడఁ గైకొని బ్రతుకు, కార్య మొల్లక పోరు గావించితేని
చుట్టాల నింతుల సుతుల సోదరుల, నిట్టి యందఱఁ జూడు మిఁకఁ జూడలేవు
ఎలమి నీమోహంపుటింతులనెల్లఁ, గలయ భోగింపుము కాంక్షలు దీర
వెలయంగ నీరాజ్యవిభవంబులెల్లఁ, బలుదెఱంగుల నేఁడె పాటించి చూడు
హరిహర బ్రహ్మాదు లడ్డగించినను, దురములోపల నిన్నుఁ ద్రుంచు రాఘవుఁడు
ఇన్నియు నేటి కాయినకులేశ్వరుని, కున్నతమతి సీత నొప్పించి బ్రతుకు
మిటు రాము నానతి యెఱుఁగఁ జెప్పితిని, కుటిలరాక్షస యేమి గొబ్బునఁ జెప్పు

## రావణుఁ డంగదునితోఁ దనపరాక్రమము సెప్పుట

మన రోషచిత్తుఁడై యద్దశాననుఁడు, ననియె నంగదుతోడ నప్పుడు కినిసి
రాముఁ జెప్పెదు పరాక్రమశాలి నన్ను, రాముఁ డెఱుంగఁడా రణవిజయుఁడుగ
దివిజేంద్రుఁడాదిగా దేవసంఘముల, బవరంబులోపలఁ బఱపినవాఁడ
హరుఁడున్న కైలాస మగలించినాఁడ, నెరియంగఁ గాలుని నెదిరించినాఁడ
వరుసతో జగముల వర్ణింప నలరి, సరవి లోకములెల్ల సాధించినాఁడ
వనజాసనునిచేత వరముఁగొన్నాఁడ, మొనసి దివ్యాయుధంబులు గలవాఁడ
నిట్టిపిమ్మటను నే నీరాముమఱుఁగుఁ, బట్టిన దేవతల్ పకపక నగరె
యనుజుండు నాతోడ నలిగటు పోయి, జననాథుమఱుఁగు వంచనఁ జొచ్చెఁగాక
ఏనును జొచ్చిన హీనతగాదె, వానరాధమ నాకు వసుమతిలోన
మగపాడి దిగనాడి మానంబు విడిచి, పగవానిఁ గలయుట పంతమే నాకు
పగవాఁడు దండెత్తి పైవచ్చినంత, మగఁటిమి చెడి సంధి మఱి సేయునపుడె
జగతిరాజులు నన్ను సరకుసేయుదురె, తగదురా సంధి యిత్తఱి వానరుండ
యనిన దశాస్యుని కనియె నంగదుఁడు, ఘనపరాక్రముతోడి కయ్యంబు వలదు
దానవ రఘురాముతెర మెఱుంగకయు, పూనియున్నాఁడ విప్పుడు కావరమున
సురల గెల్చినమాడ్కి శూరు రాఘవుని, దురములో నెదిరించి తోడరుట యెట్లు
బలమేది రఘురామపార్థివు నెదిరి, బలుముష్టి విల్లెట్లు పట్టంగవచ్చు
నొరుల గెల్చినమాడ్కి నోర్చి రాఘవుని, శరవృష్టి ముందఱ జరియించు టెట్లు
కణఁకతో నీవెత్తగా లేనివిల్లుఁ, దృణలీల విఱువఁడే త్రిజగంబు లెఱుఁగ
వెఱవేది రఘురాము విక్రమస్ఫురణ, మెఱుఁగనియవివేకి వేమందు నిన్ను
జనకనందన నిచ్చి శరణన్న లెస్స, యని యంగదుఁడు పల్కనసురేశుఁ డనియె
నోరి వానరుఁడ నీవోడక యిపుడు, సారెకు రఘురాముశౌర్య మెన్నెదవు
ఆరామువిక్రమ మా రాముకడిమి, యా రాముభుజశక్తి యది యెంతపెద్ద
చలమునఁ దాటకఁ జంపె నంటేని, తలపోయ నాఁడుది దాని కెక్కెంత
జనకునివిలువిర్చి జనకతనూజ, ఘనతఁ జేగొన్నట్టి ఘనుఁ డంటివేని

నావిల్లు నేఁటిదే యది చెప్ప నేల, కావున నది వీరకర్మమే మఱియు
జమదగ్నిరాముని సమరమధ్యమునఁ, గ్రమమున గెలిచిన ఘనుఁ డంటివేని
యని బ్రాహ్మణుని గెల్చు టది బంటుతనమె, వినఁబోల దీమాట విక్రమస్ఫురణ
నలవున ఖరదూషణాదిరాక్షసులఁ, జలమున నొక్కఁడే చంపె నంటేని
నలర వారలు వృద్ధు లది చెప్పనేల, తలపోసి ద్రుంచిన ధరణీశ్వరుండు
తెగువ మారీచు మర్దించె నంటేని, మృగమాత్ర మగువాని మేరయే దొడ్డ
ఎఱఁగ వాలినిఁ గూల నేసె నంటేని, వసుధలోపలఁ గోఁతి వాఁ డెంతదొడ్డ
జవసత్త్వమున వార్ధి శరముఖంబునకుఁ, గవగొని తెచ్చిన ఘనుఁ డంటివేని
నావీరవరునకు నారాఘవునకు, నావార్ధిజలమాత్ర మది యేమి బలిమి
ఇవి బంటుతనములే యిారాఘవునకు, నివియెల్ల గెలుపులే యిల రాజులకును
బూని నాముందఱఁ బొడవులు చేసి, వానర రఘురాము వర్ణించె దీవు
అని దశాస్యుఁడు పల్క ననియె నంగదుఁడు, అనుపమోన్నతగుణోదయముని రాఘవుని
సకలలోకారాధ్యు జగదభిరాము, సకలజగత్స్థితచరిత్రు శ్రీరాము
నకలంకవిక్రము నతివీరవర్యు, నకట దూషింపంగ నర్హమే నీకుఁ
జెలఁగు నీరఘురాముశౌర్యంబునకును, ఖలులగు క్రవ్యాదగణములే సాటి
గొనకొని వాలిని గోఁతంటి వందు, కనెద నిస్తంచిన యంబుధుల్ సాటి
అలఘువిక్రమశాలి యైన రాఘవునిఁ, జెలఁగి దూషించిన జననాథు పెంపు
తప్పెనో నీకేమి ధన్యత వొడమె, నిప్పుడు రఘురాము నిట్లు దూషింప
నీరాజసంబును నీసుభోగంబు, నీసంపదయు నాయువు దొలఁగును సిరియుఁ
దనర శ్రీరాముని దలఁచినంతటనె, ఘనమైనపాపంబు గ్రక్కునఁ బాయు
రామపాదము సోఁక ఱాయింతి యయ్యె, రామ రామని బోయ రాశికి నెక్కె
రామనామస్తుతి రావణ నీకు, నేమిపాపముననో యెఱుఁగఁ జొప్పడదు
అట్టి శ్రీరాముని యసురేశ నీవు, నెట్టన దూషింప నీకేది గతియొ
అని యంగదుఁడు పల్క నసురేశుఁ డనియె, వనచర రఘురామువసుధేశశక్తి
యెఱుఁగుదు చెప్పంగా నేల యాస్వామి, పరమైనతారకబ్రహ్మం బనంగ
నాడవలయుమాట లాడితి కాక, పోడిమి రాముతోఁ బురణింపఁగలనె
చలపట్టి రాముతో సమరంబు సేయఁ, గలుగునో యని కోరి క్రాలుచున్నాఁడ
నిందునందును మెచ్చ నినవంశుతోడఁ, జెంది కయ్యము సేయ శివుఁ డెఱింగెడిని
అతనితోఁ బోరాడి యతనిచేఁ జచ్చి, ప్రతిలేనివైకుంఠపదవిఁ గైకొందు
నీలోకసౌఖ్యంబు లింతియు చాలు, నేల చెప్పంగ నే నెఱుఁగు దన్నియును
బలవంతుఁ డగు రాము ప్రాభవోన్నతులు, దెలియ చిత్తంబులో దివురుచున్నాఁడ
ననిచెప్పి దశకంఠుఁ డనియెఁ గ్రమ్మఱను, దనవివేకము చెడి తామసుం డగుచు
ధరణీతలం బెల్లఁ దమ్ముని చేతఁ, బరగఁగఁ గోల్పోయి పడఁతియుఁ దాను
ననుజుండు గూడంగ నడవులఁ బడుచుఁ, దనపతి నొకని చేఁ దాఁ గోలుపోయి
వచ్చి సుగ్రీవాదివానరవరులఁ, జొచ్చియా నటమీఁద శూరతఁ జూపఁ

జను దెంచె రాముఁడు సంగరస్థలిని, నను దాఁక నేర్చునే నరనాయకుండు
అటుగాన రఘురాముఁ డాలంబులోన, బటుతరశౌర్యసంపన్నుండు గాఁడు
మనుజులు కోఁతులు మగఁటిమిచేతఁ, దనయొద్దఁ జెప్పకు తరుచరాధముఁడ
వనచరాధమ యోరి వాలికి నీవు, తనయుండవై తేని దశరథాత్మజుని
గొలిచితి బంటవై. కొలయీఁగవైతి, చలమున నీతండ్రిఁ జంపినాఁడతఁడు
అట్టి రామునిఁ గొల్చి తధమవానరుఁడ, పుట్టి తింద్రజుగర్భమున వృథా నీవు
చంపినపగవానిఁ జంపక రాము, పంపుసేయుచు నిట్లు బంటవై తిరిగి
యెలమిఁ గొల్చెదవన్న నీరాజె కాని, తలపోయ రాజులు ధరణిపై లేరె
గొనకొని పగవానిఁ గొలిచినవాని, నినుఁగాని యెవ్వరి నెఱుఁగ మెన్నఁడును
నీమగఁటిమికిని నీదుపెంపునకు, సీమవారెల్లను సీయని నగరె
కొడుకై నపిమ్మటఁ గులవైరమెల్ల, వడితోడ నీగనివాఁ డెట్టికొడుకు
ఈగతి బంధువై హీనమానవుని, జేరి కొల్చుట యెట్లు చేవయు లేక
నినుఁ వాలికొడుకన్న నెటు నమ్మవచ్చు, వనచర యెవ్వరివాఁడవో కాక
విను బుద్ధిసెప్పెద వివరంబుగాఁగ, మనుజులఁ గొలుతురే మనుజులు నాకుఁ
బగవారు నీకును బగవారుగాక, నొగి దౌత్య మిటు సేయుచుండుట దక్కి-
నన్నుఁ గొల్చిన నిన్ను నంగద యిపుడు, వనచరులకునెల్ల వరప్రభుగాఁగ
ఘనభూషణంబుల ఘనవాహనముల, మనఁజేతు నిప్పుడు మహిమీఁద ననిన
దనుజాధిపతిఁ జూచి తారాసుతుండు, ఘనకోపమునఁ జాల గరిమ నిట్లనియె
నగణితోన్నతశక్తుఁ డైన రాఘవుఁడు, తగ నాదుతలిదండ్రి దాతదైవంబు
ఏమిగర్వము నీకు నెఱుకచొప్పడదు, భూమీశుతో రిపుల్పురణింపఁగలరె
యరయలే కవివేకులా రామవిభుని, నరుఁడంచు నెంతురు నక్తంచరేంద్ర
యతఁడు మానవమాత్రుఁడా యసురేశ, యతఁడు లోకారాధ్యుఁ డతఁ డప్రమేయుఁ
డతఁడు శ్రీవిష్ణుండు నతఁ డాదిమూర్తి, యితనికి సరిపోల్ప నెవ్వరు గలరు
సనకాదులును గూడి చర్చింపలేరు, వనజాసనాదులు వర్ణింపలేరు
దానవాంతకుఁడునై దశరథేంద్రునకుఁ, బూని జన్మించిన భూపాలుఁ డితఁడు
నితనికోపాగ్నికి నెవ్వఁడు నిల్చు, నితనితో డీకొని యెవ్వఁడు పోరు
నితనిబాణాహతి కెవ్వఁడు నోర్చు, నితని నెన్న వశంబె యింద్రాదులకును
నీవెఱుంగవు రామునిపుణవిక్రమము, కావరంబున నేల కాఱులాడెదవు
వరరాము నెఱిఁగెదు దురములో నెల్లి, కరమర్థి దురమునఁ గదలక నిలుము
కర్మపంకము లెల్లఁ గడ తేర్చి వాలి, నిర్మలాత్మకుఁడయ్యె నృపుచేతఁ జచ్చి
పదపడి వైకుంఠపదముఁ గైకొనియె, నిది కీడుగా మమ్ము నెన్న నేమిటికి
నితనిఁ గొల్చిన నాకు నిహపరోన్నతులు, నతులితంబుగఁ గల్గు నమరులు పొగడ
నీమదంబును లావు నీరాజసంబు, రామచంద్రునిఘోరరణరంగమందు
బోయెడు నెబ్భంగిఁ బోలువేది నీవు, వేయుఁ జెప్పఁగ నేల విధి నిన్నుఁ జుట్టి
కొనిపోవుచున్నది కుటిలరాక్షసుఁడ, మునుపటివరగర్వములు చెల్ల వింక

వడి శతమాయుండు వనచరేశ్వరుల, బెడిదంబుగా నొంచి పేర్చి పెల్లార్చె
వానిచే నటు నొచ్చి వానరాధిపులు, మానక రోషసమగ్రులై కదిసి
యదరి గవాక్షుండు హయములఁ జంపెఁ, గడిమి ఖండించె నంగదుఁడు పతాక
పఱియలుగాఁ ద్రొక్కెఁ బనసుండు రథము, నుఱుముగా ఋషభుండు నొంచె సారథిని
నలవొప్ప నలుఁడు శస్త్రాస్త్రముల్ విఱిచెఁ, జలమునఁ బిడికిట శతబలిఁ బొడిచెఁ
బిడికిటిపోటునఁ బిమ్మటఁ గొనక, కడుఁ ఘుత్కృతంబున గరుడుండువోలెఁ
బటుఖడ్గమును బెద్దపరిఘముఁ గొనుచుఁ, జటులవేగంబున శతమాయుఁ డెగయఁ
బరవశంబున వాలువడియున్న బ్రద్ద, పరిఘము గొని శతబలియుఁ దో నెగసె
నెగసి ఖేటుండంబు లెడరెండుఁ గవిసి, యొగిఁ బోరు తెఱఁగున నురవడి మిగుల
వ్రేయుచుఁ దిరుగుచు వెసఁ దప్పుకొనుచుఁ, బాయుచు డాయుచుఁ బాటవం బొప్ప
గెరలుచుఁ దెరలుచుఁ గ్రిందుమీఁదగుచుఁ, బోరిఁబోరి నాకసంబున బోరుతఱిని
శతమాయుఁ డడిదంబు జళిపించి పూన్చి, శతబలివిపులవక్షం బేయుటయును
సరభసుండై యప్పు శతబలి బ్రద్ద, పరిదప్ప నొడ్డి కృపాణాగ్రధారఁ
జలమునఁ దెగవ్రేసె శతమాయుతొడలు, తలక్రిందుగా వాఁడు ధరమీఁదఁ బడఁగ
నవిసె దైత్యునితల యందందఁ జెదరి, యవనిపై గిరిశృంగ మవియుచందమున
శతమాయుఁ డపుడు చచ్చినఁ దోడికపులు, శతబలితోడ నచ్చట నార్చుటయును
ధరణి మిన్నును గుణధ్వని బీటు లెగయ, నరద మత్యుగ్రరయంబునఁ బఱపి
యంగదు నపుడు మహానాదుఁ డార్చి, యంగదుమేన మూఁడమ్ములు గ్రుచ్చి

### మహానాదుఁ డంగదునితోఁ బోరి మడియుట

మఱియును వెసనేఁగు మర్కటేశ్వరుఁడు, వఱలుకోపంబున వానిపైఁ గిట్టి
యోజనాయతగిరి యొకటి రథంబుపై జవంబున వైవఁ బడకుండ వాఁడు
నడుమనే గదవైచె నగ మెల్లఁ బొడిగ, నడిఁ ద్రుంపఁ గోపించి వాలినందనుఁడు
అతనిరథంబున కవలీల దాఁటి, చటులసత్త్వోన్నతిఁ జాపంబు విఱిచి
పట్టి రథంబుపైఁ బడవైచి యొత్తు, మెట్టి గ్రుడ్డులు వడి నిలుక రోజఁగను
మెడ నుల్చి త్రెంచి క్రమ్మిన నెత్తురోలుకఁ, బుడమిపై వైచె నప్పుడు వానిశిరము
తమ్ముఁడు చావ నుద్దండకోపమున, నెమ్ములు నగులంగ నేచి యార్చుచును
మఱియును గనలుచు మహనీయరథము, మెఱయుచు నలుగడ మెఱుఁగులువాఱఁ
గదలించి యమ్మహాకాయుఁ డుద్వృత్తి, మదమున సింహంబు మలయుచందమున
గుదులు గ్రుచ్చినమాడ్కిఁ గ్రూరబాణముల, నెదిరి ధారణిఁ గూలనేసె వానరుల
వనచరవీరులు వానికిఁ గాక, హనుమదాదులు పోరునచటికిఁ జనిరి
సారథిఁ జూచి యీచక్కటి మనల, వారక మార్కొను వారలు లేరు
బోరన రాముపైఁ బోనిమ్ము రథము, నేఁడు పుహాటిల్ల నీవన్న వాఁడు
కడఁగి యుగ్యముల పగ్గములు వదల్చి, వడి నదల్పఁగను దీవ్రంబునఁ గదల
నాస్త్రరతకుఁ గాక నగచరుల్ పఱవ, నోకోఁతులార మీకులుక నేమిటికి
శివునిచాపముఁ ద్రుంచి సీతఁ జేకొన్న, యవనీశుపైఁ గాని యాజి నేనలుగఁ

బరశురాముని భంగపఱచినయట్టి, నరనాయకుఁడుగాని నాయీఁడుగాఁడు
ఆజిలో ఖరుని నుక్కడఁచినయట్టి, రాజుమీఁదనె కాని రాదు నాయమ్ము
ధృతినమ్ము తుదకబ్ధిఁ దెచ్చినయట్టి, పతితోడఁ గాని యే బవరంబు నేయఁ
ద్రిజగంబులందును దీపించునట్టి, రజతాద్రియెత్తిన రావణుసుతుఁడఁ
దుది నింక నింద్రజిత్తునికిఁ దమ్ముఁడను, నిదె మహాకాయుండ నేతెంచినాఁడ
నచుఁ జెప్పుచు రాగ నంబుదపటలమున నున్నసూర్యుండు మొనసినమాడ్కిఁ
గపిరాజతనయుఁ డంగదకుమారుండు, కపిసేనలోనుండి కడఁగి యేతెంచి
వెనుకొని కోపంబు వీఁకసిల్ల నపుడు, ఘనమైనకడిమితోఁ గలుషించి పలికె
నోరి మహాకాయ యుడుగక రజ్జు, లీరణస్థలమున నేల ప్రేలెదవు
మీతండ్రి గిరియెత్తి మెఱసె మాతండ్రి, మీతండ్రిఁ దోఁక నిమ్మెయిఁ గట్టి యెత్తె
నీకు నాకును దగు నిమ్మరణము, కాకుత్స్థనిధి యేల కపిముఖ్యు లేల
యని మ్రాఁకు గొని మీఁదనడరింప నతని, తనువు నిండగఁ గప్పె దారుణాస్త్రములఁ
గదిసి వెండియు మహాకాయుఁ డంగదుని, గదగొని వ్రేసె నుత్కటకోపుఁ డగుచు
వ్రేసిన నెంతయు వివశుఁడై పడియె, నాసమయంబున నతఁడు మూర్ఛిల్లి
కుతలంబు పగుల నెక్కొని దైత్యు లార్చి, రతఁడు మూర్ఛిల్లిన నగచరపతులు
కవిసి యందఱు మహాకాయుపైఁ గవిసి, శిలలు భూజంబులుఁ జెచ్చెఱ వైవ
నవియెల్లఁ దనదుబాణావలిచేత, నవలీలఁ దునిమి గవాక్షునిం బదిటఁ
బృథుని నైదిట నూటఁ బృథుసత్త్వగజునిఁ, బ్రథితంబుగా శతబలి ముప్పదింట
నెనుబదియమ్ముల ఋషభునిఁ గినుకఁ, బనసుని డెబ్బది పటుసాయకముల
మెఱసి క్రోధనుని నమ్మేఘపుష్పకుని, నఱువదింటను నూట నదరంట నేసె
నిటు వానరుల నతఁ డేపడఁగింప, నటు మూర్ఛనొందిన యంగదుం డపుడు
దెలిసిమోమునఁ గ్రమ్ముదెంచురక్తములఁ,బలుమఱుఁగరములఁబాయఁద్రోయుచును
నదరుచు నప్పు డయోమయంబైన, గదయెత్తికొని మహాకాయునిరథము
పయికి లంఘించి యుద్భటశక్తితోడ, జయశీలుఁడై వానిసారథిఁ జంపి
వెస విల్లుఁ బెల్లున విఱుగంగఁ గొట్టి, యసమున హయముల నన్నింటిఁ గూల్చి
తలవ్రేసె వ్రేసిన దైత్యపుంగవుని, తలబొమిడిక యూడి ధరణిపైఁ బడఁగ
నామహాకాయుండు నరదంబు డిగ్గి, భీమగదాదండభీషణుం డగుచు
నంగదునంగంబు నదరంట వ్రేసె, నంగదుండును వ్రేయ నతఁడు దర్పించి
యంగదుమస్తకం బలుకతో మఱియుఁ, బొంగి గదాదండమున వ్రేసి డాసె
నాఘాతమున నెత్తు రడరిన నైన, రాఘవుబంటు శౌర్యం బింత చెడక
గదఁ బుచ్చుకొని మహాకాయుని వ్రేసె, నుదురు భగ్నముఁగాఁగ నురుశక్తి మెఱసి
యెదిరిన తనతండ్రి యీతనితండ్రి, విదితంబుగాఁ బట్టి వేమాఱుఁ దొల్లి
మున్నీటిలోపల ముంచుటఁ దలఁచి, మున్నంటి పగకునై ముంచెనో యనఁగ
నసమేది దనుజుఁ డాయంగదుఁ బట్టి, వెసఁ బేర్చి నెత్తురువెల్లువ ముంచె
ముంచ రావణుఁ బట్టి మున్నబ్ధి వాలి, ముంచినగతి వాని ముంచె రక్తమున

నిటు మహాకాయుండు నింద్రుమన్నఁడును, పటుగతిఁ బోరుచోఁ బరఁగురక్తముల
జేగురుటేఱులఁ జెలువైనగిరుల, బాగున నెంతయు భాస్వరులైరి
గదయును గదయు నుగ్రంబుగాఁ దాఁకి, చిదురుప లగుటయుఁ జెచ్చెఱ వారు
బలుఁడును నిర్జరపతియును దొల్లి, గలిసి పెనంగినకైవడిఁ దోఁపఁ

మహాకాయుఁ డంగదునితో మల్లయుద్ధము సేసి మడియుట

బలుధూళి యిద్దఱిపదహతి నెగయఁ, దలపడి మల్లయుద్ధము సేయుచోటఁ
జతురతమై వనచరవీరుఁ డీతఁ, డితఁడు రాక్షసుఁ డని యెఱుఁగంగ రాక
కీలుబొమ్మలు పోరుక్రియలును దోఁప, వాలిసుగ్రీవులవడువునఁ బోర
నాడటఁ గపులెల్ల నంగదుఁ జూచి, యీదుష్టరాక్షసు నేల పాలార్చ
వాలినందనుఁడవు వాలికైవడిని, వఱలినవాఁడవు వరభుజశక్తి
వాలి దుందుభియును వడిఁ బోరుచోట, వాలి దుందుభి నింత వడి నిల్వనీఁడు
వేవేగ చంపు నిలింపకంటకుని, నీవిక్రమంబున నిపుణత మెఱసి
యని జయశబ్దంబు లడరింప నతఁడు, దనుజునితల ముష్టిఁ దాటించి బెట్టు
పిడికిటఁ దాఁచిన బెట్టుగా విఱిగి, పడియు నద్దైత్యుండు బలమఱి నేలఁ
బడియున్న రాక్షసపతిఱొమ్ముఁ ద్రొక్కి, మెడ నుల్చి తలఁ ద్రెంచి మీఁదికి వైచి
యంగదుం డార్చె నయ్యంగదుఁ జూచి, యంగద నార్చి రయ్యగచరాధిపులు
విచ్చి దానవులును వెస నేఁగి లంకఁ, జొచ్చియు వారిధిఁ జొచ్చియు నాల్గు
దెసలకు నుఱికియు దీనత నొంద, నసమున నుతియించి రంగదుఁ గపులు
నుతియించి సీతామనోనాథుకడకు, నతనిఁ దోడ్కొని చని యత్తెఱం గెల్ల
వినిపింప రఘుపతి విని సంతసమున, ఘనముగా నప్పాంగి కౌఁగిటఁ జేర్చి
కరుణాకటాక్ష మంగదుమీఁద నునిచి, సరసంపుమందహాసంబున నొప్పె
హతశేషులగు రాక్షసావలి చెప్ప, గతకడ్డ యమ్మహాకాయునిఁ దలఁచి
విన్ననై తల వంచి వెఱగంది కుంది, కన్నీరు నించి రాక్షసకులేశ్వరుఁడు
అంతఃపురంబున కరిగి యారాత్రి, చింతించుచును నిద్రఁ జెందకయుండి
మఱునాఁటిరేపు సామంతులు గొలువ, మెఱుఁగారు నరదంబుమీఁదికి వచ్చి
మరిగి పెంపారిన యాశ్వారి(?)నెక్కి, పగపైన తనకోటఁ బరికించి గాంచి
మాచి పాళెంబులు శోధించి మీఁద, నేచిన బలుగాపు లిడఁ బంచి యపుడు
ఆరావణుండు ప్రహస్తుతో ననియెఁ, జేరెక్కి యుండు నభేద్య మీకోట
యెట్టిశాత్రవులకు నెన్నఁడు డాయు, నట్టిదిగా దిప్పు డగచరప్రతతి
వచ్చి ఖేదించి దుర్వారమై యునికి, యచ్చెరువైనది యదియునుంగాక
శ్రీరాముభుజబలశ్రీ యెల్లచోట, నారూఢతరము ప్రహస్త కావునను
నీవొండె యటుఁగాక నేనొండె రణముఁ, గావింప నాకుంభకర్ణుండునొండె
తగువార మందు నిద్రాసక్తి తనకు, మిగిలి నాతమ్ముఁడు మేల్కొనం డయ్యెఁ
పోయెదవో యేను బోదునో యనుడు, నాయసురేంద్రున కతఁ డిట్టు లనియెఁ
పోయెద నిదె భుజబలంబెల్ల, నాయమరులు మెచ్చ నరులఁ ద్రుంచెదను

డాసి భూతప్రేతడాకినీగణము, లాసవంబున నెత్తు రాని మోదింప
నటుచూచు మాఱి ప్రహస్తుండు కపుల, నిటుసేయు నే యన నెంతఁ బేర్చెదను
పోరికిఁ జనుమన్న బుద్ధులు సెప్ప, నారయఁ బాడిగా దైనను వినుము
దనుజేశ యొకమాట తగదన కింక, విను వినకుండు వివేకించి చూడు
దానికిఁ గాదన దనుజేశ మున్ను, మానైన బుద్ధులు మంత్రులు సెప్ప
వినవైతి వికనైన విను సీత రామ,జననాథునకు నిమ్ము సమరంబు వలదు
అనుచు రావణునిఁ బ్రహస్తుండు వీడు,కొనివచ్చి తాఁ దనకోలలవారిఁ
బనిచి యప్పుడు నాల్గు బలములవారిఁ, దనుగూర్చుకొని మహోద్దండభావమున
ఘనమైన కపివరాంగంబులగాలి, తనమీఁద వీచునంతకు మ్రోయుచున్నఁ
గొఱురున జలదనిర్ఘోషంబుదాని, నమరంగవిహగేంద్రు లనఁగఁ బెల్లెగసి
తక్కక ద్రుంచు నంతకుఁ గ్రాలుచున్న, చక్కనియురగధ్వజస్ఫూర్తిదాని,
మణిగణకింకిణీ మహానీనాభూరి, రణనంబుఁ గలిగిన రథ మెక్కి డెక్కి
పెక్కుతూర్యముల గంభీరరావముల, దిక్కులు ఘూర్ణిల్ల దివియొద్దగిల్లఁ
జుక్కలు డుల్ల వసుంధరయెల్ల,వ్రక్కలువాఱఁ బూర్వద్వారమునను
గాలాంతకునిఁ బోలి కడగి యుబ్బొంగి, నాలంబుసేయఁ బ్రహస్తుండు వెడలె
నప్పు డాదైత్యులయార్పులు నతని, యొప్పారఁ బేర్చిన యుగ్రమూర్తియును
నక్కజం బగుటయు నావిభీషణుని, కక్కడఁ జూపి రామావనీశ్వరుఁడు
తేజంబు బలమును దీప్తిశౌర్యమును, రాజిల్లుచున్న యీరాక్షసవరుని
పేరేమి సాహసస్ఫీతుఁడై కపుల, పై రాకఁ జెప్పఁజూపఁగఁ జోద్యమయ్యె
ననుడు విభీషణుం డర్కవంశునకు, ననియె దేవా యితం డారావణునకు
గలిగిన సైన్యసంఘములకునెల్ల, దళవాయి యీతనిదళములలోన
మూఁడవపాలిటు మూఁడులోకముల, వాఁడి వీరుండు రావణుమాతులుండు
ఖండేందుధరుచెలికానిసామంతు, భండనంబున మాణిభద్రుని నోర్చెఁ
దపనకులేశ యీదైత్యునితోడఁ, గపినాథులకు లెస్స కయ్యంబు గలుగు
నని చెప్పుచుండఁగ నగచరులెల్ల, దనుజుల కెదురుగాఁ దరుగిరు లెత్తి
యార్పుచు వచ్చినయసురసైన్యముల, నార్చుచు మార్కొని యనిసేయునపుడు
ప్రళయకాలాగ్నికి బాడబాగ్నికిని, గలుషతఁ దలపోయఁ గలుగదు గాని
పోడిమిగా మిన్ను భువియు నొండొండ, నోడక తాఁకుటయును లేదుగాని
మొనసి యాబ్రహ్మాండములు దమలోన, ఘనముగాఁ దాఁకుట గలుగదుగాని

## ప్రహస్తుని యుద్ధము

గలిగిన నిబ్బంగిఁ గపిదైత్యనాథు, లులుకక పోరుట యుపమింపవచ్చుఁ
బావకనిభబాణపఙ్క్తుల దైత్యు, లావనచరులపై నార్చుచు వైవ
నందు వెండియుఁ గొంద ఱసి గదాప్రాస, సందీప్తముసలోగ్రచక్రములై వ్రేయఁ
దరుచరబలములు దరులును గిరులు, మరల దైత్యులమీఁద నురవడి వైవ
ధరమీఁద డొల్లెడితలలును వ్రయ్యు, నురములు నఱుమైన యూరుకంధరములు

దొరిగెడుప్రేవులఁ దునియువాలములు, మురిసినయమ్ములు ముంచురక్తములు
చెదరినమెదడు విచ్ఛిన్నంబు లయిన, పదములు మిట్టెడు బాహుదండములు
ముడిగి ముద్గలభంగి మురియుపీనుఁగులు, నడుములు దెగినయున్నతదేహములును
ద్రెళ్లెడి మేనులఁ దిరిగెడి గ్రుడ్లు, వెల్లుగా నెత్తురు భీకరం బగుచుఁ
దలఁకక సంగరస్థలమునఁ బోరి, కలగొనఁబడిన రాక్షసులును గపులుఁ
గలఁగి యంతటఁబోక కలుషించి మించి, చల మగ్గలించి యుత్సాహంబు బెంచి
బెడిదంబుగా దైత్యబృందంబుమీఁద, నడచి యార్చుచుఁ గపినాయకోత్తములు
ద్వివిదుండు వైచెఁ బృథ్వీధరశిఖర, మవిరళశక్తి నరాంతకుమీఁద
నకలంకుఁడై కుంభహనుఁ బడవైచె, నొకపటంబునఁ దారుఁ డుగ్రవేగమున
వడిఁ బెద్దగిరి జాంబవంతుఁ డుగ్రతను, నడరించి మించె మహానాభుమీఁద
భూరిభూజంబునఁ బొరిగోల నేసె, ఘోరంబుగా దుర్ముఖుఁడు సమున్నతిని
వానరనాథుల వాటులచేత, దానవు ల్నలుగురు ధరణిఁ ద్రెళ్లుటయుఁ
దనప్రధానులచావుఁ దప్పక చూచి, యనయంబు నలిగి ప్రహస్తుండు కపుల
నొకటఁ బదుండ్రను నొకట నేఁబండ్ర, నొకటఁ బదార్వుర నొకట నూర్వురను
రథచిత్రగతులొప్ప రయమునఁ ఱేచ్చి, పృథివిపైఁ గూల్చినఁ బేర్చి వానరులు
ద్రుమశైలములఁ బ్రహస్తునిసేన లెల్ల, జమరినగతి నుండఁ జంపిరి కడఁగి
యప్పుడు వెల్లువ లయి పాఱఁజొచ్చె, జొప్పట మిన్నంటి శోణితనదులు
అందులోపలనుండి యసురులుఁ గపులుఁ, నందంద యనిసేసి రార్చుచుఁ బేర్చి
యాయగ్గలికఁ జూచి యఖిలదేవతలు, వేయువిధంబుల వినుతించి రంత
నాప్రహస్తుండు కాలాంతకాకారుఁ, డై ప్రతిలేక సొంపారి యావేళఁ
గరములు పదములు ఖండించి వైచి, యురములు నుదురులు నుచ్చిపో నేసి
తలలును భుజములు ధరమీఁదఁ గూల్చి, తలఁగ నెమ్ములును దంతంబులు రాల్చి
మఱియలుగాఁ జక్రముల ద్రుంచి త్రుంచి, పోఁడిఁబోరి నంకుశంబులఁ జించి చించి
కడునుగ్రమగు పరిఘలఁ గొట్టి కొట్టి, మడివడ ఘనపాశములఁ గట్టి కట్టి
లలిమీఱఁ బరశువులను వ్రచ్చి వ్రచ్చి, పొలుపార బలుశూలములఁ గుచ్చి గ్రుచ్చి
మునుమిడి పట్టసంబులఁ జిమ్మి చిమ్మి, గొనకొన్న కడిమి శక్తులఁ గ్రుమ్మి క్రుమ్మి
పలలంబు మెదడుఁ గుప్పలు చేసి చేసి, పొలవక యంపరాసులు వోసి పోసి
పటుభూతకోటికి బలి యిచ్చి యిచ్చి, పటపట దిక్కులు పగుల నార్చుచును
నమరవిక్రమకళాసంరంభ మెసఁగ, నమితుఁడై మెఱసి ప్రహస్తుఁ డేపొందె
నాకపిసైన్యంబు లడఁగుటఁ జూచి, భూకంపముగ మహాద్భుతవృత్తి నడఁచెఁ
బెరిఁగి యుద్భటరణాభీలుఁ డన్నీలుఁ, డురుతరహుంకారహుంకారుఁ డగుచు
ధీరుఁడై యపుడు ధాత్రీజంబుఁ బెఱికి, యారాక్షసుని తేరి కవలీల దాఁటి
యఱిమి సారథి నొంచి హయములఁ గూల్చి, యాఁటక యవ్విల్లు మహోగ్రత విఱువ
ముసలంబు గొని యార్చి మొద మొప్ప నప్పు, డసమున రథము ప్రహస్తుండు డిగ్గి
నీలునిమూఁదట నిలిచె నెదిర్చి, నీలుండు నెదిరించె నిర్జితు ననుచు

నొండొరుగెల్చుసుదోర్వేగంబులందు, గండుమీఱిన వృత్రకౌశికు లనఁగ
నలుక నీలునిఫాల మడిచె వీక్షించి, లలిఁ బ్రహస్తుఁడు ముసలంబునఁ బగుల
నడఁచిన నందంద నడరు నెత్తురులు, దుడిచికొంచును బ్రహస్తుని బెట్టుగిట్టి
వ్రేసె నన్నీలుఁడు వృక్షంబుఁ ద్రిప్పి, వ్రేసిన ముసలాన వ్రేసె నయ్యసుర
వ్రేసిన సోలియు వృక్షంబు విడిచి, యాసమయంబున నందందఁ గదిసి
యార్చుచు నతఁడు ప్రహస్తుమస్తకముఁ, బెచ్చు వ్రయ్యఁగ వైచెఁ బెనుగిరియెత్తి
యానీలువ్రేటున నాప్రహస్తుండు, మేనును శిరమును మెయిభూషణములు
చెదరి వృత్రారిచేఁ జెలువెల్లఁ బొలిసి, కుదిరి ధారణిఁ గూలు కొండచందమునఁ
బడుటయు నాకపిబలమెల్ల నార్చెఁ, జెడి పాఱి లంకఁ జొచ్చిరి దైత్యు లపుడు
సురుచిరామృతవార్ధిసుతయునుబోలె, హరియుక్తమైన నిజాంగంబు గలిగి
చారువసంతమాసంబునుబోలెఁ, సారక్తఫుల్లపలాశాళి గలిగి
వరదానశీలు నివాసంబుఁబోలెఁ, గర మొప్ప నధికమార్గణకోటిఁ గలిగి
దీపించు నేరేశుదీవియపోలె, రూపింప నవఖండరూపంబుఁ గలిగి
వలచినపతియొద్ది వనితయుఁబోలె, సలలితరాగరసంబును గలిగి
కడిఁదియై చొరరాని కానయుఁబోలెఁ, గడునొప్పు పుండరీకంబులు గలిగి
సడలనిమృడునివాసంబునుబోలెఁ, గడఁగి యాడెడు భూతగణములు గలిగి
కమలాప్తరుచినొప్పు గగనంబపోలెఁ, గ్రమముఁ దప్పినతారకంబులు గలిగి
సరభసంబైన వేసవియునుబోలెఁ, సురుచిరాంబరమణిస్ఫురణంబుఁ గలిగి
కలిసినశివుఁడును గౌరియుఁబోలెఁ, దలపోయఁగా నర్ధతనువులు గలిగి
పెక్కుచందంబులఁ బెంపుసొంపడరి, యక్కజంబయ్యె రణావనిస్థలము
అంత నీలుఁడు రాఘవాధీశుకడకు, నెంతయు వెసఁ జని యెఱిఁగె నంఘ్రులకుఁ
బొగడొందఁ గపులెల్లఁ బొగడిరి నీలు, దెగనిరాక్షసులు భీతిలి పాఱి చెప్ప
విని రావణుఁడు శోకవివశుఁడై మంత్రి, జనులతో ననియెను జల మగ్గలించి
యేవీరు లరిగిన నిట రాక లేక, యావానరులచేత నకట మ్రగ్గిదరు
వైరులవలనిగర్వం బడంగింప, నేరూపముననైన నేనె పోయెదను
అని పేర్చి కనలుచో నామాటలెల్ల, వినియు మందోదరి వెస మాల్యవంతు
శరము చేపట్టి డగ్గఱి దైత్యవనిత, లిరుదెసఁ గొలువంగ నెంతయు వేడ్క
నతికాయుఁడును దోడ నరుగుదేరంగఁ, బ్రతిహారు లురువడి బలసి యేతేర
నాయుధహస్తు లంతంతటఁ గొలువఁ, బాయక చామరప్రతతులు వీవ
సకలభూషణమణిజాలంబు వెలుఁగ, సకలమంత్రులు తోడ చనుదెంచుచుండఁ
గడునొప్పు నీలమేఘముఁ జొచ్చుమెఱుపు,వడువునఁ జొచ్చె రావణసభాస్థలము
ఆసతి నప్పు డర్ధాసనాసీనఁ, జేసి రావణుఁడు విశేషప్రియోక్తి
నుచితపీఠంబున నుండంగఁ బనిచె, నచలితమతులగు నమ్మంత్రివరుల
మ్రొక్కినయతికాయుమోహంబుతోడఁ, దక్కక యునిచె నొద్దనె గద్దెమీఁద
నంత నక్కొలువెల్ల నలబలం బుడుగ, నింతితో నద్దానవేశ్వరుం డనియెఁ

గొలువులోపల కిట్లు కువలయనేత్ర, తలఁప నెన్నఁడు రానిదానవు నీవు
వడవడ వడఁకుచు వచ్చుటలెల్లఁ గడుచోద్యమైనది కారణం బేమి

మందోదరి రావణునితో శ్రీరాములపరాక్రము దెల్పుట

యనిన మందోదరి యాత్మేశుఁ జూచి, దనుజేశ నాకు రా దరవాయిగాన
వచ్చితి నేఁడు నావచ్చుటకెల్ల, నిచ్చలోపలఁ గడు నెగ్గు సేయకుము
అనిలోన ధూమ్రాక్షుఁ డాదిగాఁగలుగు,మనవారు దనుజేశ మడియుటకంటె
యల జనస్థానంబునందు రాక్షసుల, నలిఁ దునుమాడెఁ బదునాలుగు వేల
సరి ఖర త్రిశిరులఁ జంపినవాఁడు, నరుఁడు గాఁడంటి నానరనాథు రాముఁ
డలిగి వెండియు దండకారణ్యమందు, బలవంతుఁడైన కబంధు నిర్జించె
మారీచుఁ దునుమాడె మాయఁబోనీక, ఘోరాస్త్రమున వాలిఁ గూలంగ నేసె
దేవహితార్థమై తివిరి రాఘవుఁడు, భూవలయంబునఁ బుట్టినవాఁడు
ఆది నారాయణుం డతఁడు గాఁడేని, మేదిని నింతటి మిక్కిలి నరుఁడు
కలుగునే మఱి కఱకఁదునిచాప, మలవొప్ప విఱిచెఁ బ్రఖ్యాతంబుగాఁగఁ
దమతండ్రిపనుపునఁ దపసియై సత్య, సమయంబుతో వనస్థలినుండ నతని
సీతఁ దెచ్చితి వీవు శ్రీరామచంద్రుఁ, డేతెఱంగున నీకు నెగ్గేమి చేసె
రామలక్ష్మణులతో రణమొనరింప, నీమూఁడుజగముల నెవ్వరు గలరు
నలి సామభేదదానంబులు సూపఁ,గలిగిన దండంబు గాదు పాటింప
దండంబుఁ బాటింపఁ దలఁచెదవేని, దండింపఁబడుదురె దశరథాత్మజులు
దేవ రాముఁడు పరదేవత గాన, నీవు మ్రొక్కుటయొల్ల నింద గా దెందు
శరణన్నఁ జేకొను శరణన్న నీకు, నురుశుభం బగుఁగాని యొకకీడు రాదు
గుణరూపదాక్షిణ్యగుణగణకేళి, గణుతింప నలవిరా కాకుత్స్థరాముఁ
డలిగిన నిలువ రింద్రాదిదేవతలు, దలఁప వయ్యేదు నీకుఁ దరముగా దెందు
వలదు వృథాగర్వవహ్నిఁ గూలకుము, చలమొప్ప నొప్పదు సంతాప ముడుఁగ
నింకనైనను సీత నిచ్చుట మేలు, లంకేశ కులమును లంకయు నిలుపు
మహనీయవాహనమణిభూషణాది,సహితంబుగా నీవు జానకి నిచ్చి
యుపాక్షు నతికాయుం నొగి మాల్యవంతు, భూపాలుపాలికిఁ బుచ్చు సంధికిని
మతిమంతుఁ డగుచున్న మనవిభీషణుఁడు, హితబుద్ధిఁ గావించు నీసంధి మనకు
వేయునేటికి కార్తవీర్యుతో సంధి, సేయవే యతని గెల్చినభృగురాము
గెలిచిన రాముఁడు కీర్తిధాముండు, తలపోయ సంధికి దగఁడె చర్చింప
నని దైన్యపాటుతో నాడువాక్యములు, విని రావణుఁడు కడు వేఁడియూర్పడరఁ
గలయంగ నెఱ్ఱనికన్నులఁ గోప, మొలుకుచు నుండ మందోదరిఁ జూచి
హితమతివై నాకు నిన్నియుఁ జెప్పి, తతివ నీమాటలయం దొక్కటైన
మనసునఁ బట్టదు మగఁటిమి కలిమి, ఘనుఁడనై మూఁడులోకంబులు గెలిచి
దానవయక్షగంధర్వదేవాదు, లైనను వెట్టిసేయఁగ నున్న నన్నుఁ
దమిఁ బోయి యింకఁ గోఁతులమర్గనొచ్చి, బ్రతికెడినరునకుఁ బ్రణమిల్లు మనుచు

నిది యేమిమాటగా నీసభనాడి, తిది నీకుఁ బాడియె యిక్ష్వాకుకులుఁడు
ఎఱిఁగి యెఱింగి మున్నెగ్గొనరించె, మఱి కదా తెచ్చితి మనుజేశుదేవి
జడమతి నతనితో సంధి చేసినను, గడఁగి ఖరాదులఁ గడతేర్చినట్టి
పగయు నీమఱఁదలి బన్నంబునెట్టి, పగిది నీఁగఁగను జొప్పడు నటుగాన
భీమబాణముల విభీషణు నినజు, రామలక్ష్మణుల మర్కటులఁ ద్రుంచి
గెలుతు నవశ్యంబు గెలుపు లేదేని, చల మొప్ప దురమున సమయుదుఁగాని
మానవేశ్వరుతోడ మఱి సేయ సంధి, జానకి నీను నిశ్చయ మిట్టి దతివ
యాయింద్రజిత్తుం డుదాత్తవిక్రముఁడు, నీయగ్రసుతుఁ డుండ నీ కేల వెఱపు
నాకెదు రెవ్వరు నాతనూభవులు, భీకరాకారు లభేద్యవిక్రములు
అన విని చింతించి యవనత యగుచుఁ, జనియె మందోదరి సభ నెడఁబాసి
నీచైనయట్టి దుర్నీతి చేపట్టి, యేచందమునఁ దన్ను నెఱుఁగునే యనుచు
రమణీయతరమైన రావణులక్ష్మి, క్రమమేది చనియెడి కైవడిఁ దోఁప
నా రావణుండును నప్పుడు గడఁగి, వారక తనపగవాండ్రకు ననియె
చిరకాల మేను నాచిత్తంబులోన, దొరకొన్న యలుకకుఁ దుదిసేయువాఁడ
నాతనిపాలి కే నల్ల రుద్రుండ, నాతండు నాపాలి కంధకాసురుఁడు
మునుకొని తూణీరమున వెలువడుచుఁ, దనరారు నాయంపతండంబుఁ జూడు
కుబుసంబు లూడ్చినక్రూరసర్పముల, నుపమింప ననువులై యొడియు రాఘవునిఁ
గాలంబు ప్రేరేపఁ గపిసేన నమ్మి, వ్రాలుగర్వంబున వచ్చియున్నాఁడు
ఉరుదివ్యశస్త్రాస్త్రయుక్తంబుగాఁగ, నరదంబు దెండు కయ్యంబున కనుడు
వారు నర్కప్రభావరరథం బప్డు, దారూఢగతిఁ బన్ని యర్థిఁ దెచ్చుటయుఁ

### రావణుఁడు యుద్ధమునకు వెడలుట

దొలఁగక తనదైన దుర్మనోరథము, నెలమి నెక్కినక్రియ నెక్కి రావణుఁడు
దిక్కులమింటను దీప్తిజాలంబు, లక్కజంబై యొప్ప నరదంబుమీఁద
మెఱసినతొడవుల మిఱుట్లుగొనుచుఁ, దెఱఁగొప్ప నప్డు దద్దేవారి యొప్పె
నా రామబాణానలార్చులచేత, నారథంబును దాను నలిఁ గూలుకరణి
బటుతరనిస్సాణభాంకారములును, బటహభేరీశంఖభయదరావములు
హాస్తిబృంహితములు నశ్వఘోషములు, ప్రస్తుతిపాఠకప్రకరరావములు
నరదాలమ్రోఁతయు నార్పులరవము, ధరణి గల్గెడు పదతాడనధ్వనులు
నదరి యొండొండ బ్రహ్మాండంబు నిండి, కడుభీకరంబులై కలయంగఁ బర్వె
లలిసముద్రమునకు నలుగుచందమున, నలిగె సిందును రాఘవాధీశుఁ డనఁగ
మునుకొని లంకాసముద్రంబులోన, నను వేది జీవంబు లఱచు చందమునఁ
గొనివచ్చితిమి దైత్యకోటి శ్రీరామ, కొను మని యొప్పింపఁ గొంపోవుకరణి
భీమరథంబులు పేర్చి యందంద, రామచంద్రుని మనోరథములై నడిచె
రాముశిలీముఖరాజి మై. నాటి, యీమదం బుడిపెడి నింతలోపలనె
త్రాగుద మిమ్మదధారలన్నాడ్కి, మూఁగియాడెడి శిలీముఖములతోడఁ

గరములు కడు భయంకరములై రాము, కరముల కెందు దుష్కరములు గాక
కరమొప్పఁగా సముత్కరములై యపుడు, కరికోట్లు వసుమతిఁ గంపింప నడిచె
వలనెల్లఁ దప్పె రావణుఁ డను రణము,వలన జయంబు మావలన నెక్కడిది
వలనేది కూలు రావణుఁ డనుమాడ్కి, వలనొప్ప హయములు వ్రాలుచు నడిచె
వ్రాలిన రాఘవేశ్వరుని బాణాగ్నిఁ, గ్రాలుబలం బెల్లఁ గాలుబలంబు
అనిన చందంబున నార్చుచు నడిచె, ఘనతరం బైనట్టి కాలుబలంబు
కాలమేఘంబులకరణి నొప్పుగుచు, శైలంబులో యనఁ జతురత మెఱసి
ప్రళయకాలమునాఁటి భానుబింబముల, కోలఁ బిమిాఱిన మిడిగ్రుడ్లతోడఁ
గటములు నుదురులు ఘనదంష్ట్రములును,బటుకేశచయము నొప్పఁగఁ జూడ నపుడు
ప్రళయకాలునికైన భయముఁ బుట్టించు, చలమును వికృతవేషములును మెఱయఁ
బెక్కాయుధంబులుఁ బెక్కుమాయలును, బెక్కుతేజంబుల పెక్కువ గలిగి
యేమేమె రాము జయించెద మాఁటి, నేమేమె యని యస మెక్కినవారు
రాక్షసవీరులు రాక్షసాధిపులు, రాక్షసేశ్వరునితో రణబాస లిచ్చి
పరఁగంగ నార్చుచుఁ బటునినాదములు, సురవడి మ్రోయుచు సురబలోన్నతిని
నడుపంగ నప్పు డున్నతశక్తి మెఱసి, నడనడ వడఁకి వానరులెల్లఁ గలఁగ
నినవంశునకుఁ ద్రోవ యిచ్చుట కలిగి, వననిధి నింకింప వడి నేఁగుకరణి
నినుఁడ నీతనయుండు నీరాముఁ గూడె, నని యర్కుఁ గబళింప నరిగెడుమాడ్కిఁ
దనయురవడి సముద్రంబులు గలఁగఁ, దనప్రతాపంబునఁ దపనుండు మాయఁ
దెగువయెల్లను ముఖదీప్తులఁ దోఁప, మగఁటిమి జయలక్ష్మి మఱిపొందుఁ బాయ
నారవంబునఁ దాను నాజికి వెడలె, నా రావణుం డట్టహాసంబు చెలఁగఁ
బెక్కాయుధంబులఁ జేప్పుదీధితులు, మిక్కిలి కన్నులు మిఱుమిట్లు గొలువ
పంబి వాయువులచేఁ బడగలు టెక్కె,యంబులు మిన్నంది యందందఁ గ్రాల
ఘనతరభీషణాకారంబుతోడ, ననయంబు నందంద నార్చుచు రాము
బాణానలంబునఁ బొల్పడనున్న, ప్రాణంబులను దృణప్రాయంబు చేసి
వారణ లేకటు వచ్చుచునున్న, దారుణాసురసీమఁ దప్పక చూచి
రావణానుజుతోడ రఘురాముఁ డనియె, నీవచ్చుచున్నవాఁ డెవ్వఁడో వీఁడు
మిక్కిలి సత్త్వసమేతుఁడై కడిమి, పెక్కువ లింతయుఁ జేప్పినవాఁడు
అనిన విభీషణుం డారాముఁ జూచి, దనుజనాయకుల నందరి వేఱువేఱ
వినుము శ్రీరఘురామ విన్నవించెదను, దనరంగ నని వారిఁ దగఁజెప్పఁదొడఁగె
వాఁడె సింధురగంధవారణేంద్రంబు, వాఁడిమి నెక్కి యుజ్జ్వలుఁ డైనవాఁడు
ఉదయార్కబింబసముజ్జ్వలాస్యమున, నొదవిన ఘనరోష మొప్పినవాఁడు
పోరిఁబోరి నంకుశంబున నియమించి, కరి యని సేయింపఁ గడఁగెడువాఁడు
ఉరవడిఁ జను దెంచుచున్నట్టి వీరుఁ, డురుబలాఢ్యునిగంటె యూపాత్ముఁ డతఁడు
కడునొప్పు భీకరఘంటారవంబు, లడరినరథ మెక్కి యావచ్చువాఁడు
పోరులఁ బెక్కింద్రుఁ బోరిగొన్నవాఁడు, ధారుణీశ్వర మహోదరుఁ డనువాఁడు

భరితరత్నప్రభాపటలంబుతోడఁ, బరువైనయరుణంపుఁ బక్కెరవెట్టి
గరుడవేగంబున ఘనమైనయట్టి, తురగంబు నెక్కి యుద్ధురవృత్తితోడఁ
జను దెంచువాఁడు పిశాచనాథుండు, ననికి నీతని కెదు రగువారు లేరు
మిక్కిలి కడిమిమై మెఱసి సింహంబు, నెక్కి శూలముఁబట్టి యేతెంచువాఁడు
అనిమీఁది వేడుక నలరినవాఁడు, దినకరకులనాథ త్రిశిరుఁ డన్వాఁడు
పృథులఘంటారావస్ఫీత మైనట్టి, రథమెక్కి వడి గుణారవము సేయుచును
ఘనసర్పకేతువు గలిగినవాఁడు, ఘననీలతనుఁడు రాక్షసుఁడు కుంభుండు
కనకమహామణిఖచితంపుఁ బడగఁ, దనరారు చిత్రరథంబుపై నెక్కి
యరుగుదెంచుచు నున్న యారాక్షసుండు, గురుశక్తియుతుఁడు నికుంభుఁడు దేవ
యనలసన్నిభమైన యరదంబు నెక్కి, ఘనగర్వమున మీఁటి కయ్యంబు సేయఁ
గలవాఁడు వాఁడె యీకపిసేనదిక్కు, సొలవక విషదృష్టిఁ జూచుచున్నాఁడు
శర మటువింటితో సంధించుకొనుచు, నరుదెంచువాఁడు నరాంతకుం డధిప
భీషణరూపమై పేర్చువాక్యముల, రోష మెక్కుడి మిడిగ్రుడ్లతోడఁ
గరివక్త్రములఘోటకపువక్త్రములను, హరివక్త్రములఁ గిటివ్యాఘ్రవక్త్రముల
నురగవక్త్రముల నుష్ట్రవక్త్రములఁ, గరముగ్రులైనరాక్షసు లుత్సహించి
కొలువ భూతంబులు గొలువ ఫాలాక్షు, నలవొప్పువాఁడు దేవాంతకుం డధిప
ఘనమైన ఘోషంబు గలపైఁడిరథము, దనరార నెక్కి యుద్దండభావమున
నతితృణీకృతలోకుఁ డై గుణారావ, మతిశయిల్లఁగఁ బుట్టినంతనుండియును
నెన్నఁడు నోటమి యెఱుఁగని వీరుఁ, డన్నరభోజను నాత్మసంభవుఁడు
అరుణచందనము మేనలఁదినవాఁడు, తిరమైన యరుణంపుదృష్టులవాఁడు
సంధ్యాంబుదమువంటిచాయలవాఁడు, వింధ్యాచలమువోలె వెలసినవాఁడు
కోటానకోటుల గొడుగులచేత, మేటిచామరముల మెఱసినవాఁడు
అవధరింపుము దేవ యతికాయుఁ డతఁడు, అవనీశ యాజిలో నధికశూరుండు
భూరిసితచ్ఛత్రములు పదివేలు, చారుచామీకరచామరావళులు
పరఁగంగ సింగంపుఁబడగతోఁ గ్రాలు, పరమైనఘోటకప్రతతుల నొప్పు
నరదంబుమీఁది గుణారవం బెసఁగ, భరితశస్త్రాస్త్రసంపదఁ దేజరిల్లి
యజునివరంబున నఖిలదేవతల, భుజబలస్ఫీతుఁడై పోరిలో నేచి
సురపతి పురిఁబట్టి సొంపారునట్టి, వరగర్వమునఁ జాల వ్రాలినవాఁడు
నిచ్చట మనమీఁద నిడిన చూపడర, వచ్చుచు నున్నాఁడు వాఁ డింద్రజిత్తు
ఇంకఁ జూపెదఁ జూడు మినకులాధీశ, లంకాధినాథు నుల్లసితప్రతాపుఁ
గనకరత్నప్రభాకలితతండములు, నొనరినచామరంబులు నుల్లసిల్ల
సొలవక పండ్రెండుసూర్యబింబములు, గలయంగ దశకంబుగాఁ గరఁగించి
చేసినపగిది విచిత్రరత్నాంశు, భాసురకోటీరపఙ్క్తి నొప్పారి
మహనీయతరమైన మణికుండలమున, మహిమ దిక్కులనెల్ల మట్టాడుచుండ
రోషమహాదృష్టిరోచులఁ జాల, భీషణాకారతఁ బేర్చినవాఁడు

హారఁ దున్న కైలాస మగలించినాఁడు, సురకామినులఁ జేరఁ జొనిపినవాఁడు
లోకంబు లెల్లఁ బెల్లుగఁ గెల్చినాఁడు, పాకశాసను ననిఁ బఱపినవాఁడు
ఐరావతముదంత మాడినయురము, తో రమణీయమై తోఁచినవాఁడు
ముల్లోకములఁ దనమూర్తిచే వాల్ల,కల్లోలమై పడఁ గలఁచినవాఁడు
వాఁడు సేనామధ్యవర్తియైనాఁడు, వాఁడుపో దేవ రావణుఁ డనువాఁడు
అని విభీషణుఁ డోలి నందఱఁ జెప్ప, విని రాఘవుఁడు కడు విస్మయంబంది
హరిహరి చిత్ర మీరాయసురేశ్వరుండు, సరిలేనియట్టి తేజంబె రూపైన
యట్టిచందంబువాఁ డసురులయందు, నిట్టి తేజోధనుం డెవ్వఁడు గలఁడు
కడుఁ గ్రూరకర్ముండు గాకుండెనేనిఁ, బుడమి కింతటికినిఁ బూజ్యుండు గాఁడె
పరికింప నిందఱు పర్వతాకృతులు, సురశక్తిగలిగిన యోధులు క్రూర
చరితులు మఱి వీరినైనికులెల్లఁ, గరము భీషణులు రాక్షసవీరు లనుచు
నుగ్రలోచనుపినాకోగ్రచాపంబు, నిగ్రహక్రమకళానిపుణుఁడై నృపుడు
ధరియించి కడఁకతోఁ దాను లక్ష్మణుఁడు, వరబాణచయమ్ములు వరుస నుప్పొంగఁ
గోపించియును ధర్మగుణముఁ జేపట్టి, రిపార్థివులకు నీఁ డెవ్వరు నాఁగ
నారావణుండును నఖిలనిశాట,వీరుల వీక్షించి వినుఁడని పల్కె
నగరివాకిళ్ళ నున్నతితోడఁ బెద్ద, మొగసాలలందును మోసంబులేక
కడు సురక్షితముగాఁ గావలియుండుఁ, డడరి యీలంకలో నందఱుఁ బ్రీతి
నేనును మీరును నీకయ్యమునకు, మానుగాఁ బోయిన మఱి వలీముఖులు
లంకలోఁ జొచ్చిన లా వేమి సేయు, శంకింప వలవదు చనుఁ డన్న వారు
చనిరి రావణుఁడును జటులవేగమున, ధనువును నస్త్రముల్ ధరియించి పేర్చి
కార్చిచ్చు వనము నుగ్రంబుగాఁ గిట్టి, యేర్చుకైవడిఁ దోఁప నిమ్ములఁ గిట్టి
జగతీతలము నాకసముఁ దాఁకుకరణి, నగచరసైన్యంబు నదరంటఁ దాఁకి
యిది ధరణీభాగ మిది వియత్తలము, ఇది దిశావలి యని యేర్పడకుండ
నతినిశితాస్త్రంబు లందందఁ బఱపి, యతులబలోదగ్రుఁడై దశాననుఁడు
కలఁచి కొందలమందఁగాఁజేసి కపులఁ, జులుకఁగా ఖండించి చూర్ణంబుచేసి
నెమ్ములు మజ్జంబు నెరసియు మెదడు, గ్రమ్మి నెత్తురు నేలఁ గలయంగ నించి
తనరి యార్చుచు గుణధ్వని దిక్కులందు, నించి ఘోరాజిలో నెఱయఁ బేర్చుటయుఁ
బడియెడువానరుల్ భ్రమయు వానరులు, మడియువానరులును మ్రగ్గువానరులు
నొరలు వానరులును నులుకు వానరులు, నరచు వానరులు రూపఱిన వానరులు
గలిగినసంగరాంగణభూమిఁ జూచి, తలఁకిరి సురలు చిత్తంబులు బెదరఁ
గాలకాలానలకాలదుర్వార,కేళికరాళుఁ డక్షీణుఁడై యపుడు
పేర్చుకోపంబున భీషణుం డగుచు, నార్చుచు నున్న దశాననుఁ జూచి
యతనికి నెదురుగా నరిగి సుగ్రీవుఁ, డతిరయంబున నొక్కయగ మెత్తి వైచె
నారావణుండును నది మధ్యమునను, భూరిశరంబులఁ బొడిసేసి మఱియు
నొండొండ ఘనదీప్తు లొదవ నాకసము, నిండి మండుచు నుండ నిశితాస్త్ర మినజు

సురమూడనేసిన నుచ్చి యామ్మ్ము, ధరఁ గాడె నత్తఱి దానవు లార్వఁ
దరుచరులెల్ల నుద్ధతి బాష్పధార, లురులింప నర్కజుఁ డొరలుచుఁ గూలె
భుజబలాఢ్యుఁడు శరభుఁడు ఋషభుండు, గజుఁడు గవాక్షుండు గవయుండునలుఁడు
జ్యోతిర్ముఖుం డది చూచి కోపమున, నాతతగతిఁ బర్వతావనీజముల
నడరించి రతనిపై నవియెల్ల నతఁడు, నడుమనే తునిమి వానరుల నేడ్వురను
నొక్కొక్కయమ్ముల నుర్వరమీఁద, గ్రక్కునఁ జచ్చినగతి నుండనేసె
నాలోన హనుమంతుఁ డాయోధపతులు, గూలుటయును జూచి కోపంబుతోడ
నసురాధినాథునియరదంబుమీఁది, కసమున లంఘించి యతనితో ననియె
దేవేంద్రుఁ డాదిగా దివిజులనెల్ల, రావణ మఱి యక్ష రాక్షసకోటిఁ
ద్రుళ్లడంచితి నని త్రుళ్ళెద వీవు, చెల్లదు రోరి నీ చేవడఁగింతు
నున్నతిఁ జిరకాల ముర్విపై బ్రతికి, యున్న నీమీఁద నాయున్నతంబైన
వలకేలు నేఁడు రావణ యిదె చూడు, మలమి సాగెదు దనయంతన పేర్చి
యిదె నిన్ను బోరఁగొని యేచి యంతకుని, సదనంబు కనుపక సైఁపను నిజము
అనిపేర్చి పలికిన హనుమంతుమాట, విని రావణుఁడు క్రోధవికృతాస్యుఁ డగుచు
గలితనంబును లావు గలదేని నీవు, నలువొప్ప నుప్పొంగి నను మున్ను పొడిచి
పేరుగొ మ్మిటమీఁదఁ బేర్చిన నీదు, శూరతయును లావుఁ జూచి యేనేచి
పొడిచెద ననుడు నద్భుతశౌర్యుఁ డగుచుఁ, గడఁగి మారుతి దశకంఠునిఁ జూచి
దేవదేవుఁడు రామదేవుండు పనుప, నీవీటిలో మేదినీపుత్త్రి వెదకి
తడయక పొడగాంచి తగ విన్నవించి, వెడలి యేఁ బోవుచో విక్రమస్ఫురణ
నీతోఁట నుగ్గాడి నీలంకఁ గాల్చి, నీతనూభవుఁ జంపి నిన్ను దట్టించి
యక్కన నిలిచి దైత్యులు చూచుచుండఁ, జక్క నెప్పటిత్రోవఁ జన్న నాలావు
నేఁడు చూచెద నని నీవాఁడె దుబ్బి, నాఁ డెందుఁ బోతివి నాకారి నీవు
అనవుడు కోపించి హనుమంతువక్ష, మనువొప్పఁ బొడిచె నయ్యసురేశ్వరుండు
పొడిచిన స్రుక్కియుఁ బోనీక యతఁడు, పిడికిట రావణుఁ బెట్టుగాఁ బొడిచెఁ
పెనుగాలి యడఁచిన బిట్టు కంపించు, ఘనవృక్షమును బోలి కంపించె నసుర
యంతట నొచ్చిన యసురేశుఁ జూచి, యెంతయు నార్చి రయ్యింద్రాదు లెల్ల
దనుజాధిపతియు నంతనె మూర్ఛ దెలిసి, హనుమంతుఁ జూచి యిట్లను నీబలంబు
గడు మెచ్చవచ్చు నీఘనముష్టిహతిని, గడఁకతోఁ బ్రేతలోకముఁ జూచివచ్చె
దేవారి యనుడు నద్ధీరాత్ముఁ డనియె, రావణ విను మీవు ప్రాణంబుతోడ
నున్నవాఁడ విదేల యిఱక నాలావు, సన్నుతించెదు లజ్జ జనియింప నాకు
నని పల్కి నీవు నన్నటు పిడికిటను, గొను మొనపోటన్నఁ గొను మని యతఁడు
ననయంబు కోపించి యనిలనందనుని, ననుపమాశనికల్ప మగుముష్టినార్చి
వక్షంబుఁ బొడిచిన వడి మూర్ఛనొంది, యక్షణంబునఁ ద్రెళ్ళె నవనిపై నతఁడు
నరిమురి హనుమంతుఁ డటు కూలుటయును, నెరసి రావణుఁ డంత నీలుపైఁ జనియె
హనుమంతుఁడును మూర్ఛ యంతలోఁ దెలిసి.

యెటుఁ బోయె దని పిల్చి యెదురుగా నిలిచె, నటు తన్నుఁ గిట్టి పెల్లార్చుచు నున్న
మనుజాశనునిమీఁద మలయశృంగంబు, గొనివచ్చి నీలుండు కోపించి వైవ
నడుమనె దునుమాడె నాశారి దాని, నెడపని కడఁకతో నేశమ్ము లేసి
వెండియు నీలుండు విపులకోపమునఁ, గొండలు దరువులు గొని వైచుటయును
వాని నన్నింటి రావణుఁడు చూర్ణములుగా, నిశితాస్త్రసంఘంబులఁ దునిమి
నీలునిమేనఁ గ్రొన్నెత్తురు లొలుక, వాలికయమ్ములు వడిఁ బెక్కు లేసె
నేసిన నొచ్చియు నింత గైకొనక, గాసిల్లు నీలుండు కడులాఘవమున
ధారణి దైత్యులు దల్లడంబంద, వీరుఁడై దానవవిభు తేరి కురికి
పొలుపొంద నప్పు డద్భుతశక్తి మెఱసి, నిలిచి చలంబున నిగిడి యుప్పొంగి
వడిఁ జేర్చి దానవధ్వజమున కెగసి, పొడిచేసి చాపాగ్రమునకు లాగొప్ప
నెగసి చలంబున నెక్కడలించి, మగిడి రావణుఘనమకుటముల్ ద్రొక్క
యురుభుజనిజవిక్రమోన్నతి మెఱసి, సురసిద్ధసాధ్యులు చోద్యంబునొంద
నొకమౌళిపైనుండి యొకమౌళి వ్రచ్చి, యొకమౌళిపైనుండి యొకమౌళి యూఁచి
యొకమౌళిపైనుండి యొకమౌళి దుల్పి, యొకమౌళిపైనుండి యొకమౌళి దన్ని
మకుటంబులన్నియు మట్టి మల్లాడి, యకలంకుఁడై నీలుఁ డంతటఁ బోక
వారక తనుఁ బట్టవచ్చిన సూక్ష్మ, మై రావణునిఁ జూచి యందంద నగుచు
గొడుగులు ద్రుంచి గ్రక్కున మీఁదఁద్రొచ్చి, పొడిగాఁగఁ జామరంబులు ద్రుంచివైచి
విఱుగంగ నరదంబు పీఁక దాటించి, కరకరితోఁడ నుత్కంఠ దీపింప
దనుజేశు నురుముష్టి దాఁచి హారములు, పెనచి రాఁ దిగిచి యాపృథులవక్షంబు
జఱచి యందంద యుత్సాహంబు మెఱసి, యుఱుక నీగతి నాడుచుండుటఁ జూచి
తరుచరసేనలు దైత్యసేనలును, బోరిఁబోరి నద్భుతంబుగఁ జూచుచుండ
వెఱగంది రారామవిభుఁడు లక్ష్మణుఁడు, మఱి రావణుం డంత మహితాగ్నిశరము
నయ్యెడ నారితో నలుక సంధించి, యయ్యగ్నిసుతుతోడ ననియె మండుచును
నీలాఘవము లెస్స నిన్ను మెచ్చితిని, నీలాఘవమె నాకు నెడపక చూపు
మిదె వచ్చె నాబాణ మినవహ్నిరుచుల, బ్రదికెదు చందంబుఁ బరికించికొనుము
అని యేయుటయు నీలుఁ డగ్నిబాణమునఁ, దనువెల్ల మండుచు ధరణిపైఁ బడియె
నగ్నిపుత్త్రుఁడు దాన నాతీవ్రశరపు, టగ్నిచేఁ జావక యవశుఁడై యుండె
నంత ధనుర్ఘోష మడర సౌమిత్రి, యంతకు గలిఁ జేర్చె యద్దైత్యుఁ దాఁక
నగ్గుణారావంబు నతనిసాహసము, నగ్గించి యతనితో ననియె రావణుఁడు
పిన్నవై యుండియుఁ బేర్చుచు ననికి, సన్నద్ధగతి నీవు చనుదెంచు టొప్పఁ
బుచ్చెద నంతకుపురికి లక్ష్మణుఁడ, యిచ్ఛందమున నిల్వు మించుకతడవు
అనవుడు విని రాఘవానుజుం డనియె, దనుజాధముఁడ యీవృథాగర్వమేల
డాసినవాఁడ మాటలు సెప్ప కపుడు, చేసి చూపుదుఁగాక చెలఁగి నీలావు
అనిన సౌమిత్రి నేడమ్ముల నేసె, దనుజునియమ్ము లుద్ధతి లక్ష్మణుండు

నడుమనె త్రుంచిన నాకారి యప్పు, డడరెడుకోప ముదగ్రమై పర్వ
ఘనతరజ్యానాద కలితంబుగాఁగ, ననయంబు నిగుడించె నమ్ములవాన
నయ్యంపతండంబు లందందఁ ద్రుంచి, వెస్యాసిశరములు వెస నేసె నతఁడు
నాయస్త్రములకు మాఱైనయస్త్రముల, నేయనేరక దానవేశ్వరుం డపుడు
తలకొని యొకబ్రహ్మదత్తబాణమున, లలితవక్షం బేయ లావెల్లఁ దూలి
విల్లూఁతగాఁ గొని వేగంబె తెలిసి, ఝల్లుగా నార్చుచుఁ బేర్చి లక్ష్మణుఁడు
ఘనబాణ మొకటి రాక్షసనాథువిల్లుఁ, దునిమి యంతటఁ బోక దోర్బలం బెసఁగ
మూఁడగ్నులనఁబోలు మూఁడుబాణముల, వాఁడిమి మీఱంగ వడి వక్ష మేసె
నేసిన మూర్ఛిల్లి యింతలోఁ దెలిసి, యాపన్నసత్త్వసముగ్రుఁడై కదిసి
తనవిల్లు విఱిచినదానికి నసుర, మనములోఁ జాల విస్మయమును బొంది
కలుషించి నిచ్చలు గంధపుష్పముల, నలవడఁ బూజింప నమరినదాని
నిలయు బ్రహ్మాండంబు నెల్లదిక్కులును, వెలుఁగొందుమంటల విలసిల్లుదాని
నడరెడుపదికోట్ల యశనులఁ బోలి, కడుబెట్టిదపుమ్రోఁత గలిగినదాని
నలినమిత్రునికిరణంబులకంటె, వెలుఁగొందు మంటలవేఁడిమిదాని
ననిమిషు ల్వెఱఁగంద నాబ్రహ్మశక్తిఁ, గొని లక్ష్మణుని వైచెఁ గ్రూరుఁడై పేర్చి
వైచినఁ గాలాగ్నివడువునఁ బెద్ద, యేచి వజ్రమునకు నెక్కుడై నిగిడి
యనిమిషావలియెల్ల నాహారవంబు, లొనరింపఁ బఱతెంచు నుగ్రతఁ జూచి
వారింప నమ్ములవాన లక్ష్మణుఁడు, ఘోరతరంబుగాఁ గురియంగఁ ద్రోచి
యది వచ్చి భుజమధ్య మాడి లక్ష్మణుని, వదలక తాఁకిన వసుధపైఁ బడియె
నరిగి దశాననుం డంత లక్ష్మణుని, నిరువదిచేతుల నెత్తఁ జూచుటయు
నాతఁడు విష్ణుని యంశజుఁ డగుట, నేతెఱంగున వాని కెత్త రాదయ్యె
నత్తఱి రావణుం డంతరంగమున, నెత్తరాకుండిన నేను గైలాస
మెత్తి త్రిలోకంబు లెల్లను నెఱుఁగ, నిత్తఱి నాసత్త్వ మెల్లను దఱిగె
మఱియు మేరువునైన మందరంబయిన, నెఱయ నెత్తఁగనోపు నిజశక్తివాఁడ
వీఁడింత వ్రేఁగౌట విస్మయం బనుచుఁ, బోఁడిగాఁ గరములఁ బూని రావణుఁడు
అతులసత్త్వోన్నతి నందంద నెత్త, మతిలోనఁ గోపించి మారుతి గడఁగి
పఱతెంచి నిర్ఘాత పటుముష్టి నార్చి, కఱకురాక్షసుని వక్షస్థలిఁ బగుల [గను
బొడుచుటయును మూర్ఛఁబొంది రావణుఁడు, కడుఁదూలి యంత మోఁకాళ్లమ్రోవఁ
బడియెఁ బిఱిందికిఁ బదమిడ లేక, పడినరావణుని యప్పటిభంగిఁ జూచి
యార్చిరి దేవత లప్పుడు కపులు, వేర్చిరి రాక్షసు ల్భీతిఁ గీడ్వడిరి
పావని యట విష్ణుభక్తుండుగాన, రావణునకు నెత్తరానిలక్ష్మణుని
గురుసత్త్వమున నెత్తికొనిపోయి రాము, ధరణీతలేశుముందఱఁ బెట్టె నపుడు
రాముతేజమునఁ బరాజిత మగుచు, సౌమిత్రి నాటిన శక్తియు నూడి
యసురేశురథమున కరిగె సౌమిత్రి, యసమానబలశాలియై మూర్ఛఁ దేరె
నట రావణుండును నటు మూర్ఛఁ దెలిసి, చటులబాణాసనసన్నద్ధుఁడయ్యె

సౌమిత్రి యిటు పరిశ్రాంతినొందుటకు, నామర్కటులు భీతి నడరి పాఱుటకు

### రామరావణుల ప్రథమయుద్ధము

రావణుఁ డేచి పైరాకకు రాము,దేవుండు కోపంబు దీపింపఁ బేర్చి
భీకరగుణరవస్ఫీతుఁడై వేగ, నాకారి కెదురుగా నడచుటఁ జూచి
యనిలతనూభవుం డనియె రామునకు, నినకులాధీశ్వర యీ రావణుండు
అరదంబుపైనుండి యాలంబుసేయ, వెరవగునే నీకు విభుఁడ గాల్నడవ
నామీఁద వడినెక్కి నాకారి కెదుర, రాము విచ్చేయుట రాజధర్మంబు
అనవుడుఁ గడఁకతో హనుమంతు నెక్కి, యనిమిషకరిమీఁది యమరేంద్రుకరణి
నొప్పి గుణధ్వని యొప్పారఁ జేసె, నప్పుడు కోపించి యాటోప మొప్ప
రావణుఁ డుగ్రుఁడై రాము నీక్షించి, పావకజ్వాలోగ్రబాణజాలములు
గురిసిన రాఘవక్షోణీశుఁ డలిగి, యురుబాణతతులేసి యురువడి వాని
నింద్రారి తెగనేసె నేసిన రాము,చంద్రుఁ డుద్ధతి నర్ధచంద్రబాణమున
దనుజేశుకోదండదండంబు దునిమి, సునిశితభీకరాశుగపంచకమున
మర్మము ల్నొప్పించి మఱియును నొక్క,ధర్మంబుఁ జేకొని దశకంధరుండు
పటుబాణ మొక్కటఁ బవననందనుని, నిటలస్థలం బేసె నిపుణుఁడై మెఱసి
యనిలజుఫాలముగ్రాస్త్రంబు దాఁకఁ, గనుఁగొని కోపించి కాకుత్స్థకులుఁడు
భల్లంబు దొడిగి యాపఙ్క్తికంధరుని, విల్లంతలోననె విఱుగంగనేసి
యొక్కట సారథి నొకట నశ్వముల, నొక్కట నరదంబు నొకటఁ బతాక
మొక్కట గొడుగును నొకట వస్త్రములఁ, గ్రక్కున నేసి చూర్ణములు గావించి
మనుజనాయకుఁడు సమంత్రకశరము, దనుజునివక్షంబు దాఁక నేయుటయు
నారాముశరమున నారావణుండు, వారక కడు నొచ్చి వడవడ వడఁకి
యనికి నిశ్చేష్టితుం డగుదశకంఠుఁ, గని యర్ధచంద్రమార్గణ మరివోసి
దశదిశలందును దనరిన దైత్యు, దశ యడఁగించుచందముఁ జూపుకరణిఁ
త్రిదశులు మెచ్చ నుద్దీప్తకోపమునఁ, బదిమకుటంబులు వడి డొల్లనేసె
నేసిన మదిలోన నెంతయు స్రుక్కి, భాసురమకుటప్రభావలిఁ బాసి
గ్రద్దనఁ జేయు నక్కయ్యంబు దక్కి, తద్దయు నిశ్చేష్ట దశకంఠుఁ డుండె
నప్పుడు రాఘవుం డనియె రావణున, కిప్పుడు కపులతో నిబ్భంగిఁ బోరి
కడు డస్సినాఁడవు గాన నిన్ జంప, విడిచితి నీ వింక వేగంబె చనుము
పో లంక కనుడు నప్పుడు చిన్నవోయి, యోలిన వేఁడినిట్టూర్పులు నిగుడ
మండెడికోపంబు మలఁగి చింతించి, దండిగర్వము దక్కి దశకంధరుండు
బలమెల్లఁ బొలిసి దర్పము పేర్మి దూలి, వెలవెలఁ బాఱుచు విరథుఁడై నడచి
పెదవులు దడుపుచు బిమ్మిటి గొనుచుఁ, గదరినభీతి గద్గదకంఠుఁ డగుచుఁ
జేరి యొండొరువుల చేతులు చఱచి, బోరన నవ్వుచు భూతంబు లార్వ
గురువులు వారుచు గునిసియాడుచును, గెరలి వానరకోటి గేలిసేయంగఁ
గఱుకెల్ల నుడిగి యొక్కరుఁడును వేగ, పఱచి యాలంకలోపలఁ జొచ్చె నపుడు

అటు లంకలోపలి కరిగి రావణుఁడు, పటుతరంబగు చింతపడి తల్లడిలుచుఁ
బంచాననంబుచేఁ బడియుఁ జావునకు, నించుక తప్పిన యేనుఁగుపగిది
గరుడుని కగపడి క్రమ్మఱ బ్రతికి, సురిగిపోయిన దందశూకంబువోలె
స్ఫీతనిష్టప్త ప్రభాభీలకీలముల, నాతతబ్రహ్మదండాతిశయంబు
లగురామబాణంబు లడరి ప్రాణములఁ, దెగటార్చుచునికి చింతించి చింతించి
యుడుగని శోకనిశ్శ్వాసంబుఁ బెల్లు, వడిగాలిఁ బోలి యవ్వాలనైన సుడియఁ
దలకొన్నసిగ్గున ధైర్యంబు దూలి, కొలువులోపలి దైత్యకోటి నీక్షించి
నాలావుఁ గలిమి దానవవీరులార, నేలతోఁ గలియుట నేఁడుపోఁ గలిగె
సహజపరాక్రమశాలి యొక్కరుఁడు, మహిమీఁదఁ బుట్టి రామక్షితీశ్వరుఁడు
సొరిది యుద్ధములందు సురసిద్ధసాధ్య,గరుడగంధర్వరాక్షసపక్షియక్ష
కిన్నరోరగమృగకింపురుషులును, నన్ను జయింప నెన్నఁడు లేకయుండ
వరము గాంచితి బ్రహ్మవలన నే నపుడు, సరకుసేయను నరసమితి మోసమున
నామోస మెల్లను నాకుఁ బైవచ్చె, నే మని చెప్పుదు నీదురవస్థ
కోట మీఁ రేచుఱకుండి వాకిళ్లఁ, బాటించి యెంతయుఁ బలుకాపు లిడుఁడు
దురములోపలఁ బ్రహస్తుఁడు మొదలైన, యురువీరులందఱు నొగిఁ బోరి పడిరి
మఱి యింక రామలక్ష్మణుల జయింప, నెఱవీరుఁ డెవ్వఁడు నిజగతి జగతి
బహుసంగరాంగణపరిణతుం డైన, సహజశూరుఁడు రామజనపాలుమీఁద
నడవనేర్చినయట్టి నాతమ్ముఁ డైన, కడిఁది వీరుఁడు కుంభకర్ణుండుగాక
వినుతింప మఱియొండు వీరుండు గలఁడె, యనుచు నద్దశకంఠుఁ డందఱఁ జూచి
నెఱయంగ నిరుమూఁడు నెలలు నిద్రించి, మఱి మేలుకొని సభామంటపమునకు
నలరి యేతెంచి మంత్రాలోచనంబు, పొలుపారఁగాఁ జేసి పోయి క్రమ్మఱను
నేఁడు తొమ్మిదినాళ్లనిద్రమై నున్న, వాఁడు శత్రులనెల్ల వధియింపఁగలఁడు

కుంభకర్ణుని నిద్ర మేల్కొనఁజేయుట

ఆతని మేల్కొల్పి యతులవిక్రముని, నే తెఱంగునవైన నిటకుఁ దెం డనిన
బహుగంధపుష్పము ల్భక్ష్యభోజ్యములు, బహువిధంబులఁ గొని బఱచి రాక్షసులు
ఆతతానంతభోగాస్పదం బగుచుఁ, బాతాళమును బోలెఁ బరఁగినదాని
మహనీయశతకోటిమహిమచే నింద్రు, మహితాలయము పోలె మానైనదాని
నిఖిలంబునందును నెగడు తేజమున, శిఖినివాసము పోలెఁ జెలువైనదాని
సమధికంబైన భీషణవృత్తి గలిగి, యమనివాసము పోలె నమరినదాని
వివిధమేదోమాంసవితతిఁ గ్రవ్యాదు, భవనాంగణము పోలి భాసిల్లుదాని
నిరుపమతరవారుణీయుక్త మగుచు, వరుణాలయము పోలె వ్రాలినదానిఁ
దిరమైన యాసుగంధిస్పర్శనమున, మరుదాలయము పోలె మానైనదాని
విలసితనిధులచే వెలసి కుబేరు, నెలవును బోలె వర్ణితమైనదాని
నురువిభూతికినెల్ల నునికిపట్టగుచు, హరునివాసము పోలె నమరినదానిఁ
గలిగినపద్మరాగప్రభావళుల, నలువయున్నెడ పోలె నలరినదాని

నఖిలదిక్కుల యోజనాయతం బగుచు, సుఖతరం బగుగుహఁ జొచ్చి యచ్చటను
ఆవిపులపుటూర్పు లడరినఁ దూలి, లావున నెట్టకేలకుఁ జేరఁ బోయి
కడునొప్ప నెంతయు గరగరికైన, వెడలుపుగల హేమవేదికమీఁద
నంసంబుతోఁ గపోలాంగంబుఁ జేర్చి, హంసతూలికతల్పమునందు శయనించి
యుడుగక తఱుచైన యూర్పులతోడఁ, బెడఁగైన యాఘర్మబిందులతోడఁ
గరమొప్ప మోడ్చిన కన్నులతోడఁ, దఱుచైనకపురగందపుఁబూఁతతోడ
నురమున నెంతయు నుజ్జ్వలం బగుచు, నెరసిన మణిహారనికరంబుతోడ
నల్లలితానందసంపదతోడ, నెల్లప్పుడును దన్ను నెఱుఁగమితోడ
సరసనిద్రాంగనాసంభోగకేళిఁ, బరిణమించినభంగి భాసిల్లువాని
పలుమఱు దివిజుల భంజించునట్టి, కలలర్థిఁ గను కుంభకర్ణునిఁ గనిరి
కని యిట్టివానికి ఘననిద్రయుంచె, వనరుహాసనుఁ డని వగచుచు నపుడు
ఆతనిముందట నన్న రాసులును, బ్రాఁతిగా మహిషవరాహమాంసములుఁ
బోసి యంచితగంధపుష్పార్చనములు, నేసి ధూపంబులు చెలువొప్ప నిచ్చి
పోరిఁబోరి బహుదీపముల నివాళించి, కరములు మొగిచి పొగడ్తలు నెఱపి
పిడుగులు మ్రోసిన పెక్కువకంబె, నెడప కార్చుచు బొబ్బలిడుచుఁ జీరుచును
నురువడి శంఖంబు లూఁదుచు బెట్టు, మొరయంగ నిస్సాణములును భేరులును
జెంది వ్రేయుచుఁ దోన సింహారవంబు, లందంద చెలఁగింప నమ్మహారవము
దక్షతఁ బాతాళతలము దిక్కులను, నక్షత్రపథములు నాకంబు నిండె
నంతటఁ దెలియక యాకుంభకర్ణుఁ, డంతకంతకుఁ గడు నగ్గలంబైన
నిదురవోవఁగఁ జూచి నిఖిలరాక్షసులు, గదలును ముసలముల్ ఘనముద్గరములు
బెనుపారఁ బట్టసభిండివాలములు, మునుమిడి యందఱు ముసరి వ్రేయుచును
బదివేలకుంతముల్ బరుల గ్రుమ్ముచును, వదలక కొండలు వైచియుఁ బోక
యురముపై నందంద నుఱికి పాదములఁ, గరము మెట్టియు మేలు కాన్పంగలేక
తడబడ సింహనాదములు సేయుచును, గడుబెట్టుగాఁగ శంఖంబు లూఁదుచును
బటునాదముల గ్రందుపటుకుంభవాద్య, పటహభేరీభూరిబహువాద్యములును
దొడరి వాయింపుచుఁ దోడనె మఱియు, నుడుగక పదివేలయుగ్రరాక్షసులు
క్రందుగా నిస్సాణఘనతరరావ, మందంద చెలఁగింప నారభసమున
నీలాద్రియునుబోలె నిశ్చలుం డగుచు, నాలోనఁ దెలియక యతఁ డున్నఁ జూచి
కరులహయంబుల ఘనతరోష్ట్రముల, నురులులాయములచే నురము ద్రొక్కించి
కొంకక మేనెల్ల గుదియల మోఁది, యంకించి సకలవాద్యములు వాయింప
లంక గంపించి కోలాహలంబయ్యె, శంకించె నవ్వనచరసేన లెల్ల
నిటు సేయునప్పుడు నేమియుఁ దెలియ, కటునిద్ర వోవంగ నఖిలరాక్షసులు
కొందఱు దిక్కులు ఘూర్ణిల్ల భేరు, లందంద వ్రేయుచు నధికదర్పమునఁ
గొందఱు పర్వతగుహలెల్ల నద్రువ, దందడి సింహనాదములు సేయుచును
గలయంగఁ గొందఱు కరములు పెనచి, పెలుచ శిరోజముల్ పెఱికివైచియును

గొందఱు ఘనకర్ణకుహరము ల్సొచ్చి, క్రందుగా గూబలు గఱచిపట్టియును
నటు ఘోరమగుబాధ లడరించి మఱియుఁ, బటుగదాముద్గరప్రాసఖడ్గముల
ముసలంబులను బెట్టు మొగము నురంబు, మసల కందఱు పలుమఱు వ్రేయవ్రేయఁ
దననిద్ర యించుక దఱిగి యంతటను, మనుజాశనుం డొకమఱి యావులింపఁ
దఱుచుగాఁ గన్నులు దరిగొనవైచి, యిఱియ ప్రాకులసందు లెల్ల బంధించి
తెరలఁ గాచిననూనె దెచ్చి కర్ణములఁ, గరముగ్రముగ వేయిఘటములు వోసి
మునుకొని యాతని ముక్కుఁ గోళ్లందు, ఘనమైనపారలు గనలఁ బెట్టియును
ఏకయత్నంబున హేమదండముల, భీకరగతి వ్రాయ భేరుల వ్రాసి
విడువక హయకరివితతి నురంబు, గడఁగి త్రొక్కింప రాక్షసుఁడు శంకించి
చక్కఁ శేషోగ్రహస్తంబులు సాచి, యొక్కింత మేల్కొని హుమ్మని నీల్గి
బడబాముఖాభమై పరఁగెడినోరు, కడుఁ జూడ వికృతంబుగా నావులించి
యురవైనయట్టి సాయుజ్యపదంబు, నెరయంగ రాముఁడు నేఁడు నా కిచ్చు
నీరిత్తనిద్ర నా కే లని దాని, దూరంబుగాఁ బెడఁ ద్రోచెనో యనఁగఁ
గనువిచ్చి యసురులు కంపింప మేలు,కని కుంభకర్ణుఁ డుగ్రతను గూర్చుండెఁ
బ్రళయకాలమునాఁటి భానుబింబంబు, చెలువంబుతో మోము జేగురింపంగఁ
బటువింధ్యగుహలలోపల నుండివచ్చు, చటులానిలంబుల సరియూర్పు లెసఁగఁ
బ్రళయకాలాగ్నిబింబంబులఁ బోలి, కలయంగ నెఱ్ఱని కన్నులు మెఱయ
దానవు లిట్టు లాతని మేలుకొల్పి, దానవేశ్వరునియొద్దకుఁ బోయి నిలిచి
దేవ నీతమ్ముఁ డెంతేనియు బాధ, గావింపఁగా మేలుకనియె నంతటను
నటు కయ్యమునకుఁ బొమ్మందుమో కాక, యిటు తోడితెత్తుమో యేతెఱం గనుడు
రాగిల్లి తోడ్కొని రండు నావుడును, వేగంబె యాదైత్యవిభునాజ్ఞ వచ్చి
తనకట్టెదుర నున్న దానవప్రతతిఁ, గనుఁగొని యాకుంభకర్ణుఁ డిట్లనియె
మీరేల నన్నిటు మేలుకొల్పితిరి, యారావణునకుఁ గార్యం బేమి పుట్టె
నదియేమి చెప్పుఁడీ యనవుడు వారు, త్రిదశారిచేతనే తెలియంగ వినుము
నినుఁ దోడితెమ్మని నిర్జరారాతి, పనిచె నింతియ కాని పనియేమొ తెలియ
దనవుడు జలక మింపారఁగా నాడి, చనుదెంచి యెంతయుఁ జతురత మెఱసి
చారువస్త్రములు భూషణములు దాల్చి, భూరికోటీరదీప్తుల నొప్పుటయును
నతిముదంబున నప్పు డాదైత్యులెల్ల, నతని కనేకభక్ష్యములు భోజ్యములు
మధువును సూకరమహిషమాంసములు, నధికంపుమెదడును నాజ్యభాండమును
ముదముతోఁ గొనివచ్చి ముందఱ నిడిన, మొదల మేదోమాంసములఁ బ్రీతి నమలి
రుధిరంబు మద్యంబు రూఢిగాఁ గ్రోలి, యధికసంతుష్టుఁడై యతఁ డున్నఁ జూచి
మ్రొక్కి నిశాచరు ల్ముందఱ నిలువ, నక్కుంభకర్ణుఁ డిట్లనియె వారలకు
మీఱినసుతులకు మేటిబంధులకు, వారక రాక్షసేశ్వరునకు శుభమె
యొడరు పుట్టదు గదా యెవ్వరివలన, నడరి మీలంకకు నట్టైన నిపుడు
నడచెద నథమైన నమరేంద్రునైన, వడిఁ గిట్టి నాకంబువలనఁ బాపెదను

నార్చెదఁ గాలాగ్నినైనఁ బెంపాదవి, తేర్చెదఁ బగవారితీవ్రదర్పములు
అనిన యూపాక్షుండు హస్తము ల్మోగిచి, కనుఁగొని యాకుంభకర్ణుతో ననియె
విను నిశాచరవీర విబుధులవలన, దనుజులవలన గంధర్వులవలన
నైభయం బెన్నండు నెఱుఁగని మాకు, నీభీతిఁ బుట్టించి రిప్పుడు నరులు
దివిజారి జానకిఁ దెచ్చుట కలిగి, రవికులోత్తముఁడైన రామచంద్రుండు
కడిఁది విక్రములైన కపులతోఁ గూడి, విడిసినాఁ డీలంక వేఁడించి యిప్పు
డగచరుం డొక్కఁడె యక్షకుమారు, మొగిసేనతోఁ గూడ మున్ను నిర్జించి
లంక భస్మముచేసి లావుమైఁ జనియె, నింక నెవ్వఁడు గెల్చు నిమ్మహాకపుల
ననిలోన దేవాసురాదులకంటె, ఘనవిక్రమఖ్యాతి గల రాముతోడ
నురక కయ్యముసేసి యోడి రావణుఁడు, వెఱపునఁ బఱతెంచి వెస లంకఁ జొచ్చె
నని విన్నవించిన నన్నిశాచరుఁడు, కనుగవ విస్ఫులింగంబులు చెదర
యూపాక్షు నీక్షించి యుగ్రకోపమున, దీపించి యౌడులు దీటుచుఁ బలికె
సమరంబులో నేఁడు సకలవానరుల, నమితవిక్రములైన యాదాశరథుల
మడియించి కపివీరమాంసరక్తములఁ, దొడరి రాక్షసకోటికిఁ దృప్తిఁ బొందించి
రామలక్ష్మణుల యారక్తముల్ గ్రోల, కేమని వత్తు నే నింద్రారిఁడకు
నటు చేసి వచ్చెద నన మహోదరుఁడు, నట మ్రొక్కి ముకుళితహస్తుఁడై పలికె
ఘనుని దశగ్రీవుఁ గని సేయవలయు, పను లెల్ల విని పోయి పగవారి గెలువ
మనవు డౌఁ గాకని యామహాకాంక్షఁ, దనయొద్ది రాక్షసతతిఁ జూడ వార
లిరవొందఁగా నప్పు డిరువదియొక్క, పురుషులమాంసంబుఁ బ్రోవుగాఁ బోసి
యెనుబదిమహిషంబు లెనమనూఱజములును ప్రే[illegible] నాల్గువేలు
ఘనశశకములు మృగంబు లార్నూఱు, ననువొందఁగాఁ దెచ్చి యవి వేఱువేఱఁ
జంపి సుపక్వమాంసములుగాఁ దెచ్చి, యింపార నాతనియెదుటఁ బోయుటయుఁ
దనివోవఁ గుడిచి యుద్ధతి రెండువేల, ఘనఘటంబులనిండఁ గలమద్యమాని
పటపట దిక్కులు పగుల వ్రేయుచును, జటులంబులైనమీసములు దీటుచును
జనుదెంచు నురువడి జగము గంపింపఁ, గనుదోయి ఘూర్ణిల్లఁగా గుహ వెడలె
నల రాహువదనగహ్వరముననుండి, విలయకాలార్కుండు వెడలినమాడ్కి
బలుగిట్టి ధాత్రియు బ్రహ్మాండతలము, వెలయ దర్పించు త్రివిక్రముపగిది
నాచందమున వికృతాకారుఁ డగుచు, నేచినపొడవుతో నేత్రేరఁ జూచి
కోట యవ్వలి కపికోటులన్నియును, మేటిరాక్షసుఁ గని మిగిలినభీతిఁ
గొందఱు వెఱఁగందఁ గొందఱు డాఁగఁ, గొంద ఱట్టిట్టు పడఁ గొందఱు వెఱవఁ
గొందఱు మూర్ఛిల్లఁ గొందఱు జలధి, యందఱు వగఁగొంద ఱద్దిరా యనఁగఁ
గొందఱు రాముదిక్కున కొదుగంగ, నందఱఁ గనుఁగొని యాసమయమున
సౌమిత్రి విల్లును శరముఁ దెమ్మరుచు, రాముఁడు పలికె నారావణానుజుని
నదె కయాసంబును నవనీతలంబు, గదిసిన దేహంబు గలిగినవాఁడు
ప్రళయకాలాంబుదపటలంబుపోలెఁ, బొలయు భూషణరుచిఁ బొలుపైనవాఁడు

మూఁడులోకంబు లిమ్ముల మ్రింగునట్టి, వాఁడిమి దెఱచినవదనంబువాఁడు
కాలుండొ యటుగాక కాలానలుండొ, కాలరుద్రుఁడొ లయకాలమారుతుఁడొ
కాలార్కుఁడో మహాకాలాహిపతియొ, కాలమృత్యువొ లయకాలాబ్ధివిభుఁడొ
కాల కాలుఁడొ లయకాలభైరవుఁడొ, కాలరుద్రునకును గాలరుద్రుండొ
భీషణంపురూపు విభీషణ యిట్టి, దేమెన్నఁడును జూచి యెఱుఁగము మున్ను
దానవుఁడో వీఁడు దైత్యుండొ కాక, వీనికులం బేమి వీఁడెవ్వఁ డిందు
వాఁడె యాపురవీథి వడి నేగుచున్న, వాఁడెవ్వఁ డెఱిఁగింపు వానిపే రేమి
వీనిఁ గనుంగొని వెఱచిరి కపులు, వీనిచందముఁ జూడ వెఱఁగయ్యె ననుడు

విభీషణుఁడు శ్రీరాములతో కుంభకర్ణునిశాపప్రకారము దెలుపుట

నావిభీషణుఁడు రామాధిపుఁ జూచి, దేవ యీదైత్యుని తెఱఁగెల్ల వినుము
వరనందనుఁడు విశ్రవసునకు నితఁడు, కరము క్రూరుఁడు కుంభకర్ణుఁ డన్వాఁడు
రావణుతమ్ముఁడు రణవీథి గిట్టి, దేవసంఘంబుల దిక్పాలకులను
బలుమఱు దోలిన బాహుబలాఢ్యుఁ, డలఘుశూలాయుధోద్ధతసత్వధనుఁడు
బ్రహ్మాండమయినను బగిలింపనోపు, బ్రహ్మాదులకుఁ బట్టువడఁడు సత్వమున
వీఁడు పుట్టిననాఁడె విస్తృతంపునోరఁ, బోడిమిచెడ జీవముల మ్రింగఁ జొచ్చె
మునుమిడి యటు భూతముల మ్రింగ మ్రింగ, విని వజ్రి కోపించి విపులవజ్రంబు
వీనిపై వైచిన వీఁడు గైకొనక, యానాకగజదంత మగిలించి వెఱికి
సురపతిపై వైవ సురసుర స్రుక్కి, సురపతి యప్పుడు సురలతో వచ్చి
యంభోజభవుఁ గాంచి హస్తము ల్మోగిచి, కుంభకర్ణుండను ఘోరరాక్షసుఁడు
పొలుపారఁ బ్రజలఁ జంపుచున్నవాఁడు, నొలవక సురల నేచుచున్నవాఁడు
గడఁగి పరస్త్రీలఁ గవయుచున్నాఁడు, తొడరి లోకములెల్లఁ ద్రుంచుచున్నాఁడు
ఈనీచు నీక్రియ నిటమీఁద నున్న, వీనినిగ్రహమున విశ్వంబు పొలియు
ననవిని యప్పు డయ్యంబుజాసనుఁడు, తనమనంబున నల్కఁ దద్దయు మిగుల
రాక్షసావలినెల్ల రప్పించి యందు, వీక్షించె నప్పుడు వీనిరూపంబు
వీక్షించి యెంతయు వెఱఁగంది వీఁడు, భక్షించుఁ బోవెసఁ బ్రహ్మాండమైన
వీనిచందముఁ జూచి వెఱపు నాయందు, నూనెడు వీఁ డింత యుగ్రుఁడై యున్న
వీఁ డాజిలోపల విదళింపకున్నె, మూఁడుకన్నులవేల్పు ముట్టిననైన
నని వీనితో నప్పు డనియె నాబ్రహ్మ, చన దని మిగుల నాజ్ఞాపింపఁ దలఁచి
యాపులస్త్యునియుత్తమాన్వయంబునను, నీపుట్టుటెల్లను నిఖిలభూతములఁ
బొలియించుకొఱకు నాభువనంబులెల్ల, నలుకంగ నిట్టి శౌర్యము చూపె దనుచుఁ
జావుతో సరియైన శాపంబు నిచ్చె,నీ వుడుగని యట్టి నిదురబొమ్మనుచు
జలిపిడుగునుబోలె శాపంబు దాఁకి, నిలువలే కెంతయు నిద్రితుండయ్యె
రావణుం డప్పు డాబ్రహ్మకు మ్రొక్కె, దేవ చూడుము కృపాదృష్టితో వీనిఁ
దారువెట్టినచెట్టుఁ దా రెత్రుంపుదురె, యేరూపమున నితఁ డెంతకీడైనఁ
దగుబుద్ధిసెప్పుట తగవగువానిఁ, దగ దిటువలె శాపతప్తునిఁ జేయ

వీనినిద్రకుఁ దుది వివరింపు మనిన, దానవుతోడ నుత్తరమిచ్చె నజుఁడు
అక్కజంబుగ నిద్ర యాఱేసినెలల, కొక్కొక్కపరిఁ దెలియుచునుండు ననుచు
నంతనుండియు నితం డవ్విధంబునను, జింతనేయక నిద్రఁ జెందు మేల్కాంచు
దేవ యిప్పుడు నీదు దివ్యబాణోగ్ర, పావకశిఖలఁ బొల్పడి సైఁపలేక
యవసరంబునను తా నారావణుండు, తను మేలుకొల్పఁగ దైత్యులఁ బనుప
దానును బేర్చి యుద్ధప్రసన్నద్ధుఁ, డై నేఁడు నగరికి నరుగుచున్నాఁడు
వెస వీఁడు రావణు వీడ్కొని వచ్చు, నసఁబున మనమీఁద నంతకు మున్నె
వీనియాకృతిఁ జూచి వెసఁ బాఱకుండ, వానరసేనలో వడిఁ జాటఁ బనుపు
దనుజుండు గాఁ డిటుదారుయంత్రమున, నొనరంగఁ జేసిన యుగ్రరూ పనుచు
నిటు చాటఁగాఁ బంచి యెల్లవానరులఁ, బటుభీతియును బాపి భండనంబునకు
సన్నద్ధులుగఁ జేయు సకలాధినాథ, మున్నె యానతియిమ్ము మోహరింపంగ
ననవుడు నీలున కానతి యిచ్చి, జననాథుఁ డమ్మెయిఁ జాటంగఁ బనిచె
నాకుంభకర్ణుండు నప్పురాంగనలు, చేకొని పూవుల సేసలు చల్లఁ
జని నిండువెన్నెలసదనమో యనఁగఁ, దనరారుచున్న యాస్థానంబుఁ జొచ్చె
బరఁగిన ధవళాభ్రపటలంబుఁ జొచ్చు, సురుచిరకరుఁడైన సూర్యునిభంగిఁ
జొచ్చి యన్నకు మ్రొక్క సొంపార నతఁడు, గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కూర్మి దీపింపఁ
గనకాసనం బిడఁగాఁ బంగుటయును, దనుజాధినాథునితమ్ముఁ డం దుండి
యన్న నాలోకించి యసురాధినాథ, నన్నుఁ దెల్పినకారణం బేమి యిపుడు
ఎవ్వఁడు నీయెడ నెగ్గొనరించె, నెవ్వనిఁ జంపుదు నెత్తెఱం గనుడు
నాకుంభకర్ణున కనియె రావణుఁడు, నీకుఁ జెల్లగుచున్న నిద్రపెంపునను
నేకార్యగతియును నెఱుఁగవుగానఁ, జేకొని యంతయుఁ జెప్పెద వినుము
రాముఁడు దశరథరాజనందనుఁడు, కోపించి నామీఁద కోఁతులఁ గూడి
వననిధి బంధించి వచ్చి యీకోట, వెనుకొని బలువిడి విడిసియున్నాఁడు
అనికిఁ జొచ్చుటయుఁ బ్రహస్తాదివీర,దనుజుల నందఱ ధరమీఁదఁ గూల్చె
వానరవీరు లెవ్వరుఁ జావ రందుఁ, గాన నారామలక్ష్మణుల భంజించి
యావిభీషణరవిజాదులఁ జంపి, లావునఁ జెడకుండ లంక రక్షింపు

### రావణునకు కుంభకర్ణుఁడు నీతి సెప్పుట

మని పెద్దకృపపుట్ట నాడువాక్యములు, విని కుంభకర్ణుఁ డవ్విబుధారి కనియె
మునునాఁటి యేకాంతమున మంత్రులెల్లఁ, గనుఁగొన్న యాకీడె కాక చింతింప
వారక యిది నేఁడు వచ్చిన కీడె, యేరూపమున నిది యేటికిఁ దప్పు
ముదము పెంపునఁ జేసి మఱియెవ్వఁడైనఁ, దుదిమొద లెఱుఁగక తొడరుకార్యంబు
వాఁడుగదా యెల్లవలనఁ జెట్టొందు, వాఁడని చెప్ప నెవ్వఁడు నీవె కాక
మతిగలమంత్రుల మంత్రానుమతులఁ, గృతకార్యములు పరికించునే విభుఁడు
ఓగిఁ బ్రభుమంత్రసముత్సాహశక్తు, లగణితఫలదంబులై వాని కమరఁ
బతి దేశకాలవిభాగంబు లెఱిఁగి, చతురజనద్రవ్యసంపద గలిగి

కార్యంబు మీఁదగు కార్య మూహించి, కార్యవిఘ్నప్రతీకారంబుసేసి
ఫలసిద్ధిఁ గైకొని బహురాజ్యభోగ,ముల నిత్యుఁడై యుర్వి మోదింపవలయుఁ
బగవానిబలశక్తి భావించి సంధి, తగుబుద్ధిమైఁ జేయఁ దలపోయవలయు
రూపించి సమబలారూఢునితోడ, నేపుమై చని నిగ్రహింపంగవలయు
నటు కాక బలహీనుఁ డగుట చింతించి, పటుసత్త్వుఁడై శత్రుపై నెత్తవలయు
విడిసినబలిమి వివేకించి మీఁద, విడిచి మార్తుర గెల్వ వెస పూనవలయు
వైరు లసాధ్యులై ప్రాలుదురేని, లో రెండుపుట్ట విలోకింపవలయు
నతిసత్త్వులై వైరు లజితులైరేని, హితబుద్ధిమై నాశ్రయింపంగవలయు
నీయాఱుగుణముల నెఱిఁగి వర్తించు, నాయవనీశ్వరుఁ డభివృద్ధిఁ బొందుఁ
బూని యేపురుషుఁ డెప్పుడు సామభేద,దానదండము లుచితము దప్పఁ జేయు
నెఱియ వానికిగల నీతిశాస్త్రములు, కొఱమాలియుండు నిక్కువ మివ్విధంబు
పరధనపరసతీ పరచిత్తుఁ డెవ్వఁ, డరయ నాతఁడు కులం బంతయుఁ జెఱచు
నని కుంభకర్ణుఁ డిట్లాడువాక్యములు, విని రావణుఁడు క్రోధవివశుఁడై పలికె
నను నన్న యనుచు మనంబునఁ గొనక, కినిసి యిబ్బంగి శిక్షించెదు వచ్చి
యీవృథాజల్పంబు లింక నేమిటికి, నేవిధంబుననైన నీకార్యమేను
గడవందఁజేసితిఁ గాదన కీవు, కడిమిమై నిది చక్కఁగాఁ జేయు మింక
ననవుడు విని యనె నాకుంభకర్ణుఁ, డని సేయఁ బోయెద నైనను నొకటి
విను దానవేశ్వర వేడుక నొక్క,దినమున నే నిద్ర దెలిసినవాఁడు
చేకొని కడుఁబెక్కు జీవుల మ్రింగి, యేకాంతమున నెమ్మి నే నున్నచోట
ననఘుఁడు నారదుం డరుగ నేఁ గూడఁ, జని విన్నవించితి సంయమితోడ
నెక్కడనుండి నీవిటుసంభ్రమమున, నెక్కడఁబోయెద వెఱిఁగింపు నాకు
ననవుడు కనకాద్రియందుండి రాక, విను వార్తలన్నియు వినుపింతు నీకుఁ
బంకజనాభుండు ఫాలలోచనుఁడు, పంకజాసనుఁడును పాకశాసనుఁడు
ననలుండు యమనైరృతాంబుధీశ్వరులు, ననిలుండు యక్షేశుఁ డగుకుబేరుండు
నోషధీపతియును నుష్ణకర్ణుండు, శేషగ్రహంబులు సిద్ధులు మునులు
కిన్నరగంధర్వగీర్వాణయక్ష, పన్నగగుహ్యకప్రముఖసంఘములు
సభగూడి మంత్రవిచారంబుసేయ, శుభమతి నూహించి సురగురుం డనియెఁ
గ్రోధించి మనలఁ గైకొనక లోకముల, బాధించుచున్నాఁడు పఙ్క్తికంధరుఁడు
శుంభద్బలంబున సుడివడఁజేసి, జంభారి భంజించె సమరంబులోన
వడి నంతకునిఁ దోలె వరుణు నోడించె, నొడిచెఁ గుబేరుని సురబలోజ్జ్వలుని
గట్టల్కతో నతిగర్వంబు మెఱసి, పట్టి ధర్మాత్ములఁ బలువురఁ జంపె
దినకరచంద్రులతేజంబు లణఁచె, దనయాజ్ఞ నడువంగఁ దట్టించి పనిచి
గ్రహముల నందందఁ గాఱించె మంత్ర,మహితంబు లగుచున్నమఖములు చెఱిచె
వఱలు మహోద్యానవనములు పెఱికెఁ, జెఱవెట్టె నుత్తమస్త్రీలఁ బెక్కండ్ర
నివిలోనుగా బాధ లిట్లు సేయుచును, భువనంబులకు భీతిఁ బుట్టించెఁ గాన

నడరి రాక్షసులతో నద్ధశౌననుఁడు, చెడునుపాయము మీరు చింతింపుఁ డింక
నని బృహస్పతి వల్క నామాటలెల్ల, విని బ్రహ్మ పలికె నావిబుధులతోడ
వర మిచ్చినాఁడ నే వానికి మున్ను, సురగరుడోరగాసురయక్షవరుల
చేనైనఁ జావమి సిద్ధంబుగాఁగ, దీనికి మాఱు చింతించితి విన్నఁడు
దడవఁడు మనుజుల దైత్యుండుగానఁ, దడవ నేయును వరదానకాలమునఁ
గాన రావణుని సంగరభూమియందు, మానవు లోర్తురు మనుజలోకమున
జనియింపఁ బ్రార్థింపఁ జను నాదివిష్ణు, వనజనాభుని లోకవంద్యు ముకుందు
ననవుడు సురమును లట్లు కావింప, ననఘుండు హరి మర్త్యుఁ డై పుట్టెఁ బుడమి
నని చెప్పి నారదుం డరిగె దై తేశ, దినకరకులుఁ డాదిదేవుండుగాని
మనుజుండు గాఁడు రామక్షితీశ్వరుఁడు, జనకనందన నిచ్చి శరణము వేఁడు
వనచరులెల్ల దేవతలుగాఁ దలఁపు, దనుజేశ నామాట తథ్యంబు నమ్ము
అనినమాటలు విని యద్ధశౌననుఁడు, తనలోన నధికసంతాపాగ్నిఁ గుంది
యొకకొంతవడి యూరకుండి నిట్టూర్పు, ప్రకటంబుగాఁ బుచ్చి బహుచింతతోడ
వెఱచియు వెఱవని విధమున నవ్వు, డఱిముఱి కోపించి యనుజన్నుఁ జూచి

## రావణుఁడు కుంభకర్ణునిఁ దిరస్కరించుట

సొలవక యెపుడు విష్ణుఁడు విష్ణుఁ డనుచుఁ, బలికెదు నీకింత భయమేల పుట్టె
విష్ణువై యుండిన వెఱవను నేను, విష్ణుండు మానవవేషుఁడై యున్న
వెఱతునే నన్నేల వెఱపించె దిట్లు, వెఱచెదేనియు నీవు వెఱతుగా కింక
నారాఘువుఁడు విష్ణుఁ డగుఁగాక యేమి, యారాముననుఁ దమ్ముఁ డై నసౌమిత్రి
యారయ శర్వుండె యగుఁగాక యేమి,యారవిసుతుఁ డింద్రుఁ డగుఁగాక యేమి
సురల యై యుండంగ నొరిది నే వెఱవ, నిరవొంద వీరికి నే నేల వెఱతు
నెఱయంగ నీవెల్ల నీతిశాస్త్రములు, నెఱుఁగుట నిష్ఫలం బిటు విచారింప
నతివిరోధముగొన్న యారాముతోడ, నతిహీనమైత్రికి నాసచేసెదవు
సమరోర్వి మనలను సమయింప మునుల, నమరుల రక్షింప నటు విచారించి
యంచితదేవత్వ మటు మాని వచ్చి, వంచన నిట మానవత్వంబునొంది
జగదేకరక్షకై సరసిజోదరుఁడు, జగతిపై రాముఁడై జనియించినాఁడు
వైరంబుగొని మనవధకొఱకైన, నారాముతో సంధి యది యేల పొసఁగు
వాలి దూలఁగఁబోయి వానరాశ్రితుని, నీసమయంబున నే మని కాంతు
బలిజన్నమునకు నీపంకజోదరుఁడు, పొలుచు వామనమూర్తిఁ బొంది తా నరిగి
ధరణి మూఁడడుగులు దానంబు వేఁడి, యరుదారఁ గొని యప్పు డతని బంధించె
నొప్పార నుపకార మొనరించునతని, కప్పుడె కావించె నపకార మితఁడు
పగఁగొన్నమనలను బరిమార్ప కేల, మగుడ నెక్కడిసంధి మనకు రామునకు
నేను నీవును గూడి యింద్రలోకంబు, పై నెత్తి చని భుజాబలము లింపార
నిబిడవిక్రములైన నిర్జరేంద్రాది, విబుధులఁ దోల నావిష్ణుఁ డెం దరిగె
నిను మేలుకొల్పుట నీతి నీచేత, వినఁ గోరియే నీకు వెఱవేల పుట్టెఁ

బ్రాణభయంబునఁ బలుమాటలేల, ప్రాణంబు తీపైన బ్రదుకు నెమ్మదిని
ఘనమైన యాయువుఁ గరమర్థిఁ గంటి, మునుమిడి గెలిచితి మూఁడులోకముల
ననుభవించితిఁ బెక్కు లగురాజ్యసుఖము, లనుపమం బగుతేజ మంతంత కెసఁగ
నతిహీనవిక్రముఁ డైనరామునకు, నితరులగతి నింక నే మ్రొక్కఁజాలఁ
బోఁకిఁ జనుమన్నఁ బోనోప కీవు, వారక యాడెదు వక్రోక్తు లిట్లు
నిద్రవోవఁగఁ బొమ్ము నెమ్మది నీవు, నిద్రవోయెడివాని నిర్జింప రరులు
రామలక్ష్మణులను రవితనూభవుని, భీమవిక్రములైన బిరుదువానరుల
నేనె చంపెదఁ జెప్పె యెల్లదేవతల, నేనె చంపెద విష్ణు నేనె చంపెదను
నోలి నవ్విష్ణునియొద్దిశూరులను, నాలంబులోపల నధికదర్పమున
నెద్దెసఁ గదిసిన నేనె చంపెదను, బెద్దకాలము నీవు పిఱికివై మనుము
అని పల్కి వెండియు నద్దశాననుఁడు, గనుఁగొని యాకుంభకర్ణుతో ననియెఁ
జెలువారఁగా నిటు సీతయై లక్ష్మి, యిలకు జనించుట యే నెఱుంగుదును
అరయంగ రఘురాముఁ డావిష్ణుఁ డగుటఁ, బరికించి యెఱుఁగుదు భావంబులోన
వలనొప్ప దేవతల్ వానరు లగుచు, నిలమీఁద జన్మించు టే నెఱుంగుదును
రాముచే మరణంబు రణములో నాకు, నీమెయి సిద్ధించు టే నెఱుంగుదును
నెలమిఁ గామంబున నే సీతఁ దేను, బలిమిఁ గ్రోధంబునఁ బట్టి యేఁ దేను
రణములోపల రఘురాముచే నీల్గి, ప్రణుతింప విష్ణునిపరమపదంబు
దక్కఁగ బొందంగఁ దలఁచియే సీత, నిక్కంబు దెచ్చితి నింకేల దాఁప
నని పెక్కుభంగుల నాడు రావణునిఁ, గనుఁగొని యాకుంభకర్ణుఁ డిట్లనియె
నే నీకుఁ గలుగంగ నేల తూలెదవు, దానవనాథ మోదంబున నుండు
పగయడంచెద నని పలికి యాస్థాన, మొగినంతయును జూచి యుచితవాక్యముల
నేఁ డిందులో లేఁడు నిర్మలాచారుఁ, డేడి విభీషణుం డింద్రారి యనుడు
మనమీఁద రామలక్ష్మణు లెత్తివచ్చి, రనువార్త విని సభ నందఱుఁ గూడి
యాలోచనను సేయ నంతలో నీవు, వాలిన నిద్రవో వడి నేఁగుటయును
నిష్ఠతో రఘురామునికిఁగాఁగఁ బెద్ద, నిష్ఠుర మతఁడు నానెరినాట నాడె
నాడినఁ దన్నితి నావిభీషణునిఁ, గూడదు నాకని కోపంబువేర్మిఁ
దన్ని యంతటఁ బోక తాలిమి దక్కి, యున్న జంపుదు నని యాటలే కంటి
ననవుడు ననుఁ బాసి యారాముకడకుఁ, జని యిప్పు డావిభీషణుఁ డున్నవాఁడు
అని చెప్పుటయుఁ గార్య మది తుదముట్టె, ననికిఁ బోవుట యుక్త మని విచారించి
యింకఁ బోరాదని యింద్రారియెదుట, నంకకాఁడును బోలె నతఁ డిచ్చె బాస
కిట్టి భంజించెదఁ గీనాశునైనఁ, బట్టి మర్దించెదఁ బద్మజునయిన
జిఱజిఱఁ ద్రిప్పెద శేషునినయిన, వెఱగందఁజేసెద విహగేంద్రునయిన
బలువిడి మ్రింగెదఁ బ్రళయాగ్నినైనఁ, జలమునఁ గ్రోలెద జలనిధినైన
నేపారఁ దోలెద నే విష్ణునైన, రూపఱఁజేసెద రుద్రునినైనఁ
గడఁగి ఖండించెదఁ గాలునినైన, మెడ నుల్చివైచెద మృత్యువునైన

వడిచెడఁ జేసెద వరుణునినైనఁ, గడుపు చించెద నలకాపతినైనఁ
బిడికిలించెద రవిబింబంబునైనఁ, బడద్రోచి వచ్చెద బ్రహ్మాండమయినఁ
గోఁతులఁ బట్టి మ్రింగుదు ననుటెల్ల, లేఁత నాసమరకేళిసముద్ధతికి
నామర్కటులనెల్ల నద్రుల కనిచి, యామనుజులఁ ద్రుంతు నసురాధినాథ
నీమనం బలరంగ నెమ్మది నుండు, రాముఁడు నాచేత రణములోఁ బడిన
సీత యనాథయై చిక్కు నంతటను, నీతలంచినకోర్కి నీకు సిద్ధించు
ననిన మహోదరుం డావాక్యములకు, ఘనభుజుం డగుకుంభకర్ణుతో ననియె
సత్కులంబున నీవు జనియించినాఁడ, వుత్కటం బగుకార్య ముచితమే నీకుఁ
దగ నయానయములు దలపోయ కిట్లు, పగతుఁ జంపెద నని పలుకునే ఘనుఁడు
కోపంబు దీపింప ఘోరసింహంపు, రూపున నున్నవాఁ డెసఁగు తేజమునఁ
గేవల మానవాకృతి గాఁడు రాముఁ, డావిష్ణుఁ డీరూపమై వచ్చినాఁడు
ఆవాలి నొకకోల నడఁచిన శూరుఁ, డావీరవరుఁ గెల్వ నలవియే నీకు
బ్రకటవిక్రముఁ డైనపగవానిమీఁదఁ, నొకడ పోవుట నాకు నొడఁబాటు గాదు
బలముతోఁ జని మహాబలుఁ డైనరాము, గెలువు మీ వని దశగ్రీవుతో ననియె
నేము గల్గఁగ నీకు నేల చింతింప, నీమనోరథసిద్ధి నెఱపంగ లేమె
జానకికొఱకు విచార మేమిటికి, నేను సంపాతియు నీద్విజిహ్వుండు
గంభీరవిక్రమకలితబాహుండు, కుంభకర్ణునిఁ గూడికొని పోయి రాము
నెలమి గెల్చితి మేని నేయుపాయమున, వలనొప్ప సిద్ధించు వైదేహి నీకు
నటుగాక రామనామాంకితబాణ,చటులోగ్రపాతంబు సైరింపలేక
వడి భిన్నతనులమై వచ్చితిమేని, నడరంగ నేము నీయడుగుల కెఱఁగి
ప్రణుతోగ్రవానరబలముతోఁ గూడ, రణభూమిలోపల రామలక్ష్మణుల
వధియించి భక్షించి వచ్చితి మనుచు, నధిప చెప్పిన మమ్ము నధికమోదమున
నాలింగనము చేసి యర్థి మన్నించి, పాలంగ నీవార్త పురములో నెల్ల
నీవు చాటించిన నిజముగా సీత, భావించి యటమీఁదఁ బతియాస విడిచి
మఱిఁ బూని నీమాట మఱి సేయు ననిన, నతనిఁ గోపించి యయ్యమరారిఁ జూచి
యీకొంక లగుమాటలెల్ల నేమిటికి, నాబాహుబలమేచి ననుఁ జూతుగాక
నిశ్చయంబుగ రాము నిర్జింతుఁ బోర, నిశ్చింతమున నుండు నీ విటమీఁద
నని కుంభకర్ణుఁ డుదగ్రుఁడై పలుక, విని రావణుఁడు గడువేడ్క దీపింపఁ
దనకుఁ బునర్జన్మతాసిద్ధి గలిగె, నని చాల మోదించి యనుజన్ముఁ జూచి
చని యాజి రామలక్ష్మణుల నిర్జింతు, వని నమ్మినాఁడ నీయతులసత్వంబు
శౌర్యంబునందు నీసరియైన వీర,వర్యులు లేరు ధ్రువం బివ్విధంబు
మనుకొని శూలంబు మొదలుగాఁ గలుగు, ఘనతరాయుధములఁ గయ్యంబు సేయు
మని ప్రీతి రెట్టింప నతనికి నిచ్చె, ననుపమరత్నమయాభరణములు
నారావణునితమ్ముఁ డాభూషణములు, వారక దాల్చి ప్రజ్వలితాంగుఁ డగుచు
ననరారు పసిఁడికత్తళ మొప్పఁ దొడిగి, వినుతసంధ్యాంబుదావృతగిరివోలె

బహురత్న మేఖలాబద్ధుఁడై యొప్పి, సహిరాజబద్ధమందాద్రి చందమున
నొప్పి రణోత్సాహ మువ్పొంగి పొంగి, యప్పుడు చనుదెంచి యసురపుంగవుఁడు
త్రిజగద్భయంకరదీప్తమై పర్వ, విజయసూచకభేరి వ్రేయంగఁ బనిచె

కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట

శూలిశూలముకంటె సొంపారి మొనల, వ్రాలినమంట లుజ్జ్వలములై నిగుడ
నిప్పులు చెదర మానితమైనపూజ, నొప్పి రత్నప్రభ నుజ్జ్వలం బగుచుఁ
బ్రతివీరశోణితభంజితంబైన, యతులశూలముఁ బట్టి యన్నకు మ్రొక్కి
యతనిదీవనలతో నాసభాంతరము, వితతసముద్యోగవేగుఁడై వెడలె
నీకష్టతనువులో నే మేల నిలుతు, మోకుంభకర్ణ రణోర్వర దీని
వైతువు రమ్మని వానిప్రాణంబు, లాతతగతి నీడ్వ నరుగుచందమున
నంత రాక్షసకోటి యాకుంభకర్ణు, నంతంతఁ గూడి కయ్యంబున కరిగె
దురగంబు లెక్కి సింధురముల నెక్కి, యరదంబు లెక్కి సింహంబుల నెక్కి
కాటుకకొండలగతిఁ దనరారి, మేటిదంష్ట్రంబుల మెఱుఁగులు చెదరఁ
గ్రౌర్యమంతయుఁ గూర్చి కరులిడ్డకరణి, శౌర్యంబు రూపులై చరియించుభంగిఁ
గయ్యంబునేతయే కార్యంబుగాఁగ, నయ్యయితెఱఁగుల నాటోపమొప్పఁ
బరిఘపట్టసగదాప్రాసకోదండ, కరవాలకుంతముద్గరభిండివాల
పరశుచక్రాయుధపటుసాధనములు, పరఁగఁ బదాతి యుద్భటవృత్తి నడిచె
నీచందమునఁ గూడి యెల్లసైన్యములు, వేచనుదేర గర్వితచిత్తుఁ డగుచుఁ
బురకామినీతతి పుష్పవర్షములు, గురియ రణోద్యోగి కుంభకర్ణుండు
చంద్రమండలనిభచ్ఛత్రంబు లొప్పఁ, జంద్రబింబాస్యలు చామర లిడఁగఁ
దురగహేషలును సింధురబృంహితములు, వరరథనేమినిస్వనపరంపరలు
పటుతరనిస్సాణభాంకారములును, పటహభేరీశంఖపణవరావములు
ఘంటామృదంగధక్కారవంబులును, మింట దిక్కుల నిండి మిగులమ్రోయఁగను
వెడలినయపుడు పృథ్వీభాగమగలె, జడధులు గలఁగె దిశావలి వగిలె
గగనంబు వడఁకె దిగ్గజములుఁ మ్రగ్గె, జగములు బెగడొందె శైలంబు లురిలె
దౌర్జన్యమున దుష్టదానవ నీవు, పర్జన్యునేచిన ఫల మింకఁ గుడువు
మని రాఘవునకుఁ దోడై వచ్చి పేర్చి, తనరార వాని నదల్చినమాడ్కి
గలయంగ నప్పుడు కాలమేఘములు, పలుమఱు బిడుగులు పరఁగించి మ్రోసెఁ
దోరంబుగా నార్చి త్రుళ్లెడు వీఁడు, ఘోరావనక్షోణిఁ గుపితుఁడైనట్టి
కారాధిపతిచేతఁ దారూపటుటకు, నీరాజవరునిచే నిటఁ గూలుటకును
దారు పోతులమని తగఁ జెప్పుకరణిఁ, దారలు మండుచు ధరణిపైఁ బడియె
ఘోరాజిలో నతిక్రూరుఁడై యసుర, దారుణాకారత దర్పమువ్పొంగ
తను మున్ను నొంచినదానికి ననిలుఁ, డనయంబు రామునియానతి వీనిఁ
బడవైతు నని పేర్చి ప్రబలినమాడ్కి, వడిగొని ప్రతికూలవాయువుల్ వీచె
రాముండు చంప నీరాక్షసాధముఁడు, నామీఁదఁ బడువేళ నా కెంత బళువు

పుట్టునో యని భీతిఁ బుట్టి కంపించు, నట్టిచందంబున నవని గంపించెఁ
బక్షపాతుల మని పరికింప వలదు, రాక్షసాధమ నీవు రాఘవేశ్వరుని
ఖగములచేఁ జావఁ గలవనుకరణి, ఖగములు సుడివడఁగాఁ బాఱఁ జొచ్చె
నిదియెల్లఁ గొనక సాహసము రెట్టింప, సవరణ యుడుగ కుత్సాహంబు మిగులఁ
జూపులచేతనే చూర్ణం బొనర్తుఁ, గోపించి వానరకులమెల్ల ననుచు
మేటియై వచ్చుచో మీఱి కన్గొనియెఁ, గోటయవ్వలి కపికోటులనెల్లఁ
గపులను కుంభకర్ణుఁడు జూచి, విపరీతమారుతవిధుల మేఘముల
కరణిఁ బాఱఁగఁ గుంభకర్ణుండు లంక, యురువడి వెడల మిన్నొరలంగనార్చె
నాయార్పు విని వానరావలియెల్ల, బాయనిమూర్ఛలఁ బొల్పడి రంత
శరధి గలంగె భూస్థలి గంప మొందె, సురలకుఁ గడుభీతి సొచ్చెఁ జిత్తముల
నంత వానరవీరు లంతలోఁ దెలిసి, యంతకాకృతిగల యాకుంభకర్ణుఁ

వానరవీరులు కుంభకర్ణునితో యుద్ధము సేయుట

గిట్టి పాదపములు గిరులు శృంగములు, పట్టి బెట్టుగ నెదుర్పడి వ్రేసి యార్చి
పోరిఁ బోరిఁ బోరుచోఁ బోనీక కదిసి, తరుచరసేనపై దానవసేన
యురవడిఁ గలన నిట్లుభయసైన్యములుఁ, బరవసంబున దలపడియె నావేళఁ
బ్రళయకాలమునాఁటి పటుసాగరములు, దలకొని యొండొంటిఁ దార్కొన్నకరణి
నొడలును నెమ్ములు నూరులు బర్గులు, పొడిపొడిగాఁ జేసి పోనీక మఱియుఁ
దవిలి వ్రేవులు మెదల్ దలలు ఫాలములు, నవియంగఁ బెట్టు రథ్యములఁ ద్రొక్కించి
కడలగలించిన కత్తులచేతఁ, గడికండలుగఁ జేసి కట్టల్కతోడ
నంతఁ బోవక భూనభోంతరాళంబు, నంతయుఁ గడువాఁడియమ్ములఁ గప్పి
వడిఁ బేర్చి రథములవార లిబ్బంగిఁ, గడిమిఁ జంపిరి మహోగ్రముగ వానరుల
వానరులును రథావళులను గిట్టి, పూనిచి వెనుకకుఁ బోవఁ దన్నియును
గడునొగలలమి దిగ్గన నేలతోడ, నడచియుఁ జఱచి యల్లంత వైచియును
భయదంబుగాఁ జొచ్చి పదయుగళముల, రయమునఁ జదియ సారథులఁ ద్రొక్కియును
వెళవెళ నరములు వెనచి రాఁ దిగిచి, తల లురువడిఁ ద్రుంచి ధాత్రి వైచియును
రథికులై పేర్చిన రాక్షసాధిపులఁ, బృథుగతిఁ జంపిరి పెక్కుచందముల
నది గని రాక్షసు లధికరోషమున, వదలక వానరావలిఁ జుట్టుముట్టి
మదము పెంపునఁ బలుమఱు కరిఘటల, పదములసన్నలఁ బైఁ గదియించి
కడకాళ్ళ లొడిసి యుత్కృష్టులై పట్టి, యొడపక నేలపై నెత్తి వ్రేసియును
మెదడును బుసుకలు మేదినిఁ గలయఁ, బదములఁ ద్రొక్కించి భయదంబు గాఁగ
నోలిఁ జూర్ణంబులై యుర్వి నొండొండ, రాల నుగ్రప్రదరంబు లేసియును
కరులపై నున్న రాక్షసు లేపుమీఱి, యురవడిఁ జంపి రత్యుగ్రతఁ గపులఁ
గపులు నుగ్రంబుగాఁ గవిసి యెంతయును, గుపితులై గజములకొమ్ములఁ బట్టి
కుదిచి రూపణఁచియుఁ గుంభస్థలములఁ, బదములఁ బరియలువారఁ దన్నియును
బలలంబు రక్తంబె బహుళాస్థిచయము, గలయఁ గాళ్లను బట్టి కడఁక వ్రేసియును

నాయేనుఁగులమీఁద నలవ్రఁ జలంబు, వేయుఘంగులఁ జూపి వేగ దానవులఁ
బట్టినవిండ్లను బాహావుల్లీలలు, నట్టలు మసవులు నవనిఁ గూల్చియును
నసమునఁ గపులు గజారూఢులైన, యసురులఁ జంపి యశ్వారోహవ్రమునఁ
గూడి దట్టముచేసికొని దైత్యవరులు, వాఁడిమూఁకలను గ్రొవ్వెసరంగఁ గవిసి
పలుదెఱంగుల బాణపంక్తులేసియును, నలుఁగుల సెలకట్టియలను వ్రేసియును
సునిశితఖడ్గవిస్ఫురణ శోభిల్ల, మొనసొచ్చి నవఖండములుగ వ్రేసియును
ఉక్కలులైన రావుతులేపుమీఱ, తక్కక చంపిరి తరుచరాధిపుల
గిరచరవరులును గిట్టి యశ్వములఁ, గరములఁ దోఁకలు గాళ్లను బట్టి
దెసలకు వైచియు దివికి వైచియును, వసుమతి వైచియు వ్రచ్చి వైచియును
బదఘట్టనంబులఁ బగులఁ దాఁచియును, వదలక యామీఁదివారి వ్రచ్చియును
రావుతులైన యారాక్షసాధిపుల, సాహసంబున నేలఁ జరిమిరి కడిమి
నప్పుడు రాక్షసు లధికదర్పమున, నిప్పులు కన్నుల నివ్వటిల్లంగ
నమ్ముల వేసియు నడరి కుంతములఁ, గ్రుమ్మియు సురియలఁ గ్రచ్చి త్రోచియును
శితఖడ్గసమితివ్రేసియు ముద్గరముల, వితతచూర్ణములు గావించియు మఱియుఁ
గలయాయుధముల నుగ్రతలు సూపియును, శిలలఁ బాదపములఁ జెదరఁ ద్రోచియును
కడిమిసొంపున నిట్లు కాల్వురఁ బట్టి, బెడిదంబుగాఁగఁ జంపిరి తరుచరుల
దరుచరపతులు పదాతిపైఁ గదిసి, పోరిఁబోరి నాయుధంబులు విఱిచియును
నెట్టనఁ బదకరనికరంబు లలమి, చట్టలు వాపియుఁ జమరి వైచియును
ఇరుచేతులందును నిరువురఁ బట్టి, యురవడిఁ దాటించి యురులవైచియును
అట్టలు శిరములు నమరంగఁ బట్టి, దిట్టతనంబున ద్రెంచివైచియును
నుడుగక చంపి రత్యుగ్రవేగమునఁ, గడిమి దీపింపఁ బెక్కండ్ర రాక్షసుల
నివ్విధంబునఁ జేర్చి యిరువాగుఁ బోర, నవ్వనచరులందు నసురులయందు
నిండిననెత్తురు నీళ్లభంగియును, గండలు నిండు చెంగల్వలమాడ్కి
మానితాస్యములు తామరలచందమున, నానేత్రములు కుముదావళిసగిది
తోరంపుఁబ్రేవులు దూఁడులతెఱఁగు, పేరిన మెదడును ఫేనంబురీతి
మెండువెండ్రుకలు తుమ్మెదలపోలికయు, దండిశస్త్రంబులు దరగలవడువు
చామరావళులు హంసంబుల యొప్ప, భూమిపరాగంబు పుష్పాదిక్రమము
గైకొని యపుడు సంగరమహీస్థలము, భీకరంబయ్యెను బెద్దయు నొప్పె
ననిమిషారులపాలి యామృత్యుదేవి, గొనకొని వర్తించు కొలనిచందమునఁ
గానఁగదా యిఁక గాకుత్స్థరాముఁ, డానేడు జయలక్ష్మి కునికిపట్టయ్యె
సురఖేచరులు మెచ్చి సొంపారి రపుడు, దురమున నిరువాగుఁ దొడరి పోరాడఁ
గపికోటి నొచ్చినఁ గడఁగి యందంద, కపినాయకులు చూచి కపటరాక్షసులఁ
గెరలి క్రోధంబున గిరిమహీజములఁ, దరమిడి నొప్పింప దానవుల్ బెదరి
కడువేగమునఁ గుంభకర్ణునివెనుక, నడఁగి పాఱిరి శరణనుపల్కు లెసఁగ
నాకుంభకర్ణుండు నద్దైత్యవరులఁ, జేకొని దిక్కులు చెదర నార్చుచును

నోడ కోడకుఁ డని యూరడింపుచును, గూడి పైపైవచ్చు కోఁతుల నెల్లఁ
జూపులచేతనే చూర్ణింతు ననుచుఁ, గోపించి శూలంబు గొని పెచ్చుపెరిఁగి
బలితంపుఁ గపికోటిపాలింటివిధియొ, కలుషత నేతెంచు కాలుఁడో యనఁగ
రావణుతమ్ముఁడు రాక్షసాధీశుఁ, డావనచరకోటి నడఁగింపఁ జొచ్చెఁ
గఱకైన యాకుంభకర్ణునియందు, నెఱవైనకడిమికి నిలువక కపులు
వడి మూర్ఛనొంది యుర్వరఁ బడువారు, కడువడి నెత్తురుల్ గ్రక్కెడువారు
వాతూలగతి దివి వడిఁ బ్రాఁకువారు, సేతువుత్రోవనే చెడి పాఱువారు
నగవానరులఁ జూచి యంగదుం డేచి, తగ నప్పు డతిబలోదగ్రుఁడై పలికె
నేల వానరులార యిటు చెడిపాఱ, నేలినపతి డించి యేపు పోకార్చి
వరకపీంద్రులు మహావంశవర్ధనులు, కెరలి పాఱుదురె ప్రాకృతులచందమున
రామునిముందర రణములోఁ బడిన, రామణీయకసురరాజ్యంబు గలుగు
నటుగాక బ్రతికిన నతికీర్తి గలుగు, నిటు మగుడుఁడు పాఱ నేల మీ కనుచు
బుద్ధులు సెప్పుచుఁ బురికొల్పికొనుచు, గ్రద్దన మగుడించెఁ గపికోటినెల్ల
నాకపు లంగదునతులవాక్యములు, గైకొని యొప్ప నాకర్ణించి మించి
ప్రాణంబు లిత్తుము రామున కతని, ప్రాణంబుకన్న మా ప్రాణమే లనుచుఁ
గొండలు గొనితెచ్చి కోయని యార్చి, కొండఁబోలనదైత్యుఁ గొండల వైవ
శూలంబు గొని కడుఁ జూర్ణంబుచేసె, నాలోన రాక్షసుం డాపర్వతముల
వదలక యంతఁ బోవక రౌద్ర మెసఁగ, గద చేతఁగొని త్రిప్పి కడఁగి వ్రేయుటయుఁ
బదియేడుకోటు లేఁబదియేడులక్ష, లదనము పదివేలు నార్న్నాలుకపుల
హుంకారరవముల నుగ్రత మెఱసి, కింకతో నారణక్షితిమీఁదఁ గూల్చెఁ
జెలఁగి యంతటఁ బోక చేతులఁ గపుల, బలుపడి కబళించఁ బటురౌద్ర మెసఁగ
గరుడుండు వడి నురగంబుల మ్రింగు,కరణి నెంతయు భయంకరవృత్తి దోఁప
వీక్షించి యిరువదివేవురు కపుల, నక్షణంబున మఱి యార్న్నాలుకపుల
లక్షించి యెనిమిదిలక్షల కపుల, రాక్షసాధీశుండు రయమున మ్రింగె
మ్రింగి యంతటికంటె మిక్కుటం బగుచు, సంగరాంగణమునఁ జరియింపుచుండె
నరభోజనుండు వానరభోజనుండు, ధరణిపైఁ దానయై దర్పించుచుండ
ఘూర్ణిల్లుచును ముక్కుగోళ్ళందునోటఁ, గర్ణరంధ్రంబులఁ గపిసేనఁ వెడలె
నంత నాతనిగదాహతఁ బడ్డకోఁతు, లంతయుఁ దమమూర్ఛ లెల్లను దెలిసి
యార్పులతోఁ దరు లద్రులు దెచ్చి, దర్పించి నిలచిరి దానవునెదురఁ
గనలుచు ద్వివిదుండు గండశైలంబు, గొని యపుడసురపక్షోవిథిఁ బగుల
నడరింప నది దాఁకి యంతట మిట్టి, పడియె రాత్రించరబలములు జడియ
నప్పుడు హనుమంతుఁ డధికరోషమున, నిప్పులు రాలెడు నేత్రంబు లొప్ప
గిరిపాదపము లెత్తి గిఱికొని వైవ, నురువడి దైత్యుఁ డత్యుగ్రశూలమునఁ
దుమురుసేయుచును బెఁద్రోచి రామఱయు, సమరులు మెచ్చంగ నాంజనేయుండు
నసురపై వైచె మహాపర్వతంబు, నసమానబలుఁ డని యందఱుఁ బొగడ

దానిచే నాదైత్యుకేసువ్ర గంపించి, మేనెల్ల నెత్తురు మిక్కుటం బయ్యె
దాన నెంతయు నొచ్చి దానవేశ్వరుఁడు, మానక మెఱుఁగులు మంటలు గ్రమ్మ
భూతలం బగల నభోభాగ మద్రువ, భీతిల్లి నిర్జరబృందంబు దలఁకఁ
గరముగ్ర మైనట్టి ఘనతరశూల, మురువడిఁ బూని సముల్లాసి యగుచు
మడవక శక్తి కుమారుండు పేర్చి, వడిఁ గ్రౌంచగిరిమీఁద వైచినకరణి
హనుమంతుపై నెత్తి యతిరభసమున, వనచరుల్ బెదరంగ వైచె నయ్యసుర
నటు వైవ దాన నయ్యనిలజునురము, పటపటఁ బగుల నప్పావని యపుడు
ఉరుకోపరసమెల్ల నుమియుచందమున, దురములోఁ బడియె నెత్తురులు గ్రక్కుచుఁ
బ్రళయకాలమునాఁటి పటుమేఘరవము, బలువున నెంతయుఁ బరగ రోఁజుచును
గపులు గంపింప రాక్షసులు మోదింపఁ, గపిశేఖరుఁడు గూలెఁ గలలావు దూలి
యాలంబులో నప్పు డనిలజుపాటు, నీలుఁడు గనుఁగొని నెరయు గోపమునఁ
గైకొని వైచె రాక్షసులెల్ల బెదర, నాకుంభకర్ణు మహాపర్వతమున
వడితోడఁ బైఁబడ వచ్చుపర్వతము, బెడిదంబుగా వాఁడు పిడికిటఁ బొడిచెఁ
బొడిచిన నదియు నద్భుతముగాఁ జెదరి, యెడపక చిఱుమంట లెగసి నుగ్గయ్యె
సమరారిపై నప్పు డాగ్రహవ్యగ్రు, లమితబలోదగ్రులై మహాకపులు
చలమున ఋషభుండు శరభుండుఁ బేర్చి, కలుషత నలుఁడును గంధమాదనుఁడు
నగ్గవాక్షుండును నధికరోషంబు, లగ్గలింపఁగ నప్పు డడరి పెల్లార్చి
తరమిడి వానిపైఁ దరులు వైచియును, గిరులు వ్రేసియుఁ బిడికిళ్లఁ బొడ్చియును
బదములఁ దన్నియుఁ బటునఖప్రతతి, విదళించియును బహువిధముల నొంచి
యేచిన నన్నియు నింత గైకొనక, యేచి యద్దానవుం డెసఁగు రౌద్రమునఁ
బటుతరంబుగ నేలఁ బడి తన్నుకొనఁగఁ, జటులతఁ బిడికిట శరభునిఁ బొడిచె
నురువడి ఋషభుని నొడిసి రాఁ దిగిచి, కరములఁ గొని ముద్దగాఁ గబళించెఁ
గుదికిలఁబడి తన్నుకొని గుండె లవియఁ, గదిసి యన్నీలు మోఁకాళ్లు దాటించె
నసమున నిగుడు గవాక్షునిఁ గట్టి, యసురేశుఁ డఱచేత నదరంట నేసెఁ
గ్రమ్మిన తెగువమై గంధమాదనుని, బిమ్మిటిగొని వ్రేళ్లఁ బెడచేత వ్రేసె
రయమున రణరాగరసములు గ్రక్క, క్రియ నెత్తురులు గ్రక్కి కెడసిరి కపులు
శూలంబు ద్రిప్పి యార్చుచు నట్టహాస్యలోలుఁడై యాలంబులోఁ దిరుగుచును
వితతవజ్రాభీలవృత్రారిభంగి, నతులదండోద్దండయమునిచందమునఁ
గడుభయంకరవృత్తి గాఁగఁ బెల్లార్చి, ముడివడ నెమ్మొగంబున నిప్పు లురులఁ
బ్రళయకాలమునాఁటి పటుశూలరుచులఁ, దొలుకాడునాదిరుద్రుని తెఱంగునను
మెఱసెఁ బో మ్మనుమాట మిక్కిలిగాఁగ, నెఱవార నందఱ నిర్జించెఁగాన
నప్పుడు సుగ్రీవుఁ డని సేయ నాకు, నిప్పుడు తఱి యని యిచ్చఁ జింతించి
కులశైలపతిమీఁదఁ గోపించి వచ్చు, బలభేదుపగిది నప్రతిమసాహసుఁడు
పొరిఁబొరి సర్వాంగములు పెంచి పేర్చి, పరుషరోషానలప్రభ లుప్పతిల్ల
కొండలకెల్లను కొండయైనట్టి, కొండనా నొకపెద్దకొండ చేపట్టి

కోఁతులు నెత్తుటఁ గొమరొప్పఁ దోఁగి, మూతియుఁ దనువును ముదకఱ్ఱై తోఁచి
వీక్షింప నరుదైన వేషంబుతోడ, రాక్షసాధీశుపై రయమున వచ్చి
నన్నెఱుంగవె యేను నలినాప్తసుతుఁడ, సన్నుతుఁ డగు రామచంద్రునిబంట
నీకు నాకును గాక నిష్ఠురయుద్ధ, మీకపికోటుల నేల చంపెదవు
అని పేర్చి సుగ్రీవుఁ డాడువాక్యములు, విని కుంభకర్ణుండు విపులరోషమున
సుగ్రీవ కడు నిన్ను శూరుండ వందు, రాగ్రహింతురె శూరు లనివెలిగాఁగ
శూరత రణమునఁ జూపుదుఁగాక, యూరక వెడమాట లొప్పునే నీకు
నన రాక్షసునిమీఁద నర్కనందనుఁడు, కినిసి తాఁ దెచ్చిన గిరియెత్తి వైచె
వైచిన నది వానివక్షంబుఁ దాఁకి, చూచు నంతటిలోనఁ జూర్ణమై రాలె
నాబెట్టిదమునకు నార్చె నిర్వాఁకు, నాబల్లిదునిచేత నసుర స్రుక్కియును
దడయక యత్యంత ధైర్యంబుతోడఁ, గడుభయంకరవృత్తిగాఁగఁ బెల్లార్చి
దిగులొంది యగచరాధిపులగుండియలు, వగులంగ నిలువునఁ బ్రాణముల్ వోవ
జగతీతలము నాకసంబు దిక్కులును, నగల రాక్షసుఁ డట్టహాసంబు చేసి
హుంకారరవమున నుగ్రత మెఱయఁ, గింకిణీఘంటికాఘుంకారరవము
వాసికెక్కిన యిరువదివేలతలలఁ, జేసి గంధాక్షతార్చితమూర్తి నొప్పు
శూలంబు నిర్జరాసురులకు నైనఁ, దాలుప వ్రేఁగైనదాని నక్షణమె
సుగ్రీవుమీఁద వైచుటయును శూల, ముగ్రంపుమంటల నుజ్జ్వలం బగుచు
నేలయు నింగియు నిఖిలదిక్కులును, జాలంగ దరికొని సాగి మండుచును
బదివేలపిడుగులపగిది మ్రోయుచును, వదల కర్కజుమీఁద వచ్చుటఁ జూచి
ఘనవిషజ్వాలోరగప్రభుఁ గిట్టి, వినతాత్మజుఁడు ద్రుంచు వెరవుదీపింప
నెడసొచ్చి హనుమంతుఁ డేపార నొడిసి, కడుఁబెక్కువ్రయ్యలుగాఁ ద్రుంచివైచి
కుప్పించి దాఁటి యెక్కుఁడు పేర్మి నార్చె, నప్పుడు వానరు లందఱుఁ బొగడ
శూలంబు విఱుచుటఁ జూచి కోపించి, యాలోన వేగ నయ్యసురేశ్వరుండు
కనలుచు వచ్చి లంకామలయాద్రి, ఘనశృంగ మెత్తి యర్కజుమీఁద వైవ
నుగ్రమ్ముగా నది యురముఁ దాఁకుటయు, సుగ్రీవుఁ డపుడు రోఁజుచు నేలఁ బడియె

సుగ్రీవుఁడు కుంభకర్ణునిచే మూర్ఛనొందుట

నాతఁడు పడుటకు నఖిలరాక్షసులు, చేతోగతులయందుఁ జెలఁగి యార్వఁగను
గుంభకర్ణుం డతిక్రూరుఁడై వచ్చి, కుంభినిఁ బడియున్న గురుసత్త్వధనునిఁ
గనుఁగొని తలపోయఁ గపిబలంబునకు, నినకులేశ్వరునకు నీతండె లావు
ఈతఁడు పడుటచే నెల్లవానరులు, భూతలంబునఁ బడి పొలిసినయట్ల
సుగ్రీవు మాయన్న చూచుఁగా కనుచు, నుగ్రుఁడై కొనిపోయె నొనర లంకకును
గాలానిలము వచ్చి కాలమేఘమును, గూలించి గుహకును గొనిపోవుకరణి
నట సురావళియెల్ల నకట సుగ్రీవుఁ, డిటు పట్టుపడిపోవునే యని వగవ
నక్కుంభకర్ణునియలవుఁ జలంబు, దక్కక యందంద దనుజులు పొగడ
వెనుకొని రవిసుతు విడిపింపలేక, వనచరు లాహారవంబులు సేయ

శరభుండు ఋషభుండు జాంబవంతుండు, సురథుండు ధూమ్రుండు సోముఁడు హరియు
గిరిభేది సుతరుండు కేసరి పృథుఁడు, హరిరోముఁడును పావకాక్షుఁడు హరుఁడు
ద్వివిదుండు మైందుండు వేగవంతుండు, గవయుండు శతబలి గజుఁడు దుర్ధరుఁడు
సుముఖుండు తాలపాశుఁడు గవాక్షుండు, కుముదుఁడు జ్యోతిర్ముఖుఁడు సుషేణుండు
దధిముఖుఁడును వేగదర్శి రంభుండు, గ్రథనుండు ధూమ్రుండు గంధమాదనుఁడు
తారుండు క్రోధనశతపత్రజంఘు, ఘోరాక్షజంఘాలగోముఖవిముఖ
పనససన్నాద సంపాతీంద్రజాల, వినుత సుదంష్ట్రక శ్వేతదుర్ముఖులు
వీరాదిగాఁగల వీరవానరులు, దారుణాకారు లుదగ్రవిక్రములు
ధారణీధరములు తరువులుఁ గొనుచు, నారూఢభుజసత్త్వులై మింటి కెగసి
యట్టహాసంబుల నార్పుల దిక్కు-, లట్టిట్టుగాఁగ బ్రహ్మాండంబు వగుల
నినుతు విడిపింత మెల్లన ననుచు, దనుజునిపైఁబడఁ దమకించునపుడు
కరమెత్తి వలదని కరువలి సుతుఁడు, వరనీతిమతిగాన వారి కిట్లనియె
భానుతనూజుఁ డుద్భటఘోరవస్థ, దానిన మూర్ఛచే నున్నాఁడుగాని
యామూర్ఛఁ బాసిన నాత్మలోఁ దెలిసి, యామహాత్ముఁడు వచ్చునటుగాన మనము
విడుమని యసురచే విడిపించుకొన్నఁ, గడులాఘవంబునఁ గపికులేశ్వరుఁడు
మదిలోన నెప్పుడు మఱుగుచునుండు, నిది విచారము కాదు యించుక సైఁచుఁ
డటుచూడ నీలోన నతఁడు రాకున్నఁ, గుటిలంపురావణకుంభకర్ణులను
జటులవిక్రములైన సకలరాక్షసులఁ, బటుముష్టినిహతుల భగ్నంబుచేసి
హాటకదీప్తుల నలరెడు నేడు,కోటలు లంకయుఁ గూలఁగఁ దన్ని
ప్రళయంబు నొందించి భానుజుఁ గూడి, చలము కోపము మీఱఁ జనుదెంత మేలమి
నని యిట్లు హనుమంతుఁ డాడువాక్యముల, మనముల నలరి యామర్కటేశ్వరులు
వినువీథి నత్యంతవేగులై దనుజు, పెనఁగొనిపోవ నావిధ మెఱుంగకయ
అటఁ గుంభకర్ణుండు మర్కటుఁ గొనుచుఁ, బటురయంబునఁ జొచ్చి బలియుఁడై లంక
రాజమార్గంబుల రామేడలందు, రాజిల్లు నాగోపురంబులయందు

## సుగ్రీవుఁడు మూర్ఛదేరి కుంభకర్ణుని విరూపునిగాఁ జేయుట

నొప్పెడిపురకాంత లొగిఁ బుష్పవృష్టి, యప్పుడు కురియంగ మర్కటనందనుఁడు
దెలిసి యాపురవీథిఁ దెరగొని చూచి, వెలవెలనై కడు వెఱఁగంది కుంది
యిటు పట్టువడితినే యీదైత్యు చేత, బటుతరమూర్ఛచేఁ బడి యింతతడవు
అని కరములఁ బట్టి యాదైత్యుచెవులు, పెనచి తమ్మెలతోడఁ బెఱికిరాఁ దిగిచి
కోటములతో ముక్కు గోసి పోఁ గఱచి, పటుగతి మీఁదికి భానుజుం డెగయ
నిమ్ములఁ బోనీక నేచి రాక్షసుఁడు, క్రమ్మఱ నాతని కాళ్లొగిఁ బట్టి
నేలతో వేసిన నెగసి సుగ్రీవుఁ, డేలినపతికడ కేఁగె నయ్యెడను
సురలోకసంబునఁ జోద్యంబునొందఁ, దరుచరపతులెల్లఁ దనుఁ జూచి మ్రొక్క
వారును దానును వచ్చి సుగ్రీవుఁ, డారామచంద్రునియడుగుల కెరఁగ
నాలింగనముచేసె నంత రాఘవుఁడు, నాలోనఁ గపులెల్ల నానందమంది

రాయసురేశ్వరుం డటు ముక్కుఁజెవులు, వోయిన నెంతయు బుద్ధిలో రోసి
మును చెలియలి బన్నమునకు నై యాత్త, నెనసినసిగ్గులు నెగ్గొనరింప
వనజాక్షకులునితో వలవనివైరమున మగఁటిమితోడఁ బోరాడుచున్న
నాకారికడకు మానము గోలుపోయి, యీకష్టతనువుతో నేమని పోదుఁ
బోరికి నుచితంబు పోవుట యనుచు, నారక్తపూరంబు లందందఁ గ్రమ్మి
తనువులనిండ నుద్దండవర్తనుఁడు, ఘనతరరోషంబు గడలుకొనంగఁ
జేవురుచాయల నెలయేఱు లమరఁ, గావచ్చు నీలాద్రికైవడిఁ దోఁప
నటుగాక వీఁడు యుగాంతంబునాఁటి, చటులాగ్ని యన రణస్థలికి నేతెంచి
యతిముఱిఁ గోపించి యగచరసేనఁ, దఱిమి దానవుఁ డత్యుదగ్రుఁడై మెఱసి
కడు నుగ్రముగఁ గడకాళ్లఁ గిట్టి, వడిఁ ద్రిప్పి త్రిప్పి యుర్వర వ్రేసి వ్రేసి
బిఱబిఱఁ బ్రేవులు పిడికిటితోనఁ, బెఱికి రాఁ గొందఱఁ బిడికిళ్లఁ బొడిచి
నిబ్బరంబుగ దాచి నెరయు గుండియలు, ద్రొబ్బలు నురకంగఁ ద్రొక్కి పాదములఁ
బిసుగులఁబోలెడు పెడకేలు లెత్తి, కడు నుగ్రముగ మున్నుఁ గలువంగనేసి
తనమీఁదఁ బ్రాకిన తరుచరావళుల, నిక విస్మయంబుగా వేసి గ్రహించి
యగపడ్డ రాజసునైనను బట్టి, తిరిగి వేగమునఁ గుత్తికలోన వైచు
ఝుంకారరవముల శవములు సేయు, హుంకారరవముల నుసుగులు వెఱుకు
దివిజవిమానముల్ దిరుగుడుపడఁగఁ, దివిచి మర్కటులమీఁదికి నెత్తివైచు
నెగసినకపులతో నేటుదాఁకంగ, నగచరావళిఁ బట్టి యొందంద వైచు
నెమ్ములు నురుముగా నేపారఁ ద్రిప్పి, యిమ్ములఁ గొందఱ నెడగల్గ వైచుఁ
గొందఱ నిరుగేలఁ గుదియంగఁ బట్టి, యందంద నాటించి యల్లంత వైచు
నీవానరులఁ జూడుఁ డేప్పడ ననుచు, లావునఁ గొందఱ లంకలో వైచుఁ
బెంపార నిరుగట్టి పేర్చినకపుల, నంపుదమీ యని యబ్ధి మునుఁగంగ వైచు
నివ్విధంబున దానవేశ్వరుం డెలమి, నవ్వానరుల దిక్కులందెల్ల వైచు
మేదినియందును మిన్నులయందు, నేదిక్కులందును నెడములేకుండఁ
బడిజచ్చు కపులును బడిపోర్లు కపులు, బడిరొంత లిడుకపుల్ భ్రమనొందు కపులుఁ
బడి తన్నుకొనుకపుల్ వడి గోఁజూపుకపులు, పడియున్న కపులును బడియేడుకపులు
నై రణస్థలియెల్ల నగచరాక్రోశ, మారాజసుని చేత నగ్గలంబయ్యె
నాకుంభకర్ణుని యత్యుగ్రభీష,ణాకృతి కాలాంతకాకృతిగ్గైన
నణఁగె దారాపతి యణఁగె నంగదుఁడు, నణఁగె గవాక్షుఁ డున్నతిఁ దక్కె గజుఁడు
చలియించె ఋషభుండు శంకించె నలుఁడు, పెలుకురె నీలుండు బెగ్గిలె బృథుఁడు
వెఱఁగందె శరభుండు వెఱచె ధూమ్రుండు, నురుకంపమును బొందె నొగిఁ బనసుండు
కడుభీతి నొందెను గంధమాదనుఁడు, నడరి చూచుచునుండె ననిలనందనుఁడు
చూడ భయం బొందె జ్యోతిర్ముఖుండు, జాడ చేవోసిపాతె జాంబవంతుండు
ఉలికిరి వెండియు నున్న వానరులు, కలయ నంతటఁ గుంభకర్ణునిఁ జూచి
ఘనబాహుబలుఁడు లక్ష్మణుఁడు గోపించి, చనుమర నాటించి శరము లేడింటి

మఱియుఁ బెక్కింట లక్ష్మణదేవుఁ డేయఁ, గఱకురాక్షసుఁడు లక్ష్మణునిఁ గైకొనక
బలువిడిరాఁగ నాపాదమస్తకము, లలమి ప్రాకిరి కపు లాదైత్యు మేన
నలిగి మీసములు నుయ్యాల లూఁగుచును, కలుషతఁ దోఁకలఁ గలయఁ జుట్టుచును
నఱిముఱిఁ గవిసి యయ్యెసంధులందు, వఱలంగ లాగులు వైచి హత్తుచును
జిందఱవందఱ చేసిన నసుర, డెందంబులోని కడిందికోపమున
పటుసత్త్వులై తనపైనున్నకపులఁ, జటులమత్తేభంబు జాడించుకరణి
జలకేళిఁ దనిసిన సమదసూకరము, వెలయ బిందులు రాల విదిర్చినభంగిఁ
బ్రళయకాలమునాఁటి బ్రహ్మాండతలము, దులదుల చుక్కల దుల్చుకై వడిని
దనమీఁదఁ బ్రాఁకిన తరుచరావళులఁ, దనువు గదల్చి యద్ధరణిపైఁ గూల్చె
నప్పుడు విస్మితుండై కుంభకర్ణుఁ, దప్పకఁ గనుఁ గొని తనకన్నుగవల
నిప్పులు రాలంగ నిగిడి కోపమున, నప్పన్న గాధీశునాకృతి గలిగి
కర మొప్ప కాంచనకార్ముకం బెత్తి, నిరుపమబాణతూణీరము ల్బిగిచి
భీమవిక్రమకళాభేద్యుడై కనలి, రాముండు నడుచు సంరంభంబుఁ జూచి
సమరమహారంభచతురు లొండొండఁ, దమకంబు నిండ నుద్దండవర్తనులు
పరుషాద్రిపాషాణపాదపావళులు, ధరియించి యుగ్రులై తరుచరాధిపులు
నొగి సప్తపాతాళములును భేదిల్ల, నొగిఁ గూర్మ మగలఁగ నుదధులు గలఁగ
దిగిభంబు లడరంగ దివి తల్లడిల్ల, నగచరాధీశుల కతిధైర్య మొదవ
నదిమి కుప్పించి మిన్నగలఁ బెల్లెగసి, యుదితవిక్రములు మహోగ్రభీకరులు
సురసిద్ధసాధ్యులు సొరిదిఁ గీర్తింపఁ, గరమర్థి నడువ రాక్షసుఁ డెదురేఁగె
నాపతి ముందట నావిభీషణుఁడు, కోపంబుతో గదఁ గొని శౌర్యమునను
గడువేగమునఁ గుంభకర్ణునిమ్రోలఁ, బుడమి చలింప నప్పుడు వచ్చి నిలిచె
నావిభీషణుఁ జూచి యనియె నవ్వుచును, రావణుతమ్ము డ రాక్షసేశ్వరుఁడ
విను విభీషణ నీదు విక్రమంబునకు, ననువైనతఱి యిది యధిపతియొద్ద
నిన్నరనాథునిహృదయంబె పట్టు, మన్నదమ్ములపాడి యని మ్రొక్కవలదు
పూని యెన్నఁడు నిన్నుఁ బొంద వాపదలు, భానువంశ్యునికృపఁ బడసితిగాక
నారాముదయగల దటుమీఁద నీవు, సారదయోనయశ్లాఘ్యచిత్తుఁడవు
లంక సద్గుణగణాలంకృతి నేల, నింక నెవ్వరు గల రిట నీవె కాక
సాహసబలమహోత్సాహంబు మిగిలి, యాహవంబున వేగ మడరి నాయెదుట
మగతనంబును బాడి మనసునఁ దలఁచి, తగ నీవు నాతోడఁ దాకు మటంచుఁ
బలికితిగాని యీపట్టున నిలువ, వల దొక్కఁడైనను వలయు వంశమున
ననిన విభీషణుం డన్నతో ననియె, దనుజకులంబెల్ల దగ్ధమైపోవు

విభీషణుఁడు కుంభకర్ణునికి నీతిఁ జెప్పుట

ననుభయంబున మనయన్నతోఁ దెలియ, ఘనమైన నీతిప్రకారంబులెల్లఁ
జెప్పితి నేను నేర్చినయంతవట్టు, చెప్పిన నామాటఁ జేకొనఁడయ్యె
నటుఁగాన నన్నును నన్నను బాసి, యిటు వచ్చి శ్రీరాము నేఁ బొడగంటి

నని చెప్పుచును దనయంతరంగమున, దను జేశునవినీతిఁ దలపోసి పోసి
కన్నీరు దొరఁగంగఁ గడుదుఃఖమంది, యన్నఁ జూడఁగలేక యన్నలఁ దొలఁగె
నారాఘవేశ్వరుఁ డనుజన్మయుక్తుఁ, డై రణోద్యోగుఁడై హరులతోఁ గూడ
ఘనరౌద్రరసమురాక్షసరూపుఁ దాల్చి, యనికి నేతెంచెనో యనఁదగువానిఁ
జారుకోటీరభూషణములవాని, వీరరసావేశవేషంబువాని
ధీరుఁడై కపులను దెగఁజూచువానిఁ, దోరంపునెత్తుటఁ దోఁగినవాని
కనుఁగొని మదిలోనఁ గడువెఱఁగంది, మనుకులోత్తముఁడు రామక్షితీశ్వరుఁడు
నారికై పుట్టిన నాకోప మెల్ల, నారిచేఁ జూపెద నాకారి కనుచు
నార్చుచువచ్చు నయ్యసురుకోపాగ్ని, నార్చెదశరవృష్టి నని బిట్టుఁ గవిసి
కరియాన నిజధర్మగతిఁ జెందు ననెడు, కరణి దిక్కరులు ఘీంకారములేయ
నింక నీఱుగఁ జేయు నీరామునలుక, లంకేశు నసుమాడ్కి లంక ఘూర్ణిల్ల
నెరయంగ జగములన్నియుఁ జెవుడ్పడఁగ, గురులేనిరవముగా గుణము మ్రోయించె
నాగుణధ్వని విని యలుకమై నెదురుగా గర్వమునఁ గుంభకర్ణుండు రాఁగ
మానైన దర్పంపుమాట లింపార, వానితో ననియె నావనజాప్తకులుఁడు
ఏరాక్షస నీకు నెదురంగ రాదు, ధీరుఁడవై యింకఁ దెగువ వాటించి
యమరులు మెచ్చంగ నమరి నాయెదుట, సమరంబు సేయంగఁ జక్కఁగా నిలువు
మటుగాక కపటుండవై మాయఁబన్నిఁ, యెటుపోయినను నిన్ను నేల పోనిత్తుఁ
గావవే యని పోయి కమలజుఁగన్నఁ, గావ నాబ్రహ్మలోకము నాకు నెదురె
కావవే యని పోయి కఱకంఠుఁగన్నఁ, గావ నారుద్రలోకము నాకు నెదురె
కావవే యని పేర్చి కమలాక్షుఁగన్నఁ, గావ నావిష్ణులోకము నాకు నెదురె
యని పేర్చిపలికిన నారాముపలుకు, విని కుంభకర్ణుండు విపులంబుగాఁగ
దిగులొంది యగచరాధిపులగుండియలు, వగిలి నిల్వులతోడ బ్రాణములోవ
జగతీతలము నాకసము దిక్కులెల్ల, నగల రాక్షసుఁ డట్టహాసంబుచేసి
సలువొంద నారామనరనాథుఁ జూచి, పలికె నుద్భటరణప్రౌఢి దీపింప
వెడఁగుమాయల వన్నె వెఱచి నీచేత, మడియంగ నేఁ గల్ల మారీచి గాను
రయమున నీచేత రఘురామచంద్ర, భయమునఁ జావఁ గబంధుండఁ గాను
క్రమమొప్ప నీశరఘట్టనచేత, రమణమైఁ గూల విరాధుండఁ గాను
అనిమొన నొకకోల నవనిపైఁ గూల, నినకులాధీశ్వర యే వాలిఁ గాను
చేతివిల్లిచ్చి నీచే భంగమొందఁ, బూతాత్ముఁ డగుఋషిపుత్రుండఁ గాను
రావణుతమ్ముఁడ రాక్షసేశ్వరుఁడ, దేవకంటకుఁడను దీప్తవిక్రముఁడ
నన్నెఱుంగవె రామ నగచరకోటి, క్రొన్నెత్తురానిన కుంభకర్ణుఁడను
యెఱుఁగక బ్రహ్మాయు నింద్రుండు నిన్నుఁ, గఱపిన బేలవై గర్వించి పుట్టి
యీతరుచరు నమ్మి యినకులేశ్వరుఁడ, నాతోడి యుద్ధంబునకు వచ్చితీవు
ఘనమైన పరుషరాక్షసభాషణములు, సనకాదియోగీంద్రసన్నుతుల్ గావు
ఉరవడిఁ బఱతెంచు నుగ్రదానవులు, పరిచారికామరప్రతతులుగావు

చలమున నార్చు రాక్షసభటోత్తములు, నలిఁబాడు తుంబురునారదుల్ గారు
వ్రాలుచు నీమీఁద వచ్చునాగాలి, యాలకోట్లంబుల యనిలంబు గాదు
యుద్ధరంగం బమృతోదధిగాదు, యుద్ధంబు మఱి కొలువుండుట గాదు
ఇట్టేల పుట్టితి వియ్యాజిలోన, నిట్టిసౌఖ్యంబు నీకవనీశ కలదె
యరి చెప్పనేల నిన్న నియెడి దేమి, యిదెచూడు నాగద యెట్టిదో రామ
దీనఁబో గెలిచితి దేవసంఘముల, దీనికి సాటియె దివ్యాయుధములు
బలమును శౌర్యంబు బాహువిక్రమము, గలదేని ఘోరాజిగదియుము నన్ను
నెఱయ నీయందలి నిజశక్తిఁ జూచి, మఱి నిన్నుఁ జంపెద మానవాధీశ

శ్రీరామునిచే గుంభకర్ణుఁడు గూలుట

యనుటయు రఘురాముఁ డలిగి వేగమున, ఘనశిలాముఖములు గడుఁబెక్కువేలు
నావాలి నేసినయట్టిబాణంబు, దేవకంటకుమీఁద దివిరి యేయుటయు
జలబిందువులు గ్రోలు చాతకం బనఁగ, బలువిడి నాబాణపంక్తులు గ్రోలి
కరముగ్రమైన ముద్గరము ద్రిప్పుచును, బరువడి వానరపతులఁ దోలుచును
నెదురుగాఁ జనుదెంచు నింద్రారిఁ జూచి, మది లెక్కసేయక మానవేశ్వరుఁడు
కవిసి యుద్భటగదాకలితహస్తంబు, నవలీలఁ దెగనేసె ననిలబాణమున
దానిపాటునకుఁ గొందఱు తరుచరులు, నానావిధంబుల నలుదెసఁ బాఱ
నదిమీఱి పాఱంగ నలవిగాకున్నఁ, జెదిసి వానరులు చచ్చిరి దానిక్రింద
నున్నదాపలిచేత నొకపెద్దవృక్ష, మున్నరభోజనుం డవలీలఁ బెఱికి
యింద్రాదు లడరంగ నేతేర రాముఁ, డైంద్రబాణంబున నదియును ద్రుంప
నాఘోరతరబాహువలమరు లుప్పొంగ, భూభాగ మగల నద్భుతముగాఁ దునిసి
పెక్కండ్రు కపులు నిర్భిన్నులై క్రింద, నొక్కటఁబడి కూల నుర్విపైఁ బడియె
నిటు రెండుభుజముల నినకులేశ్వరుఁడు, పటుబాణములఁ ద్రుంప బలభేదిచేతఁ
గడిమి వజ్రమున ఱెక్కలు ద్రుంపఁబడిన, నడగొండయునుబోలె నలినార్చి యార్చి
చేతులు ముక్కును జెవులును లేక, యాతతంబున వికృతాకారుఁ డగుచు
నరుదెంచుచున్న యాకుంభకర్ణు, నురవడిఁ గనుఁగొని యుర్వీశ్వరుండు
దురమున నీకష్టుఁ ద్రుంతు నే ననుచు, సరభసంబున నర్ధచంద్రబాణములు
దెగ నిండి రెండు సంధించె ఖండించె, జగములు మెచ్చఁ బచ్చరణయుగంబు
పదములు దెగియును బాహువు ల్దెగియు, గుదియక యత్యుగ్రకోపుఁడై నడిచి
బడబాగ్నిచక్రంబుపగిది నాననము, కడువికృతంబుగాఁ గావించుకొనుచు
బలువిడి భాస్కరుఁ బట్టెడు రాహు, వలవాటుగైకొని యారాము గదిసెఁ
గదిసిన నాకుంభకర్ణునినోటఁ, బొదిగొన్న నిష్ఠుర భూరిబాణములు
ఇనకులేశ్వరుఁ డేయ నేర్పడ నొక్క, దొనకోల లోకదొవ దూరినకరణి
ఘనమైన యాయంపగమి నోరునిండ, దనుజుఁడు సింహనాదము సేయరాక
యేపారువికృతపుటెలుఁగుహుంకృతులు, చూపులజంకెలు సూపుచువచ్చె
వచ్చిన యాదైత్యవల్లభుమేన, నచ్చుగాఁ దృష్టించి యైంద్రాస్త్ర మేసె

బ్రదర మప్పుడు రఘుపతి యేయుటయును, నదియును సుధ్యంపనార్క చందమునఁ
దలపోయ నాబ్రహ్మదండంబుపగిది, పలఁతియై నిగుడుచుఁ బవనునికరణి
నెఱయ లోకములెల్ల నిండ నొండొండ, నెఱమంట లొలుకుచు నేపుతో వచ్చి
కుంభకర్ణునిఱొమ్ము గొని యుచ్చిపాఱె, కుంభిని నాలు దిక్కులు మ్రోయుచుండ
నంతలో మఱియును నారాఘవేంద్రుఁ, డంతకబాణ మత్యంతవేగమున
సంధించి యేసిన సకలదిక్కులును, బంధురంబుగ మ్రోయ బ్రహ్మాండ మవియఁ
బ్రకటంబుగా భూమి పటపట పగుల, సకలభూతంబులు చైతన్య మెడలఁ
గలయంగ శతకోటిశాలచక్రములు, బలువెక్కి యొక్కటై పఱతెంచుభంగి
వ్రాలినబడబాగ్ని వడివచ్చుకరణిఁ, గాలకూటంబు మూర్తమైనపగిది
విచ్చలవిడిఁ బర్వి వేగంబు మెఱసి, వచ్చి యాబాణంబు వడిఁ ద్రుంచి వైచెఁ
బటునీలగిరిశృంగభాతితో నున్న, కుటిలరాక్షసుతల ఘోరంబు గాఁగఁ
బుడమిపై నాదైత్యపుంగవుశిరము, పడునప్డు లంకలోపల వడిఁ బడియెఁ
బొడవైన గోపురంబులును మేడలును, బొడిపొడియయి రాలి పుడమిలోఁ గలయఁ
బడిపోటు లగచరపతులోలి మ్రగ్గ, నుదధిలో జలచరయూథముల్ బెదర
వసుధపై సగమును వనధిలో సగము, నసురదేహముగూలె నద్భుతం బడర
నారవంబున నద్రు లన్నియుఁ గలగె, ధారుణి వణఁకె దిక్తటములు వగిలె
లంకాధినాథు నుల్లము వ్రయ్యలయ్యె, లంకలోనెల్ల కోలాహలం బయ్యె
జగములు మోదించె సంతోషవార్ధి, నగచరాధిపు లోలలాడి రందంద
రవికులాధీశ్వరు రఘురామచంద్రు, వివిధభంగుల సురల్ వినుతించి రప్పుడు
ఘనుఁడు రాముఁడు కుంభకర్ణునిఁ జూచి, తనలోనఁ జెలువవ్వ దళుకొత్తుచుండ
దేవసంఘములకు దిక్పాలకులకు, భావింప నెక్కుడౌ పడిన గాత్రుఁడు
ఇంక లోకములకు నెన్నండు నొండు, శంక లేదని మది సంతోషమందె
నప్పుడు కరమర్థి సాహవలక్ష్మి, సువ్వాంగి కైకొని యుజ్జ్వలుం డయ్యెఁ
గడు నుగ్రరాహువుఁ గబళించి పిదప, విడిచిన వెలుఁగొందు విమలార్కుఁ డనఁగఁ
దదనంతరంబ యాదానవకోటి, మదిలోన నెవ్వగ మల్లడిగొనఁగ
విన్ననై వదనము ల్వెలవెలఁ బాఱ, నున్న రావణుఁ గాన నురవడిఁ బాఱె
దేవ సీతమ్ముండు త్రిదశాంతకుండు, వారిరి నగచరావళినెల్లఁ దోలి
దెసలు భూభాగంబు దివియు దా నగుచు, నసమసాహసబలాహవకేళి వ్రాలి
నెలకొని దుగ్ధాంబునిధి మందరాద్రి, గలచియాడెడు క్రియఁ గపికులాంభోధి
నిక్కడక్కడఁ జేసి యింద్రాదులెల్ల, వెక్కసపడఁ బోరి వివశుఁడై తూలి
యంత శ్రీరాముని యధికబాణాగ్ని, నెంతయు దగ్ధుఁడై యిలమీఁదఁ ద్రెళ్ళె
నని కుంభకర్ణుఁ డయ్యనిలోనఁ బడుట, దనుజులు చెప్ప నాదానవేశ్వరుఁడు
తనపాటు నింకఁ దథ్యం బన్నకరణిఁ, గొనకొన్న బలుమూర్ఛఁ గుంభినిఁ బడియె
నతికాయుఁ డధికశోకాయత్తుఁ డయ్యె, ధృతిదూలి శోకించె దేవాంతకుండు
దిక్కుదప్పినమాడ్కిఁ ద్రిశిరుండు వడియెఁ, దక్కక యానరాంతకుఁడు మ్రాన్పడియె

దనుజవీరులు మహోదరమహాపార్శ్వు,లును మహాలోకవిలుంఠితు లైరి

### రావణుండు కుంభకర్ణునిమరణమునకు శోకించుట

బలుమూర్ఛ నంతటఁ బాసి రావణుఁడు, పలుమాఱుఁ దమ్మునిఁ బలవింపఁ దొడఁగె
వడిఁ దేర్చు రాఘవవైరాంబురాశి, నెడపక యేనింక నే తెప్ప గడతు
రామలక్ష్మణులను రణములోఁ జంపు దేమెయి నీవని యేయున్న చోటఁ
జటులరాఘవమహాశరవహ్నిశిఖల, నిటు నేలఁ గూలితి వేకాంగవీర
నిద్రారతుండవు నేఁడిట్లు దీర్ఘ, నిద్ర కైకొంటె నిర్నిద్రవిక్రముఁడ
కులిశధారకునైనఁ గూలని మేను, యిల నరునేటున నిటుఁ గూలవలసె
నంతకునకు నీవ యఖిలంబు నెఱుఁగ, నంతకుం డన నుంటి వారూఢశక్తి
నంతటి నీకు నీ యవనిలో నిప్పు, డంతకుం డయ్యెనే యకట! రాఘవుఁడు
నిద్ర మేల్కని నీవు నిష్ఠురవృత్తి, రుద్రుఁడవై తమ్ము రూపడం తనుచు
నద్రివిద్రావణుం డాదిగా సురలు, నిద్రఁబో రెన్నఁడు నెరసినభీతి
నీవాఁడఁ ద్రుంగుట నిర్జరు లింక, నేవిధంబున నన్ను నేల కైకొంద్రు
కులమెల్ల రక్షించుకొనుటకు నాతోడఁ, జలమునఁ బలుమాఱు సద్బుద్ధి చెప్ప
వినక విభీషణు వెసఁ దన్ని వెడల, చనుమన్న పాపంబు సైఁచునే నన్నుఁ
గడుకొని నీ వాదిగా బుద్ధిమంతు, లుడుగక చెప్పిన యుచితోక్తులెల్ల
నెమ్మితో విననైతి నిన్నుఁ గోల్పడితి, నమ్మినజయలక్ష్మి నాకేల కలుగు
బలిమిమై నావలపలిమూఁపుభంగిఁ, గలహరంగంబునఁ గడిమి వాటించి
పటుబాహుబల మేది పడితి వీవాజి, నిటమీఁద దిక్కునా కెవ్వరు గలరు
అని కుంభకర్ణుని యందందఁ దలఁచి, వనట నిట్టూర్పులు వడిఁ బుచ్చి పుచ్చి
పరితాప మనియెడి బడబాగ్ని గలిగి, పెరిగెడిలాలయర్ణ ఫేనంబు గలిగి
వెతలు కన్నీరను వెల్లువ గలిగి, కడలేనివగ పను కరుడులు గలిగి
ప్రకటరోదనమను రావంబు గలిగి, చకితత్వ మనియెడి చలనంబు గలిగి
మునుకొని శోకసముద్రుఁడై పెద్ద, వెనుఁబడి యెంతయు వికలుఁడై యున్న
యారావణునిఁ జూచి యప్పు డొక్కింత, ధీరత వాటించి త్రిశిరుండు వలికెఁ
బదిలంబు దప్పి యిబ్భంగి శోకించె, దిది యేమి దేవ నీ వితరులమాడ్కి
వనజాసనునిచేత వరమును గొన్న, ఘనశక్తి నీయందుఁ గలిగియుండఁగను
అవిరళమంత్రపూతాస్త్రము ల్వజ్ర,కవచంబు నీయందుఁ గలిగియుండఁగను
ఉరుతరగతిగల యుజ్జ్వలరథముఁ, గర మొప్ప నీకును గలిగియుండఁగను
శోకింతురే నన్నుఁ జూడు మొక్కింత, నీకెదు రెవ్వరు నిర్జరవైరి
వేవేగ యవలీల వెడలి రాఘవుని, నీవిక్రమంబున నేలపైఁ గూల్పు
మిట శోక ముడుగు నీవింతయు చాలు, నట నేను బోయి మహాజిరంగమున
నతులవిక్రమకళాహంకారవృత్తి, నతిశూరుఁ డితఁ డన నంతటఁ బేర్చి
గరుడుండు పాములఖండించుమాడ్కిఁ, దరుచరావళినెల్ల ధరణిఁ గూల్చెదను
సురపతి వృత్రుని స్రుక్కించుభంగి, హరుఁ డంధకాసురు నణఁగించుపగిది

రామునిఁ ద్రుంచెద రణములో నిప్పు, డీమెయిఁ బోయెద నేలమి నన్నుపు
మనిన రావణుతోడ నప్పుడు కడఁగి, ఘనబాహుబలుఁ డతికాయుండు పలికె
యింత శోకింపంగ నేటికి నీకుఁ, బంతంబుతో దైత్యబలములఁ గూడి
యేనుబోయెద నంపు మిటఁ జిత్రముగను, గాననంబులు గాల్చు కార్చిచ్చుపగిది
విపులబాణంబుల విశదంబుగాఁగఁ, గపులతో రామలక్ష్మణులఁ జంపెదను
అని పల్కునపుడు నరాంతకుఁ గూడి, యనుపమబలుఁడు దేవాంతకుఁ డనియె
నేమిద్దఱముఁబోయి యీక్షణంబునను, రామలక్ష్మణుల మర్కటులఁ ద్రుంచెదము
అనిన మాటలకు దైత్యాధీశ్వరుండు, దనశోక ముడిగి మోదంబున నుండి
తనయులతోఁగూడి తద్దయు నొప్పె, ననిమిషగణయుక్తుఁ డగునింద్రుమాడ్కి
నవ్విధంబుననుండి యారావణుండు, నవ్వుచుఁ గొడుకుల నలువురఁ జూచి
రామలక్ష్మణుల మర్కటసైన్యములను, భీమాస్త్రములఁ జంపి పేర్చిరం డనుచుఁ
దనతమ్ము లగుమహోదరమహాపార్శ్వులను వీడుకొలిపె సాలము సేయఁ డనుచు
మాకతంబునను నీమనుజాశనుండు, చెకొని సీతకై శ్రీరాముఁ డోడరె
నని యరిషడ్వర్గమా రావణునకు, మునుమున్నె రాము నిమ్ముల దాఁకఁబోవు
పగిది నాయార్వురు బ్రహ్మాండభాండ, మగలంగ నార్చుచు నని కేఁగునపుడు

## అతికాయమహోదరులు మొదలగువీరులు యుద్ధమునకు వెడలుట

భూరిశారదఘనస్ఫురణంబు గలిగి, యైరావతేభంబు నంశంబు గలిగి
తనరారుచున్న సుదర్శనేభంబు, నినుఁ డస్తశిఖరిపై నెక్కినకరణి
నెక్కి మహోదరుఁ డేపారి నడిచెఁ, దక్కక నిశితాయుధంబులు వెలుఁగఁ
బటుజవసత్త్వప్రభావము ల్గలిగి, చటులంబులైన యశ్వంబులఁ బూన్చి
యొసఁగు చాపంబును నింద్రచాపంబు, పసమీఱి సూర్యునిభంగి వెలుంగ
నగదంబుమీఁద నీలాభ్రంబపోలెఁ, దిరమైన వేడ్కతోఁ ద్రిశిరుండు వెడలె
వితతధనుర్వేదవిద్యాధుర్యుఁడైన, యతికాయుఁడును నప్పు డధిక తేజమున
శరచాపఖడ్గాదిశస్త్రాస్త్రసమితిఁ, గరమొప్పి సూర్యప్రకాశమై వెలుఁగఁ
దనరారు కనకరథం బెక్కి వెడలె, ఘనభూషణద్యుతిఁ గనకాద్రియగుచు
సురవరఘోటకస్ఫురణఁ జెన్నొంది, యురుభూషణప్రభ నుజ్జ్వలంబైన
యవదాతహయము నరాంతకుఁ డెక్కెఁ, బ్రవిమలతేజోవిభాసితుం డగుచు
శక్తియుద్భటబాహుశక్తిమైఁ దాల్చి, శక్తిపాణియుఁ బోలె సన్నుతి కెక్కి
దీపితగదఁ దాల్చి దేవాంతకుండు, రూపింప విష్ణునిరూపున నడిచె
గురుగదాపాణియై గుహ్యకేశ్వరుని, యరుదైనకడిమి మహాపార్శ్వుఁ డొప్పెఁ
గాలచక్రంబులగతి నుజ్జ్వలంబు, లై లీలఁ బెక్కైన యరదముల్ వెడలెఁ
గొండలవడువునఁ గోటానకోట్లు, గండుమీఱిన మదగర్వముల్ గలిగి
దండిమై వెడలె నుద్దండత హస్తదండంబు లొప్ప వేదండసంఘములు
హేషారవంబుల నెల్లదిక్కులను, ఘోషింపఁజేయుచు గుఱ్ఱము ల్వెడలెఁ
గాలకింకరసమాకారంబు లమరఁ, గాలుబలంబు లుగ్రత నేఁచి వెడలెఁ

జతురంగబలము లీచందంబు నొంచి, యతులితం బగుటయు నప్పుడు నడుమఁ
బ్రళయకాలార్కులభంగి నెంతయును, వెలుఁగొంది రా దైత్యవీరు లార్వురును
అతిశుభ్ర మగు శరదభ్రంబు లొప్ప, గతివార పుండరీకంబు లొప్పారెఁ
గడిమిమై గెలుతుము కాదేనిఁ జత్తు, ముడుగ మెబ్బంగి రణోత్సాహ మనుచు
నడచిరి కలనికి నానావిధముల, నెడపక పంతంబు లిచ్చును వారు
అప్పు డొండొరువులయాహ్వానములను, జెప్పఁ జోద్యం బైనసింహనాదముల
రథఘోషములను దురంగహేషలను, బృథులదంతావళబృంహితంబులను
గరము గ్ర మగుపదఘట్టనధ్వనుల, నిరుపమధ్వజకింకిణీనిస్వనములఁ
బటహభేరీశంఖభయదనాదములఁ, బటుతరనిస్సాణభాంకారములను
దిక్కులు ఘూర్ణిల్లె దివి పెల్లగిల్లెఁ, జుక్కలు డుల్లె వాసుకి యొడ్డగిల్లె
మేరువు గంపించె మేదిని వణఁకె, భారమోర్వక దిగిభములు చలించె
నటు దానవానీక మాకోట వెడలఁ, బటుభయంకరవృత్తిఁ బ్లవగవల్లభులు
భూనభోంతరము లాస్ఫోటనధ్వనులఁ, బూని యొక్కట నిండ భూరిసత్త్వములఁ
దలకొని గిరులును దరువులు వైచి, చెలగించి రప్పుడు సింహనాదములఁ
జలమున దైత్యులు చటులబాణములు, బలువిడి గురిసిరి ప్లవగులమీఁద
నసురావళికిమున్న యాకపివరులు, నసురులఁ జంపంగ నడరి పెల్లార్చి
కపులకు మున్న రాక్షసు లుగ్రవృత్తిఁ, గపులఁ జంపెదమని కడక వాటించి
యసమునఁ జలము పెంపార నొండొరుల, వసుమతిపైఁ బడవైతురు కినిసి
యసురులచేతిశస్త్రాస్త్రంబు లూడిసి, వెసఁ బుచ్చి పెళ్లున విఱుతురు కపులు
కపికోటిచేతివృక్షంబులు గిరులు, కుపితులై విఱుతురు క్రూరదానవులు
కపులకాళ్లనుబట్టి కదిసి రాక్షసులు, కపులతోడనె మహోగ్రతను వ్రేయుదురు
అసురులకడకాళ్లు నలమి వానరులు, నసురులతోడనే యడఁతురు బట్టు
అటుపోర జర్జరితాంగులై నేలఁ, గుటిలదైత్యులుఁ గపికోటులుఁ ద్రెళ్లి [టన
దురములోఁ బడియు నెత్తురులు గ్రక్కుచును, బోరఁ బోరి మూర్ఛలఁ బొంది యంఁ
దెలిసి వానరులును దేవశాత్రవులు, కలిసి కయ్యము సేయఁగా నందుఁ గపులు
దానవుతో నెత్తి దానవు వ్రేసి, యేనుఁగుతో నెత్తి యేనుఁగు నేసి
తురగంబుతో నెత్తి తురగంబు నేసి, యరదంబుఁగొని కరి నడరంట నేసి
కరి నెత్తుకొని తురంగముఁ బడవైచి, తురగంబు నెత్తి దైత్యుని డొల్ల నేసి
యురుసత్త్వధీరులై యుగ్రతనార్చి, తరుచరవీరులు దర్పంబు మఱసి
పోరఁబోరి నిబ్బంగిఁ బోరిపుచ్చుటయును, సురరిపుల్గొందఱు స్రుక్కుటఁ జూచి
రయమునఁ గోపంబు రంజిల్లదైత్య,చయమును వానరసమితిపైఁ గదిసి
ప్రదరంబు లేసి చక్రంబుల నేసి, గదల నొప్పించి ఖడ్గంబుల ద్రుంచి
భిండివాలంబులఁ బీచంబు లణఁచి, ఖండించి సురియల గండలు బరులు
కుంతశూలంబుల గ్రుచ్చివానరుల, సంత లింతలు చేసి యొసఁగి యార్పుటయు
నంతటఁ బోవక యగచరు లార్చి, యంతంత కడరి దైత్యావళిఁ బట్టి

తరుషండములఁ బర్వతప్రకరముల, సురవడినెత్తి యత్యుగ్రతవైవఁ
బడియెడిదైత్యులు పాఱుదైత్యులును, సుడుగక యందంద నొఱలు దైత్యులును
గలయంగ నెత్తురు గ్రక్కుదైత్యులును, బొలుపఱి నేలపైఁ బొరలు దైత్యులును
అందంద నట్టలై యాడుదైత్యులును, మ్రందిప్రత్యర్థుల మఱచు దైత్యులును
నెక్కొనరోతుల నిటునటుఁ బడఁగ, లెక్కసేయక కరాళించుగుఱ్ఱములు
పక్కెర లూడంగఁ బఱచుగుఱ్ఱములు, దిక్కులు సుడివడఁ దిరుగు గుఱ్ఱములు
కీలెడలినక్రియఁ గెడయు గుఱ్ఱములు; కూలి కాళ్లను దన్నుకొనెడు గుఱ్ఱములు
వికలంబులై పోరు విచ్చుగుఱ్ఱములు, నొకరూపు నేర్పడ కుందుగుఱ్ఱములు
కరములు దునిసినఁ గంపించుకరులు, వెరవారఁ గొమ్ములు విఱిగినకరులు
మరలి లంకకు వెస మగిడెడికరులు, తిరమేది దిర్దిరఁ దిరిగెడుకరులు
కొండకైవడి వడిఁ గూలెడికరులు, ఖండతుండంబులై కలఁగెడికరులు
రథికసారథిరథ్యరహితరథములు, ప్రథితంబుగా భువిఁ బడురథంబులును
కీళ్లుఁ దప్పి మ్రగ్గినరథంబులును, త్రాళ్లుఁ ద్రెళ్లి పొందనిరథంబులును
చాలంగ నుగ్గునూచగురథంబులును, నాలంబులోఁ దఱు చగుటయుఁ జూచి
సురఖేచరాదికస్తోమంబు చోద్యతర మని యాత్మలోఁ దద్దయు మెచ్చ
నప్పుడు కినిసి నరాంతకుం డార్చు, లొప్ప నిజాస్యంబు నుఱవడిఁ బఱపి
యసురుల నోడకుం డనుచు వానరుల, నసమునఁ గిట్టి బెట్టుగలించి తాఁకి
నెలకొని యొక్కొక్క నిమిషంబులోన, నిలఁగూల్చె నేడు నూతేసి వానరుల
సురపతిశౌర్యంబు సొంపారుచుండ, గిరులవ్రేయుచును నేఁగినత్రోవ యొప్పె
దరుచరకోటులుఁ దఱచుగాఁ బడుట, నిరవొంద వాఁడు పోయినత్రోవ వోలెఁ
నేవానరుండైన నేచి కోపమున, భావంబులోఁ దన్నుఁ బరిమార్పఁ దలఁచు
నంతరంగముఁ జొచ్చి యరయుచందమున, నంతకుమున్న తా నతని నుక్కణఁచు
నేకపియైనఁ దన్నెదురంగఁ దలఁచి, భీకరుండై గిరిఁ బెరుకంగఁ జూచు
నంతకుమున్న తా నధికరౌద్రమున, నంతెంత డగ్గఱి యతని రూపణఁచు
నేబలీముఖుడైన నేపగ్గలించి, తాఁ బెట్టుగాఁగఁ బాదపమెత్తఁ దలఁచు
నంతకంతకు హెచ్చి యతిభీషణముగ, నంతకుమున్నె తా నతని గీటణఁచు
నంతటఁ బోవక హయముపైఁ బఱపి, యంతంత పెనుగుంపులైనవానరుల
ప్రేవులు ద్రొబ్బలు పెల్లుగా నురుము, గా వివిధములైన గతులఁ ద్రొక్కించు
గుండెలు పగులంగ గోలెమ్ములగల, నొండొండఁ దాఁకించి యుర్వరఁగూల్చు
నలుకతోఁ బ్రళయకాలానలుపగిదిఁ, దలకొని యిందును దానయై నిండి
వానరవరసైన్యవనములు విఱుగ, మానక యుగ్రతఁ బవమానుఁడై మోద
వానిశౌర్యంబును వానిశక్తియును, వానరులెల్ల నోర్వఁగ లేక యపుడు
వికలులై యుండిరి విస్మితు లగుచు, సకలదేవతలును జలయించి రపుడు
నటు భీతిఁబొందిన ప్లవగసైన్యముల, నటు పేర్చుచున్న నరాంతకుఁ జూచి

అంగదనరాంతకుల ద్వంద్వయుద్ధము

యనయంబు కోపించి యంబుదపటల, మున నున్న సూర్యుండు మొనసినమాడ్కిఁ
గపిరాజతనయుఁ డంగదకుమారుండు, కపిసేనలో నుండి కడఁక నేతెంచి
యోరి నరాంతక యుగ్రతఁ గపుల, నీరసంబునఁ బేర్చి యేల చంపెదవు
ఇంత చేసినను నీవిటు బంటువైతె, యంతశూరుఁడవైన ననిఁ దాఁకు నన్ను
ననవుడు నవ్వి నరాంతకుం డనియె, వనచర నీవెంతవాఁడవు నాకు
నఖిలదిక్పాలుర నదటడంచితిని, నిఖిలదేవతల మన్నింప కేఁచితిని
అట్టినాతోడ నీవా యెదిరెదవు, పట్టి చట్టలుచీరి పాఱవై చెదను
ననుఁ జూతుగా కన్న నగుచు నంగదుఁడు, దనుజదశగ్రీవుదర్పంబు మాన్పి
పూనిన ఖరసూతిఁ బోరిగొని పిదప, నే నేఁగునపుడు నీ వెఱుఁగవే నన్ను
ననుడు దానవుఁడు కాలాహిచందమున, మునుకొని యార్పులు మ్రోయంగ వచ్చి
ఘనతరవిస్ఫులింగంబులు చెదర, ననయంబు తనశక్తి నంగదుపైవ
గరుడునివక్త్రంబు గదిసినంతటనె, పరచిన కాలసర్పంబునుబోలె
నది వజ్రనిభమైన యతనివక్షంబు, గదిసినయంత నే ఖండంబు లయ్యె
వజ్రాయుధంబున వరశైల మణఁచు, వజ్రిచందంబున వాలినందనుఁడు
అఱచేత నే వాని హయముమస్తకము, పఱియలువాఱ నిర్భరవృత్తి నేసెఁ
జెచ్చెఱ వేయంగఁ జేట్పడి నోరు, విచ్చుచు నాలుక వెడలఁబెట్టుచును
వెరవిడి కాళ్లను వెసఁ దన్నికొనుచు, ధరమీఁదఁ బడి చచ్చెఁ దత్తురంగంబు
అటుతురంగమువడ్డ నన్నరాంతకుఁడు, చటులకాలానలజ్వలితాస్యుఁ డగుచుఁ
గెడయుమంచును బిడికిట మస్తకంబుఁ, బొడిచి యంగదు మూర్ఛఁబొందించుటయును
అంతనె తెలిసి నరాంతక నీకు, నింతశక్తియుఁ గలదే యని పేర్చి
పెరిఁగిన పిడుగైన పిడికిట వాని, వరశైలనిభమైన వక్షంబుఁ బొడిచెఁ
బొడిచిన నెత్తురుల్ పొరిఁ బోరి దొరఁగఁ, బొడిపొడియై ధరఁ బునుకలు సెదరఁ
గడుఘోరమైన సంగరభూమిలోనఁ, బడి నరాంతకుఁ డంతఁ బ్రాణము ల్విడచె
నార్చిరి దేవతలామింటనుండి, యార్చిరి వానరు లవనీతలమున
దనుజాధినాథునితనయునిపాటు, గని మహోదరుఁ డుగ్రకరిఁ బురికొల్పె
దనుజుండు వడుటకు నడలుచు వాలి, తనయు నేచుటకు నుద్దండకోపంబు
ముప్పిరిగొనఁగ నిమ్ములఁ బరిఘంబుఁ, ద్రిప్పుచుఁ బఱతెంచె దేవాంతకుండు
రవిమండలముబోలు రథ ముగ్రభంగి, నవని గంపింప నుద్ధతి దోలుకొనుచు
ద్రిశిరముల్ త్రేతాగ్ని తెఱఁగున వెలుఁగ, ద్రిశిరుండు గవిసె నుద్దీప్తకోపమున
నప్పు డంగదుఁడు శాఖాయుతం బగుచు, నొప్పెడు నొకవృక్ష మురవడిఁ బెఱికి
యడరంగ నార్చి దేవాంతకు వైవ, నడుమనె త్రిశిరుండు నలగఁగ నేసె
నేసిన మీఁదికి నెగసి యంగదుఁడు, గాసిల్లి శైలవృక్షంబులు మిగుల
నడరింప నపుడు దేవాంతక త్రిశిరు, లెడబడఁగా ద్రుంచి యెంతయు మించి
పరగించి రతనిపైఁ బటుతోమరంబు, లరుదారఁగాఁ జేరి యత్యుగ్రతను

నంతటఁ బోవక యార్చుచు మఱియు, వింతగాఁ బొదువుచు వేగంబు మెఱసి
యావాలిసుతుమీఁద నధికరోషమున, దేవాంతకుఁడు వైచె దీపించి పరిఘఁ
దరమిడి సింహనాదంబు సేయుచును, దెరలక శరవృష్టి త్రిశిరుండు గురిసె
నురుదంతి గొలిపె మహోదరుం డేఁచి, పరఁగించె నతనిపైఁ బటుతోమరములు
ఎనసి ముగ్వురు దమయేపు చూపుటయు, ఘనరోష మొదవ నంగదుఁడు కోపించె
దంభోళిక్రియ మహోదరునియేనుంగు, కుంభస్థలము దాఁకఁ గుధరశృంగంబు
గెరలి వ్రేసిన నది ఘీంకార మెసఁగ, నొరలి గ్రుడ్డులు వెలి కురికి చచ్చుటయు
జయలక్ష్మి రాఘవేశ్వరుఁ బొందఁగోరి, ప్రియమునఁ గైసేయఁ బెట్టియఁ దెరిచె
ననఁగ సాకరితల యటు వ్రస్సి యొప్పె, ననుపమంబైన ముత్యంబులు సెదర
నంతటఁ బోక దేవాంతకు వ్రేసె, దంతిదంత ముగల్చి తారాసుతుండు
అటు వ్రేటుపడి వాతహతిఁ జలియించు, పటుసాలవృక్షంబు పగిదిఁ దూగాడి
నెత్తురు గ్రక్కియు నెఱసాహసమునఁ, జిత్త మొక్కింతగాఁ జేసి యయ్యసుర
పరిఘంబు గొని వ్రేసెఁ బర్వతతటము, కరణి నొప్పారు నంగదునురస్స్థలము
నంగదుండును దాన నవనిపై వ్రొగ్గి, యంగముతోడ ధైర్యము చిక్కఁబట్టి
కోపించి దేవాంతకునిమీఁద నడువ, దీపితాస్త్రంబులఁ ద్రిశిరుండు మాఁట
నావాలితనయుని నాత్మఁ గైకొనక, లావున ఫాలస్థలము నాట వేసె
నంత నీలుండును ననిలనందనుఁడు, పంతంబుతోఁ దోడుపడి రంగదునకు
నందు నీలుఁడును మహాశైల మెత్తి, యందందఁ ద్రిశిరుపై నార్చుచు వైవ

హనుమంతుఁడు మొదలగువారలు త్రిశిరాదిరాక్షసవీరులఁ జంపుట

నశనిచందంబగు నస్త్రంబుఁ దొడిగి, త్రిశిరుండు నగ్గిరిఁ దెగ నేసె నడుమ
ధీరత వాటించి దేవాంతకుండు, వారిధ్యై యొప్పిన పరిఘఁ ద్రిప్పుచును
బలియుఁడై చనుదేరఁ బవమానసూనుఁ, డలుకతో రాక్షసు నౌదలఁ జూచి
బెడిదంబుగా వెసఁ బిడికిటఁ బొడిచెఁ, బొడిచిన నప్పుడు పొరిఁబొరి బండ్లు
డుల్లంగ నోరుబెట్టుగఁ దెర్చుకొనుచుఁ, ద్రెళ్ళె దైత్యుఁడు గ్రుడ్లు దిరుగవైచుచును
దేవత లార్చిరి దివినుండి యపుడు, దేవాంతకునిపాటు తెఱఁగొప్పఁ జూచి
త్రిశిరుండు కోపించి తీవ్రత నేసె, నశనివేగాస్త్రంబు లన్నీలుమీఁదఁ
దగ వెండియును మహోదరుఁ డుగ్రవేగ,మగునొక్క కరినెక్కి యార్చుచు వచ్చి
కులగిరిపై వాన గురియుచందమున, నలువు దీపింపంగ నతనిపై నేసె
నానీలుఁడును వానియస్త్రసంతతులఁ, దానెంతయును భిన్నతనుఁడునై నొచ్చి
యటు మూర్ఛనొందియు నంతనె తెలిసి, పటుగతితోడ నభంబున కెగసి
తరువులతోడ నుద్ధతి మీఁదికెత్తి, ధరణీధరము మహోదరునిపై వైచె
వైచిన దానిచే వారణయుక్తుఁ, డై చచ్చెఁ దలవ్రస్సి యమ్మహోదరుఁడు
ధరమీఁద నమ్మహోదరుఁడు గూలుటయుఁ, దిరమైన కడిమితోఁ ద్రిశిరుండు పేర్చి
సరిగొందు నని పెక్కుశరములు నేసె, నరవాయిగొనక యాహనుమంతుమీఁదఁ
కెచ్చెఱఁ బర్వతశిఖరంబు విఱిచి, తెచ్చి యారావణి త్రిశిరుపై వైచె

నది నడుమనె తుమురై రాల నేసెఁ, ద్రిదశులు వెఱఁగందఁ ద్రిశిరుండు పేర్చి
హనుమంతుఁడును దానియరదంబుమీఁది, కనువారఁగా దాఁటి యత్యుగ్రముగను
సింగంబు గజములఁ జెలరేఁగి వ్రచ్చు,భంగి రథ్యంబులఁ బటుగతిఁ జంపె
నాత్రిశిరుండును ననిలజుమీఁద, నాతతంబుగ శక్తి యడరించుటయును
బలుమంట లెగయంగఁ బఱతెంచుదాని, బలువిడిఁ బట్టి యప్పావని ద్రుంప
శక్తి ద్రుంచిన నిజశక్తి వాటించి, శక్తి జిహ్వాయుఁ బోలు చటులాసిఁ గొనుచు
నచ్చెరువైన రయంబు సొంపార, వచ్చి యాహనుమంతువక్షంబు దాఁక
వ్రేసిన నతఁడును వెస నఱచేత, వ్రేసె నారాక్షసువిపులవక్షంబు
నటు వ్రేటుపడి తనయడిదంబు వైచి, కుటిలరాక్షసుఁడు గ్రక్కున మూర్ఛనొం దె
ననిలజుం డటు పడ్డయడిదంబుఁ బుచ్చు,కొని బిట్టుగా నార్చెఁ గుంభిని పగుల
నాలోనఁ దెప్పిరి యాత్రిశిరుఁడు, వాలిన పిడికిట వాయుజుఁ బొడిచె
హనుమంతుఁ డంత నత్యంతరోషమునఁ, దనకటంబులు పొంగ దర్ప ముప్పొంగ
రూపించి యావిశ్వరూపుమస్తకము, నేపునఁ ద్రుంచు సురేంద్రు చందమునఁ
జెచ్చెఱ దనుజుని శిరములు మూఁడు, నచ్చెరువైన యాయడిద మంకించి
తెగనేసె నాదైత్యుతీవ్రకర్మంబు, దగఁ బుచ్చుకొని త్రుంచు దైవంబుకరణి
దిశలు భూభాగంబు దివియు ఘోషింపఁ, ద్రిశిరుండు భూస్థలిఁ ద్రెళ్లెఁ ద్రెళ్లుటయుఁ
బటురౌద్రమున మహాపార్శ్వుండు గినిసి, నిటలంబు బొమలును నెరి ముడివడఁగ
నలరు నెత్తుటఁ దోఁగి యాశాకరీంద్ర,కరభీకరంబైన కనకచక్రముల
సురుమణి ప్రభల నత్యుగ్రమై యముని, పరుషోగ్రదండంబు పాటిగాఁ గలిగి
యరుణపుష్పంబుల నరుణగంధమున, సురుతరం బగుచు నయోమయంబైన
యుదయార్కభాసమానోజ్జ్వలం బగుచు, నొదవు గదాదండ ముగ్రుఁడై తాల్చి
తనకోపశిఖి మండ దర్పముప్పొంగ, హనుమంతుమీఁద రయంబున నడువ
నెడనొచ్చి యొక్క మహీధరం బెత్తి, యెడపక దైత్యుపై ఋషభుండు వైచె
నడరి యంతటిలోన నమ్మహీధరము, దొడిపడ గదఁ గొని తుమురుగా వ్రేసెఁ
జటులత గద ద్రిప్పి సముదుఁడై ఋషభుఁ, బటుసత్త్వమున మహాపార్శ్వుండు వైచె
దానిచే వక్షంబుఁ దాఁకి యావృషభుఁ, డూనిన మూర్ఛచే నొక్కింత దెలిసి
యాలోన వేగ మహాపార్శ్వుఱొమ్ము, వ్రాలినపిడికిట వ్రయ్యఁ దాటించెఁ
దాటించుటయు గదాదండంబు విడిచి, మేటిసత్త్వము దూలి మేదినిఁ బడియె
నాగదాదండంబు నాఋషభుండు, వేగంబె కొని యార్చి వ్రేసిన దైత్యు
వ్రేసిన వజ్రంబు వ్రేటునఁ గొండ,తో సరియై తల తుమురుగాఁ గూలె
నటు మహాధ్వనితో మహాపార్శ్వుఁ డవనిఁ, బటుభయంకరవృత్తిఁ బడుటయుఁ జూచి
కరువలిచేఁ దూలు కారాకు లనఁగఁ, దిరిగి దైత్యులు నలుదెసలకుఁ జనిరి
ఆచందమున వార లవనిపైఁ బడుటఁ, జూచిన రోషవిస్ఫురణశోభిల్ల
మిడుక లోకములెల్ల మ్రింగెద ననుచు, గడఁగినక్రియ నతికాయుఁడు పేర్చి
వేయుసూర్యులభంగి వెలుఁగుచు మిగుల, నాయతం బైనట్టి యరదంబు నెక్కి

తనరార సింహనాదము చెలఁగించి, తనపేరు సెప్పి యుద్దండకోదండ
నిష్ఠురారావంబు నిగుడఁ గాలాగ్ని, కాష్ఠంబు లడఁగింపఁ గవయుచందమునఁ
గపిసేనపై మహోగ్రంబుగాఁ గవియఁ, గపులు నిశాటునాకారంబుఁ జూచి
పటురౌద్రలీల నిప్పటికుంభకర్ణుఁ, డిట వచ్చెనో యని యెంతయు బెదరి
కొందఱు మూర్ఛిల్లఁ గొందఱు వెఱవఁ, గొందఱు వెఱఁగు చేకొని చూచుచుండఁ
గొందఱు వాపోవఁ గొందఱు గలఁగఁ, గొందఱు రామ చేకొనుమని మ్రొక్కఁ
బర్విసభీతిమైఁ బఱతెంచుకపుల, సుగ్రీవ్వరుం డోడ కోడకుం డనుచుఁ
గలయ లోకములెల్లఁ గప్పి గర్జిల్లు, ప్రళయావసర మేఘపటలంబుపోలె
బెడిదంబుగాఁ బేర్చు పృథులవేగమున, నడతెంచుచున్న దానవనాథతనయు
నగ్గలికయు లావు నధికరౌద్రంబు, నగ్గలియును దప్పులందె వీక్షించి
యనయంబు వెఱఁగంది యప్పు డారామ, జననాథుఁ డావిభీషణుఁ జూచి పలికెఁ
బిడుగుమ్రోసినమాడ్కి బెడిదంపుమ్రోఁత, నడరి వచ్చుచునున్న యరదంబుమీఁద
నింద్రచాపముతోడ నెనవచ్చునట్టి, సాంద్రప్రభాయిత చాప మొప్పారఁ
బరిఘగదాప్రాసపట్టసశూల, పరశుతోమరభిండివాలచక్రాది
వరదివ్యశస్త్రనిర్వాహంబుతోడ, నరుదైనయట్టి సింహధ్వజం బొప్ప
నలువొంద నార్చుచు నలుగురు సారథులు తోల నొకవేయితురగము లూన్చి
మూఁడుకన్నులుగల మూర్తియుఁబోలె, వేఁడిమి దిక్కుల వెదచల్లుకొనుచుఁ
గపులఁ దోలుచును నిక్కడనె చూచుచును, విపరీతగతి వచ్చు వీఁ డెవ్వఁ డనిన

విభీషణుఁడు శ్రీరాములకతికాయుని ప్రభావముఁ దెలుపుట

దేవ యీదైత్యుఁడు దేవారిసుతుఁడు, రావణుకంటెను రణకోవిదుండు
చతురంగములయందు సమరంబుసేయ, నతినిపుణుండు వీఁ డవనీశతిలక
యరుదైన వేదశాస్త్రాదివిద్యలను, బరిణతుం డెంతయుఁ బరతత్త్వవేది
లంక యీవీరుని లావునఁ జేసి, శంక లేకెపుడు నిశ్చలవృత్తి నుండు
ననిమిషు లలిగిన ననిఁ జావకుండ, వనజాసనునిచేత వరము గొన్నాఁడు
దివ్యాయుధంబుల దివ్యశస్త్రముల, దివ్యమంత్రంబుల దీపించువాఁడు
మీఱి యింద్రాద్యనిమిషులను నూఱుమాఱులు గెలిచిన మగంటిమివాఁడు
వాసవువజ్రంబు వరుణపాశంబు, నాసమవర్తి మహోగ్రదండంబు
ధనపతిగదయు నీతనిశస్త్రసమితి, ననిశంబు గడుఁ బ్రతిహతము లైయుండు
మనుజాశనుఁడు ధాన్యమాలినియందె, గనినపుత్త్రుం డతికాయుండు వీఁడు
ఈదానవునిచేత నీకపులెల్ల, మేదినీనాయక మెదుగక మున్నె
సమరంబులో వీనిఁ జంపుట లెస్స, యమితవిక్రమకేళి నని చెప్పుచుండ
వాఁడంతఁ బటుగుణధ్వని దిక్కులద్రువ, వాఁడిమిమై నట వచ్చుటఁ జూచి
ఖండనోదగ్రుండు గవయుండు గోముఖుండును జ్యోతిర్ముఖుఁడు కుముదుండు
మారుతాత్మజుఁడును మైందుండు నలుఁడు, శరభుండు నీలుండు శతబలి గజుఁడు
నాదిగాఁ గలుగు మహాకపివరులు, మేదినీజంబులు మేదినీధ్రములు

వడి నెత్తుకొనిపోయి వానికి నెదురు, నడువంగ నటుచూచి నవ్వి దానవుఁడు
కలహవిక్రమకళాకౌశలసత్త్వములు, గలుగవు తొలఁగుఁడు కపులార మీరు
త్రిజగంబులును మెచ్చఁ దివిరి వారాశి, నిజశరాగ్రంబున నిల్పినశూరుఁ
డతఁ డెవ్వఁ డిటు చూపుఁ డతనిపైఁ గాని, యతులితంబైన నాయస్త్రంబు విడువ
దురమున నింద్రజిత్తుఁడు గట్టినట్టి, యురగపాశంబుల నూడ్చుకొన్నట్టి
యతఁ డెవ్వఁ డిటు చూపుఁ డతనిపైఁగాని, యతులితంబైన నాయస్త్రంబు విడువ
మూఁడులోకంబులు మునుమిడి గెలిచి, వాఁడిమి మగఁటిమి వ్రాలినశూరు
నలఘుబలోదీర్ణు నాకుంభకర్ణుఁ, దలఁ ద్రెవ్వనేసి యుద్ధతిఁ బేర్చియున్న
యతఁ డెవ్వఁ డిటుచూపుఁ డతనిపైఁగాని, యతులితంబైన నాయస్త్రంబు విడువ
దేవదానవయక్షదివిజులకాజి, భావింప నెక్కుడై పరఁగినయట్టి
రావణు నోర్చెద రణములో ననుచు, నీవిధంబున లంక కేతెంచుశూరుఁ
డతఁ డెవ్వఁ డిటుచూపుఁ డతనిపైఁగాని, యతులితంబైన నాయస్త్రంబు విడువ
నని పెక్కుగర్వంబు లాడుచున్న, దనుజాధినాథునితనయునిఁ గిట్టి
కడిఁది కోపమున వృక్షంబులు గిరులు, నుడుగక కపినాయకోత్తములు ఱువ్వ
నవి యంతవట్టును నతికాయుఁ డడచె, యవిరళమార్గణాహతిఁ ద్రుంచివైచి
గురుతరాస్త్రంబులఁ గుముదుని మూఁటఁ, గరముగ్ర శరపంచకంబున ద్వివిదు
నరుదార మైందు నైదమ్ము లేడింట, శరభునిఁ బోష్టిసాయకంబులను
ఘనతరబాణాష్టకంబున గజునిఁ, గినిసి పెట్టుగ నాలుగింట గవాక్షు
గవయుని నెనిమిది ఘనసాయకములఁ, దవిలి జ్యోతిర్ముఖుఁ దశమార్గణములఁ
బలుకాండముల శతబలిఁ బదేనింట, నెలమితో నీలుని నిరువదేనింటఁ
బెడిదంబుగా నేయఁ బృథివిపై నొరగి, కడుమూర్ఛనొంది రాకపివరులెల్ల
దివిజులు వెఱఁగంది దివినుండి చూడఁ, దవిలి వెండియును నుద్దండకోపమున
మృగముల దోలెడి మృగపతిమాడ్కి, నగచరావళిఁ దోలె నతికాయుఁ డపుడు
తోలియుఁ దన్ను నెదుర్కొనుకపుల, నేలనుఁ గూల్చుచు నిగిడి రామునకుఁ
బగతోడి భక్తి నప్పరమేశుపలన, దగ ముక్తి గలుగు నింతట నని తలఁచి
నిగిడి యారాఘవునికి నతికాయుఁ, డగలని తెగువమై ననియె నవ్వుచును
రామ యీసమరధరాస్థలిలోన, నీమగఁటిమి చూపు నిక్కంబు నాకు
నెంతటివాఁడవో యెన్నఁడు నిన్ను, నింతటివాఁడని యెఱుఁగ రెవ్వరును
మాతండ్రికతమున మానిసివైతి, మాతండ్రికతమున మహి రాజవైతి
నమరేంద్ర యమవరుణాదిదేవతల, గుమిలోన నొకఁడవు గావు నిన్నెదుర
గడముట్టశూరుఁడై కదిసినవానిఁ, గడిమిమై నెదురంగఁ గవియుదుగాక
యేను నీమగతనం బెఱుఁగనే ముందు, మానాభిమానము ల్మఱి నీకుఁ గలవె
గణుతింప నన్నెఱుంగవుగాక నీవు, గుణహీనుఁడవు సత్త్వగుణ మెందు గలదు
ఏజాతిఁ గలవాఁడ వేమి చెప్పెడిది, రాజకులాచార రతుఁడవే నీవు
అనఘమానసమానసాటవుల్దూరు, ననుఁ జేరి పోరాడ నాయీడు గావు

గొనకొని వేదాద్రిగుహలలో నుండు, ననుఁ జేరి పోరాడ నాయీడు గావు
సనకాదిమునియోగిసదనములొప్పెరుము, ననుఁ జేరి పోరాడ నాయీడు గావు
కాషాయవస్త్రసంకలితులై విగతదోషులై భవరోగదూరులై పోయి
కూరలు గాయలు కూళ్లుగాఁ గుడిచి, నీరసాహారులై నిష్ఫల దస్సి
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరుచున్న, వారిలోపలఁ బోయి వర్తింపు మీవు
కలహవిక్రమశక్తి కడపట లేదు, తలపోసి యెఱుఁగుదు తగిలి నీలావు
నాగి నొంటివాఁడవై యుండెడి నీకు, జగతిలో నీకపిసైన్యంబు గలిగె
దిక్కెవ్వరును లేక తిరిగెడి నీకు, దిక్కయ్యె నిప్పుడు దినకరాత్మజుఁడు
ఎక్కడ గురుఁడని యెఱుఁగని నీకు, నక్కడ గురుఁడు విశ్వామిత్రుఁడయ్యె
నొకదేశమును లేక యుండెడు నీకు, నకలంక మగునయోధ్యాదేశ మొప్పె
నివి నీకుఁ బెద్దగా నిచ్చలో నుబ్బి, తివురకు నీవింక ధృతిపెంపుఁ దూలి
చలియించి మీనమై సకలవారిధులు, సొలవక చొచ్చినఁ జొత్తు గాకేమి
తలఁపు నీమీఁదిదె తప్పదు నాకుఁ, బలుకు లేటికి నిన్నుఁ బట్టెద వెదకి
తలఁగ్రుచ్చి కూర్మమై ధరణిలోపలికి, సొలవక వచ్చినఁ జొత్తు గాకేమి
తలఁపు నీమీఁదిదె తప్పదు నాకుఁ, బలుకు లేటికి నిన్నుఁ బట్టెద వెదకి
యలిగి వరాహంబవై రసాతలము, సొలవక చొచ్చినఁ జొత్తు గాకేమి
తలఁపు నీమీఁదిదె తప్పదు నాకుఁ, బలుకు లేటికి నిన్నుఁ బట్టెద వెదకి
చలమున వికృతవేషమున నెందైన, సొలవక చొచ్చినఁ జొత్తు గాకేమి
తలఁపు నీమీఁదిదె తప్పదు నాకుఁ, బలుకు లేటికి నిన్నుఁ బట్టెద వెదకి
కడుగుజ్జవై నీవు కార్పణ్యవృత్తిఁ, బొడవేది పోయినఁ బోదుగా కేమి
తలఁపు నీమీఁదిదె తప్పదు నాకుఁ, బలుకు లేటికి నిన్నుఁ బట్టెద వెదకి
ధారణీసురవేషధారి కుఠారి, వై రాజసంహారి వగుదు గాకేమి
తలఁపు నీమీఁదిదె తప్పదు నాకుఁ, బలుకు లేటికి నిన్నుఁ బట్టెద వెదకి
అచ్చెరువగునరుణాంబుధిలోనఁ, జెచ్చెఱ నిన్ను మోచియుఁ దేలియాడఁ
బరికింప నల వటపత్త్రంబు గాదు, కరము భీషణము నాకంకపత్త్రంబు
దురమున నను నీకుఁ దొడగంగ రాదు, వరగర్వమున నెందు వ్రాలినవాఁడ
ననిపేర్చి పలికెడు నయ్యతికాయు, ఘనగర్వమునకు లక్ష్మణుఁడు గోపించి

—లక్ష్మణాతికాయుల ద్వంద్వయుద్ధము—

యోరి నిశాట నేనుండ రాఘవునితో రణం బొనరింపఁ దొరకొన నేల
నాదెసఁ జక్కనై నడతెమ్ము నిన్ను, నాదుబాణముల భగ్నంబుచేసెదను
అని దానవునిగుండె లవియ నందంద, ఘనగుణధ్వని చేసి కదిసిన వాఁడు
నారభసంబున కాశ్చర్యమంది, క్రూరాస్త్ర మొక్కటిఁ గొని యార్చి పట్టి
నిలు నిలు లక్ష్మణ నీవుఁ బాలుఁడవు, వలదంత నీకంటె వ్రాలినవాఁడ
నావరశరఘట్టనంబు సహింప, నీవసుధర యొండె హిమగిరి యొండె
రావణుం డెత్తిన రజతాద్రి యొండె, దేవతలున్న ధాత్రీధరం బొండె

నంజకహారువిల్లు నడఁచి గర్వమున, రంజిల్లు మీఱయన్న రాఘవుం డొండె
గాక నన్నని మొనఁ గదియ శక్యంబె, నీకు నాముందట నిలువంగఁ దరమె
యీవరబాణంబు నీట నన్నుఁ గట్టి, త్రావెదు నీదురక్తంబు సౌమిత్రి
యని దురహంకృతి నాడిన నతఁడు, దనుజుఁడ నీకు వృథాగర్వమేల
పోర నీలావు చూపుదు గాక నీకు, నీరిత్తమాట లింకేల నాయెదుట
నీవును శస్త్రాస్త్రనిచయంబుతోడ, నీవిధంబున రథ మెక్కి యుద్వృత్తి
మానక యిటఁ బోటు మగవాఁడపోలెఁ, బూనియున్నాఁడ విప్పుడు నిశాచరుఁడ
యనవుడు కోపించి యతనిపై నేసెఁ, దనచేతిబాణ ముద్ధతి వాఁడు దొడఁగి
యేసి యార్చిన దతి నింద్రాదిసురులు, నాసమయంబున నాశ్చర్యపడఁగ
వదలక రాఘవేశ్వరుననుజుండు, నది యర్ధచంద్రబాణాహతిఁ ద్రుంచి
చెలువార బ్రహ్మ వ్రాసినవ్రాఁత యింక, వల దని తా భువి వైచినకరణిఁ
జటులాస్త్ర మొక్కటి సంధించి వాని, నిటలస్థలము నాఁట నిపుణుఁడై యేసె
నేసిన రుద్రుని యేటున వడఁకు, భాసురాసురపురప్రాసాద మనఁగఁ
జలియించి నాతోడ సమరంబు సేయఁ, గలిగె వీఁడని యతికాయుండు పేర్చి
కడిమిమై నరదంబుఁ గదియఁ దోలించి, తడయక యారాముతమ్మునిమీఁదఁ
జల మొక్కటియె తక్క చంపవే నన్ను, చెలువున నొక్కనిశితబాణ మేసె
మూఁడంబకంబులమూర్తి గాచినను, బోడిమిఁ జక్కింతుఁ బొమ్మన్నకరణిఁ
జటులవేగంబున సంధించి మఱియుఁ, బటుతరంబగు మూఁడుబాణంబు లేసె
ననయంబు బెరుకుదు నైదుప్రాణములు, ననుమాడ్కి వెండియు నైదమ్ము లేసె
నేడువార్ధులు సొచ్చి యీఁదిపోయినను, తోడనే నినుఁబట్టి త్రుంతు నన్నట్టి
కరణి నెంతయు భుజాగర్వంబు మీఱి, యిరవొంద సంధించి యేడమ్ము లేసె
నవి వేగ లక్ష్మణుం డంతలోపలనె, వివిధఖండములు గావించి పెల్లార్చి
యతికాయుపై నేసె నాగ్నేయబాణ, మతఁడు నూఱేసె సౌరాస్త్రంబుఁ దొడిగి
యా రెండుశరములు నడరి యొండొంటితో రణం బొనరించి తుమురులై రాలె
చేకొని దనుజుఁ డైషికబాణ మేసెఁ, గాకుత్స్థతిలకుఁ డాకంపంబునొంద
నది యైంద్రమునఁ ద్రుంచె నదరి లక్ష్మణుఁడు, అది గని దైత్యుండు యామ్యాస్త్రమేసె
నది ద్రుంచె నతఁడు వాయవ్యాస్త్రమేసి, యదిగాక పెక్కమ్ము లసురపై నేయ
నవి వాని మైమరు వటుఁదాఁకి విఱిగి, భువిమీఁద నొఱగినఁ బోక లక్ష్మణుఁడు
వెండియుఁ బెక్కేయ విఱుగుటఁ జూచి, కాండంబు లేమొకో కాడవు వీని
నని యని చింతించి యలయుచున్నంత, నెనలేనియామర్మ మెఱిఁగింతు ననుచు
నప్పు డాతనితోడ ననిలుండు వచ్చి, చెప్పె లక్ష్మణ బ్రహ్మచే వీఁడు వడసె
వరముగాఁ గోరి యీవజ్రకవచమ్ము, శరము లెవ్వియు వీనిఁ జాలవు నాటఁ
బలుదునియలుగాఁగ బ్రహ్మాస్త్ర మేసి, పొలియింపు మనవు డుప్పొంగి లక్ష్మణుఁడు
అది సమంత్రకముగా నార్పుచుఁ దొడిగి, త్రిదశారిసుతుమీఁదఁ దెగఁగొని యేసె
నేసిన బ్రహ్మాండ మెల్లను బగుల, వాసవుం డదర దేవతలు గంపింప

ధరణి వడంక దిక్తటము లల్లాడ, శరధులు ఘూర్ణిల్ల శైలము ల్వడఁకఁ
దరణిచంద్రులగతి దప్పంగఁ జుక్క, లురులంగ రత్నపుంఖోజ్జ్వలం బగుచుఁ
బ్రళయకాలమునాఁటి పావకుభంగి, నెలకొని లోకముల్ నిండి మండుచును
యమదండమునుబోలె ననిలవేగమునఁ, గ్రమ మొప్ప నింతయుఁ గడురభసమున
నమ్మేయి బ్రహ్మాస్త్ర మరుదేరదైత్యుఁ, డమ్ములు నిగుడింప నవియుఁ గైకొనక
వచ్చుటయును శక్తి వైచె వైచుటయుఁ, జెచ్చెఱ నాశక్తిఁ జేకొన కదియు
లావున రాఁగ శూలంబున వైచె, నావిధంబును గొన కది మీఱి రాఁగ
గద వ్రేసె వ్రేసిన గదయును ద్రోచి, యది వచ్చుటయుఁ జూచి యడిదాన వ్రేసె
నది దాఁటిరాఁ బరశ్వాయుధం బెత్తి, వదలక వ్రేయ దీవ్రంబున నదియుఁ
గడచి యేతేరంగఁ గడఁగి కటారిఁ, బొడిచిన నందునఁ బోక పై రాఁగ
వలనొప్ప మొలనున్న వంకినిఁ బొడిచెఁ, జలమున నది మీఱి చటులవేగమునఁ

అతికాయుఁడు లక్ష్మణునిచేఁ జచ్చుట

బోవ కేతెంచినఁ బొడిచెఁ బిడికిటను, దేవతల్ దలలూపఁ దివిరి యాశరము
మండితకోటీరమండలితోడఁ, గుండలంబులతోడఁ గూల్చెఁ దచ్ఛిరము
నటువజ్రహతి రోహణాద్రిశృంగంబు, చటులతఁ గూలిన చాడ్పునఁ బడ్డ
నతికాయుతలఁ జూచి యతిభీతిఁ బొంది, హతశేషులైన దైత్యాధముల్ పఱచి
లంకఁ జొచ్చుటయుఁ గెలఁకుల కపులు, నంకించి రెంతయు నారాముతమ్ముఁ
డరుదెంచి శ్రీరామునడుగుల కెఱఁగఁ, గరము సంతోషించి కౌఁగిటఁ జేర్చి
వినుతించు నాకపివీరులతోడ, ననయంబు హర్షించె నవనీశుఁ డంత
నాదైత్యనాథుండు నయ్యతికాయుఁ, డాదిగాఁగలదైత్యు లార్వురు వడుట
విని మూర్ఛపాల్పడి వేగంబె తెలిసి, ఘనముగాఁ గన్నీరు గ్రమ్మ నందంద
నతిదుఃఖమునుబొంది యడలుచునున్న, పతికడ కేతెంచి పల్కె మయపుత్రి
యసురేశ లోకంబు లన్నిటిలోన, నసమానసత్త్వుఁడ వైన నీకిట్లు
వాడియె శోకింపఁ బంటవై నీవు, నాఁడేల తెచ్చితి నరనాథుదేవి
నొప్పింపనేరవై తుచితకాలమునఁ, దప్పె నారామునిఁ దలపడ్డదైత్యు
లరుదెంతు రనుమాట లవియుఁ బోవిడువు, సురవైరి యాజిలోఁ జూపు నీకడిమి
యనుమాట లాలించి యాత్మఁ జింతించి, వనిత నంతగపురవరమున కనిచె
నిలిచినవగలతో నిట్టూర్పుఁ బుచ్చి, తనమంత్రివరులతో దశకంఠుఁ డనియెఁ
గటకటా! తమ్ములు గాదిలిసుతులు, నిటు నేలఁ గూలి రిం కేమనఁ గలదు
విబుధులకైనను విడిపంపరాని, ప్రబలంబులగు నాగపాశబంధములఁ
బాసిరి మాయ పోఁ బలిమినో మనుజు, లాసచేసినఁ జెల్ల దది నాకు జయము-
ఆరాముతమ్ముని నాజిలో గెలుచు, వీరుని నెవ్వాని వెదకియుఁ గాన
భయమెన్నఁడును లేక పరఁగు నీలంక, భయమును బొందె నాబలియులవలన
నారామవిభునిపరాక్రమంబునకు, మేర యెయ్యది యింటమీఁద నీలంక
యతనిచేఁ జెడకుండ నరసి యేమఱక, ప్రతిదినంబును గావఁ బంపుఁడీ యనుచు

నతగపురంబున కరిగి యొక్కెడఁ, యంతరంగంబున నడలుచు నుండె
నప్పుడు చనుదెంచి యామేఘనాదు, డప్పంక్తికంఠున కనియె నింపార
నే నీకుఁ గలుగంగ నిటు వగవేల, దానవాధీశ్వర తగదు చింతింపఁ
బటుతరంబైన నాబాణసంహతికి, నెటు సహింపఁగఁజాలు నీశ్వరుండైన
నటు చూడు రాముని నాతనితమ్ముఁ, జటులాంబకముల జర్జరితులఁ జేసి
యసువులు వెఱికి యయ్యగచరావళుల, వసుమతిపైఁ గూల్చి వచ్చెదఁ గడిమి
విబుధకంటక నేఁడు వినుము నాప్రతిన, విబుధలోకేశుండు విష్ణుండు యముఁడు
శిఖియును రుద్రుండు సితకరార్కులును, నఖిలసాధ్యులు బలి యజ్ఞవాటమున
నేచి విజృంభించునెడఁ ద్రివిక్రమునిఁ, జూచినగతి నన్నుఁ జూతురుగాక

ఇంద్రజిత్తు రెండవమాఱు యుద్ధమునకు వెడలుట

యని వీడుకొని దివ్య మగురథంబెక్కి, దనుజేంద్రతనయుఁ డెంతయు సొంపుమీఱ
నడువంగ నప్పుడు నానాముఖములఁ, గడువేగమున నుర్వి గదలఁగాఁ గదలి
వెడలె రథంబులు వెడలె నేనుఁగులు, వెడలె గుఱ్ఱంబులు వెడలెఁ గాల్బలము
పుండరీకంబుల బోలుపారువారు, పుండరీకాక్షులఁ బోలుపారువారు
పుండరీకచ్ఛాయఁ బోలుపారువారు, పుండరీకోన్నతిఁ బోలుపారువారు
నన్ను డుగ్రతఁ జతురంగసైన్యముల, నొప్పిరి దానవు లుగ్రాసనముల
నార్పులు బొబ్బలు నశులఘోషములు, దర్పితసింహనాదస్ఫురణములు
నేమీస్వనంబులు నిస్సాణరవము, రామణీయకము లుగ్రంబులై యమర
భాసురధవళాతపత్ర మొప్పార, నాసుధాకరుతోడి యాకాశ మునఁగఁ
గములలోచనములు గ్రాల నందందఁ, బ్రమదాజనము చామరంబులు వీవ
బహుభూషణప్రభాపటలంబు వెలుఁగ, సహజవైభవమహోజ్జ్వలుఁ డింద్రజిత్తు
చనుదెంచి రణమహీస్థలమున నిలిచి, ఘనభుజుం డత్యంతకౌతూహలమున
రక్తవస్త్రంబుల రక్తమాల్యముల, రక్తగంధంబుల రాజితుం డగుచు
వరమంత్రముల హుతవహుఁ బ్రతిష్ఠించి, శరములు తోమరచయములు పరుసఁ
బరిధులుఁగాఁ జేసి పలుస్రుక్స్రువములు, కరమర్థి లోహముల్గా సంఘటించి
తనలోని నిష్ఠయుదాత్తమై యొప్ప, దనుజేంద్రతనయుఁ డథర్వణోక్తముగఁ
దగ నెయ్యి లాజలు దాడిసమిథలు, నొగి వేడ్క వేల్చుచు హోమాంతవేళఁ
గడిఁది కృష్ణచ్ఛాగకంఠరక్తంబు, నడరెడుపిమ్మఁ బూర్ణాహుతి వేల్వ
ననలుండు పొడసూపి హవ్యముల్ గొనియె, ననలునికరుణ బ్రహ్మాస్త్రంబు రథము
ధనువును గవచంబుఁ దద్దయుఁ బ్రీతిఁ, గొని యార్చుటయును దిక్కులు పెల్లగిల్ల
దానవుం డర్కేందుతారకాసమితితో నభం బగులంగ దుర్దాంతుఁ డగుచు
రథరథ్యకేతుసారథులతో నెగసి, ప్రథితవేగమున నంబరవీథి డాఁగి
యగణితబలసత్త్వుఁడై యొప్పఁ బలికె, దగియెడుబుద్ధిగాఁ దనసేనతోడఁ
దరలక నిలిచి యుద్ధము సేయుచుండుఁ, డురక యేనిదె దివినుండి ఘోరముగ
రణమొనరించి యారామలక్ష్మణుల, గణుతింప కెంత వేగమె చంపువాఁడ

ననిన నుత్సాహవాక్యము విని పేర్చి, దనుజులు సేనావితానంబుతోడఁ
దరుచరసేనలు దరియంగఁ జొచ్చి, బరవసంబునఁ బెక్కుభంగులఁ బోర
నాదివినుండి దివ్యాస్త్రంబులేయ, నాదానవుని దెస కగచరు లెగసి
యగములు వైవంగ నవి ద్రుంచి గుండె, లగలించి పెక్కండ్ర నసనిపైఁ గూల్చి
వేగంబె యొక్కొక్కవిషమబాణమున, నేగురఁ దొమ్మండ్ర నేడ్గుర నేసె
మఱియును గడిమిమై మర్కటేశ్వరులు, నెఱసిన గిరిధరణీజంబు లెత్తి
యాయింద్రజిత్తుపై నడరింప నతఁడు, సాయకంబుల వానిఁ జతురుఁడై త్రుంచి
పదియు నెన్మిది తీవ్రబాణంబు లేసె, మదమెల్లఁ జెడ గంధమాదనుఁ గడిమి
దీపింప నలుఁ దొమ్మిదిట రూపుమాపె, నేపార మైందుని నేడింట నొంచెఁ
గదిసి పంచకమున గజుని నొప్పించెఁ, బదియింట భల్లూకపతిఁ గూలనేసె
నూటను హనుమంతు నొప్పించి మించె, మూఁట గవాక్షుని మొగి గాడనేసెఁ
బదియింట హరిరోముప్రాణముల్ గొనియె, నదటణంగ గగంబు నాఱింటనేసెఁ
దగిలి యాఱిట వేగదర్శి భంజించెఁ, దెగి సుషేణుని నెన్మిదింట నొప్పించె
ననయంబు పదిట సూర్యప్రభు నొంచెఁ, బనసుని యంగంబుఁ బదుమూఁట నేసె
ఘనతరబాణాష్టకంబునఁ గుముదు, నెనసి నీలుని ముప్పదింటను ముంచె
మసలక మఱి పెక్కుమార్గణంబులను, రసికతదూలఁ దారాతనూభవుని
సునిశితంబైన యాశుగముల నూట, దినపనందనుని నైదిట నింద్రజాలు
గిరిభేది రెంటను గెడపి యాఋషభు, నిరువదిశరముల నిలఁ ద్రెళ్లనేసెఁ
గేసరి పదునాలుగిట దధిముఖుని, భాసురంబుగ బాణపంచకంబునను
సుముఖునిఁ గ్రథనుని సొరిది నాఱింట, విముఖు నేడింటను ద్వివిదు నాఱింట
శరభు నేడింటను శతబలిఁ బదిట, సరి నెన్మిదిట హరు పన్నాదు మూఁట
నరుదుగాఁ దక్కిన యఖిలయూథపుల, వరదివ్యశస్త్రాస్త్రవర్షంబు గురిసి
కడుభిన్నగాత్రులఁగాఁ జేసి నేలఁ, బడవైచి మఱి గతప్రాణులఁ జేసి
కొందఱ నమ్ములు గొని గాడనేసి, కొందఱ గదలెత్తుకొని బిట్టువ్రేసి
కొందఱ శూలముల్ గొని గాడనేసి, కొందఱ శక్తులు గొని నిగుడించి
దనుజేంద్రతనయుఁ డెంతయుఁ బ్రతిలేక, తనరు బ్రహ్మాస్త్రమంత్రప్రభావమున
నందఱ నిష్క్రియ నందందఁ బేర్చి, యెందును బోనీక యయ్యింద్రజిత్తుఁ
డున్నవానరసేనయును జంపివైచి, యున్నతజయమున నుగ్రుఁడై యార్చెఁ
గపికోటి నొచ్చినఁ గడఁగి సౌమిత్రి, కుపితుఁడై యన్నఁ గన్గొని విన్నవించె
దేవ బ్రహ్మాస్త్రంబు దీపింపఁజేసి, రావణసహిత మీ రాక్షసకోటి
నంతయుఁ జంపెద నానతి యిమ్ము, చింతింప నేటికిఁ జెచ్చెఱ ననుడు
వీనిమాయలఁజేసి వీనిరూపంబు, గాననియప్పుడు గడఁగి లోకములు
భస్మంబుసేయుచు బ్రహ్మాస్త్ర మరుగు, విస్మయంబగు బలావిర్భావ మొప్పఁ
గావున వీనికై కడఁగి లోకముల, నేవేల కాల్చెదు నిష్ఠురవృత్తి
నీరాక్షసుఁడు బ్రహ్మ యిచ్చినవరము, కారణంబునఁ జేసి కపికోటిఁ జంపె

ననయంబు మన మింక నా బ్రహ్మవరము, మనమున నొకకొంత మన్నింపవలయు
నని పల్కి యింద్రజిత్తా రఘుకులుల, ఘనబాణముల నేసె గదలక నిలిచి

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే రాముఁడు మొదలగువారల మూర్ఛనొందించి మరలుట

గర్వితుండగు దశకంఠనందనుఁడు, పర్విన నీలాభ్రపటలంబు గాఁగ
నడరించు కార్ముకజ్యానినాదంబు, లుడుగక వెస మ్రోయు నురుములు గాఁగ
వడిఁ బూన్చి దైత్యుఁడు వైచుచు నున్న, బెడిదంపుశక్తులు పిడుగులు గాఁగ
నగణితదివ్యశస్త్రావళియందు, మిగిలినదీప్తులు మెఱుఁగులు గాఁగఁ
బోరిఁబోరిఁ బుంఖానుపుంఖంబు లగుచు, నరుదెంచు నమ్ములు నతివృష్టి గాఁగఁ
గరుల నొప్పిన నెలకట్టియ లెల్లఁ, దఱుచుగా నాడు చాతకములు గాఁగ
కనకరత్నప్రభాకలితంబు లగుచుఁ, దనరుచాపం బింద్రధనువును గాఁగ
నసురులయందును నగచరులందు, వెసఁ గ్రమ్ము నెత్తురు వెల్లువ గాఁగ
బింబహారములకు బాసినమౌక్తికంబులు నెరి వడగండ్లును గాఁగ
నురులినముకుటమహోజ్జ్వలమణులు, పరఁగంగ నింద్రగోపంబులు గాఁగ
లాలితాయతకాహళారవంబులును, వ్రాలిన కేకారవంబులు గాఁగ
సమధికపటహోగ్రసన్నాహరవము, రమణీయమంతూనరావంబు గాఁగ
నసమున రఘుపతి హాలికుఁడై పేర్చి, నసురేశు విపులదేహక్షేత్రమునను
ఆదరి లోకములెల్ల నలరంగ ముష్టి, విడువక యమ్ములు వెతఁబెట్టుకొఱకు
వచ్చిన తొలుకరివానకాలంబు, నచ్చుగా నొప్పారె నాసమయంబు
గానఁగదా యింకఁ గడగి రాఘవుఁడు, మానిక బాహుసమగ్రతఁ బూని
కలనికి నద్దశకంఠునిఁ దెచ్చి, తలకోఁత కోసి యుద్దండత నునుచు
ననిన చందంబున నతివిచిత్రముగ, నెనయంగ డెబ్బదిరెండువెల్లువల
వనచరులను నృపవరుల జయించి, ఘనతరజ్యానాదకలితుఁడై మగిడి
యాలంబు చాలించి యాయింద్రజిత్తుఁ, డాలంకలోనికి నరిగె నవ్వుచును
మనుజేశుదురవస్థ మది విచారించి, కనుఁగొనఁజాలక కన్నులు మొగిచి
కొని తొలఁగినమాడ్కిఁ గ్రుంకె నర్కుండు, వనచరాననపద్మవనములు మొగుడఁ
గపికోటిచే లంక కాలుచో ధూమ, ముపమింప నీగతి నుండు నన్నట్లు
కడు నగ్గలముగ లోకంబెల్ల నిండి, తడయ కెంతయు నంధతమసంబు పర్వె
నప్పుడు తొడిగి బ్రహ్మాస్త్రమంత్రంబు, లొప్పఁ జపింపంగ నొకటియుఁ గాక
నున్నవిభీషణుఁ డుర్వరఁ గూలి, యున్నసుగ్రీవాది యోధులఁ జూచి
వనచరులార గీర్వాణారిసుతుఁడు, వనరుహగర్భునివరమునఁ జేసి
పన్ని యేయుటయును బ్రహ్మాస్త్రశక్తి, మన్నింపఁదగు నని మనమునఁ దలఁచి
వంచించి యారామవసుమతీనాథుఁ, డించుక సైఁచినాఁ డింతియే యనుఁడు
వాయుసూనుఁడు బ్రహ్మవరమునఁ జేసి, యాయింద్రజిత్తుదివ్యాస్త్రసంతతులఁ
జావకుండుట విభీషణుతోడ ననియె, భావింపు మిప్పుడు భండనభూమి
నిటఁ బడ్డవారిలో నెవ్వరు గలరు, పటుబాణహతులయ్యు బ్రతికినవారు

అని యిద్ధఱును గూడి యంధకారమునఁ, గొనకొని మండెడి కొఱవులు బట్టి
కొని కలనెల్లను గ్రుమ్మరునప్పుడు, ననయంబు నాసంగరావనిలోన
నందంద నుడుగక యాడునట్టలును, గ్రందుగా మాంసము ల్గఱచుభూతములు
ఖడిదంబుగా నార్చు బేతాళములును, నడరెడురక్తంబు లానుఢాకినులు
కండలు గబళించు కంకగృధ్రములు, నొండొండ నెలుఁగిచ్చు నురుసృగాలములు
గెడసి రక్తములు గ్రక్కెడిభల్లూకములు, నుడుగక యందంద నొరలు కోఁతులును
గుదిచి కాళ్లను దన్ను కొనువలీముఖులు, కదిసినదంతము ల్గలప్లవంగములు
లావఱిపడిన గోలాంగూలములును, భావింపరాని రూపముల వానరులు
కీలాలవారిఁ దోఁగినయగచరులు, కేళిమైధూళి బ్రుంగినవనచరులు
పదుగుర నేఁబండ్రఁ బ్రదర మొక్కటను, గుదులు గ్రుచ్చినక్రియఁ గూలినకపులు
అంతంతఁ దుత్తుమురైనశైలములు, నింతింతలైన మహీరుహములును
ఖండంబులైన రాక్షసులశస్త్రములు, దండిగాఁ దునకలై ధర నున్నగదలు
నిండిన సామజనికరముల్ సమర,మండలిఁ బడియున్న మఱి వెఱఁగంది
కనుఁగొని ఖిన్నులై కడుదుఃఖ మడరి, యనిరి విభీషణహనుమంతు లపుడు
వలయుకార్యము జాంబవంతుని నడుగ, వలయుఁ గార్యంబు లవల నాతఁ డెఱుఁగు
నతఁడున్నయెడ నింక నరయుద మరసి, యతఁడు చెప్పినత్రోవ నరుగుద మనుచుఁ
గలనెల్ల వెదకుచుఁ గనుఁగొని రపుడు, బలితంపుశరశయ్యఁ బడియున్న వానిఁ
గని జాంబవంతు డగ్గఱి దైత్యనాథుఁ, డనియెఁ బెద్దయు నార్తుఁడై వగనొంది
బ్రతికియున్నాఁడవే పలుకంగఁగలవె, యిదె ఋక్షరాజ మమ్మెఱుఁగుదె యనిన
దానవశరహతి దర్పంబు దక్కి, హీనస్వరంబున ఋక్షేశుఁ డనియె
స్వరవిశేషంబు విచారించి బుద్ధిఁ, బరికించి నీవని పలికెదఁగాని
కలయ నమ్ములు కండ్లఁ గాడుటఁ జేసి, చలితదృష్టిని విభీషణ గానరాదు
చెవులకు నింపుగాఁ జెప్పుము నాకు, పవమానసూనుఁడు బ్రతికియున్నాఁడె
యనవుడు వెఱఁగంది యాజాంబవంతు, కనియె విభీషణుఁ డతిసంభ్రమమునఁ
గడు వెఱఁ గయ్యెడు ఘనుఁడైనరాము, నడుగక లక్ష్మణు నడుగక యినజు
నడుగక యంగదు నడుగక యతని, నడుగుట యేతలం పగు ఋక్షరాజ
యనిన విభీషణా హనుమంతుఁ డొకఁడు, తనువుతో నుండినఁ దరుచరులెల్ల
బ్రతుకుదు రాతఁడు బ్రతుకఁడేనియును, బ్రతికియుండిననైన బ్రతుకరు కపులు
అనుమాట విని ముదం బంది వాయుజుఁడు, దనపేరుఁ జెప్పి పాదములకు మ్రొక్క
మ్రొక్కిన నెఱిఁగి యిమ్ముల ఋక్షరాజు, తక్కక యాత్మ ముదంబును బొంది
తనుఁ బునర్జాతుఁగాఁ దలపోసి యనియె, ననిలనందనుతోడ నర్థి దీపింపఁ
దలపోయ వాయునందన నీవుదక్కఁ, గలుగునే యొక్కఁ డీకపులకు దిక్కు
అదిగాక యిప్పు డీయంబుధిఁ దాఁటి, వదలక యాహిమవంతంబు గడచి
హేమకూటంబును ఋషభపర్వతము, నామేరువును రజతాద్రియుఁ గడచి
శ్వేతాచలము దాఁటి శీఘ్రంబు మెఱసి, యాతతమగులవణాంబుధిఁ గడచి

యరిగి శాకద్వీప మవ్వలి కేఁగి, తరఁగల నొప్పు సుధావార్ధి దాఁటి
చంద్రశైలద్రోణశైలమధ్యమున, సాంద్రదీధితుల నుజ్జ్వలత వహించి
తిరమైన యాయోషధీశైల మెక్కి, కర మొప్పు సంజీవకరణి విశల్య
కరణియు సంధానకరణి సౌవర్ణ్యకరణియు నానాల్గు గలవౌషధములు
అవి తెచ్చి యీవానరావళినెల్లఁ, బవనతనూభవ బ్రతుకంగఁ జేసి
రాగంబు నొందింపు రామలక్ష్మణుల, వేగంబె యనవుడు విని వాయుజుండు

ఆంజనేయుం డోషధీశైలము దెచ్చి రామలక్ష్మణాదుల మూర్ఛ దేలించుట

అతని వీడ్కొని సువేలాచలం బెక్కి, చతురుఁడై పదములు సమముగా మెట్టి
లలితశేషాభవాలము మీఁదికెత్తి, నెలకొని భుజములు నిక్కించి పొంగి
రాముని దలఁచుచు రయమున నెగయ, నామహనీయాద్రి యవనిపైఁ గ్రుంగె
దెసలు గంపించె దిర్ధిరధాత్రి దిరిగె, నసమానమైనట్టి యారభసమున
నతఁ డట్టు లెగసి యయ్యాకాశవీథి, నతిభీషణంబైన యంబుధి దాఁటి
హరిచక్రమునుబోలె నరుగుచు నడుమ, తరమిడి పెక్కుచోద్యములు గన్గొనుచు
సాంద్రఫేనామృతజలనిధి దాఁటి, చంద్రశైల ద్రోణశైలమధ్యమున
తిరమైన యాయోషధీశైల మెక్కి, యరయుచు వచ్చుచో నాయోషధులు
కామరూపులుగాన గపిశేఖరునకు, నేమియుఁ బొడచూపనీవయ్యెఁ దమ్ము
ననిలనందనుఁడును నవి గానకుండి, దనలోన నందంద దలపోసి చూచి
యతివినయంబున నాపర్వతంబు, నతులగుణోదాత్తుఁడై వేఁడఁ దొడఁగెఁ
బ్రాలేయగిరియును బర్జన్యగిరియుఁ, గైలాసగిరియును గైకొన కేను
క్రన్నన వచ్చితిఁ గార్యాతురుండ, నిన్ను నుద్దేశించి నీలాద్రినాథ
నీయందు నిర్జరుల్ నెఱిదాఁచియున్న, యాయోషధము లెవ్వి యవి నాకుఁ జూపు
మా రాఘవునకుఁ గార్యము పుట్టియున్న, దేరూపమున నైన నిచ్చుట లెస్స
యనిన నగ్గిరి యట్టహాసంబుచేసి, యనిలనందనుతోడ ననియె గర్వమునఁ
బెలుచ నీవిటువచ్చి పెక్కులాడెదవు, తలఁకక యీయోషధములు న న్నడుగ
నీ వెంతవాఁడవు నిన్నుఁ దెమ్మనఁగ, నేవిధంబున రాముఁ డెంతటివాఁడు
చేకొని సురలు దాఁచిన యోషధములు, నీకు నిచ్చుటకంటె నేరమి గలదె
యని గర్వమాడిన ననిలనందనుఁడు, కినుకతో ననియె నగ్గిరితోడఁ బేర్చి
యే నిన్ను వలెనని యిటు వేఁడుకొనిన, దాని విచారింపఁ దగదొకో నీకు
నగలించి నాభుజాయతశక్తి నిన్ను, నగము మూలోన్మూలనంబుగాఁ బెఱికి
యిదె కొనిపోయెద నెఱుఁగని రాము,హృదయంబులో నప్పు డెఱిఁగెదుగాక
యని భీషణంబుగా హనుమంతుఁ డద్రి, యనువారగాఁ బట్టి యగలించి పేర్చి
పెఱికి గంధర్వుల బెదరంగఁదోలి, గురుతిడరాకుండఁ గొనిరాఁ దొడంగె
ననిలనందనుఁడు సహస్రధారలను, ఘనముగా మండు చక్రముతోడి విష్ణు
కరణి నేతేర రాక్షసవీరముక్త, శరహతి నొచ్చి మూర్ఛల నున్నకపులు
వరమహౌషధవాతవశతచేఁ దేరి, కరము సంప్రీతితోఁ గడఁగి యార్చుచును

అనిమొనఁ బడిన దైత్యావళిఁ గిట్టి, వనధిలోఁ బొఱంగ వైచిరి చెలఁగి
హనుమంతుఁడును సువేలాద్రిపైనుండి, చనుదెంచి యాకపిసైన్యంబునడుము
మహనీయమైనట్టి మందులకొండ, మిహిరప్రతాపుఁడై మెల్లన డించి
పవనవంశజులగు తపనసుతాది,కపిముఖ్యులకును స్రుక్కక ప్రయోగింప
యుక్తి నట మూర్ఛఁ దెలిసిరి వారు, నాయౌషధములమహాత్త్వంబువలన
నిమొనఁ దునకలైనట్టిదేహములు, ఘనమైన సంధానకరణిచేఁ గదిసె
రపుంజమురుశస్త్రచయము విశల్య, కరణిచే నపుడూడి గండులు పూడె
వర్ణకరణిచే సకలాంగకములు, సౌవర్ణకాంతి నుజ్జ్వలములై మించెఁ
లయంగ సంజీవకరణిచేఁ బ్రాణ,ములు వచ్చి చెలఁగుచు మునుపటికంటెఁ
దునొప్పి రెంతయుఁ గపివీరులెల్లఁ, గడఁకతో నిద్ర మేల్కనినచందమున
ప్పుడు కపివీరు లనిలనందనుని, నొప్పార నగ్గించి రుత్సాహ మొదవ
నిమొనఁ జచ్చిన యసురులఁ గపులు, వనధి నంతకుమున్నె వైచుటఁజేసి
దనంబులోని రాక్షసుఁ డొకఁడైన, బ్రతుకుట లేదయ్యెఁ బరమౌషధముల
ంత సుగ్రీవాదులైనవానరులు, సంతసంబున సూర్యచంద్రులభంగిఁ
రమొప్ప రామలక్ష్మణులకు మ్రొక్కి, యరుదార నుతియించి రనిలనందనుని
ప్పుడు మ్రొక్కెడు నాంజనేయునకు, నుప్పొంగ విబుధాళి యుర్వీశుఁ డనియె
మనకు వాసవునాజ్ఞ మన్నింపవలయు, ననయంబు గావున నమరులు మెచ్చ
నీయోషధీశైల మెప్పటిచోట, వాయుతనూభవ వైచి రమ్మనుఁడు
మారుతాత్మజుఁ డసమానవేగమున, నారాఘవుఁడు మెచ్చ నగ్గిరిచంద్రు
నెనయ నెప్పటిచోట నిరవొంద నునిచి, చనుదెంచె రయమున సంగరస్థలికి
అంత సూర్యోదయం బయ్యె రాఘవుని, చింతతో డనె కూడి చీఁకటి వాసె
నప్పుడు సుగ్రీవుఁ డారామచంద్రు, నొప్పారఁ గనుఁగొని యుల్లాస మెసఁగ
వసుధేశ పొలిసె రావణుబలం బెల్ల, ననమసాహసబలాహవకేళి వ్రాలి
గుదులు గ్రుచ్చినక్రియఁ గుంభకర్ణుండు, మొదలైన రాక్షసముఖ్యులందఱును
అదిగానఁ దనవర్గ మంతయుఁ గడఁగి, త్రిదశారికయ్యంబు తెఱఁగొల్లఁ డింక
లంకఁ గాల్పంగ గోలాంగూలబలము, పంకజహితవంశ పనుపు మీరాత్రి
ననుమాట విని కపులందఱుఁ గూడి, యినమండలము గ్రుంకు టెప్పుడో యనుచుఁ

## వానరులు లంకఁ గాల్చుట.

దమకింపుచుండంగఁ దరణి గ్రుంకుటయుఁ, దమమును పెద్దయై దట్టమై పర్వ
నప్పుడు కపివీరు లధికరోషమున, నుప్పొంగి ధీరులై యుగ్రులై కపులు
గొనియుచు నార్చుచుఁ గొరవులు పట్టి,కొని జవంబులు మీఱ గుప్పించి దాఁటి
వడి లంక ముట్టియు వాకిళ్లవారు, కడుభయంబునఁ బొఱఁగా లంకఁ జొచ్చి
యారావణునిపురి యడలి కాల్చుటకు, నారామవిభునికోపాగ్ని యేమిటికి
నీయనలము చాలదే యని పేర్చి, పాయక లంకఁ గాల్పంగఁ జొచ్చుటయు
ననలుండు దరికొని యందందఁ బర్వి, వినువీథిఁ దాఁకి దిగ్వివరంబు నిండె

నాయగ్ని బడబాగ్ని యై ధూమపటలి, తోయమై మిన్ను ప్లుతోయధివోలె
విస్మయంబుగ మణివితతులు చెదర, భస్మంబుగాఁ గాలెఁ బ్రాసాదతతులు
పొడిపొడిగాఁ గాలి పొడవెల్ల నడఁగి, పుడమి గంపింప గోపురములు గూలె
గ్రక్కున మంట లుగ్రంబుగా నెగయ, నక్కజంబుగఁ గాలి యట్టళ్లు రాలె
మహనీయకాంచనమంటపంబులును, బహురత్నమయగృహపంక్తులు గాలె
నిండినసొమ్ములు నిండినట్లుండ, భండారగృహములు భస్మంబులయ్యె
వెలలిడఁగారాని వివిధాంబరములు, దలఁపఁ బెక్కైన గంధద్రవ్యములును
బహువిధరత్నకంబళచయంబులును, మహనీయమరకతమౌక్తికాదులును
అగరు కుంకుమ మలయజ ఘనసార, మృగమదాద్యములైన మేలివస్తువులు
దఱగని బహువిధధాన్యరాసులును, మఱియును గల్గిన మహితవస్తువులు
కడునొప్పు కరితురంగముల పక్కెరలు, నెడనెడఁ బ్రోవుగా నిడినట్టిజోళ్లు
దొరల ననేకవస్తువులు దైత్యులకుఁ, గరకరిచిత్తము ల్గ్రిందంగఁ గాలెఁ
డడయక పైఁడికత్తళములు పూని, వడి నాయుధములు దుర్వారులై పూని
కవులఁ జంపెద మని గడఁగినవారిఁ, గపులపైఁ బఱతెంచి కదిసినవారిఁ
బొలఁతులతో సుఖంబుల నున్నవారిఁ, దొలఁగంగ నేరక తూలెడువారిఁ
బోలింపఁ గడునిద్ర బోయెడివారి, బాలురఁగొని భీతిఁ బాతెడువారి
నాలుగుదెసలకు నలి నేగువారిఁ, జాల రోదనములు సల్పెడువారి
నార్పంగ నురుమందిరాగ్రంబు లెక్కి, నేర్పున మఱి దిగ నేరనివారి
విడువక ధనముల వెడలంగఁ బట్టి, కడుసంభ్రమంబునఁ గదిసినవారి
ద్రోవలు గానక ధూమంబుచేత, నావలింపుచుఁ బడి యడలెడువారిఁ
గూడి నివ్వెఱఁగంది గుమురులుగట్టి, వాడవాడలయందు వదరెడివారి
నప్పుడు చూడఁ గాలాగ్నిచందమున, నిప్పులు మంటలు నెరయు నప్పురము
గాలుచు నందందఁ గడురభసమున, గాలిచేఁ జెదిరి పెక్కండ్రు నవ్వేళ
లలనలమణిమేఖలారవంబులును, గలయఁ జెన్నొందు కంకణరవంబులును
బొలుపారు రత్ననూపురరవంబులును, చెలఁగెడు నావిపంచీరవంబులును
సురుచిరమధురవచోరవంబులును, నరుదైననృత్తగీతారవంబులును
గరమింపుఁ గులుకు కేకారవంబులును, చరియింపుచుండు హంసలరవంబులును
సొంపారు పంజరశుకరవంబులును, ఇంపారు నెంతయు నేలతోఁ గలిసి
సలలితంబైనట్టి చంద్రికకంబె, తెలుపునుబొందిన దీధితుల్ గల్గి
ప్రణుతింప నొచ్చిన పద్మరాగాదిమణులచే నొప్పిన మహిమలు బలసి
కాలెడిరవములఁ గప్పెడి పొగల, ప్రేలి పెల్లెగసెడి విస్ఫులింగముల
నాలంకలోపలి హర్మ్యంబులెల్ల, చాల భీషణముగా సమసె నన్నియును
గాన సుఖంబెల్ల గ్రాగి సీతైరి, మానినీజను లభిమానంబు దూలి
చండతరంబైన శబ్దంబుతోడ, మండుచు నుండెడి మంటలఁ గూలి
నెఱపైన తోరణనికరంబు లొప్పె, మెఱుఁగులతో నొప్పు మేఘంబు లనఁగ

వినువారిగుండెలు వీనులుఁ బగుల, ననయంబు బెట్టుగా నాలంకలోన
తరమిడి యందంద దైన్యంబు మీఱి, వరవధూరోదనంబులు వినవచ్చెఁ
గాలి కాలక తమకట్టులు ద్రవ్వి, నీలిగి విడివడి నేఁగనికరులు
హయములు గ్రందుగా నాపురంబందు, రయమున ముందఱ రామబాణాగ్ని
తలఁకొని జలచరతతులు సమ్మర్ద, ములను ఘోషించు సముద్రంబువోలెఁ
బారెడువారినిఁ బఱతెంచువారిఁ, గూరినవగలతోఁ గుందెడువారి
నొదిగెడివారిని నొకకొంత గాలి, విదిలించికొంచును వెడలెడివారి
లంఘించువారి విలాపించువారి, సంఘంబులై నీరు చల్లెడివారిఁ
బట్టి యామంటలో బడఁద్రోచి త్రోచి, నెట్టన నార్తుస నెరయంగఁ గపులు
అటు లంక వికలతనంద రాఘవుఁడు, పటుతరకోదండపాణియై కదిసి
త్రిపురము ల్సాధింపఁ ద్రినయనుఁ డలిగి, విపులపినాకంబు వీఁక మ్రోయించు
కరణ నిర్వక్రవిక్రమశాలి రాముఁ, డురుతరజ్యాఘోష మొనరించుటయును
వసుధాతలంబున వడిఁ జుక్క లురిలె, వసుమతి గంపించె వార్ధులు గలఁగె
దెసదప్పిరి నశకుల్ద్రివిజాద్రి యొరగె, దెసల సందులు వ్రీలె దిక్కరుల్ బెదరె
నసమాక్షుఁ డతివిస్మయంబందె భూత,విసరంబు ఘూర్ణిల్లె విధి తల్లడిల్లె
రయమున రోదోంతరాళంబు మ్రోసె, భయమంది రెంతయుఁ బౌలస్త్యులెల్లఁ
గోదండరవము రక్షోభటసింహ,నాదంబు వీరవానరులయార్పులను
దిక్కు లొక్కట నిండె దివిజారిపురము, దిక్కు [illegible]మచుఁ దీవ్రవేగమునఁ
గైలాసశిఖరంబుకరణిఁ జెన్నొందు, నాలంకగోపురం బైదుబాణముల
వడి నూఱుతునియలై వసుమతిమీఁదఁ, బడ నేసి మఱియును బహుసాయకముల
నేసె గేహములపై నేసె సౌధముల, నేసెఁ దేరులమీఁద నేసె నేయుటయు
నారాక్షసులు పోరు కాయత్తపడఁగ, నారాత్రి వర్తించె నతిఘోరలీల
అప్పుడు సుగ్రీవుఁ డఖిలవానరులఁ, దప్పక చూచి యుదగ్రుఁడై పలికె
లావు నొప్పారంగ లంకవాకిండ్లఁ, గావలియుండు రాక్షసుఁ డెవ్వఁడైన
వెడలినఁ జంపుఁడు వెఱచితిరేని, కడుదప్పు సైరింపఁ గపివీరులార
అనవుడు కపివీరు లందఱు పేర్చి, కనలుచుఁ గుజములు ఘనశైలములును
చారుభీషణరణోత్సాహులై పూని, వారక యక్కోటవాకిండ్లనుండి
దర్పించి యార్చినఁ దరుచరావళుల, యార్పులు సైరింప కసురవల్లభుఁడు

కుంభనికుంభాదులు యుద్ధమునకు వచ్చుట

కుంభకర్ణునికొడుకుల ననికనిచెఁ, గుంభనికుంభుల ఘోరవిక్రములఁ
బనిచి వెండియును గంపనునిఁ బ్రజంఘు, ననికిఁ దోడుగ శోణితాక్షు యూపాక్షు
నారాక్షసులును గజాశ్వరథంబు, లారసి యుద్ధతి నడరి తోనడువఁ
బరిఘపట్టసగదాప్రాసాదిశూల, కరవాలకుంతముద్గరభిండివాల
శరశరాసనము లుజ్జ్వలభంగిఁ దాల్చి, గురుశక్తి దానవకోటులు నడువఁ
జారుపతాకాదిచయములం గ్రాల, భూరిభూషణదీప్తిపుంజము ల్వెలుఁగ

నధికమైనట్టిశౌర్యంబులు మ్రోయఁ, గుధరంబు లదల దిక్కులు నిండ నార్చి
పరువడిఁ గల్పాంతపవనసంఘములు, తరమిడి కాలాంబుదంబులఁ దాఁకి
విఱియించు తెఱఁగున వీడెల్లఁ గాల్చి, యఱిముఱి విహరించు నగచరావళుల
నురవడిఁ దాఁకి మహోగ్రులై కదిసి, తెరలించి నొంచి యుదీర్ణవిక్రముల
వాకిండ్లయందు దుర్వారులై యున్న, యాకపిసేనల నందంద దోల
నాలంక వెడలిన యగచరసేన, లోలి వీఁగుటఁ జూచి యోడకుం డనుచు
నురుబాహుసత్త్వసముగ్రులై పేర్చి, హరిరోమకేసరు లాదిగాఁ గల్గు
వానరు లాదైత్యవర్గంబుతోడ, మానక రోషసముగ్రులై కదిసి
తరులును గిరులును దఱుచుగా వైవ, కరవాలముద్గరగదలశూలములఁ
బరిఘపట్టసభిండివాలచక్రాది, వరశస్త్రముల నొంచి వ్రాలిన నంత
వారు నఖంబుల వక్షస్థలంబు, చీరియుఁ గర్ణనాసిక లోలి ద్రెవ్వఁ
గడిమిమై పండ్లను గఱచియుఁ దలలు, పిడికిళ్ల బొడిచియు పేర్కొన నపుడు
నొకవానరుఁడు వచ్చి యొకదైత్యుఁ బొడువ, నొకదానవుఁడు వానినుద్ధతిఁ బొడుచు
నొకరాక్షసుఁడువచ్చి యొకకపిఁ జంప, నొకకపి యాదైత్యు నురవడిఁ జంపు
నొకకపి జనుదెంచి యొకదైత్యుఁ బట్ట, నొకదైత్యుఁ డాకపి నుగ్రతఁ బట్టు
నొకదైత్యుఁ డొకకపి యుద్ధమి మ్మనిన, నొకకపి వానితో యుద్ధంబుసేయు
నెడపక యేద్దుర నెనమండ్ర నొక్క, పిడికిటఁ గపులేచి పెల్లడంగింప
నందందఁ గూలుదు రసురులు గపులు, నందఱు నుగ్రులై యార్చుచు నపుడు
ఇరువాఁగు బోరంగ నింతింతయైన, తరుమహీధరముల తరుచరాంగములఁ
గరిహయదనుజనికాయకాయముల, వరశస్త్రముల రణోర్వర ఘోరమయ్యెఁ
గడిమిమై నప్పు డంగదునితోఁ బేర్చి, కడఁగి కంపనుఁడు నగ్గద యెత్తి వైచె
నంగదుండును నొచ్చి యంతలోఁ దెలిసి, తుంగశైలమున దైత్యుని వేయుటయును
అకంపనుఁడు చూర్ణమై నేలఁ గలిసె, నాకపినాయకుఁ డార్చి మోదింప
నతఁడు చచ్చినశోణితాక్షుండు గినిసి, గతిదప్ప నరద మంగదుమీఁదఁ బఱపి
యక్షరాస్త్రములేయ నడరి యంగదుఁడు, రాక్షసుఁడున్న యారథముపై నుఱికి
విల్లు ద్రుంచుటయును వెస నొడ్డ నమ్ము, నుల్లసితాసియు నుగ్రతఁ గొనుచు
నాకాశమునకు నయ్యసుర పోవుటయు, నాకపివీరుండు నతనితో నెగసి
యారాక్షసునిచేతియడిదంబుఁ బుచ్చి, యారాక్షసుని వ్రేయ నతఁడు మూర్ఛిల్లె
నంతకుఁడై రాక్షసావలిఁ దునుము, నంతలోననె శోణితాక్షుండు తెలిసి
గదఁ బుచ్చికొనుచు నంగదు గూడఁబాఱఁ, గదిసె నప్పుడు తోడుగాఁ బ్రజంఘుండు
యూపాక్షుఁడది చూచి యొగిరాఁగఁ జూచి, యేపున ద్వివిదుండు నేచి మైందుండు
నాయంగదునకుఁ దోడై కూడికొనిరి, ఆయార్వురకు ఘోరమయ్యె రణంబు
అప్పుడు వానరు లగములు గురియఁ, జప్పరించుచును బ్రజంఘుండు ద్రుంచె
మఱియు నాముగ్వురు మర్కటేశ్వరులు, దఱుచుగా గిరులును దరులును నెత్తి
శిరరథాశ్వములపైఁ గడుబెట్టు వ్రేయ, నరుదుగా వడుము యూపాక్షుండు ద్రుంచె

విని విస్మయంబుగా ద్వివిధమైందులును, బెనఁగొని వృక్షము ల్పెఱికి వైచుటయు
నవియన్నియును శోణితాక్షుండు నడుమఁ, గవిసి చూర్ణములుగా గదగొని యేసెఁ
గలకలధ్వని యొప్పఁ గరవాల మెత్తి, జళిపించుకొనుచుఁ బ్రజంఘుండు గదియ
మానైన యొకనల్ల మద్దిమా నెత్తి, వానిపై నడరించి వారక మఱియుఁ
బిడికిట వక్షంబు బెట్టుగాఁ బొడువ, నడిదంబు వైచి యయ్యసుర కోపించి
పిడుగున కెనయైన పిడికిటఁ బొడిచె, బొడిచిన వెస మూర్ఛఁ బొందియుఁ దెలిసి
సమధికముష్టిఁ బ్రజంఘు మైందుండు, తమకించి పొడిచిన ధరణిపైఁ గూలెఁ
బృథివిపై నిటు దనపినతండ్రి పడుట, ప్రథితంబుగాఁ జూచి రథ మటు డిగ్గి
యడిదంబు దాల్చి యూపాక్షుండు నడువ, విడఁ వనియలుకతో ద్వివిదుండు దాఁకి
వరముష్టి యమరించి వక్షంబుఁ బొడిచి, గురుసత్త్వుఁడై పట్టుకొనుటయు నపుడు
అతనితమ్ముఁడు శోణితాక్షుండు వచ్చి, వితతబలం బొప్ప ద్వివిదునిఱొమ్ముఁ
బిడికిట నొప్పించి పెనుమూర్ఛఁ బుచ్చి, విడిపించుకొని పోయె వేగ యూపాక్షు
దెలిసి మైందునితోడ ద్వివిదుండు గూడి, సొలవక యూపాక్ష శోణితాక్షులను
ఆటు దాఁకి వారితో ననిసేయునపుడు, చటులత ద్వివిదుఁ డాశ్చర్యంబు గాఁగ
నలమి క్రమ్మిన శోణితాక్షునిఁ బట్టి, ఇలవైచి ప్రాణ రూపేర్పడకుండ
నడరి మైందుండు యూపాక్షునిఁ గిట్టి, బెడిదంబుగాఁ దనపిడికిటఁ బొడిచి
చలమున ధీరుఁడై చంపెను వేర్చి, నలియ నెమ్ములు మేను నలినలిగాఁగ
నిలమీఁదఁ గపులచే నిట్టిచందమున, నలువురు పడుటయు నానాముఖముల
నేపరి రాక్షసు లెల్లను బాఱఁ, గోపించి యప్పుడు కుంభుండు వారి

కుంభనికుంభుల యుద్ధము

వెఱవకుం డని తనవింటిలావొప్ప, మెఱుఁగుటమ్ములు దొడ్డి మెఱుఁగులతోడి
సురచాప మనఁజాలి శోభిల్లుదాని, పరఁగఁ బ్రత్యాలీఢపాదుఁడై నిల్చి
తెగఁగొని వేయఁగ ద్వివిదుండు భిన్నుఁ, నగముకై వడిఁ గూలె నతిఘోరబిల
ముందఱ ననుఁగుఁదమ్మునిపాటుఁ జూచి, యందంద మైందుండు నసమవేగమునఁ
గుంభునిపై నొక కొండ వైచుటయుఁ, గుంభుఁ డైదమ్ములఁ గుధరంబుఁ ద్రుంచి
మఱియు నొక్కమ్మున మైందుని నేయ, నొఱగె నయ్యగచరుం డుర్వరమీఁద
ధరమీఁద నీగతిఁ దనమేనమామ, లిరువురుఁ గూలిన నేచి యంగదుఁడు
కుంభునిపై వైచె ఘోరభూధరము, కుంభుఁ డేడమ్ముల గుధరంబుఁ ద్రుంచి
నెఱబాణములు మూఁటనిటలంబు నేసి, మఱి పెక్కుశరముల మర్మంబు లేయ
నెరియుచుఁ గుంభుపై నెగసి యంగదుఁడు, తరు లెత్తి వైచె న త్తరువును ద్రుంచి
యాకుంభుఁ డంగదు నందంద మఱియు, భీకరబాణసంపీడితుఁ జేయ
నతఁడు మూర్ఛిల్లిన నారాముకడకు, నతివేగమున వాన రావలి పాఱి
యంతయుఁ జెప్పిన నధిపతి జాంబవంతుఁ డాదిగఁ గల వనచరోత్తములఁ
బనిచిన వారును బాదపశిలల, దనుజుల నొంచుచుఁ దఱుమఁ గుంభుండు
వారి ననేకతీవ్రప్రకాండముల, వారక నొప్పించి వారి వారించె

నప్పుడు సుగ్రీవుఁ డాకపివరుల, నప్పరుసునఁ బడ్డ యంగదుఁ జూచి
కోపంబు ముడివడఁ గుంభునిఁ జూచి, యేపారఁగాఁ జొచ్చి యెన్నఁ బెక్కైన
ఘనశైలములు సశ్వకర్ణవృక్షములు, వనచరులార్వంగ వైచి పెల్లార్చె
నవియన్నియును గుంభుఁ డంతలోఁ ద్రుంచి, రవిజునిఁ బెక్కుమార్గణముల నొంప
స్రుక్కి కాతనివిల్లు సుగ్రీవుఁ డోడిసి, యక్కజంబుగఁ ద్రుంచి యటు పాఱవైచె
దంతంబుఁ దునిమినఁ దఱిమి పైవచ్చు, దంతిచందంబునఁ దఱిమి కుంభుండు
కడురోషమున మండి కడఁగి సుగ్రీవుఁ, బడవైతు నని పాఱి పట్టుకొన్నప్పు
డినజుండు కుంభుండు నిభములు రెండు, పెనఁగినకైవడి పెనఁగి రుద్ధతిని
గరలాఘవము లొప్ప ఘనశక్తి మెఱసి, చరణఘట్టనల భూస్థలము గ్రక్కదలఁ
బొగలచందమున నూర్పులు గ్రమ్ముచుండ, మిగిలినతాఁకుల మిన్నెల్లఁ బగుల
అప్పుడు సుగ్రీవుఁ డాకుంభుఁ బట్టి, త్రిప్పి యంబుధి వైచె దేవతలార్వ
దనుజుఁ డావారిధితలము ఘోరంబు, దనరారఁ బడియె మందరశైల మనఁగఁ
బడియు నాదనుజుండు భానుజుఁ జేరఁ, గడఁకతోఁ దుత మహోగ్రత నేఁగుదెంచి
బెడిదంబుగా ఱొమ్ముఁ బిడికిటఁ బొడువ, నెడ వ్రచ్చి యదియు నాయెమ్ములు దాఁకఁ
గడిఁది వజ్రము దాఁకఁ గనకాద్రి వెడలు, మిడుఁగురులో యన మిడుఁగురు లెగసె
దానికిఁ గోపించి తరణినందనుఁడు, దానవాధము నురస్స్థల మారఁ జూచి
యచ్చెరువుగ ముష్టి నమరించి పొడువఁ, జచ్చె నద్భుతబహుసత్త్వుండు దూలి
వాఁడంత శాంతపావకుఁడును బోలె, వేఁడిమి చెడి పడ్డ వెఱచి రాక్షసులు
పఱచిరి దివియు భూభాగంబు వగుల, నెఱి దప్పి యెంతయు నీరధి గలఁగ
నప్పుడు దమయన్న యవనిఁ గూలుటయు, నిప్పులు చెదరెడు నెఱిచూడ్కు లడరఁ
గొలఁదికిమీఱిన కోపంబుతోడ, నలి నికుంభుఁడు సింహనాదంబుచేసి
కనకరత్నప్రభాకలితమై తనరి, యనయంబు గంధపుష్పార్చితంబైన
పరిఘుఁ ద్రిప్పుటయును బ్రహ్మాండమెల్ల, నురిలెడుగతినుండె నుగ్రభావమున
నాశలన్నియుఁ దీరినట్లయ్యె వాయు,పాశంబులను ద్రెస్సి పలువిధంబయ్యె
హనుమంతుఁ డప్పు డుద్ధతి దైత్యుఁ దాఁకి, యినతనూభవునకు నెడసొచ్చి పేర్చె
ఘోరాజిఁ బరిఘ నికుంభుండు ద్రిప్పి, మారుతివక్ష మున్మత్తుఁడై వ్రేసె
వ్రేసిన నత్యుగ్రవిస్ఫులింగములు, భాసమానంబులై పర్వుచునుండ
నురములోఁ జెయువెట్టిదో యన నపుడు, కరమరుదుగ పరిఘము తుమురయ్యె
వాలినపరిఘంబు వాటున నతఁడు, గాలిచేఁ దూలు వృక్షంబునుబోలెఁ
దూలియు ధైర్యంబుతోడ నికుంభు, వాలినపిడికిట వక్షంబు వొడిచెఁ
బొడిచిన నాదైత్యపుంగవునురము, కడు వ్రస్సి నెత్తురు గ్రమ్ముదెంచుటయు
నతఁడు మహానిలాహతి మహీజంబు, గతిఁ గంప మొందియుఁ గ్రమ్మఱఁ దెలిసి
హనుమంతుఁ బట్టి యుద్ధతి మీఁదికెత్తి, దనుజులార్వఁగ వియత్తలమెల్ల నద్రువఁ
గడువేగమున వైవఁ గపికుంజరుండు, విడిపించుకొని రణోర్వీస్థలి కుఱికి
కడఁగి నికుంభు నుగ్రత బిట్టు వొడిచి, వడిఁ బడవైచి యవ్వసుమతిమీఁద

విసరి యమ్ములు పారవ్రేసి యొప్పెక్కి, దెస లద్రువఁగఁ దలఁ ద్రుంచి పెల్లార్చె
నారభసంబున నవనియు మిన్ను, వారిధులును దిశావలయంబు మ్రోసె
హతశేషరాక్షసు లాలంకలోని, కతిరయంబునఁ జని యారావణునకుఁ
గుంభనికుంభాదిగురుసత్త్వధనులు, కుంభినిమీఁద నార్గురు దైత్యవరులు
కూలుట చెప్పినఁ గోపించి యసుర, వాలిన ఖరుఁ డనువానినందనుని
మకరాక్షుఁ బిలిచి సమగ్రసైన్యములఁ, బ్రకటంబుగాఁ గూర్చి పరఁగంగ నీవు
రామలక్ష్మణుల మర్కటములఁ జంపి, రా మగఁటిమి నని రావణుఁ డాడ

## మకరాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట

విని మహోత్సాహుఁడై వేగంబ వాఁడు, దనతండ్రిపగఁ దీర్పఁ దనకబ్బె ననుచు
ముదముంది తనరెండుమూఁపు లుప్పొంగఁ, ద్రిదశారి కప్పుడు ధీరుఁడై మ్రొక్కి
వీడ్కొని రథమెక్కి వెడలి కయ్యంబు, వేడ్కతోఁ దనయొద్ది వీరుల కనియె
మీరు సమగ్రత మెఱసి యుగ్రతను, బోరుఁడు కపులతోఁ బోరిబోరి నేను
రామలక్ష్మణుల మర్కటుల నాధైన, భీమశరాగ్నుల భిన్నులఁ జేసి
యేఁచెద ననవుడు నెలమి దానవులు, ద్రోచితో నడవంగ దుశ్శకునములు
గలిగెఁ బెక్కువియెల్లఁ గనియు నయ్యసుర, తలఁకక తూర్యనాదంబులు సెలఁగ
నలినార్చి కవిసె వానరసేనమీఁద, నిలయు నాకాశంబు నిట్టట్టుఁ బడఁగఁ
దఱిమి వానరులును దరులును గిరులు, దఱచుగా వైచిరి దైత్యులమీఁద
దానవులును గదాదండకోదండ, మానితఖడ్గాదిమహితశస్త్రముల
వాని నన్నింటిని వడిఁ ద్రుంచి వైచి, వానరకోటిఁ దీవ్రత నొంచి యార్చి
రాసమయమ్మున నమ్మకరాక్షుఁ, డాసర్వకపులపై నతివేగ రథము
పఱపుచుఁ గదిసి ముప్పదిట నూఱింట, నఱువదింటను మఱి యఱువదేనింట
నిరువదింటను వెస నిరువదాఱింటఁ, బరఁగ నాఱింటను బండ్రెంట రెంటఁ
బదిటఁ బదేనింటఁ బదునెన్మిదింటఁ, బదుమూఁట నాల్గింటఁ బదునాలుగింటఁ
దెగఁగొని మూఁట నైదింట నేడింట, నగలించి తొమ్మిది యమ్ములనేసె
నవి సహింపఁగలేక యఖిలవానరులు, భువి తల్లడిల్ల నప్పుడు పాఱుటయును
ఏమిభయం బిట నేనుండ ననుచు, రాముఁడు విలుఁగొని రాక్షసుల్బెదరఁ
జతురంగబలములఁ జంపుటఁ జూచి, యతికోపమున మకరాక్షుండు పేర్చి
యరదంబు పఱపించి యారాము డాసి, ఖరసూతి నేను రాఘవ మున్ను నీవు
పెరిఁగి మాతండ్రిఁ జంపినఁదానఁ జిత్త, మెరియుచునుండె నాకింతకాలంబు
నాకు నీతోడి రణం బబ్బుటయును, జేకొని చింతింతుఁ జేకూడె నేఁడు
తరలకు నీవు మాతండ్రిసూఁడునకు, నెరయంగఁ బోరాడ నిన్నంటి నేను
దుర మొనరింపు నాతో వింటనైనఁ, గరవాలముననైన గదనైన ననుఁడు
వానితో రాఘవేశ్వరుఁడు కోపించి, దానవాధమ యీవృథాగర్వమేల
భాసిల్లు నాబాహుబలము సొంపారఁగా సమరంబున ఖండింతు నిన్ను
ననుడు రాముని మకరాక్షుండు గిట్టి, ఘనమైన నిశితాంబకంబుల నేసె

నేసిన నవి రాముఁ డెడఁ ద్రుంచివైచె, నాసమయంబున నవనియు మిన్ను
నిండ నాయిద్దఱ నిష్ఠురచాప, దండమహాగుణధ్వనులు పెల్లడరె
సురఖేచరాదులు చోద్యంబునొంద, నరుదార నేయు రామాస్త్రంబులెల్ల
నతివేగమున మకరాక్షుండు ద్రుంచి, యతనిపై బాణంబు లడరించుటయును
నవి రాఘవుఁడు త్రుంచి యమ్మకరాక్షు, వివిధనిష్ఠురశరావృతుఁ జేయ నతఁడు
నవియెల్లఁ గడఁగి యత్యంతరోషమున, వివిధఖండములు గావించి పెల్లార్చె
గోపించి కాకుత్స్థకులుఁడు నద్దైత్యు, చాపంబు వెస నొక్కశరమునఁ ద్రుంచి
సారథి నెనిమిదిసాయకంబులను, నారథంబును ఋజీ యన్ని బాణముల
వికలత్వ మొనరింప విరథుఁడై యపుడు, మకరాక్షుఁ డొక్క సమగ్రశూలంబు
వైచిన నది వేగ వచ్చుట విభుఁడు, చూచి మూఁడమ్ములఁ జూర్ణంబుచేసె
అనిమిషు లారాము నగ్గించి రపుడు, దనుజుండు కినిసి యాదశరథాత్మజునిఁ
బిడికిటఁ బొడువంగ బిట్టేగుదేర, నడుమనే యారామనరనాయకుండు
అనలాస్త్రమున హృదయము గాడనేయ, నరిమొన నమ్మకరాక్షుండు గూలెఁ
బ్రథితారుణప్రభాభాసియై యంత, బ్రథమాద్రిపైఁ దోఁచెఁ బద్మబాంధవుఁడు
హతశేషరాక్షసు లాలంక కరిగి, యతఁడు చచ్చుటఁ జెప్ప నారావణుండు
కోపంబు చింతయుఁ గూడి చిత్తమున, నేపార ననియె నయ్యింద్రజిత్తునకు
రణమునఁ గపులను రామలక్ష్మణుల, క్షణమాత్రమునఁ జంపఁగాఁ జాలువాఁడ
నీవె కాకింక నాకెవ్వరు గలరు, నీవిట నీవాహినీసమేతముగఁ
జని యందఱను జంపి చనుదెమ్ము తొల్లి, యనిమిషకోటుల ననిఁ ద్రుంచుకరణి
రణమున గెల్చి సంరంభంబుతోడఁ, బ్రణుతింప నేతెమ్ము ప్రమద మొప్పార
ననవుడు నింద్రజిత్తా రావణునకు, వినయంబుతో మ్రొక్కి వీడ్కొని కదలె
వాయువేగములయశ్వంబులఁ బూన్చి, యాయితంబైనట్టి యరదంబు నెక్కి
శరదభ్రసంవృతశైలంబుకరణి, గురుభుజుండై వెలిగొడుగులనీడ
రమణీయకంకణరణితము మ్రోయ, రమణు లిమ్ములఁ జామరమ్ములు వీవ
నొలసి మోమున సంగరోత్సాహలీల, దళుకొత్త నేతెంచి తల్లికి మ్రొక్కి
జనని దీవింపఁగఁ జని తనపత్నిఁ, దనయుల వీడ్కొని తమ్ములఁ జావుఁ
దలపోసి కోపాగ్ని దరికొనఁ జేర్చి, యలఘుదర్పంబున నయ్యింద్రజిత్తు
మానక రోషసమగ్రతతోడ, దానవకోటులు దన్ను సేవింప
ఘనకామరూపులు దనమంత్రివరులు, తనుఁగొల్వ నుత్తరద్వారంబునందు
నద్రులగతిఁ దేరు లఱువదికోట్లు, భద్రగజంబులు పదుమూఁడుకోట్లు
కొరలెడు నాల్గేసి కొమ్ములు కరులు, పరఁగంగఁ గోటినిర్ఝరవృత్తినడువఁ
దురగంబు లరయంగఁ దుద నూఱుకోటు, లురుతరహేషంబు నొప్పుచు నడువ
భేరుండములఁ బోలి పెంపువహింప, భూరివేగంబునఁ బొలుపారునట్టి
చిలుకవన్నియలతోఁ జెలఁగుగుఱ్ఱములు, కొలఁదులై నాలుగుకోటులు నడువ
వలుద నిస్సాణాదివాద్యముల్ మ్రోయఁ, గలనికి వెడలె లంకాపురినుండి

తనచుట్టు దైత్యు లసంఖ్యులు గొలువ, (?) ఘనతరభీషణాకారంబుతోడ
వానరవీరదుర్వారసాదముల, మానైన రణమహీమధ్యంబుఁ జొచ్చి

## ఇంద్రజిత్తు హోమముఁ జేసి కృత్తి యనుశక్తిఁ బుట్టించుకొని మాయాయుద్ధము చేయుట

యరదంబు డిగి ధీరుఁడై కాచియుండఁ, దిరిగి రాదైత్యులఁ దెఱఁగొప్ప నిలిపి
గురుతరవేది త్రికోణమై పెద్ద, పరపొంది దక్షిణప్రవణమై యున్న
భూరిశ్మశానాగ్ని పొలుపారఁ దెచ్చి, ధీరుఁడై వేదిలో దీపింపఁజేసి
రక్తవస్త్రంబులు రక్తమాల్యములు, రక్తచందన మురక్తుఁడై తాల్చి
దండంబు నుపవీతతతియు మౌంజియును, నిండుమనంబుతో నెరయంగఁ బూని
యలవడ నచట ఖట్వాంగధ్వజంబు, నిలిపి కపాలంబు నిష్ఠతో నెక్క-
పరగంగఁ గంకాళపరిధిఁ గావించి, తిరముగా దక్షిణదిశ స్రుక్స్రువంబు
లినుపపాత్రల నుంచి యేర్పడఁ గృష్ణ, తనుఁడైన వానిరక్తము మాంసమును
పొరిఁబోరి నవి నిండఁ బోసి మానంబు, ధరియించి యప్పు డధ్వరణక్రమము
దప్పకయుండ మంత్రము లుచ్చరించి, చొప్పడ నినుప స్రుక్స్రువములు పట్టి
కమియఁ బావకుఁడును గడునొప్పు తాటి, సమిధలు తిలలును సర్షపంబులును
హోమంబు సేయంగ సురుతరం బగుచు, నాముహాధూమ మజాండంబు గప్పె
నాయగ్నిలోనుండి యప్పుడు వేగ, యాయతంబైనట్టి యరదంబు వెలుఁగ
రయమున నుగ్రకరాళకేశములు, భయదరూపంబు కపాలపాత్రయును
దళతళ మను కోఱదడలు మెఱయ, ములగ కార్చుచు నస్థిమాలిక లలర
నెఱరుంట లొలికెడు నేత్రంబు లొప్ప, నుఱక హాసము[illegible]ప నొకవృత్తి వెడలి
పంపుము పంపు మేపనికైన నన్ను, సొంపారఁ జేసెద సురవైరి యనుడు
నాకృత్తి నడిగి యింద్రారి శస్త్రములు, నాకృత్తిఁ గైకొని యాకాశమునకు
నరదంబుతోడనె యరిగి వానరులఁ, దిరిగి యేయుటకు నదృశ్యుఁడై యుండె
అంతట నారావణాత్మజు సేన, యంతయుఁ గ్రమ్మఱ యరిగె లంకకును
అట నింద్రజిత్తును నాకపిసేనఁ, బటుశిలీముఖపరంపరల నొప్పింప
వలియ దా.కడిశిలావర్షంబు చేశఁ, బలుదెసఁ జెడిపాఱు పక్షులో యనఁగ
ఛిన్నభిన్నాంగులై చెదరిరి కొంద, ఱున్నతగతి దప్పి యుండిరి కొంద
ఱెసఁగంగఁ జేవురు కేఱులతోడి, వసుమతీధరములు వడిఁ గూలుకరణి
బడిరి రక్తంబులపైఁ బఱుఁ దొరఁగఁ, గుఱుసుగా మఱి యొకకొందఱు కపులు
అప్పు డాముమ్ములయంధకారంబుఁ, గప్పి యెవ్వరికినిఁ గానరాకుండ
నంత వానరవీరు లంతరిక్షమున, నంతర్హితుండగు నాయింద్రజిత్తు
బొడగానఁజాలక భూనభోంతరము, వడి నిండఁ బఱతెంచు వాఁడిబాణముల
నడుములు దెగువారు నలిమైనవారు, కడికండలై నేలఁ గలసినవారు
కడిమిమై నాఱికిఁ గైకొన్న తరులు, విడిచి యమ్ములు గాడ వెసఁ జచ్చువారు
నడునెత్తిఁబడు ఘోరనారాచసమితి, పుడమితోఁ గీలింపఁ బొడవులు సెదర

నిలువు చచ్చినవారు నిఖిలాంగకముల, బలుబాణములు గాఁడఁబడి పొరల్వారు
మాతంగశవముల మాటుకొన్వారు, చేతుల గిరులెత్తి చేష్టించువారు
దృష్టికిఁ దోఁపక తిరిగి విస్వీథి, దృష్టించి యోడులు దీటెడువారు
నఖిలాశుగప్రవాహములు పైఁదొరఁగ, ముఖసరోజములకు మురియ రాకుండ
బొందిమీఁదికి నెత్తి భూరిసేతువుల, చందంబుగాఁ బ్రకోష్ఠము లొడ్డువారు
ప్రేవులు ప్రోవులై పృథివిపైఁ బడఁగ, నావులింతలతోడి నధికనిద్రలను
గనుమూయువారును గడిమి రామునకు, నని ప్రాణ మీఁగంటిమని పల్కువారు
చిచ్చఱపిడుగుల చెలువునఁ జదల, వచ్చుకోలలఁ గేల వడినొడ్డువారు
వాలంపపాదువుల వాలఘాతములఁ, దూలించువారు నెత్తుటఁ దోఁగువారు
ఘోరాంబకంబులఁ గొనియు ధైర్యంబు, లారంగ నిశ్చలులై యుండువారు
దుర్లభ్యుఁ డితఁడని తొడరంగ నేఁడు, దుర్లభంబని బ్రహ్మ దూషించువారు
బ్రహ్మ యిచ్చినశక్తిఁ బదిలుఁడై వీఁడు, బ్రహ్మాండమునఁ గానఁబడకున్నవాఁడు
బ్రహ్మవరం బెంత బ్రహ్మాండ మెంత, బ్రహ్మ యెంతటివాఁడు పార్థివేంద్రునకుఁ
దలపోయ ననిలోన ధరణీశుఁ డేటి, కలుగఁడో యనువారునై యుండ మఱియు
నుద్దండకోదండ మొకచోట మొఱయ, నుద్దామశరజాల మొకచోట నిగుడ
నొకచోటఁ దనుఁజెప్ప నొకచోట నార్చు, నొకచోట నదలించు నొకచోట నవ్వు
నొకచోట హుంకార మొనరించునట్లు, సకలభీకరలీలఁ జరియింప నలిగి
యురుభుజుం డాంజనేయుఁడు నంగదుండు, శరభుండు ఋషభుండు జాంబవంతుండు
గజుఁడు గవాక్షుండు గంధమాదనుఁడు, విజయుండు నీలుండు వెస సుషేణుండు
పనసుండు మొదలుగాఁ బటుపరాక్రములు, వనచరులందఱు వడిఁ దరుల్గిరులు
నిగిడి యాకసమెల్ల నిండ వైచుటయు, మొగి వచ్చుశరముల ముఱియలై చెదరి
జడియ శరానిల చటులవేగమున, నుడుగని మోఁతతో నురవడి వచ్చి
యాశైలములు దరు లప్పుడు దునిసి, యాశకలములపై నందందఁ దొరఁగ
నాశంబులైరి వానరులు పెక్కండ్రు, ఆశాకరీంద్రంబు లవని కంపింప
మెఱసిన కడిమిమై మేఘనాదుండు, నెఱయంగ నిగుడించు నిబిడబాణములఁ
గొందఱు తునియలై కూలిరి భీతి, నొంది కొందఱు పాఱి రొదిగి దిక్కులకుఁ
బ్రదరపరంపర ల్పఱపుచు నిట్టు, పదికోటు లగచరపతుల రూపడఁచి
వెండియు నెదిరిన వీరవానరుల, ఖండించి యతిచండకాండసంతతుల
నతులవిక్రముఁడైన హనుమంతు వాలి,సుతు శతబలి గవాక్షుని నీలు నలుని
బంధురబలుఁడైన పనసుని గుముదు, గంధమాదను ఋక్షకపియూథపతుల
మఱియుఁ గొందఱ నుగ్రమార్గణావళుల, నఱిముఱి నిశ్చేష్టులై యుండ నేసి
యాదితేయులగుండె లవియ నమ్మేఘ,నాదుండు పటుసింహనాదంబు సేయ
మునముల భీతిల్లి మానము ల్దూలి, వనచరు ల్దనవెన్క వచ్చి చొచ్చుటయు
సౌమిత్రియును రామచంద్రునిఁ జూచి, భూమీశ యీమాయ పొందున వీఁడు

వినువీథి నత్యంతవిభవంబుతోడఁ, దనుఁ గావరాకుండ దర్పించినాఁడు
గర్వించి యిబ్భంగిఁ గపివీరబలము, సర్వంబు సమయింప సమకట్టినాఁడు
మన మింతలో వీని మడియింపవలయు, ననవుడు శ్రీరాముఁ డనుజుతో ననియె
విను బ్రహ్మవరమున వినువీథి వీఁడు, దనరూపు చూపక డాఁగియున్నాఁడు
మనమెంత యలిగిన మనకు లోఁబడఁడు, వినుము లక్ష్మణ నేఁడు వీఁ డసాధ్యుండు
అస్త్రంబు లేమియు నతనిపైఁ గొలుప, నస్త్రము ల్చెడిపోవు నని పల్కుచుండ
నాసమయంబున ననిలుండు వచ్చి, భాసురమృదువచోఫణితి నిట్లనియె
విను వీనిమాయకు వెరవు భూనాథ, దనర నాగ్నేయమంత్రము జపియించి
నీవు బాణం బేయ నెరిఁ దప్పి కృత్తి, దేహారిఁ బాసి యదృశ్యమై పోవు

## శ్రీరాముఁ డాగ్నేయాస్త్రముచే నింద్రజిత్తునిమాయ దెరల్చుట

నని యర్థిదీపింప ననిలుండు పలుక, జననాథుఁ డాహవసంరంభ మెసఁగ
మానితంబగు నగ్నిమంత్రపూతంబుగా నమ్ము సంధించి కడఁకతో నేయఁ
గృత్తి యత్యద్భుతక్రియ నింద్రజిత్తు, నత్తఱి నెడఁబాసి యరిగె నెందేని
ఆయింద్రజిత్తును నవని కేతెంచి, యాయెడఁ గార్ముకజ్యావాద మడరఁ
గడఁగిన నంత నక్కపికులోత్తంసు, లడరిన యామూర్ఛ లందంద తెలిసి
వడిఁ గూడికొని వచ్చి వానిపైఁ గవిసి, కడిఁదియౌ శైలశృంగమును వాయుజుఁడు
గండశైలముల నంగదుఁడు మైందుండు, దండిమై ఘనపర్వతమును గజుండు
జయమూలమైన వృక్షమును నీలుండు, రయమున నశ్వకర్ణంబున నలుఁడు
అవనీధరంబును నర్కనందనుఁడు, నవిరళశాఖిని నటఁ బనసుండు
కదిసి యుగ్రంబైన గద విభీషణుఁడు, గదరుచు సాలవృక్షము సంపాతి
భూజమహాశైలముల వలీముఖులు, నాజాంబవత్ప్రముఖాదివీరులును
వలినార్చి మూఁడుబాణముల లక్ష్మణుఁడు, కలయంగ నూరంబకముల రాఘవుఁడు
వానిపై నడరింప వాఁ డంతవట్టు, నానాంబకములఁ జూర్ణములు గావించి
యనలోగ్రఘోరంబులైనబాణముల, వనచరసేనల వడిఁ బెల్లువఱపి
కరలాఘవం బొప్ప గంధమాదనునిఁ, బరుషోగ్రకరములఁ బదునెన్మిదింట
నేఁడింట మైందుని నేడింట ద్వివిదు, నేడింట హనుమంతు నేడింటఁ గుముదు
వడిఁ దొమ్మిదింట నవ్వాలినందనునిఁ, గడిమి నన్నియ సాయకమ్ముల నలుని
నైదింట నీలు గవాక్షు నేడింట, నాదిత్యనందను నఱువదేనింటఁ
బనసుని నిరువది పటుసాయకముల, నెనయంగ దధిముఖు నేకబాణమున
నెసఁగ లక్ష్మణు డెబ్బదేనంబకముల, వసుధేశు నఱువది వరసాయకముల
సాయకత్రయమున శతబలి నూఱు, సాయకంబుల విభీషణుని నొప్పించి
మఱియుఁ దక్కినబలు మర్కటవరులఁ, గొఱప్రాణములతోడఁ గూల నేయుటయు
నప్పుడు హనుమంతుఁ డచలశృంగంబు, నుప్పొంగి యంగదుం డురుగండశిలయు
పనసవిభీషణు ల్బలుగద ల్బలిమి, దనర సంపాతి యుత్తాలతా మును

నలుఁడు సారాశ్వకర్ణముల నందంద, నలినాప్తతనయుఁ డున్నతగ్రావములను
సౌమిత్రి మూఁడుగ్రసాయకంబులను, భూమీశుఁ డురుశరంబులు నూఱు వఱుప
శరభుండు ఋషభుండు జాంబవంతుండు, నురుభుజుం డగుగవయుఁడు సుషేణుండు
వెస గవాక్షుండును ద్వివిదమైందులును, నసమానవిక్రము లయినవానరులు
తక్కినవారును దరుశైలతతుల, నక్కజంబుగఁ బేర్చి యందంద వైవ
వానిఁ దుత్తునియలై పడఁ గూలనేసి, భానునందను నొక్క భయదభల్లమున
వక్షంబు నొప్పింప వడఁకి పెన్గాలి, వృక్షంబు చలియించువిధ ముండె నతఁడు
ఆలోన ఋషభ గవాక్ష సుషేణ, వాలినందన జాంబవంతులు కుముద
మారుతసుత గంధమాదన నలులు, వీరాదిగాఁగల వీరవానరుల
వివశులఁగాఁ జేసి వివిధబాణముల, నవనీశుపై నేసి యస్త్రలాఘవము
విలసిల్ల లక్ష్మణు విలుఁ ద్రెవ్వనేసి, యలుక విభీషణు నదరంట నేసి
విలయకాలాంబుదవిధమునఁ జెలఁగి, పలుమాఱు గర్జించి పలికె నెంతయును
చూచితె రఘురాము సుగ్రీవముఖ్య, లేచందమునఁ గూలి రేనల్గి నపుడు
నరనాథతనయ నిన్నమ్మినయట్టి, బిరుదు వానరజాతి పీచంబు లడఁగె
ననుచు వెండియుఁ బేర్చి యన్నిశాచరుఁడు, ఘనబాణతతుల నక్కపిసేనమీఁద
నడరించె ఘనభూధరాభదేహముల, నెడ లేకయుండ ననేకమార్గణము
లటు లేసి తెలిసితి నని యార్చికొనుచుఁ, బటుగతి లంకలోపలి కేఁగి యంత
తనసంగరక్రీడ దశకంఠుతోడ, వినుతంబుగాఁ జెప్ప విని యతం డుబ్బి
తనయ రమ్మనుచు నందనుఁ గౌఁగిలించి, కొని నాకు నీయట్టికొడుకు గల్గంగఁ
బగవారిచే నాజిఁ బడినబాంధవుల, పగ నీగఁ గాంచితిఁ బాసె నావగపు
కడిఁది వీరుఁడు కుంభకర్ణుండు మడిసె, నడఁగె మహాబలుం డగుప్రహస్తుండు
మృతిఁబొందెఁ ద్రిశిరుండు మేటివీరుండు, హతుఁడయ్యె నతికాయుఁ డాలంబులోన
నొగి మహాపార్శ్వ మహోదరు ల్వడిరి, తెగిరి నరాంతక దేవాంతకులును
గుంభకర్ణునిసుతు ల్ఘోరవిక్రములు, కుంభుండు పడియె నికుంభుండు సమసె
మకరాక్షుఁ డనిలోన మడిసె తోడ్తోన, సకలనిశాచరసైన్యంబు వాలిసె
లంకఁ గాల్చెను నొకయలఁతియా కోఁతి, ఇంక నేటికి మాట లివియెల్లఁ దలఁచి
రయమునఁ జని నీవు రామలక్ష్మణుల, భయదసాయకపరంపర లేసి చంపు
రణదక్షుఁడవు నీవు రణములోఁ దొల్లి, తృణలీల గెలిచితి దేవేంద్రుఁ గడిమి
నీ వేచి నడచిన నిఖిలలోకములు, భావించినప్పుడె భస్మమైపోవు

**ఇంద్రజిత్తు హోమమును చేసి శస్త్రసమేతముగా రథమును బడయుట**

నరు లెంతవారు వానరు లెంతవారు, పరికింప నీకని పల్కి వీడ్కొలుప
నెలమితోడన పురోహితునిఁ దోడ్కొనుచుఁ, బొలుపారఁగా రణభూమి కేతెంచి
చెన్నొంద హోమంబు సేయంగఁ బూని, యున్నంతఁ బరిచారు లొగి వేగమునను
బఱఁగంగ నరసి కపాలపత్రికలు, సొరిది నుక్కనయిన స్రుక్స్రువంబులును
శస్త్రంబులును దాటిసమిధలు రక్తవస్త్రగంధాదులు వరుసఁ దెచ్చుటయు

రక్తాంబరంబులు రక్తమాల్యములు, రక్తగంధంబును రయమొప్ప నతఁడు
ధరియించి మారణతంత్రమార్గమునఁ, బరువడిఁ దోమరప్రాసఖడ్గములు
పరిపరిధులు వెట్టి సప్రాణకృష్ణ, హరిణంబు మెడ యస్థి యది పుచ్చుకొనుచు
నక్తంచరాధీశునందనుం డెలమి, యుక్తక్రమంబున హోమంబు సేయఁ
దనరిన ధూమప్రదక్షిణశిఖల, ననలుండు వెలుఁగుచు నాహుతుల్ గొనియె
జయనిమిత్తంబులు చాలఁ గన్గొనుచు, జయశీలుఁ డానిశాచరవీరుఁ డలరి
నియతి హోమము దీర్చి నిరుపమంబైన, హయచతుష్టయముతో నతిఘోరలీల
నురుతరబాణాసనోజ్జ్వలం బగుచు, సురుచిరాలంకారశోభితం బగుచు
సరినొప్పు సింహార్ధచంద్రచిహ్నములఁ, బరఁగుచు వైడూర్యభాసురంబయిన
పడగచే నమరుచు బ్రహ్మాస్త్రరక్ష, నడరుచు నని నదృశ్యం బయియుండు
నట్టి యారథ మెక్కి యనికి నేఁగుచును, గట్టల్కఁ బల్కె రాక్షసులెల్ల వినఁగ
మిథ్యాతపస్వుల మీఱి సంగ్రామ, రథ్యఁ గూలుతు నేఁడు రామలక్ష్మణుల
పగదీర్చి మాతండ్రిఁ బల్కికంధరుని, విగతశోకునిఁ జేసి విజయ మేనిత్తు
భానునందనముఖప్లవగవల్లభుల, నే నేఁడు సమయింతు నిమిషమాత్రమున
మఱియుఁ దక్కినయట్టి మర్కటోత్తముల, నెఱయంగఁ జంపుదు నేఁ డాజిలోనఁ
దెగువతో ననుచు నదృశ్యుఁడై యచట, నొగి రాక్షసుల నేయుచున్న రాఘవులఁ
బొడగని భీకరభ్రుకుటియై విల్లు, వడి నెక్కువెట్టి దుర్వారవేగమునఁ
బ్రళయకాలమువాఁడు బలువృష్టి గురియు, జలదంబువిధమున శరవృష్టి గురిసె
గగనంబు నిండ నాఘనులు రాఘవులు, నొగి నేసి రలుకమై నుగ్రబాణములు
అమరారి యవి ద్రుంచి యమ్ములసోనఁ, దిమిరంబు పరగించె దిక్కులం దపుడు
పృథుచండకోదండభీకరధ్వనియుఁ, రథనేమిరవమును రథతురంగముల
గొరిజలమ్రోఁతయు గుణమునిస్వనము, నరుదార జనియించు నతనిరూపంబు
వినఁ గానఁబడకుండ విస్మయంబంది, ఘనవీథిఁ బరికింపఁ గ్రమ్మఱ నతఁడు
అఖిలాంబకంబుల నాదాశరథుల, నిఖిలావయవములు నిండ నేయుటయు
నాఖరకరకులుం డారాఘవేంద్రుఁ, డాఖరసూదనుం డపుడు కోపించి
వాఁడేయు మార్గణావళు లెందు వచ్చు, వాఁడి భల్లములందు వడి నేసి యేసి
యాబాణజాలంబు లందంద తునుమ, నాబాహుబలశాలి యగునింద్రజిత్తు
బహుముఖంబులఁ దేరుఁ బఱపుచు నేసె, బహుశరంబుల సంతఁ బార్థివసుతులు
కమియఁ బూచిన కింశుకంబులతోడి, సమత నొప్పిరి శరక్షతయుతాంగముల
శరముగ్రమైనట్టి కాలమేఘంబు, కరణి నొప్పిన తనఘనశరీరంబు
తెలియకుండఁగ యామ్యదిక్కుననుండి, పలికె నయ్యింద్రారి పార్థివేశ్వరుల
ఎక్కడఁబోయెద రెందు డాఁగెదరు, చిక్కితి రిట మిమ్ముఁ జేరి కావంగ
దిక్కెవ్వ రిలమీఁద దివిజు లటన్నఁ, జుక్కవాల్గా వంకఁ జూడ నోడుదురు
బక్కక్రోఁతుల నమ్మి బవరమ్మునకును, మొక్కలమ్మున వచ్చి మోసపోయితిరి
పటుతరంబైన నాబాణాగ్నిశిఖలఁ, బెటపెటఁ బ్రేలక ప్రిదిలిపోఁగలరె

యావిభీషణునివాక్యములె నిక్కువము,గా విని నాశక్తిఁ గానలేరైతి
రిదె మిముఁ దెగటార్చి యేచి యీప్రొద్దె, కదలి యయోధ్యలోఁ గలవారినెల్లఁ
బరిమార్చి మించి యాభరతశత్రుఘ్ను, లిరువురఁ జంపి నే నేతెంతు ననినఁ
గడు వెఱఁగందిరి కపులు నాకపులు, నడరు కోపంబున నాయింద్రజిత్తు
పడకుటఁ దనపేరు పంతంబులాడుఁ, దడయకుదీచిన ధనువు మ్రోయించు
ధీరుఁడై యటఁ దూర్పుదిక్కుననుండి, ఘోరంపుశరవృష్టి గురియించు మఱియు
దక్షిణంబున కేఁగి ధరణి గ్రక్కదల, నక్షీణశక్తిచే నదరి వెల్లార్చు
నిబ్భంగిఁ దిరుగు చనేకమార్గముల, నబ్భానుసూనాదు లరుదంది చూడ
శరముల వింటితో సంధించుకొనుచుఁ, బరువడి వాఁడేయుబాణజాలములు
జనపతుల్త్రుంతుచు చటులాంబకముల, ననిమిషు లప్పు డత్యాశ్చర్యమంద
అప్పుడు శతసంఖ్య లతనిచేఁ గపులు, కుప్పలు కుప్పలై కూలుట చూచి
సౌమిత్రి కోపించి జనపతి కనియె, భూమిాశ వీనిచేఁ బొలిసిరి కపులు
ఇదియేమి దేవ నీ విట్లూరకున్కి, యిదె చూడుమిా భువి నెల్లదిక్కులను
బడి పొర్లుచున్నారు భల్లూకపతులు, మడిసి రనేకులు మర్కటేశ్వరులు
జగదీశ నిను నమ్మి సకలవానరులు, మిగిలినభక్తితో మేకొనివచ్చి
తగిలి యీయింద్రారిదారుణాస్త్రముల, నొగిలి నీనామమే నొడువుచున్నారు
పగవాఁడు చేరి నీబలమెల్లఁ ద్రుంపఁ, దగదింకఁ దెగకున్నఁ ద్రైలోక్యనాథ
పగ దెగనల్లు నీబాణజాలములు, గగనంబు దిక్కులు గలయంగ నిండి
నిండినభక్తితో నిజదివ్యతనువు, లొండొంట ధరియించి యున్నవి వానిఁ
గైకొమ్ము రిపుఁ జంపు కమలాప్తవంశ, నీకెదురై పోర నేర్తురే రిపులు
ఇంత శాంతము దగునే నృపులకును, జింతింప వేల విచిత్రంబుగాఁగఁ
బరఁగిన నీబాహుబలపరాక్రమము, తరుణార్కసరుతేజ తలపోయ వకట!
యీనిశాచరకోటి నీయింద్రజిత్తు, నేన చంపెద దేవ నీమహత్వమున
నిటమీఁద బ్రహ్మాస్త్రమే ప్రయోగించి, కుటిలరాక్షసకోటికులమెల్ల నడఁతు
అనవుడు రఘురాముఁ డనుజుని కనియె, వినుము లక్ష్మణ యొకవీనికై పూని
చనునె పల్వురఁ జంప సంగ్రామమునకుఁ, జనుదేని వారల సమయింప నగునె
యనిమిష బ్రహ్మరుద్రాదులచేత, ననిఁ జావఁ డిత డని యబ్జజుఁ డిడిన
వరము చెల్లింపంగ వలసెనే వీని, నిరవొందఁ గాచితి నిఁక నుండెనేని
వీనిఁ జంపఁగఁజాలు వీరవానరుల, నేను బంచినవారె హింసింతు రితని
నటుగాక తక్కిన నమ్మేఘనాదుఁ, డట నింద్రలోకంబునందు డాఁగినను
నట బ్రహ్మలోకంబునందు డాఁగినను, నట రుద్రలోకంబునందు డాఁగినను
ధరణి దూరిన రసాతలముఁ జొచ్చినను, శరధిలో మునిఁగిన జముఁడు గాచినను
దనతాత యగుధాత తనవెన్కఁ బెట్టు, కొనిన నేఁ బోనీను ఘోరాజిఁ ద్రుంతు
నని పల్కు రఘురాముఁ నలుక వాఁడెఱిఁగి, యనిసేయనొల్లక యాలంకఁ జొచ్చి
ఘోరనిశాచరకోటితోఁ బోయి, యారావణునితోడ ననె నింద్రజిత్తు

కట్టల్కఁ గపులను గయ్యంబునందు, నెట్టన నేసితి నేలపైఁ గూల
మనుజుల నిద్దఱ మానముల్గొంటి, ననవుడు రావణుం డతనిఁ గోపించి
యిదియేమి పోకయా యిదియేమిరాక, యిదియేమి సేతఁగా నెన్ని చెప్పెదవు
ఒక పక్షియును జంప కూరక వచ్చి, ప్రకటించె దందఱు వడిరని నీవు
నీవేచి నడఁచిన నిఖిలలోకములు, భావింప నప్పుడే భస్మమైపోవు
నదిగాన నిది యొక్కయధిక మటంచుఁ, దుదిఁ దలంపకుము సంతోషంబుగాక
మగఁటిమి రామలక్ష్మణుల వానరులఁ, దెగటార్చి కాని నా దెస కేఁగుదేకు
మనవుడు నౌఁగాక యని యింద్రజిత్తు, దనుజేంద్రు వీడ్కొని తనమదిలోన
నతికాయకుంభకర్ణాదులైన తేయ, పతులెల్ల మడిసి రిబ్బంగి సుగ్రాజిఁ
గాన నా రామలక్ష్మణుల నేరీతి, నైనను గెల్చెద నని నిశ్చయించి
సీత చందముగాఁగఁ జెలువొందు నొక్క, నాతినిఁ దనమాయ నాకేశవైరి

ఇంద్రజిత్తు మాయాసీతను దెచ్చి తలఁ దఱుఁగుట

యటఁ జేసి ప్రీతి మాయాసీతఁ గొనుచుఁ, బటుబలసహితుఁడై పడమట వెడలె
వానికేఁగాక యావానరులెల్ల, నానాముఖంబుల నలికి పాఱుటయు
హనుమంతుఁ డపుడు మహాశైలశృంగ, మనువారఁగాఁ బట్టి యసుర మార్కొనఁగ
నరుదార నడచుచో నల యింద్రజిత్తు, నరదంబుమీఁద మాయాసీతఁ జూచె
వెక్కసంబుగ రామవిరహానలంబు, నిక్కన నాహారనిద్రలు దొరఁగి
కడలేని వగఁబొంది గతిఁగానఁబడక, వెడలు నిట్టూర్పుల వెలవెలఁ బాఱి
కడుఁ గృశంబగు మేను కమలపత్రముల, నొడుచులోచనముల నొలుకుబాష్పముల
జడగట్టి సీమంతసరణిఁ జిక్కొదవి, యడగొని మలినంబు లగుశిరోజములు
ధరణిరజోలిప్తతనుతరాంగములు, గరము విన్ననిమోము గరపల్లవంబు
గదిసిన చెక్కునై గాలిచేఁ జాల, గదలెడు లతవోలెఁ గంపించుచున్న
యామహీసుతఁ జూచి యకట వీఁడింక, నేమినేయునొ రామహృదయవల్లభను
నీదీనదశ నాకు నీక్షింపవలసె, హా దైవమా యని హనుమంతుఁ డడరి
ఘోరవానరవీరకోటితో నడువ, దారుణాకృతిఁ జేర్చి తఁమీఁద ననికి
నడచుచో నవ్వాయునందను గాంచి, కడుఁ గ్రూరుఁడై దశకంఠనందనుఁడు
ఇది యేలవచ్చెఁ దానీసేనతోడ, ఇదె చూడరా సీత యీసీతకొఱకు
నలజడి వడియెద రటుగాన దీనిఁ, దలద్రెవ్వ నేసెదఁ దవిలి యేననుచుఁ
గలఁగి శార్దూలంబుకడ నున్నహరిణి, పోలుపున నయనాంబుపూరంబు లొలుక
హారామ హారామ యనునార్తరవము, లారంగఁ జేయు మాయాసీత నొడిసి
తలవెండ్రుకలువట్టి దట్టించి యీడ్వ, నలఁగి యాదైత్యుతో ననియె వాయుజుఁడు
తగునె దురాత్మక దనుజుండవైన, నగుదుఁగా కేము నీవావిశ్రవసుని
మనుమఁడ విబ్బంగి మనకులేశ్వరుని, వనితముందలఁ బట్టి వారక తిగువ
ననవుడుఁ గరవాల మంకించి యసుర, తనరు మాయాసీత తల ద్రెవ్వనేసెఁ
జనుమింక రామలక్ష్మణులకుఁ జెప్పు, మన ఖిన్నుఁడై యుండె ననిలనందనుఁడు

వసుధాతలంబున వడి నెత్తురొల్క, నసిధారఁ దెగియున్న యాసీతఁ జూపి
హనుమంతుతో ననె నాయింద్రజిత్తు, వనచరోత్తమ రాముపనిత నీసీత
ఘనతరంబైన నాకరవాలమునను, దునిమితి మీరణోద్యోగంబు లింకఁ
జిక్కెఁ బొమ్మంచు విజృంభించి పలికి, దిక్కుంభికర్ణము ల్దిశలును బగుల
సంహారఘనఘనస్తనితమో యనఁగ, సింహనాదముసేయఁ జిత్తము ల్గలఁగి
యప్పుడు రణములో నాయింద్రజిత్తుఁ, దప్పక కనుఁగొని తనరినభీతి
వనచరులార్వంగ వాయునందనుఁడు, కనుఁగొని పలికె నోకపివీరులార
ఘనరవిక్రమములు చాలించి పాఱ; సమయమే వినరొకో సమరధర్మంబు
దలఁప బంధులకెల్లఁ దలవంపుగాఁగఁ, గలనఁ బాఱుటకంటె కష్టంబు గలదె
నడఁచెద నేమున్న ననుఁ గూడి మీరు, కడిమి వాటింతురు గాకంచుఁ బలుక
నందఱు తరువులు నద్రిశృంగములు, నందంద కయికొని హనుమంతుఁ గూడి
రయమున నార్చుచు రాక్షససేన,పయి వైచి రంత నాపవమానసుతుఁడు
చలమున నొకమహాశైల మంకించి, యలుకతో వైవంగ నానిశాచరుని
సారథి రథ మాఁడఁ జనఁ దోల నడియు, దారుణధ్వనితోడ ధర క్రుంగఁబడియె
ఆలోన వెండియు నగచరుల్ తరులు, శైలశృంగములు రాక్షసులపై వైవఁ
దనసేన విఱిగిన దశకంఠసుతుఁడు, కనుఁగొని కోపించి కపియూథపతులఁ
బటుశూలముద్గరప్రాసఖడ్గములఁ, జటులవేగంబున సమయించె నపుడు
మారుతాత్మజుఁడును మదిలోనఁ గినిసి, ఘోరవిక్రమకళాకుశలుఁడై పేర్చి
కడిమిచేఁ గవియు రాక్షసుల రూపడఁచి, వడి శిలాతరుఘోరవర్షముల్ గురిసి
యానిశాచరసేన నవలీలఁ దోలి, వానరావలిఁ జూచి వాయునందనుఁడు
వనచరపతులార వసుధేశుదేవి, దనుజాధముఁడు జంపెఁ దప్పెఁ గార్యంబు
సమరమేటికి నింక జనకజవార్త, కమలాప్తకులున కొక్కట నెఱిఁగింప
నరుగుద మటమీఁద నారాముఁ డెద్ది, వెరవాన తిచ్చు నావిధము సేయుదము
మీరందఱును సంభ్రమింపకయుండుఁ, డీరాక్షసుఁడు క్రూరుఁ డేమఱవలదు
అనిమాట మగిడిన హనుమంతుఁ జూచి, తగమది నప్పు డద్దశకంఠసుతుఁడు
ఈమహాబలుఁ డేఁగె నిటమీఁదఁ దనకు, హోమవిఘ్నముసేయ నోప రెవ్వరును

**ఇంద్రజిత్తు నికుంభిళయాగము సేయుట**

అని నికుంభిళ కేఁగి యచట నశాటుఁ, డెనసిన నిష్ఠతో నేపు దీపింపఁ
గల్లు నెత్తురు పాలు ఘనకచ్ఛపముల, బల్లులఁ బిల్లులఁ బలుసర్పములను
గారుకోళ్లను మంచిగంధంబు తేనె, నారికేళంబుల నల్లనికోళ్ల
సూకరంబుల మఱి సొరిది కేశములఁ, గాకులఁ దెల్లని గార్దభంబులను
గాఱెనుపోతుల ఘనమేషములను, నాఱు నాలుగు రెండు నఱువదికరులఁ
గొండగొఱ్ఱెలు వేయి కోటుల లక్ష, మండూకములఁ గోటి మాణిక్యములను
ముత్యంపుఁజిప్పలు మూఁడర్బుదములఁ, గాత్యాయనీదేవికడ నిష్ఠ నిలిపి
మనమున నిగమమంత్రపూతముగ, ననలుని రుధిరమాంసాదులఁ దనిపి

హోమంబు సేయుచు నుండె నయ్యెడను, రాముండు పడమటిరభసమంతయును
విని జాంబవంతుని వేగంబ పిలిచి, వినవచ్చెఁ బడమట విపులఘోషంబు
హనుమంతునకు నెట్టి యనియైన యదియొ, ఘనమైన యట్టి యాకలకలం బరయఁ
జనుము రయంబున సైన్యంబుతోడ, ననిన ఋక్షేశ్వరుం డతిశీఘ్రవృత్తి
బలువిడి భల్లూకబలములు దన్నుఁ, గొలిచి యప్పుడు నూఱుకోటులు రాఁగ
వడిగొని పశ్చిమద్వారంబు దెసకు, నడుచుచోఁ గనియె నన్నడుమ వాయుజుని
వాయుజుండును జాంబవంతునితోడ, నాయింద్రజిత్తుచేఁతయుఁ జెప్పి
యీవార్త రామున కెఱిఁగించి వత్తు, నేవచ్చునందాఁక నేమున్నయెడను
గాచి యావాకిటఁ గదలకయుండు, మేచిన పగవాని నేమఱవలదు
అని పంచి వచ్చుచో ననతిదూరమున, హనుమంతుఁ బొడగని యారాఘవుండు
ఇతనిముఖస్థితి నేమొకో కార్య, గతి దోఁచుచున్నది కనుఁగొన నిపుడు
ఇది యేతెఱంగని యిచ్చఁ జింతింపఁ, గదిసి వాయుజుఁడు రాఘవునకు మ్రొక్కి
దేవ యేమెల్లను దెంపుమై దాన, వావలితోడ గయ్యమ్మొనరింప
మాముందట నె తెచ్చి మది శంకలేక, భూమిజ తలఁ ద్రెంచెఁ బోరి నింద్రజిత్తు
ఆవాకిటికిని ఋక్షాధీశుఁ బెట్టి, యీవార్త చెప్పంగ నేను వచ్చితిని
అనువార్త చెవులలో నడరకమున్నె, ఘనవాతనిహతి వృక్షంబునుబోలె
నతులశోకాగ్నియు నడరి దహింప, ధృతిదూలి రవికులాధిపుఁడు మూర్ఛిల్లి
యవనిపైఁ బడియున్న నతిభీతినొంది, ప్లవగవల్లభులెల్లఁ బటుశోకులైరి
కైకొని యపుడు లక్ష్మణుఁ డన్నతొడల, పైకిరాఁ దిగిచి సంభ్రమచిత్తుఁ డగుచు
నక్కటా! రామ నీయట్టియుత్తమున, కిక్కళంకము పుట్టెనే యిట్టిచోటఁ
దలపోయఁగా మేలు ధర్మంబునందుఁ, గలదనుమాట నిక్కము గాకపోయె
నదియె నిక్కంబైన నకట! నీయట్టి, సదయచిత్తున కేల సంతాప మొదవు
నీచేత రావణునికిఁ జావు లేక, యీచందమున నుండ నేటికి వచ్చు
జానకి కేల యీచావు సిద్ధించుఁ, గాన ధర్మముకంటె ఘనమధర్మంబు
త్యాజ్యంబు గాదని తలపోయకట్టి, రాజ్యంబు విడిచి యరణ్యంబులందుఁ
దిరుగ వచ్చితి మటుఁ దిరిగెడు మనకుఁ, బురుషార్థములు సిద్ధి వొందునే యధిప
అవనీశ నిర్ధను లగువారు సేయు, వివిధయత్నంబులు వెస నిదాఘముల
నడరెడు సెలయేఱు లడఁగినభంగిఁ, జెడిపోవు నని బుధు లెప్పంగ వినమె
ధనము లార్జించిన ధర్మకామాదు, లనుపమస్థితితోడ నధిప సిద్ధించు
ఎసఁగంగ నర్థంబు లెవ్వాని కొదవు, వసుధ వానికి నెల్లవారు చుట్టములు
అర్థంబుగలవాఁడె యరయంగఁ బురుషుఁ, డర్థంబుగలవాఁడె యధికుండు జగతి
అర్థంబె విద్యయు నర్థంబె నేర్పు, నర్థంబె కీర్తియు నర్థంబె పెంపు
అర్థంబె బలమును నర్థంబె కులము, నర్థంబ బలగంబు నర్థంబె గుణము
అర్థంబె శీలంబు నర్థంబె ప్రాణ, మర్థంబె పుణ్యంబు నర్థంబె భూమి
అర్థంబె రూపును నర్థంబె నీతి, యర్థంబె ఖ్యాతియు నర్థంబె భూతి

అర్థంబె గతియును నర్థంబె మతియు, నర్థంబె యెఱుకయు నర్థంబె సుఖము
అర్థంబు కావున నఖిలకామ్యములును, నర్థసంపన్నున కరచేతివరయ
అధికులు వేదవేదాంగపారగులు, బుధులు దూర్వాంబులఁ బూతాక్షతముల
నర్థంబుగలవాని నమరఁ బూజింతు, రర్థి మోక్షార్థులై యడవుల నుండు
మునిపుంగవులు కందమూలంబు లిచ్చి, ధనవంతులగువారి దర్శింతు రెలమిఁ
బాయక మంగళపాఠకానీక, గాయకకులములు కలవారిఁ బొగడు
ఉన్నతకుచములు నురునితంబములు, నన్నువనడుములు నలసయానములు
బింబోష్ఠములు చంద్రబింబాననములు, నంబుజలలితంబు లగులోచనములు
రోలంబకులనీలరుచిరధమ్మిల్ల, లీలాలకంబులు లేఁతసిగ్గులును
ఒయ్యన నవ్వుట నోరచూపులును, దియ్యమాటలు గాముదీమంబు లనఁగ
నెలయించు నేర్పులు సెలజవ్వనములు, గలకాంత లర్థంబు గలవృద్ధునైన
మనమారఁ గొలుతురు మహితభోగేచ్ఛ, ధనహీను నొల్లరు దర్పకునైన
లేమియే నరకంబు లేమియే రుద్రభూమియు లేమియే భూరిశోకంబు
లేమియే రోగంబు లేమియే మృతియు, లేమియే పాపంబు లేమియే జరయు
లేమియే కష్టంబు లేమియే కరువు, లేమియే దైన్యంబు లేమియే వగపు
లేమియే సకల మాలిన్యంబు దలఁప, లేమియే సర్వంబు లేమి గావునను
అచ్చెరువుగ రాజ్య మంతయు విడిచి, వచ్చినప్పుడ కాదె వచ్చె నాపదలు
జానకిమరణంబు సైరింపఁజాల, మానవలోకేశ మార్గణావళుల
విసువకాసురబలాన్వితముగా లంక, మసలక నింక భస్మంబు చేసెదను
అని లక్ష్మణుఁడు పల్క నావిభీషణుఁడు, దనమది నూహించి ధరణీశు కనియె
నాయింద్రజిత్తుమాయయెకాని సీత, కేయపాయంబును నిటుగాదు వినుము

**విభీషణుఁ డింద్రజిత్తునిమాయ శ్రీరాములతోఁ జెప్పుట**

ఖలుఁడైన యాపఙ్క్తికంఠుండు దలఁచు,తలఁపు నేనెఱుఁగుదు త్రైలోక్యనాథ
జానకి నొప్పింపు జనపతి కనుచు, నేనెన్ని చెప్పిన హితవుగాఁ గొనఁడు
జనకనందన నేల చంపించు నతఁడు, ఘనుజేశ యిది వానిమాయ గావలయు
అట్టిదియైన నోయవనీశవర్య, నెట్టనఁ బొలియవే నిఖిలలోకములు
ఇది బొంకు చింతింపనేల యాసీతఁ, బదిలంబుగాఁ జూచి ప్రతివార్త దెత్తు
నని రామునను మతి నవ్విభీషణుఁడు, దనరూపమంతయు దాఁచి వేగమున
నలిరూపుఁ గైకొని యసురేశువనము, తలఁకకఁ జొచ్చి సీతను గాంచి మరలి
వచ్చి యారామభూవరునకు మ్రొక్కి, యచ్చపుభక్తితో నంతయుఁ జెప్ప
విని విభీషణ యిట్టివిధ మేల నేసె, ననిలోన నింద్రజిత్తని రాముఁ డడుగ
దనుజుఁ డాసురహోమతాత్పర్యబుద్ధి, జనుటకునై యిట్టి చందంబు చేసె
హనుమంతుఁడాదిగా నగచరకోటి, మనములు గలఁచి యిమ్మాడ్కిఁ బుత్తెంచి
తనహోమవిఘ్నంబు తగఁజేయువార, లనయంబు లేరింక నని నికుంభిళకు
నరిగినవాఁడు వాఁ డచట హోమంబు, పరిసమాప్తముగాఁగఁ బటునిష్ఠ నేఁడు

దనహోమమంత్ర మింతయుఁ జిక్కకుండ, మనుయుక్తి నవధానమతిఁ జేసెనేని
దేవదానవులైన దృష్టించి నిలిచి, యావీరవరు నెవ్వ రని గెల్వలేరు
అటుగాన నీలోన నసురప్రేలిమికిఁ, బటుగతి విఘ్న మాపాదింపవలయు
జనియెద నేనిదె సైన్యంబుతోడ, మనుజేశ పంపు లక్ష్మణుఁ దోడు మాకు
సౌమిత్రి యవ్వీరుఁ జండకాండముల, భూమిపైఁ బడ నేసి పొలియింపఁ గలఁడు
నేఁడింద్రజిత్తును నీతమ్ముఁ డోడుచు, వాఁడు నికుంభిళావనములోపలను
దపము గైకొన్నాఁడు దశకంఠసుతుఁడు, తపము నిండకమున్న దండింపకున్న
బ్రహ్మ మెప్పించి యాపరమేష్ఠివలన, బ్రహ్మశిరం బను బాణంబు విల్లు
కవచంబు ఖడ్గంబు కవదోన లమఱియు, నవిరళమంత్రపూతాస్త్రము ల్వడసి
కామగాశ్వంబును గమనీయకేతు, భీమంబు మారుతస్ఫీతవేగంబు
నగురథం బాయగ్నియందు వెల్వడినఁ, దగ నారథం బెక్కి ధను వందెనేని
నావాసవారాతి నాలంబులోన, దేవాసురాదులు దృష్టింప లేరు
వానికి నిమ్ముల వరమిచ్చునప్పు, డానీరజాసనుం డతని వీక్షించి
నీవు నికుంభిళ నెఱయ హోమంబు, గావించి తేని నేగతి నజేయుఁడవు
కావించు హోమంబుఁ గడముగు నేని, రావణసుత నీవు రణములోపలను
బగతుచేఁ జత్తని పల్కినవాఁడు, జగదీశ యటుగాన సమరయత్నంబు
సేయించి నేఁడింద్రజిత్తుఁ జంపింపు, మాయావి యగువీఁడు మడిసినఁ జాలు
నమరకంటకుఁడగు నద్దశాననుఁడు, సమరంబులో మున్నె చచ్చినవాఁడు
అని పల్క రఘురాముఁ డప్పు డనుజన్ముఁ, గనుఁగొని యనఘాత్మ ఘనుఁ డింద్రజిత్తు
ఘనశిరోహితతిగ్మకరుభంగి నింగి, ఘనమాయఁ దనగతి గానరాకుండఁ
జరియించు నవ్వీరు శక్రాదిసురలు, దురమునఁ గడిమిమైఁ దొడరంగ లేరు
హోమమధ్యంబున నుగ్రరాక్షసుని, సౌమిత్రి నీవేఁగి సమయింపు వేగ
పటుతరభల్లూకబలముతోఁ గూడి, చటులవిక్రముఁడైన జాంబవంతుండు
హనుమంతుఁడును దోడు నరుగుదెంచెదరు, ఘనతరవిజయవిక్రమధురంధరుఁడు
ఇష్టమంత్రివరులతో నివ్విభీషణుఁడు, నెమ్మి నయ్యాగంబు నీకుఁ జూపెడిని
అని పల్కి రఘురాముఁ డనుజాతునకును, వనధి యిచ్చినయట్టి వజ్రకవచమ్ము
ఘనతరఖడ్గంబు కవదోనల్విల్లుఁ, బెనుపొందఁగా నిచ్చి ప్రీతితో మఱియు
వరభూషణంబులు వరుసగా నిచ్చి, యరుదైనపేర్మి నిట్లనుచు దీవించె
అనిశంబు జయము శ్రీహరి యొనఁగూర్చు, ఘనతరశుభము శంకరుఁ డిచ్చు నజుఁడు
నీకాయువు ఘటించు నిఖిలదేవతలు, గైకొని దిశలందుఁ గాతురు నిన్ను
అనిలుండు ననలుండు నభిరక్షణంబు, దనరఁ జేయుదురు ముందఱ వెన్క నీకు
అనవుడు లక్ష్మణుం డప్పు డుప్పొంగి, ధను వందుకొని తనుత్రాణంబుఁ దొడిగి
కవదొన ల్ధరియించి ఖడ్గంబు దాల్చి, వివిధభూషణముల విలసితుం డగుచు
నారాముఁ గనుఁగొని యతిభక్తి మ్రొక్కి, ధీరవాక్యంబులఁ దెలిఁగొప్పఁ బలికె
నలినాకరములోన నలి మరాళములు, కలగొనఁబడునట్టి గతి గానఁబడఁగ

నాతెల్లగరులబాణము లింద్రజిత్తు, వేతూరి చని నేఁడు వెస లంకఁ బడును
విస్ఫుటపౌలస్త్యవిపథమున హాని, నృపవీర విశిఖాగ్ని నీఱుచేసెదను
అని యథోచితభంగి నారామచంద్రు, మనమార వీడ్కొని మహితతేజమున

### లక్ష్మణుఁడు యుద్ధమునకు వెడలుట

గరుడుని నెక్కిన కమలాక్షుపగిదిఁ, గరువలిసుతు నెక్కి కరమొప్ప మిగిలి
పంబి గోలాంగూల బలములు గొల్వ, జాంబవదాదులు చనుదేరఁ గదలి
బలువిడి నటకు ముప్పదియోజనములు, గలనికుంభిళ కేఁగి ఘనతరంబుగను
నురుమదేభంబులు నుత్తమాశ్వములు, నరిది రథంబులు నలరు కాల్బలము
స్తోమమైనవనంబు చుట్టును గాచి, భీమమై యొందు నభేద్యమై తనరి
బలములన్నియు నల బలమెల్ల నుడిగి, యలలు లేనట్టి యాయంబుధికరణి
నున్న రాక్షససేన నొప్పారఁ జూచి, సన్నతశస్త్రాస్త్రసన్నద్ధుఁడైన
సౌమిత్రితో విభీషణుఁ డిట్లు లనియె, నీమహాసైన్యంబు నిషుపరంపరల
నెడల నేసినఁగాని యింద్రారి మనకుఁ, బొడగానరాఁడు నీశూరబాణములఁ
దూలింపు మీసేనఁ దొలితొలి పిదప, హాలాహలాభీల మైనశరాలి
దొరకొన్నహోమంబు తుదిముట్టకుండ, దురితాత్ముఁ డగువానిఁ ద్రుంపుము వేగ
అనవుడు సౌమిత్రి యత్యుదగ్రతను, గనుఁగొనలం దగ్నికణములు దొరఁగఁ
బలుతెఱంగుల బాణపఙ్క్తులు పఱపె, నలఘుబలోదగ్రులై పెల్లు రేఁగి
తరుచరాధిపులును దరులును గిరులు, పౌరిఁ బోరి వైచి రప్పుడు సొంపు మిగిలి
అసురులు నత్యుగ్రులై వనచరుల, వెసఁ బరిఘంబుల విసరివైచియును
గదలచే మోఁదియుఁ గరవాలములను, విదళించియును బహువిధములఁ గడఁగి
మఱియును దక్కిన మహితశస్త్రముల, నుఱక నొప్పించిరి యుగ్రత నిట్టు
మార్పడ నసురుల మర్కటేశ్వరుల, యార్పుల నాలంక యట్టిట్టుఁ బడఁగ
నంతఁ బోవక రాక్షసావలిఁ దఱిమి, యెంతయుఁ గడఁక ననేకశస్త్రములఁ
గపుల నొప్పింపఁగఁ గపులును గవిసి, కుపితులై రాక్షసకోటి నొప్పింప
విఱిగి రాక్షసులెల్ల వెస నింద్రజిత్తు, మఱుఁగున కరిగిరి మతమెల్లఁ దక్కి
ఆలోన నొక్కొక్క యాహుతిఁబట్టి, యాలోలకీల మహావహ్నికసుర
పరఁగంగ నిన్నూటపదియాహుతులకు, దొరకొని యొక నూటతొమ్మిది వేల్చి
కడమ యాహుతులు సాకైవడిఁబట్టి, విడువక నిష్ఠతో వ్రేల్చుచునుండె
యురుతరసత్త్వులై యుగ్రతఁ బేర్చి, ధరణి గంపింప నత్తరుచరవరులు
బలువడి నేతెంచి పైనార్చుటయును, గలుషతఁ జిత్తంబు గలఁగినఁ జేతి
యాహుతి యటు వైచి యాయింద్రజిత్తుఁ, డాహవోన్ముఖుఁడు మహారోషమెత్తి
కన్నులు నిప్పులు గ్రమ్మంగ భీషణోన్నతి రథమెక్కి యుగ్రకార్ముకము
ధరియించి మించి యుద్ధతి నేఁగుదెంచి, తరుచరసేనలఁ దఱిమి నొప్పింప
దనుజేశతమ్ముండు దనర సౌమిత్రిఁ, గొనిపోయి వనమతి క్రూరుఁడై చొచ్చి
సమధికంబగు నీలజలదంబపోలెఁ, గొమరారుచున్న న్యగ్రోధంబుక్రిందఁ

దొడఁగి యాయింద్రజిత్తుఁడు సేయఁజేయఁ, గడమ చిక్కినహోమకర్మంబుఁ జూపి
సౌమిత్రి చూచితే సమరంబుకొఱకు, హోమ మిక్కడ దైత్యుఁ డుగ్రతఁ జేసి
బలిభూతముల కిచ్చి పావకువలనఁ, గలశక్తిసహితులఁ గడఁగి జయించుఁ
దొల్లియు నిటు చేసి దుర్మదవృత్తి, బల్లిదుఁడై యనిఁ బర్జన్యు గెలిచె
నిప్పుడు నిదె చూడు మీహోమవహ్ని, నొప్పార వెడలుచు నున్నది రథము
అరుణనేత్రంబుల నరుణకేశముల, నరుణవస్త్రంబుల నరుణమాల్యముల
జడిగొన్న నల్లని సారథితోడఁ, గడునెఱ్ఱ నగుతురంగంబులతోడ
వాఁడు క్రమ్మఱ వచ్చి వరహోమశక్తి, వేఁడిమి నెంతయు వెడలించి మించి
యీరథం బెక్కిన నింద్రాదులైన, నారావణాత్మజు నని నోర్వరాదు
కాన నింతటిలోనఁ గడఁగి సౌమిత్రి, వానినిఁ బటుశరవ్రాతంబుచేతఁ
బొలియింపు మనుడును బొంగి లక్ష్మణుఁడు, తలఁగక కార్ముకధ్వని చెలంగింపఁ
గరవాలహస్తుఁడై కవచంబుఁ దొడిగి, యరుదార శిఖివర్ణ మగురథం బెక్కి
తనరూపు చూపిన దశకంఠసుతునిఁ, గనుఁగొని సౌమిత్రి కడునల్కఁ బల్కె
మాయలఁ బనియేమి మగవాఁడవేని, నాయెదుటికివచ్చి ననుఁ జూతుగాక
నిక్కంపులావున నీవు గయ్యమునఁ, జక్క నిల్వుము నిన్ను జముఁ గూడఁబుత్తుఁ
గపటంబుఁ గైకొన్నఁ గైకొనకున్నఁ, గపటరాక్షస నిన్నుఁ గడతేర్త వేగ
నెఱసిన కడిమితో నిలువు నాయెదురఁ, గఱకురాక్షస యనుకడ నింద్రజిత్తు
భీలకరాళసంక్షోభితుఁడై పలికె, బాలుండవై యిట్టి పంతంబు లేల
లక్ష్మణ నిన్ను నాలంబున వీర, లక్ష్మికిఁ బెడఁబాపి లా వెడలించి
యసువుల నాదు బాణావలిఁ బెఱికి, వసుమతిపైఁ గూల్చి వారక వ్రచ్చి
కాకుల గ్రద్దలఁ గండలఁ దనుప, భీకరాకారతఁ బెంపారువాఁడ
ఉఱక నాకట్టిన యురగపాశముల, మఱచితే లక్ష్మణ మది నింతలోనె
అని లక్ష్మణునిఁ బల్కి యట విభీషణునిఁ, గనుఁగొని యింద్రారి కడు నల్కఁ బలికెఁ
బినతండ్రివఁట నీవు ప్రియమార నేను, దనయుండ నాకెగ్గు దలఁపఁగఁ దగునె
దుర్మతివై కులద్రోహంబు సేయ, ధర్మఘాతుక నీకుఁ దగవేల కలుగు
ఎడరైనబంధుల నెట్టి నీచుఁడును, విడిచి శత్రులఁ బోయి వేఁడునే శరణు
తగవు దప్పిననైనఁ దనవారిఁ బాసి, పగవారి సేవించి బ్రతుకు కే బ్రతుకు
ఆనిశాచరనాథుఁ డధికతేజుండు, నీనిష్ఠురోక్తులు నీతిగా వినునె
అన్న కోపించిన నటయింటిమూల, నున్ననేమగు నుండకున్న నేమగును
నీలావుబలిమినే నిఖిలదేవతల, నాలంబులో గెల్చె నాపశాసనుఁడు
హితుఁడవై మర్మము హిత మెఱింగించి, యతనిచేతన చెడు మన విభీషణుఁడు
నావర్తనము మేఘనాద యీ వెఱఁగు, దీవృథాజల్పంబు లేల యియ్యెడను
ఆతండ్రికొడుకైన యవినీతిమతికి, నీతియు ధర్మంబు నీకేల కలుగు
పొసఁగఁ జేపట్టిన భుజగంబుపగిది, వెసఁ గ్రూరుఁ డగుబంధు విడువఁగా వలయు
పాపాత్ముఁ డగునట్టి పఙ్క్తికంధరుఁడు, నాపలుకులు విన్న నాఁ డింత లగునె

పరధనంబులకును బరకాంతలకును, బరితాపములఁ బొందు పాపకర్మలకుఁ
దగవేల మేలేల ధర్మంబులేల, జగదేకహితమైన చరితంబులేల
మగ్నమహామోహమది మదము గర్వంబు, నగ్నులై కాల్పక యవి యేల పోవు
తలకొని యెపుడు నధర్మవర్తనమె, కలిగి వర్తింతురు కడుఁ గ్రొవ్వి మీరు
సురల బాధింతురు సువ్రతులైన, పరమమునీంద్రులఁ బట్టి చంపుదురు
కావున నాదశకంఠునితోడ, నీవును లంకయు నిఖిలబంధువులు
మాన కిచ్చకమాడు మంత్రులు గూడ, సేనలు రాజుచేఁ జెడుట సిద్ధంబు
బుద్ధిశూన్యుఁడవైతి స్ఫుటకాలపాశ,బద్ధుండవై తేమి పల్కినఁ బల్కు
మిటమీఁద నీమాయ లెక్కవు వినుము, పటుముక్రింపకి హోమవాంఛఁ బోరాదు
చనరాదు లంకకు సౌమిత్రిఁ దొడరి, చనవచ్చు నిఁక వేగ జముపురి కనఁగఁ
బ్రథమాద్రిపయివచ్చు భానునిపగిదిఁ, బృథుగాత్రు హనుమంతుఁ బెంపార నెక్కి
యమరిన లక్ష్మణు నావిభీషణుని, సమరార్థులగు నగచరుల వీక్షించి
వీరులై నాబాణవృష్టికి మీరు, సైరించెదరుగాక సమరోర్వి నేఁడు
ఉడుగక నావింట నొదవు బాణాగ్ని, యడరి మిమ్మిందఱ నాహుతిగొనుచుఁ
గరవాలపట్టిసఘనభిండివాల, శరజాలముల మిమ్ము సమయింతు ననుచు
రోదసీకుహరంబు మ్రోయంగ సింహ,నాదంబు సేయుచు నానాశుగముల
వెస నేయుచును బాహువిక్రమస్ఫూర్తి, నెసఁగు నామ్ముందఱ నెవ్వండు నిలుచు
అనవుడు లక్ష్మణుం డాదైత్యుతోడ, దనుజాధముఁడ యీవృథాగర్వమేల
చేరక యడఁగి మ్రుచ్చిలి పోటు వొడుచు, పేరణంబునఁ బాడి యేమగతనము

ఇంద్రజిల్లక్ష్మణుల ద్వంద్వయుద్ధము

నీమాయలన్నియు నిరసించి నిల్వు, నామార్గణములఁ బ్రాణముల హరింతు
అనవుడుఁ గోపించి యతఁ డేసె నతని, ఘనకాలసర్పప్రకాండకాండముల
అవి లక్ష్మణునిఁ గాఁడి యవ్వల వెడలి, యవనీస్థలము గాఁడె నద్భుతశక్తి
మఱియును వాఁడు లక్ష్మణదేవుమీఁదఁ, గఱులాడఁగాఁ బెక్కుకాండంబులేయ
పడివచ్చి తాఁకి యవ్వల గ్రుచ్చిపాఱె, వెడలు రౌద్రరసంబు వెల్లియపోలెఁ
గడుఁబెల్లు నెత్తు రంగంబుల వెడల, నడరంగ రాక్షసు లార్చుచునుండ
బంకెల నట్టహాసములు చేయుచును, లంకేంద్రతనయుఁ డాలక్ష్మణుఁ జేరి
నరనాథసుత నేఁడు నన్నాజిఁ గదిసి, బిరుదవై యిటు విజృంభించిన నిన్నుఁ
దొలుతఁ గత్తళముఁ దుత్తునియలుసేసి, తలఁ ద్రుంచి వైచెద దారుణాస్త్రముల
బెనుపేది పడియున్న ప్రియసహోదరుని, నినుఁ జూచు రాముఁడు నేఁడవశ్యమును
అని పల్క లక్ష్మణుం డన్నిశాచరునిఁ, గనుఁగొని యీవృథా గర్వమేమిటికి
పలుకులఁ బనియేమి బవరంబులోనఁ, దొలఁగక నాతోడ దొడరుదుగాక
మాటలాడక వహ్నిమడియించు మాడ్కి, మాటలాడక నిన్ను మడియింతు నిపుడు
పనిలేనిపంతము ల్పలుకంగనేల, యనుచు నుగ్రాస్త్రంబు లరివోసి తిగిచి
ఘనతరభీషణాకారుఁడై పేర్చి, కనుఁగవఁ గెంజాయ గడలుకొనంగ

నమరంగఁ గోపించి యర్కదీధితులు, గమియంగ దిక్కుల గలయంగఁ బర్వి
విలయాగ్నికీలల విస్ఫులింగములు, కనుఁగొనఁ దెరలేదు ఘనతరశక్తి
కలయమ్ము సంధించి కఱపరక్కసునిఁ యలఘుఁడుస్తన్నల మటగాడనేయ
దాన దైత్యుండు రక్తము గ్రక్కి మూర్ఛ, నూని యంతనె తెల్విఁనొంది పెల్లార్చి
వాఁడిమి మిగులఁ దీవ్రంబున నేసె, మూఁడుబాణముల రామునితమ్మునురము
అప్పుడు ధీరులై యధికరౌద్రముల, నిప్పులు గన్నుల నివ్వటిల్లంగఁ
జెలగు నయ్యిద్దఱ సింహనాదములు, బలువిడిఁ బఱతెంచు బాణఘట్టనలు
నురుగుణస్వనములు నొక్కట నెసఁగ, నరయ మృత్యువువట్టహాసంబువోలె
వెలసినలావుల విక్రమంబులను, బొలుపులఁ జలముల భూరిరౌద్రముల
ననిశంబు వెలుఁగు చంద్రార్కులఁ బోలెఁ, దనరు చతుర్దంతదంతులఁబోలెఁ
గొమరారు సింగంపుఁగొదమలఁబోలెఁ, గ్రమమొప్ప శంబరశాములఁబోలె
నమరఁ ద్రినేత్రాంధకాసురుల్వోలె, రమణఁ గుమారతారకులనుబోలెఁ
నేపారఁ వృత్రాసురేంద్రులఁబోలె, రూపింప లయకాలరుద్రులఁబోలెఁ
బాయని జయకాంక్ష బలియురై పోర, నాయిద్దఱును నొప్పి రప్పుడు చూడ
కోపించి కోదండగుణఘోష మెసఁగఁ, జాపరథధ్వజసహితంబుగాఁగ
నా మేఘనాదుని నంపవర్షమున, సౌమిత్రి ముంచిన సైరింప కతఁడు
ప్రతిసాయకములేయ బలువిడి ద్రుంచి, వితతంబుగా బాణవృష్టిఁ గప్పుటయు
ఆయింద్రజితుఁ డప్పు డలవెల్లఁ బొలిసి, యాయస్త్రములకు మాఱైనయస్త్రములు
నెరినేయనేరక నిట్టూర్పు పుచ్చి, తరిగొని చూడ నత్తఱి విభీషణుఁడు
సౌమిత్రిఁ గనుఁగొని జననాథతనయ, నీమార్గణంబుల నిర్విణ్ణుఁ డగుచు
దశకంఠసుతుఁ డున్నదశఁ జూడు మింక, దశరథాత్మజ రణస్థలి వీని గెల్వ
మనవుకు నుగ్రంబులైన బాణములు, గొని యంగకములెల్ల గ్రుచ్చిపోనేయ
నొకమహార్తము మూర్ఛనొంది వే తెలిసి, యకట ముందే వాసవాదుల గెల్చి
పరికింప దైవంబు ప్రతికూలమైన, నరునకు నిటు నేఁడు నాకోడవలనె
ననిలోన రాక్షసు లందఱుఁ బొలిసి, రినవంశజులచేత నిఁక నేటిబ్రతుకు
అనుచుఁ గోపమున నయ్యసురకంటకుఁడు, జననాథసుతుఁ జూచి చలమగ్గలించి
నరనాథనందన నావిక్రమంబుఁ, బరికించి నీవింక బంటవై నిలువు
మనుచు నేడమ్ముల నతని నొప్పించి, హనుమంతుఁ బదియింట నదరంట నేసి
వెస విభీషణుమీఁద విశిఖములాఱు, మసలక నిగుడించి మఱి విజృంభించెఁ
గాకుత్స్థతిలకుఁ డాకడిమి కైకొనక, నాకేంద్రరిపుఁజూచి నవ్వుచుఁ బలికె
నధికుండు పంతంబు లాడకే గెలుచు, నధముండు పంతంబు లాడియు నోడు
ననుచితస్థితి శూరు లగువారు డాఁగ, ననిలోన వంచించు టది యొక్క గెలుపె
కుటిలయుద్ధము సేయఁ గ్రూరాత్మ నీకుఁ, బటుగతి నిహమును బరము లేదనుచు
దినకరకరజాలతీవ్రార్చు లడరఁ, గనకపుంఖంబులు గలుగు బాణములు
వానిపై నిగుడించి వడి బోదుఁ ద్రెంచి, మేనుచ్చి చనఁగ నమ్మెయి మఱువపుడు

కాలోగ్రసర్పంబు కంచుకం బనఁగ, నాలోకనాభీలమై నేలఁ బడియె
వాఁడు వెండియు నొక్కవజ్రాంగిఁ దొడిగి, వాఁడిబాణంబుల వడినేయ నపుడు
పరువడి నొండొరుబాణఘాతముల, నురువడి వెలువడు నురుశోణితముల
గైరికనిర్ఝరకలితంబులైన, భూరిభూధరముల పోలుపుఁ గైకొనుచుఁ
గరవేగశరవేగగతులు నేర్పులును, గరమొప్పఁ బోరుచోఁ గారాకురాలి
పూచినకింశుకభూజంబులొప్పు, నాచందమున నొప్పి రస్త్రఘాతముల
సమరగంధర్వాదు లచ్చెరువంది, సమరంబు చూడ నాసమయంబునందు
కలభవేష్టితమత్తగజలీల మంత్రి, కలితుఁడై భీకరగతి విభీషణుఁడు
విలుగుణధ్వనిచేసి విపులరోషమున, వెలుఁగుమంటలతోడి విశిఖంబులేయఁ
బిడుగులు చఱచిన పృథులభూజముల, వడువున రాక్షసు ల్వసుధపైఁ బడిరి
అనలుండు మొదలుగా నతనిమంత్రులును, ఘనశూలపట్టిసఖడ్గఘాతముల
నెగడి రాక్షసకోటి నేలపైఁ గలిపి, రగచరావలిఁ జూచి యవ్విభీషణుఁడు
ఇంక నీతనిఁ జంపుఁ డిందఱుఁ బొదివి, లంకేంద్రుబలమున్న లావన్న నితఁడె
అని నీతఁ డీల్గిన నాదశాననుఁడు, దనసేనతోఁ గూడఁ దానీల్గినాఁడు
మును ప్రహస్తుని వజ్రముష్టిఁ బ్రజంఘుఁ, డనువాని సుప్తఘ్నుఁ డనువాని మఱియుఁ
గుంభనికుంభుల ఘోరవిక్రములఁ, గుంభకర్ణుని మహోగ్రుని నతికాయు
వికటు మహాపార్శ్వు వెలయ ధూమ్రాక్షు, మకరాక్షు రక్తాక్షు మఱి శోణితాక్షు
యూపాక్షుఁ ద్రిశిరు మహోదరు నగ్ని,కోపుని దేవాంతకుని నరాంతకుని
ఖరు జంబుమాలిని కంపను మఱియు, బరుషవిక్రములైన పగతురఁ జంపి
యాహవసాగరం బవలీల దాఁటి, బాహాబలంబులఁ బరఁగితి రింక
సౌమిత్రికిని మీకు సమయంబు దాఁటుఁ,డా మెయి నింద్రజిత్తను గోష్పదంబు
కొడుకుఁ జంపఁగ నాకుఁ గూడదు వీఁడు, చెడునుపాయము మీకుఁ జెప్పెద వినుము
హింస గావించిన నెదిరిచేఁ బంచి, హింస సేయించిన నివిరెండు సరియె
ఇది రామకార్యార్థ మిదిలోకహితము, నదికాన పాతకం బైనఁ గానిందు
సౌమిత్రిచే నేఁడు చంపింతు వీని, నేమాయలును గొల్వ విటమీఁద ననఁగ
జాంబవంతుఁడు ఋక్షసంఘంబుతోడ, నంబరం బగలంగ నార్చి రాక్షసుల
నగశృంగతరుసింహనఖదంతములను, బగతుర నవలీలఁ బొల్పడి సొచ్చి
నొప్పింపఁ గపులచే నొగిలి రాక్షసులు, నిప్పులు సెదరంగ నెఱఁ దార ఘోర
పరశుముద్గరశూల పట్టిసప్రాస, పరిఘశరాసనపాణులై బెరయఁ
బోరి సురాసురులకుఁ బోలె నయ్యద్రి, చరనిశాచరులకు సంగ్రామమయ్యె
హనుమంతుఁ డాసమయంబున నలిగి, ఘనులక్ష్మణుని డించి కాలునిపగిది
నొక్కొక్కవాటున నొక్కొక్కమాటు, పెక్కండ్రదైత్యులఁ బృథివిపైఁ గూల్చి
శైలశృంగంబుల సాలవృక్షముల, లీలమైఁ జంపి బల్లిదుఁడునై పేర్చె
సరభసంబున విభీషణుఁ డంత నలుక, నురుతరజ్యాఘోష మొనరించి మించి
తనమంత్రులును దాను దద్దయుఁ గడిమి, దనుజులఁ బెక్కండ్ర దరమిడి చంపి

కరమొప్పఁ గనకపుంఖప్రదరములు, దొరఁగించె నింద్రజిత్తుని మేను గాఁడఁ
దరమిడి వాఁడు సుదగ్రుఁడై కినిసి, యరిది శరంబు లేయఁగ నవి వచ్చి
దూరి విభీషణునురంబున నుచ్చి పాఱి, ధరఁ గాఁడె ధరణియుఁ దల్లడపడియె
దరము విభీషణుతో నింద్రజిత్తు, కరముగ్రముగ నిట్టు కావించుచుండఁ
గనుఁగొని యపుడు లక్ష్మణుఁడు కోపించి, హనుమంతు నెక్కి తీవ్రాస్త్రసంతతుల
వడి మీఱి రాక్షసవరునిపై నేయ, గడు నొచ్చియును భయంకరముగా నపుడు
మగుడ వాఁ డుజ్జ్వలమార్గణపఙ్క్తి, మిగులంగ లక్ష్మణుమీఁదఁ బెల్లేసె
అడ్డరి యయ్యిద్దఱు నతికోపు లగుచుఁ, గడిఁదిబాణంబు లుగ్రత నేయ నపుడు
ఆయంపతండంబు లసరి యొండొరుల, కాయంబు లందంద కప్పిన నపుడు
అంబుధారలతోడి యంబుదంబులను, నంబుదంబులతోడి యర్కచంద్రులను
బోలి రామార్గణంబులు వచ్చుచున్న, యాలోని వేగ మేమని చెప్పవచ్చు
తొడిగినశరములు తొడిగినయట్లు, విడువరొకో యనువిధమున నుండె
నారెండు తెఱఁగుల యమ్ములు గగన, మారంగఁ గప్పిన నడరెఁ జీకట్లు
వీరరసావేశవివశత నెఱుఁగ,రైరి యొండొరుల మహాజిరంగమున
నాయవసరమున నచ్చెరుపడర, వాయువు రణభూమి వర్తింపదయ్యె
ననలుండు వెలుఁగొందఁడయ్యె దిక్పతులు, ననిమిషగంధర్వయక్షకిన్నరులు
చకితాత్ములై వచ్చి శరణంబు సొచ్చి, సకలదేవతలు లక్ష్మణుఁ బ్రశంసించి
యాలక్ష్మణునకు జయం బగునటుల, చాల దీవన లిచ్చి సమ్మదంబునను
నతిలోకకంటకుం డైనయాదైత్యు, మృతుని గాఁ జేయు సౌమిత్రి నీవనుచుఁ
బలుకుచు నుండ నాభానుకులుండు, పెలుచ నార్చుచు గుణాభీలరావంబు
చెలఁగంగ నాయింద్రజిత్తును గిట్టి, బలుకాండములు మీఁదఁ బరఁగించుటయును
ఆరాక్షసుఁడు వేగ నవి త్రుంచి వైచి, ఘోరనారాచము ల్గురిసి పెల్లార్చె
మదిలోనఁ గోపించి మఱియు లక్ష్మణుఁడు, గదిసి యాశాఖామృగంబు లార్వఁగను
జలమున నొకయర్ధచంద్రబాణమున, బలియుఁడై వానిచాపము ద్రుంచివైచి
పడగ యేడింటను బడ నేసి యొకటఁ, దడయక సారథితలఁ ద్రెవ్వనేసి
పదియింట పక్షంబు పగులంగ నేసి, యదరంట నేసె రథ్యముల నాల్గింట
ఆరావణునిసుతుం డప్పుడు తానె, సారథి రథికుండునై సౌమిత్రిఁ గిట్టి
నెట్టన నేయుడు నిగుడు కోపమున, నట్టహాసము సేయ నాలక్ష్మణుండు
నరదంబుఁ గడపుచు ననిసేయు దైత్యు, నరువార వీక్షించి యదరంట నేసె
ఆవాఁడియమ్ముల నధికంబు నొచ్చి, రావణసుతుఁడు మూర్ఛాగతుం డగుచు
నంతన తెలివొంది యాత్మలోఁ బెద్ద, చింతించి యిది యేమి చిత్రమో నరుఁడు
నన్ను నొప్పించె నెన్నఁడు నిట్టి దెఱుఁగ, మున్ను నేకాహవంబులఁ బోరునపుడు
కాల మెవ్వరికినిఁ గడవరా దనుచు, వాలిన యుష్ణనిశ్వాసంబు లడరఁ
జాపంబు తివియంగ శరము సంధింప, నోపక పరిపంథి నొనరంగఁ జూడ
నేరకయుండిన నిఖిలదేవతలు, నారాముతమ్ముని నగ్గించి రపుడు

వెలవెల నగువాని విన్ననిమోము, కలయంగఁ గనుఁగొని కపివీరు లార్వ
వీరులు గ్రథనుండు వెసఁ బ్రమాథియును, మేరుసన్నిభుఁ డగు మేఘనిస్వనుఁడు
శరభుండు ఋషభుండు శైలము ల్వైచి, రరుదార నింద్రారియరదంబు విఱుగ
నటుపైన కేతురక్ష్యంబులతోడ, విటతాటమై కూలి విపులకోపమున
నసురనాయకసుతుం డంత బిట్టార్చి, వెస విభీషణు రామవిభునను జన్ము
నుదురును వక్షంబు నొనాట నేసె, వదలక మూఁడేసి వాఁడిబాణముల
నేసి గుణధ్వని యెసకంబుగాఁగఁ, జేసి చెలంగించె సింహనాదంబు
అప్పుడు కోపించి యధికరౌద్రమున, నిప్పులు కన్నుల నివ్వటిల్లంగ
రావణుతనయునురం బుచ్చిపాఱఁగా విభీషణుఁ డేసెఁ గాండంబు లయిదు
ఆతఁడు గోపించి యాగ్నేయబాణ, మాతండ్రిపయి నేయ నది రాఁగఁ జూచి
వారుణాస్త్రం బేసె వడి లక్ష్మణుండు, నా రెండు నటఁ బోరి యవనిపైఁ బడియె
ఉరగాస్త్రమాదైత్యుఁ డుగ్రుఁడై యేయ,గరుడాస్త్రమునఁ ద్రుంచె గళము సౌమిత్రి
తగుఁ గుబేరాస్త్ర ముద్ధతినాతఁ డేయ, నగణితంబుగఁ ద్రుంచె యామ్యబాణమున
నతఁడు వేఁడియును వాయవ్యాస్త్ర మేయ, నతఁ డదియును ద్రుంచె నైంద్రాస్త్ర మేసి
దానవుం డపుడు గంధర్వాస్త్ర మేయ, దాని లక్ష్మణుఁడు రౌద్రంబునఁ ద్రుంచె
చలమున నిటు వారు సమరంబు సేయఁ, బ్రళయకాలమునాఁటిభంగిరై తోఁచె
సౌమిత్రి రణపరిశ్రాంతి మాన్పుటకు, నామంద వాయువు లల్లన వీచె
అంత లక్ష్మణుఁడు నాయంతకుపగిది, నంతకంతకు నుగ్రుఁడై యింద్రజిత్తు

## లక్ష్మణునిచే నింద్రజిత్తు చచ్చుట

నటు చూచి కార్ముకజ్యానినాదంబు, పటుశక్తితో దిశాభాగంబు వగులఁ
జెలఁగించి మరియు మించి సింహనాదంబు, సెలఁగించి దేవేంద్రు చేఁ గొన్నయట్టి
యారూఢిమీఱ నింద్రాస్త్రంబు దొడిగి, యారామవిభుఁడు ధర్మాత్ముఁ డౌనేని
దేవి యాసీత పతివ్రతయేని, దేవతాకరుణ నాదెసఁ గల్గెనేని
నింద్రాదులకు నెల్ల హిత మగునేని, నింద్రజిత్తునితల యిమ్మహాశరము
త్రెంచుఁగావుత మని దృష్టిసంధించి, మించి యేయుటయును మిన్నెల్ల నిండి
పృథుదీర్ఘనిర్ఘాతభీషణం బగుచు, బ్రథనవికాసనప్రారంభ మగుచు
బహురత్నపుంఖశోభాయితం బగుచు, విహగేంద్రసముజనావిర్భావ మగుచు
నహిముఖానలకణాత్యాలోల మగుచు,నహిమాంశుబింబప్రభాభీల మగుచు
మండుచు రుచులతో మహియు నాకసము, నిండుచు నత్యుగ్రనిగ్రహోదగ్ర
గతులమైఁ బఱచి రాక్షసలోకనాథు,సుతుఁ గిట్టి యందంద సురలు మిన్నందఁ
దనరిన నమ్మహోద్దండాస్త్ర మతని, యనుపమమణికుండలాంచితంబైన
లలితారుణేక్షణాలంకృతంబైన, తల బోమిడికముతో ధరఁ గూలఁ ద్రోసెఁ
గలుషభావమున లంకానిధానంబు, చలమున నుగ్రుఁడై సాధింపఁ గోరి
బలియుచ్చుకొనుకునై పటులులాయంబు, దలద్రుంచి వైచువిధం బచ్చుపడఁగ
ననిలోనఁ బడియున్న యాయింద్రజిత్తుఁ, గనుఁగొని జయలక్ష్మిఁ గైకొని దిశలు

గలయంగ నపుడు శంఖంబు పూరించి, విలు గుణధ్వనిచేసి వెస లక్ష్మణుండు
నలి నప్పు డురుసింహనాదంబుఁ జేసెఁ, జెలువొంద నప్సరస్త్రీలలాస్యములు
వీనుల సొలయించె విశ్రుతశ్రుతుల, మానైన గంధర్వమధురగానములు
అంత విభీషణుం డంతంత కెచ్చు, సంతోషమున గ్రుచ్చి సౌమిత్రి నెత్తి
యాలింగనముసేసె నాలంబులోన, నాలోన వనచరు లందంద చెలఁగి
రంతలో హతశేషు లగునిశాచరులు, నెంతయు భీతిల్లి యేపెల్లఁ బాసి
వనచరుల్ దోలంగ వడి ధృతుల్గూలఁ, దనరారుపదహతి ధరణి గంపింపఁ
గలఁగొని చీఁకట్లు కన్నులఁ గవియఁ, దలలు వీడఁగ నాయుధంబులు వైచి
చెందినభయమునఁ జెడి పాఱి లంకఁ, గొందఱు చొచ్చిరి కుధరశృంగములు
కొంద ఱెక్కిరి వార్ధిఁ గొందఱు వడిరి, కొందఱు దూఱిరి గుహానికుంజములు
అనలుండు తీవ్రార్చు లడరంగ వెలిఁగె, దినకరుం డుజ్జ్వలదీప్తిఁ జెన్నొందె
జలము లెందును నతిస్వచ్ఛంబు లయ్యెఁ, గలయదిక్కుల కప్పు కావిరి విఱిసె
గగనప్రసన్నత గలిగె నిష్కంప, మగుచు భూతలమొప్పె నప్పు డెంతయును
బవనసూనుఁడు శతబలియును నలుఁడు, జవశాలి పనసుఁడు శరభుండు ఋషభుఁ
డతులవిక్రమశీలుఁ డావాలిసుతుఁడు, నుతబలుం డగుసుషేణుం డర్కజుండు
గజుఁడును గవయుండు గంధమాదనుఁడు, విజయులైనట్టి యాద్వివిదమైందులును
దక్కనవానరోత్తములు నేతెంచి, మ్రొక్కి కీర్తించిరి ముదితాత్ము లగుచు
అప్పుడు లక్ష్మణు నఖిలదేవతలు, నొప్పార నుతియించి యొగిఁ బుష్పవృష్టిఁ
గురిసిరి వానరకోటి పెల్లార్చెఁ, బరిమళయుతముగఁ బవనుండు వీచె
ఆలక్ష్మణుఁడు విష్ణునంశంబుగాన, నాలంబులోపల నతనిచేఁ దెగిన
కపటరాక్షసుఁడును గాయంబు విడిచి, యపరాబ్ధిఁ గ్రుంకిన యర్కుండువోలె
విష్ణుసాయుజ్యంబు వెలయంగ నందె, నుష్ణాంశుకులకీర్తు లొగి దిశల్నిండ
సౌమిత్రి యట జయస్తంభంబు నిల్పి, రామునియొద్దకు రయమునఁ జనియె
సర్వవానరవిభీషణవాయుజాలును, బర్వి యెంతయుఁ దన్ను బలిసి యేతేర
వచ్చి రామునిపాదవనరుహంబులకు, నచ్చుగా నెఱఁగిన నప్పు డుప్పొంగి
యలరి కౌఁగిటఁ జేర్చి యానందబాష్పములతోడఁ దోడలపై ముద మొప్ప నునిచి
పొరి నంగముల వీఁకపులకలనంగ, నరగరుల్ప్బర గా డిన్నట్టిబాణముల
మునుకొను నాహసఘనమున మేఘనాదుఁ, డనిలోనఁ గూలిన యాసంతసమున
నతిరయంబున మూర్ఛ యంతలోపలనె, ధృతిదూలుకొనఁ దోన తెలివియుఁ గలిగి
యాయోధనంబున నలవుమై నింత, సేయునే యీతం డజేయుఁడై నేఁడు
బహుదివ్యశస్త్రాస్త్రబలునింద్రజిత్తు, నహితభయంకరు ననిలోనఁ జంపె
నటుగాన నాచేత ననిఁ జచ్చు నింకఁ, బటుశౌర్యధనుఁడైన పఙ్క్తికంధరుఁడు
ఆతనివిభవంబు నాతనిబలిమి, యాతనిసుతునితో నంట నేఁడు పొలిసె
నిఖిలశస్త్రంబుల నిపుణుఁడై మెఱసి, యఖిలరాక్షసులకు నాధారమైన
కొడుకుచావున కెల్లకోర్కులు విడిచి, కడిమిమై నాతోడఁ గయ్యంబుసేయ

సర్వాయుధోజ్జ్వలనన్నద్ధుఁ డగుచు, గర్వించి దుర్వారగతి వచ్చెనేని
చతురంగబలదైత్యసంఘంబుతోడ, వితతాహవక్షోణి విశిఖజాలముల
బలువిడి దునుమాడి బలిభూతములకు, నలువడఁ గావింతు సద్దశాననుని
అని సుషేణునిఁ జూచి యారాముఁ డనియెఁ, దనరు నోషధశైలతటవనంబునను
సురతరుప్రభలతో నొప్పువిశల్యకరణి నేతెచ్చి లక్ష్మణవిభీషణుల
వానరావలి శరవ్రణవేదనలను, వానరోత్తమ పాపవలయు నీవనిన
ఆతండు నత్తెఱం గటు సేయ వారు, వీతక్షతాంగులై వెస నుల్లసిలిరి
ఇనసూనుపనుపున నెల్లవానరులు, మనమారఁ గైసేసి మహితతేజమునఁ
జంద్రదివాకరసదృశులౌ రాము,చంద్రసౌమిత్రుల సరిఁ గొల్వ నపుడు
రామలక్ష్మణులును రవితనూజుండు, యామినీచరవరుఁ డగువిభీషణుఁడు
నుతబలుం డనిలసూనుఁడు సుషేణుండు, [illegible] జాంబవంతుండు
నీలుండు మొదలుగా నిఖిలయూథపులు, పౌలస్త్యులకునెల్ల బట్టుగొమ్మైన
యావీరవరునిచా వధికసమ్మదము, గావింప సంపూర్ణకాములై రిటను
అంత నారాక్షసు లట లంక కరిగి, యెంతయు కోపంబు లెసఁగ నవ్వేళ
రావణు లోకవిద్రావణుఁ గాంచి, దేవ నీపుత్త్రుండు దేవేంద్రవైరి
తనబాహుబలమునఁ దఱిమి వానరులఁ, దునుమాడి పెక్కండ్రు దురములోపలను
దివిజు లచ్చెరువంద దివ్యాస్త్రకోటి, నవిరళంబుగఁ బేర్చి యంతటఁ బోక
బలువిడి లక్ష్మణుప్రాణము ల్గలఁగఁ, బలుసాయకంబులఁ బ్రౌఢుఁడై యేసి
యామేఘనాదుం డుదగ్రవిక్రముఁడు, సౌమిత్రిచేఁ జచ్చె సమరమధ్యమున

## రావణుఁ డింద్రజిత్తుమరణమునకు శోకించుట

ననవుడు రావణుం డధికశోకమున, మునిఁగి పెద్దయుఁ బ్రొద్దు మూర్ఛిల్లి తెలిసి
హా వంశవర్ధన హా మహావీర, హా వీరరణధుర్య హా శూరవర్య
ఆశతమన్యుని నవలీల గెలుచు, నాశౌర్య మెవ్వఁ డుదగ్రుఁడై యడఁచె
బలసూదనాదిదిక్పతులు ఖేచరులు, పలుమాఱు నీవన్నఁ బాఱుచుండుదురు
నీయుగ్రశక్తికి నిలిచి నిన్నెదిరి, యాయోధనంబున నడఁచెనే నరుఁడు
చటులకోపంబునఁ జండకోదండ, పటుబాణపాణివై బవరంబులోన
నిలిచిన జముఁడైన నీకోడునట్టి, బలిమి యెక్కడ బోయెఁ బరికింప నేఁడు
వక్రమై దైవంబు వలనుగాకున్న, శక్రారి నీకంటె జముఁ డెక్కుడయ్యె
అక్కజంబుగ మందరాచలంబైన, వ్రక్కలు సేయు నీవాఁడిబాణములు
రణములోపల మున్ను రామలక్ష్మణులఁ, దృణలీల గెలిచితి తివిరి పల్లాఱు
ఆమహాత్త్వము దూలి హాపుత్త్ర నీవు, సౌమిత్రిచే నిటు సమసితే యకట!
అమరులు మునులును నమరారి నీవు, సమరోర్విఁ బడుటకు సంతసించెదరు
సంహారఘనఘనస్తనితమైనట్టి, సింహనాదము నీవు చేసిన బెదరు
నిఖిలలోకంబుల నీ వజేయుఁడవు, నిఖిలనిర్జరులకు నీపేర్మి దక్కి
యల్పునిగతిఁ గూలి తకట! యాబ్రహ్మకల్పన దప్పింపఁ గానేరవైతి

సచరాచరములైన జగము లీరేడు, సుచిరవిక్రమ వీరశూన్యమైనదియు
కందన నీలావు నమ్మిన నన్ను, బృందారకులు నవ్వఁ బెడఁబాయఁ దగునె
చెవులార రాక్షసస్త్రీవిలాపములు, వివిధభంగుల నేఁడు విన నాకు గలనె
ప్రియయౌవరాజ్యంబు నీవులంకయును, నీయిష్టబంధులు నీతల్లి నన్నుఁ
దనయ నీపత్నులఁ దన యీల డించి, చనఁ జాలితే యెందుఁ జనితి వీవకట!
రాఁ డంతకుని గెల్చినాఁడ వాలమున, నేఁడెట్టు వోయితి వీవు తత్పురికి
పరలోకకృత్యము ల్భక్తితోఁ దనయుఁ, డరయఁ దండ్రికిఁ జేయునవియెల్లఁ బోయి
యే నీకుఁ జేయంగ నిటు నేఁడు వలసె, నేనింక నేమందు నేమి సేయుదును
రామలక్ష్మణులును రవితనూజుండు, యామినీచరపాలుఁ డగువిభీషణుఁడు
భీమవిక్రమలీలఁ బెంపొందు కపులు, నామర్మములు దూరనాఁటియున్నారు
అట్టి నాహృదయశల్యంబు లోపుత్ర, నెట్టనఁ బెఱుకక నేఁడెందుఁ జనితి
నాపాలిజయమయ్యు నాతేజమయ్యు, నాపుణ్యఫలమయ్యు నాభాగ్యమయ్యు
నాపెంపుగతియయ్యు నాకీర్తియయ్యు, నేపార నోపుత్ర యెంచినవెల్ల
నీవ యైయుండుదు నీవంటికొడుకు, చావఁ జూచితి నింక జన్మ మేమిటికి
ఈకష్టశోకాబ్ధి యెడ తెగ కీఁద, నాకు నెయ్యది తెప్ప నలినాప్తతేజ
నినుఁ గొని రాముని నిర్జింతుఁ బోర, నని నమ్మియుండితి నదియును దీరె
ఆశలన్నియుఁ దీరె నకట! యేనింక, నీశోకదహనాగ్ని నెరియంగఁజాల
ననియని శోకించి యందంద పొగిలి, మనసు డిందకయుఁ గ్రమ్మఱ మూర్ఛనొంది
యున్నదశగ్రీవు నుగ్రప్రభావు, నున్నతాత్ములు మంత్రు లొయ్యనఁ దెలుప
బలురోషశోకము ల్బలిసి కన్బొమలు, పలుమఱు ముడివడఁ బగవసంబొప్ప
నేచిన కిన్కమై నేదిక్కు చూచెఁ, జూచినదిక్కున స్రుక్కి రాక్షసులు
ఘనభీతిఁ బఱువ రాక్షసలోకవిభుఁడు, కనదుగ్రదంతసంఘట్టనరవము
లతిభయంకరవృత్తి నప్పుడు దిశలఁ, బ్రతిరవం బొనరింపఁ బదిముఖంబులను
గనుఁగవలను నగ్నికణములు దొరుఁగఁ, దనమంత్రివరుల నందఱఁ జూచి పలికె
విడువనితపమున వేధ మెప్పించి, పడసితి శస్త్రాస్త్రసంఘములు పెక్కు
ఎన్నఁడు నపజయం బెఱుఁగ యుద్ధముల, నెన్నఁడు నేశోక మెఱుఁగఁ జిత్తమున
నిరుపమస్థితి నొప్పు నీలాభ్రమనఁగఁ, బరమేష్ఠి మెప్పించి పడసినజోడు
గైకొని రథ మెక్కి కదలితినేని, నాకనాయకుఁడైన నను గెల్వఁగలఁడె
నలినసంభవుచేత నాఁడేను గొన్న, విలునమ్ములును మీరు వేగంబ తెండు
వాఁడిమి మీఱంగ వడిఁ గిట్టి కలన, నేఁడు నే గెల్తు నానృపులను గపుల
నని పేర్చి ప్రళయకాలాగ్నియుఁ బోలె, ఘనమున జాజ్వల్యమానుఁడై యుండి
దివ్యవాద్యములతో దిక్కులు మెఱయ, నవ్యబాహాస్ఫాలనంబు సేయుచును
అనియె నిట్లుగ్రుఁడై యధికరోషంబు, పెనఁగొన మఱియును బేర్చి యిట్లనియె
నేఁడు నాతమ్ముల నేఁడు నాసుతుల, నేఁడు నాబంధుల నేఁడు నాభటులఁ
జంపెను సీతకై చనుదెంచి కడిమి, పెంపార రాముఁ డభేద్యుఁడై పేర్చి

యాయింద్రజిత్తు మాయాసీతఁ జంపె, నాయుపాయంబు నిరర్థకంబయ్యె

## రావణుండు సీతను దెగ వేయఁ బోవుట

నేనింక నిజముగా నిప్పుడ పోయి, జానకిఁ దెగటార్చి చలము సాధింతు
నని హస్తమునఁ జంద్రహాసంబు పూని, తనరినపదహతి ధరణి గంపింపఁ
జనుచుండ వృద్ధరాక్షసమంత్రివరులు, దనశంక నూహించి తమలోన ననిరి
దశరథాత్మజుల నీదశకంధరుండు, నిశితబాణంబుల నిర్జింపలేఁడె
కైకొన కితఁడు కడిమిమై సకల, లోకపాలుర నాజిలో మున్ను గెలిచె
నోలి మరుత్తుల నుగ్రాహవమునఁ, దోలెను నలువలఁ దొమ్మండ్రఁ గెలిచె
నెనమండ్రు వసువుల నేపడఁగించె, ఘనతతోఁ దొమ్మిదిగ్రహముల నడఁచెఁ
దెగువఁ బన్నిద్ద రాదిత్యుల నొంచెఁ, బగ గెల్చె రుద్రులఁ బదునొక్కరుండ్ర
నరువార గంధర్వయక్షరాక్షసుల, నురగుల గరుడుల నుగ్రదానవుల
నతిభీతి పొందించె నారసి చూడ, నితనికి నరు లన నెంతటివారు
తమకించి సతిఁ జంపఁ దగవుగా దనుచు, సమవర్తిఁబోలె నాసమయంబునందు
లోకభయంకరాలోకుఁడై తివిరి, నాకేంద్రవైరి జానకిఁ జంపఁ గదిసె
అప్పు డప్పాపాత్ము నత్యుగ్రదృష్టి, కప్పుణ్యవతి స్రుక్కి యనదచందమున
నొందినభీతితో నుగ్రగ్రహంబు, ముందట నిల్చిన మోదంబు దక్కి
పడియున్నరోహిణి పగిది సాకేత, పతితుఁడౌ రావణుభావంబుఁ జూచి
యీదురాత్మునిచేత నిటు చావవలసె, హా దైవమా! యని యతిబాధ పొంది
దురమున నింద్రజిత్తుఁడు చచ్చు టెఱిఁగి, సురవైరి చంపవచ్చుచున్నవాఁడో
కాక యారామలక్ష్మణుల జయించి, చేకొని ననుఁ జంపఁ జేరుచున్నాఁడో
వీనిచే చావ నావిధి చెఱఁబెట్టె, నేనేమి సేయుదు నిలమీఁద నింక
నక్కటా! దైవంబ యతిపుణ్యధనులఁ, బెక్కుసంకటములఁ బెట్టితే తెచ్చి
రామాభిరాముల రామలక్ష్మణుల, నామీఁద పగనంచు నలినాయతాక్షి
పలవించి పలవించి భావమధ్యమున, నెలకొన రఘురామునిజమూర్తి నిలిపి
పరవశయై తూలిపడి మూర్ఛవోయె, ధరణిపైఁ బడియున్న ధరణిజఁ జూచి
ధరణిజదెస నల్లు దశకంఠుఁ జూచి, కరము శోకించి రాక్షసులెల్లఁ గలయ
హాహానినాదంబు లందంద చెలఁగ, నోహో దురంత మీయుగ్రకృత్యంబు
అనుచుండునత్తఱి నమరారిఁ జేరి, ఘనుఁడు సుపార్శ్వుండు ఘననీతిధనుఁడు
వెఱవక తననీతివిభవంబు మెఱయఁ, దెఱఁగొప్ప నతని బోధించుచుఁ బలికె
ధాత పులస్త్యుండు తండ్రి ధర్మైక, నీతిజ్ఞుఁ డురుయశోనిధి విశ్రవసుఁడు
నీవు వేదాగమనిధివి నీపెంపు, భావింప కేల దుర్భావుండ వయితి
తగదుత్తమస్త్రీలఁ దవిలి వధింప, నగణితం బగుదోష మటుగాన వలదు
ఈకోపమంతయు నెల్లి యుద్ధమునఁ, గైకొని రామలక్ష్మణులపైఁ జూపు
మని చెప్పి యాచంద్రహాసంబు పుచ్చుకొని సుపార్శ్వుండు దోడ్కొనివచ్చె మగుడ
అంత నాదశకంఠుఁ డధికరోషమునఁ, జింతించి విన్ననై చిత్తంబునందు

మఱిపుట్టని పుత్త్రమరణాతురమున, మఱుఁగుచు నాస్థానమంటపంబునకుఁ
జనుదెంచి కొలువుండి చటులవేగమున, తనమంత్రిబాంధవతతుల రప్పించి
కొందలమందుచుఁ గొడుకుచందంబు, మది నుగ్గడించుచు మౌనతనుండె

## ఇంద్రజిత్తుభార్య సులోచన శోకించుట

అంతఃపురంబున నతివలు గూడి, చింతింపఁగా విని శేషునిపుత్రి
గైనసులోచన యాత్మేశుచావు, విని చాల వగచుచు వివశతనొంది
ఘాలుపొందఁగాఁ బెద్దప్రొద్దుకుఁ జెలులు, తెలుపఁగా నొకకొంత తెలివొంది కుంగి
నానావిధంబుల నాథునిఁ గూర్చి, యాననం బదరఁ బ్రలాపింపఁ దొడఁగె
హా ప్రాణనాయక హా జీవితేశ, హా ప్రాణనాథ నీవాజిలో నెదిరి
యేపార నిన్ను జయించెనే నరుఁడు, చూపోపఁజాలకఁ జులకఁగాఁ జూచి
పాపపుబ్రహ్మ యీపట్ల నిద్దఱినిఁ, బాపంగఁ దగునె దాత్పర్యంబులేక
యెప్పు డెక్కడికైన నేగుచోఁ బిలిచి, చెప్పిపోదువు నన్ను నేమ ముప్పొంగ
నాకుఁ జెప్పిన నీకు నాథ యీచావు, చేకూరునే శత్రుచేత నీలాగు
మాతండ్రి నన్ను ప్రేమముమీఱ నీకుఁ, బ్రీతి రెట్టింపఁగఁ బెండ్లిగావించు
తఱి నీవు జయకాంక్ష దలఁచితివేని, సరవి కార్యంబులు సతితోడఁ జెప్పి
అరిగిన నజహరాదుల కజేయుఁడవు, నరు లనఁగా నెంత నాకేశవైరి
యనుచు శిరోరత్నమపుడు నాచేతి, కొనరంగ నిచ్చి నాశోకబుద్ధి దెల్పె
తనయ నీపతి శత్రుతతిమీఁదఁ బోవ, మానుగా తలపయి మణి నివాళించి
పంపినఁ బగఁదీర్చుఁ బగతులనెల్ల, నింపుగాఁ జెప్పిన నీమామమాట
మఱచి యిప్పుడు నీవు మఱి వైరిదివ్య, శరవహ్నిచే రణస్థలిని వ్రాలితివి
అని తనప్రాణంబు లాత్మేశునకును, మునుకొని మదిదారఁ బోసి యాక్షణమె
తనయులఁ జూచి యాతరలాయతాక్షి, ఘనమైన శోకసాగరమున మునిఁగి
భీతిల నేల విభీషణుం డుండ, నాతఁడు మన్నించు నధిక తేజమున
వర్ధిష్ణులై తనూభవులార మీరు, వర్ధిల్లుఁ డెప్పుడు వరగుణోన్నతిని
నాకింక నుండుట న్యాయంబు గాదు, ప్రాకటంబుగఁ బోదు ప్రాణేశుకడకు
నని ముదమందుచు నన్నిట రోసి, మనమునఁ గలవాంఛ మమత రెట్టింప
నలయుచు సొలయుచు నసుకసు రనుచు, లలిఁ దూలి యజపుప్పుటిచందమునఁ
జని దశకంఠునాస్థానంబుఁ జేరి, తనకన్నులను బాష్పతతులును దొరఁగ
మదిరాక్షి యేడ్చుచు మమత రెట్టింప, నొదుగుచు మామతో నొయ్యనఁ బలికె
పతివియోగంబైన సతియు నాక్షణమె, పతిసంటి యేగుట పరమధర్మంబు
అటుగానఁ బతినంటి నరుగంగవలయుఁ, బటుబుద్ధితోడ నాపతికళేబరము
తెప్పింపు మిప్పుడు తీవ్రంబుగాను, పంపు (?) మిప్పుడు భటవర్గబాంధవుల
ననిన నాతఁడు నాత్మ నల్లఁ జింతించి, మనుజాశనుండు నామగువ కిట్లనియె
విన్ననై యాహవవిముఖమధ్యమున, పన్నుగాఁబడియున్నపడఁతి నీవిభుని
నేను భో యడిగిన నిత్తురే వారు, కాన నాచేతను గాదు మృగాక్షి

నీమన సటుమీఁద నే నేమి చెప్ప, భామ నీవెఱుఁగని పనియేమి కలదు
చెప్పితి నాకుఁ దోఁచినవిధం బనిన, నప్పద్మలోచన నతని కిట్లనియెఁ
గైలాసనగము వేగమె కేలనెత్తి, ఫాలాక్షునకు నతిభయముఁ బుట్టించి
కడఁకమై మూఁడులోకములను గెల్చి, కడిమిగల్గిన మహాఘనుఁడవు నీవు
సురనాథు గెల్చిన శూరున కిపుడు, నరు లెంతవారు వానరు లెంతవారు
నరుఁలలో హీనవారులలోఁ బడిన, గురుసత్త్వశాలి నీకొఱకు దేహంబు
తేలేను నే నని ధీరత్వ మెడలి, యీలీల ననఁ గాలహేతువో యనుచుఁ
గర మొప్పఁగా బాహ్యకర్మంబులకును, తరుణులు పతిరహితం బైన నగ్ని
సరవితోఁ జన ధర్మసరణియుఁ గాన, వెరవక నే విన్నవించినమాట
నెగ్గుగాఁ గొన కానతిచ్చి నన్ననుపు, దిగ్గున చని పతిఁ దెచ్చుకోవలయు
ననిన నాదశకంఠుఁ డతివ వీడ్కొలుప, మానినియును దనమామకు మ్రొక్కి
మెలుపైనఁ దోలుకరి మెఱుపుచందమున, కలితమా తన మేనికాంతిజాలములు
తలకొని భూనభోంతర మెల్ల నిండ, జలరుహనేత్ర నిశ్చలబుద్ధి చేత
వినువీథి రాఁ గపివీరు లందఱును, మనమున నాశ్చర్యమగ్నులై చూడ
నంతఁ గొందఱు గొప్ప యాశ్చర్యమునను, వింత రెప్పలు విచ్చి వేవేగ చూడ
వెఱఁగొందుచున్న యీవెలఁదులు మేటి, సురపురినుండి యీసుదతీలలామ
దేఁత లంపిన జయలక్ష్మి రాము, దేవునికడ కేగుదెంచెనో కాక
తనయుఁడు మృతుఁడైన దశకంధరుండు, మనమున రోషంబు మఱియింతలేక
కక్కసం బుడిగి వేగమె సీత రథము, నెక్కించి మగుడ నంపించెనో గాక
కాక వేఱొక దేవకాంతయు నిందు, రాఁగారణం బేమి రయమున ననుచు
అంగద సుగ్రీవు లాంజనేయుండు, సంగరస్థలి నున్న తరుచరాధిపులు
వెరవొప్ప శ్రీరామవిభుఁడు లక్ష్మణుఁడు, దొరకొని చోద్యమందుచునుండి రపుడు
పరమపావనుఁడైన పవమానసుతుఁడు, వెరవున నాకాశవీథి నేతెంచు
భామినీమణిఁ జూచి పరఁగ రామునకు, తామసింపక వేగఁ దగ విన్నవించె
ఈమానవతి మది నెంచఁగా దేవ, భామకా దిది ధరాపుత్త్రియుఁ గాదు (?)
మానుగాఁ బతిలేని మగువయే కాని, దానికి నదిగొ ప్రత్యక్షంబు గలదు
అప్పడఁతుకయున్న యరదంబుమీఁదఁ, గప్పినధూళి రాఘవ విలోకింపు

సులోచన శ్రీరాముల నుతించుట

మని చూపుచుండ నయ్యబ్జాక్షి వేగ, చనుదెంచి యరదంబు చయ్యన డిగ్గి
పుత్తడిబొమ్మయో పాసగంగ మొదల, క్రొత్తగుముత్తెమో కొదరాయంచో
యనఁగ సన్నపునడు మసియాడుచుండఁ, గనుఁగవలను బాష్పకణములు దొరుఁగ
నందంద దూలుచు నసుకసు రనుచు, మందయానంబున మగువ రాఘవుఁ
గదిసి సాగిలి నమస్కారంబు సేసి, ముదిత హస్తంబులు ముకుళించి నుదుట
రవికులాంబుధిసోమ రామాభిరామ, ప్రవిమలగుణధామ పరరాజభీమ
జలదసన్నిభగాత్ర సారసనేత్ర, విలసితచారిత్ర వితతపవిత్ర

కలశాబ్ధిగంభీర కనకాద్రిధైర్య, లలితోక్తిమాధుర్య లావణ్యధుర్య
జననాథ నీపాదసంసేవకతన, నెనయు నాపాపంబు లెల్లను బాసె
నని విన్నవించుచు నరనాథునెదుట, వినయంబుతో నున్న వెలఁది నీక్షించి
మానవేంద్రునియనుమతిమీఁదఁ జేరి, భానుతనూజుఁ డాపడఁతి కిట్లనియె
నెలనాఁగ నీ వెవ్వరిచటికి నిపుడు, వెలయంగ వచ్చిన విధ మేమి నేఁడు
వెలఁది నీపే రేమి విభుఁడు నీ కెవఁడు, పొలుపొంద నెవ్వనిపుత్రివి నీవు
చెప్పు మేర్పడ నీదుచందంబటన్న(?), నప్పు డప్పడఁతి తా నశ్రువులొలుక
భానుజ విను భోగిపతి నాదుతండ్రి, యేను సులోచన యిదియు నాపేరు
నాకు నాథుఁడు మేఘనాదుఁ డాపుణ్య, ప్రాకటబహుభోగభాగ్యశీలుండు
నధికబాహాటోపుఁ డధికతేజుండు, కదనభీకరుఁడు వాసవభంజనుండు(?)
కడిఁదిశూరుఁడు దశకంఠనందనుఁడు, కడఁక మందోదరీగర్భసంభవుఁడు
అని చెప్పి శ్రీరాము నతివ వీక్షించి, మనమున నతిశోకమగ్నయై పలికె
నట్టిశూరుని రాఘవేంద్ర రణోర్విఁ, బట్టి చంపితి కృపాపరులయ్యు మీర
లెట్లు చంపితిరయ్య యినకులాధీశ, పుట్టునే యిటువంటి భూరివిక్రముఁడు
పతివియోగాగ్నిచేఁ బడఁతులు మదిని, పరితాప (?) మొందరె పలుతెఱంగులను
ఎఱుఁగవే సర్వజ్ఞ యేఁ బతిఁ బాసి, ధరణి వైధవ్యంబు దాల్పంగఁగలనె
శరణార్థిరక్షక సదయాంతరంగ, పరిపూర్ణహృదయ శోభనకృపాపాంగ
మరుగుచొచ్చితి కాన మన్నించునట్టి, బిరుదు నీబిరుదు రూపింప నావిభుని
మరలఁ బ్రాణములిచ్చి మన్నించు నాకు, పురుషభిక్షము పెట్టి భువి నన్ను నిలుపు
మనుచుఁ బ్రార్థించిన నవనీశ్వరుండు, ఘనదయాపరమూర్తి గాన నయ్యింతి
పురుషుని బ్రతికింప బుద్ధి నూహించు, టెఱిఁగి మారుతియును మఱి విన్నవించె
నిదియేమి రాఘవ యెఱుఁగరే మీరు, వదలక యాబ్రహ్మవరము తప్పింప
నీతియే మీరు మానినికిని జెప్పి, ధాతను మన్నింపఁ దగును భూనాథ
యని మారుతాత్మజుఁ డాడువాక్యములు, అన విని తలపోసి యపు డిట్టు లనియె
జలజాక్షి యింకొక్క జన్మంబునందు, కలసెదు భువి పెద్దకాలంబుదాఁక
పెక్కుసంపదలచేఁ బెంపుసొంపార, యక్కజంబుగ భోగ మనుభవంబొంది
యామీఁద వైకుంఠమందు నిర్వురును, కామితార్థోన్నతి కాంతురుగాక
యనిన సంతోషించి యతిదయాపరుని, వినయపూర్వకముగా వినుతింపఁదొడఁగె
సదయాంతరంగ శోభనకృపాపాంగ (?), సదమలగుణధీర సాధుసాంగత్య
పరఁగ నాపతికళేబరము తెప్పించు, పురమున కతివేగఁ బోవంగవలయు
ననవుడు సుగ్రీవుఁ డపు డిట్టు లనియె, వనజలోచన పతివ్రత వౌదువేని
నీదుపురుషునితోడ నీచందమెల్ల, తగఁబల్కు(?)మిప్పుడు తడయక యనినఁ
గడువేగమునఁ బోయి కదనరంగమును, దడయక చొచ్చి యాతరలాయతాక్షి
పడియున్నతలఁ జూచి పలుతెఱంగులను, అడలుచుఁ బతిఁ జేర నరిగియు దుఃఖ
జలధిలో మునిఁగి మూర్ఛయుఁ బొంది తెలిసి, పలువిధంబులఁ బడి ప్రాణేశుమీఁద

నెలఁగెత్తి హాయని యేడ్చి ధైర్యంబు, నిలిపి సుస్థిరమున నిలిచి యాలేమ
పలికె సత్యప్రభాభాసిత యగుచు, వలనొప్ప నామనోవాక్కాయకర్మ
ములయందుఁ బతిభక్తి మొనసితినేని, సలలితధర్మసంచారంబునందు
పతియె దైవంబని భావంబులోన, సతతంబు వ్రతముగా సలుపుదునేని
చెలఁగి నావిభునకు జీవంబు వచ్చి, యలమి నాతో మాటలాడుఁ గా కనుచు
అని తమయాత్మమర్యాదలు కొంత, యనినఁ గన్విచ్చి ద[illegible]
నెలఁత చంపినవాఁడు నీతండ్రి గాఁడె, తలపోయ నొరులకు తరమె నన్నెల్ల
నిలిచి యుద్ధముసేయ నిమిషమందైనఁ, బలుచింతపడ నీకు పనిలేదు వినుము
తనదు ఋణానుబంధము గూడియున్న, నెనసియుందురు నరు లింతులఁగూడి
వెలయఁగ యోగవియోగముల్బ్రహ్మ, వెలయంగఁ గల్పించె వెలఁది జీవులకు
ఇటుగాన మఱి కాలహేతువుగాన, కుటిలకుంతల యిట్లు కూలితి ధరణిఁ
జను మని కన్నులు చయ్యన మూయఁ, గని మదిలోఁ జింత గడలుకొనంగ
నప్పుడు బహుదుఃఖయై కొంతసేపు, అప్పొలఁతం దుండ కతివేగ వచ్చి
శ్రీరామువిభునకుఁ జేతులు మొగిచి, యోరామ వినుతించె. నతిమోదమునను
నప్పుడు రఘురాముఁ డంగదుఁ బిలిచి, యిప్పుడఁతుకపతి నిప్పింపు మనిన
తరమిడి యారామధరణీశునాజ్ఞ, తలనిడి యాయింతి పతికళేబరము
నిచ్చిన యురముపై నిడి రాఘవునకు, నచ్చుపుభక్తితో నతివ వీడ్కొలుప
నతివేగమున పురి కప్పుడే పోయి, యతివ మందిరమున కప్పుడు పోక
వామాక్షి పతికళేబర ముంచఁదగిన, భూమిని నిల్పి కాపుండఁగాఁజేసి
యంతఃపురంబున కటు చేర నరిగి, చింతించి తనమదిఁ జింతించి మఱియుఁ
దలపుత్రులను ప్రేమ తగఁ జేరఁదీసి, కనుఁగవలను బాష్పకణములు దొరుఁగ
శిరము మూర్కొని ప్రేమఁ జెక్కిలి నొక్కి, కరమర్థితోఁ దన కౌఁగిటఁ జేర్చి
సుతులార మీముద్దు చూడంగ నాకు, హితవుమీఱఁగ దైవ మియ్యకపోయె
మహిమీఁద నుండ ధర్మముగాదు తనకు, సహగమనంబు నిశ్చయముగాఁ గూర్తు
నిక్కడ నుండుట యిది బుద్ధికాదు, తక్కక పొందు పాతాళంబునకును
స్థిరబుద్ధి మీరాదిశేషునియింట, వెఱవకుండుఁ డటంచు వేగంబె పంపి
కడువేగమున దశకంఠుసన్నిధికి, గడగడ వడఁకుచుఁ గమలాక్షి పోయి
విన్ననై వదనారవిందంబు వాంచి, కన్నీరు విడిచి గద్గదకంఠ యగుచుఁ
గరములు మొగిచి యగ్గపుభక్తితోడఁ, బురపురఁ బొక్కుచు పొలఁతి మామకును
బోయినవృత్తాంతమును విన్నవించి, కాయము దెచ్చినక్రమ మెఱిఁగించి
రామచంద్రునిదయారసము లక్ష్మణుని, ప్రేమాతిశయము విభీషణుకూర్మి
గపికుంజరులపరాక్రమము సామహిమ, విపరీత మని చెప్ప విని రావణుండు
విన్ననై మోమున వేడుక లేక, తిన్ననిస్వరమునఁ దెలిసి తెలియకను
యాయింతి తెగువయు నాయింతి తెలివి, నాయింతిసుబుద్ధి కామహామహిమ
కాయింతి పతిభక్తి కాయింతి వేగఁ, గాయము దెచ్చినక్రమశక్తియుక్తి

క్షేమనఁజాలక యేయుత్తరంబు, కోమలి కియ్యకఁ గొంతుకుచు నున్న
కని సులోచన దైవకారణంబునకు, మనమునఁ జింతించి మఱియేల యింక
నాకానతీవయ్య నాకేశవైరి, యేకచిత్తంబున నేఁగెద నింక
ననఁగ వ్యాకులచిత్తుఁడై రావణుండు, తనదు కోడలిమోము తప్పక చూచి
యాయింతి తెగువయు నాయింతి తెలివి, పాయక యిఁక నిల్వఁబట్టరా దనుచు
నేమి చెప్పుదు నీకు నిందీవరాక్షి, నీయది పూనిక నీతెఱం గదియొ
ప్రియసుతాగ్రజుఁ జంపి భీతులచేత, భయదుఃఖవార్ధిలోఁ బడియున్నవాఁడ
నాకేమి తోఁచదు నాతి యీమీఁద, నీకుఁ దోఁచినజాడ నీ వేఁగు మనిన

### సులోచన సహగమనము సేయుట

తరలాక్షి మ్రొక్కి సంతసమంది మదిని, కర మొప్పఁ దనకు భాగ్యము గల్గె ననుచు
గృహమున కేఁగి కోకిలవాణి తనదు, సహవాసులౌ పెక్కుసతులు గొల్వంగ
దశకంఠునానతిఁ దగుబాంధవులను, దశదిశ లిండ మృదంగనిస్సాణ
పటహభేరీశంఖపటుకాహళాది, చటులనాదములు విచ్చలవిడి మ్రోయ
సతతనిశ్చలకృతస్నానయై యపుడు, నతివేగమునను గార్యార్థియై యచట
సిరిపట్టుఁబుట్టంబుఁ జెలువొందఁ గట్టి, సరసత రత్నభూషణములఁ బెట్టి
పువ్వులదండలు పొలుపొందవేసి, యవ్వారిగాఁ జుట్టి యాణిముత్తెముల
సూచకం బొనరించి సుందరి నొసలఁ, బ్రాచుర్యగంధలేపనము గావించి
తిర మొప్పఁగా నింద్రజిత్తుదేహంబు, కర మొప్పఁగా నలంకారం బొనర్చి
మంచివస్త్రంబులు మహితభూషణము, లంచితశృంగార మలవడఁ జేసి
వరవిమానంబుపై వరుఁ దెచ్చి పెట్టి, వరవాద్యతూర్యరావంబులు చెలఁగఁ
ద్రేతాగ్నులును గొంచుఁ దిరముగా దైత్యు, లాతతంబుగ వెంట నరుగుదేరంగ
వెనుకొని వేదోక్తవిధిపూర్వకముగ, మొనసి యుత్తరభాగమునఁ జితి పేర్చి
యాగతలైన ముత్తైదుల కపుడు, బాగైనపసిఁడి శూర్పములు దానముల
నచ్చి వస్త్రంబు లనేకంబు లొసఁగి, యచ్చపుభక్తితోఁ నాచితిమీఁదఁ
బరఁగఁ బ్రవేశించి ప్రాణేశు నురము, కరమర్థితోఁ దనకౌఁగిటఁ జేర్చి
యనలంబు సంధింప నాయింతిమేను, పనిగొని పతి సమర్పణముగాఁ జేసి
సకలదేవతలును సన్నుతుల్సేయఁ, బ్రకటంబుగాఁ దనపతితోడఁగూడి
దేవవిమానంబు తెఱఁగొప్ప నెక్కి, దేవతాకోటిలోఁ దేజరిల్లుచును
గడువేడ్కఁ బుణ్యలోకంబునఁ జేరి, పడఁతియుండెను దనపతితోడఁగూడి
యంతట రావణుం డధికరోషమున, నంతయు మూలబలాళి రప్పించి
చలమును బలమును సమరనైపుణియుఁ, గలసైనికుల నెల్లఁ గలయ వీక్షించి
కపులను రామలక్ష్మణుల మీరేఁగి, నెపమార నిర్జించి నెఱిఁ బగఁదీర్చి
రండు పొండనవుడు రభసంబుతోడ, నొండొరుఁ గడచుచు నుద్దండవృత్తి
సామజఘోటకస్యందనసుభట, సామగ్రితో యుద్ధసన్నద్ధు లగుచు
వజ్రసమానేకవరసాధనములు, వజ్రాంగులాదిగా వలయువర్మములు

కరమరుదయి భయంకరలీల దనర, ధరియించి మించి యుదగ్రులై పేర్చి
కరిఘటాఘీంకార ఘంటికానేక, తురగోగ్ర హేషిత దుందుభిశంఖ
పటహఢమామికా పణవాదివాద్య, పటురథసధ్వజపటపటాత్కార
రథనేమిశింజినీరావసంకులము, మథితార్ణవధ్వనిమాడ్కి ఘూర్ణిల్లఁ
బలుధూళిజలరాశిపట్టుగయ్యాంపు, గలను సేయఁగ నేఁగుకరణిఁ బెల్లెగయ
బింకము ల్గంకెనల్ప్రథితరఘోర,హుంకారములును నొండొరులపంతములు
నంకించునెలుఁగులు నార్పులు చెలఁగ, నంకితమణికుండలానేకహార
కంకణకోటీరకాంతులు నిగుడ, లంకేశుసైనికు ల్లంక వెల్వడిరి
భూకంప మెసఁగ నార్పులు మిన్నుముట్ట, భీకరగతి నేచి పెడబొబ్బ లిడుచు
ఘనసత్త్వమునఁ బేర్చి కపికులాంభోధి, గనుఁగొని బెగడొందఁగా నుత్సహించి
కడఁకతో నపుడు లంకావార్ధివెడలు, బడబాగ్నికోటులభంగి శోభిల్లి
కాటుకకొండలగతిఁ దనరారు, మేటిదైత్యులఁ జూచి మిగిలినకడఁక
నప్పుడు కపివీరు లార్పులు నిగుడ, నుప్పొంగి చెలఁగుచు నుడుపథం బవియఁ
గ్రుంకి దిగ్గజములు కుదికిలఁ బడఁగ, నింగికి లంఘించి నేలకు దాఁటి
బ్రహ్మాండ మగలంగ బాహువుల్సరచి, బ్రహ్మాదిదివిజులు పరికించి చూడఁ

### మూలబలయుద్ధము

కొండలు తరువులు గోటానకోట్లు, గండశైలంబులు కడువడిఁ బెఱికి
కొనివచ్చి తాఁకిరి క్రూరులై యంత, ననిలోన రఘురాముహస్తవైచిత్రిఁ
గనుఁగొను వేడుకఁ గమలబాంధవుఁడు, చనుదెంచె ననఁ బూర్వశైలాగ్రమెక్కె
వననిధి వననిధి వడిఁ దాఁకునట్లు, దనుజబలంబును దరుచరబలము
నొండొంటిఁ దలపడి యుగ్రత మెఱయ, మెండుగాఁ గపిసేన మిగులంగఁ జొచ్చి
యరదముల్వఱపుచు హరులఁ దోలుచును, గరులు డీకొలుపుచుఁ గవిసి రాక్షసులు
మునుమిడి నొప్పింప మొక్కలంబునను, వనచరు ల్దరులెత్తి వైవంగ నపుడు
వాటుల వ్రేటుల వడి నిందు నందుఁ, బోటులఁ గాటులఁ బొరి నందు నిందుఁ
గరవాలముల భయంకరవాలములను, గరగండముల గదాఘనదండములను
బరశులఁ బరిఘలఁ బట్టిసంబులను, గిరులను దరులను గిరిశృంగములను
దరుచరు లైవ్వంగ దనుజులువైవ, ధరణిపై శోణితధారలు దొరుఁగ
వనచరుల్గొండలు వాలయంత్రములఁ, గొని మీఁద వైవ నాకొండలనడుము
దుత్తుమురై నేల దొరుఁగఁ జక్రంబు, లెత్తివ్రేసియు గద లెత్తిమోఁదియును
సరిపోరి రొండొరు ల్బలమునఁ గిట్టి, సుర లద్భుతంబంది చూడంగ నపుడు
కరులను హరులను ఘనరథంబులను, సరిఁబోలి కపుల రాక్షసులు నొప్పింప
వనచరేశ్వరుఁడును వాలినందనుఁడు, ననిలజుండును నీలుఁ డాదిగాఁగలుగు
నగచరప్రముఖులు నధికవేగమున, నగపాదపముల వానలు వెసఁ గురియఁ
బరియలై పడియెడు బహురథంబులును, గరముగ్రగతి గూలు కరిసమూహములు
నఱిముఱిఁ గెడయు వాహనములు నేల, కొఱగు దానవులు నైయుండంగఁ గినిసి

రథరథ్యవేగంబు రథికు లగ్గింప, రథములు పఱపి సారథులు బిట్టార్వ
రథములు తమతమ నోరథములకరణిఁ, బృథివీతలం బెల్లఁ బెల్లుగా నద్రువఁ
గవిసిన కడనొగ ల్కరములఁ బట్టి, యవలీల దివి కెత్తి యవనిపై వైచి
తురగముల్ద్రోలినఁ దొలఁగక కపులు, తురగంబుతో నెత్తి తురగంబు వ్రేసి
కరుల డీకొలిపినఁ గరులపైఁ గవిసి, కరిఁ గరిఁ దాటించి గములకు నుఱికి
డాకాల నొక్కని డాకేల నొకని, నాకేల నొక్కని నాకాల నొకని
నడిమి నొంచియు నదరంట వ్రేసియును, గుదియించి వైచియుఁ గూల దన్నియును
బెక్కువిధంబులఁ జెర్చి రాక్షసుల, నిక్కడక్కడ సేయు నెడఁ బెచ్చుపెరిఁగి
తురగరింఖాదులధూళి గప్పుటయుఁ, దరుచరాధిపులును దానవాధిపులు
నరుదైన యానిబిడాంధకారమునఁ, గరవాలరోచులఁ గలకలం బెసఁగ
వీరు వారును బోర వెడలినరక్తధారామరీచులు దఱచుగాఁ గవిసి
బలురేణువను తమఃపటలంబు నడఁపఁ, జలమరి కయ్యంబు సందడిద్యైనఁ
గుంజరరథకూల ఘోటకమకర, పుంజధ్వజానేకభూరుహసుభట
కరకాండకల్లోల ఖడ్గపాఠీన, కరికరోరగఖేటకచ్ఛపనికర
వికలభూషణరత్నవిసరవికీర్ణ, శకటసైకత కేశజాలశైవాల
జనితచామరఫేనచయరక్తనదులు, వనచరు ల్దనుజులు వడిఁ దాఁటి దాఁటి
తాఁకుదు రాలోనఁ దరుచరు ల్గినిసి, వీఁక గోలెమ్ములు విఱుగ నొక్కియును
మోఁకాళ్ల మోఁచేత ముష్టి నందంద, తాఁకించి పడఁదీసి తలలు ద్రొక్కియును
బొట్టలు చీల్చియుఁ బోనీకపట్టి, చట్టలు వాపియుఁ జదియవ్రేసియును
గఱచియు విఱచియుఁ గడకాళ్లు పట్టి, జిఱజిఱఁ ద్రిప్పియుఁ జిదిమివైచియును
బలువిడి దలలొగిఁ బట్టి వెండ్రుకలు, పెళపెళ మనఁ బెల్చఁ బెఱికివైచియును
నిరుచేతులందును నిరువురఁ బట్టి, పొరిఁ బోరి దాటించి పొళ్లుసేయుచును
నెరసి రంధ్రంబుల నెత్తురు ల్వెడల, నురవడిఁ బడఁ ద్రోచి యురములు సరచి
నఖరదంతంబుల నాసికాకర్ణ, ముఖపాలపట్టిక ల్మసరి త్రెంచియును [ను
నొప్పించియును గపు ల్నల్గు రొక్కొకని, నుప్పొంగ యొక్కొకం డొనర నూర్వుర
బట్టి చంపియుఁ జలపట్టి దానవుల, నట్టిట్టు వోనీక యవనిపైఁ గూల్చి
చిందరవందర సేయంగ నప్పు, డందఱ వెసఁ జూచి యధికరోషమున
ధరణి గంపింప దిక్తటములు వగుల, శరధులు గలఁగ ముజ్జగములు బెగడ
దారుణాకారులై తద్దయుఁ జెర్చి, భేరీమృదంగగంభీరవాద్యములు
చెలఁగించి యక్కపిసేనపైఁ గవిసి, బలసూదనాదిదిక్పతులు భీతిల్ల
వికృతమస్తకములు వికృతహస్తములు, వికృతప్రకోష్ఠము ల్వికృతోష్ఠములును
వికృతనఖంబులు వికృతముఖములు, వికృతగాత్రములును వికృతనేత్రములు
వికృతహాసములును వికృతనాసములు, వికృతవక్షములును వికృతకక్షములు
వికృతకర్ణములును వికృతవర్ణములు, వికృతపాదములును వికృతనాదములు
గలసైనికులు లయకాలాభ్రపఙ్క్తి, బలువిడి విడివడి పఱతెంచుకరణిఁ

పరిఘగదాచక్రపట్టసప్రాస, పరశుతోమరభిండివాలత్రిశూల
కరపత్రకుంతముద్గరయష్టిపరశు, కరవాలఖేటకక్రకచాసినాగ
ముఖశిలీముఖచాపముసలాయుధాది, నిఖిలసాధనములు నెరయంగఁ బూని
నరికియు నడచియు నలియ మోఁదియును, నురువడిఁ జిమ్మియు నొనరఁ గ్రుమ్మియును
వ్రేసియుఁ బొడిచియు వీఁక వైచియును, నేసియుఁ గోసియు నీరీతిఁ గపుల
నొప్పింప నెంతయు నొచ్చి భీతిల్లి, యప్పుడు తరుగిరు లవనిపై వైచి
మన కేల యుద్ధంబు మన కేల చలము, నినకులేశ్వరుఁ డేల యినసూనుఁ డేల
యడవిలోఁ గాయ పండాకులు నమలి, కడుపు నించుక యుండఁ గానక వచ్చి
మడిమడి నిచ్చట మడియంగ నేల, పదపదం డని కపిపతులు రాఘవుల
విడిచి ధైర్యంబులు విడిచి రాక్షసులు, విడువక చలమున వెనువెంటఁ దఱుమ
సేతువుదిక్కుకై చెడి పాఱునపుడు, వాతూలసుతనీలవాలినందనులు
గని సేతువును దాఁటి గ్రక్కున నెందుఁ, జనకుండ మరలింపఁ జనుదెంచి భీతి
వనచరు ల్దనవెన్క వచ్చి చొచ్చుటయుఁ, గనుఁగొని రాముఁ డక్కపివరు ల్బెలఁగ

## శ్రీరాముఁడు మూలబలముపై మోహనాస్త్రము వేయుట

దనుజులమనములు తల్లడంబంద, ధను వందుకొని గుణధ్వని సేసి డాసి
కరలాఘవము చిత్రగతి నొప్ప మెఱయ, శరములు గురియ నిశాచరు ల్బెగడి
తెరువులు గానక తిరుగుడుపడుచుఁ, దెరలియు మరలియుఁ దీవ్రకోపమున
ధరణీశుఁ గాన రాధరణీశుఁ డేయు, శరముల తఱుచున సమరాంగణమున
రవికులతిలకుండు రభసంబుతోడ, వివిధభంగులఁ దనవిలువిద్య మెఱసి
యేసినశరము లనేకంబు లగుచుఁ, గాసి సేయుచుఁ దాఁకఁగా దైత్యవరులు
నడుమునఁ దెగియు నెన్నడిమికిఁ దొడరు, కడిఖండమయ్యు వక్షములు వ్రస్సియును
వదనముల్వ్రాఁడి భావంబులు సెదరి, పదములు దునియలై బాహువు ల్వ్రీఁగి
గళములు దునిసియుఁ గరములు దెగియుఁ, దల లవిసియుఁ దనుత్రాణము ల్డాఁకి
శరములు మెయినుచ్చి చనఁగ నెత్తురులు, దొరుఁగ నంగములఁ దుత్తునియలై రపుడు
కెడయు రాక్షసులు బెగ్గిలెడు రాక్షసులు, పుడమిపై మూర్ఛను బొందు రాక్షసులు
నొగులు రాక్షసులును నోరులు దెఱచి, దిగులొందు రాక్షసు ల్ధీరత సడలి
వారణంబులవారు వాజులవారుఁ, దేరులవారునై తిరుగుడుపడుచు
నదె రాఘవుం డేసె నదె రాముఁ డేసె, నదె డాసె నిదె పాసె నదె యిదె యనుచు
వీక్షింపరానట్టి వేగంబు మెఱసి, రాక్షసబలములు రయమునఁ బఱచె
నంతఁ బోవక రాఘవావనీనాథుఁ, డెంతయు ఘనరోష మెసఁగ వెండియును
నమ్మోహనాస్త్రంబు సంధించి పఱపఁ, దమ్ముఁ దా మెఱుఁగక దనుజులు భ్రమసి
దానవుం డితఁడు తరుచరుం డితఁడు, దా నని తెలియక దనుజుండు దనుజుఁ
గనితాఁకునప్పుడు గాంధర్వశరము, ఘనమహత్త్వమున రాక్షసులకుఁ జూడ [గుచు
నొక్కొక్కనికి రాముఁ డొక్కొక్కఁ డగుచు, నొక్కొక్కనికి రాము లొగిఁ బదుండ్ర
నొక్కొక్కనికి రాము లొగి నూర్గు రగుచు, నొక్కొక్కనికి రాములొగి వేవురగుచు

నొక్కొక్కనికి రాము లొగి లక్ష యగుచు, నొక్కొక్కనికి రాముఁలొగిఁగోటి యగుచు
శతకోటి యర్బుద సంఖ్యలు గడచి, యతులితం బైనట్టి యాజిరంగమున
మఱి సర్వమును రామమయమయ్యె నపుడు, గిరికొనియుండ నీ క్రియ నల్కతోడ
వడి నేయునప్పుడు వారక గుడుసు, పడియున్న రఘురాము పసిఁడివిల్ చూచి
సమగసమాభీలచక్రి యుగ్రతను, నముచిపై వైచిన నాఁటిచక్రంబొ
కిరణజాలంబుల గిరికొన్న భాను, పరివేషచక్రమో పరికింప ననుచుఁ
బ్రమమనంబుల నెంచి దైత్యు లయ్యంప,గముల మెఱుంగులు గనుఁగొని పఱవ
నమరారిసేనలో నప్పు డొక్కొక్క, నిమిషంబులోపల నెత్తురువాన
లాన వాజులు పదునాలుగువేలు, నేనుఁగులో పదునెనిమిదివేలు
లక్ష తేరులు రెండులక్షలు వీర, రాక్షసవీరులు రణభూమిఁ గెడయ
శరములరంబులై చాపంబు నేమి, కరణి యై గుణరవక్వణితమై మెఱసి
కిరణస్ఫులింగము ల్గిరికొన్న రాము, కరచాపచక్రంబు కాలచక్రంబు
గతి నుల్లసిల్లంగఁ గనుఁగొని పెలుచ, హతశేషదై తేయు లతిభీతిఁ బొంది
కడుఘోరమైన సంగరభూమి విడిచి, వడి లంకఁ జొచ్చిరి వనచరులార్వఁ
గాలాంతమునఁ గాలకంధరుం డలుకఁ, గేళి సల్పిననాఁటిక్రియ నుండె రణము
వలనయినట్టి రావణుమూలబలముఁ, జలమున రఘుపతి సమయించునపుడు
పదివేలుకరులు నిర్వదివేలుహరులు, పదిపదులరదము ల్పద్మంబుబలము
నాలంబులోపల నతిదారుణముగఁ, గూలిన నొకయట్ట గునియుచు నాడు
నట్టలు కోటాడ నారాము వింటఁ, గట్టిన యొకఘంట ఖణిలని మొరయు
నొరయ ఘంటలు నాద మూర కీరేడు, మొరసె నవ్విభుచాపమున నరజాము
భావింప రాకుండఁ బడియేడుగడియ, లావీరవరుని బాణాసనవిద్య
కిన్నరగంధర్వఖేచరయక్ష, పన్నగామరవరు ల్ప్రణుతించి రెలమి
ఆరామచంద్రుండు నప్పు డింపలర, శూరపుంగవుఁడగు సుగ్రీవుఁ గనియె
జగదేకభయదమీసమ్మోహనాస్త్ర, మొగిఁ బ్రయోగింపను నుపసంహరింప
నే నొండె విషధరుం డీశ్వరుం డొండెఁ, గాని నేర్పరులారు ల్గారు లోకముల
కౌశికుం డిచ్చిన కనదస్త్రమహిమఁ, గౌశికాదులకైనఁ గననశక్యంబు
అనిన విభీషణుఁ డారాముఁ జూచి, వినయసంభ్రమములు వెలయ ని ట్లనియె
దేవ యీబలములు దేవేంద్రుఁడాది, దేవతలకునైనఁ దెరల వెన్నఁడును
పౌలస్త్యునకు మూలబల మిది నేల, పాలయ్యె నీక గూలుఁ బంక్తికంధరుఁడు
తలకొని నీపెంపుఁ దలఁపవుగాక, తలఁచిన నెదురింపఁ దరమె యెవ్వరికి

## రాక్షసస్త్రీలు రావణుని నిందించుట

అని విభీషణుఁ డాడునట్టివాక్యములు, విని యప్పు డారామవిభుఁ డాత్మ నలరె
అంత నక్కడ దానవాంగనలెల్ల, నంతంతఁ బెనుమూఁకలై లంకలోనఁ
బొరిఁబొరి శోకాగ్నిఁ బొగులుచుఁ బలికి, రరయ జగన్నింద్య మగుచరిత్రంబు
ప్రాయిడిమోమును బలితరోమంబు, లైయున్న శిరము నభ్యాయతోదరము

వికృతవేషంబును వికృతయౌవనముఁ, గ్రకచోగ్రదంష్ట్రలు గలుగుశూర్పణఖ
సకలగుణోజ్జ్వలు సత్యసంపన్ను, సుకుమారు మరుతేజు సుముఖు నారాముఁ
గందర్పసుకుచిరాకారుఁ గావించె, నందనిపంటికి నఱు చాఁపఁ దగునె
యీలంకలోఁగల యెల్లరాక్షసులు, కాలగోచరులైన కారణంబునను
భానువంశజునకుఁ బంక్తికంఠునకు, నానిశాచరి సేసె నధికవైరంబు
తగవు చింతింపక దానిమాటలకుఁ, బగగొని వచ్చి యీపంక్తికంధరుఁడు
తనచావునకె కాదు ధరణీశుదేవిఁ, గొనివచ్చె రాక్షసకులమెల్లఁ జెఱుప
నింతట సిద్ధించెనే సీత దనకు, నింత తెంపునకుఁ దా నితఁ డేల దొడఁగె
మారీచు నొకకోల మడియించె దండ,కారణ్యమునఁ జంపెఁ గసలి విరాధు
నిది యెఱింగియు రాము నెఱుఁగలేఁడయ్యె, మదిలోన గర్వించి మనరావణుండు
అనలసమానంబు లగుసాయకముల, జననాయకుఁడు జనస్థానంబునందు
బదునాల్గువేవురఁ బరిమార్చి రోష, మొదవంగ నేచి యత్యుగ్రబాణములఁ
ద్రిశిరు దూషణు ఖరుఁ దృణలీలఁ జంపె, దశకంఠుఁ డదియును దలపోయఁడయ్యె
రుధిరాశనుని నతిక్రూరవిక్రముని, నధిక యోజనబాహు నాకబంధకుని
గ్రౌంచవనంబునఁ గడతేర్చి పుచ్చె, రంచితవిక్రము లగుదాశరథులు
ఇట్టిరాక్షసులచా వెఱిఁగియుఁ దొడరె, నట్టిరాముని గెల్వ నలవియే తనకు
జగదీశుఁ డగు రామచంద్రుతోఁ బోర, మగఁటిమి గలుగునె మనరావణునకు
నవలీల వాలి నొక్కమ్మునఁ గూల్చి, రవిజుఁ గిష్కింధకు రాజుఁ గావించె
నధికపరాక్రము నాకుంభకర్ణు, వధియించె నొక్కఁడె వసుధేశ్వరుండు
కరిసహస్రంబు లగ్గలములౌ పెక్కు, తురగలక్షలు రథస్తోమకోటులును
గణనకు మిక్కిలి గలకాలుబలము, నణుమాత్రముగఁ జంపె నాజిరంగమున
నట్టి పరాక్రమం బదియెల్లఁ గనియు, నిట్టివాఁ డని రాము నెఱుఁగలేఁడయ్యె
ఆమేటి నతికాయు నయ్యింద్రజిత్తు, సౌమిత్రి యొక్కఁడ సమయించె నాజి
నింకనైనను రాము నిట శరణనఁడు, లంక నింటింట విలాపము ల్పుట్టె
తమబంధు లీల్గిరి తమమగ ల్దెగిరి, తమసుతు ల్మృతులైరి తమసహోదరులు
హతులైరి రణభూమి నని యెల్లవారు, నతిశోకమును బొంది యడలుచున్నారు
దుర్మతియును నీతిదూరుండు క్రూర,కర్ముండునై నాఁడు కపటరూపమున
సీత నీపురికిఁ దెచ్చిననాఁటనుండి, తోఁచెంచుచున్నవి దుర్నిమిత్తములు
దశకంఠుఁ డింక నీదశరథసుతుని, విశిఖాగ్ని గూలుట వేగంబ యుండు
నక్కటా! నీతిజ్ఞుఁ డగువిభీషణుఁడు, పెక్కుభంగులఁ జెప్పెఁ బ్రియమున బుద్ధి
నతఁడు చెప్పినబుద్ధు లన్నియు నాఁడు, హితవులుగా విన్న నీలంక సెడునె
కులశైలపక్షము ల్గులిశఘాతమున, నలుకమైఁ దునుమాడు నాపురందరుఁడొ
మధుకైటభాదుల మర్దించునట్టి, యధికుఁ డావిష్ణుఁడో యదయుఁ డంతకుఁడొ
ప్రళయకాలమునాఁటి ఫాలలోచనుఁడొ, యిల రాముఁడై పుట్టి యిటుచంపఁ దొడఁగె
దశరథతనయుండు దర్పంబు మెఱసి, దశకంఠు ననిలోనఁ దగఁ జంపునపుడు

ఘనులగుసురలైన గంధర్వులైన,మునులైన వీనికి మునువరం బిచ్చు
వనజసంభవుఁడు శర్వాణీశుఁ డయిన, వినుఁడు రాక్షసులైన విడిపింప లేరు
వరమిచ్చునప్పు డావనజసంభవుఁడు, నరులచేఁ జాకుండ నాఁడీఁడు గానఁ
బరికింపఁగా సర్వబంధులతోడ, ధరణీశుచేఁ జచ్చు దశకంధరుండు
ఇది నిజ మెట్లన్న నింద్రాదిసురల, మది దయలేక పల్మాఱు నొప్పింప
నీరావణునిచేత నెంతయు నొచ్చి, నీరజాసనుఁ గాంచి నిఖిలదేవతలు
నభయంబు వేఁడిన నాచతుర్ముఖుఁడు, శుభతరస్థితివారిఁ జూచి యిట్లనియె
నేబాధలను జెంద విటమీఁద మీకు, మీబుద్ధివర్తించు మీ రుండుఁ డెలమి
నని వారు దాను మహాదేవుకడకుఁ, జని ప్రస్తుతింపఁ బ్రసన్నుఁడై శివుఁడు
కమలాసనాదులఁ గరుణ నీక్షించి, యమరరక్షార్థమై యఖిలరాక్షసుల
సమరంబులోపల జంపించుకొఱకు, నమర నిందిరపుట్టు నాసతీమణికిఁ
బతి యయి ప్రజల నాపద లొందకుండ, సతతంబు గావ దుర్జనుల రాక్షసులఁ
జంపంగ విష్ణుండు జన్మించుఁ బుడమి, నింపార నని యానతిచ్చె రాముండె
యరయంగ నావిష్ణుఁ డామహీజాత, పరికింప నిందిర భావంబులోనఁ
దలపోయ శివుమాట దప్పదు గాన, మఱఁగనిశోకంబు మనకుఁ బాటిల్లె
మనకు దిక్కెవ్వరు మనరావణుండు, మననేరఁ డిఁకమీఁద మరుగంగనేల
మనకందఱకు దిక్కు మనవిభీషణుఁడు, చని రామచంద్రుని శరణంబు సొచ్చె
నని పెక్కుభంగుల నసురకామినులు, పనవుచుండఁగ విని పంక్తికంధరుఁడు
చింతాసమాకులచిత్తుఁడై యపుడు, వంతతో నొక్కింతవడి యూరకుండి
చండకాలవ్యాళసమలీల దోఁప, నిండుకోపంబున నిట్టూర్పు వుచ్చి
యవుడులు దీటుచు నందంద కన్నుఁ, గవల నిప్పులు రాలఁగా నుగ్రుఁ డగుచు
నురవడిఁ గనలి యుద్ధోన్మత్తు మత్తు, సొరిది విరూపాక్షుఁ జూచి మీ రెలమి
దండడిసింహనాదములు తూర్యములు, నందంద మెఱయంగ పనికి నేతెండు
అని పల్క భయమున నానిశాచరులు, విని యూరకున్న నవ్విధము వీక్షించి
యాలంబునకు వేగ యత్నంబు సేయుఁ, డేల యుత్సాహంబు లిటు మానియుండ
ననిన వారరిగి పుణ్యాహకర్మంబు, లొనరించి సన్నాహ మొప్ప నేతెంచి
యారాక్షసేంద్రున కవనతులైన, నారాక్షసులఁ జూచి యతఁ డల్కఁ బల్కె
నానాఁటి కిబ్భంగి నాబలంబెల్ల, హీనమయ్యెను భృత్యులెల్లఁ జచ్చుటయు
నమరేంద్రవిక్రముఁడైనయాఖరుఁడు, నమితబలోదగ్రుఁ డగునింద్రజిత్తు
నాకుంభుఁడును శూరుఁ డగునికుంభుండు, నాకుంభకర్ణుండు నాప్రహస్తుండు
భీమవిక్రమవిజృంభితుఁ డతికాయుఁ, డామహాకాయుండు నామహోదరుఁడు
నాసురాంతకుఁడును నానరాంతకుఁడు, భాసురయశులకంపనుఁడు దంపనుఁడు
నాకాధిపతినైన ననినోర్చువారు, నాకునై పొలిసిరి నాగర్వ మడఁగె
నటుగాన శత్రుల నందఱఁ దునిమి, పటుపరాక్రమమునఁ బగ నీఁగువాఁడ
మీఱినశరములు మిన్నులు ముట్టి, యేఱులు జలధులు నెఱుఁగ రాకుండ

నఖిలంబుఁ గప్పుచు నచ్చెరువార, నిఖిలవానరులను నేఁడు నిర్జింతు
నేపున నల్కనే నేయుబాణమ్ము, లాపుంఖముగఁ గాఁడి యగచరాస్యములు
నాళముల్గలిగిన నవపంకజములఁ, బోలంగ నేఁడాజిభూమిఁ గైసేతు
మగలు తనూజులు మాసహోదరులుఁ, దెగి రింక నెవ్వరు దిక్కుమా కనుచు
లంకాపురస్త్రీలు లలిఁ దూలి సోలి, యింక నీశోకాబ్ధి నిట మునింగెదరు
మార్తురఁ బొలియించి మఱి పురజనుల, యార్తి వాపుదు శోక మడఁచెదఁగాక
నేఁడాజిఁ బ్రతిపక్షనికరసైన్యముల, వాఁడిబాణంబుల నడిఁ ద్రుంచివైచి
కరమొప్ప ఫేరవకంకగృధ్రములుఁ, బోరి పిశాచప్రేతభూతజాలములుఁ
దనివోవ మాంసరక్తంబులఁ దృప్తి, యొనరింతు ననుచు యుద్ధోన్మత్తు మత్తు
నక్షీణబలుఁడగు నివ్విరూపాక్షు, నీక్షించి రణమున కిప్డు వేగ
యనుపమం బగునట్టి యరదంబు దేరఁ, బనుపుఁడు నేఁడు నాపటుసాయకములు
ఘనులైన రామలక్ష్మణుల ప్రాణములు, గొని వారిరుధిరము ల్గ్రోలఁ గోరెడిని
శతసంఖ్య లొక్కొక్కసాయకంబునను, మృతిబొందఁ గపికోట్లమీఁద నేసెదను
అనికి బలాఢ్యతు లగువారిఁ జూచి, కొనిరండు సేనలఁ గూర్చుక వేగ

రావణుఁడు రెండవసారి యుద్ధమునకు వెడలుట

యని వారు పిలిపింప నఖిలరాక్షసులు, వినువీథి యద్రువంగ వీఁక నార్చుచును
గరవాలచక్రభీకరభిండివాల, పరశుశూలప్రాసపట్టసగదలు
ముసలంబులును గాఢముద్గరంబులును, నెసఁగెడుశక్తు లనేకవిచిత్ర
వివిధాయుధంబులు వెలుఁగ నేతెంచి, రవిరళోత్సాహంబు లడరంగ నంత
దనుజులు నానాస్త్రతతులతోఁ గూడ, దినకరప్రభగలతేరు తెచ్చుటయు
రమణీయరత్నాంశురాజివిరాజి, తములైన కర్ణావతంసంబు లమరఁ
బదికంఠముల రత్నపదకముల్గ్రాలఁ, బదిముఖంబుల వింత పంతము ల్దనర
మహనీయకేయూరమణికంకణాది, బహుభూషణాంకితబాహుదండముల
శరశరాసనఖడ్గచక్రాసిపరశు, పరిఘాదిసాధనప్రకరంబు మెఱయ
దివిజారి చెఱఁబెట్టె దినకరు నొకని, దివి నొక్కదినమణి దిరుగుచున్నాఁడు
తలఁపఁ దక్కినభానుదశకమో యనఁగ, దలకొని కోటీరదశకంబు వెలుఁగ
నంత నాదశకంఠుఁ డారథం బెక్కి, దంతిరథాశ్వపదాతులు నడవఁ
బటుతరనిస్సాణఝాంకారవీర, భటసింహనాదాది బహునినాదముల
విలయకాలాభీలవేళ ఘూర్ణిల్లు, జలరాశితో లంక సరివోలుచుండ
నవిరళవందిజనావలివినుత, రవముతోడుత నుత్తరద్వార మపుడు
బలువడి వెలువడి పౌలస్త్యముఖ్యుఁ, డలుక యుద్ధోన్మత్తు నావిరూపాక్షు
మత్తుని వీక్షించి మహి వ్రయ్యవార, నొత్తిలి యార్చుచు నోలి నాలంక
వెడలంగ రవిదీప్తి వెలవెలఁబాఱె, నడరి దిక్కుల నిండె నంధకారంబు
ధరణి గంపించె రథంబులు విఱిగెఁ, దురగంబు లొఱిగె నెత్తురువాన గురిసెఁ
గడుఁగీడు శకునము ల్గానంగఁబడినఁ, గడిమి డింపక దశకంధరుం డడరె

లంకేశు నానాబలంబులఁ జూచి, పంకజగర్భునిభాండంబు వగులఁ
నిగుడు సార్పులతోడ నిఖిలవానరులు, నొగి వీఁకతోఁ దాఁకి రుగ్రదానవులఁ
గలుషించి యాలోనఁ గపిసేనఁ గిట్టి, బలములు నెరయంగఁ బంతము ల్మెఱయఁ
గఱకురాక్షసులు నుగ్రముగ నేయుదురు, నెఱకులు దూరంగ నిశితబాణముల
ముసలతోమరశక్తి ముద్గరచక్ర, విసరము లైనీతురు వీఁకఁ బెల్లేచి
యంకుశకుంతతోమరాదులఁ బొడుతు, రంకించి ప్రేయుదు రాభీలగదల
నడిదము ల్జళిపించి యలుకనంగములు, కడిఖండములఁజేసి కడిమిఁ జూపుదురు
కపులును గుపితులై కడిమి వాటించి, విపులశైలంబుల వృక్షజాలములఁ
బదదంతనఖవాలపాశహస్తముల, నదయులై యారాక్షసావలినెల్ల
శిరములు నరములు చేతులు మూతు, లురములు బాహువు లోష్ఠకంఠములు
ద్రెంచియు నొంచియుఁ దీవ్రవైఖరులఁ, జించియు వంచియుఁ జిదిమియు నదిమి
తరమిడి నిబ్బంగి దనుజుల నొంపఁ, దరుచరావలిఁ జూచి దనుజేశుఁ డంత
దారుణాకృతివత్సదంతశ్వకర్ణ, నారాచభల్లాది నానాస్త్రవితతి
నగచరరుధిరంబు నవనిపైఁ దొరుఁగ, నిగుడించి యొక్కొక్కనిశితబాణమునఁ
గపిపంచకంబును గపిసప్తకంబుఁ, గపినవకంబును గదనరంగమునఁ
గుదులు గ్రుచ్చినక్రియఁ గూలనేసియును, వదలక తరుచరు లైచుశైలములు
ఘనతరుల్సకలము ల్గానేసి మఱియుఁ, గనలి యేనమ్ముల గంధమాదనునిఁ
బదునెన్మిదింటను బనసుని మఱియుఁ, బదియింట నీలునిఁ బదియింట నలుని
ద్వివిదు నాఱింటను వినుతు నేడింటఁ, బవననందను నిరువదిట గవాక్షు
నైదైదులను మైందు నైదింటఁ గుముదు, నైదింట గోముఖు నైదింట ఋషభు
నేడిట శరభుఁ బదేడింట గజుని, నేడమ్ములను బృథు నేడింట హరునిఁ
దరిమి యొక్కమ్మడి దారుని గ్రథునిఁ, జెరి మూఁట సాయకాళీతినంగదునిఁ
దక్కినవనచరతతి నిలఁ గూలఁ, బెక్కుబాణంబులఁ బేర్చి యుగ్రతను
వెసనేసె మగఁటిమి వీఁకతో మెఱయ, నసురేశు మునుమున నందందకపులు
నడుములు నిశితబాణంబుల విఱిగి, పడువారు నిలలేక పడి తూలువారు
నురములు వ్రయ్యలై యొగిఁ గూలువారు, చరణము ల్తునియలై సరిమ్రగ్గువారు
చేతులు దెగువారు శిరములు పగిలి, భూతలంబునఁ బడి పొరలెడివారు
గళము లూరులును జంఘులు ద్రెవ్వ నొచ్చి, పలుమాఱు మూల్గుచుఁ బడియెడివారు
నంగంబు లివి యవి యని యేరుపడక, సంగరాంగణమునఁ జచ్చినవారు
బాణము ల్గాఁడినఁ బఱచుచు నడుమఁ, బ్రాణము లోర్వాయి యుర్వఁబడువారు
నయ్యుండ నప్పు డయ్యసురేశుఁ జూచి, చయ్యన రణమున నైరింపలేక
వానరు ల్పాఱిరి వసుధ గంపింప, దానవేంద్రుండును దవిలి వెన్వెంట
బలువిడి నేతెరఁ బాఱ నేమిటికి, నిలు నిలుండని పల్కి నిలువక పాఱు
సేనలఁ గావ సుషేణుని నునిచి, భానుసూనుఁడు వృక్షపాణియై నడచె
తరుశిలాహస్తులై తరుచరపతులు, నిరుగెలంకుల వెన్క నేపు దీపించి

నడుమ నాతఁడు సింహనాదంబుచేసి, తోడరి కాలాగ్నిరుద్రునివిధంబునను
వృక్షతాడనముల వేసఁ జంపి చంపి, వృక్షశిలాఘోరవృష్టి నందంద
రాక్షసబలముపై రయమునఁ గురియ, రాక్షసవరులు శిరంబులు పగిలి
కులిశోగ్రహతిభగ్నకూటంబులైన, కులశైలములభంగిఁ గూలిరి మఱియు
రవినందనుఁడు క్రోధరక్తాక్షుఁ డగుచు, నవనిధరాభీలహస్తుఁడై నడవ

**సుగ్రీవునిచే విరూపాక్షుఁడు మొదలగురాక్షసవీరులు చచ్చుట**

నంత విరూపాక్షుఁ డధికరోషమునఁ, బంతంబు మెఱయంగఁ బయిఁ దేరు వఱపి
విలు గుణధ్వనిసేసి విపులనిర్ఘాత, తులితంబులగు వాఁడితూపులనేయ
నవి లెక్క సేయక యరదంబుపైకి, రవిజుండు లంఘించి రథసూతహరులఁ
బృథివీధరంబునఁ బృథుశక్తితోడఁ, బృథివిపైఁ బడ నేయఁ బృథివికి నుఱికి
విరథుఁడయ్యును దైత్యవీరుండు వివిధ,శరము లేయుచుఁ బాదచారియై నిలువ
నమరారిపనుపున నఖిలాయుధములు, సమకూర్చి మావతు ల్మదసామజము
దెచ్చిన వెస నెక్కి దీకొని కపుల, విచ్చలవిడినేసి విక్రమం బెసఁగ
నుగ్రదానవులార్వ నుగ్రబాణముల, నుగ్రాంశుతనయుపై నురవడి నేసె
నక్కజంబుగ విరూపాక్షుండు మఱియుఁ, బెక్కాయుధంబులఁ బెక్కుబాణముల
వసమర నేయంగ వసుధ గంపింప, వెసఁ బాఱు తనవారి వెఱవకుం డనుచు
నలుకతో సుగ్రీవుఁ డతని నిర్జింపఁ, దలపోయఁ గ్రథనుఁ డద్రుచరోత్తముఁడు
విపులవృక్షమున దద్విరదంబుశిరము, గుపితుఁడై యేయంగఁ గుంభంబు పగిలి
తఱుచుగా శోణితధారలు దొరుఁగఁ, బిఱిఁదికి నొకవింటి పెట్టొనరించి
యది మ్రొగ్గనేల యయ్యసురయు దాఁటి, కదురుచు ఖేటకఖడ్గముల్ గొనుచు
మర్కటపతి దాఁకె మార్కొని వాని, నర్కసూనుఁడు వైచె నతులశైలమున
నక్కొండఁ దెగ వ్రేసె నదరి దానవుఁడు, రక్కసుఁ బిడికిట రవిజుండు వొడిచె
నాలోనఁ గరవాల మంకించి యసుర, వాలితమ్ముని వ్రేసె వడి చెడ కపుడు
పిడికిటిపోటునఁ బెలుచదానవుఁడు, నడిదంబు వ్రేటున నర్కనందనుఁడు
నొక్కటఁ బడి యంత నొక్కటఁ దెలిసి, యొక్కలాగున బోరి రొగి నుక్కుమిగిలి
యప్పుడు సుగ్రీవుఁ డఱచేత వ్రేయఁ, దప్పించుకొని హేతిదనుజుండు వ్రేసెఁ
గరవాలనిహతి కగ్గతిదప్పు నుఱికి, కరహేతిజడిసిపోఁ గపిరాజు వ్రేసె
మగఁటిమితో నంత మల్లయుద్ధమున, మిగిలినవెరవుల మెఱసి పోరుచును
దినవల్లభులభంగిఁ దేజరిల్లుచును, గనలుకాలాగ్నులకరణి మండుచును
బలిబిడౌజులమాడ్కి బాహుగర్వముల, వెలయుచు నిరువురు విజయంబు గోర
నక్కజం బగుశక్తి నఱచేత నినజు, మొక్కలంబున వాఁడు మూర్ఛిల్ల వ్రేసి
కరవాలహస్తుఁడై కపులపైఁ బాఱ, దరణిజుం డాలోనఁ దనమూర్ఛ దెలిసి
పఱతెంచి నిర్ఘాతపాతమైనట్టి, యఱచేత నావిరూపాక్షువక్షంబు
నెఱిలావుతో నేయ నెత్తురు గ్రక్కి, యుఱులుచు ధరఁ గూలె నుగ్రదానవుఁడు
తరుచరు ల్చెలఁగిరి దానవు ల్గలఁగి, తిరుగుడువడి రంత దీనాస్యు లగుచుఁ

స్రుక్కి యుద్ధోన్మత్తుఁ జూచి రావణుఁడు, తక్కనికడఁక యెంతయుఁ దోఁపఁ బలికెఁ
గంటె యాసుగ్రీవుకడిమి మీఱయన్నఁ, గంటె విరూపాక్షుఁ గదనరంగమునఁ
బడి రనేకాసురభటులును బెక్కు, మడిసెఁ కుంజరములు మడిసె నశ్వములు
విఱిగె రథంబులు విరిసె మూఁకలును, నుఱక నొప్పించుచు నున్నారు కపులు
సమయంబు నీ కిది సమరంబు సేయ, సమరాంగణంబున సమయింపు రిపుల
నన విని యనిఁ గూలి యఖిలేశుఁడైన, మనుజేశుఁ గలయంగ మది నిశ్చయించి
తరుచరానీకంబు దరియంగఁ జొచ్చి, శరగదాఖడ్గాదిసకలాయుధముల
నదరి విరూపాక్షునసుజుఁడు కపులఁ, గడిమిమై నొప్పింపఁ గని భానుసుతుఁడు
నగమెత్తి వైచిన నడుమనె దానిఁ, దెగనేసె దనుజుఁ డాదినకరాత్మజుఁడు
తనర సాలము వైచె దాని దానవుఁడు, దునియలుగా మూఁడు తూపుల నేసె
లక్షించి బాణజాలము లేయుచుండ, రాక్షసు లదరంగ రథముపై కుఱికి
భానుసూనుఁడు వాని పరిఘాయుధమున, వానికేతువువిల్లు వడి ద్రుంచివైచి
రథసూతుఁ దెగవ్రేయ రయమున వాఁడు, పృథుగదాపాణియై పృథివికి దాఁటి
యిరువురు పోరాడి రిల చలియింపఁ, బరిఘగదాభీలబాహువులైఱయఁ
గంఠీరవంబుల కరణి గర్జిలుచుఁ, గంఠముల్వదనము ల్గరము లంసములు
చరణము ల్నఖములు జానుజంఘములు, నురములు వెన్నులు నూరులు వ్రేళ్లు
బరులును బిఱుఁదు జబ్బలు మధ్యములును, శిరములుఁ జెవులును జెక్కులోష్ఠములు
వరుసతో నవు డురవడిఁ దాఁకి తాఁకి, వెరవులు చిత్రము ల్వెసఁ గల్గుచుండ
సరిగాఁగ నత్యంత సాహసలీల, నిరువురుఁ బోరి రనేకమార్గముల
నాలోనఁ బరిఘగదాభీలహతుల, వాలుదు రొక్కట వ్రాలి యాలోనఁ
గడిమిమై నొండొరుకంటె మున్దెలిసి, వడినార్తు రెంతయు వసుధ గంపింప
దానవుం డురుగదాదండంబు రెండు, సేనలవారు నచ్చెరువందఁ ద్రిప్పి
భానుజుఁ బడవైవఁ బడి లేచి వచ్చి, వనజాప్తసుతుఁ డేసెఁ బరిఘంబు ద్రిప్పి
దనుజాంగనిహతిదత్పరిఘంబు దునియఁ, గనలుచు దనుజుండు గరవాలమునను
వనచరపతి వైవ వడిఁ దత్కృపాణ, మినజుండు గొని దీప్తు లెసఁగ నంకించి
వికలమై ధర డొల్లవ్రేసె దైతేయు, మకరకుండలదీప్తిమయమస్తకంబుఁ
గనుఁగొని విఱిగి రాక్షసులు రావణుని, వెనుకకు లంకకు వెసఁ బాఱె రపుడు
బలగర్వ మెసఁగ సుపార్శ్వుఁ డంగదుని, బలుసేనపైఁ గిట్టి పటుసాయకముల
వానరశిరములు వడిఁ గూలనేసి, తోన హస్తంబులు ద్రుంచెఁ గొందఱను
గొందఱ బాహువుల్ ఘోరబాణముల, నందంద తునుమాడె నంత వానరులు
నానిశాచరునకు ననిఁ బాఱఁ జూచి, వాని తేఱికి దాఁటి వాలినందనుఁడు
పసయేరుపడ వానిపరిఘాయుధంబు, వెసఁ బుచ్చుకొని నేల వివశుఁడై తూల
వడినేసె నాజాంబవంతుండు నొక్క, పెడఁదపాషాణంబు వీకతో నెత్తి
యరుదార నంకించి యరదంబు విఱుగ, హరులు సూతుఁడు జావ నలుకతో వ్రేసె
దనుజుఁ డాలోఁ దేఱి దశసాయకములఁ, గనలుచు నంగదుఘనభుజం బేసి

యంబకత్రయమున నధికరోషమున, జాంబవంతుని నేసి చలనంబు నొంద
నేసె గవాక్షుని నిషుపంచకమున, నాసమయంబున నంగదుఁ డలిగి
వజ్రసన్నిభముష్టి వడిఁ గిట్టి పొడువ, వజ్రంబు తాఁకిన వసుధాధరంబు
వసుధఁ గూలినక్రియ వాఁ డాజిఁ గూల, నెసఁగ దేవత లార్చి రేచి మిన్నద్రువ
నంత రాక్షసబలం బతిభీతిఁ బాఱ, నంతయుఁ జూచి దశాననుం డనియెఁ
బరుషవిక్రముఁడు సుపార్శ్వుండు మడిసె, నురుబాహుబలుఁడు యుద్ధోన్మత్తుఁ డీల్గె
ననిఁ గూలె నావిరూపాక్షుఁడు మఱియు, ఘనమైనరాక్షసు ల్గడతేరి రింక
బలసమన్వితులైన పార్థివసుతుల, బలువిడి గెలిచి నాబంధులవలన
నెలకొన్న శోకాగ్ని నెరియు నీలంకఁ, గలవారివగ పెల్లఁ గడఁకతోఁ దీర్తు
నవిరళక్షత్రధర్మైకమూలంబు, నవజయోన్నతలక్ష్మణప్రకాండంబు
భానునందనముఖప్లవగశాఖంబు, మానవపతికీర్తి మంజరీకంబు

## రావణుఁడు రామలక్ష్మణులపైఁ గదియుట

ప్రకటసీతానామఫలభాసురంబు, సకలామరాశ్రితచ్ఛాయంబు నైన
రామద్రుమంబు బేరు రయమారఁ బెఱికి, నామనోదుఃఖంబునకు మందు చేసి
యొసఁగెద జగములో నేనంచు నవ్వు, దసురేశుఁ డధికరోషాయత్తుఁ డగుచు
సారథి కనియె నీచతురత మెఱసి, తేరు రాఘవులపైఁ దీవ్రతఁ బఱపు
వారిఁ జంపెద నేఁడు వారాజిఁ బడిన, తా రేఁగుదురు విచ్చి తరుచరు ల్చెదరి
యన విని వాఁ డట్ల యరదంబు వఱపె, ఘననేమిరవము లుత్కటముగాఁ జెలఁగ
సాయకాసనధనుర్జ్యానినాదంబు, మ్రోయంగ నిస్సాణములు బోరు కలుగ
వందిమాగధసూతవరనుతు ల్మించ, నందంద నిజసేన యార్పు లుప్పొంగఁ
దరుచరసేనపై దారుణాస్త్రంబు, లరుదార నిగుడించె నద్దశాననుఁడు
అజనిర్మితంబులౌ నాబాణతతుల, భుజబలంబులు దూలి భూరిసత్త్వులును
నేలఁ గూలిరి పెల్లు నిఖిలప్లవంగు, లాలోన రఘురాముఁ డనుజుండుఁ దాను
గోదండపాణులై కోపించి నిలిచి, రా దశాననుఁడును నలుక మార్కొనఁగ
నుడువీథి యవియంగ నుదధులు గలఁగఁ, గడుఁ బేర్చి దిక్కుంభికర్ణముల్వగుల
నడరు రామునిధనుర్జ్యాఘోషమునకుఁ, గడుమానసంబులు గలఁగి రాక్షసులు
గుపితదశగ్రీవకోదండముక్త,తపనోగ్రసాయకధ్వనికి వానరులు
భయమంది ధరణిపైఁ బడిరి యుక్కడఁగి, రయమార నాలోన రామలక్ష్మణులు
రవిసుధాంశులభంగి రాగిలి కదియ, దివిజారి రాముప్రదీప్తుఁడై కవిసె
నంత నాలక్ష్మణుం డతితీవ్రవిశిఖ, సంతతు లేసె దశగ్రీవుమీఁద
నడుమన తెగనేసి నాకేశవైరి, కడిఁదిబాణముల నుత్కటముగా మఱియు
నొక్కొక్కశరమేయ నుగ్రుఁడై వాని, నొక్కొక్కశరమున నొగి ద్రుంచివైచి
మూఁడేసిశరము లిమ్ముల వడి నేయ, మూఁడుమూఁడమ్ముల మురియలు చేసి
పదియమ్ము లేసినఁ బదియింట వానిఁ, జిదురుపలై ధరఁ జెదరిపో నేసె
నూఱేసి యేసిన నూతనగతుల, నూఱునూఱమ్ముల నుగ్గు గావించి

సౌమిత్రి నటు రణస్థలిఁ జిక్కువఱిచి, రామచంద్రునితోడ రణము సేయుటకు
దనుజాధినాథుఁ డుద్ధతి నేగుదేరఁ గనుఁగొని సమవర్తిఁ గని పాఱుకరణిఁ
గనుకనిఁ జెదరి మర్కటు లసింబాఱఁ, గని కన్నుఁగవఁ గెంపుగదల రాఘవుఁడు
విల్లంది దివిజులు వినుతింప ధరణిఁ, దల్లడపడఁ దాఁకె దానవేశ్వరుని
ముఖములఁ గోపంబు ముడివడ నతఁడు, నఖిలలోకాతిభయంకరంబుగను
రామునిఁ దాఁకె నారామరావణులు, భీమాట్టహాసము ల్బెరయించి మించి
సైన్యద్వయంబున సరినార్పు లెసఁగ, నన్యోన్యకార్ముకజ్యానినాదములు
పరువడి దశదిశాభాగంబులందు, మొఱయఁ బరస్పరముక్తబాణంబు
లొండొంటితోఁ దాఁకు నుగ్రంపురవము, మండుమంటలు నభోమండలి నిండ
సరినొప్పి యిరువురు శరలాఘవములఁ, గరలాఘవంబులకరణి నొండొరులు
మెచ్చుచు నొండొరు మీఱు వైచిత్రి, కచ్చెరువడుచును ననిసేయునపుడు
క్షోణీశుపై నొక్క ఘోరతమిస్ర, బాణంబు నిగుడించెఁ బంక్తికంధరుఁడు
ఆకాండ మడరిన నఖిలవానరులు, చీఁకటిగప్పి నిశ్చేష్టితులైరి
అప్పుడు గన్నుల నలుకఁ గెంజాయ, లొప్పార రఘురాముఁ డుగ్రబాణములు
పదిపదు లేసినఁ బటుభల్లసమితిఁ, ద్రిదశారి వానినిఁ దెగనేసి మఱియు
నిశితబాణము లేయ నృపుఁ డర్ధచంద్ర,విశిఖంబు లడఁగించి వేగంబ త్రుంచి
యసురేశునిఖిలావయవములు దూర, నసదృశంబగు ననేకాస్త్రము ల్వఱపె
రౌద్రబాణం బంత రావణుం డేయ, రౌద్రబాణంబున రఘురాముఁ డేసె
అవి రెండు నన్యోన్యహతములై పడఁగ, నవనీశ దనుజేశు లాలోనఁ గినుక
దివిరి యొండొరు లేయు తీవ్రబాణములు, దివినిండఁ గప్పినఁ దిమిరంబుగప్పె
రణములో నప్పుడు రయమున మ్రోఁగు, గుణరావములచేత ఘూర్ణిల్లుచున్న
యురుచాపసాగరయుగమున నెగయు, శరవీచు లొగిఁ బరస్పరఘట్టనముల
విరియంగ దైతేయవిభుఁడు కోపించి, నరనాథు నురమేసె నారాచసమితి
నదియుండె నీలోత్పలావలికరణిఁ, గదిసి రాముఁడు చండకాండము ల్దొడిగి
కవచంబు సించి వక్షము గాఁడనేసె, దివిజారి యప్పు డెంతే నొచ్చి మఱియు
నహిశిలీముఖముల నడరింపఁ దోన, యహిమాంశుకులనాథుఁ డవి త్రెవ్వనేసె
నాసమయంబున నమరేంద్రవైరి, యాసురసాయకం బడరింపఁ బెక్కు
ముఖముల శార్దూలముఖములు నుష్ట్రి,ముఖములు సూకరముఖములు నురగ
ముఖములు కరవైరిముఖములు దంతి, ముఖములు ఘనగృధ్రముఖములు దనరు
ఘనశిలీముఖములై కడుఁ బెక్కు నిగుడఁ, గని వానిఁ దునుకలుగాఁ జేసి మఱియు
జననాథుఁ డాగ్నేయసాయకం బేయఁ, గనుఁగొని నెందు నుల్కాముఖాస్త్రములు
మహితవిద్యున్ముఖమార్గణంబులును, గ్రహముఖంబులుగల్గు ఘనసాయకములు
మిహిరముఖంబుల మెఱయు బాణములు, దహనముఖంబులై తనరుశస్త్రములు
నగుచు నచ్చెరువుగా నడరంగ వానిఁ, దగనేసి యప్పుడు దైత్యవల్లభుఁడు
మయునిచేఁ బడసిన మాయాశరంబు, రయమున సంధించి రాముపై నేసె

నేసిన దాన ననేకంబు లగుచుఁ, బ్రాసతోమరగదాపరిఘంబు లడరె
గాంధర్వశరమంత ఘనకార్ముకముఁ, సంధించి నిగుడించె జనలోకవిభుఁడు
నాదిత్యతులితంబు లైనచక్రంబు, లాదివ్యబాణంబునం దనేకములు
జగములు భయమంద జనియించి రుచుల, నిగిడి యాకసమెల్ల నిండఁ బెల్లడరి
యామార్గణంబున నడరినపరిఘ, తోమరాదులనెల్లఁ దునియలు సేయ
దశకంఠుఁ డంత నద్ధరణీశుమీఁద, నిశితనారాచము ల్నిగిడించె నలుకఁ
బరఁగించె నృపుఁడును బ్రతిసాయకములు, పోరిఁబోరిఁ బుంఖానుపుంఖంబు గాఁగ
జగతీశదనుజేశశరపరంపరలు, గగనభాగంబెల్లఁ గప్పె నాలోన
నెడఁజొచ్చి లక్ష్మణుం డేడుబాణములఁ, బడగయు విల్లొక్కపటుసాయకమున
సారథిశిర మొక్కశరమునఁ ద్రుంచి, యారావణునివక్షమైదింట నేసె
నీలధరాధరనిభతురంగములఁ, గూలంగ నేసె మూర్కొని విభీషణుఁడు
విరథుఁడై దైతేయవిభుఁ డంతలోన, ధరణికి లంఘించి తరుచరు ల్బెదర
భ్రూకుటిదశకవిస్ఫురితాస్యుఁ డగుచు, భీకరశక్తి విభీషణు వైవ
నడుమనె మూఁడు బాణంబుల దాని, మిడుఁగురు ల్మంటలు మింటఁ బెల్లెగయ
ధరణిపైఁ బడనేసెఁ దరుచరులార్వ, ధరణీశునను జుండు దశకంఠుఁ డంతఁ
గడునల్గి మయునిచేఁ గన్న యాశక్తి, వడి విభీషణుమీఁద వైవ నంకింప
శరణాగతత్రాణసద్ధర్మపరులు, శరణాగతులచావు సైతురే యనుచు
దనుజేశుతమ్మునిఁ దనవెన్కఁ దిగిచి,కొని. రాముతమ్ముఁడు క్రూరబాణములు

### రావణునిశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

పరఁగించె నప్పుడు పంక్తికంధరుఁడు, బిరుదవై వచ్చి విభీషణు వెనుక
నిడుకొంటి లక్ష్మణ యీశక్తిహతికిఁ, గడిమిమై నోర్తువు గాకంచుఁ బలికి
ప్రళయకాలాదిత్యపరివేషఘోర, వలయమై దీపింప వడిఁ ద్రిప్పి వైచె
నది కింకిణీఘంటికానేకరవము, లొదవంగ మ్రోయుచు నుదధులు గలఁగ
వడిఁ గులాచలములు వడఁకాడ దిశలు, బెడఁక దివాకరబింబంబు గదలఁ
బిడుగులు దొరఁగంగఁ బృథివి గంపింప, నుడుపథం బవియంగ నుడుపంక్తి చెదరి
మిడుఁగురు లెగయంగ మింటఁ బెన్మంట, లడరంగ శేషజిహ్వాకార మగుచు
రయమునఁ బఱతెంచి రాముఁ డాలోక, భయదసాధనముచేఁ బ్రాణభయంబు
సమకొనకుండెడు సౌమిత్రి కనఁగ, నమరులు మింట నాహాకృతుల్సేయ
నెడనెడఁ బయినేయు నిషుపంక్తి జడిని, వడిమీఱఁగా వచ్చి వక్షంబునందు
భీకరఘనశక్తి వెల్లుగా గాఁడ, రాకుమారుఁడు దూలి రణభూమి వ్రాలెఁ
గాలావసానంబు గదియఁ బెంఫేది, కూలుమహామేరుకుధరంబుపగిది
ధరణిపైఁ బడియున్న తమ్మునిఁ జూచి, దరికొన్న శోకాగ్ని దనచిత్త మెరియఁ
గనుఁగవబాష్పము ల్గ్రిమ్మి పై నిగుడ, దనుజేశుపటుబాణతతులు గైకొనక
పృథుతరవక్షంబు వెల్లుగా నాటి, పృథివిఁ గాఁడినయట్టి భీకరశక్తిఁ
బఱతెంచి వానరపతులెల్లఁ గూడి, పెఱుకఁజాలకయున్నఁ బెఱికి పోవైచి

యర్కజానిలసుతులాదిగాఁ గలుగు, మర్కటేశులఁ జూచి మనుజేశుఁ డనిరు
శౌర్యంబు సలిపెడి సమయంబుగాని, కార్యంబు లడఁచు శోకపువేళ గాదు
ఘనులార! మీరు లక్ష్మణుఁ గాచికొనుఁడు, వినుఁడు నాపలికెడు వీరప్రతిజ్ఞ
వెనుకకు రాజ్యంబు విడుచుట బంధుజనులఁ బాయుట వనస్థలులఁ గ్రుమ్మరుట
బాణబాణాసనపాణినై యుండి, ప్రాణంబు దానైన పత్నిఁ గోల్పడుట
కడిఁది మాయావిరాక్షసులతో ననికిఁ, దొడరుట మొదలైన దుఃఖంబులెల్ల
ఘోరాజిలోఁ బాపుకొనువాఁడ నేను, దారుణకర్ము నీదశకంఠుఁ దునిమి
సమరోర్వి నీతనిఁ జంపెడికొఱకు, నమితవిక్రముఁడైన యావాలిఁ గూల్చి
కపిసేనకై భాస్కరతనూభవుని, గపిరాజ్యపట్టంబు గట్టితిఁ బ్రీతిఁ
జండతరగ్రాహసంకులం బగుచు, నొండొండ మిన్నందు నూర్పులు గలిగి
కడలేనియావార్ధిఁ గట్ట గట్టించి, కడచి వచ్చితి మహాకపిసేనతోడ
వచ్చి లంకాపురవరము వేఁడించి, యిచ్చట సౌమిత్రి నిటు గోలుపడితి
నాదశాననుఁ డేచి యాలంబులోన, నాదృష్టిమార్గంబునకు వచ్చెనేని
దృష్టివిషంబులఁ దీవ్రసర్పంబు, దుష్టజంతువు గాల్చు తెఱఁగు చూపెదను
బ్రదికిపోనీ నింకఁ బఙ్క్తికంధరునిఁ, బ్రదరపరంపరపాలు చేసెదను
గిరులెక్కి నేఁడెల్ల గిరిచరావలులు, సొరిది యారణకేళి చూతురుగాక
లోకపాలుర నెల్లలోకులు నేఁడు, నాకార్ముకప్రౌఢి నలువారఁ జూచి
రణములోపల నేను రఘురాముఁ డగుట, ప్రణుతవిక్రమలీలఁ బరికింప నిండు
సురకంటకుఁడు డాఁగి సురలోకమునకు, నరిగిన నబ్ధిమధ్యమునఁ గ్రుంకినను
ధరణిఁ దూఱిన రసాతలముఁ జొచ్చినను, బొరిపుత్త్రుఁ గాకేల పోనిత్తుఁ దన్ను
భువి నర్కకులమునఁ బుట్టితినేని, రవితేజుఁడగు దశరథుతనూజుండ
నైతినే రాముఁడ నైతినే నింక, దైతేయపతి రణస్థలి నిల్చెనేని
నేవిధంబుననైన నిపుడె నిర్జింతు, రావణుం డయ్యెడి రాముఁ డయ్యెడిని
నిల రామరావణు లిరువురయునికి, గలుగంగ నేర దీకదనరంగమున
ననుచు నారాచంబు లందంద దిగిచి, దనుజేశుపై నేయ దశకంధరుండు
ప్రతిశిలీముఖపరంపరలు పైఁబఱప, నిత రేతరాశుగానేకసంఘములు
మండుమంటలు నభోమండలి నిండ, నొండొంటితోఁ దాఁకు నుగ్రంపురవము
గురుతరకోదండగుణనినాదములు, బెరసె నొక్కట లోకభీకరగతులు
అంత జర్జరితాంగుఁడై రాముడివిశిఖ, సంతానవేగంబు సైరింపలేక
గజవైరిఁ గనిపాఱు గజముచందమున, రజనీచరేంద్రుండు రణభూమి విడిచి
కచభారములు వీడఁ గమనీయరత్న, ఖచితభూషణములు గనుకనిఁ జెదర

## రావణుఁడు విభీషణాదులమాట దలంచి చింతించుట

ఘనపాదహతి నేల కంపింపఁ బాఱి, వనచరు లార్వంగ వడి లంకఁ జొచ్చి
కొలువుకూటంబునఁ గూర్చుండి బుద్ధిఁ, దలపోసి తనకు ముందర విభీషణుఁడు
చెప్పినబుద్ధులు చిత్తంబులోన, నప్పుడు దలఁచుచు నారాముఁడేయు

నేటులు దలఁచుచు నెల్లందు సుభటు,కోటులు గొనియాడఁ గుంభకర్ణుండు
నతికాయుఁడును ఘనుం డగునింద్రజిత్తు, మృతులౌటఁ దలఁచుచు మిగులఁ జిత్తమున
గవిసిన శోకాంధకారంబువలన, నవశభావముఁ బొంది యాలోనఁ దెలిసి
యంతఃపురంబున కంత నేతెంచి, యంతరంగమునఁ జింతాక్రాంతుఁ డగుచుఁ
దనసతి రావించి తల వాంచి పలికె, విను రాముజగదేకవిక్రమక్రమము
నేమని చెప్పుదు నిదె నాకు నెదుర, రామసహస్రము భ్రమణి తోఁచెడిని
ఎక్కడఁ జూచిన నీలంకలోన, నక్కడ రఘురాముఁ డై యున్నవాఁడు
ఇంక జయోపాయ మేమియు లేదు, శంకరుచరణము ల్శరణంబు నాకుఁ
త్రిపురంబు లేదేవుదివ్యోగ్రబాణ, విపులాగ్ని నీఱయ్యె విస్మయం బెసఁగ
నిందుఖండంబున నేదేవుమకుట, మందమై విలసిల్లు నభినవస్ఫురణఁ
దనర నేదేవుహస్తమున బినాక, సునిశితఖడ్గత్రిశూలము ల్మెఱయు
నేదేవుఁ డఖిలలోకేశుఁ డేదేవుఁ, డాదక్షు మర్దించి యాగంబు చెఱిచె
అలుకతో నేదేవుఁ డంధకాసురునిఁ, బొలియించె నేదేవుఁ బొగడు వేదములు
తెలియ నేదేవుండు దేవాదిదేవుఁ, డెలమి నాదేవుని నే భజించెదను
అని కృతస్నానుఁడై యగ్రజన్ములకుఁ, దనియంగ బహువిధదానము ల్చేసి
మదిలోన మదదర్పమానము ల్విడిచి, పదిలుఁడై సాత్వికభావంబుఁ బూని
రక్తాంబరంబులు రక్తమాల్యములు, రక్తోపవీతము ల్రక్తగంధంబు
రక్తాక్షసూత్రము ల్రాజిల్లఁ బరమ,భక్తితో మంత్రజపంబు సేయుచును
నీశ్వరాలయమున కేతెంచి రాక్ష,సేశ్వరుం డచలితహృదయుఁడై నిలచి
తగ వేదిఁ గావించి దర్భాంకురంబు, లొగిఁ జేర్చి తనకుఁగా నుగ్రదానవుల
నన్నిదిక్కులనుండ నమరించి వ్రేల్వ, నున్నంత నెఱిఁగి మందోదరి వచ్చి
కనుఁగొని యోపఙ్క్తికంధర నీకుఁ, జనునె దీనునిభంగి శౌర్యంబు విడువ
ఉఱక నీవలిగిన నుదధులు మ్రోయ, వెఱచు సమీరుండు వీవంగ నళుకు
వినువీథి నర్కుండు వెలుఁగ శంకించు, ననలుండు తీవ్రార్చు లడరింప నోడు
జగములు నీసన్నఁ జలియించు నేల, మగఁటిమి చెడి విప్రమతము గైకొంటి
నేఁడింత ధైర్యంబు నీకు లేకున్న, నాఁడేల తెచ్చితి నరనాథుదేవి
మారీచుమాటలు మదిలోన నాఁడు, నేరముల్గాఁ గొంటి నీతి గావంటి
నీతి విచారించి నీచేటు సైఁప, కాతతధర్మాత్ముఁ డగువిభీషణుఁడు
తోడరి పల్మాఱును దోషాచరేంద్ర, చెడుత్రోవ లేటికి సీత నీపైని
విడుచుట గడుమేలు విడుమంచు నీకు, విడువక చెప్పఁడా విన వైతిగాక
మాతామహుం డైనమాల్యవంతుండు, నీతి దాఁ జెప్పఁగ నీవు గైకొంటె
తప్పక మీతల్లి తగవు చింతించి, చెప్పినబుద్ధులు చెవియొగ్గి వింటె
జననాథుతో నేల శాత్రవం బనినఁ, గనలవే మఱి కుంభకర్ణుమాటలను
వల దని చెప్పినవారివాక్యములు, తలకూడెనే నేఁడు దనుజలోకేశ
భుజవిక్రమం బెల్లఁ బోవంగ విడిచి, నిజముగా మునివృత్తి నేఁడు గైకొంటి

ఇంద్రుండె యని నోడ నెఱుఁగఁడు రామ,చంద్రుని నని జగజ్జనులు నిన్నగరె
యని వాని గెల్తుగా కసురేశ నీకు, ననదచందము లేల యని తూలఁ బల్క
నెలకొన్నసిగ్గున నిట్టూర్పు వుచ్చి, నెలఁత నీమాటలు నిజమగు నైన
రామచంద్రుని కింక రమణి నే వెఱవ, హోమంబు గావించి యుద్ధరంగమున
జననాథవరులను జంపెద నీవు, చనుమన్న మ్రొక్కి బాష్పంబు లందంద
దొరఁగ మందోదరి దుఃఖించి లోని, కరుగుచో నాడిన యార్ద్రవాక్యములు
విని సిగ్గుపడి వేల్మి విడిచి రావణుఁడు, చనియె నెజ్జకునంత జననాథుఁ డిచట
ఒడలు నెత్తుటఁదోఁగి యూర్పులు సడలి, పడియున్న శేషాహిపతిఁ బోలియున్న
యనుఁగుఁదమ్మునిఁ జూచి యాలోన ధృతికిఁ, జొనుపని మతితోడ శోకింపఁదొడఁగె

## లక్ష్మణునిమూర్ఛకు శ్రీరాముఁడు శోకించుట

ఇబ్భంగి సౌమిత్రి యిలమీఁద నుండ, నెబ్భంగిఁ బ్రాణంబు లేను నిల్పుదును
లలి రణం బొనరింప లావెట్లు గలుగు, బలుముష్టి విల్లెట్లు పట్టంగవచ్చుఁ
గన్నులబాష్పము ల్గ్రమ్మంగ నెట్టు, పన్ని పైఁ బఱతెంచు పరిపంథిఁ జూతు
నాకన్న లెదుటనే నాసహోదరుఁడు, నాకూర్మిబంధుండు నాప్రాణసఖుఁడు
నాకుఁ బ్రాణము లిచ్చి నను డించిపోయె, నాకు సిగ్గయ్యెడి నాశౌర్యమునకు
నా కేల రణ మింక నా కేల జయము, నా కేల రాజ్యంబు నా కేల సీత
నా కేల శౌర్యంబు నా కేల బ్రతుకు, నాకు నీతోడిద నాకంబు గాక
జయశాలివై మున్ను శరభశార్దూల, భయదాటవులలోనఁ బాటించి తెచ్చి
యరుదైన తుచ్ఛదైత్యాటవియందుఁ, బరునికై వడిఁ గాడుపఱచితే నన్ను
ఉన్నతోన్నతబుద్ధి నోరంతపొద్దు, నన్నుఁ గాచుటకుఁ గాననభూములందు
నిద్రవో వెన్నఁడు నేఁడిట్లు దీర్ఘ, నిద్రపోవుట నీకు నీతియే తండ్రి
పలుమఱు నిబ్భంగిఁ బనవుచుఁ బిలువ, నెలుఁగెత్తి యోయన వేమి లక్ష్మణుఁడ
ఇంక నెవ్వరు గల రే నెందుఁ జొత్తు, నింకఁ బాలయితిగా యీశోకవహ్ని
శుభలక్షణోపేతసురుచిరాకారుఁ, డభిరామబలుఁడు నాకతిభక్తిపరుఁడు
ప్రియసహోదరుఁడు గంభీరుండు సమర, జయశాలి నాప్రాణసఖుఁడు లక్ష్మణుఁడు
ఇతఁడు నాతోఁ గాన కేతెంచె నిప్డు, డితనితో నేఁగెద నేనింద్రపురికిఁ
గల రిందు నెందును గలరు బాంధవులు, నిల నిట్టిసోదరు లెక్కడఁ గలరు
యత్నంబుచేసిన నవనిజఁ బోలు, పత్ని నొండొకచోటఁ బడయఁ జొప్పడును
ఇట్టి సద్గుణశీలుఁ డిట్టి దయాళుఁ, డిట్టి మహాబలుం డిఁక నెందుఁ గలఁడు
తమ్ముఁ డన్మాత్ర మే తలపోయభక్తి, నిమ్ముల ననుఁ గొల్చు నిమ్మహాభుజుఁడు
ఇతఁడె నాపౌరుషం బితఁడె నాశాంత, మితఁడె నాకీర్తియు నితఁడె నాస్ఫూర్తి
యితఁడె నాశౌర్యంబు నితఁడె నాధైర్య, మితఁడె నానయమును నితఁడె నాజయము
భావింప నాపాలిభాగ్యంబు నితఁడె, పావనంబగు రాజ్యపదవియు నితఁడె
యని పెక్కుభంగుల నడలుచునుండ, విని సుషేణుఁడు రామవిభుఁ జూచి పలికె
ఇదియేమి దేవ నీకింత శోకింప, హృదయంబుఁ గుందింప కిడె చూడు మితని

యొడలఁ బ్రాణములు లేకున్న నాననము, కడునొప్పి యుండునే కళలు దేరుచును
గన్ను లిందీవర కమనీయకాంతిఁ, జెన్నొంది యుండునే చెలువంబు మిగిలి
అందంబులై యున్న వఱచేతు లెలమిఁ, గెందామరలభంగిఁ గెంజాయ మెఱసె
నని పల్కి రఘురాముఁడలువారించి, హనుమంతుఁ గనుఁగొని యతనితో ననియె
మును జాంబవంతుండు ముదముతోఁ దెల్ప, వినినాఁడ వౌషధవిధమెల్లఁ దెలియఁ
బోలుచు మహాద్రోణభూధరేంద్రమునఁ, జెలువొందు దక్షిణశిఖరంబునందు
బరికింప దీప్తులఁ బరఁగు విశల్య,కరణియు సౌవర్ణకరణియు మఱియు
సంధానకరణియు సంజీవకరణి, బంధురతరశుభప్రభ నొప్పుచుండు
నాలుగౌషధములు నవి దెమ్ము వేగ, మీలక్ష్మణుని ప్రాణ మెత్తంగవలయు
లవణసముద్రంబు లంఘించి పోయి, యవకుశద్వీపము లవియును గడచి
వడి నేఁగి దుగ్ధార్ణవము నాక్రమించి, తడయక పోయి చంద్రద్రోణగిరులఁ
బంబి దేవాసురు ల్బలువడి ద్రొల్లి, యంబుధి మథియించి యమృతంబు వడసి
యందు దాఁచుటఁ జేసి యమృతంబువలన, నందు జన్మించె నానౌషధలతలు
అందు దేవేంద్రునియనుమతంబునను, మందరంబులఁబోలు మహనీయతనులు
గంధర్వు లొగి వానిఁ గాచియుండుదురు, గంధర్వులకు నీకుఁ గలుగుఁ గయ్యంబు
తెరువున రాక్షసు ల్దిరుగుచుండుదురు, వరుస మాయావులై వారి నేమఱక
ద్రోణాద్రి కవలీలతో నేఁగి యితని, ప్రాణ మెత్తుము రఘుపతి సంతసింప
నిరుమూఁడులక్షలు నిరువదివేలు, పరికింప నిన్నూటపది యోజనములు
వాయునందన నీవు వాయువేగమునఁ, బోయి రమ్మిటఁ బ్రొద్దుపొడువకమున్నె
భానుండు వొడిచినఁ బ్రభఁ దూలి శక్తిహీనంబులై పోవు నీయౌషధములు
అటమీఁద లక్ష్మణునాయు వెత్తుటకు, ఘటియిల్ల నేరదు గాన నీలోన
వానరోత్తమ నీవు వడిఁ బోయిరమ్ము, వానిలక్షణములు వలయు నీకెఱుఁగ
హరితఫలంబులు నరుణపుష్పములు, నరుదారఁ దెల్లనియాకులు నమరు
జననాథసుత విభీషణు జాంబవంతు, నినసూను నంగదు నెలమి వీడ్కొనుము
అని సుషేణుఁడు పల్క నౌఁగాక యన్న, యనిలనందనుఁ జూచి యవనీశుఁ డనియెఁ
బడియున్న లక్ష్మణుప్రాణంబు లెత్తి, పడయుము త్రిభువనప్రఖ్యాతకీర్తి
అనుజులు మును మువ్వు రరయ నాకిప్పు, డనిలనందన నల్వురైరి నీతోడ
నన విని నీబంటు హనుమంతుఁ డుండ, నినకులోత్తమ నీకు నేల చింతింప
నీయాజ్ఞఁ దలమోచి నృపసింహ వేగ, మాయేడుదీవుల కవల నుండినను
నినుఁ డుదయాద్రికే తేరకమున్న, కొనివత్తు నౌషధకుధరమే ననుచు
నడుగుల కెరఁగిన హనుమంతు నెత్తి, నడుఁగ్రుచ్చి యాలింగనముసేసి విభుఁడు
ఇంద్రుండు నీశిర మినుఁడు నీముఖము, చంద్రుండు నీమది శక్తి నీపిఱుఁదు
లనిలుండు నీవెన్ను హరుఁడు నీవాల, మనలుండు నీయంఘ్రు లజుఁడు నీబుద్ధి
వరుణుండు నీశక్తి వాణి నీవాణి, గరుడకేతనుఁడు నీఘనబాహుయుగము
కుంజరాననుఁడు నీకుక్షి రక్షింతు, రంజనాసుత వేగ యరిగి రమ్మనిన

హనుమంతుఁడు సంజీవకరణికొఱకు ద్రోణాద్రికిఁ బోవుట

సరవి నర్కజ విభీషణ ఋక్షరాజ, పురుహూతపౌత్రు లప్పుడు వీడుకొల్ప
మేదిని వడి వ్రయ్య మెట్టిననగము, పాదంబు లూఁదిన బలువడిఁ గ్రుంగ
మెయిగాలి యవ్వీరు మిన్నేలు గలఁగ, రయమున లంకాపురంబుగోపురము
వెసఁగూలఁ గుప్పించి వినువీథి కెగసి, లసితవిద్యున్నిభలాంగూలలతయు
నుగ్రబాహార్గళయుగళంబు నెత్తి, యుగ్రాంశుపటుమండలోదగ్రలీల
వదనంబు గడుసముజ్జ్వలితమై వెలుఁగఁ, బదకర్ణసంకోశభంగిఁ జెన్నగుచు
బహుపర్వతంబులు బహుదేశములును, బహునదీనదములు బహువనంబులును
పురములు సాగరంబులు గనుంగొనుచు, నరుదారఁ దుహినాద్రి నవలీలఁ గడచి
దెసలు ఘూర్ణిల్లంగ దిగ్భాగ మగల, నసహాయశూరుఁడై హనుమంతుఁ డరిగె
వేవులవా రట్టివిధ మెల్లఁ జెప్పఁ,గా విని విఘ్నంబుగాఁ జేయఁ దలఁచి

కాలనేమివృత్తాంతము

యొంటిమై రావణుం డేగెఁ గాలనేమి, యింటికి నటు రేయి నేఁగుదెంచుటయు
భక్తితోడుత నర్ఘ్యపాద్యాదు లిచ్చి, నక్తంచరేంద్రున కాతఁ డిట్లనియె
నీమధ్యరాత్రి మీ రిటకు విచ్చేయ, నేమి కారణ మానతిండు నా కనిన
నని నేఁడు నాశక్తిహతి మృతుండైన, యనుజునికై రాముఁ డటుఁ దన్నుఁ బనుప
సంజీవికరణిచే సౌమిత్రిఁ బడయ, నంజనాసుతుఁ డిప్పు డరుగుచున్నాఁడు
చని వేగ హనుమంతుఁ జంపు కాదేని, వినుభాను గనునంత విఘ్నంబు సేయు
కలదు దేవాసురకల్పితంబైన, నలినాకరము ద్రోణనగసమీపమున
మదముతో నొకమహామకరియందుండు, నది దేవతల మ్రింగు నగచరుం డెంత
ఆసరోవరమున కనిలజుం డరుగ, మోసపుచ్చుము వేగముగ నేఁగు మనిన
మనమున నట నీతిమార్గంబు దెలియ, దనుజేశుతో నాడెఁ దగఁ గాలనేమి
మాయామృగాకృతి మారీచుఁ డరిగి, మాయమైపోఁడె యామతము పోనిమ్ము
ఘోరాజిఁ గూలిరి కుంభకర్ణాది, వీరదానవులెల్ల వినుమింకనైన
మనుజేశునకు సీత మరలంగ నిచ్చి, దనుజేశ లంక నీతమ్ముని కిచ్చి
యరిగి మృడావాస మైనకైలాస, ధరణీతలంబున తపసివై యుండు
కాదేని బిరుదుమైఁ గదనరంగమున, మేదినీపతిచేత మృతిఁబొంది మీఁద
నొనరంగ విష్ణుసాయుజ్యంబునొందు, మని పల్కఁ గన్నుల నలుక గెంపెసఁగ
నాయెడ వెసఁ జంద్రహాసంబు పెఱికి, వ్రేయఁ దలంచె నావిధ మాతఁ డెఱిఁగి
యిదె చనుచున్నాఁడ నే నంచు నచటు, గదలి మనోవేగగతి లావు మెఱసి
చని చూతపున్నాగచంపకక్రముక, పనసచందనజంబు పాటలీవకుళ
కదలికాఖర్జూరకర్పూరతరులు, మొదలుగాఁ గల భూజముల సొంపు మిగిలి
బహుశిష్యగణవేదపఠనంబు చెలఁగ, మహనీయమణిదీపమాలిక ల్వెలుఁగ
భాసురమంజరీఫలహోమధూమ, ధూసరీకృతలతాదులఁ జెన్ను మిగిలి
కలకంఠశుకనీలకంఠశారికల, కలహంసకలరవకలకలం బెసఁగ

హుతదానమంత్రస్వరోదీర్ణమైన, కృతకాశ్రమము ద్రోణగిరిసమీపమున
నిర్మించి మునివోలె నియతితోఁ గపట, నిర్మలాకృతిఁ దాల్చి నేత్రముల్ మూసి
సన్నపుటెలుఁగున జపమాలపూస, లెన్నుట మంత్రమై యెదిరికిఁ దోఁప
నావనంబున నుండ నాకాశవీథిఁ, బోవుచో మారుతపుత్త్రుఁ డీక్షించి
యిది యొక్క మునివనం బింత యొప్పగునె, యిది నాఁడు లే దిప్పు డెందు వచ్చితినొ
యెక్కడి దుగ్ధాబ్ధి యెక్కడి మేరు, వెక్కడి మునివనం బిది త్రోవ దప్పెఁ
దెరువిమ్మునీంద్రుచేఁ దెలియంగ నడిగి, యరిగెదఁ గాకంచు నవని కేతెంచి
వనపక్వఫలములు వాంఛఁ బుట్టించి, మునిశాపభయమున ముట్టనోడుచును
మునిఁ జేరఁ జనుదెంచి మ్రొక్కి కేల్మోగిచి, మునినాథ దుగ్ధసముద్రంబుకడకు
మనుజేశకులశిఖామణియైనరాము, జననాథుపనుపునఁ జనుచున్న వాఁడ
హనుమంతుఁ డనువాఁడ నధికమౌ తృష్ణ, జనియించె నిచ్చోట జలములు గలవె
చెప్పవే యనవుడుఁ జిఱునవ్వు నవ్వి, డప్పివో మాకమండలుపుతోయములు
ద్రావు మీఫలములు దనియంగ నములు, నీవింక రాతిరి నిద్రింపు మిచట
నగచరోత్తమ యతీతానాగతంబు, లగుమేర లెఱుఁగుదు నంతరంగమున
రాము వంచించి యారాముని దేవి, భూమిజఁ జెఱగొనిపోయె రావణుఁడు
అవనీశుఁడును వాలి నవలీలఁ జంపి, లవణాంబునిధిఁ గట్టి లంకపై విడిసి
యనిలోనఁ గుంభకర్ణాదిరాక్షసులఁ, దునుమాడి యింద్రజిత్తును ద్రుంచివైచెఁ
బుత్రశోకంబునఁ బుట్టినయలుక, రాత్రించరేంద్రుండు రణభూమిలోన
మయునిచేఁ బడసిన మహనీయశక్తి, రయమునఁ గొని సుమిత్రాపుత్త్రు వైచెఁ
బడిన యాసౌమిత్రిప్రాణము ల్వడయ, వడి నౌషధములకు వచ్చితి వీవు
వినుము నీ విప్పుడు వేయోజనంబు, లనిలనందన వచ్చి తనిలవేగమున
నన్ను నధర్మాత్ములకుఁ గానరాదు, నిన్ను నుత్తమునిఁగా నిశ్చయించితిని
జగదేకహితముగాఁ జనియించెఁ గాన, జగదీశుపని మాకు సమకూర్పవలయు
దివ్యౌషధంబులు దెపింపనట్టి, దివ్యమంత్రము లుపదేశింతు నీకుఁ
గంజాప్తునుదయంబు గని శక్తిమిగుల, సంజీవసముఖ్యసకలౌషధములు
గలవు మావనమునఁ గసుఁగొని యందు, వలసినయవి గొంచు వడి లంకకరుగు
కనురెప్ప వెట్టెడుకంటె వేగమునఁ, జనియెదు నామంత్రసామర్థ్యమునను
అనవుడుఁ గపటసంయమిఁ జూచి పవనతనయుండు పల్కె నోతాపసాధీశ
అక్కడ లక్ష్మణుం డబ్బంగి నుండ, నిక్కడ నుచితమే యిటు నాకు నిలువ
ఫలములు నా కేల పటపంచుకొర్కి, ఫలముగా సౌమిత్రిఁ బడయక మున్న
నిద్రవోవుట నాకు నీతియె దీర్ఘనిద్రనైకొని రామనృపుతమ్ముఁ డుండ
జలము లల్పంబులు చాలవు లేదె, నలినాకరంబైన నదియైన ననుఁడు
ఉన్నది చేరువ నొకదివ్యసరసి, కన్నులు మూసి యాకమలాకరమున
నమృతోపమానంబు లగునిర్మలోదకములు ద్రావిన దివ్యకాయుండ వౌదు
దృగ్గోచరములగు దివ్యౌషధములు, దిగ్గనఁ జనుదెంచుఁ దెరువు సూపుటకుఁ

గపటసంయమిశిష్యగణము నంపుటయుఁ, గపివీరుఁ డేతెంచి కనియె నక్కొలను
మాకందమందారమాధవీవకుళ, శాకోటకుటజకచందనసాల
నీపార్జునాశోకనింబకదంబ, తాపింఛతరులసత్తటములదాని
కమనీయకోమలకమలకల్హార, విమలకైరవముల విలసిల్లువాసి
లలితకల్లోలడోలాకేలిఁ దేలు, కలనాదకలహంసగతు లొప్పుదానిఁ
బటుహంసవేషచుంబకపికక్రౌంచ, పటలకారండవప్రతతులదాని
వెనుకొని తముఁ బిల్చి విరహులమీఁదఁ, బనిచిన గెల్చి నిర్భరవృత్తి గొన్న
విపులాభిమానార్థవితతు లీకున్నఁ, గుపితుఁడై రతిరాజు కొట్టులఁబెట్టె
ననఁ బక్షబంధంబులై వాఁడి మిగుల, మొనసినకైరవముకుళాగ్రశిఖల
మూఁగి చలింపని మొకరితుమ్మెదల, బాగొప్ప నొప్పుల బలసినదాని
మఱికొన్నియెడలను మకరందములకుఁ, దెఱపి చూపక తమ్ముఁ ద్రిప్పుచు నున్న
కమలగేహాంతరకములకుఁ బ్రీతి, సమరీతి మంగళాచారగీతములు
నలిఁబాడుగాయకనాయకు లనఁగ, మెలపున నందంద మృదురీతిమ్రోయు
మధుపానరసమత్తమధుకరతతుల, బధిరాబ్జపుటసమీపము లొప్పుదానిఁ
గామునుగ్రాత్ముచేఁ గ్రమ్మఱఁ బడయఁ, గామించి నీరమాకందబృందంబు
లలరునగ్నులలోన నాజ్యహోమములు, చెలువొంద నందంద చేయుచందమునఁ
జిలుకలు చంచులఁ జించినఁ దొరుఁగు, ఫలరసధారలు పర్ణాగ్రవీథి
దొలఁగక యురిలి చెందొవలలోఁ దొరుఁగు, పాలు వెంతయును జూడఁబొసఁగెడుదాని
ఫలరసంబులు వచ్చి పైఁబయిఁ దొరుఁగ, నొలసి చెందొవలలో నుండరాకున్నఁ
దొలఁగు నుజ్జ్వలహోమధూమంబు లనఁగ, నలులాకసంబున నమరెడు దాని
నాకంజపత్రంబు లనుపల్లెరముల, శ్రీకరాక్షతములు చెలువొప్ప నునిచి
కొలనప్పుడును ద్రుళ్ళఁ గువలయవలయ, దళవిలోచనములఁ దనరాక కెదురు
చూచు తెఱంగున శోభిల్లుదానిఁ, జూచి డగ్గఱవచ్చి సుఖకేలిఁ దేలి
యదరు సమ్మదమున నానందమంది, కడు విస్మయంబంది కన్నులు మూసి
యక్కొలనికి డిగ్గి హనుమంతుఁ డంత, నెక్కొన్నతృష్ణతో నీళ్లు ద్రావఁగను
బొలుపార సంసారభూరివారాశి, మలఁగుచు వర్తించు మాయావధూటి
విషయరసంబులు వేడ్కతోఁ గ్రోలు, తృషితునిఁ గబళించుతెఱఁగు దీపింప
నురవడి నందుండి యొకమహామకరి, హరినాథుపాదంబు లలమి పట్టుటయుఁ
దగిలినయంఘ్రి యుద్ధతశక్తిఁ దిగిచి, తిగువఁజాలక చాల ధీరుఁడై నిలిచి
యిది యేటిదో యని యేర్పడఁ జూచి, మది వాయుసూనుండు మకరిగా నెఱఁగి
యంతకంతకు మది నలుక రెట్టింప, నంతలో నతినిష్ఠురాకారుఁ డగుచు
వేవేగ రఘురాము విజయవల్లభుల, కావాలమై వ్రాలు నావాల మెత్తి
రాగరసోద్రేకరావణాయోగ, భోగసంచితపాపములు డుల్చుపగిది
వాల మంకించి దుర్వారుఁడై విజయ, లోలుఁడై మకరిపండులు డుల్లవ్రేసె

### హనుమంతుని మకరి మ్రింగుట

సంతతమునికృతశాపరోగమున, కంత మాయౌషధమని మ్రింగుకరణి
నజేముఁజే మకరి మహారోష మెత్తి, మెఱసి యాహనుమంతు మ్రింగఁజొచ్చుటయు
నక్కటా రాముకార్యము నిల్వఁబడియె, నిక్కడ దీనిచే నిట్టిచందమునఁ
దెగిపోదునో యింకఁ దెఱఁగేది యనుచుఁ, దగ విచారించి యుద్ధతి వాయుసుతుఁడు
కడుపులోపలఁ జొచ్చి కడ తేర్తు ననుచు, నొడిసి మ్రింగుచునున్న నూరకయుండి
పదిలుఁడై యంధకూపముఁబోని మకరి,యుదరంబుఁ జొచ్చె నాయురుబాహుబలుఁడు
అంత నామకరియు నాహారబుద్ధి, సంతోషమునఁబోయె జలమధ్యమునకు
ఆవీరవరుఁ డంత నలుకతో దాని, ప్రేవులు నరములు పెనచి త్రెంచుచును
నడరినకడఁకతో నమ్మహామకరి, కడుపులోపల విషకబళంబపోలె
నరుగక తిరుగుచు ననలంబుభంగి, జొరవుచ్చఁ దొడఁగిన స్రుక్కి యమ్మకరి
దేహంబులోపలి ధృతిదీఱ డించి, దాహంబు పెంపున ధరియింపరాక
వఱువట్లు వెట్టెడు వదనగహ్వరము, తెఱచి నిల్చుటయు న త్తెరువున వచ్చి
క్రూరనక్రగ్రాహఘోరప్రవాహ, వారిపైఁ బడుటయు వాయునందనుఁడు
పెనచి త్రెంచిన దానిప్రేవులు ముద్ద, గొనివచ్చి చెచ్చెఱఁ గుత్తుకఁ దురిమె
ఆలోన మకరియు నాహార మరుగఁ, బోలదు పొమ్మని బుద్ధిఁ జింతించి
పరవశ యగుటయుఁ బవననందనుఁడు, దరిఁజేర్చి మకరి నుద్ధతి వ్రచ్చి వెడలి
కోరి చూడఁగ నొప్పె ఘోరాంధకార,దారుణనిర్ముక్త తరుణార్కుపగిదిఁ
బ్రళయారుణోదగ్రబడబాగ్నిశిఖలు, కలయఁ బర్విననాఁటి ఘనపయోరాశి
కరణి నమ్మకరిరక్తములతోఁ బెరసి, యరుణమై కడునొప్పె నప్పు డాసరసి
యంత నామకరియు నమరియై యమరి, యంతరిక్షమున నుద్యద్విమానమున
జలదంబులోపలఁ జపలతమాని, మెలఁచు తిరమ్మైన మెఱుపుచందమున

### ధాన్యమాలి తనశాపప్రకారము హనుమంతునితోఁ దెల్పుట

నిలిచి మారుతిచేత నిజశాపముక్తి, గలిగిన నలరి యక్కపిముఖ్యుఁ జూచి
యోకపికుంజర యోవానరేంద్ర, నీకతంబున శాపనిర్ముక్తి గంటి
నేనింకఁ బోయెద నింద్రలోకమున, కేను నీ కొకవార్త యెఱిఁగింపవలయు
నని మున్ను హనుమంతు నక్కాలనికనిఁ, బనిచిన కపటదాపసిఁ జూపి పలికె
వానరోత్తమ మునివరుఁడు గాఁ డరయ, వీని నమ్మకుమయ్య వీఁడు రాక్షసుఁడు
చలమున దానవేశ్వరునియోగమున, బలియుఁడై నినుఁ జంపఁ బనిపూనివచ్చి
యేనిందులో నున్కి యెఱిఁగి నాచేతఁ, బూని నిన్ జంపింపఁ బుత్తెంచినాఁడు
వీఁడు వధ్యుఁడు నీకు వీని నమ్మకుము, వీఁడొప్పఁ డిటమీఁద వేవేగ చంపి
పొమ్ము నీవౌషధంబులకు ద్రోణాద్రి, కిమ్ముల నటఁబోవ నిదె నీకుఁ ద్రోవ
అన విని హనుమంతుఁ డాశ్చర్యమంది, వనితఁ గనుంగొని వలనొప్పఁ బలికె
మదిరాక్షి మును నీవె మకరవై యుండి, త్రిదశభామిని వైనతెఱఁగేమి యనిన
వినవయ్య పావని వీరాగ్రగణ్య, కనకాద్రిసమధైర్య గాంభీర్యధుర్య

ధాన్యమాలిని యనఁ దనరు గంధర్వ,కన్యక నాజన్మకథ యేర్పరింతు
నఖిలలోకారాధ్యుఁ డగుసదాశివుఁడు, సుఖగోష్ఠి రజతాద్రి శోభిల్లుచుండ
నరుదార నే పాడి యాడి మెప్పించి, హరుచేత నసమాన మగువిమానంబు
వడసి యిక్కొలనిలోపల జలక్రీడ, లెడపక కావింప నేఁగుదెంచుటయు
శాండిల్యుఁ డనుముని చనుదెంచి నన్ను, నిండినప్రేమంబు నెలకొనఁ జూచి
యాలోనఁ దనలోన నానందకేలి, నాలోకనాలోలుఁ డయి తేలి తేలి
కొనకొని తూకొన్న కోర్కుల ప్రాలి, మనసిజజ్వరమున మానంబు దూలి
యేను బుట్టాత్తుండ నేతపోధనుఁడ, నే నేడ యెలనాఁగ యేడ పొమ్మనక
యూని నన్గామించుచున్న కన్నెఱేఁగి, యే నేడ యీ వేడ యీదృష్టి యేల
నీవు తపస్వివి నీవు పుణ్యుఁడవు, భావింప నిది తపఃఫలవిఘ్న కారి
యన విని మునినాథుఁ డతికాముఁ డగుచు, ననుఁ జూచి మదిలోనియాస వోవిడిచి
యిది తపఃఫలసార మెలనాఁగ నాకు, నిది పుణ్యఫలసార మెలనాఁగ నాకు
నిది మోక్షసాధన మెలనాఁగ నాకు, నిది స్వర్గసోపాన మెలనాఁగ నాకు
ననిన రజస్వల యటుఁగాన నేఁడు, మునినాథ నను మీరు ముట్టఁగారాదు
ఇమ్మూఁడుదివసంబు లేను మీయింట, నెమ్మితో వసియించి నిజశుద్ధిఁ బొంద
మఱి పొందు మని గంధమాదనంబునకు, నెఱి నేఁగి మునియింట నిష్ఠతో నుండ
దిక్కులు సాధించి తిరిరి రావణుఁడు, నక్కొండ సబలుఁడై యారాత్రి విడిసి
యాపర్వతాగ్రంబునం దేనుబాడ, నాపాట విని దశాననుఁ డేఁగుదెంచి
తనసొంపు దనపెంపు దనప్రతాపంబు, తనపేరు నెఱిఁగించి తగ బుజ్జగించి
వనిత నీరూపయౌవనవిలాసములు, మునుమిడిఁ దుదముట్ట ముట్టవే నన్ను
ననినఁ బరాధీన నంటఁగారాదు, ననుముట్టఁ దగదన్న నరభోజనుండు
అరయ రజస్వల లయినకామినులు, పరభామినులు సువ్వె భామ నామెచ్చు
వనిత నన్ గాఱింపవలదు రమ్మనుచు, ననుఁ బ్రియోక్తులఁ దేల్చి నాతో రమింప
నతికాయుఁ డుదయించె నంత నాపుత్త్రు, నతివేగమున దానవాగ్రణి కిచ్చి
దివసత్రయంబును దీఱినపిదప, ప్రవిమలతను శుద్ధిఁ బాటించి యేను
మునిగణాధీశ్వరు ముందఱ నిలువఁ, గనుఁగొని నాయున్నగతి వివేకించి
నాయింటిలోనుండి ననుఁ డాఁగురించి, పోయి నీవెవ్వరిఁ బొందితి ప్రీతి
నింతి నీయౌవన మెవ్వండు గొనియె, చింతింప కిట్లేల చేసితి వీవు
పరమపరిజ్ఞానభావమార్గమున, నరసి చూచిన నది యట్టిద కాదె
పరహిత మేయూరు పడఁతు లేయూరు, గురుశీల మేయూరు గొంతు లేయూరు
జలజాక్షు లేయూరు సత్య మేయూరు, కలకంఠు లేయూరు కరుణ లేయూరు
వనజాక్షు లేయూరు వరుస లేయూరు, ననఁబోఁడు లేయూరు నచ్చి కేయూరు
తరలాక్షు లేయూరు తగవు లేయూరు, పరికింప సతులకు బాస లేయూరు
అని తీరఁ గోపించి యమ్మునీశ్వరుఁడు, ఘనశాప మిచ్చె సత్కరుణఁ బో విడిచి
యాసరోవరమున నీవిలాసంబు, గాసిగాఁబడ నీవు గ్రాహివై యుండు

మెందేని బహుపుణ్యహీనుఁడై నిన్నుఁ, బొందినవాఁడును బుత్రమిత్రాది
బలములతోఁ గూడ భస్మమై పోవఁ, గలఁ డింక నీపాతకంబున ననుచు
శాప మిచ్చుటయును జలనంబు నొంది, యాపుణ్యనిధిమ్రోల హస్తము ల్మోగిచి
యోముని వల్లభ యోమునిచంద్ర, యోమునిసింహాకు యోమునిశ్రేష్ఠ
యీశాపజలరాశి యే తెప్పఁ గడతు, నీశాపదావాగ్ని యేనీటనార్తుఁ
గరుణింపవే దయాకర నన్ను ననుచు, నురుభీతి నొందుచు నున్న వీక్షించి
తిరమైనసుజ్ఞానదృష్టి నూహించి, పరమకృపామూర్తిపరుఁ డిట్టు పలికెఁ
గామిని యొకకొంతకాలంబు చనఁగ, రాముకార్యార్థమై రానున్న వాఁడు
హనుమంతుఁ డిచటికి నతనిచే నీకు, ఘనశాపనిర్ముక్తి గలుగుఁ బొమ్మనుచుఁ

మునివేషధారి యగు కాలనేమిని హనుమంతుఁడు చంపుట

బోయె గంగాతీరమునకు నమ్మౌని, పోయె శాపం బేను బోయెద నింక
నని చెప్పి దీవించి యాసరోజాక్షి, యనిలజు వీడ్కొని యరిగె నద్దివికిఁ
ఎడపనికడఁకతో నిటఁ గాలనేమి, కడ వచ్చి నిలిచె నాకపికులోత్తముఁడు
అప్పు డప్పాపాత్ముఁ డచలసమాధిఁ, దప్పక యున్న చందమునఁ గూర్చుండి
యొడలిపూరంబుతో నురమెల్ల విచ్చి, నడుము నిక్కించి మానవ మొప్ప వంచి
కపటచింతావృత్తిఁ గన్నులు మూసి, జపమాలపరుసఁ బూసలు త్రోసి త్రోసి
నిక్కంపుజపముగా నెఱి నోరు గదల, నక్కలిఁ గనువిచ్చి హనుమంతుఁ జూచి
యీయున్న మడువేల యీతడవేల, పోయినపని యెంత ప్రొద్దెంతపోయె
నొలసి నీమదిలోన నుపదేశవాంఛ, గలదేని గురుపూజ గలదె యేమైన
మాకిప్పు డనవుడు మారుతాత్మజుఁడు, నీకిదె గురుపూజ నెమ్మిఁ గొమ్మనుచుఁ
బ్రథననిష్ఠురుఁడు నిర్భరవృత్తి వాని, బృథుబాహుమధ్యంబుఁ బిడికిటఁ బొడిచె
నాక్షణంబున దైత్యుఁ డారూప ముడిగి, పక్షియై రణవీథిఁ బావనిఁ గదిసెఁ
గదియుటయును బట్టి కడిమి దీపింపఁ, జదిపి రెక్కలు రెండు సరి ద్రుంచివైచె
నారూప ముడిగి మాయాశక్తి మెఱసి, ధీరసింహాకృతిఁ దివిరి లంఘించి
గర్జించి దంష్ట్రల గడుసుగ్రుఁ డగుచు, తర్జించె రణవీథి దర్పించె నసుర
అలయక హనుమంతుఁ డక్కాలనేమి, తలబిట్టువగుల నుద్ధతశక్తిఁ బొడిచెఁ
బొడిచిన నారూపు పోనిచ్చి యసుర, కడఁగి సుగ్రీవుఁడై కదియ నేతెంచి
యిదియేమి మారుతి యిచట నేమిటికి, పదపద లక్ష్మణుప్రాణము ల్వచ్చెఁ
దొలఁగక నీవింక ద్రోణాద్రి కరుగ, వల దౌషధంబులు వల దింక మనకు
ననవుఁడు హనుమంతుఁ డతని సుగ్రీవుఁ, డని చూచి తెలిసి కాఁడని నిశ్చయించి
యలిగి రాక్షసుసుర మదరంట వ్రేయ, నిలఁ గూలి మూర్ఛిల్లి యింతలోఁ దెలిసి
యతఁడును శతశృంగుఁడై హనుమంతు, నతిశాతనఖముల నడరి నొప్పింప
ముష్టిఘట్టనముల మొగిఁ బాదహతుల, నష్టసత్త్వునిఁ జేసి నలిఁ జిక్కువఱిచి
యమితసత్త్వ క్రీడ నవలీలఁ దిగిచి, కమలనాళము ద్రెంచు గంధసింధురము
పరుసున రాక్షసప్రవరమస్తకము, తెరలిచి వెస నుల్చి త్రెంచిపో వయిచి

నలి నేచి వెస సింహనాదంబు చేసి, తొలఁగక మారుతి ద్రోణాద్రి కరిగె
నరిగి యాగిరిమీఁద నౌషధలతలు, పరికించి పరికించి పవననందనుఁడు
బహుదివ్యలతికావిభాభాసమాన, మహిమయు నిర్మలమణిగణప్రభల
దీపవృక్షంబుల దీప్తులు పర్వి, దీపించు నక్కొండఁ ద్రిమ్మరి చూచి
హితపుష్పగంధంబు లివె లత లనుచు, నతఁడు దగ్గరఁ బోవ నవి డాఁగిపోయె
నంత నాహనుమంతుఁ డంతరంగమునఁ, జింతించి సంతాపచిత్తుఁడై పలికె
నోపర్వతాధీశ యోయద్రిరాజ, యోపుణ్యసత్ఫల యోగిరిచంద్ర
యనఘుఁ డారఘురాముఁ డౌషధంబునకుఁ, బనిచిన వచ్చితిఁ బనివూని యేను
నిన్నిలోకములకు హితవైనపనికి, నన్నేల వంచింప నగరాజ నీకు
నడరి నీయందున్న యౌషధలతలు, పొడసూపు వేవేగ పోఁ బని గలదు
ఇమ్ముల నిది లోకహితకార్య మగుట, మిమ్ము వేఁడెద మీరు మీప్రభావముల
దీపింపుఁడీ యోషధీలతలార, చూపుఁడీ నాకు మీసురుచిరాకృతుల
నని పల్క వంచన నపుడు తేజములు, పొనుపడఁ దనకవి పొడసూపకున్న
నగకులోత్తము నీకు నారాక చూచి, తగుఁ బ్రియం బొనరింపఁ దగదూరకుండ
నని తన్నుఁ బ్రార్థించి యడుగుచునున్న, తనకు నౌషధము లాధరణీధరంబు
చూపకుండుటయును జూచి యెంతేని, కోపించి వానరకులవజ్రపాణి
యేనెంత వేఁడిన నేల నీమనసు, నానదు నాయెడ నగకులాధముఁడ
తలకొని జాలకు దయగల్గునన్నఁ, గలుగునే గుణశూన్యకఠినమూర్తులకు
నని యుగ్రకోపాగ్ను లంగరోమములఁ, గనదగ్నికీలలై క్రమ్మఁ బైఁ గ్రమ్మి
రాముతో నెదిరిన రావణాచలము, నీమెయిం బెరుఁగుదు నిల నని మాడ్కి
దశయోజనముల విస్తారంబు పంచ, దశయోజనోన్నతత్వంబును గలుగు
నాభీలతరశైల మవలీలఁ బెఱికె, భూభాగముగల నభోభాగముద్రువ
నపు డాగిరి సురేంద్రు ననుమతిఁ గాచు, తపనతేజులు త్రయోదశకోటిసంఖ్య
గలచిత్రసేనాదిగంధర్వపతులు, బలశౌర్యములు మీఱఁ బావనిఁ జూచి
యిది దివ్యగణవాస మిది మేరుతుల్య, మిది జగజ్జీవనం బిది నీకు వలదు
నీ కిది దక్కదు నెఱి డించి పొమ్ము, పోకున్నఁ బ్రాణము ల్పోకుండ వనుఁడుఁ
గదనోగ్రసమవర్తి కపివీరుఁ డార్చి, వదలనికడిమిమై వారి నీక్షించి
బంధురంబగు వాలపాశంబుతోడ, బంధించి బంధించి బలువిడిఁ ద్రిప్పి
యలుకమైఁ గొందఱ నబ్ధిలో వైచె, నలుకమైఁ గొందఱ నడరి కారించె
నలుకమైఁ గొందఱ నదరంట వ్రేసె, నలుకమైఁ గొందఱ నవనిపైఁ గూల్చె
నామహావీరునుద్ధతిశక్తిఁ జూచి, సోమింపరాదని స్రుక్కి కేల్ మొగిచి
యోకపికుంజర యోవానరేంద్ర, యీకొండఁ గొనిఁ యేఁగు మెలమితో నీవు
అని వాయునందను నర్థి దీవించి, వినుతించి గంధర్వవీరులు దొలఁగ
నధికసత్వంబున ననిలనందనుఁడు, కుధరంబు బిట్టెత్తుకొని మింటి కెగసి
కడువేగమున భయంకరవృత్తి దోఁప, నడరి జితారాతియై సొంపుమిగిలి

భూచరఖేచరాద్భుతవేగుఁ డగుచు, నాచందమునఁ బోవ నామధ్యరాత్రి
భ్రామితమిత్రుఁడౌ భరతుస్వప్నమున, రామసౌమిత్రులు రణమధ్యమునను
దలమూనియలతోడ దనువులు డస్సి, బలహీనులై క్రుస్సి పంకమధ్యమునఁ
బడి పలవించుచు పలురోదనంబు, లుడుగక కావించుచున్న బిట్టులికి
భరతుండు మేల్కని పాపంపుఁగలకుఁ, బరితపించుచు వెలుపలికి నేతెంచి
కలలోన రామలక్ష్మణులున్న తెఱఁగు, తలపోసి తలపోసి తలఁకుచు నుండఁ
దొడఁగి దానికిఁదోడు దుర్నిమిత్తములు, కడఁగి పెక్కులు దోఁపఁగా భీతిఁబొంది
యిదియేమి పాపమో యిదియేమి తెఱఁగొ, యిది యింక నిటమీఁద నేమి గాఁగలదొ
రామసౌమిత్రు లరణ్యమధ్యమున, నేమైరొ జానకి యేమైనయదియొ
యొన్నంగఁ బదునాలుగేండ్లును నిండు,చున్నవి వినఁగరా దొకవార్తయైన
నాసత్యధనులకు నాయుదారులకు, నాసదాచారుల కాకృతార్థులకు
నేకీడుఁ గాకుండ నేను నాసుకృత, పాకమిచ్చితి నని భరతుండు పలికి
భావించి వేదతత్పరుల భూసురుల, వేవేగ రావించి వేదోక్తయుక్తి
సకలదానంబుల సకలధర్మముల, సకలహోమంబుల శాంతి చేయించె
నాలోన హనుమంతుఁ డాకాశవీథి, నాలోలబాలార్కుఁడై వచ్చి వచ్చి
బలిసిననిష్ఠతో భరతేశుఁడున్న, పొలుచు నంది గ్రామపురిఁ జేర వచ్చి
ఘనజటాభారవల్కలములతోడ, ఘనఘనశ్యాముఁడై కమలాప్తకులుఁడు
భరతుఁ డారఘురాముభంగిఁ దోఁచుటయుఁ, గరమద్భుతం బంది కపిముఖ్యుఁ డపుడు
సౌమిత్రి మృతుఁడైన జానకి డించి, రాముఁ డొక్కరుఁ డిటు రాఁబోలు ననుచు
నడుగుదునో యంచు నడుగఁబొమ్మనుచుఁ, గడఁకతోఁ దలపోసి కపికులోత్తముఁడు
శరణాగతత్రాణచరితార్థచరితుఁ, డరయంగ రఘురాముఁ డభిరామబలుఁడు
తనసూనృతము డించి తమ్ముని డించి, తనకులసతి డించి తనపేరు డించి
యంగదసుగ్రీవు లాదిగాఁ బ్లవగ,పుంగవకోటులఁ బోరిలో డించి
మొనసి రావణుఁ బ్రాణములతోడ డించి, తన మేనుఁ దెచ్చునే దశరథాత్మజుఁడు
మానవసామాన్యమతిఁజేసి రాము, నే నేల చూచితి నీపిన్నచూపు
ఒలసి రామునిఁబోలు నొకతపోధనుఁడు, కలిగినాఁ డింతియ కాఁబోలు ననుచు
నతివేగమున లంక కరిగెదుత్రోవ, నతులబలోదాత్తుఁడై పోవఁబోవ
కలగన్నభరతుఁ డాకాశంబుఁ జూచి, యలఘుఁడై చనుచున్న హనుమంతుఁ గాంచి
యిటఁ దోఁప నేలొకో యీదుర్గ్రహంబు, నటు బాణముల దీనిఁ బడనేయవలయు
నని శరచాపంబు లాటోప మొప్ప, ఘనసత్త్వుఁ డప్పుడు కైకొన్నఁ జూచి
కాకుత్స్థతిలకుఁ డాకర్ణించుకొలఁది, నాకాశముననుండి యశరీరి పలికె
నీతనిదిక్కున హితబుద్ధి సేయు, మీతఁడు మీబంధుఁ డీవల్లవలదు
అని యొప్పఁబలికిన యశరీరిపల్కు, విని శరచాపము ల్విడిచె నవ్విభుఁడు
అంత నాహనుమంతుఁ డంభోధిఁ గదియ, నంతలో రాక్షసు లక్షీణబలులు

## హనుమంతునితో మాల్యవంతుఁడు పోరుట

దితబలోదగ్రు లుగ్రవిక్రములు, పదివేలు కోటులు బలిసి తన్గొలువ
రావణుపనుపున రణజయస్ఫురణ వావిరి నమ్మాల్యవంతుఁడు వచ్చి
వదల నెదుర్చడి జలధిమధ్యమునఁ, బొదివి యాహనుమంతుఁ బోనీక కదిసె
దిసిన నక్కొండ ఘనబాహుశక్తిఁ, బదిలంబుగాఁబట్టి పవననందనుఁడు
ాఁకిన భుజబలదర్పము మెఱయ, వీఁకతో రాక్షసవీరులు గదిసి
రశుతోమరచక్రపట్టసప్రాస, కరవాలశూలముద్గరభిండివాల
తుల నొప్పింప నుద్ధతిఁ బెచ్చుపెరిఁగి, యతులవిక్రమదక్షుఁ డవి లెక్కగొనక
మమరు లచ్చెరువంద ననిలనందనుఁడు, సమరలీలాభీలఘటులవాలమునఁ
డఁకతో నొడిసి రాక్షసవీరవరుల, వడిఁ జుట్టి పట్టి యవ్వననిధిలో వైచె
ంజించెఁ గొందఱఁ బదతాడనముల, భంజించెఁ గొందఱ భయదనాదముల
ంజించెఁ గొందఱఁ బటువాలహతుల, భంజించెఁ గొందఱఁ బరుషోగ్రదృష్టిఁ
ొందఱఁ బడఁద్రోసెఁ గొందఱ వ్రేసెఁ, గొందఱఁ గారించెఁ గొందఱ నొంచె
ంతరోషాయత్తుఁడై మాల్యవంతుఁ, డంతకాకారుఁడై హనుమంతుమీఁద
నయ బాణములు నూతేసె నేయుటయు, ఘనవాలమున వాని ఖండించివైచి
లుక విల్లొడిసి యల్లటుఁ బాఱవైచి, బలుతోఁకచేఁ గాళ్లు బంధించి రొత్తి
డి వైచుటయు మాల్యవంతుఁడు మగిడి, పొడిచె నమ్మారుతపుత్త్రుశూలమున
వి లెక్కసేయక యతఁ డున్నఁ జూచి, యదరులు చెదరంగ నత్యుగ్రశక్తి
రము నొప్పించిన నురుశోణితంబు, లురువడిఁ దొరుఁగంగ నొక్కింత నిలిచి
లుకతోఁ గపివీరు డసమున వాని, తలఁదాఁచి చని వియత్తలమున నిలిచెఁ
లకొని దివిజులు తలలూఁచి పొగడఁ, దలఁ దన్నుటయు వానితల బిట్టుపగిలి
ోలిఁ గీలాలంబు లొలుకులో దారి, యాలోన మూర్ఛిల్లి యంతలోఁ దెలిసి
దనరంగమున నిగ్గదగదా నీకుఁ, దుదిముంచు గదయల్కతో బిట్టువైచి
డయక యది తాఁకుతఱి మంట లెగయ, వడి జూచి యమ్మాల్యవంతుఁ డిట్లనియె
ోరి వానరుఁడ యీయుదధిలో నద్రి, బోరనఁ బడవైచి పో నిన్నుఁ జంప
మొనసేసి తొల్లి సముద్రమధ్యమున, వినతాత్మజుని నెక్కి విష్ణుండు వచ్చి
ాతోడ యుద్ధంబు నలిఁజేసి చేసి, భీతుఁడై చాలక వెనువేదిపోఁడె
ోకంబు లెఱుఁగ ముల్లోక మీఁకడిమి, నీకోర్వరాదురా నెరి నాదుకిన్క
నవుడు హనుమంతుఁ డమ్మాల్యవంతుఁ, గనుఁగొని పలికె నుత్కటకోపుఁ డగుచు
యుద్ధమధ్యమున మహోద్ధతి మెఱసి, వృద్ధరాక్షస నీవు వెఱవక నన్నుఁ
దియ నెవ్వఁడ వని కదియు నవ్వీరు, మదభాషలకు నల్గి మాల్యవంతుండు
నచంద్రహాసోగ్రఖడ్గ మంకించి హనుమంతువక్షు ముద్ధతశక్తి వైవ
ది వజ్రనిభకాయుఁ డగునాంజనేయు, విదితంబుగాఁ దాఁకి వెసఁ బెల్లు విఱిగె
నిలజుఁ డాఖడ్గహతి కింత నొచ్చి, కినిసి నిశాచరుఁ గిట్టి బిట్టలిగి
హూతభయంకరాద్భుతవాలమెత్తి, యాతనిమెడఁ జుట్టి యలుకతోఁ బట్టి

చెలఁగి యాకసమునఁ జిరజిరఁ ద్రిప్పి, యలఘువిక్రమశీలుఁ డబ్ధిలో వైచె
వైచినఁ బడి మాల్యవంతుఁ డాత్రోవ, వేచని పాతాళవివరంబుఁ జొచ్చె
హతశేషరాక్షసు లన్నిదిక్కులకు, ధృతి దూలి పఱచిరి దివిజు లుప్పొంగ
గొండంత గెలుపుతోఁ గొండతో సమర, మండలి వొగడ ధీమండనుం డరిగె
బర్వతదీప్తిఁ బ్రభాతవిభ్రాంతి, పర్విన భీతిమై భానువంశజుఁడు

## శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి పరితపించుట

సమరలక్ష్మీరతిశ్రమ నిద్రనొందు, క్రమమునఁ జెలువుఁడై రణశయ్య నున్న
తమ్మునిఁ గనుఁగొని తమ్ముఁడా నీవు, తమ్ముఁడవై యుండు టది నోచనైతి (?)
నిలజీవులకునెల్ల నిదె వేగెఁ బ్రొద్దు, పొలుపేది నాపాలిప్రొద్దస్తమించె
నఱిముఱి నడవిలో నాలిఁ గోల్పడితి, నెఱయ నేఁ డాజిలో నిన్నుఁ గోల్పడితి
నెడ నాకు నైన దుష్కీర్తిపంకంబు, గడప దిక్కెవ్వరు గలరు సౌమిత్రి
మానపయోనిధి మహనీయశీలు, నానోచికన్న యున్నతపుణ్యశీలు
నేను నీచే నమ్మి యిచ్చిన నకట, కానలోఁ గొనిపోయి కడ తేర్చితన్న
యేనేమిసేయుదు నిటమీఁద నన్న, నేను సుమిత్రతో నే మననేర్తుఁ
దుదిఁబోయి భరతశత్రుఘ్నులు నన్ను, గదియ నేతెంచి లక్ష్మణుఁ డేడి యనిన
నే మని చెప్పుదు నే మని పోదు, నాముఖంబునను దైన్యము దోఁప నింకఁ
దేనికిఁ జింతింప దేనికి వగవ, నేను జింతించెద నిను దీర్ఘచింత
బలుఁడై నరావణు గతులకుఁ జేసి, తలపోసి మదిరోసి తమయన్నఁ బాసి
హితభృత్యవృత్తిమై నీవిభీషణుఁడు, చతురుఁడై నను వచ్చి శరణంబుఁ జొచ్చె
జొచ్చినఁ బ్రీతి రక్షోరాజ్యమెల్ల, నిచ్చితి నీ కని యే నూఱడించి
పట్టంబు గట్టితిఁ బ్రతినతోఁ బలికి, నెట్టన నిండింప నేర్పు లేదయ్యె
నిది వేగుచును వచ్చె నింక లక్ష్మణుఁడు, బ్రదుకఁడు నాకింకఁ బ్రాణముల్వలదు
దురితదూరుని వీనితోడిదె లోక, మరసిచూచిన నింక నడలోర్వరాదు
శరణన్నవారి నెచ్చట వీడరాదు, ధరణిపై క్షత్రియధర్మ మూహింపఁ
దారు లోనైనను దమ్మాశ్రయించు, వారల రక్షింపవలయు రాజులకు
నీవిభీషణుఁ గొంచు నీవేఁగి పుణ్య,భావుఁడై నట్టి మాభరతుతోడుతను
సరయ నిక్కడికార్య మంతయుఁ జెప్పి, పరఁగంగ లంకకుఁ బ్రతిగాఁగ నతని
వెలయు నయోధ్యకు విజయలగ్నమున, ఫలసిద్ధి సొంపారఁ బట్టంబు గట్టు
మని యేను జెప్పితి నని యొప్పఁ జెప్పి, యొనరంగ నందుండి యుచితంబుతోడ
వానరేశ్వర నీవు వాలినందనుఁడు, సేనలఁ గొంచుఁ గిష్కింధకు నరుగు
మన దైన్యపాటుతో నాడ భీతిల్లి, వనచరాధీశుండు వలనొప్పఁ గదిసి
పరికించిచూడఁ బ్రభాతంబు గాదు, నరనాథ యిప్పుడు నాలవజాము
సొచ్చె నింతియ వాయుసూనుండు నిపుడ, వచ్చు సంతాపింప వలదంచుఁ దేర్చెఁ
దేర్చిన నెంతయుఁ దేలక మఱియుఁ, జేర్చినశోకాగ్ని పెల్లున మిగులఁ
బొరిఁబొరి భూమిపైఁ బొరలుచు వగలఁ, బురపురఁ బొక్కుచు భూవరతనయుఁ

డన్న నేజనకాజ్ఞ నడవి కేతేర, నిన్నుఁ బొమ్మనకున్న నీవు నావెనుకఁ
జనుదెంచి యిడుమలఁ జాలంగఁబడగఁ, గనుఁగొని మనమునఁ గరము శోకింతు
నేఁడు నీవొరుచేత నీలావు దూలి, పోఁడిమిచెడి యిట్లు భూమిపై నుండ
నే నెట్లు బ్రదుకుదు నే మని వగతు, నే నిను డించి యెట్లేఁగుదుఁ బురికి
సీత నా కేటికి జీవ మేమిటికి, సీతరుచరసేన లేటికి నాకు
నోతండ్రి నాకింక నుర్వి యేమిటికి, నాతండ్రి క్రియ నన్ను నరయుచుండుదువు
నావిధి నిను నేఁడు నాకారిచేత, నీవిధి నిటు సేసె నీరసంబెత్తి
దేశదేశముల సతీజనంబులను, దేశదేశములందుఁ దివిరి బాంధవుల
నరసి కానఁగవచ్చు నట్టిదేశములఁ, బరఁగు తమ్ముని నెందుఁ బడయంగవచ్చు
నని యచేతనుఁ డగు ననుజుపై వ్రాలి, కనుఁగొని దిక్కులు కడుధైర్య మెడలి
యన్నరో నీవు నన్నన్నని పిలువ, నెన్నఁడు వినఁగల్లు నింక వీనులకు
సీత సుమిత్రగాఁ జిత్తానఁ జూతు, చూతు నన్దశరథక్షోణీశుఁ గాఁగ
నెప్పుడు నాతోడ నెడఁబాయకుండు, దిప్పుడు పాడియే యెడఁబాయ నన్ను
నాతతవిషమఘోరారణ్యభూమిఁ, బ్రీతి నయోధ్యగాఁ బెంపునఁ జూతు
పూవుపాన్పున నిద్రఁబొందించుమేను, నీవెట్లు నేర్చితి నేఁడు ఱానేలఁ
బడియు నిద్రించెదు పరిణామమొందు, పుడమిపై నందన పొలుపొంద నీవు
పదునాలుగేండ్లును బాయక నిద్ర, పదిలంబుగా డించి పన్నుగా నడవి
నరసి నన్రక్షించి యాజిమధ్యమున, నరులఁ జంపకపోవ నగునయ్య నిద్ర
నిద్ర నీ విట్లున్న నిజమయ్యె దీర్ఘనిద్ర మాయన్నకు నృపనందనుండ
మాయన్న కెప్పుడు మిక్కిలి భక్తి, సేయుదు నేఁ డేల చింతింప వకట!
యున్నవంతయుఁ దూలి యుండెడుమాట, లిన్నియుఁ బొంపిరి నేల పల్కెదవు
రావణకోటుల రణములోఁ గూల్చి, భూవిభునందను భూసుతఁ గూర్తు
నని నాకు వీనుల కసలారఁ బలుక, కునికికిఁ గత మేమి యోపుణ్యమూర్తి
యిప్పుడు మేల్కొని యేల శ్రీరాము, తప్పఁబల్కఁగ నీకుఁ దగునయ్య యనుచు
నొప్పెడిమాటల నూఱడఁ జేర్చి, తప్పక కనువిచ్చి తనుఁ జూడు మనుచు
రాసుతు కెంగేలు రమణమైఁ దిగిచి, భాసురంబుగ గండపాలికఁ జేర్చి
ననుఁ దేర్పవే యని నరనాథుఁ డపుడు, మనమునఁ దెలియక మహిమీఁదఁ బడియెఁ
బడియున్న యారఘుపతి మూర్ఛదెలిపి, యడలు వారించి రాయగచరాధిపులు
అంత ప్రభామండలాభీలుఁ డగుచు, నంతలో హనుమంతుఁ డరుగుదెంచుటయుఁ
దేజంబు పెంపున దృష్టింపరాక, తేజోదివాకరదీప్తుఁడై యున్నఁ
గపులెల్లఁ గలఁగి యుత్కటభీతిఁ బొంది, విపులతరభ్రాంతి వివశులై తూల
నాలోనఁ గమలాప్తుఁ డని చూచి విభుఁడు, కాలకాలోదగ్రగతి నిండనుండఁ
గపికులాధీశులఁ గలయ నీక్షించి, కపులార సూర్యునిఁ గంటిరే మింటఁ
జేకొని బహుపుణ్యశీలంబులందు, మాకులంబునకెల్ల మహిఁ గర్తయైన
యంధకారారాతి యకట! యీపద్మబంధుండు నేఁడు నాపగవానిఁ గూడి

యుదయించుచున్న వాఁ డుగ్రత మిగిలి, యిదె వడి సౌమిత్రి యిబ్భంగి నుండ
నీసూర్యమండలం బిలమీఁదఁ గూల, నేనెద నంచు నహీనసాహసుఁడు
బ్రహ్మాండకోటుల భంగింపఁ బూని, బ్రహ్మాదు లదరంగఁ బ్రళయకాలంబు
నాఁ డుగ్రవృత్తిఁ బినాకి విల్లంది, వాఁడిమి మెఱయ నవ్వాడువు దీపింప
నాపూర్ణభుజనై పుణాటోపకోపుఁ, డాపినాకియుఁ దానె యగుటఁ దెల్పుచును
విల్లంది భుజబలవిస్ఫూర్తి మెఱయఁ, బెల్లు కోపించి సంభృతవేగుఁ డగుచుఁ
జటులరౌద్రాస్త్రంబు సంధింపఁ దివురు, పటువృత్తిఁ గనుఁగొని భయవృత్తిఁ గలఁగి
యసమానసత్త్వతో నతికోపుతోడ, వసుధేశుతో జాంబవంతుఁ డిట్లనియె
నగణితశక్తిమై నలుక దీపింప, జగతీశ నీవిటు శరము పుచ్చుటయు
ధృతిదూలి నలుగడ దేవగంధర్వ, పతులెల్ల భీతులై పాఱుచున్నారు
ఇది యేమి రఘురామ యిచ్చలో నీవు, పదిలుండవై చూచి భావింపలేవు
వెలుఁగొందు బహుదీపవృత్తదీధితులు, దోలుకాడు నుజ్జ్వలద్రోణాచలంబు
గొనివచ్చుచున్నాఁడు గురుసత్త్వధనుఁడు, అనిలసూనుఁడు గాని యన్యుఁడుగాఁడు
భానుప్రభాభాసిపవనసూనునకు, భూనాథ యెదురుగాఁ బుచ్చువానరుల
ననుటయు శ్రీరామునానతి వడసి, హనుమంతునకు నెదు రరిగిరి కపులు
ఆకాశముననుండి హనుమంతుఁ డంత, నా కొండఁ గొనివచ్చి యవనిపై నునిచి
జననాథుఁ డగు రామచంద్రున కర్థి, వినతుఁడై కరములు వెరవొప్ప మొగిచి
యుర్వీశ నేఁబోయి యోగి నౌషధములు, పర్వతంబునఁ బెక్కుభంగుల వెదకి
పనివడిఁ గానక పర్వతంబెల్లఁ, గొని యేను వచ్చితిఁ గువలయాధీశ
యడరి మీయానతి నటఁ బోవునపుడు, నెడపనికడఁకతో నిటవచ్చునపుడు
కడఁగి విఘ్నము లనేకములయ్యె నడుమఁ, దడయుట దప్పుగాఁ దలపోయవలదు
ననవుడు రాముఁ డా హనుమంతుఁ జూచి, ఘనతరసంతోషకలితుఁడై పలికె
నీ కేటి తప్పులు నీచేత బ్రదికెఁ, గాకుత్స్థకులలీల గౌరవోన్నతులు
సురుచిరశక్తిమై సుగలకునైన, నరుదైనపనిచేసి తని ప్రీతినొందె

సుషేణుఁడు సంజీవకరణిచే లక్ష్మణుని మూర్ఛఁదేర్చుట

నాసమయంబున నర్కతనూజుఁ, డాసుషేణునిఁ జూచి యర్థిదీపింప
నిక్కొండఁ దడయక యీవు వానరులు, నెక్కి మహౌషధు లేర్పడఁ దెచ్చి
భావించి లక్ష్మణుప్రాణముల్వడయు, వేవేగ ననవుడు విని సుషేణుండు
పనిఁబూని యప్పుడు బరవసంబొప్ప, వనచరసహితుఁడై వడిఁ గొండనెక్కి
యమరేంద్రుఁ డిక్కడ నర్థితోఁ దొల్లి, యమృతపానముచేసె నమరులు దాను
నిచట విష్ణుఁడు జగద్ధితబుద్ధిపూని, యచలుఁడై తనచక్రహతిఁ ద్రుంచివయిచె
నురురాహుమస్తకంబుగ్రుఁడై యనుచుఁ, దరుచరవరులకుఁ దవిలి చూపుచును
నొగిఁ బర్వతమున మహౌషధుల్దెచ్చి, తగఁ బ్రయోగింప నంతన దానిశక్తిఁ
దగిలి నాటినబాణతతులోలి వెడలి, మగిడెఁ బ్రాణములు లక్ష్మణకుమారునకు
నప్పుడు వానరు లందఱు గొలువ, నెప్పటివేర్మితో నినవంశుకడకుఁ

జనుదేరఁ గౌఁగిట సౌమిత్రిఁ జేర్చి, కనుఁగవ హర్షాశ్రుకణములు దొరఁగ
నాసమీరజుఁ జూచి యతులపుణ్యాత్మ, యీసుమిత్రామిత్రు నిచ్చితి నాకుఁ
గాకుత్స్థకులమిత్రుఁ గమనీయగాత్రు, నీకతంబునఁ గంటి నేఁడు లక్ష్మణునిఁ
బడిన నాతమ్ముని ప్రాణంబు లెత్తి, పడసితి నిపుడు నాప్రాణము ల్మగుడఁ
బ్రాణంబులన నాకుఁ బరికింప నితఁడె, ప్రాణబంధుండవు పరమబంధుఁడవు
తరుచరోత్తమ నీవ తలఁప నీచేయు, పురుషార్థ మొరులకుఁ బోలునే చేయ
నుపకారమునకుఁ బ్రత్యుపకార మెలమిఁ, గపివీర సేయుట గదు నుత్తమంబు
నీకుఁ బ్రత్యుపకృతి నే నేరఁ జేయ, నీకాపదలు లేవు నిఖిలలోకముల
నని పల్కి రఘురాముఁ డంత సుషేణుఁ, గనుఁగొని కొనియాడి కౌఁగిటఁ జేర్ప
ముదితాత్ముఁ డగుచు నిమ్ముల సుషేణుండు, నుదధి పొంగినక్రియ నుబ్బి యారాము
ననుమతి రణములో నటఁ బడియున్న, వనచరోత్తముల జీవములెల్లఁ బడసె
నంత వానరవీరు లంతరంగమున, సంతోష మెసఁగ నాశైలంబుఁ గదిసి
సకలరత్నోజ్జ్వలసానుశృంగముల, నకలంకరుచిఁ బొల్చు నాసొంపు చూచి
యవనీశుననుమతి నగ్గిరి యెక్కి, వివిధస్థలంబుల వేడుకఁ దిరిగి
పరిపక్వఫలములఁ బరితృప్తినొంది, పెరయ తేనియలాని పెన్నీరుఁ గ్రోలి
యవరోహణముచేసి రందఱు నంతఁ, బవననందను జూచి పలికె భూవిభుఁడు
ఎప్పటిచోటనే యేర్పడఁ బెట్టు, మిప్పర్వతాధిపు నింక నీ వనుచు
రాముఁడు వంప సంరంభంబు మెఱసి, యామహాశైలంబు ననిలనందనుఁడు
అలఘుఁడై కొనిపోవ నాకాశవీథి, జలధిమధ్యమున రాక్షసులు వీక్షించి
పఱచి యుత్తెఱఁగెల్లఁ బరువడిఁ దనకు, నెఱిఁగింప నేర్పడ నెఱిఁగి కోపించి
లంకాధిపతి జయాలంకారధనుల, శంఖుకర్ణస్థూలజంఘులతోడ
నట మహానాదుని నట మహావక్త్రు, నటఁ జతుర్వక్త్రుని నట మేఘజిత్తు
నట హస్తికర్ణు మహావీరజైత్రుఁ, గటువాక్యశాలి నుల్కాముఖుఁ జూచి
యలవుసొంపును మీర లడ్డంబు దాఁకి, బలియు నాహనుమంతుఁ బట్టితెండొండె
కొనిపోవుచున్న యక్కుధరంబు వుచ్చి, వనధిలోపలఁ బాఱవైచి రండొండె
ఈరెండుతెఱఁగుల నేర్పడ నొకటి, ధీరులై చేసి యేతెంచినఁ జాలు
నచ్చుగా నతనికి నర్మిలి వెలయ, నిచ్చమై సగరాజ్య మిచ్చెద నిపుడె
నావిని విపులసేనాసహస్రముల,తో వారు వెడలి బంధురసత్త్వధనులు
దానవామరవేషధారులై కినుక, లూని రణోదగ్రు లుగ్రవిక్రములు
క్షురికాసితోమర శూలకోదండ, పరశుకుంతాదిక ప్రముఖశస్త్రములు
ధరియించి మించినదర్పంబు మెఱసె, యురుతరహుంకారహుంకారు లగుచుఁ
గనుకని గర్జించు కాలమేఘములు, పొనుపడ సూర్యునిఁ బొదువుచందమునఁ
బొదివి యాహనుమంతుఁ బోనీక కదిసి, మదమునఁ బేర్చి దుర్మదులు బిట్టార్చి
దేవాసురుల నమ్ము దృష్టింపఁగోరి, పోవుచున్నాఁడవు భుజశక్తి మెఱసి
యీకొండఁగొనుచు నీవెటఁబోయె దనిన, నాకపివీరుఁ డాయసురులఁ జూచి

విలయకాలాచలవిస్ఫులింగములు, తొలఁకాడ నుజ్జ్వలదుర్జయాభీల
కాలచక్రాకారఘనవజ్రకరిన, వాలచక్రముఁ ద్రిప్పి వడి వ్రేయఁ దొడఁగె
నప్పు డారాక్షసు లదరి యొంతయును, నొప్పింప వాయుజుం డుగ్రకోపమున
భంజించెఁ గొందఱఁ బటువాలనిహతి, భంజించెఁ గొందఱఁ బరుషోగ్రదృష్టి
భంజించెఁ గొందఱఁ బదతాడనముల, భంజించెఁ గొందఱ భయదనాదముల
ఘనసత్త్వుఁ డిబ్భంగిఁ గయ్యంబుచేసి, వినుతవిక్రమమున విజయంబునొంది
తోయజాప్తుఁడు పేర్చి తుప్పలదూలఁ, దోయదంబులఁదూలఁ ద్రోచుచందమున
రాక్షసవీరుల రణవీధి నొడిచి, నక్షత్రవీథి నున్నతశక్తి మెఱసి
పోవుచునుండ నాభుజశక్తిఁ జూచి, దేవగంధర్వులు దివినుండి యపుడు
పొఱిఁబొఱి నతనిపైఁ బూవులవాన, గురియుచు నుండిరి కొలఁది కగ్గలము
అంతలో హనుమంతుఁ డతివేగుఁ డగుచు, నంతరిక్షంబున నరిగి యక్కొండ
మున్నున్నచోటనే ముద మొప్పఁ బెట్టి, క్రన్నన రఘురాముకడకు నేతెంచి
వినతుఁడై తనపోవువృత్తాంత మెల్ల, వినిపింప శ్రీరామవిభుఁడు హర్షించి
యావాయునందను నాలింగనంబు, కావింపఁ గనుఁగొని కపివీరు లెల్ల
వచ్చి లంకాపురవర మెల్లఁ గలఁగఁ, జెచ్చెఱఁ జేసిరి సింహనాదములు
భూరిదశాననపుణ్యచిహ్నములు, బోరన నొండెడ పోవుచందమునఁ
దఱిగి యాకసమునఁ దార లొండొండ, యఱిగిపోవఁగఁ జొచ్చె నటవేగెఁ బ్రొద్దు
దారుణస్ఫుటరోషదైత్యగర్వాంధ, కారంబుతో నంధకారంబు విఱిసె
నలి మీఱె వానరాననసరోజాత, ములతో సరోజాతములు వికసించె
దమపెంపు లొగిఁ దూలి దనుజాస్యకైర, వములతో భువిఁ గైరవమ్ములు మొగిడె
భానువంశాధీశబహుళప్రతాప, భానుతో భానుండు ప్రాగ్దిశఁ దోఁచె
జానకీవిభుఁ డంత సౌమిత్రిఁ జూచి, యానినసంతోష ముల్లంబు నిండ
సదమలగుణముల సౌమిత్రి నీవు, బ్రదికితి నాపాలి భాగ్య మెట్టిదియొ
యనియని కొనియాడునతులవాక్యములు, విని లక్ష్మణుఁడు రామవిభునకు మ్రొక్కి
దేవ ప్రాకృతుఁడవె దేవ దీనుఁడవె, దేవ నిర్ధనుఁడవె దేవ యల్పుఁడవె
యీభంగి నానతి యీనేల నాకుఁ, బ్రాభవంబునఁ బెంపుఁ బరికింప మఱచి
మును దండకారణ్యమునులకు సాధు,జనుల కిచ్చిన ప్రతిజ్ఞలు విచారించి
యిచ్చలో మిము నమ్మి యీవిభీషణుఁడు, వచ్చిన నిచ్చినవరముఁ జింతించి
యినుఁ డస్తశిఖరికి నేఁగకమున్న, యని రావణునిఁ జంపు మఖిలలోకేశ
యనవుడు రఘురాముఁ డౌఁగాక యనుచు, ఘనరణవిక్రమక్రమశక్తి మెఱసె
నంత నావృత్తాంత మంతయు నెఱిఁగి, యొంతయుఁ జింతించి యిచ్చలోఁ గలఁగి

### శుక్రునియొద్ద రావణుఁడు శోకించుట

విక్రమక్రమశక్తి విడిచి రావణుఁడు, శుక్రుసన్నిధి కేఁగి స్రుక్కుచు మ్రొక్కి
చుట్టాల భృత్యుల సుతుల సోదరుల, నెట్టన రఘురామునిశితబాణాగ్ని
దరికొని కాల్చి దగ్ధులఁ జేసి, కరఁగి యమోఘమై ప్రళయాగ్నిపగిది

నున్నది మాన్పరా కున్నది పోర, నన్నియుఁ దెగటారె నన్నియుఁ బొలిసె
నేను బ్రాణములతో నెబ్భంగి నిలుతు, నానతి యిమ్మన్న నాశుక్రుఁ డనియె
నలఘుసంగరవీథి నరుల సాధింపఁ, గలయుపాయంబును గలుగ నేమిటికి
నేవిఘ్నములు లేక యీవు హోమంబు, గావించుపుణ్యంబె కలిగినఁ జాలు
భీమసంగ్రామగంభీరంబు లగుచు, హోమాగ్నిముఖమునసుండి నీకడకు
సురరథాశ్వంబులు నుగ్రఖడ్గములు, శరచాపకవచము ల్పనుదెంచుఁ గడఁగి
యవి సాధనములుగా నరుల సాధింపు, మవి నీకు జయసిద్ధు లనుచు నాతనికి
హోమమంత్రములెల్ల నుపదేశ మిచ్చి, హోమమంత్రములెల్ల నొగి నేర్పరించి
పొమ్మన్న వీడ్కొనిపోయి రావణుఁడు, క్రమ్మిన కడఁకతోఁ గడునుగ్రుఁ డగుచు
బురవప్రరక్షకు భూరిసత్త్వులను, బరికించి చతురంగబలములఁ బనిచి
యవధానతత్పరుఁ డయి నేఁగ లంక, గవకులు వేయించి కలయ శోధించి
యంత విద్యుజ్జిహ్వుఁ డనుమహావీరు, నంతకాకారు నుద్ధతశూరుఁ బిలిచి
నీవు నీబలమును నెలకొని నగరు, గావు మేమఱకుము గదలకు మనుచుఁ
బనిచి యనుష్ఠానపదశుద్ధిఁ బొంది, చని మృత్యువక్త్రంబుఁ జనఁ జొచ్చుభంగిఁ
బాతాలగుహఁ జొచ్చి పదిలుఁడై నిలిచి, యాతతహోమకృత్యములకుఁ దగిన
రక్తవస్త్రంబులు రక్తమాల్యములు, రక్తచందన మనురక్తుఁడై తాల్చి

## రావణుఁడు పాతాళహోమము చేయుట

బంధురదక్షిణప్రవణవేదికకు, గంధపుష్పాక్షత ల్గర మొప్ప నిచ్చి
యామహావేదిలో నగ్ని సంధించి, హోమమంత్రములెల్ల నొగి నుచ్చరించి
వెరవొప్ప నాహోమవేదిలోఁ గలయఁ, బరికించి నిశితాస్త్రపరిధులఁ జేర్చి
శ్రీవృక్షభల్లాతసితముఖ్యసమిధ, లావృత్తిఁ గైకొని యంతట మఱియు
నోజసర్షపములు నొనర దూర్వములు, లాజలు దగ గుగ్గిలంబును నగరు
నేయి దేనియ గల్లు నెత్తురుఁ బెరుఁగు, పాయసాన్నములు దర్భలు ప్రవాళములు
తగరులు మీలు గ్రద్దలు వరాహములు, నొగి నివి మొదలుగా నొప్ప వేల్చుచును
నాశ్చర్యకరమైన యామహావేది, నిశ్చలతాధ్యాననిరతుఁడై యుండె
బలువిడి రావణుపాపంబులెల్లఁ, గలసి పెల్లెగసిన కైవడిఁ దోఁప
వామహాగుహనుండి యప్పు డత్యుగ్ర,ధూమంబు లురుతరస్తోమంబు లగుచుఁ
బటుతరనిర్ఘాతపవనసంఘాత, చటులంబులై నిక్కి చదలఁ బర్వుటయు
వెఱచిరి దివిజులు వెఱచిరి మునులు, వెఱచిరి దిక్పతు ల్వెఱచిరి కపులు
ఆమహాధూమంబు లప్పుడు చూచి, రాముతో ననియె నారావణానుజుఁడు
నెలకొని యనిమొన నినుఁ దాఁకి గెలువ, నిలువనేరకపోయి నేఁడు రావణుఁడు
కపటకర్మారంభగంభీరవృత్తి, విపులజయార్థియై వేల్చుచున్నాఁడు
అవధరించితె పొగ లాకసంబునను, నివుడుచు నున్నవి నిండి యొండొండ
హోమంబు నిర్విఘ్నయోగమై యితఁడు,కామించు తెఱఁగునఁ గడముట్టెనేని
రావణు లోకవిద్రావణుఁ బోర, దేవాసురులకైనఁ దెగి గెల్వరాదు

కావున హోమవిఘ్నము సేయవలయు, వేవేగ వానరవీరులఁ బనుపు
మనవుడు రఘురాముఁ డగుఁగాక యనుచుఁ, బనిచినఁ బనిపూని బలువిడిఁ గడఁగి
గురుబలాఢ్యుఁడు గవాక్షుండు దారుండు, శరభుఁడు క్రథనుండు శతబలి నలుఁడు
గవయుండు మైందుండు గంధమాదనుఁడు, పవమానసూనుండు పనసుఁ డంగదుఁడు
కుముదుండు జ్యోతిర్ముఖుండు గోముఖుఁడు, క్రమమున వీరాదిగాఁ గపివరులు
పదికోటు లుద్భటప్రధనవిక్రములు, విదితప్రతాపులు విదితకోపనులు
గగనమార్గమున లంకకు నేఁగుదెంచి, యగణితాహంకారులై పెచ్చువెరిఁగి
పదఘట్టనముల భూభాగంబు వగులఁ, జదియ దిగ్గజములు చదలు గ్రక్కదల
నార్పులు బొబ్బలు నడరఁ బెల్లడరి, దర్పితనిర్భరోత్సాహసాహసులు
నలిఁ దాఁకి రావణునగరిఁ గాపున్న, బలియురఁ బెక్కండ్రఁ బట్టి చెండాడి
క్రూరులై దౌవారికులఁ జంపివైచి, భూరిసత్త్వములఁ దల్పులు వీడఁదన్ని
నగరుద్దవిడిఁ జొచ్చి నగరూపధరులు, నగచరు ల్వడి దశానను రోయువారు
పృథురథశాలలు బిరుదులై చొచ్చి, రథములు విఱుగ సుర్వర వ్రేయువారు
గజశాల లోగిఁ జొచ్చి ఘనముష్టిహతుల, గజమస్తకములు వ్రక్కలు సేయువారు
హయశాలలోగిఁ జొచ్చి హయశరీరములు, భయదోగ్రనఖములఁ బడవ్రచ్చువారు
సారిది శాలల నున్న జోడుపక్కెరలు, దరమిడి చింతించి దరలాడువారు
చలమొప్ప నాయుధశాలలఁ జొచ్చి, కలయశస్త్రాస్త్రము ల్ఖండించువారు
నేచి బండారపు టిండ్లలోఁ జొచ్చి, రాచి యర్థములు చూఁగలు చల్లువారు
నురుసత్త్వగతులొప్ప నుప్పొంగి పొంగి, వరుస తోరణములు వడిఁ ద్రెంచువారు
పసిఁడిగోపురములు భర్మహర్మ్యములు, వెస నుర్విఁ గూల బల్విడిఁ ద్రోయువారు
కట్టల్కఁ గొందఱఁ గని జగద్ద్రోహిఁ, బట్టి తెండని పట్టి బాధించువారు
వనితలు సుతులును వాపోవఁ గన్న, జనను లడ్డము చొరఁ సదనము ల్సొచ్చి
నెట్టన వెలి కీడ్చి నెరసి రాక్షసుల, దట్టించి తలలూడఁ దాటించువారు
వానిమై నిబ్బంగి వనచరుల్గూడి, గాసివెట్టుచు నుండఁగా భీతినొంది
దీనదశాతురస్థితిఁ దూలపోయి, దానవుపీడు విధ్వస్తమై కలఁగి
హరిపీడితానేకహయహేషితములు, కరిఘటానేకభీకరబృంహితములు
వృద్ధబాలాంగనావిలవిలాపములు, సిద్ధవిక్రమకపిసింహనాదములు
గలయఁ బర్విన లంక కల్పాంతకాలమునఁ బేర్చు బడబాగ్ని ముఖముఖార్చులకు
నులికి వాపోవు పయోధిచందమునఁ, గొలఁది కగ్గలముగా ఘూర్ణిల్లఁ దొడఁగె
అంత సూర్యోదయమయ్యె రావణుని, నంతటఁ బరికించి యతఁ డున్న చోటు
కానక చింతించి కడుసంభ్రమమున, వానరు ల్వెదకంగ నారి నీక్షించి
చతురతమై విభీషణుపత్ని సరమ, పతిహితం బాత్మలో భావించి యపుడు
వడి నంగదునకు రావణుఁ డున్నచోటు, చిడిముడిపాటుతోఁ జేసన్నఁ జూపె
చూపుటయును జూచి సుభటదంభోళి, కోపించి యప్పు డగ్గుహావాత నున్న
శిల నుగ్గుఁగాఁ దన్ని చెచ్చెఱఁ జొచ్చి, యలఘువిక్రమకళాయతకేళి వ్రాలి

పోలుపొంద భుజసత్త్వమునఁ బెంపుమీఱి, కలఁగి రాక్షసులెల్లఁ గడుభీతిఁబొందఁ
జని హోమనియతి నిశ్చలుఁడైనవాని, ఘనమంత్రతంత్రసంగతుఁడైనవాని
రావణు నమరవిద్రావణుఁ గాంచి, రావణుఁ బొడగంటి రండు రండనిన
ననిలతనూభవుం డాదిగాఁగలుగు, వనచరాధిపులెల్ల వడిఁ గూడముట్టి
యగ్గుహారక్షకులైన రాక్షసుల, నుగ్గునూచము చేసి నుతశక్తి మెఱసి
యొక్కఁడై వేల్చుచు నున్నయద్దనుజు, నక్కడఁ బొడగని యలుక దీపింపఁ
దోడెవ్వరును లేక తుది నొంటిపడియెఁ, దోడు వేలుతమని దొరకొని కపులు
సొరిది నవ్వేదికచుట్టులనున్న, పరిధులు సమిధలు బహుకలశములు
హస్తికుక్కుటజంబుకాశ్వోష్ట్రశునక, మస్తకంబులు ఘృతమధుపాత్రతతులు
నఱిమిఱిఁ బుచ్చి హోమాగ్నిలో వైచి, నెఱసి యార్చిరి దైత్యనికరంబు బెదర
నప్పుడు పాపాత్మునంగంబులందు, నిప్పులు సల్లుచు నెఱమంట లొదవు
గుండంబులో మండుకొఱవులు పుచ్చి, యొండొండ వ్రేయుచు నుండిరి కపులు
చేతిస్రుక్స్రువములు చెనసి రాఁదిగిచి, వాతూలసుతుఁడు రావణు వ్రేసి డాసె
నిత్తెఱంగునఁ గపు లేచి కాఱింపఁ, జిత్తంబులో నిష్ఠ చెదరంగనీక
కనియక కదలక క్రతునిష్ఠనుండెఁ, గొనకొని నిద్రించుకొండచందమున

## అంగదుండు మందోదరిని రావణుపద్దికి నీడ్చుకొని వచ్చుట

సంగరక్రమకళాసంగుఁ డభంగుఁ, డంగదుం డంగద నంచితాంగదుఁడు
అంతఃపురంబున కరిగి యాదైత్యు, కాంతానివాసంబు కరమర్థిఁ జొచ్చి
పరికింప రోహిణిఁ బాసినచంద్రుఁ, దరుణపల్లవశయ్యఁ దగఁజేర్చుకరణిఁ
గందినముఖచంద్రుఁ గరపల్లవమునఁ, బొందించి వగలచేఁ బొగలెడిదాని
ఘోరాహవంబునఁ గుంభకర్ణాది, వీరులు పెక్కండ్రు విషమవిక్రములు
దక్కి రందఱు విభుం డొక్కఁడ చిక్కె, నెక్కటిరఘురాము నితఁ డేమి గెలుచు
నని యని రావణునపజయంబునకుఁ, దనబంధువులు దాను దలఁకెడుదాని
చిత్తంబులో నింద్రజిత్తుచావునకు, నొత్తిలి యేడ్చుచు నున్నట్టిదాని
రమణీయమణిమందిరమునఁ గొల్వున్న, రమణి మందోదరి రాజాస్యఁ గదిసి
యొలసినగతి రాహు వొడిసి పట్టుటకుఁ, జలదిందుమండలీచంద్రికవోలెఁ
దిగిచినఁ బెడమర దిరుగువేగమున, మృగనేత్ర మొగమున మెఱుఁగులు సెదర
నెఱుఁగమితోఁ గూడ హృదయంబు గలఁగ, తెఱఁగున నలివేణిఁ దిగిచి పట్టుటయుఁ
గమ్మసౌరభములు గలుగుసంఫుల్ల,ధమ్మిల్లమల్లికాదామంబు లనఁగఁ
గెడఁగూడి రావణుకీర్తిపుష్పములు, గడివోయి భువిరాలు కైవడిఁ దోఁప
నేసముత్తియములు చెలువంబు వాసి, గాసిలి వసుధపై గనుకనిఁ జెదర
వలనేది చెడిన రావణురాజ్యపదవి, చెలువున నెఱి దప్పి సీమంతవీథిఁ
గృతకంపుదైత్యలక్ష్మీపదాబ్జమున, శ్రితచంచరీకము ల్చెదరుచందమున
నాలోలలోలముఖాంభోజనీల, నీలాలకంబులు నెఱి దప్పి చెదర
నురుమంగళంబులై యొప్పెడినాత్మ, వరభూషణములు రావణులక్ష్మి చెవుల

నుండనిక్రియ వడి నొండొండ కర్ణ,మండనంబులు మహీమండలి రాల
దను జేశునపకీర్తిధారలో యనఁగఁ, గనుగవఁ గాటుకకన్నీరు దొరుఁగ
నొగి దైత్యపతికి మహోల్కలు దుల్లు,పగిది భూషణమణిప్రకరముల్దుల్ల
వరభర్మనిర్మలావరణంబు కలఁగ, నిరవేది రావణు నిహాపరోన్నతులు
చలియించు తెఱఁగునఁ జనుగట్టు దొలఁగి, చలియింప నున్నతస్తనకలశములు
కొమరేది సురవైరిగుణవల్లి నులియు, క్రమమున నెంతయుఁ గౌఁదీఁగె నులియు
నిర్మలుఁ డగురామనృపతిచేఁ దెగిన, కర్మబంధములు రాక్షసలోకపతికి
వదలు నిక్రియనను వడువున నీవి, వదలుచు మేఖలావల్లియు వీడఁ
బ్రమదరాక్షసరాజ్యపదపంథి రోసి, విమలవర్ణావలి వీడుచందమున
నుదితరావంబులై యొండొంటిఁ గడవఁ, బదనూపురము లూడిపడి మ్రోయుచుండ
వెఱచి రాక్షసవధూవితతి శోకింపఁ, జెఱనున్ననిర్జరస్త్రీ లుత్సహింప
నీరసంబునఁ బట్టి యీడిచి తెచ్చె, వారక రాక్షసేశ్వరుని ముందఱికి
నంత మందోదరి యాత్మేశుఁ జూచి, యంతరంగమున శోకాగ్నులు నిగుడ
నింద్రు గెల్చినసత్త్వ మెక్కడఁ బోయెఁ, జంద్రహాసము వాఁడి సమసెనే నేఁడు
ఫాలలోచనుతోడఁ బ్రముఖులతోడఁ, గైలాసమెత్తిన గర్వ మెందణఁగె
మూఁడులోకంబులు మునుమిడి గెలిచి, నేఁడేల తూలెదు నీపేర్మి విడిచి
యింద్రజిత్తుఁడు నన్ను నిటఁ బాఱవైచి, యింద్రలోకంబున కేఁగకయున్న
నన్నిట్లు చూచునే నాకొడుకున్న, నిన్నిచదుర్దశ లేను బొందుదునె
సిగ్గు లజ్జయులేని చెనఁటిరో నన్ను, బగ్గించుచున్నారు పగతు లిబ్భంగి
నీహోమ మేటికి నిష్ఠయేమిటికి, నాహుతు ల్నిన్నుఁ బూర్ణాహుతిఁ జేసెఁ
బటుబుద్ధివై రాముబాణాగ్నిఁ బడుము, కుటిలక్రియలకింకఁ గొలదిఁగా దుడుగు
మన విని దశకంఠుఁ డలుక దీపింపఁ, దనచేతియాహుతు ల్ధరణిపై వైచి
యురుతరం బగునిష్ఠురోగ్రకోపాగ్నిఁ, బురవధూతోరణంబులు వోనిబొమలు
ముడివడ సమవర్తిమూర్తియై పేర్చి, కడఁకమై నత్యుగ్రఖడ్గ మంకించి
యతులరత్నాంగదు నంగదు వ్రేసి, వితతవిక్రముఁ డింతి విడిసించి పుచ్చె
వీడిన నెఱివేణి వెన్నున జార, వాడినమోముతో వగలఁ దూలుచును
నంతఃపురంబున కరిగె దైతేయు, కాంత చింతించుచుఁ గడుఁ జిన్నవోయె
నప్పుడు హనుమంతుఁ డత్యుగ్రముష్టిఁ, దప్పక దశకంఠుతల బిట్టు వొడిచె
నావాలిసూనుండు నంతలోఁ దెలిసి, రావణువ్రేసె విక్రమకేలివాని
తోరంపునెత్తుటఁ దోఁగి యెంతయును, గ్రూరుఁడై జేగురుకొండచందమున
నతిఘోరకోపాట్టహాసంబు లెసఁగ, నతులసత్త్వోదత్తుఁడై దశాననుఁడు
అంగదుఁ దగ వ్రేసె ననిలనందనుని, భంగించె నిశితాశిఁ బటుశక్తి మెఱసి
నలి శూలముఖమున నలుని నొప్పించె, నలువున గజు నొంచె నంకుశనిహతి
మొగి నీలు ధట్టించె ముసలఘాతమునఁ, దగుశక్తి శతబలిదర్పంబు మాపెఁ
బవితుల్యముద్గరప్రదరంబు పుచ్చి, ద్వివిదుని మైందుని వ్రేసె వ్రేయుటయు

వానరవరులు దుర్వారులై తమదు, సేనలఁ జొచ్చి రచ్చెరువుగాఁ బఱచి
యనిలసూనుఁడు రాఘవాధీశుకడకుఁ, జని మ్రొక్కి హస్తాంబుజంబులు మొగిచి
రామావనీశ్వర రాక్షసేశ్వరుని, హోమంబుఁ జెఱచితి మొప్ప వచ్చితిమి
అనవుడు విని రాముఁ డంతరంగమున, ననయంబు హర్షించె నట దైత్యపతియు
గడువేగమునఁ బోయి ఘనశోకవహ్ని, నుడుకుచు నున్న మందోదరిఁ జూచి
యతివ నీమనమున నక్కట దైవ,కృతమున కింత శోకింప నేమిటికి
ననిమొన నేఁడు రామావనీనాథుఁ, దునిమెద నట్లుగాక దురములో నతఁడు
నను సమయించిన నలినాయతాక్షి, జనకనందనఁ జంపి సాహసంబొప్ప
వేవేగ యగ్నిప్రవేశంబు సేయు, నీవనుఁటయు నింతి నిజనాథుఁ జూచి

### మందోదరి శ్రీరాములమాహాత్మ్యము రావణునికిఁ దెల్పుట

యోదశాసన నీకు యుద్ధమధ్యమున, రాదు జయింపఁగ రఘురామదేవు
నీవొక్కఁడవ యేల నెఱసి రాఘవుని, దేవాసురులకైన దీఱదు గెలువ
నీమది రాజుగా నిర్ణయింపకుము, రామచంద్రుండు పురాణపూరుషుఁడు
ఆమేటి తొల్లి మత్స్యావతారమున, సోమకు నిర్జించి శ్రుతు లుద్ధరించె
ఘనమంథశైలంబు గమఠమై యతఁడు, దనవీపుఁ గుదురుగా ధరియించెఁ దొల్లి
రాముఁడు మున్ను హిరణ్యాక్షుఁ జంపి, భూమి వరాహమై పొగడొందనెత్తె
నతఁడు నృసింహుఁడై యలుకమైఁ దొల్లి, పతితుదైత్యునిఁ జంపి ప్రహ్లాదుఁ గాచె
నలిగి యాతఁడు వామనావతారమున, బలి నర్థిమై వేఁడి బంధించెఁ దొల్లి
జమదగ్ని రాముఁడై జన్మించి యతఁడు, విమలశౌర్యునిఁ గార్తవీర్యునిఁ ద్రుంచె
పీకను జేకొన్న విశ్వమంతయును, నాకశ్యపబ్రహ్మ కర్థితో నిచ్చె
సన్నుతగతి విరోచనుఁ జంపి వైచె, మున్ను మాయారూపముఖుని నిర్జించె
జలధిమధ్యంబునఁ జరణఘాతమున, బలువిడి రాక్షసపతుల రూపడఁచె
లవణాసురునిఁ జంపె లలిఁబార్ష్ణిహతుల, జవమార నీరామచంద్రుండు మొదల
నధికుఁడై యాతఁడ యాదికాలమున, మధుకైటభాదుల మర్దించె నతఁడు
తనసత్త్వమంతయుఁ దలకొని వచ్చి, నినుఁ జంప నిప్పుడు నిష్ఠమైఁ బూని
దిశలఁ దేజంబులు దీపింపఁజేసి, దశరథేశ్వరునకుఁ దనయుఁడై పుట్టె
నామహామహిమ లత్యద్భుతక్రియలు, నేమని చెప్పుదు నేను వాక్రుచ్చి
యలఘువిక్రమకళాయతశక్తి మెఱసి, బలియుఁడై యాతఁడు బాల్యంబునందుఁ
గౌశికప్రముఖదిక్పతులెల్లఁ బొగడఁ, గౌశికుం డొనరించు క్రతువు రక్షించె
శతసహస్రాయుతసంఖ్యలు గడవ, నతనిచేఁ బడసె దివ్యాస్త్రశస్త్రముల
జనకుండు మొదలుగా జగమెల్లఁ బొగడ, ఘనశక్తి విఱిచె శంకరుశరాసనము
దైవయోగంబునఁ దనకుఁ బట్టమున, దేవిగాఁ బూని వైదేహిఁ గైకొనియె
బోమించి నిజబలస్ఫురణంబు చూపి, రాముఁ డాభార్గవరాము భంగించెఁ
దనతండ్రి మనుపునఁ దప మొప్పఁ బూని, మునివృత్తి వనవాసమునకు నేతెంచ

సన్నుతశక్తిమైఁ జంపె విరాధుఁ, బన్నుగాఁ జేర్చి శూర్పణఖ శిక్షించె
నసుగుల నాదండకారణ్యభూమి, గడుఁ బుణ్యభూమిగాఁ గావించినాఁడు
ఖరదూషణాదిరాక్షసవీరవరుల, ధరఁ గూల్చె మఱి చతుర్దశసహస్రముల
మారీచుఁ దునుమాడె మాయఁబోనీక, ఘోరరూపుఁ గబంధుఁ గూలంగ నేసె
నీకందు గుణమెల్ల నిలిపి దట్టించి, లాగొప్ప నిన్ను వాలమున బంధించి
చతురబ్ధిజలములఁ జలమున ముంచి, యతులసత్త్వక్రీడ నడరి కాఱించి
విడిచిన యావాలి వెస నొక్కకోలఁ, బడనేసె సుగ్రీవుఁ బట్టంబుఁ గట్టె
నలవుమైఁ దనదుబాణాగ్నికీలలను, జలనిధి నింకించె జగములు మెచ్చఁ
గలనిలోపలఁ గుంభకర్ణు ఖండించెఁ, జలమున నఖిలరాక్షససమేతముగ
సమరంబులోపలఁ జంపె లక్ష్మణుఁడు, నమర నయ్యతికాయు నయ్యింద్రజిత్తు
నలుగఁ డెన్నఁడును రామావనీనాథుఁ, డలిగిన నిలువ రింద్రాదులు నెదుట
మదిమది నుండ నామనుజేశుదేవిఁ, ద్రిదశారి వంచనఁ దేనీకుఁ జనునె
నీవెఱుంగవె రామునిత్యసత్త్వములు, నీవెఱుంగవె రామునృపుమహత్త్వములు
రాముసత్త్వస్థితి రావణ నీకు, నేమిపాపమునవో యెఱుఁగఁ జొప్పడదు
నీవింక రఘురాము నిష్ఠురబాణ,పావకజ్వాలల భస్మమై పడక
జనకనందనతోడ సకలరాజ్యంబు, నెనయ రాఘవునకు నిమ్ము వేవేగ
మరలి తపోవృత్తి మనమరణ్యములఁ, జరియింత మింతియ చాలు భోగములు
నీవు దీఱిన నాకు నీతోడఁ గూడఁ, బావకుముఖమునఁ బడి కాలరాదు
మున్ను మాతండ్రియు ముదిమియుఁ జావు, నన్నుఁ బొందకయుండ నాకిచ్చె వరము
వరభోగ మేనొల్ల వలవ దీత్రోవ, తరముగా దింక దుస్తరము తద్వరము
సరమకునొందె నాజనకజకొందె, వరవుడనై యేను వర్తింపవలసె
ననవుడు దశకంఠుఁ డాకలకంఠిఁ, గనుఁగొని పలికె నుత్కటరోషుఁ డగుచు
నింతేల చింతింప నెలనాఁగ నీకు, నింతకు వచ్చితినే యేను నేఁడు
చుట్టాల భృత్యుల సుతుల సోదరుల, నెట్టనఁ జంపించి నేఁడింక నాకు
దేవదానవభయోద్వృత్తిఁ బోనాడి, యీపట్టిప్రాణంబు లేల రక్షింప
దురమున నింద్రజిత్తునింటికొడుకుఁ, బరులచేఁ జంపించి బ్రదుక నేమిటికి
గరుడోరగామరగంధర్వవరులఁ, బోరిఁ గొంటిఁ జెఱిచితిఁ బుణ్యగేహినులఁ
దపసులఁ జంపితిఁ దరుణి యేనింకఁ, దపసినై పోయినఁ దపసులు నగరె
కావు నీమాటలు కార్యంబు తెఱఁగు, భావింపనేరవు పద్మాయతాక్షి
ఏ నెల్లభంగుల నింక రాఘవులఁ, బోనీను జంపుదు భూమిజ నీను
ఆరూఢబలుఁడనై యటుగాక యేను, శ్రీరాముశరములచేఁ జత్తునేని
నాకవాసులు మెచ్చ నాకోరుచున్న, వైకుంఠ మెదురుగా వచ్చు నిచ్చటికి
లలన నీవేటికి లంక యేమిటికిఁ, దలకొన్న ముక్తిసత్పథముఁ గైకొందు
ఎలనాఁగ నీవింక నేను లేకున్నఁ, గలపుణ్యలక్షణకళలెల్లఁ బొలిసి
కమలబంధుఁడు లేని కమలినిబోలె, కోమరేచి శశిలేని కుముదినిఁబోలె

రేరాజు లేనట్టి రేయునుబోలె, శారిక లేని పంజరమునుబోలె
ఎనయఁ గోయిల లేని యెలమావివోలె, దినమణి లేని యాదినమునుబోలె

## రావణుఁడు మూఁడవసారి యుద్ధమునకు వెడలుట

ఉండుము నీవన్న నొండాడ వెఱచి, యుండె మందోదరి యుదరి లజ్జించి
యంత దశగ్రీవుఁ డాహవోద్యోగ, సంతోషపోషితోత్సాహుఁడై కినిసి
యాదిత్యులదర బ్రహ్మాండభాండంబు, భేదిల్లఁ బటురణభేరి వేయించి
కలహవిక్రమకళాకల్పుఁడై తివిరి, బలములఁ బన్నింపఁ బడవాళ్లఁ బనిచి
యుదయార్కబింబసముజ్జ్వలప్రభలఁ, బదికిరీటంబులు పదిలమై యొప్ప
వినుతరత్నప్రభానిద్యోతమాన, ఘనకుండలంబులఁ గర్ణంబు లడర
నాయతభుజశాఖ లన్నియు రత్న, కేయూరకంకణాంకితములై తనర
నిరవొంద డాకాల నింద్రాదిభయద, బిరుదభీషణ గండపెండేర మొప్పఁ
గరము లన్నిటను భీకరచంద్రహాస, శరశరాసనగదాచక్రాదు లమరఁ
బటురోషదృష్టిప్రభావహ్ను లెందుఁ, జటులంబులై పర్వఁ జనుదెంచి యపుడు
స్ఫుటబంధబంధుర షోడశచక్ర, ఘటితకోటిద్వయఘంటికాబద్ధ
భయదోగ్రసంఫుల్ల భల్లూకవర్మ, హయసహస్రోదగ్ర మగురథం బెక్కి
కాకుత్స్థశరములఁ గడతేరి మీఁద, వైకుంఠరథ మెక్కవమువు దీపింప
నెలకొని రథకళానిధి కాలకేతుఁ, డలఘుబలోదారుఁ డాతేరుఁ గడప
దీపించు వెన్నెలతేటలై మీఁద, నేపారుగొడుగు లనేకంబు లొప్ప
మండితమార్తాండమండలచంద్ర, మండలకబళనోన్మదసముద్యోగ
రాహుత్రయముపోలె రహి మిన్నుముట్టి; సాహసరాహుమస్తకము ప్రశస్త
బిరుదధ్వజంబు లాభీలమై మూఁడు, దరలంగఁ బటపటధ్వనులతో వెడలె
భేరీమృదంగాది భీమగంభీర, భూరిఝంకృతుల నంభోధు లుప్పొంగ
ఉప్పొంగుకడలకు నుర్వి గంపింప, నప్పుడు కరులును హరులుఁ దేరులును
బలసముద్భటమహాభటకదంబములు, బలువిడి వెడలె దిగ్భాగంబు నిండఁ
బ్రళయకాలమునాఁటి భానులభంగిఁ, దలకొని వెడలి రుదగ్రులై ఖడ్గ
రోముండు నగ్నివర్ణుఁడు గయ్యమునకుఁ, దా మేఁగఁ బదహతి ధరణి పెల్లడరె
నప్పు డంభోనిధు లన్నియుఁ గలఁగె, నప్పుడు లోకంబు లన్నియు బెదరె
నప్పుడు దిగ్దంతు లన్నియు వ్రాలె, నప్పుడు కులగిరు లన్నియు వడఁకె
నెడపనికడఁకతో నిబ్బంగి వెడల, నుడువీథి సురలు దా రొండొండ నిండి
రావణోద్యోగసంరంభంబు సూచి, దేవారి యిటుఁ గ్రింద దేవదేవారి
యోధులపైఁ బేర్చి యుద్వృత్తినెత్తి, క్రోధించి మించి పేర్కొనిపోవువాఁడు
ఈరీతి యీభాతి యీరణోద్యోగ, మీరోష మీవేష మెన్నఁడు లేదు
నేఁడు లక్ష్మణసమన్వితునిరాఘవునిఁ, బోఁడిమితోఁ దాఁకి పోరాడకున్నె
యని రత్నమయవిమానారూఢు లగుచు, ననిమిషులనిమిషులై చూచుచుండ
రాసి వానరబలారణ్యంబుఁ గాల్పఁ, గా సొంపుతో వచ్చు కార్చిచ్చుపగిది

నడతెంచె నసురసేనాసహస్రమును, బొడగని కపివీరపుంగవులెల్ల
నంగదుఁ జెలరేఁగి యట్టహాసమును, పొంగ నుప్పొంగి యార్పులు నింగిముట్టఁ
దరమైనతరులు నుద్ధతమైనగిరులు, గిరిశృంగములుఁ గొని గిరిసమాకృతుల
దరమిడి బరువడి దనుజసైనికులు, దురమున నిరువాఁగుఁ దొడరి రొండొంటి
నక్షీణబలము లేపారంగఁ దాఁకు, దక్షిణోత్తరసముద్రములచందమున
నప్పుడు దానవు లాసేనమీఁద, ముప్పిరిగొనురోషములు మండుచుండ
నార్పులు జంకెలు నతులహుంకృతులు, నేర్పులు కడఁకలు నిండ నొండొండఁ
గటమదోత్కటదంతి ఘటల డీకొల్పి, పటుజవాశ్వంబుల బలువిడిఁ దోలి
యలవొప్ప నరదంబు లతిముఱిఁ బఱపి, నలుగడఁ గాల్బార నలిఁ గవియించి
కరవాలముసలముద్గరభిండివాల, పరశుతోమరశరప్రాసఖడ్గములఁ
గనుకని వైచియు గాఁడఁబొడిచియుఁ, దునిమియు మెఱిమియుఁ దూలనేసియును
వ్రచ్చియు మోదియు వసుధఁ గూల్చియును, గ్రుచ్చియుఁ గపులఁ బేర్కొని విదళింప
మొనసి వానరవీరముఖ్యులు గడిమిఁ, గినిసి యుద్భటరణక్రీడమైఁ గదిసి
యుఱికి సమీపమందున్నశైలములు, తఱుచైన గిరిశృంగతతులు వృక్షములు
శిలలును వడివ్రేసి చెలరేఁగి మఱియుఁ, దలమీఱి గుజ్జుపుదళముల కుఱికి
యుదితోగ్రసత్త్వంబు లొప్పఁ గుప్పించి, కుదియక రౌతులఁ గూలఁ దన్నియును
గర ముగ్రులై కరిఘటలపైఁ గవిసి, సొరిది శైలము లెత్తి జోదులు పెలుచఁ
గుంభమధ్యంబుల గ్రుంగ నేనుఁగులఁ, గుంభిని నొక్కటఁ గూల నేయుదురు
రథములతోడ సారథులరథ్యముల, రథుల నొక్కట నెత్తి రణమధ్యవీథిఁ
బెలుకుర నందంద పృథివి గంపింప, నలవున నటువ్రేసి నలియఁ జేయుదురు
ధరణీధరంబులఁ దగుకదంబముల, నురవడిఁ గాల్బార నురక మోఁదుదురు
కఱతురు పండ్లను గరతలాగ్రములఁ, జఱతురు పదములఁ జదియఁ బ్రాముదురు
వ్రత్తు రుజ్జ్వలనఖావలుల వాలముల, మొత్తుదు రలతురు ముష్టిఘట్టనలఁ
బనసనీలాంగదప్రముఖులు మఱియు, వనచరపతులు దుర్వారులై యెగసి
తనియనికడిమి నుద్దండదానవుల, మొనలపై నాకసంబుననుండి నిండి
భూరిధారాధరంబులు లయవేళ, ఘోరనిర్ఘాతము లురియుచందమున
గురుశైలపాషాణకోటు లందంద, కురియ నుద్భటరణక్షోణి నెగ్గైడలఁ
గూలు నేనుంగులు కుంభమధ్యముల, వ్రాలు మావుతులు పైవ్రాలుచందములు
విఱుగువిండ్లును గూలు వీరరాక్షసులు, నొఱగు నశ్వములుఁ బై నురులు రావుతులు
జదియు రథంబులు సమయు సారథులుఁ, జివియు పీనుంగులుఁ జెదరు మాంసములుఁ
బడు కిరీటంబులు పగులు మస్తకము, లడరు నెత్తురులుఁ బెల్లవియు గాత్రములుఁ
దొలుకాడు ప్రేవులుఁ దునియు ఖడ్గములుఁ, గలిగి యప్పుడు రణాంగణ మొప్పెఁ జూడ
బహుభోగపర్జన్యభాగ్యంబపోలె, మహితాభ్రమాతంగమదసిక్త మగుచు
నతిరౌద్రరుద్రవిహారంబపోలె, హతగజాసురపశాచానంద మగుచు
నక్షీణరామకటాక్షంబుపోలె, ప్రేక్షణహృష్టవిభీషణం బగుచుఁ

గలియుగాంతోద్యదగ్రకాలంబపోలె, బలశూన్యవిధ్వస్తబహుధర్మ మగుచు
గతతోషసంఫుల్లకమలినిపోలె, శ్రితశిలీముఖపుండరీకౌఘ మగుచుఁ
జారుశుభోదారుసదనంబపోలె, నార్తకఘనమార్గణాకీర్ణ మగుచు
స్థిరపుణ్యమూలనదీభర్తపోలె, హరిసత్త్వనిర్మథితాభీల మగుచు
ననఘుక్రమాగరుయాగంబపోలె, ననిమిషలోకచింతాభీష్ట మగుచు
నొప్పెడిరణములో నుగ్రభావమున, గుప్పతిల్లుచు సుర లొగిఁ జూచుచుండఁ
దొడఁగి నెత్తుటఁ దొప్పఁదోఁగి లోఁగలయఁ, బడియున్న ప్రేవులు పసడంపు బొదలు
రథములు యానపాత్రము లూడిపడిన, రథచక్రతతులు గూర్మముల మొత్తములు
మొగి నున్న శవములు మొసళులు గలయఁ, దెగిపడ్డ భుజములు దీర్ఘసర్పములు
ఆయుధరథరశ్ము లస్థిసమూహ, మాయతశైలంబు లతులదంష్ట్రములు
తిమితిమింగిలములు దీర్ఘఘోటకపు,గములు సముల్లోకకల్లోలతతులు
వివిధాశ్వలాలలు వెలి నురువ్వలందు, ధవళాతపత్రసంతతులు హంసములు
బహుకిరీటప్రభల్బడబాగ్నిశిఖలు, మహిమీఁదఁ జెదరినమాంసము ల్మణులు
ప్రీతనిశాచరప్రేతబేతాళ, భూతాట్టహాసము ల్భూరిఘోషములు
చంద్రుండు రఘురామచంద్రుఁ డవ్విభుని, సాంద్రహాసద్యుతుల్చంద్రిక లగుచు
నడరెదురక్తాబ్ధి యబ్ధితోఁ దొరసి, యుడువీథితో రాసి యుప్పొంగుచుండె
నప్పుడు హనుమంతుఁ డసురేశుమీఁద, నుప్పొంగి కవియ నుద్యోగంబు సూచి
యచలాచలాకారుఁ డతిబలోన్నతుఁడు, రుచిరఖడ్గుఁడు ఖడ్గరోముండు గినిసి

**ఖడ్గరోముఁడు మొదలగురాక్షసులు వానరవీరులతో యుద్ధముసేయుట**

యందెందుఁ గడఁగెద వందేల నీకు, నిందు రమ్మనిలజ యే నున్నవాఁడ
ననవుడుఁ గుప్పించి యతనిపై కుఱికి, తనురోమశితఖడ్గధారల మునిఁగి
యొకభంగి నిగిడి మహోగ్రుఁడై కడఁగి, ప్రకటసత్త్వోన్నతిఁ బవమానసుతుఁడు
కులశైల మనఁబోలు కొండ చేఁబూని, పెలుచ నార్చుచు వచ్చి పృథివి గంపింప
వానిపై నురువడి వైచె వైచుటయు, దాని వాఁడురురోమధారాభిహతిని
గండ్రించి ప్లవగుల ఖండించుకొనుచు, దండి నప్పవమానతనయుఁ దాఁకుటయుఁ
బావని మఱియునుంబర్వతం బొకటి, వేవేగ దానవవీరుపై వైవఁ
గులిశధారాహతిఁ గూలుపర్వతము, పోలుపునఁ గూలె నప్పుడు రక్కసుండు
సర్పరోముఁడు తీవ్రసర్పాంగుఁ డగుచు, దర్పించి కడఁకతోఁ దాఁకి యంగదుని
దనురోమసర్పసంతతుల నొప్పింప, ఘనమైనకడిమి కంగదుఁడు గోపించి
గ్రద్దన లయకాలకాలుఁడై మండి, యద్దైత్యుమస్తకం బఱచేత వ్రేసె
దనుజునిశిరమంతఁ దద్దయుఁ బగిలి, ఘనరక్తధార లొక్కటఁ గ్రమ్ముచుండ
రోషాగ్ను లొలుకుచు రోమసర్పముల, భీషణాకారుఁడై పేర్చి యద్దనుజుఁ
డంగదునంగంబు నంగద వ్రేయ, నంగదుం డధికరోషాయత్తుఁ డగుచు
నసురశిరోమధ్య మతిఘోరముష్టిఁ, బస చెడఁ దాటించి పడవైచి త్రొక్కి

తలఁ ద్రుంచివైచి యుద్ధతిశక్తి వాని, బలువిడి నిర్గతప్రాణుఁ గావించె
భీషణరణకళాభీలు నన్నీలు, రోషించి వృశ్చికరోముండు దాఁకి
ఘనవిషజ్వాల లొక్కటఁ బిక్కటిల్లఁ, దనురోమవృశ్చికతతుల నందంద
యేచి నొప్పింప సహింపక నీలుఁ, డాచేత దానవు నాత్మ గైకొనక
విరథులై రాక్షసవీరులు పర్వ, సురసాలతరువున నురువడి వ్రేసె
వ్రేసిన దనుజుఁ డావృక్షంబు ద్రుంచె, గాసిల్లి విషరోమకంటకాగ్రముల
ద్రుంచిన కనుఁగొని తోరంపుఁగడిమి, కంచితజయశీలుఁ డానీలుఁ డలిగి
ఘోరబాహాశక్తిఁ గుశలుఁడై పేర్చి, భూరిశాఖల నొప్పు భూజంబు పెఱికి
కొనివచ్చి వాని వక్షోవీథి వ్రేసి, యనిమిషు లుప్పొంగ హతజీవుఁ జేసె
భగ్నారివీరుఁ డభగ్నప్రతాపుఁ, డగ్నివర్ణుం డనునతఁ డాగ్రహించి
పడి మహాటవుల దుర్వారతఁ బేర్చి, కడఁగి యుగ్రత నేర్పు కార్చిచ్చుకరణి
నగణితస్ఫుటపర్ణ లంగంబులందు, నిగిడించి కోఁతుల నీఱుసేయుచును
బ్రళయాగ్నియునుబోలి పఱతెంచుచుండ, నలుకమై వీక్షించి యావనీశ్వరుండు
బలిముఖప్రముఖుల పరిభవక్రమము, తిలకించి కరుణావిధేయుండు గానఁ
దలఁపున నోర్వ కద్దనుజునుగ్రతకుఁ, దలయూఁచి దశకంఠుతమ్ముఁ గనుఁగొని
నోవిభీషణ నాకు నూహింపఁ దెలియ, దీవచ్చుచున్న వాఁ డెవ్వఁడో చూడ
నారావణుఁడు పంప నని సేయఁగోరి, ధీరుఁడై యనలుఁ డేతెంచుచున్నాఁడో
వీఁడొకరాక్షసవీరుఁడో కాక, వీఁడెవ్వఁ డేర్పడ వినుపింపు నాకు
ననవుడు దేవ వీఁ డగ్నివర్ణుండు, దనమేనిమంటలు దరికొల్పి వీఁడు
పర్వతంబులనైన భస్మీకరించు, గర్వదుర్వారుఁ డఖండవిక్రముఁడు
అనిన నచ్చెరువంది యర్కవంశజుఁడు, ఘనమైన వానియుగ్రతఁ జూచి యలిగి
వాసవనుతుఁ డంత వరుణాస్త్ర మేసె, నేసిన నది మింట నెడమీఁక నిండి
కప్పురుమేఘంబు-గప్పి యార్భటము, లుప్పొంగ జడివాన లుడుగక కురిసి
యలవేఁడిమంటల నార్చి పెల్లార్చి, ఖలునగ్నివర్ణు నొక్కట నేలఁ గూల్చె
నాలంబులో నప్పు డగ్నివర్ణుండు, గూలుటయును జూచి క్రూరుఁడై పేర్చి
కోపంబు పేర్మి నతుల నిప్పులురులఁ, జూపుల లయకాలసూర్యుఁడై మండి
రాముఁ గనుంగొని రాక్షసేశ్వరుఁడు, రామ నన్నెఱుఁగవే రణమధ్యవీథిఁ
గ్రూరనిష్ఠురవజ్రఘోరదుర్వార, ధారావిదారితోద్ధతకులాచలుఁడు
దేవేంద్రుఁ డుద్వృత్తి దేవసంఘములతో వచ్చి యొదిరినఁ ద్రుంతు నే నాజి
నిన్నేలఁ గైకొందు నీచకాపేయ, సన్నాహమే నన్ను సాధింప నహహా
పదిలుఁడై మగపాడి పాటింతుఁగాక, తుదిముట్ట నన్ను నెదుర్కొందుగాక
త్రోచి శస్త్రాస్త్రపఙ్క్తుల నొంతుగాక, యేచి నీలావు నాకెఱిఁగింతుగాక
యనవుడు రఘురాముఁ డద్దురాత్మకుని, చెనఁటిమాటలు విని చిఱునవ్వు నవ్వి
గంధసింధురము ఘీంకార మాలించి, సింధురాంతకమత్తసింహంబుపోలె
నూరకుండుటయు మహోగ్రుఁడై కినిసి, యారాముతమ్ముఁ డయ్యసురారిఁ దాఁకి

ఘోరనారాచము ల్గురియఁ దద్బాణ,ధారలఁ ద్రుంచి యాతని లెక్కగొనక
యెంతయుఁ ద్రోచి వెల్లేచి లంకేంద్రుఁ, డంతకాకారుఁడై యఱిమి పైఁ దఱిమి
భానుపై నడచు స్వర్భానుచందమున, భానువంశాధీశుపై నప్పు డడరి
దారుణస్ఫుటవజ్రధారానుకారి, నారాచతతుల నన్నరనాథుఁ గప్పెఁ
గప్పిన నప్పుడు కాకుత్స్థుఁ డలిగి, నిప్పులురాలెడు నిష్ఠురాస్త్రముల
నుగ్రుఁడై యేయంగ యుద్ధమధ్యమున, నిగ్రహింపఁగఁజొచ్చె నెఱి రావణుఁడు

దేవేంద్రుఁడు శ్రీరామునకు రథంబుఁ బంపుట

ఆసమయంబున ననియె మాతలికి, వాసవుఁ డారామవల్లభుఁ జూచి
దేవహితార్థమై తివిరి రాఘవుఁడు, పోవక దనుజుతోఁ బోరుచున్నాఁడు
వాఁడె పదాతియై వసుధ నున్నాఁడు, వాఁడు రథస్థుఁడై వ్రాలుచున్నాఁడు
ఎందు లోకోన్నతుఁ డితఁడె దుఃఖముల, డింది యక్కమటికి దిగువ నున్నాఁడు
వేదపల్లవముల విహరించుసౌఖ్య,వేది కర్కశరణవీథి నున్నాఁడు
కమలామనోరథగతుల నున్నతుల, నెమకెడుసుఖి నేల నిలుచున్నవాఁడు
ఇనకులాధిపునకు నీదివ్యరథము, గొనిపొమ్ము వేవేగ కుంభిని కనుడు
ననిలమనోవేగ మగుతురంగముల, గనకదండాబద్ధఘనకేతనముల
మహనీయరుచిరోరుమణికదంబముల, మహితమై బాలార్కమహిమ దీపింపఁ
దనరారురథము మాతలి మహీస్థలికిఁ, గొనివచ్చి వేడ్కతోఁ గుంభిని నిలిపి
యారామునుందట హస్తము ల్మోగిచి, యారూఢబలశాలి యై విన్నవించె
దేవ రాఘవ ధరాధీశ సమస్త, దేవతారాధ్య వందితభక్తసాధ్య
శరచాపకవచాదిసన్నాహరథము, పురుహూతుఁ డిదె నీకుఁ బుత్తెంచినాఁడు
కాకుత్స్థ నీవింకఁ గౌశికునుపుఁ, గైకొని యావజ్రకవచంబు పూని
యాదివ్యరథమెక్కి యాయాయుధముల, నీదుర్మదాంధుని నెదిరి సాధింపు
మేను సారథిగాఁగ నింద్రుండు సకల, దానవావలి గెల్చె ధరణీశ తొల్లి
ననవుడు విని రాముఁ డవ్విభీషణుని, యనుమతితోఁ గూడ నారథంబునకు
వలగొనివచ్చి యుజ్జ్వలతనుప్రభలు, పొలయంగ నీరేడుభువనంబు లలరఁ
జదల నొక్కటఁబర్వ జయజయధ్వనులు, పొదివి శాఖామృగంబులు మిన్నుముట్ట
నురవడిఁ గమలాప్తుఁ డుదయాద్రి నెక్కు,కరణి నారథ మెక్కెఁ గమలాప్తకులుఁడు
నప్పుడు నభమెల్ల నల్లాడుచుండి, యుప్పతిల్లుచునుండె నొండొండ నిండి
శరదభ్రసంఘాభ్రచయసమానములు, గరుడోరగామరగణవిమానములు
సరిచూచుసురలు ఖేచరులు గిన్నరులు, పరమసమ్మదమును భయము నుప్పొంగ
నీపర్వతద్వంద్వ మీయబ్ధియుగళ, మీపావకద్వయ మీనభోయుగము
గదిసెపోఁ బోరాడఁ గదిసెఁబో పోర, నిది సమానస్కంధ మెట్లొకో యనుచుఁ
గంపింప జగము లాకంపింప నిట్లు, కంపింప నిరువాఁగు కంపింపఁ గడఁగి
రణజయోదగ్రులై రామరావణులు, రణజయవ్యగ్రులై రామరావణులు
గదిసినదృష్టి నిర్ఘాతపాతములఁ, జదిసినమెఱుఁగులు చదలపైఁ జెదర

చెలఁగె సేనలవెంట సింహనాదములు, గలఁగె నాకాదిలోకంబు లన్నియును
నామేటివిలుకాండ్రు లన్యోన్యవిజయ, కాములై రణచిత్రగతు లొప్పమెఱయ
దినకరానలకల్పదీర్ఘనిర్ఘాత, ఘనశాతశరసముత్కరపరంపరలఁ
గరములు గళములు కక్షము ల్భుజము, లురములు నిటలంబు లూరులు బరులు
నేసి నొప్పించుచు నిరువురు గడిసి, త్రాసులై దొరసి విత్రాసులై బెరసి
యంపకయ్యము సేయునప్పు డొండొరుల, సొంపు బెంపును దెంపు చూడ నచ్చెరువు
ఫలితవిక్రమసముప్రారంభు లగుచుఁ, దొలఁగక చేతుల దొనలయమ్ములకుఁ
జాచిరి తివిచిరి సంధించి రేయఁ, బూచి నేసిరి పోయెఁ బొమ్మని తెలియ
రాకుండె నప్పు డారామరావణుల, భీకరకరశరాభీలవేగములు
గణనలు క్రమములు గడచి యందంద, రణచండకోదండవిదుండలముల
ప్రేంఖచ్ఛరాంశులఁ బేర్చి పుంఖాను,పుంఖంబు లగుటయుఁ బొంకు గావించి
బాణబాణాసనప్రౌఢులక్షీణ, తూణీరు లేయుచోఁ దొడఁగి యొండొరులఁ
బ్రతిసేసి యొకటికిఁ బదియింటివెనుక, నుతశక్తి దానికి నూఱింటివెనుక
వెనుకొని దానికి వేయింటివెనుకఁ, బనిగొని దానికిఁ బదివేలువెనుక
నడుగక దానికి నొకలక్షవెనుక, మడువక దానికి మఱికోటివెనుక
నేసినశరము మున్నేసినశరము, రాసి యొక్కట దాఁకు రామరావణుల
నలి నప్పు డమరారి నారి సారించి, తలకొని దేవగంధర్వబాణములు
పరువడి నేయంగఁ బఱతెంచుచునికిఁ, బరికించి చూచి యప్పరమాస్త్రవేది
తడయక దేవగంధర్వబాణముల, వడినేసి పొడిసేసె వసుధేశుఁ డంత
నలుకమై రావణుం డారాముమీఁద, బలువిడి రాక్షసబాణ మేయుటయు
మిడిగ్రుడ్లు నిడుదలై మెఱయుకోఱలును, సుడిగొన్నకఱకుజుంజురువెండ్రుకలును
నసదృశోన్నతిభీషణస్థిరకాయములు, బొసఁగ దానవరూపములతోడ నిగుడఁ
గనుఁగొని రఘుకులాగ్రణి యల్క మదిని, దనరంగ వైష్ణవాస్త్రముఁ బ్రయోగించి
తరణిదీధితి నంధతమసంబు నడఁచు,కరణి రాక్షసబాణ గౌరవం బడఁచె
నంత రావణుఁ డురగాస్త్రంబు వింట, నెంతయు సంధించి యేసె నేయుటయు
నామహాబాణమునందు బాణములు, భీమసర్పంబులై పేర్చి యందంద
పదియు నిర్వదియును బండ్రెండు రెండు, పదుమూఁడు మూఁడును బదు నేను నేను
తలలతోఁ దలలపైఁ దళతళరుచులు, గలమహామణులతోఁ గడఁకమైఁ బేర్చి
గరుడవాహనుఁ డని కాకుత్స్థుమీఁద, బరవసంబున వచ్చు పాపదం డనఁగ
జవలనత్స్ఫుజ్జ్వలజ్వాల లెల్లెడల, వెదచల్లుచును వచ్చువిధము వీక్షించి
కాకుత్స్థకులభర్త గారుడాస్త్రంబు, గైకొని సంధించి కడఁక నేయుటయుఁ
గడుకొని గారుడాకారబాణములు, వడినందుఁ బ్రభవించి వసుధ గంపింప
వరపక్షసంఘాతవాతవిధూత, ధరణీధరంబులై తడయక నిగిడి
నడుమన త్రుంచె నన్నాగబాణముల, నుడువీధి సురలుండి యుబ్బొంగి యార్వ
వెండియు నాదైత్యవిభునిపై నగ్ని,కాండంబు నిగిడించెఁ గాకుత్స్థుఁ డలిగి

అది ధూమవిస్ఫులింగాక్రాంతదిశము, నది నిశాదగ్ధసురాధీశవనము
నగుచు నేతెంచు సురారాతి యుగ్ర, మగువారుణాస్త్ర ముద్ధతి నేయుటయును
ఘనసమూహంబు నాకసమెల్లఁ గప్పి, ఘనతర శంపాజాలముల వాన గురిసి
యనలసాయకము పెంపడఁచి గర్జిల్లఁ, గనుఁగొని రాముఁ డాకాండంబుమీఁద
వాయవ్యశర మేసి వారించె దనుజుఁ, డాయెద దంతిముఖాస్త్రంబు పఱప
దానఁ బెక్కగు దంతితతి గళద్బహుళ,దానజంబాలితధాత్రియై కదియ
శ్రీరాముఁడును నారసింహాస్త్ర మేసె, బోరనఁ దద్బాణమున సింహచయము
దారుణతరసటాతాడితసకల, నీరదనివహమై నిజఘోరనాద
చలితదిగ్ద్విరదమై చటులత నిగిడి, కులిశాగ్రనఖములఁ గుంభముల్వ్రచ్చి

◆ రావణుఁడు శ్రీరాములపై శూలము వేయుట ◆

హస్తిసంతతిఁ ద్రుంచె నయ్యెడ సురలు, ప్రస్తుతిచేసి రా పార్థివోత్తముని
గలుషించి యప్పుడు కల్పాంతవహ్ని,తులితమై మంటలు దొలకాడుచుండ
నాలోన లోకభయంకరాకార, శూలంబు గొని రాముఁ జూచి రావణుఁడు
వసుమతి కంపింప వారిధు ల్గలఁగ, దెసల నెల్లెడలఁ బ్రతిధ్వను ల్సెలఁగ
బిట్టులిక్క భూతము ల్బెదరఁ గట్టల్క, దట్టించి సింహనాదముచేసి పలికె
పన్నుగా రాదు యీపటుశూలవహ్ని, నిన్ను నీతమ్ముని నీఱుగావించి
ఘోర నిన్నెదిరించి పోరాడి చన్న, వారినాఁపలబొప్పవారి వారింతుఁ
జూడుము నీవంచు శూల ముంకించి, యోడక రాముపై నుంకించి వైచె
దానిపై రాముఁ డుదగ్రుఁడై కినిసి, వానలు కల్పాంతవహ్నిపైఁ గురియు
పురుహూతుపగిది నచ్యుతశితాస్త్రములు, గురియంగ నది దాన గుదియక వాని
నుఱక నీఱుగఁ జేసి యుగ్రవేగమునఁ, బఱతెంచుగతిఁ జూచి భానువంశజుఁడు
దేవేంద్రుఁ డర్థిఁ బుత్తెంచినశక్తి, వావిరిఁ గైకొని వైచె వైచుటయు
నది నిర్గళద్ఘంటికారావ మగుచు, నది విస్ఫురత్పావకారంభ మగుచు
నది యతిసురఖేచరానంద మగుచు, నది రాక్షసాలోకనాభీల మగుచు
వఱలు మనోవేగవాయువేగమునఁ, బఱతెంచుశూలంబు భస్మంబుచేసె
నప్పుడు రావణుం డలుక చిత్తమున, ముప్పిరిగొనఁగఁ గార్ముకదశకంబు
ధరియించి పేర్చి యుదగ్రుఁడై యార్చి, శరవృష్టి ముంచిన జననాథసుతుఁడు
తానేకకోదండధరుఁడయ్యుఁ దునిమె, హానియస్త్రములెల్ల వారనికడిమి
మదము మత్సరమును మానంబు చలము, గదురఁ గన్నులనిప్పుకలు నివ్వటిల్ల
రావణుఁ డెంతయు రఘురాముమీఁద, వావిరి నమ్ములవానలు గురిసి
కుదియనికోపంబు కొలఁదికి మిగులఁ, బదియింట మాతలిఁ బదియింట హరుల
వికలసత్త్వులఁజేసి విషమాస్త్ర మొకటఁ, బ్రకటంబుగాఁ ద్రుంచెఁ బటుకేతనంబు
విపులచింతాభరవివశులై తూలి, కపులు నాకపులు నొక్కట విన్ననైరి
భువనము ల్కంకించె బుధుఁడు వేధించె, జవమున రోహిణీశకటంబునందుఁ
బటుతర తేజంబు భయదంబుగాఁగ, నట విశాఖకు వచ్చె నంగారకుండు

చటులోగ్రతరభంగి జలధు లుప్పొంగ, నటదూర్మిమాలిక లభ్రమంది పొరలె
నెగయునౌర్వానలనిష్ఠురశిఖలు, పొగలచందముగాఁగఁ బొగయంగఁ దొడఁగె
నుగ్రాంశుబింబంబు సరయుచు వచ్చి, యుగ్రదీప్తులతో మహోల్కలు దుల్లె
నవిరళతరతేజ మటు మ్రానుపడఁగ, రవియును గడు మందరశ్మియై తోఁచె

శ్రీరాముల కగస్త్యు లాదిత్యహృదయ ముపదేశించుట

నలినప్తు డేచి మైనాకంబుపోలెఁ, దలఁకఁగ నందంద దశకంఠుఁ డేయు
శరవేగగతిఁ జూచి జనలోకనాథుఁ, డరుదంది చింతింప నట యగస్త్యుండు
చనుదెంచి యా రామచంద్రు నీక్షించి, విను మహాభుజబలవీర యో రామ
వితతంబుగా నాజివిజయంబుచేయు, నతిగోప్యమగుచున్న యట్టిమంత్రంబు
నెలమితో నాదిత్యహృదయంబు హృదయ, మలర ననుష్ఠింపు మవనీశతిలక
యిమ్మహాజపమున నిప్పుడు నీవు, సమ్మదం బడరంగ శత్రు గెల్చెదవు
ఇది యాయు వొనరించు నిది దుఃఖముడఁచు, నిది సర్వమంగళహేతుభూతంబు
వెలయ సురాసురవినతుఁడై పొల్చు, జలజాప్తుఁ బూజింపఁ జను నీవు నధిప
యీలోకలోచనుం డెల్లలోకముల, జాలరశ్ములు నిండఁ జరియించుచుండు
బ్రహ్మయు విష్ణుండు ఫాలలోచనుఁడు, బ్రహ్మకల్పాదిని భానుఁడై నాఁడు
మది సర్వదేవతామయునిఁగా నెఱిఁగి, కదనంబునప్పు డీకమలబాంధవుని
నెవ్వఁడు కీర్తించు నింపుసొంపార, నవ్వీరునకుఁ గల్గు నాహవజయము
అనుచు నమ్మునివరుం డాశ్రమంబునకుఁ, జనుటయు నాసౌరజప మాచరించి
యప్పు డత్యున్నతుఁడై రాఘవేంద్రుఁ, డుప్పొంగి రావణోద్యోగంబుఁ జూచి
ఘోరావలోకనాగ్నులు మండుచుండ, భూరిధూమ్రాయతభ్రుకుటి నిక్కించి
పెరిఁగి రావణురథాభీలఘోటముల, నురుతరాస్త్రంబుల నుఱక నొప్పించి
పరశరత్రయము రావణులలాటమున, సరిఁ గ్రుచ్చి యురురక్తసంసిక్తుఁ జేసె
నప్పుడు రక్తసిక్తాంగుఁడై చూడ, నొప్పె లంకేశ్వరుం డొగి రామచంద్ర
శరవసంతాగమసమయసంఫుల్ల, తరుణారుణాశోకతరువుచందమునఁ
గుపితుఁడై యంత రక్షోభర్త రాము, విపులవక్షం బేసె వేయిబాణముల
నథమప్రయుక్తంబులై సురద్రోహ,విధి కోసరింపక విషశక్తి మెఱసి
నిర్మలగుణయుక్తి నెఱఁ బెడఁబాసి, ధర్మంబు విడిచి యుద్ధతశక్తి నిగిడి
చనుదెంచి రాఘవేశ్వరుని నొప్పింపఁ, జన నధోగతిగాక సద్గతి గలదె
యనినచందంబున నద్దశాననుని, ఘనబాణములు వచ్చి కాకుత్స్థు గాడి
జగదద్భుతంబుగాఁ జని భూమి దూరి, తగులక నిగిడి పాతాళంబుఁ జొచ్చె
నురుశరక్షతముల నుఱక వెల్లుబ్బి, తొరఁగు నెత్తుటఁ దొప్పఁదోఁగి రాఘవుఁడు
ప్రళయకాలాభీలపావకజ్వాల, లలవుమై నిట్లుండు నన నిండ మండి
మండు దిచ్చఱకంటిమంటలు మింట, నొండొండ పర్వ కాలోగ్రుఁడో యనఁగఁ
జండతేజమునఁ బ్రచండమార్తాండ,మండలకిరణసమానాసమాన
మానితశరపరంపరలోలి పఱపి, మానగర్వముఁ దొంటి మదమును నుడిపి

యనిసేయఁ గాలుసే యాఁడకయుండఁ, దను వెల్ల జర్జరితంబుగాఁ జేయఁ
బర్విడి రఘురాముబాణవేగమున, నిర్విణ్ణుఁడై యుండె నిల్చి రావణుఁడు
దశరథసుతుఁడు ప్రతాపభాస్కరుఁడు, దశకంఠుఁ జూచి యుదగ్రుఁడై పలికె
నేలరా రావణ యిట్లు నిర్విణ్ణశీలుఁడవై యుండఁ జేష్టలు మఱచి
యోడ నెన్నఁడు నని యుగ్రాహవముల, నాడుదు బీరంబు లవి యెందుఁ బోయెఁ
బెరిఁగి మీయన్నఁ గుబేరు గాఱించి, పరునిచందమునఁ బుష్పకముఁ దెచ్చుటయు
మఱి యరణ్యములందు మము డాఁగురించి, చెఱఁగొని లంకకు సీతఁ దెచ్చుటయు
నివి నీకృత్యంబులే దశగ్రీవ, యివి పౌరుషము లని యిందు గర్వింతు
వడఁ బురాకృతదోషవశుఁడవై చిక్కి, పడి నేఁడు నాదృష్టిపథమునఁ బడితి
పడితి గా కింక నీప్రాణముల్గొనక, విడుతునే నిన్నేల విడుతునే లంక
హరిహరబ్రహ్మాదు లడ్డమైరేనిఁ, బొరిఁగొందుఁ బోనీనుఁ బోర సాధింతు
రావణ నేఁడు నీరక్తమాంసములు, సేవింపఁ జేయుదుఁ జెలఁగి భూతములఁ
గష్టచిత్తుఁడ పతికామాతురుఁడవు, దుష్టబుద్ధివి సురద్రోహివి గాన
బదిలమై నిలువక పాఱితేనియును, బొదివి నిన్ జంపుట పుణ్యంబు నాకు
నాసన్నమృత్యుఁడ వైననీతోడ, నీసుమాటలు పల్క నింక నేమిటికి
నీవిక్రమంబును నీభుజాబలము, నీవైభవంబును నేఁడు వాపెదను
గలన నీతమ్ముని ఖరుఁడనువానిఁ, బొలియించు టెఱుఁగవే భువనభీకరుని
నింక నొక్కటి నీకు నెఱిఁగింతు వినుము, శంకింప వలవదు జనకజ నిచ్చి
శరణను కాచెద సమరంబు సేయ, సురజయం బిది నీకు నోటమి గాదు
ఆయువు వరశక్తి నధికంబు పడసి, మాయావిధంబులు మఱి పెక్కులెఱిఁగి
సమరోగ్రశస్త్రాస్త్రసామగ్రి గలిగి, యమరేంద్రుఁ డాదిగా నఖిలదిక్పతుల
మూఁడులోకంబుల మును గెల్చియున్న, వాఁడవీరుని నిన్ను వధియింతు ననిన
మర్కటయూథపు లదిసంతసిల్లి, రక్కతనూభవుం డావిభీషణుఁడు
భూవర జయమును బొందు నీవనఁగ, రావణు వీక్షించి రఘురాముఁ డనియె
నింక నొక్కటి నీకు నెఱిఁగింతు వినుము, శంకింప వలవదు జనకజ నిచ్చి
శరణను కాచెద సమరంబు సేయు, సురజయం బిది నీకు నోటమి గాదు
యనుచున్న రఘురామునత్యుగ్రభాష, లనలార్చులై తన్ను నడరి కాల్చుటయు
నలుకమై నులుకుచు నద్దశాననుఁడు, బలియుఁడు జానకీపతిఁ జూచి పలికె
దురమునఁ గొందఱ దుష్టరాక్షసులఁ, బెరిఁగి జంపితి నని పేర్చెదు కడఁగి
నన్నెఱుంగవు నీవు నాలావుఁగోలఁది, మున్నెఱుంగవు నేను మునుమిడిఁ దొల్లి
యతిలోకకృతులైన యక్షగంధర్వపతుల దేవతల దిక్పతులఁ బెక్కండ్ర
బలువిడిఁ గాఱించి భంగించి నొంచి, చెలఁగి వర్తింతు విశృంఖలవృత్తి
సమబలప్రౌఢి విచారింప కేను, సమరంబులో నిన్ను సరకు సేయుదునె
నిన్ను నీతమ్ముని నేఁ డాజిఁ జంపి, కన్నులపండువుగాఁ జూచి కాని
యీలంకఁ జొర నింక నే నంచు మించి, కాలాగ్నికల్పుఁడై గడఁగి రావణుఁడు

మఱియు నాకసమును నిండ రాఘవుని, బహుదివ్యశస్త్రాస్త్రపంక్తులఁ బొదివె
బొదివినఁ గోపించి భూపాలుఁ డేసెఁ, బొదిగొని ప్రతిబాణములు సహస్రములు
అప్పుడు రఘురాముఁ డధికసంతోష, ముప్పొంగ రెట్టించి యురుపరాక్రమము
చెనఁటియా తాటక జీఁకిననాఁడు, ముని యిచ్చు దివ్యాస్త్రముల మదిఁ దలఁపఁ
దలఁపులోనన వచ్చి తమమూర్తులొప్ప, విలసితజయలింగవిస్ఫులింగముల
నమర దివ్యాస్త్రంబు లవి వెలుంగుటయు, సముచితస్థితి వాని సంధించి మించి
కొండపైఁ బిడుగులు గురియుచందమునఁ, జండత సవ్యాపసవ్యంబు లేసి
తనియక మఱియు నుద్ధతశక్తి మీఱి, ఘనబాణవృష్టులఁ గప్పి నొప్పించి

### రావణుఁడు మూర్ఛిల్లుట

కడఁకమైఁ బోరాడఁగాఁ బోడసూడ, నడుమీఁక దశకంఠు నలిఁ జిక్కువఱిచె
నా రాముశరహతి నవశుఁడై దనుజుఁ, డారథమధ్యంబునందు వ్రాలుటయుఁ
గనుఁగొని భీతుఁడై కాలకేతుండు, గొనిపోయె నరదంబు ఘోరాజి వెడల
సుర లప్పు డెంతయుఁ జూచి యార్వంగఁ, దరుచరయూథము ల్దగ నుత్సహింప
నొలసినలావుమై నొకకొంతవడికి, బలశాలి రాక్షసపతి మూర్ఛఁ దేరి
ప్రథనవిక్రమసముప్రారంభుఁ డగుచు, రథముపై నిలిచి సారథిఁ జూచి పలికె
ఓరి రాముఁడు నన్ను నుఱుకీర్తిఁ ద్రెవ్వఁ, దేరింత యొడదవ్వు దెత్తురే యనిన
నోడినవాఁడవై యుండ నీవగతుఁ, గూడినవాఁడనై కొనిరాక గాదు
రథిసంకటంబు సారథిఁ గన్న చోట, రథము మరల్చుట రణధర్మ మెందు
నటుగానఁ దెచ్చితి ననవుడు వాని, పటువివేకమునకు బలుమాఱు మెచ్చి
పరమసమ్మదమునఁ బసదనం బిచ్చి, సురవైరి యప్పుడు సూతు వీక్షించి
రాముఁ డున్నాఁడదె రణమధ్యవీథి, రామునిరథముపై రథముఁ బోనిమ్ము
నావుడు నరద మన్నరనాథుఁ గదియ, ద్రోవ నక్కాలకేతుఁడు బిట్టు వఱపె
దశకంఠునరద ముద్ధతి రాఁగఁ జూచి, దశరథసుతుఁడు మాతలిఁ జూచి పలికె
నదె రావణునిరథ మరుదెంచుచున్న, దదె మనరథమును నటఁ బోవనిమ్ము
దృష్టి చలింపక తీవ్రబాణముల, దృష్టించి వెఱవక తిరుగుడువడక
వదలక కుదియక వరుసఁ బగ్గములు, పదిలంబుగాఁ బట్టి పఱపు రథ్యముల
మాతలి హయములమనసు నీవెఱుఁగు, దాతతరథవేగ మతివిచిత్రముగ
సారథ్య మొనరింపు సకలంబు నీవు, నేరనియది లేదు నీ కేల చెప్ప
ననవుడు నపసవ్య మగుత్రోవ నాతఁ, డనిమిషారాతిపై నరదంబు వఱప
లోకకంటకుఁడు త్రిలోకభీకరుఁడు, భూకంపముగ మహాద్భుతశితాస్త్రములు
రథముపైఁ గప్పి సారథిఁ జిక్కువఱిచి, రథవాహముల నొంచి రౌద్రంబు మించి
కాండ మొక్కటఁ విల్లు ఖండించి పెక్కు, కాండంబు లేసి రాఘవుని నొప్పించె
నొప్పింప నొచ్చి మనోవీథి నలుక, ముప్పిరిగొన నుగ్రమూర్తియై కడఁగి
దేవేంద్రుఁ డర్థిఁ బుత్తెంచినవిల్లు, వావిరి రామభూవరుఁ డెక్కువెట్టి
నెఱసిన ఘనశింజినీనినాదములఁ, బఱియలై బ్రహ్మాండఖాండంబు వగుల

దానవగర్వాంధతమసం బడంగ, భానుభాసురములై పరఁగు నస్త్రములు
శతములు వేలు లక్షలు కోట్లు మఱియు, శతకోటు లర్బుదసంఖ్యలు గడవ
వాసవప్రముఖగీర్వాణు లుప్పొంగ, నీసున నింద్రారి నేసె నేయుటయుఁ
గడుఁబాపకర్ముండు గష్టుఁ డస్థిరుఁడు, వెడమాయముఁలప్రోగు వీనిలో నునికి
ధర్మప్రయుక్తమైఁ దనరెడి మాకు, ధర్మంబు గా దని తలపోసి రోసి
పోవుపోలిక నుచ్చిపోవుచు నుండు, రావణుఁగొని కాడి రాముబాణములు
ఎడలేదు రావణుం డిలఁగూలు నింక, నడలకుం డిటమీఁద నని ముదం బొదవ
ధరణికి సురలకు ధరణినందనకుఁ, బొరిఁబొరి నెఱిఁగింపఁ బోవుచందమున
నొకకొన్ని ధరణికి నొకకొన్ని దివికి, నొకకొన్ని లంకకు నురవడిఁ బోవు
పావకోగ్రంబులై పరుపడి నిగిడి, రావణుఁ గొనికాడు రాముబాణములు
నెఱసి యుత్తెఱఁగున నిబిడంబు లగుచు, నఱిముఱి జడిగొన్న యంపవానలకుఁ
దెరలక మరలక దివిజారి దివిరి, ధరణీశు నురుశరోత్కరముల నొంచె
ఘనబాణవిక్రమక్రమబాహు లగుచుఁ, బెనఁగి రిబ్బంగి నభేద్యవిక్రములు
సమసత్వ సమవేగ సమబాణవిభవ, సమసమరారంభచతురులై కదిసి
బలముల నేర్పుల బాహుగర్వములఁ, దులదూగి యిద్దఱు దురములోపలను
నెఱసినకినుకలు నిండ నొండొండ, చెఱవిడి పోరాడు సింగంబు లనఁగ
నేడహోరాత్రంబు లెడతెగకుండ, రూఢిఁ బోరాడి రారూఢి విక్రములు
అత్తఱి రావణునరదంబుమీఁద, నెత్తురు వర్షించె నిల్చి మేఘములు
ఘనరథాశ్వములతోఁకల నిప్పు లురిలె, నినరుచిచ్ఛాయ లనేకంబులయ్యె
నిలువవు చచ్చెదు నేఁడు నీ వనుచుఁ, బలికె రావణుఁ జూచి బలసి భూతములు
గెలిచెదు రాఘవక్షితిప నీ వనుచుఁ, వలనొప్ప నాకాశవాణి భాషించె
తనకైన దుర్నిమిత్తము లటు సూచి, యనిమిషారాతియు నాస పోవిడిచి
ధృతిపెంపు దీపింపఁ దివిరి కాకుత్స్థు, నతిశాతశరముల నదరి నొప్పించి
కరవాలములు మహాగదలు చక్రములు, పరిఘులు శక్తులు బ్రాసము ల్వైచె
వైచిన వానిపై వజ్రసన్నిభము, లై చండకాలానలాకృతులైన
సాంద్రార్ధచంద్రాస్త్రచయ మేసి రామ,చంద్రుండు నడుమన చక్కుగావించె
నా రావణుండును నత్యుదగ్రతను, ఘోరనారాచము ల్గురియించె మఱియుఁ
జలమున రాఘవేశ్వరుఁడును వాని, నలినర్ధచంద్రబాణము లేసి త్రుంచె
నారీతి నిరువురు నన్యోన్యసమర,ధీరులై జయకాంక్షఁ దెగి పోరుచుండ
సమరంబులో నద్రిచరనిశాచరులు, దమతమయుద్ధసాధనములు గొనుచు
రణవిచక్షణులైన రామరావణుల, రణకేళిఁ గనుఁగొని రణకేళి మఱచి
పరువడిఁ జిత్రరూపంబులో యనఁగ, నరుదంది చూచిరి యద్దశాననుఁడు
తనచావు నిక్కంబు తా నెఱింగియును, గినిసి రాముఁడు దనగెలు పెఱింగియును
నెంతయుఁ గడఁకతో నిరువురుఁ జలము, లంతకంతకు నెక్కుడై పోరుతఱిని
గనలి కాలానలకల్పుఁడై రోషమునఁ గన్నుఁగవల నిప్పుక లుప్పతిలఁగ

నింద్రారిరథకేతు విలఁ గూల్చె రామ,చంద్రుండు నిశితార్ధచంద్రబాణమున
నారావణుండును నధికరోషమున, ఘోరబాణముల నెక్కొని రథాశ్వముల
మాతలి నేసె నామార్గణనిహతు, లాతఱాంబుజనాళహతులచందమున
నారాఘవేంద్రుని నాతురంగముల, సారథి నొప్పింపఁ జాలకయుండ
హాసంబులును నట్టహాసము లెసలఁగ, వాసిగఁ గపులు రావణుని మార్కొనిన
దరుచరసేనపైఁ దనమాయ మెఱసి, సురకంటకుఁడు మహాశుగవృష్టిఁ గురిసెఁ
గురిసినఁ దద్బాణకోటులచేతఁ, దరుచరు ల్జడిసి ర త్తఱి రామవిభుఁడు
సారథి రథరథ్యసహితుఁగా దైత్యు, భూరిమార్గణములఁ బొదివి నొప్పించె
దశరథసుతునిపై దశకంధరుండు, విశిఖజాలంబుల వృష్టిగా నపుడు
కురిసినఁ గనుఁగొని ఘోరబాణముల, నరుదుగా సంధించి యమరులు వొగడ
నతని నాకాశంబు నవనీతలంబు, నతిరయంబున రాముఁ డమ్ములఁ గప్పెఁ
బగలెల్ల నమ్ములపందిరినీడ, నొగి రాత్రి శరదీప్తి నుడుగక యుండి
తనరుమహేంద్రమందరమహీధరము, లొనరుధైర్యంబుల నొప్పుచందమున
నలిఁ దిరంబై నిల్చి నభముతో నభము, జలధితో జలధియు సరిఁ బోలుకరణి
రామరావణుల సంగ్రామంబుతోడ, రామరావణులసంగ్రామంబె పోలు
ననుటకుఁ దగి మహోదగ్రకోపనులు, దనరార నిరువురుఁ దమకించి పోర
జలదగర్జితధనుర్జ్యాఘోషములను, గలహానిష్ఠురబాణఘట్టనధ్వనుల
జితవర్ష్మసమరోగ్రసింహనాదములఁ, జతురరథాశ్వహేషావిరావముల
నుదధులు ఘూర్ణిల్లె నుల్కలు ల్డుల్లెఁ, ద్రిదశు లుపొంగిరి దిక్కు లల్లాడె
బెగడె భూతంబులు పృథివి గంపించె, దిగిభంబు లూటాడెఁ దిరిగె లోకములు
నగములు వడఁకెఁ బన్నగభర్త దలఁకె, నగణితప్రౌఢి నిట్టిరిమి పోరాడఁ
గడకలు విడిచి యుగ్రతలుద్ది కొంత, తడవిద్దఱును బాహుదర్పము ల్సడలి
ఘనబాణసంధానగతు లుజ్జగించి, కనుఁగొనుచుండిరి కలయ నొండొరులఁ
దెమలిపైవయివ ఘూత్కృతులు నార్పులును, జెమటలవఱదలు చిఱుతహుంకృతులు
నలయికలును ఘటికార్ధానఁ దేరి, మలుగనిచలములు మఱియుఁ బ్రేరేప
నత్యుగ్రనిగ్రహవ్యగ్రులై కదిసి, రత్యంతకాలకాలాంకృతినప్పు

శ్రీరాములు రావణునికరశిరంబులఁ దెగ నేయుంట

డలవుధైర్యంబును నలుక దీపింపఁ, బ్రళయకాలమునాఁటి ఫాలాక్షుపగిది
ఘనశాతకర్కరిక్రకచభల్లంబు, నినవంశవల్లభుం డెసఁగ సంధించి
యరుదరు దనఁ ద్రుంచె నద్దశాననుని, శిరములు పదియును జేతు లిర్వదియు
త్రుంచుట బొంకొకో త్రుంచితి ననుచుఁ, ద్రుంచిన రాముఁ డద్భుతమంది చూడఁ
గరవాలములను ముద్గరభిండివాల, శరచాపకేయూరచయములఁ దనరు
కరము లిర్వదియును ఘనకిరీటముల, శిరములు పదియును జెచ్చెర మొలచె
మొలచినఁ గోపించి మొగిఁ ద్రుంచె మఱియుఁ, దలలు చేతులు పేర్మి దశరథాత్మజుఁడు
తలలుద్దవిడిఁ ద్రుంచుతఱిఁ గ్రింద మొలచు, తలలకిరీటము ల్తద్బాణతతుల

తాఁకి మ్రోయుట చెవిఁ దాఁకకమున్న, తాఁకున త్తలలయుదగ్రహాసములు
తరమిడి త్రెవ్విన తలలోలి మొలవఁ, బరమేష్ఠిచేఁ దొల్లి పడయుచో వరము
గళకరంబులతోడఁ గనుకని మొలవ, బలియుఁడై యీతఁడు వడసెనో యనఁగఁ
దలలొగి మొలతేరఁ దడవఁగుత్తుకల, నలిఁ గాడి రాముబాణము లుండెనోలి
మొగిఁ ద్రెంచుతలలు నమ్ములతోన మీఁది, కెగయఁద్రోచుచు వెస నెగయున త్తలలు
దొంతులకుత్తుక ల్దుర్రించునస్త్రములు, నెంతయు రమ్యమై యొసఁగెఁ జూపఱకు
ఫలితసౌరభరామబాణోత్పలములఁ, గలిపి రావణశిరగళములసంతతులు
రమణమై రక్తధారాసూత్రతతులఁ, గ్రమమొప్ప నెత్తులుగట్టి వేల్పులకుఁ
బొలుపొంద నాకాశపుష్పలావికుఁడు, సొలవక పలుమఱుఁ జూపుచందమున
దనుజాధిపతి గొంతదడవు చూడ్కులకు, నినకులాధీశ్వరుం డేయుచో మఱియుఁ
ద్రెవ్వి రాలెడునెడఁ ద్రెవ్వనితలలు, గ్రువ్వనివేరులై కొమరొప్ప నప్పు
డనిమిషావలియెల్ల నచ్చెరువంది, కనుఁగొన నద్దశకంధరుం డమరె
లలి శిరోమాలికాలంకృతుండైన, ప్రళయావసరఘోరభైరవుపగిది
నావేళ రఘురాముఁ డాగ్రహవ్యగ్రభావుఁడై రణబలప్రౌఢి దీపింప
లక్షించి దృఢముష్టిలాఘవగతుల, దక్షుఁడై రావణుతలలు బాహువులు
ద్రెంచుఁ గ్రమ్మఱ మొలతెంచు వెండియును, ద్రెంచుఁ గ్రమ్మఱ మొలతెంచు నిబ్భంగిఁ
గరములు శిరములు కాకుత్స్థతిలకు, శరపరంపరలచే జటులవేగమునఁ
దెగుటలు మొలుచుట దెలియరాకుండె, నగచరావలికి నయ్యనిమిషావలికి
నాలోన రఘురామునమ్ములఁ ద్రెస్సి, రాలుచునున్న యారావణుతలలు
ఆవులింపవు నొవ్వ వలసముల్గావు, లావుదూలవు నిజోల్లాసము ల్వైదవు
గాజువారవు మిడుకవు రెప్పవేయ, వోజ దప్పవు వైర ముడుగ వెంతయును
బగయొండె బొమముడిపాటొండె నిండు,నగవొండె నార్పొండె నలుకచూపొండెఁ
బలుకొండె మెచ్చొండె బైపడి పోరు, నలవొండె ధృతియొండె హంకృతియొండెఁ
గలుగనితల లేదు ఘనరణభూమి, తలమునఁ బడియున్న తలలలో నొకటి
తలలందు సమములై తలకొనుచుండ, మొలతెంచు తలలందు మొగి నుర్విఁగూలు
దానవాధీశ్వరు తలలు బాహువులు, భూనభోంతరము లద్భుతముగా నిండె
నిండుటఁ గనుఁగొని నిండఁ గోపించి, వెండియు రామభూవిభుఁ డేయుచుండెఁ
ద్రెంచినశిరమును ద్రెవ్వినకరముఁ, ద్రుంచినశిరమును దునిఁగినకరము
బలువడిఁ బుట్టిన బాహుదండముల, నలమి యప్పుడు వట్టి యద్దశాననుఁడు
గణుతింపరాని వేగము లావు మెఱసి, రణరోషదృష్టిమై రాముపై వైచె
నఱిముఱి దశకంఠుఁ డందంద వైవఁ, బఱతెంచుశిరములు బాహుదండములు
గువలయహితవృత్తి కుశలుఁడై కళల, నవిరళాకృతి జగదానందుఁ డగుచుఁ
గమనీయవానరగ్రహమధ్యవీథి, రమణుఁడై యొప్పెడు రఘురామచంద్రుఁ
గని చంద్రుఁ డనుబుద్ధిఁ గమలషండములు, ఘనరాహుకోటులఁ గడఁకతోఁ గూడి
యదరి యన్యోన్యసహాయము ల్వడసి, వడిఁ జేర్చి వచ్చుకైవడిఁ దాఁకుచుండె

శిరములుఁ గరములు నెలఁగి యేతెంచు, వరుసలు పంక్తులు వర్ణింప నొప్పు
శ్రీరామవిజయలక్ష్మీవివాహమున, నారణదేవత లర్థి శోభిల్లఁ
బల్లవరత్నదర్పణతోరణములు, తెల్లమై కట్టిన తెఱఁగు దీపింపఁ
దరిగినతలలు నుద్దామబాహువులుఁ, గురిసెడిశిరములు ఘూకకాకాది
ఖగములు జగము లాకంపింపఁ జేర్చి, గగనమండలమెల్లఁ గలఁగొననిండ
గురుతరంబై జముకొలువుకూటమునఁ, గరముగ్రముగ మేలుకట్లనఁ బరఁగి
యిది దివ మిది రాత్రి యిది సంధ్య యనుట, త్రిదశులకైనను దెలియరాకుండె

## రావణునికరశిరంబులు మరల మొలచుటకై శ్రీరాములు చింతించుట

ప్రథితబాణాసనబాణదీప్తులును, ప్రధనంబులోఁ బట్టుపగలయి తోఁచె
నప్పుడు రఘురాముఁ డాదైత్యుఁ గెలుచు, చొప్పింత యైనను జొప్పడకునికి
గనుఁగొని శరసంధిగతులు సాలించి, తనలోనఁ బలుమఱు దలపోయఁ దొడఁగె
తెరలక శిరములు ద్రెంచి వేసరితి, దొరకొని కరములు ద్రుంచి వేసరితి
నెఱఁగు మర్మములెల్ల నేసి వేసరితి, విసువక పలుమాఱు వ్రేసి వేసరితి
నెబ్భంగిఁ దెగటారఁ డీదుష్టచిత్తుఁ, డెబ్భంగిఁ దెగటార్తు నిద్దురాత్మకుని
ననియని తలపోసి యలయుటఁ జూచి, జననాథుతో విభీషణుఁ డర్థిఁ బలికె
వనజాతజాతుని వరమునఁ జేసి, యినకులాధీశ్వర యీతనినాభి
నమృత మున్నది కుండలాకృతిఁ గలిగి, యమృతత్వమూలమై యది చంపనీదు
దానవుతలలు నుద్దండబాహువులు, మానక నీవెన్నిమాఱు లేసినను
మొలతెంచుచుండు నున్మూలముల్గావు, తలఁకఁడు దీన నద్దనుజవల్లభుఁడు
తఱిమి యిమ్మెయి నీవు తలలు బాహువులు, నఱకుచున్నాఁడవు నరనాథ కడఁగి
తుదియేది దీనికి దొసగొడ్డి నీవు, చదురొప్ప నాగ్నేయశరమేయు మింక
నానాభిమూలమూలామృతం బిగురు, దాన దానవపతి దాన లోఁదారు
నిగిడెడు భవదీయనిష్ఠురాస్త్రములఁ, దెగి మఱి చేతులు త్రిదశారితలలు
దురములోపల నూటతొమ్మిదిమాఱు, లరుదుగా మొలతెంచు నంతటఁ బోలియు
ననవుడు విని లక్ష్మణాగ్రజుం డతని, వినయనయజ్ఞానవిశ్వాసభక్తి
భావశుద్ధికి నాత్మఁ బలుమఱు మెచ్చి, దేవత లుప్పొంగ దివిజారి గ్రుంగఁ
గ్రుంగనిధర్మంబు కొనలుసాగంగఁ, గాగినవదులెల్లఁ గలఁక దేరంగఁ
దేరనిచిత్తంబు దేరి రాఘవుఁడు, ఘోరంబుగా ధనుర్గుణము మ్రోయించి
కనలెడి దీర్ఘనిర్ఘాతము ల్గురియు, ననలాస్త్రమరివోసి యలవొప్ప నేసి
యారావణునినాభియం దున్నయమృత, మారూఢశరవహ్ని కాహుతిచేసి
మఱి నూటతొమ్మిదిమాఱులు ద్రుంచి, తఱికొని రావణుతలలు బాహువులు
నిరుపమాస్త్రంబున నృపకులాధిపుఁడు, పరికింప మఱి నూటపదియవసారి
యొక్కశిరంబును నొగిఁ గరద్వయముఁ, దక్కంగఁ దక్కినతలలు బాహువులుఁ
దెగనేసె నేసినఁ ద్రిదశులు చెలఁగి, రగచరువరులార్చి రందంద పేర్చి
తలలోలిఁ దెగి రక్తధారలు ధాత్రి, నొలుకఁగ దివి కుబ్జ్ఞ నొప్ప రావణుఁడు

లోకహవిర్భాగలోలకీలములు, పైకొని మండెడి ప్రళయాగ్నిపగిదిఁ
దనువున ఘనరక్తధారలు నిండ, దనుజేశుతనువుపైఁ దలయొప్పెఁ జూడ
నరుణారుణచ్ఛాయ లడరు నస్తాద్రిఁ, బరఁగెడి భానుబింబంబుచందమున
నప్పుడు రావణుం డావిభీషణునిఁ, దప్పక చూచి యుదగ్రుఁడై యలిగి
యెవ్వరు నెఱుఁగని యిట్టి నామర్మ, మివ్వసుధేశున కెఱిఁగించె వీఁడు
వీనిఁ ద్రుంచెద నంచు విపులోగ్రశక్తి, పూని వైచుటయు నభోవీథినుండి
యఱిముఱి నిగిడి కాలాగ్నిచందమున, నెఱమంట లుమియుచు నేతెంచుచుండ
నారామవల్లభుం డచలుఁడై ఘోర, నారాచముల దాని నడుమనే త్రుంచె
జడిగొని రఘురామశరవృష్టి పర్వ, యుడుగకుండుటయు నందుండ రాకున్న
వలనేది రాక్షసేశ్వరుకోపవహ్ని, పొలుపరఁ బెడఁబాపి పోవుచందమునఁ
బోయి రావణుదేహమున నున్న తేజ, మాయవసరమున నద్భుతం బగుచు
తలలు చేతులు ద్రెవ్వి దశకంఠుఁడొక్క, తలయుఁ జేదోయునై దర్పించి యపుడు
వీరరసంబును వెల్లిచందమునఁ, దోరమై తొరుఁగు నెత్తుటఁ దొప్పఁ దోఁగి
తడఁబడ నెత్తుటఁ దడిసి రణోర్విఁ, బడియున్న తలలును బాహుదండములు
వానిఁ జంచులఁ జించు వరపక్షిగణముఁ, బూని యొక్కటఁ జూచి భూనాథుఁ జూచి
చఱిగొని తనదైన సటలెల్లఁ బెఱుక, చెఱ విడి వడిమ్రోయు సింగంబుభంగి
నేపారు తనకోఱ లెల్లనుఁ బెఱుకఁ, గోపించి పైఁబడు ఘోరాహికరణి
మీసంబు లూఁచిన మిగుల గోపించి, శాసింపఁ గడఁగిన జమునిచందమున
మెఱసి లోకములెల్ల మ్రింగెడిరీతి, నుఱక కోపించి మహోగ్రుఁడై తొంటి
యన్నిచేతులఁగల యాసత్త్వమెల్ల, నున్నచేతులరెంట నుగ్రమై తోఁప
నాసురవరుఁ డట్టహాసంబుచేసి, ప్రాసతోమరశూలపరశుఖడ్గముల
శరముల సురియల శక్తుల గదల, నురవడి వ్రేసియు నురక వైచియును
బొడిచియు నడచియుఁ బోనీక రాము, నుడుగక నొప్పించి యుగ్రుఁడై యేచి
దేవత ల్భయమందఁ దెగి మహారణము, గావించుచుండె నక్కజమైనకడిమిఁ
గడఁకయు లావును గర్వంబు మిగుల, నడరి ధీరతఁ బోరు నసురారిఁ జూచి
మాతలి భీతుఁడై మఱి రాము ననియె, నీతడ వేటికి నినకులాధీశ
తలలు బాహువులు నిద్దనుజాధిపతికి, మొలచునో క్రమ్మఱ మొలవకమున్నె
యెడపక బ్రహ్మాస్త్ర మేసి యీనీచుఁ, బడవైతు కాక దోర్బలశక్తి మెఱసి
యనవుడు విని రాముఁ డభిరామబలుఁడు, వినుతవిక్రమభుజావిభవనిర్భరుఁడు
విదితమా శస్త్రాస్త్రవేది గావునను, నిది వేళ బ్రహ్మాస్త్ర మెత్తంగ ననుచు
భూదేవదేవ తపోధనువేద, వైదికకర్మప్రవర్తనఁ దలఁచి
తనప్రతాపంబును దర్పంబు మెఱసి, ధనువు మ్రోయించుచు ధరణి గంపింపఁ
గౌశికకృతమైన క్రతువేళఁ దనకుఁ, గౌశికుఁ డిచ్చినఁ గైకొన్నయట్టి
యక్షయబ్రహ్మాస్త్ర మప్పుడు దలఁచి, దక్షత వేదమంత్రములతోఁ బుచ్చి
తిరముగా నరివోసి తెగ నిండఁ దిగిచి, పరఁగఁ బ్రత్యాలీఢపాదుఁడై నిలిచి

దేవేంద్రుఁ డాదిగా దివిజు లుప్పొంగ, దేవారియురముపై దృష్టి సంధించి
యేసె నేయుటయుఁ బెల్లేచి యాబాణ, మాసురాలోకకీలాభీల మగుచు
వసువులు కెలఁకుల వనజాతమిత్ర, వసువు లగ్రంబున వసురత్నతతులు
పిఱుఁదు ముందఱ మహాపృథులమారుతము, గరుల నుజ్జ్వలదివ్యకళ లెల్లకడల
సహజంబులై పేర్చి సంతతామోఘ,మహితమై దేదీప్యమానమై సకల
శాఖామృగాభీష్టసఫలమై చతుర, లేఖావలోకనాలీఢమై నిగిడి
నిలువక విలయాభ్రనిర్ఘోషఘోష,ములు పర్వ రాక్షసముఖ్యులు బెదర
జయజయధ్వనులతోఁ జదలు గ్రక్కదల, రయమున రావణోరస్థలిఁ గాఁడి

రావణుఁడు బ్రహ్మాస్త్రముచేఁ మడియుంట

యయ్యింద్రయమవరుణాదులచేత, వ్రయ్యనిమర్మము లవ్రిచ్చి రావణుని
ప్రాణముల్గొని యుచ్చి పాఱె యాదివ్య, బాణంబు వెస మహీభాగంబు గాఁడి
నీరూఁతు జెఱఁపెట్టి నీచభావమునఁ, గైకొనఁ దలఁచిన ఖలునిప్రాణములు
కైకొంటి నే నని కదిసి భూస్థలికిఁ, బ్రాకటంబుగఁ జెప్పఁ బఱచెనో యనఁగ
మహి గాఁడి పఱతెంచి మగిడి రాఘవుని, మహితతూణీర మున్నదవృత్తిఁ జొచ్చె
నలి బ్రహ్మమనుమని నాటిచంపుటకుఁ, గలిగినదోషంబు గడ తేర్చుకొనఁగ
నేచందమున నెందు నితరంబు లేమి, చూచి రాఘవుమర్వు సొచ్చెనో యనఁగ
రాఘవాస్త్రాక్షతరక్తాంబుధార, లోఘంబులై పర్వ నొరయుచు వచ్చి
కులిశధారాహతిఁ గుంభినిఁ గూలు, కులశైలమునుబోలెఁ గూలె రావణుఁడు
ఆదైత్యభూరిదేహాతిపాతమున, భూదేవి యప్పు డద్భుతముగాఁ గ్రుంగెఁ
గ్రుంగెఁ శైలంబులు గ్రుంగెఁ దిక్కరులు, గ్రుంగె భుజంగంబు గ్రుంగెఁ గూర్మంబు
దలఁకిరి సప్తపాతాళవల్లభులుఁ, దలఁకిరి హతశేషదనుజపుంగవులు
గిరిచరులార్చిరి కీర్తించి రమర, వరులు కిన్నరులు దిగ్వరులు ఖేచరులు
ఆరఘురాముపై నప్సరస్త్రీలు, బోరనఁ గురిసిరి పుష్పవర్షములు
దివ్యదుందుభులును దివ్యకాహళులు, దివ్యశంఖంబులు దివినిండ మ్రోసె
శీతలపరిమళాశ్లిష్టవాయువులు, వీతెంచె దిక్కులు విమలంబు లయ్యె
సురమునిఖేచరశోకంబు డించి, పరికించి సకలభూభారంబు డించి
యభిమతజయశీలుఁడై పేర్చి రామ,విభుఁ డంతఁ దనచేతివి ల్లెక్కుడించి
యానందమయచిత్తుఁ డగుచు నవ్విల్లు, జానకీవిభుఁడు లక్ష్మణుచేతి కిచ్చె
సకలవానరులును సకలఖేచరులు, సకలదిక్పతులును సకలభూవరులు
సకలభూతంబులు సకలదేవతలు, సకలలోకంబులు సన్నుతిసేయ
ననిమొన గర్వాంధు నంధకాసురునిఁ, దునుమాడి విలసిల్లు ధూర్జటివోలె
రాముఁడు లోకాభిరాముఁడై విజయ,ధాముఁడై నవసుధాధాముఁడై యొప్పె
నంత విభీషణుం డధికశోకమున, సంతాపమందుచు సమరమధ్యమున
నలఘుఁడై పడియున్న యగ్రజుఁ జూచి, పలుమఱు నెలుగెత్తి పలవింపఁదొడఁగె
నాహావోదగ్రసురాసురభయద, బాహులు పక్షులపాలయ్యె నేఁడు

సురుచిరమృదుతల్పసుభగదేహంబు, పరుషసంగరభూమిఁ బడియెనే నేఁడు
అహితాంధకారబాలార్కబింబములు, మహిఁగూలెనే నేఁడు మణికిరీటములు
వినయవిక్రమనయవిఖ్యాతులందు, నినుఁ బోల రెవ్వరు నీయంతవాఁడు
కడపట నరయంగఁ గష్టుండు ఖలుఁడు, బెడిదుండు వీఁడనఁ బృథివి నేర్పడితి
తప్పుట తప్పని తలపోయవైతి, చెప్పినమాటలు చెవిఁ బెట్టవైతి
వెమ్మెయి నయమార్గ మెఱుఁగలేవైతి, విమ్మన్న జానకి నీనేరవైతి
మంతనంబున రాము మర్త్యుఁగా నీవు, చింతింపవలదన్నఁ జేకొనవైతి
నీమానగర్వంబు నిన్నింతచేసె, నేమని శోకింతు నేనింక నీకు
వలదు రామునితోడి వైరంబు విడువు, చలమొప్ప దని నీకుఁ జాటనే తొల్లి
నిరుపమనయనిధీ నీయట్టిసుకృతి, పరసతిఁ దల్లిఁగా భావింప వలదె
జగతిలో తగవు విచారింపవైతి, తగిలి నామాటలు తలకూడె నేఁడు
అని యని శోకించు నన్న నేరములు, మనమునఁ జింతించు మఱియు శోకించు

### మందోదరి మొదలగు రావణునిభార్యలు శోకించుట

నంత మందోదరి యాదిగా దనుజకాంతలు గూడి లంకాపురి వెడలి
యడుగులకెంజాయ లవనిపై నొలుకఁ, దడఁబడి మేఖలాదామము ల్వడల
నఱికొను లసియాడ నలసయానములు, మెఱయు లోయలతల మెయిదీఁగె లులియ
హారము ల్తెగి రాల నశ్రుపూరములు, తోరంబులై యొల్కఁ దొల్కఁగఁ బయ్యెదలు
వీడినవేణులు వెన్నులనొరయ, వాడినమోములు వఱువట్లు గట్ట
మొకములు దలలును మొగిమోఁదికొనుచుఁ, బ్రకటరోదనములు బహువిలాపములుఁ
గుదియఁగ రోదసీకుహరంబు నిండఁ, గదిరెడిశోకాగ్నిఁ గాలుచు వచ్చి
విఱిగినరథములు వికలభావములఁ, బఱియలై యున్న కపాలకుంభములఁ
దునిసినచేతులు తునియలై పడిన, తనువులు నుఱుమైన దంతిదంతములుఁ
జిదిసినతలలు విచ్ఛిన్నంబులైన, గదలును బొడియైన ఘనకంకణములుఁ
దెగినగుండియలును దృఢమస్తకములుఁ, బగిలినగళములు భగ్నశస్త్రములుఁ
బ్రేవులప్రోవులు పిశితఖండములు, జీవము ల్విడిచియుఁ జెలువొందుకపులు
హయములు చిద్రుపలు నద్రిశృంగములుఁ, బయిఁబయిఁబడిన కబంధబృందములు
నిలువక పాఱెడి నెత్తురుటేర్లు, కలిసి మెండుగఁ బాఱు కరటితుండములు
నడ్డంబు నిడుపునై యద్రులక్రింద, గ్రుడ్డులు వెలికుర్కి కూలినభటులు
చేకొని శవములఁ జిట్టుముట్టాడు, కాకఘూకానేకకంకగృధ్రములు
రామశరక్షతరక్తపానములు, సోమపానము లని సోలుభూతములు
రామునిఁ గికురించి రాక్షసేశ్వరుఁడు, భూమిజఁ దెచ్చుటఁ బోగడుభూతములు
శిరములు పదియును జేతులిర్వదియు, నరుదార నొకరిత్త యట్టుఁ బొందించి
దైతేయకులనాథ తగదు రామునకు, సీత నిమ్మని బుద్ధి చెప్పుభూతములు
కోఁతిబొందులు సొచ్చి కోఁతులై వచ్చి, బ్రాఁతైన కరటికబంధముల్ దెచ్చి

వడిఁ బేర్చి ఘనరక్తవార్ధిలో ముంచి, గడకఁతో సేతువుఁ గట్టుభూతములు
నారాయణుఁడ నేను నాకులు మీరు, మీరు రాక్షసు లని మేరలు చేసి
పనివడి కరటికబంధముల్ దెచ్చి, ఘనతఁ బ్రేవులు శేషుగాఁ జేసి చుట్టి
కోరి రక్తాబ్ధిలోఁ గొని తెచ్చి వైచి, ధీరత మించి మర్దించుభూతములు
మా రాముబాణనిర్మథితమాంసముల, కీరాదె నీసాటి మేల యిచ్చెదవు
పొలవక మేఁకనంజుళ్లఁడు ననుచు, వలినింద్రుదెసఁ జూచి నవ్వు భూతములు
మదిఁ జేవగలిగి కుమారతారకులు, గదిసిన సంగరాంగణముఁ జూచితిమి
అదయులై విషకంధరాంధకాసురులు, గదిసినసంగరాంగణముఁ జూచితిమి
త్రిదశేంద్రవృత్రులు దెగువమై మెఱసి, కదిసినసంగరాంగణముఁ జూచితిమి
ఈమాంసఖండంబు లీకబంధంబు, లీమహారక్తంబు లీవింతచవులు
పొడగాన మేమని పొంగి యొండొండ,నడరుచుఁ దొడరుచు నాడుభూతములు
రవికులాధిపుఁడైన రామువిక్రమము, తివుటమైఁ గడఁగి కీర్తించుభూతములు
ఈరామవిక్రమం బేటివిక్రమము, ఘోరాహవంబులు కోటులు సలిపి
వరమాంసరక్తప్రవాహము ల్వఱపి, పరితృప్తి గావించు పఙ్క్తికంధరుని
వని మొనఁ దెగటార్చె నాచవు లింక, మన కెందుఁ గల వని మఱుఁగుభూతములు
ఉరురథధ్వజదండయుగళము ల్నిలిపి, పొరిఁబొరిఁ బ్రేవులు పొందొంద ముడిచి
పరమసమ్మదమునఁ బ్రమదలుఁ దారు, సరసడోలాకేళి సలుపుభూతములు
ఎమ్ములు నమ్ములు నెడలుగఁ ద్రోసి, యిమ్మైనచోటుల నెడగల్గ నిలిచి
ప్రియమొప్పఁ బ్రియులును బ్రియలను గూడి, ప్రియరక్తపానసంభృతకేళిఁ దేలి
చెలువొప్ప రాముఁడు సీతతోఁ గూడి, వెలయుఁగాకంచు దీవించుభూతములు
కలిగి భయంకరాకారమైయున్న, కలహాంగముఁ జొచ్చి కడుచోద్యమంది
పనవుచు నేడ్చుచుఁ బతిఁ జేరుకొనుచుఁ, జనుదెంచి యందు రాక్షసవధూజనము
తునిసి నెత్తుటఁ దొప్పఁదోఁగినకేలు, తనుపారు కిసలయతల్పంబుగాఁగ
సకలంకతరములై యడరి పైఁబర్వ, మకుటరత్నారుణమండలప్రభలు
తనుఁ బెక్కుగప్పినఁ దద్దయు నొప్ప, ఘనధాతువస్త్రనికాయంబు గాఁగ
ననివడఁ బర్వి సర్వాంగంబులందుఁ, దలకొన్న మెదడు చందనచర్చ గాఁగఁ
జతురసంఘట్టనజాతాస్థిరజము, ప్రతిలేని పుష్పపరాగంబు గాఁగఁ
దాలసముత్తాలదండము ల్విరిగి, వ్రాలి తూఁగాడెడు ధ్వజములఁ గ్రాలు
కోమలమృదులదుకూలఖండములు, వేమఱుఁ బైవీచు వీవనల్గాఁగ
నంతంతఁ జొట్టును నవనిపై నున్న, దంతావళోరుముక్తాఫలావళులు
వరుసతో బడిసిపో వైచినఁ జెదరి, కర మొప్ప మల్లికాకళికలు గాఁగ
నరుదుగాఁ బర్విన యా రామచంద్రు, శరచంద్రికలచేత సంతాపమంది
వీరలక్ష్మీఘనవిరహాగ్నిఁ గ్రాఁగి, ధారణిఁ బడియున్న దశకంఠుఁ గనిరి
కని యంత శోకాబ్ధికరడులఁ దేలి, దనుజేశుపైఁ బడి దానవాంగనలు

బల్లవహస్తలుఁ బల్లవాధరలు, పల్లవారుణపాదపల్లవోజ్జ్వలులు
హరిమధ్యసమమధ్య లమృతాంశుముఖులు, కరిరాజగమనలు కమలలోచనలు
అలినీలకుంతల లంబుజగంధు, లెలదీఁగఁబోఁడు లింపెక్క నందంద
కై సేసి చనుదెంచి కామినీమణులు, ప్రాసాదగోపురప్రతతులందుండి
పుణ్యావలోకనంబులఁ బుణ్యసతులు, పుణ్యపుష్పాక్షతంబులు చల్లుచుండ
మేడలపైనుండి మీనాక్షులోలిఁ, బ్రోడలై తమతమ బోటులతోడ
నీసునఁ బిన్ననాఁ డీపుణ్యధనుఁడు, చేసినచేఁతలు చెప్ప నచ్చెరువు
తమ నెదిర్చినమాత్రఁ దాటకఁ జంపె, ననఘుఁడై కౌశికుయాగంబు గాచె
సర్వశంకరుమహాచాపంబు విఱిచె, దర్పించి జమదగ్నితనయు భంగించె
నహితలోకాంతకుం డంతటిపనులు, సహజశూరుఁడుగానఁ జనఁజేసెఁ గాక
అమ్ముద్దుప్రాయంబునందుఁ గానలకుఁ, బొమ్మన్నఁ దపసియై పోయె వేడుకను
పోయి జగద్ధితపుణ్యకృత్యములు, సేయ నెవ్వఁడు చాలుఁ జేవ దీపింప
వనధి బంధించి రావణుఁ బోరఁ ద్రుంచి, దనుజులఁ బెక్కండ్ర ధరణిపైఁ గూల్చెఁ
దనతండ్రిపనుపునఁ దవిలి కానలకు, మునివృత్తిఁ జనునాఁటి ముద్దుప్రాయంబు
లీపెద్దచందంబు లెన్నిచందములఁ, దీపించుచున్నవి తెలియఁ జూచితిరె
పర్జన్యు నవలీల భంజించి మరలఁ, దర్జించి భుజశక్తి దర్పించినట్టి
యామేఘనాదు సుగ్రాజిలోఁ జంపె, సౌమిత్రిఁ గంటిరే చపలాక్షులార
పడఁతి రావణుఁ డతిపాపాత్ముఁడైన, విడిచి లంకాపురివిభుఁడయ్యె నితఁడు
వనజాక్షి యీతఁడు వాలి సోదరుఁడు, వనిత యీపుణ్యుండు వాలినందనుఁడు
తడయక యంబుధి దాఁటి యాసీతఁ, బొడఁగాంచి వచ్చిన పుణ్యాత్ముఁ డితఁడు
కలకంఠి యవలీలఁ గడలి బంధించి, నలిలంకపై రాము నడపించె నితఁడు
నీరేరుహానన నిఖిలౌషధములఁ, బోర లక్ష్మణుప్రాణములు దెచ్చె నితఁడు
అని తన్నుఁ దమ్ముల నసురను గపులఁ, గొనియాడుచును జెప్పికొనుచుండ వచ్చి
నగరు ప్రవేశించె నలినాప్తకులుఁడు, జగదేకనిధి రామచంద్రుఁడు తాను
భరతశత్రుఘ్నులఁ బనిచి దైత్యేంద్ర,తరుచరపతులను దగుమందిరముల
విడియించి యిష్టాన్నవివిధభోజ్యములు, కడఁకతోఁ బుత్తెంచెఁ గారుణ్యమొప్ప
సురుచిరమతి నంత సుగ్రీవుతోడఁ, బరమసమ్మదమున భరతుఁ డిట్లనియె
నెల్లి రే పభిషేక మినవంశనిధికి, నెల్లతెఱంగు లాయితముచేసితిమి
సంగతిఁ జతురబ్ధిజలములు వలయు, గంగాదితీర్థోదకములు దేవలయుఁ
దెప్పింపు మనవుడు దిననాథతనయుఁ, డప్పుడు పరమహర్షానందుఁ డగుచు
వలనొప్ప గజు జాంబవంతు సుషేణు, నలఘువిక్రమువేగుఁ డగువేగదర్శిఁ
గమనీయనవరత్నకలశంబు లిచ్చి, క్రమమునఁ దీర్థోదకములు తేఁ బనిచె
నలుగవాతునివాయునందను ఋషభుఁ, గలయసముద్రోదకములకుఁ బంచె
బనిచినఁ గడిమిమైఁ బ్లవగవల్లభులు, వినువీథి నత్యంతవేగులై పోయి

## శ్రీరాములపట్టాభిషేకము

యరవడి మఱునాఁటియుదయకాలమున, గరుదరుదనఁ దెచ్చి రఖిలోదకములు
చేతోవినిర్మలశిష్టు వసిష్ఠు, గౌతముజాబాలి కశ్యపు కణ్వ
వామదేవాదులౌ వరమునీశ్వరుల, సామాదిబహువేదచతురంబోధకుల
భరతుండు రప్పించి భయభక్తులొప్పఁ, బరమసమ్మదవచోభంగుల మెఱసి
శ్రీరామునకు నభిషేకంబు సేయుఁ, డారూఢనియతితో నని పల్క వారు
పూని మంగళతూర్యములు మ్రోయుచుండ, జానకీరాములఁ జదురొప్పఁ దెచ్చి
రమణీయతరమైన రత్నపీఠమునఁ, గొమరొప్ప నిరువురఁ గూర్చుండఁ బనిచి
మానితవేదోక్తమంత్రపూర్వకము,గా నభిషేకంబుఁ గరమర్థిఁ జేయ
నారామునొదల నాపూర్ణవారి, ధార డగ్గఱునప్పు డగఁ జూడ నొప్పె
గీర్వాణముఖ్యులు కీర్తనల్సేయఁ, బార్వతీసహితుఁడై ప్రణుతింప నొప్పు
నంగజహరుమౌళి నమలమై తొరఁగు, గంగానదియుఁబోలెఁ గమనీయ మగుచు
నాతీర్థజలధార లంఘ్రులకొలికి, భూతలంబున నిండి పొలుపారెఁ జూడ
హరిపాదమునఁ బుట్టి యయ్యాదిగంగ, ధరపైనఁ బరఁగువిధం బచ్చుపడఁగఁ
బరికించి రామభూపాలకుం డపుడు, హరుఁడు విష్ణుఁడు దాన యనుమాడ్కి నుండె
మఱి పట్టభద్రుఁడై మనుజవల్లభుఁడు, నెఱసెఁ బట్టముతోడి నిటలంబుతోడ
సరసజటారుణచ్ఛాయల మూని, కరమొప్ప శశిరేఖగంగవీచికల
సరిదాఁటి నుదుటికి జాఱిన నొప్పు, హరునిచందంబున నలరెఁ జూపఱకు
గరుడవియచ్చరగంధర్వపతులు, సురసిద్ధసాధ్యులు సొరిదిమై నపుడు
చదల నుత్సవపటుజయజయధ్వనులఁ, గుదియక యందంద ఘోషించి రెలమి
నప్పు డచ్చరలొలి నాడిరి ప్రీతి, నప్పుడు పుత్తెంచె సమీరవల్లభుఁడు
పారిజాతామలప్రసవమాలికయు, హారంబుఁ బ్రియమున ననిలునిచేత
నమితమంగళమూర్తి యయినరాఘవుఁడు, గొమరొప్ప వానిఁ గైకొనియె వీక్షించి
వసుధ యెంతయు సస్యవతియయ్యెఁ బ్రీతిఁ, గుసుమఫలంబులు గొమరొప్పెఁ దరుల
ఘనగంధబంధముల్గలిగెఁ బుష్పముల, వినుతింప దిక్కులు విమలంబులయ్యె
నప్పుడ రఘురాముఁ డక్షీణవిభవ, మొప్ప భూసురులకు నున్నతాత్ములకు
ననుపమతరభక్తి నంతరంగమునఁ, గొనకొన ముప్పదికోటులధనము
లక్షగుఱ్ఱంబుల లక్షయుష్ట్రముల, లక్షగోవుల నిచ్చె లలి సొంపుమీఱ
లలితదివ్యాంబరాలంకారతతులు, పొలుపొందు కాంచనపుష్పమాలికయుఁ
గొలఁదిమీఱిన ప్రియోక్తులఁ జేరఁ బిల్చి, యెలమి సుగ్రీవున కిచ్చెఁ బెంపొంద
ఘనవజ్రవైడూర్యకలితాంగదంబు, ననఘుఁ డంగదునకు నర్థితో నిచ్చె
మహితోరుకేయూరమకుటంబులొప్ప, సహజపుణ్యుఁడు విభీషణునకు నిచ్చె
నమితబలోదాత్తుఁ డగువాయుజునకుఁ, గమనీయరత్నకంకణయుగం బిచ్చె
నాలోలరుచినిచయానూనమైన, నీలహారముఁ బ్రీతి నీలున కిచ్చె
వెలనొప్పు నవరత్నవరహార మొకటి, నలునకు నిచ్చె నానంద ముప్పొంగ

నంబరమణిభూషణాదివస్తువులు, జాంబవంతుని కిచ్చె సమ్మదం బొదవ
నభిమతవేది యై యందఱఁ జూచి, విభుఁడు వానరులకు వీరు వా రనక
ప్రకటదివ్యాంబరాభరణమాల్యంబు, లకలంకమహిమతో నందఱ కిచ్చె
శారదనిర్మలచంద్రికానూన,హారంబు సీతకు నర్థితో నిచ్చె
ధరణిజ హారంబుఁ దానుఁ గైకొనుచుఁ, గరముల ధరియించి కాకుత్స్థమోము
చూచెఁ జూచుటయును సుదతి చూపెఱిఁగి, యాచతురాత్మకుఁ డనుమతించుటయుఁ
దనకృపారసధారదనరునాహార, మనిలజుకంఠంబునం దొప్పఁ బెట్టె
నానిర్మలోదారహారంబుఁ బూని, యానిర్మలాత్మకుఁ డనిలనందనుఁడు
శారదాభ్రావలి సరిఁ జుట్టియున్న, మేరువు తెఱఁగున మెఱసెఁ జూడ్కులకు
నంత వసిష్ఠునియనుమతి రాముఁ, డంతఃపురంబున కరిగి తల్లులకు
వరుసతో మ్రొక్క దీవన లిచ్చి రపుడు, ధరణీతనూజ యత్తలకెల్ల భక్తి
చెలఁగంగ మ్రొక్కిన శ్రీదేవిఠేవ, నలసరస్వతిభాతి నగజాతరీతిఁ
బతిభక్తిమతియు సౌభాగ్యంబుకాంతి, యతులకీర్తియును బెం పలరంగఁ గలిగి
యినచంద్రులనఁ గాంతి నెరయుపుత్రులును, గనుము నీ వని ప్రేమఁ గౌఁగిటఁ జేర్చి
దీవింప రఘుకులాధిపుఁడు వేడుకలు, గావించు భోజనాగారంబునకును
జనుదెంచుహితులను సకలబాంధవుల, ననుజుల రవిజాదు లైనవానరుల
నావిభీషణముఖ్యు లగుదైత్యవరులఁ, బావనాత్మకు గుహుఁ బరఁగ రావించి
యుచితాసనమునఁ గూర్చుండఁగఁ బనిచి, సుచరిత్రు నంజనాసూనునిఁ దనదు
పొత్తుల వేడుక భుజియింపు మనియె, నత్తఱిఁ జాల నెయ్యము దియ్య మమర
నెనయంగ నవ్వేళ నెలఁతలు దెచ్చి, కనకపళ్లెరములఁ గ్రమ మొప్ప నునిచి
పరఁగఁ బాయసము సూపములుఁ బూపములు,వరుగులు వడియము ల్వాంఛఁ బుట్టించు
కూరలు పచ్చళ్లు కోరొందుశిఖర, లూరుగాయలును శాల్యోదనం బొప్పఁ
దనరఁగ సద్యోఘృతము వింతరుచులఁ, బెనుపొందుఫలములు పేర్మితో నిడఁగ
నినకులాధీశ్వరుం డింపు రెట్టింప, ననిలజ భుజియింపు మనుచుఁ దా నొక్క
కబళంబుఁ గొనిన నాకపికులోత్తముఁడు, ప్రబలమౌభక్తి నప్పళ్లెరం బెత్తి
తల మీఁద నిడుకొని తనర నాడుచును, జెలఁగుచు నోకపిశేఖరులార
రండు రామునిపళ్లెరము ప్రసాదంబు, దండిగా దొరకె నందఱకు నేఁ డనుచు
మునివృత్తి మెక్కి యిమ్ముల దానిదళము, లనువొందఁగాఁ ద్రుంచి యాప్రసాదమున
నొనరించి సంతోష ముల్లంబు నిండ, ఘనభక్తి నొసఁగె నాకపినాయకులకు
వారును దానును వాంఛలు దీర, నారూఢిఁ దృప్తులై రాప్రసాదమున
ననిశంబు నదిమొద ల్హరిహాసరముల, మునివృత్తిపర్ణము ల్ముఖ్యంబు లయ్యె
నంత నారఘురాముఁ డంజనాసుతుని, సంతతభక్తికి సంతోషమంది
పరమైన వేఱొకపళ్లెరంబునను, ధరణీశ్వరుండును దగ భుజియించి
జలముల నొగివార్చి జతనంబు మీఱ, లలితసుగంధమాల్యము లొప్ప ముడిచి
కర్పూరతాంబూలగంధాక్షతముల, నర్పింప దయ మీఱ నందఱఁ జూచి

యినకులోత్తముఁ డిచ్చె నెల్లవస్తువులు, మనమార నప్పుడు మహిమ దీపింప
సకలభృత్యామాత్యసహితుఁడై వేడ్క, నకలంకచిత్తుఁడై యటఁ గొలువుండె
నప్పుడు సౌమిత్రి ననురక్తితోడ, నొప్ప నిద్రాదేవి యొగిఁ బొందుటయును
గొలువులోపలను గాకుత్స్థునియెదుటఁ, గలకల నవ్వినఁ గమలాప్తకులుఁడు
జనకజయును విభీషణుఁడు సుగ్రీవుఁడును మారుతాత్మజుఁడును వాలిసుతుఁడు
నలనీలశరభసన్నాథతారాది, బలిముఖుల్శత్రుఘ్నభరతులు భీతిఁ
దలలు వాంచిరి యప్డు తమయందుఁ జెంది, లలి మీఱినట్టి కళంకము ల్దలఁచి
యందఱు నట్లుండ నలుక చిత్తమునఁ, జెంద లక్ష్మణుఁ జూచి శ్రీరాముఁ డనియెఁ
దగవు వోవిడిచి యాస్థానంబునందు, నగుటేమి నిష్కారణముగ సౌమిత్రి
అనవుడు భయమంది యాలక్ష్మణుండు, తనకరంబులు మోడ్చి తగ నిట్టు లనియె
వనవాసమునకు దేవరఁ గొల్చి వచ్చి, వనముల నున్నచో వచ్చెఁ జూ నిదుర
వచ్చినఁ బదునాల్గువత్సరంబులకు, నచ్చుగాఁ జేరకు మన నిద్ర చనియెఁ
బదునాలుగేండ్లను బరఁగ నిండుటయు, వదలక యిప్పుడు వచ్చెఁగా నిద్ర
యది కారణంబుగా నవనీశతిలక, యిది యేను నవ్వితి నిదియె నాతప్పు
నీవు సహింపుమో నిఖిలాధినాథ, దేవదేవేశ యో దీనమందార
యనవుడు సంతోషమంది రందఱును, ననుమానములు వాసి యలరి రెంతయును
నిర్మలకారుణ్యనిధి రాముఁ డంత, నర్మిలి నిండార నందఱఁ జూచి
యెల్లతెఱంగుల నెట్టికార్యముల, నెల్లధర్మంబుల నేమఱ కెపుడు
గొనకొని చేయుఁడీ కోర్కి దీపింప, ననువొంద ననుచు నత్యాదరం బొప్పఁ
బొండని కడఁకతో బుద్ధులు గఱపి, యొండొండ ప్రియముల నూఱడఁ బలికి
యనిలజసుగ్రీవు లాదిగాఁ గపుల, దనుజపుంగవుల నత్తఱి వీడుకొలుప
కిష్కింధ కెలమి సుగ్రీవాదికపులు, నిష్కళంకాత్ములై నెమ్మితోఁ జనిరి
చనియె లంకకు విభీషణుఁ డర్థిఁ దన్ను, దనుజులు గొలువ నుత్సవకేలిఁ దేలి
రాముఁడు మఱియావరాజ్యంబునందు, సౌమిత్రిభరతులఁ జతురమానసులఁ
దగఁ బ్రతిష్ఠించి యాతతరాజ్యభూతిఁ, దగిలి సుఖించుచుఁ దాను సీతయును
సకలభోగంబుల సౌఖ్యంబునొంది, యకలంకచిత్తుఁడై యనవరతంబు
వేదోచితాచారవిమలమార్గమున, నాదిరాజన్యుల నందఱఁ గడచి
పూజితానుష్ఠానములు నశ్వమేధ,వాజపేయాదికవరయాగతతులు
సొలవక చేయుచు సురలభూసురుల, నెలమి రక్షించుచు నేపుదీపింప
నిండార ధర్మైకనిష్ఠతోఁ బదునొ,కొండువేలేండ్లు దా నుర్విఁ బాలించెఁ
బాలించి యేలుచోఁ బ్రజలు దుఃఖములఁ, దూలరు దురితము ల్దుర్భిక్షతతులు
కలుగ వెయ్యెడలను గాలదోషములఁ, జలియింప వెన్నఁడు సత్యధర్మములు
పరహితాచారతాత్పర్యంబు లెల్ల, పురుషులయందును బొలుపారుచుండు
ననియాంధ్రభాషభాషాధీశనిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుం డపారధీశరధి, భూలోకనిధి కోనబుద్ధభూవిభుఁడు

తనతండ్రి విఠ్ఠలధరణీశు పేరఁ, గమనీయగుణధైర్యకనకాద్రి పేరఁ
బనిపూని యరిగండభైరవు పేర, ఘనుపేర మీసరగండని పేర
నాచంద్రతారార్కమై యొప్పు మిగుల, భూచక్రమున నతిపూజ్యమై వెలయ
నసమానలలితశబ్దార్థసంగతుల, రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావనల్మిండఁ, గరమర్థి నీయుద్ధకాండంబు చెప్పె
నారూఢి నార్షేయమై యాదికావ్య,మై రసికానందమై యెల్లనాఁడు
నివ్వసుమతి నొప్పు నిప్పుణ్యచరిత్ర, మెవ్వారు చదివిన నెవ్వారు వినిన
సామాదిబహువేదచయధామ రామ, నామచింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును, బాయక పాటించుఁ బాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యచయసమృద్ధియును
నేవిఘ్నములు లేక యిండ్లలో నధిక, లావణ్యవతులైన లలనలపొందు
కొడుకులతో నెప్డుఁ గూడియుండుటయు, నెడగాఁగ నాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులకూటమియు, నిమ్ములఁ గామ్యంబు లెడపకుండుటయు
సతతంబు దేవతాసంతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవలోకాదివాసులఁ జేయు
నిది మోక్షసాధనం బిది పాపహరము, నిది దివ్య మిది భవ్య మిది శ్రీకరంబు
ఎందాఁకఁ గులగిరు లెందాఁక జలధు, లెందాక రవిచంద్రు లెందాఁకఁ దార
లెందాఁక భువనంబు లెందాఁక దిశలు, నెందాఁక వేదంబు లేపుదీపించు
నందాఁక నీకథ యక్షరానంద, సందోహదోహళాచారమై పరఁగు.

శ్రీరంగనాథరామాయణము యుద్ధకాండము
సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949

# పద్యకావ్యము

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| అడవిమల్లెలు | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | 0 | 10 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | 1 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | 0 | 6 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | 1 | 8 |
| ,, టీక | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | 4 | 0 |
| ఆరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 |
| శాంతిసప్తకము | 7 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | 0 | 12 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకా॥మూ | 0 | 3 |
| ,, టీకతో బ్రౌనుపేపరు | 0 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలికో | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రభాషార్ణవము | 1 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | 6 | 0 |
| ఉత్తరహరివంశము | 3 | 0 |
| కవిరాజ మనోరంజనము | 1 | 4 |
| కృష్ణదండకము | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | 0 | 8 |
| కాశీఖండము | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక,(భాగవతం) | 0 | 6 |
| డిటో గట్టుప్రభువుకృతము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము. విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 | 8 |
| ,, గొట్టి సూర్యనారాయణశాస్త్రిగారిది | 0 | 12 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | 0 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | 0 | 8 |
| చెన్నబసవపురాణము | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | 2 | 0 |
| తెనుఁగుసమస్యలు | 0 | 3 |
| దశావతారచరిత్ర | 3 | 0 |
| దసరాపద్యములు | 0 | 2 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికో బైండు | 2 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | 3 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | 1 | 0 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | 3 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.